# Encyclopedic MEDICAL DICTIONARY

(English-English-Telugu)

# ఎన్సైక్లోపీడిక్ మెడికల్ డిక్షనరి

(ఇంగ్లీష్-ఇంగ్లీష్-తెలుగు)

Prof. Dr. O.A. Sarma
B.Sc., MBBS, MD, TDD., FCCP, (USA)
FNCCP., FIAMS., FCGP



NEELKAMAL PUBLICATIONS PVT. LTD.
EDUCATIONAL PUBLISHERS
(EXPORTERS & IMPORTERS)
SULTAN BAZAR, HYDERABAD-500 095.
✆ 4757140, 4757197

# ENCYCLOPEDIC MEDICAL DICTIONARY
(English-English-Telugu)

ఎన్‌సైక్లోపీడిక్ మెడికల్ డిక్షనరి
(ఇంగ్లీష్-ఇంగ్లీష్-తెలుగు)

**Prof. Dr. O.A. Sarma**

---



**First Edition : 2000 A.D.**

**Price: Rs. 195/-**

*Distributors:*

**NEELKAMAL BOOK DISTRIBUTORS**
First Floor, opp. Clock Tower,
Sultan Bazar, HYDERABAD - 500 095,
Phone: 4757140, 4757400.

---

Published by Suresh Chandra Sharma for Neelkamal Publications Pvt. Ltd., Hyderabad - 500 095 and printed at Sri Kalanjali Graphics, Hyderabad.

# INTRODUCTION

**A** dictionary is a book that lists and explains words. A word is a fundamental thought, unit of speech and language. A group of words makes phrases, clauses and sentences which express ideas.

This dictionary is a treasure to posterity. It is fact that technical vocabulary is available in the English language. English and Telugu versions of the medical words are supplied herein.

Knowledge is acquired through words. Successful and intelligent people, executives, politicians, advertisers and such talented people develop extensive vocabulary, and this enables them to capture the attention of their fellow-beings. A person's IQ is directly proportional to the richness of his vocabulary. Man's intellect lies in the play of words.

This dictionary serves as a reference book for medical students; practising doctors in allopathy, homeopathy and ayurveda; students of biology at school and college level; nurses, midwives, technicians, pharmacists and such paramedical personnel. It caters to the needs of pharmaceutical companies, medical representatives and medical shop employees. It contains a lot of information to answer objective type questions in all competitive examinations like IAS, EAMCET, LAWCET, SVUCET, EDCET and of UPSC. It is a useful reference book for every citizen to obtain a glimpse of a bodily or mental disorder. It is a home doctor and household companion. Further, it improves one's vocabulary both in English and Telugu.

In order to make the reading more spicy and less drab, figurative phrases/sentences are included at appropriate

places. Thus gentle humour is sprinkled into the narration. Resemblances are given at the appropriate places to augment the understanding. This will stimulate the reader to read further and more.

One must develop a lion's look and an eagle's eye while referring to a dictionary. In all medical dictionaries the terms tiny, small, minute, little, delicate, miniature are employed as adjectives for naked eye as well as microscopic structures. One reputed dictionary gives the meaning micro=very small. **Microcephaly** means a small sized skull; it contains the prefix **micro** but it is a glaring naked eye structure. In contrast, **macrophage, macrogamete,** etc. are microscopic structures though containing the prefix **macro.** In view of this and to avoid confusion, naked eye structures are separated from microscopic structures in this dictionary. For example in the entry **membrane,** *naked eye str.* and *micro. str.* are given under separate heads.

Both British and American names are included in the main entry so as to give the reader an exposure to the two words, *e.g.* **anaemia** (British) and **anemia** (US); **Caesarean section** (British) and **cesarean section** (US).

I express my deep sense of appreciation to Shri Suresh Chandra Sharma, Managing Directer, Neelkamal Publications Pvt. Ltd., for initiating me into this project, *viz.* the compilation of this dictionary.

I thank sincerely Shri G.S. Reddy for his valuable suggestions and guidance.

A feedback from the readers will be gratefully appreciated.

**Dr. O.A. SARMA**
Author

# ప్రవేశిక

ఈ పుస్తకము ద్విభాషావైద్య నిఘంటువు. ఈ రంగంలో ఇది తొలికృషి. ఉన్నత విద్యారంగంలో తెలుగు బోధనభాషగా ప్రవేశపెడ్దామనే తలంపు కలగడం పరిపాటి; మాతృభాష మాధుర్యం దీనితో జతచేసి చవిచూపిస్తే ఈ కుతూహలం మరింత శోభాయమానంగా ఉంటుందని ఈ ప్రయత్నం తలపెట్టబడింది. విద్యనర్థించువారు విద్యార్థులు, వారికి చేదోడువాదోడుగా ఉంటుంది ఈ నిఘంటువు.

భాషకు పదములు ప్రధమాంగాలు. పదముల సముదాయం వాక్యము. వాక్యానికి హంగు, రంగు కల్పించేది పదమే గదా! పద మాధుర్యం కలది మన తెలుగుభాష. ప్రతి తెలుగువారింట్లో ఉండవలసినది ఈ గ్రంధము.

విజ్ఞానానికి పదం మూలం. పదనిధి పెంపొందించే కృషిలో మేధావులు నిమగ్నులవుతారు. కార్య నిర్వాహకులు, రాజకీయనాయకులు, ప్రకటన ప్రభృతులు, బుద్ధిశాలులు, ప్రజ్ఞావంతులు వారి తెలివితేటలను పదములద్వారా వెల్లడిచేస్తుంటారు; సూక్ష్మగ్రాహ్యత, కీర్తి, జనప్రీతి వారి పదసంపదననుసరించి విశదమవుతుంది. ఈ పదముల పద్మవ్యూహంలో పదసుధ రుచి చూద్దాం రండి!

ఇంగ్లీషుభాషలో వైద్యశాస్త్రం లిఖింపబడినది; ఆ భాషయొక్క వెలుగు తనివితీరనిది, బహుజన సమ్మతము. ఇంగ్లీషు పదానికి సరిగ్గా అనువదించే తెలుగుపదం వెదకటం అనేది కృషితో కూడిన పని. కొన్నిచోట్ల పదములు నిర్మాణము చేయాల్సివచ్చింది. ఈ పదములు వాటిలోని భావం, విశిష్టత కోల్పోకుండా, చదువరులకు ఆకర్షణీయంగా, జనరంజకంగా అనువాదం చేయబడ్డాయి. ఈ పోకడలో ఒక నూతన పంథ ఏమిటంటే కొన్నిచోట్ల సమయస్ఫూర్తిగా అలంకారయుక్త సమాసములు/వాక్యములు పేర్కొనబడినవి; నూనూగు హాస్యం అక్కడక్కడ చిలకబడింది. మరికొన్నిచోట్ల పోలికలు ఇవ్వబడినవి. ఈ పద్ధతి పాఠకులకు విసుగు కలుగకుండా, యోచనశక్తిని ఉత్తేజపరుస్తూ, చదువరులను ఆకట్టుకొనడానికి, ఈ నిఘంటువును నిరంతరము అందుబాటులో పెట్టుకోటానికి తోడ్పడుతుందని నా దృఢవిశ్వాసము.

ఆంధ్రదేశంలో మూడుప్రాంతాలవారి వాడుకభాష పదములు పేర్కొనబడ్డవి, ఉదా. **dyspnea** అంటే ఆయాసము సర్కార్ జిల్లాలు (కోస్తా ఆంధ్ర)లో వాడేది, గస రాయలసీమలో వాడేది, దమ్ము/మొస తెలంగాణాలో వాడేది.

ఈ నిఘంటువు సర్వవైద్య విద్యావిషయములను విశదీకరిస్తూ సర్వ సంగ్రహ నిఘంటువుగా రూపొందించబడినది. వైద్యపద శబ్దార్థ సర్వస్వము చిత్రీకరించి అరటిపండు వలచి చేతిలో పెట్టినట్లు తయారుచేయబడినది.

ఈ నిఘంటువు వైద్యవిద్యార్థులకు, అల్లోపతి హోమియోపతి ఆయుర్వేద డాక్టర్లకు, జీవశాస్త్ర విద్యార్థులకు, నర్సులు, మంత్రసానులు, టెక్నీషియన్లు, ఫార్మసిస్టులు, ఔషధతయారీ సంస్థలకు, మెడికల్ రిప్రజెంటేటివ్‌లకు మరియు మెడికల్‌షాప్‌లో మందులు విక్రయించు సిబ్బందికి అచూకీ గ్రంథం; IAS, EAMCET, LAWCET, SVUCET, EDCET, UPSC లాంటి పోటీపరీక్షలకు కావలసిన సమాచారాన్ని అందజేస్తుంది. అంతేగాదు ఇంటి డాక్టరుగా అందరికీ ఉపయోగపడుతుంది.

అన్ని నిఘంటువులలో 'సూక్ష్మ' అర్థము ఇస్తూ చిన్న, స్వల్పమైన, కొంచెము, కొద్ది, మిక్కిలి చిన్నదైన – ఈ పర్యాయపదములు వాడుతున్నారనుట లోకవిదితము. ఇవే పదములు 'స్థూల' (macroscopic or naked eye) నిర్మాణములకు గూడా వాడ్తున్నారు. ఈ నిఘంటువులో కొన్ని పదముల వివరణలో 'ప్రత్యక్షముగా చూడబడేవి', 'సూక్ష్మదర్శినిలో చూడనగునవి' అని రెండు విభజనలుచేసి రెండు శీర్షిక (heading)ల్లో తెలియపరచడమైనది.

ప్రతిపదం స్పష్టత, నిర్దిష్టత కలిగి చదువుటకు సొంపుగాను వినుటకు ఇంపుగాను తీర్చిదిద్దబడినది. నేటి విద్యార్థులు రేపటి పౌరులు, మార్గదర్శకులు; లేత హృదయాల్లో ఈ పదములు నాటుకుపోయినట్లయితే నా కృషి ఫలించినట్లు భావిస్తాను.

ఈ బృహత్కార్యమును తలపెట్టుటకు ప్రథమ ఆలోచన కల్పించిన శ్రీ సురేష్‌చంద్ర శర్మ (Managing Director, Neelkamal Publications (Pvt. Ltd.) గార్కి నా హృదయపూర్వక అభినందన చందనం చిలికిస్తున్నాను.

తగురీతిగా సలహాలిచ్చిన శ్రీ జి.యస్. రెడ్డి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

చదువరులకొక మనవి. మీ విలువైన సలహాలు అందజేస్తే విద్యార్థి బృందానికి మేలుచేసిన వారవుతారని నా విన్నపము.

ఈ పొత్తము మీకు దత్తమై మీ చేతిలోని కాంతిపుంజమై వెలుగొందుతుంది. విద్య అందరికీ పంచిపెడితేనే రాణిస్తుంది. విజ్ఞానం వెలుగులాంటిది, ఆ కాంతి నలుమూలలా ప్రసరింపజేసే యత్నమే జ్ఞాన సరస్వతికి జోహార్లు అర్పించడం.

అన్ని దానాల్లోకల్లా జ్ఞానదానం మిన్న. పాఠకుల తృప్తి నా సంతృప్తి, చదువరుల వ్యాఖ్యానం నాకు జ్ఞానపద సోపానం.

డాక్టరు ఒ.ఎ. శర్మ
గ్రంథకర్త

# List of abbreviations used in this dictionary

| | |
|---|---|
| *abbr.* | abbreviation |
| *adj.* | adjective |
| *anat.* | anatomy |
| *bot.* | botany |
| *biol.* | biology |
| *Cf.* | compare, in comparison |
| *colloq.* | colloquial, colloquially |
| *e.g.* | for example |
| *figur.* | figuratively |
| *histol.* | histology |
| *in contr.* | in contrast; in contradistinction |
| *i.e.* | that is |
| *micro.str.* | microscopic structure |
| *n.* | noun |
| *naked eye str.* | naked eye structure |
| *opp.* | opposite of; (as) opposed (to) |
| *physiol.* | physiology |
| *pl.* | plural |
| *q.v.* | cross-reference |
| *sing.* | singular |
| *sl.* | slang |
| *syn.* | synonym |
| *vide infra.* | see below |
| *vide supra.* | see above |
| *viz.* | namely |
| *zool.* | zoology |

| | |
|---|---|
| అలంకార. | అలంకారయుక్తంగా |
| ఉదా. | ఉదాహరణ; ఉదాహరణకు |
| గ్రా. | గ్రామ్యము |
| తారత. | తారతమ్యము, తారతమ్యముగా |
| ప్రత్యక్ష.చూ. | ప్రత్యక్షముగా చూడనగు(ను) |
| భిన్న. | భిన్నము; భిన్నమైనవాని |
| మొ. | మొదలగు; మొదలగునవి; మొదలైన, మొదలుగాగల, మొదలగువాటి |
| వాడు.భా. | వాడుకభాష; వాడుకలోనున్న భాష |
| వ్యతి. | వ్యతిరిక్తము(గా); వ్యతిరేకము(గా) |
| సం., | సంబంధ, సంబంధించిన; సంబంధమైన |
| సూక్ష్మ.చూ. | సూక్ష్మదర్శినిలో చూడనగు(ను) |

కొన్ని పదాలు జంటగా వచ్చాయి. అవి -

| | |
|---|---|
| *common experience:* | నిత్యానుభవము: |
| *figur.* | అలంకార. |
| *N.B.* | గమనిక: |
| *resemblance:* | పోలిక: |

★ ★ ★

# Hippocratic Oath

*I swear by Apollo the physician, by E sculapius, Hygeia, and Panacea, and I take to witness all the gods, and all the goddesses, to keep according to my ability and my judgement the following Oath :*

*To consider dear to me as my parents him who taught me this art; to live in common with him and if necessary to share my goods with him; to look upon his children as my own brothers, to teach them this art if they so desire without fee or written promise; to impart to my sons and the sons of the master who taught me and the disciples who have enrolled themselves and have agreed to the rules of the profession, but to these alone, the precepts and the instruction. I will prescribe regimen for the good of my patients according to my ability and judgement and never do harm to anyone. To please no one will I prescribe a deadly drug, nor give advice which may cause his death. Nor will I give a woman a pessary to procure abortion. But I will preserve the purity of my life and my art. I will not cut for stone even in patients in whom the disease is manifest; I will leave this operation to be performed by practitioners (specialists in this art). In every house where I come I will enter only for the good of my patients, keeping myself far from all intentional ill-doing and all seduction, and especially from the pleasures of love with women or with men, be they free or slaves. All that may come to my knowledge in the exercise of my profession or outside of my profession or in daily commerce with men, which ought not to be spread abroad, I will keep secret and will never reveal. If I keep this Oath faithfully, may I enjoy my life and practice my art, respected by all men and in all times; but if I swerve from it or violate it, may the reverse be my lot.*

# A a

**abacterial** devoid of bacteria బాక్టీరియా (సూక్ష్మక్రిములు) లేని.

**abarticulation** dislocation of a joint కీలులోని భాగములు స్వస్థానము నుండి తొలగుట.

**abasia** inability to walk నడవలేకపోవుట. **ataxic a.** చలనంలో తూలుడు. **paralytic a.** పక్షవాతం వలన.

**abate** lessen (pain), mitigate (నొప్పి) తగ్గించు, ఉపశమనం చేయు.

**abatement** decrease in the intensity of pain ఉపశమనం: నొప్పి యొక్క తీవ్రత తగ్గడం.

**abdomen** 1. belly ఉదరము, పొట్ట, కడుపు. 2. region with the diaphragm above and pelvis below పైన విభాజక పటలము, క్రింద శ్రోణిఫలకము మధ్యగల స్థలము.

**abdominal** *adj.* of abdomen. పొట్టకు సం., ఉదర సం.

**abdominalgia** pain in the abdomen కడుపులో నొప్పి.

**abdominal wall** fibromuscular guard of the abdomen ఉదరకుడ్యము, పొట్టపైని కండర సమూహముల కాపు/రక్షణ(ము).

**abducent nerve** $6^{th}$ cranial nerve supplying the lateral rectus muscle of eyeball 6వ కపాలనాడి, ఉపచాలినీనాడి.

**abduction** moving any part away from the mid-line, *e.g.* moving leg or hand away from the umbilicus అపవర్తన: ఏ భాగమునైనా శరీర మధ్యమునుండి అవతలకు జరుపుట, ఉదా. కాలుగాని, చేయిగాని బొడ్డు అవతలకు జరుపుట [*opp.* adduction వ్యతి. అభివర్తన].

**abductor** muscle that moves a part away from the mid-line of the body ఒక భాగమును శరీర మధ్యరేఖనుండి వెలుపలకు జరుపు కండరము [*opp.* adductor].

**aberration** deviation from normal అసాధారణము; వక్రగతి, అపసవ్యమార్పు. 1. in cardiology: aberrant conduction pathways హృద్రోగశాస్త్రములో: అసాధారణమైన/వక్ర వాహక పథాలు. 2. unequal

refraction of a lens కటకములో అసమమైన కిరణ వక్రీకరణము. 3. **chromosome a.** క్రొమోసోమ్ వ్యవస్థలో క్రమము తప్పిన పరిణామము.

**ablactation** weaning the child from breast milk చనుబాలు మాన్పించటం.

**ablation** surgical removal of any part of the body తొలగింపు: శరీరములో ఏ భాగమైన శస్త్రచికిత్స ద్వారా/చేసి తీసివేయుట.

**ablepsia** or **ablepsy** blindness అంధత్వం, చూపుపోవుట.

**ablution** 1. ritual of washing ప్రక్షాళనము. 2. the act of cleansing మురికి పోయేటట్లు శుద్ధి శుభ్రపరచుట.

**abnormal** other than normal అసాధారణమైన [*opp.* normal వ్యతి. సాధారణమైన].

**ABO blood group system** system in which human blood is classified into four groups (A, B, AB and O) *see/* చూడండి blood group. మనిషి రక్తంలో ABO రకము – ఇందులో నాలుగు గ్రూపులున్నవి (A, B, AB మరియు O).

**abort** 1. premature arrest of a disease జబ్బు పరిపక్వము గాకుండా సమసిపోవుట/అరికట్టబడిపోవుట/ఊరడిల్లుట. 2. to undergo abortion, *viz.* to expel a foetus from the uterus before it can survive independently గర్భస్రావమగుట.

**abortifacient** a drug or agent that causes abortion గర్భస్రావకారి.

**abortion** premature exit/withdrawal of the foetus from any part of the female reproductive system, most commonly out of the womb (uterus) before the $28^{th}$ week of pregnancy గర్భ/పిండ స్రావము: గర్భస్థపిండము జీవించుటకు పక్వముగాకుండా 7వ నెల గర్భిణీముందు, స్త్రీప్రత్యుత్పత్తి వ్యవస్థలో నుంచి, తరచుగా యోనిలో నుండి బయటకు నిష్క్రమించుట లేదా తీయబడుట. **incomplete a.,** retention of the products of conception గర్భకణజాలములు పూర్తిగా బయటపడకపోవుట. **septic a.,** infection of the uterus గర్భాశయమునకు సూక్ష్మజీవి సంపర్కము. **therapeutic a.,** done in some illnesses కొన్ని జబ్బులలో చేస్తారు. **threatened a.** బెదిరించి భయపెట్టే ఎర్రబట్ట నాందిగాగల ఎబార్షన్.

**abracadabra** a word believed to have power of curing agues (burning fever), *etc.* the word written on a small plate and worn as amulet, to protect the wearer from witchcraft, evil, disease, *etc.* జ్వరతీవ్రతను తగ్గించే తాయిత్తు. ఇది భుజం మీద ధరిస్తే/కట్టుకుంటే, మంత్రప్రయోగంగా పనిచేసి కీడు, వ్యాధుల్లాంటి అరిష్టాలను అరికట్టుతుందని/తొలగిస్తుందని నమ్మకం.

**abrasion** 1. dissolution/rupture/tear of the surface of the skin, usually secondary to an injury చర్మముమీద అపఘర్షణ/కోత, గీసుకుపోవుట: ఇది సాధారణముగా దెబ్బయొక్క పర్యవసానము. 2. It can occur after scratching/rubbing of surfaces గోకిన తర్వాత, రాపిడివలన కూడ సంభవించవచ్చును.

**abscess** collection of pus anywhere in the body చీముగడ్డ, కురుపు: శరీరములో ఏ భాగములోనైనా చీము చేరుట.

**absorb** get lost, disappear, *e.g.* sponge absorbs fluids శోషణ, పీల్చు, తడిలేకుండా లాగుకొను, ఉదా. సముద్రపు పాచి (స్పంజిక) ద్రవములను పీల్చును.

**absorbent** a substance that absorbs fluids, e.g. cotton ద్రవగ్రాహకం: ద్రవములను పీల్చు శక్తిగల వస్తువు, ఉదా. దూది.

**absorption** the process of absorbing శోషణ(ము), ద్రవగ్రాహక చర్య: పీల్చుకొనబడెడు క్రమము/గతి. **intestinal a.**, uptake of nutrients from the intestines into the blood పోషక పదార్థములు ప్రేవులనుండి రక్తములోనికి సేకరింపబడుట/గుంజుకొనబడుట.

**abstinence** to be away from, *e.g.* refraining from eatables, sex నిగ్రహం: త్యాగము చేయుట, అనుభవింపకుండుట, జితేంద్రియత్వము, ఉదా. తినుబండారములు, లైంగికవాంఛ త్యాగము చేయుట.

**abuse** 1. wrong or excessive use, *e.g.* drug abuse, misuse of prescribed drugs – like painkillers, anaesthetics, antidepressants, sedatives హానికరమైన పదార్థము అతిగా తీసుకొనుట, ఉదా. మాదకపదార్థముల వాడుక, డాక్టరు వ్రాసినమందుల దుర్వినియోగం. 2. (a) drug trafficking, bootlegging (illicit liquor), illicit drugs అవినీతిగా వాటి సరఫరా/రవాణా. *N.B.* athletes taking recourse

to drugs, *e.g.* corticosteroids; epo, or erythropoietin; hypobaric chambers, to enhance their performance levels *గమనిక:* క్రీడాకారులు తమ గెలుపుకొరకు డ్రగ్స్ వాడుట. (b) to promote sex trade వ్యభిచారాన్ని వాంఛించినప్పుడు. (c) drug pedalling as a profession మందుల యొక్క అవినీతి అమ్మకం వృత్తిగా గలవారు. 3. అలంకార. ఔషధము (అగదము)ను మందు (వశ్యౌషధము)గా మార్చరాదు!

**acapnia** hypocapnia, lowering of carbondioxide in the blood రక్తములోని కార్బన్ డైఆక్సైడ్ తగ్గుట.

**acarbia** hypocarbia, lowering of bicarbonate ($HCO_3$) in the blood రక్తములోని బైకార్బొనేట్ తగ్గుట.

**Acarus** a genus of mites తవిటి పురుగుల ప్రజాతి. **A. scabiei** *Sarcoptes scabiei*, causative agent of scabies గజ్జికి కారకం.

**acceleration** increase in the tempo, speed in the course of a disease జబ్బు ముదురుట, ఉద్ధృతము.

**accessary** person who helps another in a crime నేరస్తునికి నేరములో సహాయము చేసేవాడు/తోడ్పడేవాడు.

**accessory** 1. contributory తోడ్పడు, సహాయక. 2. spinal accessory nerve, the eleventh cranial nerve 11వ కపాలనాడి.

**accident** unanticipated event, injury, అనుకొనని/ఊహించని దుర్ఘటన, కీడు/హాని సంభవించుట, ప్రమాదము, గండము.

**accidental** by chance యాదృచ్ఛిక. **a. contamination**, say of a culture of microorganisms సూక్ష్మజీవుల సంవర్ధనం యాదృచ్ఛికంగా కలుషితమగుట.

**acclimatize** habituate, to get used to a climate ఒక వాతావరణము నకు/పరిస్థితికి అలవాటు పడుట.

**accommodation** adjustment in the aperture of the 'curtain muscle' in the eye (iris) దృష్టిసవరణ: కన్నులోని పరదాకండరము (తారక) ముడుచుకొనుట, తెరచుకొనుట.

**accouchement** delivery ప్రసవం, కాన్పు. baby birth శిశుజన్మ.

**accoucheur** midwife, obstetrician మంత్రసాని, పురుడు పోయు/నిర్వహించు డాక్టరు.

**accretion** accumulation of debris చెడిపోయిన పదార్థము ఒక చోట చేరుట.

**acetabulum** hollow in the hip bone (ilium) into which the head of the thigh bone (femur) fits in, forming a ball and socket joint తుంటి ఎముకలో లోతుగా నున్న గుంట: బంతిగిన్నెకీలు; ఇందులో తొడ ఎముక పైఅంచున గుండ్రపు బంతివలెనున్న భాగము ఈ బంతి గిన్నె కీలులో ఆడుతుంది.

**acetate** a salt of acetic acid అసితము.

**acetic acid** a pungent acid with penetrating odour ఎసిటిక్ అమ్లము: ఘాటైన వాసనగల అమ్లము.

**acetylcholine** an acidic secretion which plays a role in nerve impulse transmission నాడీప్రేరణ ప్రసారమునకు సహాయపడే అమ్ల ద్రవము.

**achalasia** failure of a hollow viscus (organ) to relax (open), *e.g.* achalasia cardia; cardiospasm due to the disturbance of the oesophago-gastric sphincter, producing difficulty in swallowing (dysphagia) తిత్తి రూపములోనున్న అవయవము తెరచుకొనలేకపోవుట, ఉదా. అన్నవాహికనుండి జీర్ణాశయమునకు గల మార్గము బిగుసుకు పోవుట; దీనివలన మింగుటకు ఆటంకము కలుగుట.

**ache** pain నొప్పి. 1. headache తలనొప్పి. 2. toothache పంటినొప్పి.

**Achilles tendon** tendo Achillis, tendo calcaneus, tendon at the back of the heel మడమ వెనుక గట్టిగా తాడులా ఉండెడి స్నాయు బంధనము.

**achlorhydria** absence of hydrochloric acid (Hcl) in the stomach అనామ్లత: హైడ్రోక్లోరిక్ అమ్లము జీర్ణాశయములో లేకుండుట.

**achondroplasia** dwarfism due to a congenital disorder of cartilage formation; sometimes running in families (hereditary) ఎముకలకు అంటిపట్టి ఉన్న కార్టిలాజ్ యొక్క జబ్బు వలన మరుగుజ్జుగా ఉన్న స్థితి. కొందరిలో వంశపారంపర్యముగా వస్తుంది.

**achromatic** 1. colourless అవర్ణ, రంగులేని. 2. no stain or losing stain వివర్ణ.

**acidaemia** or **acidemia** increase in the H-ion concentration of the blood అమ్లరక్తత. [*in contr.* alkalaemia].

**acid burn** 1. When acid is swallowed, stricture of the pharynx or oesophagus results. అమ్లము త్రాగిన తర్వాత గొంతు గాని, అన్నవాహిక గాని కాలిపోయి, గొంతుగొట్టము సన్నగిల్లుట. 2. burn on the skin when acid falls on it చర్మము మీద అమ్లము పడినప్పుడు కాలుట.

**acidemia** *see/చూడండి* acidaemia.

**acidity** presence of more of hydrochloric acid (Hcl) in the stomach producing heartburn అమ్లత: హైడ్రోక్లోరిక్ అమ్లము జీర్ణాశయములో ఎక్కువై ఛాతీలో మంట కలుగుట.

**acidosis** 1. a condition wherein the blood becomes more acidic, *i.e.* pH becomes less than 7.4 అమ్లాధిక్యత, అమ్లరక్తత: రక్తములోని అమ్లము ఎక్కువగుట. 2. encountered in diseases of the lungs or kidneys ఊపిరితిత్తుల, మూత్ర పిండముల జబ్బులలో ఇది సంక్రమించును [*in contr.* alkalosis భిన్న. క్షారాధిక్యత].

**acid poisoning** *see/చూడండి* acid burn.

**aciduria** passing acidic urine which produces burning sensation in urination అధిక అమ్లపుమూత్రం పోవుట; మూత్రంలో మంట.

**acinus** microscopic division in a gland/organ గ్రంథి/అవయవములో సూక్ష్మ విభాగం. **liver a.,** smallest functional unit of the liver కాలేయ కార్యనిర్వాహక నిర్మాణంలో అతిచిన్న ప్రమాణము. **pulmonary a.,** terminal respiratory unit శ్వాసవృక్ష నిర్మాణంలో అంతిమ ప్రమాణము.

**acme** zenith, crisis ఉత్కృష్ట స్థితి.

**acne** a skin disease occurring in teenagers characterised by comedones, blackheads, mostly on the face and back యౌవన దశలో వచ్చు మొటిమలు/మటిమలు, ముఖ్యముగా ముఖము మరియు వీపు మీద. **a. vulgaris,** chronic acne. దీర్ఘకాలం సతాయిస్తున్న మొటిమలు, పొక్కులు.

**acneform** resembling acne మొటిమల/మటిమల వంటి చర్మము కురుపులు.

**activity** a state of being busy, sign of health చురుకుదనము: క్రియాశీలత, కార్యనిమగ్నత – ఇది ఆరోగ్య చిహ్నము/లక్షణము. *N.B.* Activity prolongs longevity. *గమనిక:* చురుకుదనము ఆయుర్దాయమును పెంచుతుంది.

**acuity of vision** sharpness of (eye) sight దృష్టి తీక్షణత.

**acupressure** application of counter-pressure over sensitive pressure points in the body, a treatment modality for certain diseases శరీరములో కొన్ని చోట్ల ఒత్తిడి కలిగిస్తే కొన్ని జబ్బుల ఉద్రిక్తము తగ్గుతుంది.

**acupuncture** induction of counter-pain with hair-thin needles over trigger strategic points on the body, a treatment modality for some diseases సూదిపొడుపు వైద్యము: శరీరములో కొన్ని కీలక స్థలములందు వెంట్రుక పరిమాణముగల సూదులతో పొడిచి, వ్యాధి ఉపశమనమునకు తోడ్పడుట.

**acute** illness starting suddenly with rapid tempo అకస్మికముగా అవతరించే, తీవ్రమైన, ఉద్రిక్తతతో పైకెగయు రుగ్మత/జబ్బు [*in contr.* chronic *భిన్న.* దీర్ఘకాలపు].

**Adam's apple** projection on to the neck of the thyroid cartilage of the voice-box (larynx), prominent in males గొంతుకముడి, కుతికకాయ, కంఠమణి: శబ్దపేటికయొక్క మృదులాస్థి కంఠముయొక్క ముందుభాగమునందు పొడుచుకొని వచ్చి యుండుట (ప్రధానంగా పురుషులలో చూస్తుంటాము).

**Adams-Stokes syndrome** an emergency అత్యవసర పరిస్థితి. Adams-Stokes disease, Stokes-Adams syndrome, Morgagni's disease, Morgagni-Adams-Stokes syndrome. characterised by slow or absent pulse, vertigo, convulsions దీనిలో లఘురక్తప్రసరణ వలన నాడి దొరక్కపోవటంగాని లేదా ఆ నాడి పూర్తిగా స్తంభించి పోవటంగాని ఉండి, తలతిప్పుడు, కంపనములు లేదా మూర్ఛలు కలుగవచ్చు.

**adaptation** process of adjusting సవరణ. **light a.,** adaptation of the eye to light కన్నులో కాంతికి సవరణ.

**addiction** state of being a slave to a drug, drink, *etc.* వ్యసనము; మాదక పదార్థములను సేవించి (పుచ్చుకొని) ఆ వ్యసనమునకు/అలవాటుకు బానిస అగుట.

**Addison's disease** hypofunction of the adrenal glands which figure on the top of the kidneys like hats మూత్రపిండములపైన టోపీలవలె అమర్చబడియున్న అడ్రినల్ గ్రంథుల ద్రవముల లోపము.

**adduction** moving any part towards mid-line/umbilicus అభివర్తన: ఏ భాగమునైనా అవతలనుండి శరీర మధ్యరేఖవైపు జరుపుట, ఉదా. కాలుగాని, చేయిగాని అవతలనుండి బొడ్డు దగ్గరకు జరుపుట [*opp.* abduction వ్యతి. అపవర్తన].

**adductor** muscle that moves a part towards the mid-line of the body శరీరమధ్యభాగము వైపునకు జరుపుకండరము [*opp.* abductor].

**adenitis** inflammation of the glands, *e.g.* lymphadenitis which is the inflammation of lymph glands/nodes నొప్పి, వేడి, మంట, వాపుతో కూడిన గ్రంథుల వాపు/శోథము, ఉదా. లింఫ్ గ్రంథులు ఉబ్బటం/శోథము.

**adenoids** 1. lymph nodes in the naso-pharynx which act as protective barriers to trap germs thus guarding against infection. Another such example is the tonsil in the throat. కొయ్యగండలు: ముక్కుకును, నోటికిని మధ్య పెరుగు కొయ్యగండలు. ముక్కు కుహరములోనున్న లింఫ్ గ్రంథులు, గొంతుకలోనున్న టాన్సిల్సు – ఇవి శరీరాన్ని క్రిములదాడినుండి కాపాడుతాయి. 2. If the adenoids are unduly enlarged, obstruction occurs in the naso-pharynx and the child is forced to adopt mouth-breathing. ఈ ఎడినాయిడ్స్ మరీ ఉబ్బి పెద్దవి అయితే ఆ బాలుడు/బాలిక శ్వాసను ముక్కుతో పీల్చలేక నోటితో పీల్చు పరిస్థితి ఏర్పడుతుంది.

**adenoma** tumour arising from glandular tissue/substance గ్రంథులలో పుట్టినకాయ/కంతి.

**adenopathy** a group of enlarged glands, *e.g.* lymphadenopathy, enlarged lymph nodes ఉబ్బిన గ్రంథుల సముదాయము, ఉదా. ఉబ్బిన లింఫ్ గ్రంథులసమూహము.

**adhesions** abnormal communication/joining together/adhering in the tissues after surgical operation or injury శస్త్రచికిత్స లేదా దెబ్బ తరువాత కణజాలములు అనగా జీవకణముల సముదాయము ఒక దానికొకటి అతుకుకొనిపోవుట.

**adipose** fatty కొవ్వుతో కూడిన. **a. tissue** కొవ్వు కణజాలము. fat underneath the skin, in skeletal muscles, in bones and in organs చర్మము అడుగున, కండరములలో, ఎముకలలో మరియు అవయవములలో నుండు కొవ్వు కణజాలము.

**adiposity** state of excessive accumulation of fat in the body (obesity) శరీరములో అధిక కొవ్వు జమ అయిన స్థితి.

**adiposuria** lipuria. passing fats in urine మూత్రంలో కొవ్వు పదార్థములుండుట.

**adjunct** supplement, *e.g.* Vitamins and minerals are necessary adjuncts to carbohydrates, proteins and fats in the diet. అనుబంధము, ఉదా. విటమిన్‌లు, ఖనిజములు ఆహారములో కార్బోహైడ్రేట్లు, ప్రోటీన్లు మరియు కొవ్వు పదార్థములకు సహాయత.

**adjuvant** helpful, auxiliary, *e.g.* First-aid is an adjuvant to treatment. తోడు, సహాయకారి, సహాయకౌషధము, ఉదా. ప్రథమచికిత్స అసలు చికిత్సకు తోడ్పడుతుంది.

**adnexa** [adnexal *adj.*] appendages of an organ అవయవము యొక్క ఉపాంగములు. *e.g.* 1. Fallopian tubes and ovaries are the uterine adnexa. ఉదా. ఫెల్లోపియన్ వాహికలు మరియు అండాశయములు గర్భాశయము యొక్క ఉపాంగములు. 2. Appendages of the eye are the eyelids and lachrymal glands. కనురెప్పలు, బాష్పజల గ్రంథులు కన్నుయొక్క ఉపాంగములు.

**adolescence** youth, the period in life from the commencement to the termination of puberty కౌమారదశ: బాల్యమునుండి యౌవనమునకు (జీవి) ఎదిగే దశ.

**adrenal** 1. near the kidney మూత్రగ్రంథికి దగ్గరగా నున్నది. 2. supra renal అధివృక్క: మూత్రగ్రంథి పైన ఉన్నది.

**adrenal cortex** the outer part of the adrenal gland which secretes steroid hormones ఎడ్రినల్ గ్రంథి పైభాగము, స్టిరాయిడ్ హోర్మోన్లను స్రవిస్తుంది.

**adrenal gland** *syn.* supra renal gland అధివృక్క గ్రంథి, ఎడ్రినల్ గ్రంథి; పర్యాయపదము సూప్ర రీనల్ గ్రంథి.

**adrenaline** epinephrine, a hormone secreted by the medulla of the adrenal gland which is a ductless (endocrine) gland అధివృక్క గ్రంథిలోని దవ్వయొక్క స్రావము: ఎడ్రినలిన్ ఒక హోర్మోన్, నాళములేని ఎడ్రినల్ గ్రంథి తయారుచేయు ద్రవము.

**adsorption** adhesion of the molecules of a gas or liquid to a surface అధిశోషణము: ఏ గాలిలోగాని ద్రవములోగాని ఉన్న అత్యంతాల్ప అణుసముదాయము (molecules) దాని ఉపరిభాగము వద్ద చేరి అంటుకొనుట.

**adult** *syn.* matured, grown-up individual; a person who attained full growth or maturity ప్రౌఢజీవి, వయస్సు వచ్చినవాడు, ఎదిగినవాడు, వయోజనుడు; యుక్తవయస్సుకు ఎదిగి, పక్వమైన అనుభవంగల వ్యక్తి.

**adultery** sexual relations between a married person and some-body who is not the person's husband or wife. వ్యభిచారము, అంకుతనము.

**adventitia** the outer coat of a structure, *e.g.* **tunica a.**, the outer coat of an artery కంచుకము: ఏ భాగానికైనా పై పొర, ఉదా. ధమనియొక్క పై పొర.

**adynamia** not being dynamic; weakness, asthenia, vital debility నిస్సత్తువ, నీరసం, దుర్బలత.

**aeration** 1. taking up oxygen and releasing carbon dioxide by the blood in the lungs ఊపిరితిత్తులలో రక్తము ప్రాణవాయువును తీసుకొని బొగ్గుపులుసు వాయువును వదలుట. 2. charging a liquid with gas, e.g. preparation of an effervescent drink పానీయములో గ్యాసు నింపుట, ఉదా. సోడా.

**aerobe** a living organism which thrives in an atomosphere of oxygen వాయుసహితజీవి, వాతజీవి: ప్రాణవాయువుగల వాతావరణంలో పెరిగే సజీవ ప్రాణి [*opp.* anaerobe వ్యతి. అవాత జీవి].

**aerophagy** aerophagia, swallowing of air which produces belching వాయుభక్షణము: దీనివలన త్రేపులు వస్తాయి.

**aerosol** a device in which a colloid system of drug particles are suspended in a gas, to be inhaled in a fine spray or mist, *e.g.* inhaler in asthma గాలితుంపర; మందుజల్లు: మందు రేణువులు ఒక వాయువులోనికి చేర్చబడి, ఆ వాయువులో వ్రేలాడుతున్న ప్రతిస్థటిక (జిగటువస్తువు)ను తుంపరుల రూపంలో వెడలించే సాధనము – ఈ సాధనమును నోట్లో పెట్టుకుని ఆ మందు జల్లును పీల్చడం, ఉదా. ఉబ్బసం వ్యాధికి చికిత్స.

**Aesculapius** Roman name for the Greek god of medicine, *see/చూడండి* caduceus.

**aetiology** or **etiology** causation of disease వ్యాధికి కారణము.

**afebrile** without fever జ్వరరహిత: జ్వరము లేకుండా ఉండుట [*opp.* febrile వ్యతి. జ్వరసహిత].

**affect** attack, involve, *e.g.* to be caught by a disease సంక్రమించు, ఉదా. వ్యాధి సోకుట.

**affection** 1. mental state, emotion మానసిక స్థితి, ఆవేశము, చిత్త క్షోభము. 2. a diseased state/morbid condition రోగదశ/వ్యాధిగ్రస్తము అగుట.

**afferent** carrying impulses from the periphery to the centre, *e.g.* transmission of nerve impulses from the periphery to the centre అభివాహి: శరీరములో ప్రేరణలను పరిధీయ అనగా చివరిభాగమునుండి కేంద్ర/మధ్య భాగమునకు తీసుకవెళ్ళు, ఉదా. నాడులలో ప్రాకెడు ప్రేరణ (impulse) పరిధీయభాగం నుండి కేంద్రస్థానమునకు పోవుట [*opp.* efferent వ్యతి. అపవాహి].

**affinity** attraction, nearness ఆకర్షణము, సన్నిహితము, సాన్నిధ్యము.

**affliction** suffering, distress బాధ, వ్యథ/క్లేశము.

**affusion** pouring water on the body or any part for therapeutic purposes నీరు శరీరంమీదగాని, ఏ భాగంమీదనైనా పోసే చికిత్సోపాయము.

**after-birth** material coming out of the womb after the birth of the baby, *viz.* placenta జరాయువు, మావి, మాయ: యోని నుండి శిశువు బయటపడిన తర్వాత వచ్చు పదార్థము.

**after-pains** residual contractions of the uterus after delivery ప్రసవము తదుపరి వచ్చే తుది నొప్పులు.

**agalactia** absence of milk in the breasts after baby-birth. శిశువు జన్మించిన తర్వాత తల్లి పాలిండ్లలో పాలు లేకుండుట.

**aged** very old ముసలి, వృద్ధ. **a. tissues/lungs,** seasoned ఆరితేరిన కణజాలములు/ఊపిరితిత్తులు.

**ageing** or **aging** to grow old, *see/చూడండి* aging. ముసలివారగుట.

**agenesis** 1. absence of an organ అవయవం ఏర్పడకపోవటము, ఒక అవయవము లేకుండుట. 2. imperfect development పెరుగుదల సరిగాలేకపోవుట.

**agglutination** 1. the clumping together of bacteria exposed to specific immune serum గుచ్ఛకరణము: గుమిగూడటము, రసిక (serum) తో మిశ్రమమైనప్పుడు బాక్టీరియా గుంపులు గుంపులుగా ఏర్పడుట. 2. healing process in which the wound closes by adhesion నయమగునప్పుడు గాయముయొక్క అంచులు అతుకుకొనిపోవుట.

**aggravation** increase in the intensity పరిస్థితి విషమించుట. *e.g.* pain becoming worse, ఉదా. నొప్పి ఉద్రిక్తమగుట.

**aggregation** clumping of materials పదార్థములు గుంపులుగా ఏర్పడుట.

**aggression** 1. self-assertive behaviour; self-expressive drive to gain importance 'నాది పై చేయి' అను ధీమా; మెప్పు పొందవలెనను కృషి. 2. It may be a mental aberration. ఈ ప్రవర్తన ఒక మానసిక భ్రంశము/వికలము అవచ్చు.

**aging** the process of getting aged/old వయోవృద్ధి, వయసు పెరుగుట, ముసలి వారగుట. definition: Aging is a progressive loss of physiological capacities, culminating in death. నిర్వచనము: వ్యక్తి కాలక్రమేణా శరీరధర్మ శక్తులను ఒకదానితర్వాత మరొకటి కోల్పోయి మృత్యువు పాలవటం. Researches are going on to isolate the gene responsible for aging. వృద్ధాప్యానికి కారణభూతమైన జీన్/జన్యువును కనుగొనాలని పరిశోధనలు జరుగుతున్నాయి.

**agitate** to shake up/excite తత్తరపాటు చెందు.

**agitation** 1. restless excitement. సంక్షోభము, కలత, కలవరము, తల్లడము, గందరగోళము, అల్లకల్లోలము. 2. symptom of mental illness మానసిక రోగలక్షణము.

**agony** intense pain తీవ్రమైన/మిక్కుటమైన బాధ.

**agoraphobia** morbid fear of being alone in large open places పెద్ద బయలు ప్రాంతంలో ఒంటరిగా ఉండాలంటే భయం [*in contr.* claustrophobia].

**agranulocyte** a nongranular leucocyte సూక్ష్మకణికలు లేని తెల్లరక్తకణము.

**agranulocytosis** marked decrease in the number of white blood cells (granulocytes) in the blood రక్తములో తెల్లరక్తకణముల సంఖ్య బాగా తగ్గిపోవుట.

**agraphia** loss of ability to write అలేఖనం, లేఖనలోపం, లేఖనశక్తి కోల్పోవుట. **motor a.**, inability to express thoughts in writing రాయలేకపోవటం. **sensory a.**, inability to interpret the written word రాసినది అర్థం చేసుకొనలేకపోవుట.

**ague** malarial fever మలేరియా జ్వరము.

**ague cake** enlargement of the spleen or/and liver caused by malaria మలేరియా వలన స్ప్లీను, లివరు పెరిగిన స్థితి; పొట్ట తాకినప్పుడు ఇవి బల్లలులాగా తగులుతాయి కాబట్టి వీటిని కడుపులో బల్లలు అని సామాన్య సంభాషణలో అంటుంటారు.

**aid** 1. help, succour, *e.g.* first aid సహాయము, ఉపకారము, ఉదా. ప్రథమ చికిత్స. 2. hearing aid శ్రవణ సహాయకారి.

**AIDS** *abbr.* acquired immunodeficiency syndrome caused by HIV (human immunodeficiency virus), a deadly disease. There is no known cure yet, for this disease. ఎయిడ్స్ వ్యాధి హెచ్.ఐ.వి. వైరస్‌వలన కలుగును. ఇది ఒక మారణవ్యాధి. దీనికి మందు లేదు. Precaution is the only prevention! ముందు జాగ్రత్త ముఖ్యం!

**AIDS awareness** realization of the risk about AIDS disease ఎయిడ్స్ అనే వ్యాధి యొక్క అపాయం గురించి ఎఱుక.

**ailment** illness, especially a slight one స్వల్ప అస్వస్థత.

**air** 1. mixture of gases in the atmosphere వాతావరణములోని వాయువుల మిశ్రమము. 2. air which we breathe మనము పీల్చేగాలి. **a.bed** వాయుశయ్య. **a.cushion** గాలిదిండు.

**air borne** spread by air, *e.g.* pulmonary tuberculosis వాయువాహిత: గాలిద్వారా సంక్రమించు, ఉదా. ఊపిరితిత్తి క్షయవ్యాధి.

**air embolism** the blockage of any blood vessel by some quantity of air రక్తనాళములో గాలి అడ్డుపడుట.

**air hunger** deep indrawing of breath, occurs in uncontrolled heamorrhage, వాయుక్షుధ: అదుపులోలేని రక్తస్రావం, ఆఘాతం (shock)లో వాయుక్షుధ/వాయులోపం, శ్వాస వాయువు కొరకు తపన.

**air-sickness** sickness due to high altitude flying and during mountaineering exercises ఎత్తైన ప్రదేశంలో ఎగురుతున్నప్పుడు, విమాన యానములోగాని పర్వతారోహణలోగాని కలుగు అస్వస్థత.

**air-sinus** వాయుకోటరం. **paranasal a.** by the side of nose, *e.g.* maxillary sinus ముక్కు ప్రక్కన వాయుకోటరము, ఉదా. దంధికలోని వాయుకోటరము.

**airway** a device to keep breathing passages patent/open శ్వాస ఆడుటకు నోట్లో పెట్టే పరికరము. *figur.* Airway is lifeway. *అలంకార.* గాలిమార్గం జీవమార్గం.

**akinesia** immobility చలనరాహిత్యం, చలనము లేకుండుట [*opp.* kinesia *వ్యతి.* చలనము].

**alae nasi** nostril openings ముక్కు కుహరముల అంచులు.

**alba** white తెల్లని. **linea a.,** vertical white line on the centre of the anterior abdominal wall ఎదుట ఉదరకుడ్య మధ్యమున నిలువుపాటి తెల్లని/శ్వేతరేఖ.

**albinism** congenital absence of pigmentation in the body (skin, hair and eyes) due to defect in the synthesis of a pigment named melanin వర్ణహీనత, బొల్లి: చర్మము, జుట్టు మరియు కన్నులలో మెలనిన్ వర్ణకము తయారుగాక దేహము తెల్లబారిన స్థితి, ఇది పుట్టుకతోనే సంభవిస్తుంది.

**albino** *biol.* 1. in an animal or human: abnormal lack of pigmentation in hair, skin and eyes రంజకహీన జీవుడు: జంతువులలోగాని మనిషిలోగాని అసాధారణంగా వర్ణకలోపం. జుట్టు, చర్మం మరియు కన్నులో సాధారణంగా ఉండే రంగు ఉండదు. 2. *bot.* in a plant: lack of chlorophyll and other pigments మొక్కలలో: పత్రహరితం మరియు ఇతర వర్ణకముల లోపము.

**albugo** leucoma. *see/చూడండి* leucoma.

**albumin** a protein, *e.g.* albumin in the white portion of the egg; solidifies on heating తెల్లసొన, ప్రోటీన్లలోని పదార్థము, ఉదా. కోడిగుడ్డులోని తెల్లని పదార్థము; వేడి చేసినచో గడ్డకట్టును.

**albuminuria** albumin in the urine found in nephritis and nephrotic syndrome మూత్రంలో తెల్లసొన పోవటము, మూత్రపిండాల జబ్బులలో మూత్రములో అల్బుమిన్ కనపడుట.

**alcohol** astringent, antiseptic and intoxicant సారా, మద్యం, ఒగరు పదార్థము, క్రిమిసంహారిణి మరియు నిషాకారి. major ingredient in wines and whisky, liquor మాదక పానీయము, ఉదా. కల్లు, సారాయిలోని ముఖ్య అంశము.

**alcohol abuse** excessive indulgence/drinking of alcohol, *see చూడండి* abuse. మద్యమును (కల్లు, సారాయి వగైరా పదార్థములను) మితిమీరి సేవించుట/పుచ్చుకొనుట.

**alcoholic** 1. containing alcohol, *e.g.* alcoholic beverages/drinks మాదక పానీయములు. 2. a person addicted to alcohol త్రాగుబోతు.

**alcoholism** effect of alcohol on human system మద్యపాన మాంద్యరోగము; మాదక పానీయమువలన కలుగు మత్తు/నిషా.

**aldosterone** hormone secreted by the cortex of the adrenal gland అడ్రినల్ గ్రంథి తయారుచేయు హార్మోన్.

**alexia** word blindness: inability to comprehend written words; there is no loss of visual power పదాంధత్వము: వ్రాసిన పదాలు గ్రహించలేరు; చూడగలిగి ఉంటారు.

**algesia** 1. recognising pain బాధను తెలుసుకొనడం, బాధానుభూతి [*opp.* analgesia]. 2. excessive sensitiveness to pain, hyperaesthesia అధికవేదన.

**algid** chilly, cold, e.g. algid malaria caused by *Plasmodium falciparum* శరీరము చల్లబడుట, ఉదా. ఒక రకమైన మలేరియా.

**alimentary** with reference to nutrition పోషణమునకు సం., ఆహార సంబంధ. **a.system** జీర్ణవ్యవస్థ.

**alimentary canal** the part of the gastro-intestinal tract comprising the oesophagus, stomach and intestines ఆహారనాళము: అన్నవాహిక, జఠరము, పేగులు (చిన్నపేగు, పెద్దపేగు).

**alimentation** giving nourishment పోషక ఆహారమిచ్చుట.

**alive** 1. full of life సజీవము. 2. not dead మృతిచెందని/చనిపోని.

**alkalaemia** or **alkalemia** decrease in the H-ion concentration of the blood క్షారరక్తత [*in contr.* acidaemia]

**alkali** 1. a base substance క్షారము. 2. Alkali turns red litmus paper into blue. క్షారము ఎర్ర లిట్మస్‌ను నీలముగా మార్చును.

**alkaline** pertaining to alkali క్షార సం.

**alkaloid** organic substance found in plants, *e.g.* caffeine, morphine, quinine వృక్షముల నుండి తీయబడిన పదార్థములు, ఉదా. కెఫైన్, మార్ఫిన్, క్వినైన్.

**alkalosis** a condition wherein the blood becomes more alkaline, *i.e.* pH becomes more than 7.4 క్షారమయత, క్షారాధిక్యత: రక్తములోని క్షారము ఎక్కువగుట [*in contr.* acidosis భిన్న. ఆమ్లాధిక్యత].

**allantois** outgrowth of the embryo from which the blood vessels in the umbilical cord are derived అళిందము: పిండము మీది పిలక, బొడ్డుమొలక – దీనినుండి నాభిరజ్జువులోని రక్తనాళములు ఉద్భవిస్తాయి.

**allele** allelomorph, one of the possible forms of a gene at corresponding sites (loci) on homologous chromosomes ఎల్లీల్, యుగ్మవికల్పము: సమజాత (homologous) క్రోమోసోమ్‌లలో సంగత (corresponding) స్థానములలో ఉన్న సాధ్యమైన జన్యురూపములలో ఒకటి.

**allergen** substance causing allergy: pollen, article in diet, drug, *etc.* and during parasitic infestation శరీరమునకు సరిపడని పదార్థము, ఎలర్జి కలుగజేయు పదార్థము: పుప్పొడి, ఆహారపదార్థము, ఔషధము,

మొ. శరీరంలో ప్రవేశించినప్పుడు, మరియు పరాన్నజీవి శరీరములో ప్రవేశించినప్పుడు.

**allergy** 1. a hostile reactivity of tissues to a foreign substance, pollen, article in diet, drug, *etc.* and during parasitic infestation. All people do not exhibit unwantedness to the above foreign substance but only few do, *see/చూడండి* hyposensitization, urticaria ఎలర్జీ, అసహనీయత: పైన వ్రాసిన ఎలర్జెన్లు శరీరతత్వమునకు సరిపడకపోతే వారి కణజాలములు ఈ పదార్థములకు విద్వేషముతో సంచరించి వ్యాధికి గురి అవుతాయి. దీనిని ఎలర్జి అంటారు. ఈ స్థితి బహుకొద్దిమందిలోనే చూస్తాము; పెక్కుమంది ఈ స్థితికి గురికారు. 2. Allergy, a medical journal వైద్యవార్తాపత్రిక.

**allopathy** using drugs which produce effects opposite to those which the patient is suffering from రోగిలోని గుణములకు విరుద్ధమైన గుణములు కలుగజేయు ఔషధప్రయోగము [*Cf.* homoeopathy *తారత.* హోమియోపతి].

**aloe** 1. aloes (plural noun with singular verb). laxative of vegetable origin కలబంద, విరేచనకారి. 2. applied over an abscess to soften it చీముగడ్డమీదపెట్టి కట్టుకడితే అది మెత్తబడుతుంది.

**alopecia** falling of hair జుట్టురాలిపోవుట. 1. localised: patches over scalp, beard ప్రాంతీయంగా తలమీదగాని గడ్డముమీదగాని వెంట్రుకల కొరత. 2. diffuse: (a) after prolonged illness, after typhoid fever తలజుట్టు అంతా రాలిపోవుట, దీర్ఘవ్యాధులలో, టైఫాయిడ్ జ్వరము తగ్గిన తర్వాత (b) after anticancer therapy (drugs) కాన్సరు చికిత్సకు వాడిన ఔషధముల ప్రభావమువలన జుట్టు రాలిపోవుట.

**altitude sickness** *see/చూడండి* mountain sickness.

**alveoli** [alveolus *sing.*] The diameter of an alveolus is about 0.25 mm, *i.e.* 250$\mu$; air sacs (of microscopic size) situated at the periphery of the respiratory tree/tract, *resemblance:* bunch of grapes. వాయుకోశాలు: శ్వాసవాహికల చిట్టచివరనున్న, సూక్ష్మదర్శినిలో చూడగలిగిన సూక్ష్మమైన వాయుకోశగోణులు, *పోలిక:* ద్రాక్షపండ్ల గుత్తివలె అమర్చబడి ఉంటాయి.

**alveolitis** inflammation of alveoli; by tradition lung alveoli ఊపిరితిత్తి వాయుకోశాల ఇన్‌ఫ్లమేషన్.

**alveolus** [alveoli *pl.*] **pulmonary a.** వాయుకోశం. **dental a.** దంతబిలం.

**alveolus dentalis** [alveoli dentales *pl.*] tooth socket పన్నుగూడు, పన్నుకుదురు.

**Alzheimer's disease** mental deterioration / degeneration; degeneration of brain cells, loss of memory: may start in middle age మెదడుకు క్షీణదశ/చెరుపు, జ్ఞాపకం ఉండకపోవటం; మధ్యవయస్సులో మొదలు కావచ్చును. It may sneak in the elderly. వృద్ధాప్యంలో జొరబడవచ్చును.

**amaurosis** loss of sight, blindness అంధత్వము.

**ambidextrous** able to use both hands with equal power/ease సవ్యసాచి: రెండు చేతులతో సమానముగా (అనగా సమానశక్తితో) పనిచేయగల.

**amblyopia** dimness of vision చూపులో/దృష్టిలో మాంద్యము.

**ambulance** a vehicle to transport a diseased or injured person (not a deceased person, of course) రోగినిగాని, గాయపడిన వారినిగాని తీసుకొనిపోవు వాహనము (చనిపోయినవారిని కాదు సుమా!) The mirror-image of the word AMBULANCE - ƎƆИA⅃UᗺMA is painted in red letters on the front beneath the windshield so that it appears straight in the rear mirror of the vehicle in front, to enable the other vehicles to give way/side to the ambulance, since for the patient inside 'Time is life'. ఆపదలోనున్నవారిని ఆసుపత్రికి తరలించే వాహనంమీద AMBULANCE అనే పదం ముందు పోతున్న వాహనాల దర్పణం/అద్దంలో కనపడేటట్లు ఎర్రరంగులో తిరగతిప్పి వ్రాయబడి ఉంటుంది, వాటిని దాటిపోవాలని గ్రహించాలని; ఎందుచేతనంటే లోపల ఉన్న రోగికి 'నిముషాలమీద ప్రాణం ఆధారపడి ఉంటుంది' కాబట్టి. అందుచేతనే ambulance ని ఆపద్బంధువు అంటారు. *గమనిక:* ప్రాణం విలువ అమూల్యం.

**ambulant** ability to move చలన సమర్థత.

**ambulatory** able to walk and move about నడవగలుగుట, తిరగగలుగుట.

**AMC** *abbr.* acute medical care, a unit in a hospital ఆసుపత్రిలో 'తీవ్రమైన వ్యాధుల పర్యవేక్షణ' విభాగం.

**ameba** *pl.* **amebae** or **amebas** *see/చూడండి* amoeba.

**amebiasis** *see/చూడండి* amoebiasis.

**amelia** congenital absence of limb(s) అంగహీనత.

**amelioration** making better పరిస్థితి మెరుగుపడుట.

**amenorrhoea** or **amenorrhea** absence of normal menstrual periods ఋతుస్రావము/ముట్లు లేకుండుట, బహిష్టు కాలేకపోవటము.

**amentia** mental ratardation బుద్ధిమాంద్యత.

**amino acid** a chemical radical in all proteins ఎమైనోఆమ్లము: ప్రోటీన్ లలో రసాయనమూలము.

**amitosis** direct cell division: cell division in which chromosome formation and division do not occur. ఏకదశ కణ విభజనము/విభాగము.

**amla** *bot. Emblica officianalis,* Indian gooseberry, richest source of vitamin C. ఉసిరికాయ, C విటమిన్ గలది, *గమనిక:* ఉసిరిపచ్చడి మొదటి ముద్దలో రుచి/శ్రేష్ఠం. అలంకార. రాచ ఉసిరి ఇంకా రాజసం.

**ammonia** $NH_3$, a colourless gas with pungent smell and strong alkaline reaction అమోనియా, నవాసారము, కారమైన/తీక్షణమైన క్షారము. ఇది ఒక వాయువు.

**amnesia** loss of memory స్మృతిలోపము, మరపు, మతిమరుపు.

**amniocentesis** aspiration of amniotic fluid ఉమ్మనీరు సిరెంజ్ తో తీయుట.

**amnion** the membrane which lines the chorion and envelops the foetus and amniotic fluid ఉల్బము,. అపరాయువు: భ్రూణము మరియు ఉమ్మనీరు ఉన్న తిత్తియొక్క పొర.

**amniotic fluid** The fetus is surrounded by this fluid. ఉమ్మనీరు, పిండముచుట్టూ ఉన్న ద్రవము, ఉల్బకద్రవము. It acts as a shock-absorber to the fetus. భ్రూణమునకు అదరు తగ్గించేది.

**amoeba** [amoebae *pl.*] or **ameba.** a single cell protozoan అమీబా, ఏకకణ సూక్ష్మజీవి.

**amoebiasis** or **amebiasis** a disease caused by the invasion of amoeba, *Entamoeba histolytica* into the tissues, *e.g.* amoebic dysentery. Another disease is abscess in the liver, *see/చూడండి* trophozoite. అమీబా కణజాలముల మీద దాడెత్తిన పర్యవసానంగా వచ్చు జబ్బు, ఉదా. చీము రక్తవిరేచనములు. మరియొక జబ్బు లివర్‌లో చీముగడ్డ.

**amphetamines** drugs which stimulate the central nervous system మెదడును ఉత్తేజపరచే మందులు, అలంకార. మేధను మెరుగుపరచేవి.

**ampoule** or **ampule** glass container with fluid for parenteral administration ఇంజక్షన్ బుడ్డి/గాజుపరికరము.

**ampulla** dilated end of a small passage/tube కలశిక: వాహిక యొక్క లావుపాటికొన. **a. of Vater,** a. of bile duct, the dilatation at the junction of the pacreatic and bile ducts as they open into the lumen of the duodenum క్లోమనాళము మరియు పైత్యరసనాళము కలసి డుయోడినమ్‌లోనికి ప్రవేశించునప్పుడు ఉన్న కలశిక.

**amputation** cutting of a limb or appendage ఛేదించుట: అంగచ్ఛేదన, కాలు/చేయి/ఉపాంగము ఛేదించుట.

**amylase** enzyme which converts starches into sugars. పిండి పదార్థమును చక్కెరగా మార్చే ఎన్‌జైమ్. **pancreatic a.** క్లోమములో ఎన్‌జైమ్. **salivary a.,** ptyalin లాలాజల ఎన్‌జైమ్. *N.B.* daily experience: When we chew rice/chapati sweet taste emanates in the mouth, *i.e.* the starch in carbohydrates gets converted into sugar by the action of the salivary enzyme. *గమనిక:* నిత్యానుభవము – అన్నం, చపాతి తింటున్నప్పుడు కార్బోహైడ్రేట్‌లోని పిండి పదార్థము ఈ లాలాజల ఎన్‌జైమ్ ప్రభావముతో చక్కెరగా రూపొందినందున నోట్లో తీపిదనం వస్తుంది.

**amyloid** starchy paste-like material గంజివంటి గుజ్జు/పదార్థము.

**amyloidosis** accumulation of amyloid in the organs; transformation of the substance of the organ into amyloid material అవ

యవములలో ఎమ్తైలాయిడ్ మార్పువచ్చి ఆ గంజివంటి జిగటుపదార్థము చేరుట.

**amyotonia** flaccidity of muscles కండరాల బిగి సడలటము, బిగువులేని/పితపితలాడు కండరములు.

**amyotrophic lateral sclerosis** motor neuron disease, paralysis of muscles due to degeneration of the spinal cord, *see*/చూడండి sclerosis. వెన్నుపాము క్షీణించినందున కండరముల పక్షవాతము.

**amyotrophy** muscular atrophy కండరములయొక్క క్షయము.

**anabolism** process by which simple substances are converted into complex compounds జీవ నిర్మాణక్రియ, నిర్మాణాత్మక సంశ్లేషణ క్రియ: ముడిపదార్థములను జీవరసాయన పదార్థములుగా మార్చు ప్రక్రియ.

**anaemia** or **anemia** patient looks pale, deficiency of red blood corpuscles and haemoglobin in the blood రక్తహీనత, పాండురోగము/పాలిపోవుట; రక్తములో ఎర్రకణములు, హెమోగ్లోబిన్ తక్కువగుట.

**anaemic** or **anemic** suffering from anaemia రక్తహీన. **a. individual** రక్తహీనవ్యక్తి.

**anaerobe** a living organism which thrives in an atmosphere devoid of oxygen వాయునిరపేక్షి, అవాయుజీవి, అవాతజీవి: ప్రాణవాయువులేని వాతావరణంలో పెరిగే సజీవప్రాణి [*opp.*aerobe వ్యతి. వాతజీవి].

**anaesthesia** or **anesthesia** A. absence of the sensation of pain and temperature sense, one example leprosy (Hansen's disease) నొప్పి మరియు ఉష్ణశీతలములు తెలియకుండుట, ఒక ఉదాహరణ కుష్ఠవ్యాధి, వాడు.భా. కుష్ఠురోగం. B. a reversible loss of sensation induced by a drug, *e.g.* during a surgical operation మత్తుమందు, ఉదా. శస్త్రచికిత్సలో మత్తుకలిగించటం: (i) **general a.** making patient unconscious రోగికి స్పృహ లేకుండాచేయుట. (ii) **local a.** patient is conscious, the part to be operated is anaesthetised, *i.e.* made numb రోగి స్పృహలో ఉంటాడు, స్థానికంగా నొప్పి తెలియకుండా మొద్దుబారినట్లు చేస్తారు, ఇక స్పర్శజ్ఞానముండదు. (iii) **spinal a.** a drug

is injected into the spinal canal in the lumbar spine; the part below that level is made numb, say for operations in groin, lower limbs కటికశేరుకాలమధ్యనుంచి కశేరుకుల్యలోకి మత్తుమందు ఎక్కించి దిగువ భాగాన్ని మొద్దుపరుస్తారు; గజ్జప్రాంతంలో, అధోంగాలమీద ఆపరేషన్లకు ఈ పద్ధతి అవలంబిస్తారు. C. Anesthesia, Anesthesiology—medical journals వైద్యశాస్త్ర వార్తాపత్రికలు.

**anal** referring to the anus ఆసనమునకు సం.

**analeptic** 1. drug/agent that restores consciousness, *e.g.* 'smelling salt', crushed garlic స్పృహ తెప్పించే మందు/వస్తువు, ఉదా. తీక్ష్ణ లవణము, నలిపిన/చితిపిన లేదా దంచిన వెల్లుల్లి. 2. one which stimulates the activity of central nervous system, *e.g.* caffeine in coffee/tea కేంద్రీయ నాడీవ్యవస్థను ఉత్తేజపరచే పదార్థము, ఉదా. కాఫీ, టీలో ఉన్న కెఫైన్.

**analgesia** lack of sensation of pain నొప్పి తెలియకుండుట, వేదనారాహిత్యస్థితి.

**analgesic** a drug inducing analgesia బాధానివారిణి: నొప్పి తెలియకుండా చేసే మందు.

**analogous** *biol.* resembling functionally, but having a different origin or structure, e.g. the wings of insects, birds. విధి నిర్వహణలో పోలిన, కాని ఉద్భవంలోగాని నిర్మాణంలోగాని వేరుగా ఉండుట, ఉదా. కీటకముల, పక్షుల రెక్కలు. [*Cf.* homologous].

**analogue** or **analog** *biol.* parts or organs in different species of animals or plants which differ in structure or development but are similar in function సమధర్మి: నిర్మాణంలోగాని ఎదుగుటలో గాని వేరువేరుగా ఉండి ఒకే విధి నిర్వహిస్తున్న వివిధ జంతు లేదా వృక్షజాతుల్లోని అవయవములుగాని, భాగములుగాని.

**analysis** 1. resolution into elements విశ్లేషణము. 2. examination of component parts విభజనము.

**anamnesis** remembrance of the history of the illness as narrated by the patient రోగి తనకున్న వ్యాధిని గురించి చెప్పే చరిత్రలోని ఘట్టముల యొక్క జ్ఞాపకం.

**anaphylactoid** resembling anaphylaxis తీవ్ర ప్రక్రియనుపోలిన. vasomotor disturbances, *see/చూడండి* vasomotor.

**anaphylaxis** life-threatening shock and collapse due to immediate hypersensitivity to an offending antigen తీవ్ర ప్రక్రియ, ప్రాణాపాయమైన దుస్థితి: అన్‌టిజన్‌మీద శరీర వైషమ్యము; అతిసంవేదనశీలత దీనికి కారణము.

**anaplasia** loss of the distinctive characteristics of a cell విలక్షణము: కణముయొక్క విశిష్ట లక్షణములు కోల్పోయిన స్థితి. anaplastic carcinoma ఇట్టి విలక్షణకణ కేన్సరు.

**anasarca** oedema/swelling of all tissues leading to bloating of the body నంజు, ఉబ్బు: శరీరమునకు నీరు పట్టింది అనే స్థితి; అన్ని కణజాలములయందు ద్రవము చేరుట – అప్పుడు మనిషి ఉబ్బిపోతాడు.

**anastomosis** [anastomoses *pl.*] joining: communication between vessels by the establishment of collateral channels అనుసమ్మేళనము: అనుమేళకము, రక్తనాళములను కలుపు పార్శ్వసంబంధముగల రక్తవాహికల మేళనము (union).

**anatomy** subject of knowing the structure of the body శరీర నిర్మాణశాస్త్రము.

**Ancylostoma** or **Ankylostoma** a genus of hookworms which inhabit the intestines, suck blood and produce anaemia, *see/చూడండి* ground i., in itch. కొంకి పురుగు. ఈ పురుగులు ప్రేగుల లోపలిభాగమున కొక్కెమువేసి పట్టుకున్నట్లు వ్రేలాడి, అక్కడ స్థావరము ఏర్పరచుకొని, రక్తము గుంజి, రోగిని రక్తహీనుడుగా చేస్తాయి. ఈ పురుగు ప్రేగులలో పరాన్నజీవిగా జీవిస్తుంది.

**ancylostomiasis** or **ankylostomiasis** *syn.* hookworm disease కొంకిపురుగువ్యాధి. infestation with Ancylostoma. ఈ పురుగులు శరీరంలో చేరుటచేత రోగి బాధపడుట.

**androgen** hormone responsible for masculine features పురుష లక్షణము సూచించు/చూపించు హోర్మోన్.

**androgynous** pertaining to female pseudohermaphroditism. *see/చూడండి* pseudohermaphrodite.

**androphobia** morbid fear of men or male sex పురుషుడన్నా పురుషలింగమన్నా అమితభయం.
**androsterone** male sex hormone పురుష లింగము సూచించు హార్మోన్.
**anemia** *see/చూడండి* anaemia.
**anencephaly** rudimentary brain, *colloq.* 'frog-babies' అమస్తిష్కృత. incompatible with life వీళ్ళు బతకరు.
**anesthesia** *see/చూడండి* anaesthesia.
**aneurine** thiamine or vitamin $B_1$, concerned in carbohydrate metabolism కార్బోహైడ్రేట్ జీవ(న)క్రియకు సం. విటమిన్ $B_1$.
**aneurysm** or **aneurism** dilatation of the wall of a blood vessel or chamber of the heart, e.g. aneurysm of aorta రక్తనాళముగాని గుండె కుహరముగాని ఉబ్బుట, ఉదా. బృహద్ధమని ఉబ్బుట.
**angiitis** or **angitis** ('itis' means inflammation) inflammation of blood or lymph vessel ('itis' అనగా శోథము/నొప్పి, వేడి, మంటతోగూడిన వాపు) రక్త/లింఫ్ నాళముయొక్క ఇన్‌ఫ్లమేషన్.
**angina** 1. a choking/suffocating/constricting/'in the grip of vice' feeling or sensation గుండెపోటు, నొప్పి: ఉక్కిరిబిక్కిరిచేయు/ఊపిరి అడకుండాచేయు/అదిమిపట్టు/పటకారువంటి కమ్మరివాని సాధనము (vice)లో ఇరుకుకున్నట్లు క్షోభము. **a. of effort,** often angina is induced by exercise ఛాతీలో పైనవివరించిన క్షోభము తరచుగా శరీరకదలిక/వ్యాయామం వలన సంభవిస్తుంది. **a. pectoris,** angina in chest due to myocardial ischaemia, *i.e.* lack of blood supply to the wall of the pump (heart) in spite of the presence of blood inside the heart – cry of the heart for redressal of its plight of 'Blood, blood everywhere; Not a drop to drink' రొమ్ముశూల, ఎదురు రొమ్మునొప్పి: హృదయవేదనతో గూడిన గుండెరోదన. గుండె లోపల రక్తం ఉన్నప్పటికి హృదయ కుడ్యమునకు రక్త సరఫరాలేదు. 2. **Ludwig's a.,** brawny swelling due to inflammation in the floor of the mouth నోరు అడుగున ఇన్‌ఫ్లమేషన్. 3. **Vincent's a.,** ulceration of throat, tonsil due to *B. fusiformis and Treponema* ఈ సూక్ష్మజీవులవలన గొంతు, టాన్సిల్‌లో వ్రణములు.

**angiogenesis** angio=blood vessels, genesis=growth; growth of new blood vessels in a tumour, *etc.* కంతి, మొ. వాటిలో నూతన రక్తనాళములు రూపొందుట.

**angiogram** X-ray photograph of blood vessels రక్తనాళముల యొక్క ఎక్స్‌రే పరీక్ష ఫొటో.

**angiography** taking X-ray of blood vessels after the injection of a radio-opaque dye/material, *see/చూడండి* angiogram. అపారదర్శకమగు అద్దకము/పదార్థము రక్తనాళములలోనికి ఎక్కించి, వాటి ఎక్స్‌రే ఫోటో తీయుట.

**angiology** the science of the blood vessels and lymphatics నాళ విజ్ఞానం: రక్త, శోషరసనాళముల స్వరూపాదులను గురించి తెలియజేసే శాస్త్రం.

**angioma** tumour of blood vessels రక్తనాళికల కంతి.

**angioneurotic oedema** severe form of urticaria; localised temporary swelling under skin of face, hands, genitals or mucous membrane of the mouth and throat ముఖము, చేతులు, గుహ్య అవయవముల చర్మముక్రిందగాని నోరు, గొంతు శ్లేష్మపొరక్రిందగాని విపరీతమైన దద్దుర్లు, వాపు. Beware! oedema of the glottis may be fatal. జాగ్రత్త! కంఠబిలం వాపు ప్రాణాపాయము.

**angor animi** awareness of dying ఆసన్నమరణ జ్ఞానం. *figur.* wild anger అలంకార. బక్క కోపం.

**anhidrosis** or **anidrosis** absence of sweating చమట లేకుండా ఉన్న స్థితి, స్వేదరాహిత్యం.

**anhidrotic** or **anidrotic** an agent suppressing sweat స్వేదనిరోధి: చమటను తగ్గించు మందు.

**anhydrous** entirely without water, dry తడి ఏమాత్రంలేని; పొడి/ఎండిన.

**anidrosis** *see/చూడండి* anhidrosis.

**anidrotic** *see/చూడండి* anhidrotic.

**anion** a negatively charged ion ఋణావేశిత అయాన్, నెగెటివ్ ఛార్జిగల అయాన్ [*Cf.* cation తారత. ధనావేశిత అయాన్].

**aniseikonia** difference in the size or shape of the object from one eye to the other ఒక కంటితో కనపడిన వస్తువు సైజుగాని ఆకృతిగాని, రెండవకంటితో కనపడిన అదే వస్తువు సైజుగాని ఆకృతిగాని వేరువేరుగా ఉండుట. correction by iseikonic glasses possible ప్రత్యేక అద్దాలతో ఈ దోషం సరిదిద్దవచ్చును.

**anisocoria** a state of difference in the size of the two pupils రెండు కనుపాపల సైజుల్లో వ్యత్యాసముండుట/భేదముండుట.

**anisocytosis** variation in the size of red blood cells అసమకణ పరిమాణస్థితి: ఎర్రరక్తకణముల సైజులు వేరువేరుగా ఉండుట.

**ankle** portion above the heel కాలి చీలమండ.

**ankyloglossia** immobile tongue, tongue-tie జిహ్వాబద్ధత, రసజ్ఞ బంధనం. అలంకార. నాలుక నాట్యమాడలేదు, ఇంక.

**ankylosing spondylitis** *syn.* bamboo spine. immobility of the vertebrae resulting in a stiff spinal column. Hip, shoulder and other joints may become stiff ఎండిపోయిన బొంగువలెనున్న వెన్ను: వెన్నుపూసలోని ఎముకలు బిగిసిపోయి వెన్ను బిర్రుగా అవుతుంది. తుంటికీలు, బుజము మరికొన్ని కీళ్ళుగూడా బిగువుగా కావచ్చు.

**ankylosis** rigidity of a joint, *eg.* bony ankylosis wherein the joint does not move at all వంగని కీలు, కీళ్ళలో చలనరాహిత్యము, ఉదా. కీలు ఎముకలు కలిసిపోవుట (bony ankylosis); ఇక ఆ కీలు కదలదు, ఆడదు.

**Ankylostoma** *see/చూడండి* Ancylostoma.

**ankylostomiasis** *see/చూడండి* ancylostomiasis.

**anodyne** a drug which relieves/eases pain నొప్పికి శమనము/ఉప శమనము కలిగించే మందు.

**anomaly** irregularity అసంగతము.

**Anopheles** a genus of mosquitoes; bite of female Anopheles mosquito causes malaria in human beings ఈ ప్రజాతికి చెందిన దోమలు; ఆడదోమ కాటువలన మనుష్యులకు మలేరియా వస్తుంది.

**anorexia** lack in appetite/loss of appetite ఆకలి లేమి/లేకుండుట

**anoscope** proctoscope, instrument for introduction into the anus/rectum for examination అసన/పురీషనాళ అంతర్దర్శిని: ఆసనము/మలాశయము పరీక్షచేయు సాధనము/పనిముట్టు.

**anosmia** absence of the sensation of smell వాసనలేమి, ఘ్రాణజ్ఞాన రాహిత్యం: వాసన తెలియని జబ్బు.

**anoxaemia** or **anoxemia** hypoxemia, reduction of oxygen in the blood రక్తములో ప్రాణవాయువు తగ్గుట.

**anoxia** absence of proper oxygen supply to the tissues అమ్లజని హీనత: కణజాలములకు కావలసిన ప్రాణవాయువు లేకుండుట.

**antacid** a substance/agent that counteracts acidity ప్రత్యామ్లము: జఠరరసములోని ఆమ్లము/పులుపు తగ్గించే మందు.

**antagonism** opposition వైరము, ప్రతిపక్షత, వైరుధ్యము.

**antagonist** opponent ఎదిరి, ప్రతివాది.

**anteflexion** bent forward, *e.g.,* uterus in an anteflexed position ముందుకు వంగిన, ఉదా. గర్భసంచి ముందుకు వంగిన స్థితి.

**ante mortem** before death చావుకు ముందు [*Cf.* post mortem *తారత.* చావుకు తర్వాత].

**antenatal** before birth ప్రసూతిపూర్వ. **a. care,** medical examination of a pregnant woman during the period from conception to delivery గర్భధారణమునుండి ప్రసవము వరకుగల కాలములో వైద్య పరీక్ష [*Cf.* postnatal *తారత.* ప్రసవము తదుపరి/తర్వాత].

**antepartum** before parturition ప్రసవము/కాన్పుకు ముందు [*Cf.* post partum *తారత.* కాన్పు తర్వాత].

**antepyretic** before the stage of fever జ్వరము వచ్చుటకు ముందు.

**anterior** situated in/at the front పూర్వ, పూర్వాంత, ముందటి, ముందు భాగమున ఉన్న [*opp.* posterior వ్యతి. వెనుక].

**anteversion** forward displacement, *e.g.* anteversion of the uterus ముందుకు జరుగుట, ఉదా. గర్భకోశము ముందుకు జరుగుట [*opp.* retroversion వ్యతి. వెనుకకు జరుగుట].

**anthelminthic** or **anthelmintic** an agent/drug destructive to worms or expelling them, *e.g.* those in the gastrointestinal tract

పురుగులను నశింపజేయు లేదా నెట్టివేయు మందు, ఉదా. జీర్ణాశయాంత్ర క్రిమిసంహారిణి.

**anthracosis** a disease of the lungs due to inhalation of carbon dust బొగ్గు అణువులు పీల్చినందువలన కలిగిన ఊపిరితిత్తుల జబ్బు.

**anthrax** disease of the human being due to infection (air borne spores) from ruminants/cud-chewing animals like the cattle, sheep, goat, *etc.* Two forms of the disease exist in man chiefly, *viz.* cutaneous (of skin) and pulmonary (of lungs), in addition to involvement of other regions. దొమ్మరోగము: మేత నెమరువేయు జంతువులనుండి మనిషికి సంక్రమించు అంటురోగము. ముఖ్యముగా చర్మము, ఊపిరితిత్తులు ఈ వ్యాధికి గురి అవుతాయి; మరికొన్ని శరీరప్రాంతములలోకూడ ఈ జబ్బు రావచ్చును.

**anthropology** science which deals with the characteristics of man like origin, race, cultural development, *etc.* మానవ విజ్ఞాన శాస్త్రము: మనిషి యొక్క పుట్టుపూర్వోత్తరాలు, జాతి, సంస్కృతి వగైరా అంశములు వివరించు శాస్త్రము.

**anthropometry** science dealing with the measurement of the height, size, weight and proportions of the human body మానవ శరీరమాపనము: మనిషియొక్క నిలువుకొలత, పరిమాణము, బరువు, తదితర అంశములు నమోదుచేయు శాస్త్రము.

**anthropophobia** fear of society or fear of companionship సంఘం అన్నా, స్నేహితం అన్నా భయం.

**antibiosis** anti = against, biosis = life. an association between two organisms which is harmful to one or both of them రెండు జీవుల మధ్య హానికరమైన సాంగత్యము [*in contr.* symbiosis వ్యతి. సహజీవనము].

**antibiotic** a chemical substance produced by a microorganism which is inimical to other microorganisms సూక్ష్మజీవి నాశకము, సూక్ష్మజీవులు తయారుచేసిన రసాయనిక పదార్థము; ఇది మిగతా సూక్ష్మజీవులకు హానికరము.

**antibody** a protective product. Production of antibodies is the response of cells in the body consequent upon exposure to

a foreign substance, *e.g.* an antigen, a protein. ప్రతిరక్షకము, శరీరరక్షక పదార్థము: ఏదైనా పరాయి పదార్థము, ఉదా. ఏన్‌టిజన్, ఒక ప్రోటీన్, శరీరములో ప్రవేశించగానే రక్తములోని కణములు ఈ ప్రతికూల పదార్థములను (antibodies) తయారు చేస్తాయి.

**anticoagulant** a substance which reduces the clotting of blood రక్తము గడ్డకట్టుటను తగ్గించు పదార్థము.

**antidepressant** an agent/drug used in treating depression, *see*/చూడండి depression. వ్యాకులత/కుంగిపోవటంను నయముచేసే వస్తువు/ఔషధము.

**antidiuretic** an agent that reduces the output of urine మూత్ర విసర్జన(ము) తగ్గించే వస్తువు.

**antidiuretic hormone** ADH, vasopressin, stored in the posterior pituitary పరాంత పిట్యూటరిలో నిల్వ చేయబడి ఉండే హార్మోన్.

**antidote** a remedy to counteract a poison విషపరిహారవస్తువు, విషమును విరుగుడుచేయు చికిత్స.

**antiemetic** a remedy to stop vomiting వాంతి నివారిణి, వాంతిని అరికట్టు సాధనము/మందు.

**antifebrile** a drug/measure to reduce fever జ్వరమును పోగొట్టు మందు/సాధనము.

**antigen** a protein which produces antibodies ఏంటిజన్, ప్రతిజనకము, ప్రతిరక్షక జనకము. ఇది ఒక ప్రోటీన్; ఇది ప్రతిరక్షకాలను (antibodies) తయారుచేయును.

**antihaemorrhagic** or **antihemorrhagic** a substance to stop bleeding రక్తస్రావనిరోధి: రక్తస్రావమును అరికట్టు పదార్థము.

**antihistamine** a drug used in the treatment of allergy ఎలర్జిని ఎదుర్కొనే మందు.

**antihypertensive** an agent/drug used to reduce blood pressure రక్తపోటును తగ్గించేమందు.

**anti-infective** against infection సంక్రమణ నిరోధక.

**anti-inflammatory** against inflammation శోథ నిరోధక.

**antimetabolite** preventing the metabolism and development of a cell కణజీవ(న)క్రియ, తద్వారా. కణ పెరుగుదల ఆపునది. used in the treatment of cancer కాన్సరు చికిత్సలో వాడ్తారు.

**antimicrobial** killing microorganisms సూక్ష్మజీవులను చంపు.

**antimycotic** antifungal ఫంగస్‌ను నిర్మూలించునది.

**antioxidants** substances which annul the harmful effects of free radicals contained in the oxidative products produced in metabolism in the body. *see/చూడండి* also bioflavonoids. కూరగాయలు, పండ్లలో నున్న పదార్థములు – జీవ(న)క్రియ రక్షకములు.

**antiparasitic** a drug to destroy parasites పరాన్నజీవి నిరోధి: పరాన్నజీవులను చంపు మందు.

**antipathy** enantiopathy: treating with antidotes విరుగుడు, విషపరి హారకౌషధముచే నయం చేయటం.

**antiphlogistic** relieving inflammation ఇన్‌ఫ్లమేషన్ తగ్గించేది.

**antipruritic** a drug to counteract itching దురదను రూపుమాపే/ తగ్గించే మందు.

**antipsoric** for curing scabies, or the itch గజ్జి లేదా దురదను నయం చేసేది.

**antipyretic** a drug used for fever to subside జ్వరనాశిని, జ్వరనిరోధి: జ్వరమును తగ్గించే మందు.

**antiscorbutic** an agent effective in the relief of vitamin C deficiency (scurvy) స్కర్వీ నివారక ఔషధం: విటమిన్ సి లోపమును సరిదిద్దు పదార్థము.

**antiseptic** 1. agent preventing invasion by pathogenic bacteria/microorganisms (sepsis): antiseptic used on the skin only పూతిరోధి: బాక్టీరియా/సూక్ష్మజీవులు చేరకుండా, కుళ్ళిపోకుండా కాపాడే మందు; దీనిని చర్మము మీదనే వాడుతారు. 2. Antiseptic, an Indian journal of medicine భారత వైద్యపత్రిక.

**antiserum** immune serum; blood serum that contains antibodies to counteract antigens, see immunity, vaccine. ఏంటిజన్‌లను ఎదుర్కొనే ప్రతిరక్షకాలు (antibodies) గల సీరమ్.

**antispasmodic** an agent relieving the spasm (narrowing) of any tubular structure in the body, *e.g.* intestine, blood vessel ఈడ్పు నిరోధి: గొట్టము/నాళము రూపములోనున్న భాగముయొక్క ఈడ్పు/ముడుచుకొనుటను నయముచేయు మందు, ఉదా. ప్రేగు, రక్తనాళము యొక్క ఈడుపును తగ్గించేమందు.

**antisyphilitic** a drug which cures syphilis సవాయినిరోధక: సవాయి కొఱుకురోగము నయముచేసే మందు.

**antitoxin** a substance manufactured by the blood (of animals, usually) which neutralises the poison (toxin) generated by germs in the human body విషనిరోధి, ప్రతిజీవవిషము, జీవవిషనివారకము: పశువుల రక్తంనుండి తయారుచేసిన పదార్థము; ఇది మనుష్యులలో క్రిములు జమచేసిన విషపదార్థము (toxin) ను నిరర్థకము (neutralize) గావించును.

**antitubercular drugs** drugs which cure or arrest tuberculosis క్షయవ్యాధిని అరికట్టు లేదా అదుపులో పెట్టు మందులు.

**antitussive** an agent/drug which relieves cough దగ్గును అరికట్టు సాధన/ఔషధము.

**antivenin** a material used to neutralise the poison in animal venom, *e.g.* use of polyvalent antivenin in the treatment of snake bite గరళ/విషవిరుద్ధ పదార్థము, ఉదా. పాముకాటుకు విరుగుడు.

**antiviral** acting against viruses వైరస్ నిరోధి.

**antixerotic** an agent which removes dryness ఏ కణజాలమునందైనా ఎండిపోవు స్థితిని ఆపునట్టి వస్తువు.

**antrum** space within a bone, *e.g.* maxillary antrum ఎముకలోని కుహరము, ఉదా. బుగ్గవెనుకనున్న మాక్సిల్లా ఎముకలోని కుహరము.

**anuria** strike of the kidneys, cessation of urine formation by the kidneys మూత్రబంధనము, కిడ్నీబందు, మూత్రపిండాల సమ్మె, కిడ్నీలు మూత్రము తయారుచేయటం మానేశాయి/ఆపేశాయి.

**anus** an opening for the passage of faeces పాయువు, ఆసనము, గుదము, మలద్వారము. గమనిక: దీనిమీద ఆసీనులవుతారు కాబట్టి ఆసనము అన్నారు. **imperforate a.** anal region without an opening నిరంధ్ర, రంధ్ర రాహిత్య గుదప్రాంతం.

**anvil** a very small bone by name incus with resemblance to an anvil, set as the middle ossicle articulating with malleus and stapes, *see/చూడండి* ear. కంసాలివాని దాగలిని పోలియున్న దాగలి ఎముక. ఇది బహుచిన్న ఎముక (అస్థిక). ఇది మాలియెస్, స్టేపిస్ అను రెండు బహుచిన్న ఎముకలమధ్య వ్రేలాడుతూ వాటిని తాకుతూ ఉంటుంది.

**anxiety** a feeling of apprehension, uncertainty and fear **ఆతురత:** రాబోవుకీడు తెలిసిపొందే భయము, వాస్తవముకాని ఊహ, బెదరు – ఈ మూడు మిళితమైన చింత. **a. neurosis** వ్యాకులతతో కూడిన మనోదౌర్బల్యం, **ఆతృతతో** కూడిన మనఃప్రవృత్తి, వ్యాకులతా నాడీరుగ్మత. **a. reaction,** వ్యాకులతా ప్రతిచర్య.

**aorta** a big artery leaving the heart మహాధమని, బృహద్ధమని, అవర్తాధమని: గుండెనుండి వెడలు పెద్ద ధమని.

**aortic** pertaining to the aorta బృహద్ధమనికి సం. **a. arch** మహాధమని వంపు.

**aortic regurgitation** recycling back of blood from aorta into the left ventricle due to the incompetence of the aortic valve గుండె ఎడమ జఠరిక నుండి బయలుదేరు బృహద్ధమనిలోని అటుఇటు ఆడెడి కవాటముయొక్క అసమర్థత వలన రక్తము బృహద్ధమనినుండి ఎడమ జఠరికలోనికి గుంజుకొనబడుట.

**aortic stenosis** narrowing of the aortic valve as a consequence of which the left ventricle gets hypertrophied బృహద్ధమనిలోని అటుఇటు ఆడెడి కవాటము ముడుచుకొనిపోవుట. దీనివలన గుండె ఎడమజఠరిక ఉబ్బుతుంది.

**aortic valve** valve situated inside the aorta at the commencement of the aorta from the left ventricle గుండె ఎడమ జఠరికనుండి బృహద్ధమని పుట్టుతుంది; ఈ పుట్టుక స్థానములో లోపల అటుఇటు ఆడెడి కవాటము.

**aortitis** inflammation of the aorta బృహద్ధమని యొక్క శోథము / 'నొప్పి వేడి మంట వాపు'.

**aortography** visualisation of the aorta and its main branches by injection of a dye and taking X-ray అద్దకమువంటి మందు శరీరములోనికి ఇంజక్షన్‌ద్వారా ఎక్కించి ఎక్స్‌రే ఫోటో తీయుట; ఈ ఫోటోలో బృహద్ధమని, దాని శాఖనాళములు (main branches) అగపడుతాయి.

**apathy** 1. absence of emotion మనస్సులో ఉద్వేగము లేకుండుట. 2. indifference ఉదాసీనత, నిర్లక్ష్యము. 3. insensibility నిశ్చింత, అచేతనత్వము.

**apepsia** absolute/complete lack of digestion పూర్తి అజీర్ణస్థితి.

**aperient** mild laxative to produce a silky motion మృదువిరేచక: శిల్కు బట్ట జారునట్లు మెత్తగా జారి వచ్చే విరేచనమును కలిగించే విరేచనకారి.

**aperture** opening రంధ్రము.

**apex** 1. term used to denote the top of an organ, *e.g.* apex of the lung శిఖరము, శీర్షము, అగ్రము: ఊపిరితిత్తి యొక్క ఊర్ధ్వభాగము (పైభాగము). 2. the blunt, rounded bottom of the heart గుండెయొక్క మొద్దైన అధోభాగము (క్రిందిభాగము).

**aphakia** absence of the lens behind the pupil of the eye నేత్రకటక రాహిత్యం, లెన్స్ హీనత: కంటిలోని నల్లపాప వెనుక కటకము/అద్దపుబిళ్ళ లేకుండుట.

**aphasia** loss of speech, and writing due to injury of the centres in the brain వాక్బంధనము, మాట్లాడలేకపోవుట, మరియు వ్రాయలేక పోవుట: మెదడులోని కీలకస్థానములు (centres) దెబ్బతిన్నందువలన సంభవించును.

**aphonia** inability to phonate/utter sounds, *e.g.* disease of the voice box (larynx) స్వరభంగరోగము: శబ్దము ఉచ్చారణ చేయలేకపోవుట, ఉదా. శబ్దపేటిక జబ్బు/రుగ్మత.

**aphrodisiac** a drug or drink (substance) that stimulates sexual desire కామోద్దీపకము, లైంగిక ఉత్తేజకారి.

**aphthae** small ulcers in the mouth నంజు కురుపులు, అస్యవ్రణములు: నోట్లో చిన్నపుండ్లు, వాడు.భా. నంజుబొబ్బలు/పొక్కులు.

**aphthous** *adj.* of aphtha. aphthous stomatitis నోట్లో వ్రణములు, వాడు. భా. నోటిపూత, నంజుబొబ్బలు.

**apical** pertaining to the apex of any structure, *e.g.* apex of the lung శిఖర సం., శీర్ష సం., ఉదా. ఊపిరితిత్తియొక్క అగ్రభాగం.

**aplasia** 1. lack of development or growth of organ/tissue అవికసనము: అవయవము/కణజాలము వృద్ధి పొందకుండా ఉండుట. 2. lack of production of cellular products from the above పైవాటి నుండి కణజననము లేకుండుట.

**aplastic** *adj.* of aplasia, *e.g.* aplastic anemia అవికసిత: రక్తకణ జననరాహిత్యమువలన కలుగు రక్తహీనత.

**apnoea** or **apnea** cessation of breathing ఊపిరి అపుదల.

**apomorphine** a derivative of opium, used for inducing vomiting in the treatment of ingestion of poisons నల్లమందు నుండి తయారు చేసిన మందు: ఇది వాంతులు కలుగజేస్తుంది; ఏదైనా విషపదార్థము తిన్నప్పుడు దాన్ని వాంతి ద్వారా బహిష్కరించడానికి దీనిని ఉపయోగిస్తారు.

**apoplexy** 1. haemorrhage in any organ, classical example intracranial haemorrhage రక్తఘాతము: ఏ అవయవములోనైనా రక్తము చిమ్ముట/చేరుట; సాంప్రదాయకమైన ఉదాహరణ కపాలము/పుర్రెలో రక్తము కూడుకొనుట. 2. cerebrovascular lesion/stroke, *see*/చూడండి stroke. మెదడు మరియు రక్తనాళములకు సం. క్షతము/జబ్బు.

**apothecary** druggist ఔషధములు అమ్మువర్తకుడు.

**apparatus** components/parts performing a special function, *e.g.* **vestibular a.** ఉపకరణము: అంగములు/భాగములు కలసి ఒక ప్రత్యేకపనిని నిర్వహించుట, ఉదా. కర్ణము/చెవిలోని అళిందఉపకరణము.

**appendage** 1. an offshoot/outgrowth of a structure in the body ఉపాంగము. 2. supplement అనుబంధము. 3. appendix ఎపెండిక్స్.

**appendectomy** surgical removal of the vermiform (shaped like a worm) appendix ఈ ఎపెన్‌డిక్స్ పురుగు ఆకృతి/ఆకారములో నుండును. దీనిని శస్త్రచికిత్స చేసి తీసివేయుట/తొలగించుట.

**appendicectomy** *see/చూడండి* appendectomy.

**appendicitis** inflammation of the vermiform appendix ఎపెన్‌డిక్స్ యొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**appendix** 1. accessory or dependent part attached to a main structure, wormlike projection from the caecum or diverticulum of the caecum, named vermiform appendix కణజాలముల నిర్మాణము నకు పిలకలాంటిది, అంధనాళము (caecum) కు పిలక, పురుగు ఆకృతిలో ఉంటుంది. దీనినే వెర్మిఫారమ్ ఎపెన్‌డిక్స్ అంటారు. 2. appendices epiploicae – pellets of fat along the taeniae coli అనుబంధం: పెద్దపేగు పైపొరలో ఉన్న తంతుయుత పట్టికలకు అంటుకొని ఉన్న కొవ్వుబిళ్లలు.

**appetite** 1. a primordial instinct – desire for food క్షుధ, ఆకలి: సహజజనకమైన/బీజభూతమైన జన్మతో పుట్టిన అంతర్బుద్ధి – అన్నవాంఛ, ఆహారహితవు. *N.B.* Appetite is the index of health *గమనిక:* ఆకలి ఆరోగ్య సూచకం. 2. an instinct of/for pleasure, *e.g.* sexual desire వినోదానికి ఉత్సుకము, ఉదా. లైంగికవాంఛ.

**appetizer** an agent which promotes appetite, *e.g.* a tonic ఆకలి పుట్టించేది, క్షుధావర్ధకం, ఉదా. టానిక్.

**appliance** a device/instrument సాధనము/పనిముట్టు. **orthopaedic a.** శల్యవైద్య సాధనం.

**apprehension** 1. fear of impending harm భయశంక: రాబోవు కీడుతెలిసి పొందేభయము. 2. psychological deviation from normal state సహజస్థితికి వేరుగానున్న మనస్తత్వము.

**apyetous** apyous. non suppurative, not purulent చీములేని స్థితి.

**apyous** *see/చూడండి* apyetous.

**apyretic** without fever, afebrile జ్వరములేకుండా.

**apyrexial** not having fever జ్వరము లేకుండుట.

**aqua** $H_2O$, water నీరు, జలము. *గమనిక:* నీరే ప్రాణాధారము. *అలంకార.* జలమూలమిదం జీవనమ్/శరీరమ్.

**aqualung** portable underwater breathing apparatus useful for divers, underwater activities నీటిలో మునుగువాళ్ళు, నీటిలో పని చేసేవారు ఉపయోగించే కృత్రిమ శ్వాస సాధనము.

**aqueous** watery, *e.g.* **a. humor** in the anterior chamber in the eye సజల, నీరులాంటి, ఉదా. నేత్రోదకం, కన్నులోని పూర్వాంతకక్ష్య అనగా ముందుకుహరములో నుండు నీరువంటి ద్రవము.

**Arabian Medicine or Unani tibb** అరేబియను వైద్యం లేక యునాని తిబ్.

**arachnid** class of animals, spiders, scorpions, ticks and mites జంతువర్గం: సాలీడులు, తేళ్ళు, గోమార్లు మరియు తవుటి పురుగులు.

**arachnidism** arachnoidism. systemic poisoning by the bite of a spider సాలీడు కరచుటచే శరీరంలో కలుగు విషపరిణామం.

**arachnoid** fine, thin membrane, middle of the three layers covering the brain and spinal cord లౌతికళ: మెదడు మరియు వెన్నుపాము చుట్టూ ఉన్న మూడు పొరలలో మధ్యపొర.

**arachnoidism** *see/చూడండి* arachnidism.

**arch** bow-like or curved structure ధనుస్సువలెనున్న వంపు, చాపము: ధనురాకారము లేదా వంపుతిరిగిన కట్టడము/కమాను. 1. arch of aorta బృహద్ధమనియొక్క వంపు. 2. the longitudinal and transverse arches of the foot. The tarsal and metatarsal bones are so designed as to get the shape of an arch. This will give spring action while walking, running, *etc.* పాదములోని కమానులు రెండు: నిడువులోనున్న, మరియు అడ్డముగానుండెడు కమాను. పాదములోని ఎముకలు ఈ ధనుస్సు ఆకృతిలో అమర్చబడి ఉన్నవి; నడుస్తున్నప్పుడు, పరుగెత్తుతున్నప్పుడు విల్లువలె పైకి క్రిందికి వంగుతూ, spring action కలిగి ఉంటాయి.

**arcus** a white or grey opaque ring round the cornea శుక్లపటలము చుట్టూరా ఆవరించి ఉంటుంది. 1. congenital శిశువు జన్మించినప్పుడే కనపడేది: తెల్లని/బూడిదవర్ణము గలిగిన వర్తులము/వలయము. ఇది ఉంగరమువలె కన్పడుతుంది. 2. occurring in senility due to cholesterol deposits or hyalinosis, known as arcus senilis ఇది ముసలితనములో కానవస్తుంది; ఇది వార్ధక్యములోని విశేషము. అలంకార. జుట్టు నెరిసినట్లు ఈ నల్లగుడ్డు చుట్టూరా నెరుస్తుంది.

**areola** *anat.* pigmented area around the nipple చూచుకము చుట్టూరా వర్ణకం గల ప్రాంతం. *naked eye str.* ప్రత్యక్ష.చూ.

**a. mammae,** circular ring around the nipple చూచుక పరివేష్టనము: కుచాగ్రము (చూచుకము) చుట్టూతా ఉన్న వలయాకృత చార. *micro. str.* సూక్ష్మ.చూ. meshwork in connective tissue బంధనకణజాలములో సూక్ష్మమైన ఖాళీచోట్లు.

**arginine** an essential amino acid found in plant and animal protein వృక్ష మరియు జంతువుల ప్రోటీన్లలో ఉండే ముఖ్యమైన ఎమైనో అమ్లము.

**ariboflavinosis** riboflavin i.e. vitamin $B_2$ (one component in vitamin B complex) deficiency రైబోఫ్లేవిన్ అనగా విటమిన్ $B_2$ (విటమిన్ బి కాంప్లెక్స్‌లో ఒక విటమిన్) లోపము.

**arm** 1. the portion from shoulder to elbow దండ, బాహువు, భుజము; బుజము నుండి ముడుకు (elbow) వరకుగల భాగము. 2. a component in the chromosome క్రోమోసోమ్‌లోని ఒక భాగము.

**armamentarium** physician's entire equipment including drugs (therapeutic armamentarium) వైద్యునియొక్క పూర్తి హంగు, ఔషధ పెన్నిధితో సహా.

**armpit** *syn.* axilla. the hollow beneath the shoulder చంక: బుజము అడుగున లోతుగా తగులుతున్న గుంట.

**arrector muscle** *e.g.* **a. pili** muscles, smooth muscles which raise hair shafts ఊర్ధ్వ పేశీ, ఉదా. రోమములను నిక్కపొడుచుకునేటట్లు చేసే మునుపు కండరములు, చర్మము గగుర్పాటు చెందునట్లు చేసే పేశీలు.

**arrest** stoppage, coming to a standstill, halt, cessation, *e.g.* cardiac arrest wherein the heart has gone on strike in toto అపుదల, పూర్తి విశ్రాంతి, నిలుపు, 'బందు', ఉదా. గుండె లబ్ డుప్ అని కొట్టుకోకుండా గప్‌చుప్ అవటము, గుండె పూర్తిసమ్మెచేయుట.

**arrhythmia** deviation from normal rhythm leading to/resulting in irregular heart beat తాళవిరుద్ధమైన, లయవిరుద్ధమైన గుండెనాట్యము: దీనివలన స్వాభావిక ధ్వనులు క్రమము తప్పి (సక్రమపద్ధతిలో గాకుండా) వినపడతాయి.

**arterial blood** oxygenated blood which is bright red in colour (except that in the pulmonary artery) ధమని రక్తము: ప్రాణవాయువును గుంజుకున్న రక్తము ఎర్రకుంకుమ రంగులో ఉంటుంది (పుపుసధమనిలో కాదు).

**arteriole** microscopic blood vessel సూక్ష్మదర్శినిలో చూడనగు రక్తనాళము. *micro. str.* సూక్ష్మ. చూ. smallest sized arterial vessel, 30$\mu$ in diameter ధమనిక, సూక్ష్మ (అఖరిసైజు) ధమని.

**arterioplasty** 1. plastic operation on the artery attempting reconstruction of the vessel రక్తనాళమును సృజించెడిపని, నాళము ఆకారము తెప్పించే ప్రయత్నం. 2. arterial grafting using a tubed device జబ్బుపడిన రక్తనాళభాగం తొలగించి, గొట్టపుసాధన అమర్చుట.

**arteriosclerosis** 1. arterial walls become thickened, hardened and inelastic ధమనికాఠిన్యము: రక్తనాళముల పరిధి లావెక్కి, గట్టిపడి, స్థితిస్థాపకగుణము వీడుట. 2. The arterial wall in a child is supple, soft and smooth like the covering over the stem of a tender plant, whereas the arterial wall in an elderly person gets transformed into a lining which resembles the thick hard and shrivelled bark of a tree. బాల్యములో రక్తనాళముల పరిధి లేతమొక్క మొదలుయొక్క పరిధివలె మృదువుగా, మెత్తగా మరియు నున్నగా ఉంటుంది. వృద్ధాప్యంలో ఇది దళసరిగా, గట్టిగా మరియు ముడతలుపడినట్లుగా మారుతుంది. ఇప్పుడు ఇది పెద్దవృక్షముయొక్క చెట్టుపట్ట (bark) వలె బీటలువారి ఉంటుంది.

**arteriostenosis** narrowing of an artery ధమని సన్నగిల్లుట/ ముడుచుకొనుట.

**arteritis** inflammation of an artery ధమనియొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**artery** 1. vessel carrying blood away from the heart ధమని: గుండెనుంచి అవతలకు రక్తమును తీసుకువెళ్లేనాళము 2. The blood traverses in spurts in the artery corresponding to the contractions of the heart; this, in turn, is felt as pulse when the artery is palpated. In a normal person heart contracts/beats at the rate of 70 to 75 times per minute; therefore the pulse rate is the

same. ఆరోగ్యవంతునిలో గుండె ముడుచుకొను/కొట్టుకొనుటకు అనుగుణముగా రక్తము ధమనిలోనికి నిముషమునకు 70 నుండి 75 సార్లు చిమ్మబడుతుంది (traverses in spurts); ధమనిపైన వేళ్ళుపెడితే తగిలే ఈ అభిఘాతము (impact)ను నాడి (pulse) అంటారు. All arteries except pulmonary artery carry pure (oxygenated) blood. పుపుసధమనిలో తప్ప అన్ని ధమనులలో శుద్ధ (అక్సిజన్ సహిత) రక్తం పారుతూ ఉంటుంది.

**arthralgia** discomfort, uneasiness, pain on moving a joint కీళ్ళనొప్పులు: కీలు ఆడించినప్పుడు అసౌఖ్యము, ఇబ్బంది, నొప్పికలుగుట.

**arthritis** inflammation of a joint కీళ్ళవాతము: కీలులో శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**arthrodesis** surgery to make a joint stiff కీలు కదలిక నివారించు శస్త్రచికిత్సోపాయము.

**arthropathy** any joint disease ఏదైనా కీలుయొక్క కాయిలా.

**arthroplasty** 1. plastic repair of a joint కీలు మరమ్మతు చేయుట. 2. replacement of a mechanical device in the joint, *e.g.* to install a metallic hinge-like device inside the knee joint as a remedy in osteoarthritis మోకాలు ఒక మడతబందు కీలు (hinge joint). లోహముతో చేసిన మడతబందు (hinge) ను మోకాలు లోపల (inside) అమర్చుతారు. ఆస్టియోఆర్త్రైటిస్‌కు ఇది ఒక చికిత్స.

**arthroscopy** visualising the interior of a joint by arthroscope, an instrument, especially popular in the examination of the knee joint కీలులోపల పరీక్షకు పనిముట్టు, ముఖ్యముగా వినుతికెక్కినది మోకాలు కీలు పరీక్షలో.

**articular** relating to a joint కీలుకు సం.

**articulate** 1. to speak మాట్లాడుట. 2. to divide or unite so as to form a joint ఒక భాగమును ఛేదించిగాని, కలిపిగాని కీలుగా రూపొందించుట. 3. to adjust the teeth in artificial denture కృత్రిమ పండ్లవరుసలో పండ్లు సరిదిద్దుట.

**articulation** 1. The act of speaking మాట్లాడుట. 2. the state of being jointed together కలిసి ఉన్నస్థితి. 3. a joint కీలు.

**artifact** artefact, man-made over-sight. artificial product not naturally present but introduced by an external source. మిథ్యా నిర్మాణము, మనిషి పరాకున చేసిన పొరపాటు. **a. in X-ray film** ఎక్స్‌రే పటములో ఈ పొరపాటు.

**artificial** not natural కృత్రిమమైన. **a. denture** కృత్రిమ పండ్లవరుస.

**artificial respiration** mouth to mouth method: The helper puts his mouth over the mouth of the patient and blows air at the rate of 16 to 20 times per minute (normal respiratory rate). కల్పితశ్వాస, కృత్రిమ శ్వాసక్రియ: ఊపిరినెలకొల్పు కల్పిత/కృత్రిమ పద్ధతి. నోటిమీద నోరుపెట్టు పద్ధతి: సహాయకారుడు తన నోటిని రోగినోరుమీదపెట్టి నిముషమునకు 16 నుండి 20 సార్లు గాలిని బలంతో నింపుతుంటాడు/ పూరిస్తుంటాడు. ఆరోగ్యవంతునిలో ఊపిరి/శ్వాస వేగము నిముషమునకు 16 నుండి 20 సార్లు.

**asafoetida** *bot.* Indian Name: Hing. resinous gum of a herbal tree, constituent in cookery, has a pungent smell ఇంగువ: పాకములలో రుచి. helps digestion జీర్ణకారి.

**asbestos** fibrous material used in thermal insulation రాతినార.

**asbestosis** a lung disease occurring in those who inhale asbestos fibres, an occupational hazard; workers in asbestos factories prone to this disease ఆస్‌బెస్టాస్ పీచు/నార పీల్చేవాళ్ళలో సంభవించు ఊపిరితిత్తుల రుగ్మత/జబ్బు – ఇది వృత్తిలో సంభవించు విపత్తు. ఆస్‌బెస్టాస్ ఫ్యాక్టరీలలో పనిచేయువారు ఈ జబ్బుకు గురి అవుతారు.

**ascariasis** invasion of the intestines by round worms, *e.g. Ascaris lumbricoides*. It is an intestinal parasite. ప్రేగులలోనుండు ఎలికపాములు, నట్టల వలన జబ్బు. ఇది మనిషి ప్రేగులలో పరాన్నజీవి.

**ascending colon** ascending part of the large intestine పెద్దప్రేగు లోని ఆరోహణ భాగము. [*Cf.* descending colon అవరోహణ భాగం].

**ascites** dropsy, accumulation of fluid in the abdomen in the peritoneal cavity ద్రవోదరము, జలోదరము: పొట్టలోని అంత్రవేష్టన కుహరములో ద్రవము చేరుట.

**ascorbic acid** vitamin C, present in sour fruits. *e.g.* lemon విటమిన్ సి: ఇది పులుపు పండ్లలో ఉంటుంది, ఉదా. నిమ్మపండు.

**asepsis** absence of putrefaction which is an aftermath of infection సూక్ష్మజీవి/క్రిమి సంపర్కమువలన కలిగిన కుళ్ళు లేకుండుట, పూతి రాహిత్యం [*opp.* sepsis వ్యతి. పూతిదోషము].

**aseptic** devoid of sepsis అపూతిక. **a. technique** అపూతిక పద్ధతి.

**asexual** without sexual contact/connection అలైంగిక: స్త్రీపురుష సంపర్కము లేకుండా. **a. reproduction** అలైంగిక ప్రత్యుత్పత్తి.

**asparagine** an amino acid ఒక ఎమైనో అమ్లము.

**aspergillosis** disease caused by *Aspergillus,* a fungus ఏస్పర్జిల్లస్ అను ఫంగస్ వలన పుట్టే జబ్బు.

**Aspergillus** a genus of fungi (moulds/molds) ఒక ప్రజాతి ఫంగస్.

**aspermatism** *see/చూడండి* aspermia.

**aspermia** 1. absence of sperms in semen శుక్రములో శుక్రకణములు లేకుండుట, వీర్యకణరాహిత్యం. 2. lack of expulsion of semen వీర్యం రాకుండుట.

**asphyxia** choking of the breath which occurs in drowning, noxious gas inhalation, hanging, bulbar poliomyelitis, severe or forceful compression to the thorax శ్వాసావరోధము: నీటిలో మునిగిపో తున్నప్పుడు, విషవాయువు పీల్చినప్పుడు, ఉరితీస్తున్నప్పుడు, మెదడు పోలియోలో, ఛాతీమీద తీవ్రమైన తీక్షణమైన నొక్కుడు కలిగినప్పుడు ఉక్కిరిబిక్కిరై ఊపిరిఆడకుండుట, శ్వాస ఆగిపోవుట.

**aspiration** 1. act of inadvertent inhalation of foreign material or entry of a foreign body into the respiratory passages, *e.g.* aspiration of vomit గమనములేకుండా పరాయి పదార్థము ఊపిరితిత్తుల లోనికి పీల్చడం లేదా అది శ్వాసనాళికలలో అడ్డుపడటం, ఉదా. వాంతి చేసుకున్నప్పుడు ఆ పుల్లని అమ్లం ఊపిరితిత్తులలోనికి పీల్చబడటం. 2. manual removal of fluid or gas from a body cavity, *e.g.* aspiration of pleural effusion ఉదా. ఊపిరితిత్తి మీద పొరలో చేరిన ద్రవము లేదా వాయువును బయటకు లాగడం.

**aspirator** a device for aspirating/withdrawing fluid, gas or debris from a body cavity శరీర కుహరమునుండి ద్రవము, వాయువు లేదా కుళ్ళును గుంజివేసే పనిముట్టు.

**aspirin** 1. acetylsalicylic acid commonly used to relieve scalp/head ache నెత్తి/తలనొప్పి తగ్గించేమందు. 2. used as prophylaxis in some heart diseases కొన్ని గుండె జబ్బులలో రోగనిరోధకత కొరకు ఉపయోగిస్తారు.

**assay** 1. measuring the proportion of a substance in a mixed combination నిర్ధారణ మాపనము: మిశ్రమ సరుకులలో ఒకదాని దామాషా ఎంత అని ఎంచుట. 2. to establish the potency of a drug మందులోని శక్త్యత/బలిమి నిర్ణయించుట.

**assessment** estimate of something అంచనా.

**assimilation** 1. intake of nutrients into the system during and after digestion స్వాంగీకరణము, ఒంటబట్టటం: జీర్ణక్రియ సమయములోనూ, ఆ తర్వాత సారవంతమైన పోషకపదార్థములను కణజాలములలోనికి గుంజుకొనుట. 2. incorporation of new experiences in life in the psychological set-up of an individual నూతన అనుభవములను మనస్తత్వమునకు అనుగుణముగా తనలో ఇముడ్చుకొనుట.

**associated** concomitant అనుసరించుకొని యుండెడు. **a. diseases,** co-morbid conditions, తోడు వ్యాధులు. *e.g.* ఉదా. 1. diabetes mellitus and pulmonary tuberculosis మధుమేహం మరియు టి.బి. వ్యాధి. 2. TB and HIV టి.బి. మరియు హెచ్.ఐ.వి.

**asthenia** [asthenic *adj.*] lack of strength నిస్త్రాణ, దుర్బలత: బలములేకుండుట. weakness నీరసము.

**asthenopia** subjective sensation of weakness of the eye after using the same కన్ను ఉపయోగించిన తర్వాత నేత్ర దుర్బలత. also *see/చూడండి* eyestrain.

**asthma** [Greek word meaning panting or short-drawn breath]. usually refers to bronchial asthma. hyper-reactivity of bronchi associated with dyspnea (breathlessness) and wheezing due to bronchospasm. An asthmatic virtually fights for breath. He struggles like a fish out of water, *see/చూడండి* rhonchi, wheeze.

రొండు, ఉబ్బసము: శ్వాసనాళికల యొక్క అధిక ప్రతిఘాతమువలన అయాసము, ఛాతీలో పిల్లికూతలు (wheeze): ఇవి శ్వాసనాళికలు ముడుచుకుపోయి సన్నగిల్లినందువలన సంభవించును. ఈ ఉబ్బసమురోగి వాస్తవానికి ఊపిరికొరకు ఊరిరితిత్తులతో సమరం సాగిస్తుంటాడు/యుద్ధం చేస్తుంటాడు. నీటిలో ఉండవలసిన చేప బయటపడితే ఎట్లా గిలగిలా తన్నుకుంటుందో అట్లా బాధపడుతాడు.

**asthmatic** 1. relating to asthma ఉబ్బసమునకు సం. 2. suffering from asthma ఉబ్బసంతో బాధపడుతున్న. 3. one who suffers from asthma ఉబ్బసం రోగి/వ్యాధిగ్రస్తుడు/వ్యాధిగ్రస్తురాలు.

**astigmatism** defect in eyesight caused by uneven curvature of the refractive surfaces దృష్టివైషమ్యము: కిరణములను వక్రముగా త్రిప్పెడు భాగముల ఎగుడుదిగుడు వంపువలన కలుగు దృష్టిదోషము.

**astringent** 1. bitter substance ఒగరైన పదార్థము, కషాయము. 2. drug which causes contraction of surfaces and stops discharges after topical/local application, *e.g.* local application of ointment/oil/dye over the rectal surface to stop discharges ఉపరిభాగములను ముడుచుకొనేటట్లుచేసి, విసర్జింపబడే 'పదార్థములను (discharges) నిలిపివేసే గుణముగల మందు, ఉదా. మలముతోపడు చీము మొదలగు వానిని అరికట్టే మందు; దీనిని మలాశయం ఉపరిభాగము (rectal surface) మీద మలాము/తైలము/అద్దకము వంటి రూపములో పూస్తారు.

**asynergy** lack of co-ordination in parts or organs శరీర భాగములలో, అవయవములలో సమానాధికారము/సమానావశ్యకత లేకుండుట.

**asystole** absence of heart contractions గుండె కొట్టుకోవటం ఆగిపోవుట. cardiac standstill/arrest గుండె బందు.

**atavism** [Latin *atavus* = remote grandfather]. appearance of characteristics inherited from a remote ancestor బహుదూరపు పూర్వీకుల వంశానుగత లక్షణములు కనబడుట.

**ataxia** lack of muscular co-ordination due to disease of the nervous system అస్థిరత: చలనములో తూలుడు, నాడుల జబ్బువలన కండరములలో సమానాధికారము/సమానావశ్యకత లేకుండుట.

**atelectasis** 1. incomplete expansion of the lungs after birth: During normal course of events, the baby expands the lungs for the first time with the first bout of cry. ముడుచుకొనిపోవటము: ప్రసవము సమయములో శిశువు భూమిమీద పడగానే ప్రప్రథమ రోదనతో తన ఊపిరితిత్తులను ఉబ్బించుకుంటుంది. ఇట్లా కానిపక్షమున ఇది జబ్బు. 2. collapse of lung in later life తరువాత జీవితంలో ఊపిరితిత్తి ముడుచుకొనిపోవుట. 3. eardrum (tympanic membrane) atelectasis as a complication of otitis media చెవిలోనున్న కర్ణభేరి (టింపానిక్ పొర) ఈ జబ్బుకు గురియగుట.

**atheroma** a plaque of degenerated arterial wall in atherosclerosis ధమని క్షీణదశలో బీటలువారిన పరిధిలో ఒకముక్క.

**atherosclerosis** a form of arteriosclerosis, *see/చూడండి* arteriosclerosis. రక్తనాళ కుడ్యములు గట్టిపడటం.

**athetosis** repetitive, involuntary, writhing movements especially in the hands పలుమార్లు/మరల మరల, అనిచ్ఛాపూర్వకమైన/మనకు తెలియకుండ మెలిపెట్టు (twist) చలనములు, ముఖ్యముగా చేతుల్లో.

**athlete's foot** fungus infection of the foot giving rise to itching and blister formation ఒక ఫంగస్ వలన సంక్రమింపబడు వ్యాధి; ఇది పాదంమీద దురద మరియు పొక్కులను కలుగజేయును.

**atlas** the first bone on the top in the vertebral column/spine. The vertebrae are arranged in a row, like beads in a garland. శీర్షధరము: వెన్నుపూస పైభాగములో ప్రథమ పూస (ఎముక). వెన్నులో ఈ ఎముకలు (vertebrae) ఒక వరుసలో దండలోని పూసలవలె అమర్చబడి ఉంటాయి.

**atmosphere** 1. the gaseous envelope around the universe/ earth విశ్వము/భూమి చుట్టూరా ఉన్న వాయువుల కప్పు (envelope). 2. climate వాతావరణము. atmospheric pollution వాతావరణ కాలుష్యము.

**atocia** 1. sterility in the female స్త్రీలో వంధ్యత్వం. 2. nullipara గొడ్రాలు, అగర్భ, పిల్లలను కననిస్త్రీ, సంతానహీనురాలు.

**atom** smallest portion of an element that can exist chemically పరమాణువు: ఒకమూలములోని సూక్ష్మభాగము [*Cf.* molecule *తారత.* అణువు].

**atony** absence of normal tone of the muscles కండరములకు ఉండవలసిన పట్టు/బిగువు లేకుండుట.

**atopy** a form of allergy, a genetic predisposition towards the development of immediate hypersensitivity వారసత్వపు ప్రోద్బలంతో కొందరిలో కలుగు సత్వర అతిసంవేదనశీలత – వైషమ్యము.

**ATP** *abbr.* adenosine triphosphate, a nucleotide required for RNA synthesis and used to store energy. శరీరములోని జీవకణములలో జరుగు జీవ(న)క్రియకు అవసరమైన పదార్థము, జీవనచర్యలకు శక్తినిచ్చే యౌగికము.

**atresia** congenital non-development or closure of a normal body opening/tube, *e.g.* anal atresia or imperforate anus అవివర్తత: వికసించని రంధ్రము, శరీర రంధ్రము/వాహిక యొక్క మూసివేత; ఇది పుట్టుకలోనే కనిపెట్టవచ్చును, ఉదా. ఆసనము/గుదము యొక్క రంధ్రము లేకుండుట.

**atria** [atrium *sing.*] the two upper chambers in the heart ఏట్రియమ్‌లు, గుండెలోని పై రెండు కుహరములు.

**atrial septal defect** *colloq.* hole in the heart. hole in the partition between the two atria రెండు ఏట్రియమ్‌ల మధ్యనున్న తెరలో రంధ్రము. congenital in origin జన్మజాత.

**atrial septum** the partition between the two atria రెండు ఏట్రియమ్‌ల మధ్య తెర/విభాజకం.

**atrophy** 1. diminution in the size of an organ or tissue క్షీణత, క్షయము: అవయవము లేదా కణజాలము యొక్క పరిమాణము తగ్గుట; పోషణలేక కృశించుట. 2. due to degeneration క్షీణించుట.

**atropine** anticholinergic alkaloid వృక్షములనుండి తీయబడిన పదార్థము. actions: ప్రయోజనములు: 1. relaxes smooth muscle నాళముల, గొట్టముల పరిధిలోనున్న నున్నని/సాదా కండరములను వదులుచేయుట లేదా బిగువు తగ్గించుట (relax). 2. increases heart rate గుండె

వేగము పెంచుట. 3. decreases secretions స్రావములను తగ్గించుట. 4. dilates the pupil కంటిపాప రంధ్రము పెద్దది చేయుట.

**attack** 1. onset of illness, *e.g.* colloquially styled 'heart attack' ఘాతము, జబ్బు ప్రారంభము, ఉదా. వాడు. భా. 'హార్ట్ ఎటాక్'. 2. syncope in Adams-Stokes attack – fainting due to a disease of the heart called 'heart block' 'హార్ట్ బ్లాక్' అనే గుండె జబ్బులో మూర్ఛిల్లుట. అలంకార. గుప్పెడంత గుండె గొల్లుమంటుంది.

**attenuation** the process by which pathogenic microorganisms are made less virulent లఘుతీవ్రత/ఉగ్రత: వ్యాధిని కలిగించే సూక్ష్మజీవుల తీవ్రత/ఉగ్రతను తగ్గించే ప్రక్రియ.

**attrition** 1. wearing away by friction, *e.g.* of a tissue సంనిఘర్షణము, అరిగిపోవుట, ఉదా. కణజాలముయొక్క రాపిడి. 2. gradual weakening, *e.g.* of a tissue in senility క్రమేణ బలహీనమగుట, ఉదా. వృద్ధాప్యంలో కణజాలముయొక్క పటుత్వము తగ్గుట.

**audiogram** record of the acuity of hearing శ్రవణశక్తిలేఖనము: శ్రవణ తీక్షణతను నమోదు చేయు రికార్డు.

**audiology** science of hearing శ్రవణేంద్రియ శాస్త్రము.

**audiometer** apparatus for testing of hearing శ్రవణాన్ని పరీక్షచేసే ఉపకరణం.

**audiophone** hearing aid వినుటకు సహాయపడు సాధనము.

**auditory** pertaining to hearing వినుటకు సం. **a. canal** శ్రవణ కుల్య. **a. meatus,** external auditory meatus బాహ్య కర్ణకుహరము. **a. nerve,** nerve of hearing శ్రవణనాడి. **a. pinna** కర్ణపల్లవము.

**aura** subjective sensations felt before the onset of an epileptic fit, *e.g.* an unpleasant smell or taste, revival of a visual scene, dreamy state, *etc.* పూర్వ అనుభూతి: మూర్ఛకు ముందు అనుభవించే స్వానుభవ ఇంద్రియ అనుభూతులు, ఉదా. హితవుకాని/అసహ్యమైన వాసన లేదా రుచి, పూర్వము తను చూచిన దృశ్యము, కలగన్న స్థితి, మొ.

**aural** 1. pertaining to the ear చెవికి సం. 2. pertaining to an aura (see above) మూర్ఛకు ముందు ఇంద్రియ అనుభూతులు (పైన చూడండి) మరియు వీటికి సం. సమాచారము.

**auricle** 1. projecting part of the ear మనకు కనపడు చెవి. 2. the ear-shaped appendage of either atrium of the heart కర్ణిక: గుండెలో పైకుహరము(atrium)నకు చెవి అకారములోనున్న ఉపాంగము.

**auscultation** listening for sounds produced in the organs in the body with a view to judge their condition అవయవశబ్ద శ్రవణము: శరీర అవయవములలో వినిపించు ధ్వనులు విని, వాటి పరిస్థితిని నిర్ణయించే మార్గము. 1. heart sounds గుండెలో ధ్వనులు. 2. lung sounds ఊపిరితిత్తులలో ధ్వనులు. 3. intestinal sounds in abdomen పొట్టలో ప్రేగులు చేసే ధ్వనులు. 4. foetal heart sounds గర్భములోనున్న శిశువుయొక్క గుండె ధ్వనులు. This is accomplished with the aid of the stethoscope. ఈ ప్రక్రియ స్టెతొస్కోప్ సహాయముతో నిర్వహిస్తారు.

**autoblast** 1. an independent cell స్వతంత్ర కణం. 2. protozoon, unicelluar microorganism ఏకకణ సూక్ష్మజీవి.

**autoclave** an instrument for the sterilization of materials exposing them to steam under pressure ఈ ఉపకరణములో వస్తువులను ఒత్తిడిగల ఆవిరికి తాకనిచ్చి, తద్వారా సూక్ష్మజీవి రాహిత్యము (sterilisation) సాధించుట.

**autoerotism** also autoeroticism. stimulation of sexual instinct by self. One variety is masturbation, *see/చూడండి* masturbation. తనలోతాను లైంగికవాంఛను ప్రేరేపించుకొనుట: హస్తప్రయోగం ఒకమార్గం.

**autogenics** a system of relaxation (say, yoga) used as therapy in psychosomatic disorders విశ్రాంతి వ్యవస్థ (ఉదా. యోగాభ్యాసం), మనోవికృతివలన కలిగే శారీరక జాడ్యములలో ఒక చికిత్సా విధానము.

**autoimmune** reaction against body's own tissues, *figur.* self against self. తన స్వంతకణజాలముల మీద ప్రతిఘాతము. **a. disease,** a disorder wherein the patient's own cells are attacked by autoantibodies, *e.g.* rheumatoid arthritis తన ప్రతిరక్షకాలే తన కణములకు శత్రువులై, కణనాశము కలుగజేయు రుగ్మత, ఉదా.

రుమటాయిడ్ కీళ్ళవాతం. అలంకార. 'ఎవరి కంపు వారికింపు' – ఈ నైజం ధిక్కరింపబడితే పాట్లు తప్పవు, మరి.

**autointoxication** self-poisoning by metabolic products from infected or dead tissues క్రిమి సంపర్కం కలిగిన లేదా మృత కణజాలములనుండి తయారైన జీవ(న)క్రియ పదార్థములచే తనకు విషప్రయోగం.

**autolysis** adoption of intermittent fasting to give rest to the digestive system and to keep fit, thereby giving the body an opportunity to use internal resources by catabolism and avoid obesity ఆత్మవిశ్లేషణము, స్వయంవిచ్ఛిన్నము, స్వయంక్షీణత: మధ్య మధ్య నిరాహార దీక్షపూనినట్లయితే జీర్ణశక్తి వ్యవస్థకు విరామము లభిస్తుంది; ఆరోగ్యానికి దోహదము చేస్తుంది, ఎందుచేతనంటే – ఈ దీక్ష సమయములో శరీరములో నిల్వ ఉన్న క్రొవ్వు వంటి పదార్థముల విచ్ఛిన్నమునకు అవకాశము కలుగుతుంది. దీనివలన క్రొవ్వు పెరుగదు. అలంకార. జిహ్వాచాపల్యరాహిత్యం ఆరోగ్యానికి సోపానం.

**autonomic** independent, self-governed స్వతంత్ర, స్వపరిపాలన దక్షత కలిగిన, స్వయంచోదిత.

**autonomic nervous system** that which supplies internal organs: It is divided into two divisions, sympathetic and para sympathetic nervous system, *see/చూడండి* nervous system. స్వయంచోదిత వ్యవస్థ, అంతర అవయవములకు మార్గదర్శి. దీనిలో రెండు విభాగములు, సింపథెటిక్, పారసింపథెటిక్ నాడీమండలములు.

**autoplasty** the use of the patient's own tissue/organ in grafting/transplantation, *see/చూడండి* graft. ఒకరి శరీరంలో తన కణజాలము/అవయవమును అంటుగట్టి సరిచేయు పద్ధతి.

**autopsy** postmortem examination of a body after death to determine the cause of death శవపరీక్ష: మరణమునకు కారణము తెలుసుకొనుటకై చావు తర్వాత పరీక్ష [*in contr.* biopsy భిన్న. జీవకణపరీక్ష].

**autosome** any chromosome other than a sex chromosome అలైంగిక క్రోమోజోమ్. Humans have 22 pairs of autosomes

నరజాతి వారిలో 22 జతలుంటాయి. These transmit all genetic traits other than sex-linked లైంగిక లంకె లేకుండా ఉండే అన్ని జన్యువు లక్షణాలను వంశానుగతంగా ప్రసరింపజేస్తాయి.

**autosuggestion** homo-suggestion, *i.e.* suggestion arising in one's own self స్వయంసూచన: తనలోనే తనకు ఆవిర్భవించిన సూచన.

**autotrophism** *biol.* process of manufacture of complex organic compounds from simple inorganic molecules present in the environment – photosynthesis, as occurs in green plants and some bacteria స్వయంపోషణ: వాతావరణంలోని కార్బన్ డైఆక్సైడ్‌ను, నీటిని కలిపి శక్తివంతమైన సంక్లిష్ట కర్బన పదార్థములను తయారుచేయు ప్రక్రియ – ఇదే కిరణజన్య సంయోగక్రియ – ఈ క్రియ ఆకుపచ్చ మొక్కలలోను మరియు కొన్ని బాక్టీరియాలోనూ ఉన్నది. [*Cf.* heterotrophism *తారత.* పరపోషితత్వము].

**auxiliary** helping or supporting సాయముచేయు లేదా ప్రాపు. **a.nurse** or **nursing a.**, a helper సాయముచేయు నర్సు.

**avascular** devoid of blood vessels రక్తనాళములు లేని.

**aversion** a strong dislike, hatred, unpleasantness, *e.g.* aversion to food in disease states తీరని అయిష్టము, విముఖత, అసంతోషకరము, ఉదా. వ్యాధిగ్రస్తులలో ఆహారంమీద విముఖత.

**avitaminosis** a state of deficiency of one vitamin or more vitamins ఒక విటమిన్‌గాని లేదా కొన్ని విటమిన్లయొక్క లోపము.

**avulsion** tearing away of a part, dismemberment ఒక భాగమును పీకివేయుట, శరీరమునుండి తొలగించుట.

**awareness** knowledge about something ఎఱుక, ఎఱిగినస్థితి **AIDS a.** ఎయిడ్స్ గురించి ఎఱుక. **disease a.** వ్యాధుల గురించి తెలుసుకొనుట. **health a.**, being health conscious ఆరోగ్యాన్ని కాపాడుకొంటూ ఉండటం. **medical a.** వైద్యానికి సం. విషయములు తెలుసుకొనుట. **risk a.** అపాయస్థితి సూచన.

**axilla** armpit, hollow beneath the shoulder చంక, బుజము క్రింద/దిగువున ఉన్నలోయ.

**axis** 1. the second cervical vertebra రెండవ గ్రీవాకశేరుక. 2. an imaginary line passing through the median line/midline of the body శరీరమధ్యంలో నిలువుపాటి ఊహారేఖ.

**axon** process of a neuron (nerve cell) అక్షతంతువు, తంత్రికాక్షము.

**ayurveda** Indian system of medicine, native to the soil; Charaka and Susruta were pioneers in the field. ఆయుర్వేదము: దేశీయ వైద్యము; చరక, శుశ్రూత మొ. వారు త్రోవ చూపించినవారు.

**azoospermia** semen devoid of spermatozoa శుక్రకణములు లేని శుక్రము.

**azotaemia** or **azotemia** uraemia. *see*/చూడండి uraemia.

**azoturia** increased excretion/elimination of urea in the urine మూత్రంలో యూరియా అధికంగా విసర్జింపబడుట.

**azygos** 1. azygous: not one of a pair జతలో ఒకటికానిది. 2. unpaired part, జతకాని భాగము, *e.g.* **a. lobe,** ఉదా. అజైగాస్ లంబిక. **a. vein** అజైగాస్ సిర అనగా అయుగ్మసిర.

# B b

**baby** an infant not able to walk yet బిడ్డ, శిశువు: ఇంకా అడుగులు వేయటం చేతకాని పసికందు/శిశువు. **blue b.**, baby born with congenital heart lesion or atelectasis of lung నీలవర్ణపు శిశువు: పుట్టుకతో వచ్చిన గుండెజబ్బు లేదా ఊపిరితిత్తి ముడుచుకున్న స్థితిగల శిశువు.

**bacillary** related to bacilli బాసిల్లైకు సం.

**bacilli** [bacillus *sing.*] bacteria that cause disease సూక్ష్మజీవులు.

**bacillaemia** or **bacillemia** presence of bacilli in blood రక్తములో బాసిల్లై ఉండుట.

**bacilluria** presence of bacilli in urine మూత్రంలో బాసిల్లై ఉండుట.

**bacillus** 1. an organism of the genus *Bacillus* బాసిల్లస్ ప్రజాతికి చెందిన సూక్ష్మజీవి. 2. any rod shaped bacterium దండాణువు: కర్ర ఆకారములో ఉండే బాక్టీరియమ్.

**back** posterior part of the body from the neck to the pelvic girdle వీపు: శరీరములో మెడనుంచి శ్రోణిమేఖల వరకుగల వెనుకభాగము.

**backache** pain in the back వీపునొప్పి, పృష్ఠభాగంలో బాధ.

**bacteraemia** or **bacteremia** presence of bacteria in blood జీవాణుక్రిమి రక్తత: రక్తములో బాక్టీరియా ఉండుట.

**bacteria** [bacterium *sing.*] one group of microorganisms జీవాణువులు, జీవాణుక్రిములు. **different forms of bacteria** (a) round or coccus, *e.g. Staphylococcus* (b) rod-like or bacillus, *e.g. Mycobacterium tuberculosis* (c) spiral or spirillum, *e.g. Treponema pallidum* సూక్ష్మదర్శినిలో కనపడు సూక్ష్మజీవులు; సూక్ష్మజీవులలో ఒక తెగకు చెందినవి – పైన పేర్కొనబడినవి.

**bacterial endocarditis** inflammation of the inner layer of the heart caused by bacteria గుండెలోపలి అంతర హృదయస్తరమునకు బాక్టీరియావలన సంభవించు శోథము/వాపు.

**bactericidal drug** a medicine that kills bacteria జీవాణుక్రిమి సంహారకౌషధం, బాక్టీరియానాశి: బాక్టీరియాను చంపుమందు.

**bacteriology** science dealing with the study of bacteria సూక్ష్మజీవి/ జీవాణుక్రిమి శాస్త్రము, జీవాణువిజ్ఞానము.

**bacteriophage** bacteria eater; a virus that lyses bacteria బాక్టీరియా భోజి/భక్షి; బాక్టీరియాను రూపుమాపే వైరస్ see/చూడండి choleraphage.

**bacteriostatic drug** an agent that inhibits the growth of bacteria బాక్టీరియా పెరుగుదలను అటంకపరచు మందు.

**bacteriuria** the presence of bacteria in urine మూత్రములో బాక్టీరియా ఉండుట.

**bagassosis** lung disease caused by inhalation of fibres of sugarcane residue (bagasse) after extraction of sugar చక్కెర తీసిన తర్వాత చెరకుపిప్పి (bagasse) యొక్క పీచులు గాలిలో ఎగిరినప్పుడు వాటిని పీల్చినందువలన సంక్రమించు ఊపిరితిత్తుల జబ్బు.

**BAL** 1. *abbr.* British anti-lewisite, a chemical; antidote in metal poisoning శరీరములో చేరిన లోహముల విష పరిణామమును విరుగుడుచేసే విషపరిహారకౌషధము. 2. *abbr.* broncho alveolar lavage, *i.e.* introducing a fluid into the bronchi and alveoli, and drawing it back – examination of this fluid helps in the diagnosis of the disease శ్వాసనాళిక, వాయుకోశాలలోనికి ద్రవము ఎక్కించి దానిని మరల వెనుకకు గుంజుట – ఈ ద్రవముయొక్క పరీక్ష వ్యాధినిర్ణయంలో తోడ్పడుతుంది.

**balanced diet** food with adequate nutrition సమతుల్య ఆహారము.

**balanitis** 1. inflammation of glans penis శిశ్నాగ్ర శోథం, పురుషాంగ శిఖరము (మేఢ్రమణి) యొక్క నొప్పి వేడి మంటతో గూడిన వాపు. 2. inflammation of glans clitoridis భగ శిశ్నాగ్రశోథం.

**balanoblennorrhoea** or **balanoblennorrhea** gonorrhoeal inflammation of the glans penis శిశ్నాగ్రంయొక్క గనేరియా ఇన్‌ఫ్లమేషన్.

**balanorrhoea** or **balanorrhea** purulent balanitis చీముతోకూడిన శిశ్నాగ్రశోథం.

**baldness** alopecia, lack of hair over scalp బట్టతల. *resemblance:* a worn-out tyre *పోలిక:* అరిగిపోయిన టైర్.

**ball and socket joint** *e.g.* hip joint బంతిగిన్నెకీలు, ఉదా. తుంటికీలు.

**ballottement** rebound of a floating object after release of pressure, *e.g.* manoeuvre for detecting pregnancy, ఉదా. ఇది గర్భ నిర్ధారణకు ఒక పరీక్ష: ఒత్తిడి చేసి నిలిపివేయగానే గర్భసంచిలో తేలుతున్న పిండము మరల పైకెగురుట.

**balm** a soothing ointment ఉపశమనము చేయు మలాము.

**balneology** science dealing with baths by mineral waters ఖనిజ లవణజల స్నానం గురించి తెలియజేసే శాస్త్రం.

**bandage** to cover with gauze or any material and wrap over a part of the body, *e.g.* crepe bandage బ్యాండేజి కట్టు: సన్నటి రంధ్రములుగల నేతఉన్నబట్ట (gauze) తోగాని లేదా దొడ్డు బట్టతోగాని శరీరభాగమును చుట్టుట.

**Banti's syndrome** enlargement of spleen, effusion and accumulation of serous fluid in the abdominal cavity ప్లీహము పెరుగుట (కడుపులో బల్ల) మరియు జలోదరము/ద్రవోదరము.

**barber's itch** sycosis barbae, inflammation of hair follicles over the beard, *see/చూడండి* sycosis. క్షురకర్మతీట, గడ్డముమీది వెంట్రుక కుదుళ్ల శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**barbiturate** used as a tranquilizer and for sedation ప్రశాంతత కొరకు మరియు నిద్రకు తీసుకొనే మందు. poisoning occurs when used in excess ఎక్కువ పరిమాణంలో వేసుకుంటే విషము అవుతుంది. *గమనిక:* మోతాదులో తీసుకుంటే మందు, మోతాదు మీరి మిక్కిలి అయితే మారణం.

**barium sulphate** or **sulfate** $BaSo_4$, a radio-opaque medium used in X-ray examination of the digestive system, *e.g.* barium meal, barium enema అపారదర్శక పదార్థం, పొట్టకు ఎక్స్‌రే పరీక్షకు వాడుతారు, ఉదా. బేరియం నీళ్లల్లో కలిపి నోటితో త్రాగించి ఫోటో తీయుట, మరియు ఇది ఎనిమాద్వారా ఆసనములోకి ఎక్కించి ఫోటో తీయుట.

**barrel chest** barrel shaped chest which occurs in one disease of the lungs called emphysema wherein there is hyperinflation of the lungs పీపా ఆకారములో ఉన్న ఛాతి: అధికవాయువుతో నింపబడిన/ఉబ్బిన ఊపిరితిత్తుల వ్యాధిలో ఇది కానవస్తుంది.

**barren** said of a nullipara గొడ్రాలు, సంతానహీనవతి, సంతాన హీనురాలు, వంధ్యయైన స్త్రీ.

**Bartholinitis** or **bartholinitis** inflammation of vulvovaginal (Bartholin's) gland ఈ భగ-యోని గ్రంథి యొక్క 'నొప్పి మంట వేడి వాపు'.

**Bartholin's glands** two small mucus-secreting glands in the vestibule of vagina భగ-యోని ఇరుప్రక్కలా ఉండే రెండు శ్లేష్మగ్రంథులు.

**basal ganglia** groups of nerve cells located in the brain మెదడులోని నాడిముడులు (ganglia).

**basal metabolism** measurement of energy production in the body under basal/resting condition విశ్రాంతిదశలో శక్తి ఉత్పన్నతను కొలిచే మాపనము.

**Basedow's disease** Graves' disease. *see/చూడండి* hyperthyroidism. థైరాయిడ్ తేజము.

**basilar** relating to a base మూలమునకు సం. **b. membrane,** in the organ of Corti situated inside the cochlear duct in the inner ear, the movement of which is essential for hearing లోపలి చెవిలో కర్ణావర్తములోనున్న కార్టై అర్గన్‌లోని పొర. శ్రవణంలో దీని చలనము ముఖ్యము. **b. meningitis,** inflammation of the meninges at the base of the brain మెదడు పైన ఉన్న పొరకువచ్చిన శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**basophil** a granulocytic white blood cell కణికామయ తెల్లరక్తకణం.

**battered baby syndrome** and **battered child syndrome** violence, *e.g.* beating a baby/child by a parent or psychic person or psychopath తల్లి/తండ్రిగాని, వికృత మనస్కుడుగాని పసివాళ్ళమీద చేసే హింస, ఉదా. కొట్టుట. [*q.v.* shaken baby syndrome].

**Bazin's disease** erythema induratum. tuberculosis cutis indurativa. a variety of skin TB ఒకరకమైన చర్మ క్షయవ్యాధి.

**BCG** *abbr.* Bacillus Calmette Guerin. vaccination against tuberculosis క్షయవ్యాధినిరోధక టీకా.

**bearing down** pains during labour కాన్పులో కాబోయే మాతృమూర్తి పడే నొప్పులు, కటినుండి తొడలకు, కాళ్ళకు దిగజారే నొప్పులు.

**bedbug:** blood-sucking insect of the genus *Cimex* నల్లి. నల్లికుట్టు నిద్రాభంగం.

**bedpan** dish into which a patient can urinate or defecate మలపాత్ర.

**bedridden** *figur.* wedded to bed మంచం పట్టిన.

**bed-wetting** urination during sleep నిద్రలో మూత్రవిసర్జన. వాడు.భా. రాత్రుళ్ళు పక్కలో ఉచ్చపోయటం.

**beepollen** a source of anti-oxidant, natural tonic food, collected from the hindlegs of bees, *figur.* makes one as busy as a bee తేనెటీగ కాళ్ళనుండి తీసిన పుప్పొడి, టానిక్.

**belch** escape of gas from stomach through the mouth, eructation పొట్టలోని వాయువు నోటిగుండా త్రేపుట, తేపు, త్రేన్పుట.

**belladonna** *bot. Atropa belladonna,* the deadly nightshade, a plant containing alkaloids మారణమైనమొక్క; వృక్షపదార్థములు (alkaloids) కలది.

**Bell's palsy** paralysis of the muscles of the mouth and orbit due to disease of $7^{th}$ cranial nerve (facial nerve) నోరు మరియు కనుగుంటయొక్క కండరముల పక్షవాతము, 7వ కపాలనాడియొక్క జబ్బు.

**belly** 1. abdomen పొట్ట. 2. the fleshy contractile portion of a skeletal muscle కండరములోని ముడుచుకొను మాంసపుముద్ద భాగము.

**benign** benignant, not malignant; having a favourable prognosis/outcome సాత్వికమైనది, నిరపాయమైనది, మారణము కానిది/మారణశక్తిలేనిది; అనుకూల పరిణామము కలది [*in contr.* malign, malignant భిన్న. అపాయకరమైన].

**benumb** to make a part numb శరీరంలో ఒక భాగం మొద్దుపరచుట *see/చూడండి* anaesthesia.

**beri-beri** a disease due to the deficiency of thiamine (vitamin $B_1$) characterised by tingling and numbness of extremities, heart failure and cerebral involvement (encephalopathy) విటమిన్ $B_1$ లోపమువలన కలుగుజబ్బు; వ్యాధిలక్షణములు: కాళ్ళుచేతుల్లో సూదులతో పొడిచినట్లు పోట్లు, తిమ్మిర్లు, గుండెజబ్బు – దీనివల్ల శరీరం వాపు; మరియు స్మృతి తప్పుట.

**besotted** confused, especially having drunk too much మత్తెక్కిన, ఒళ్ళు తెలియని, తప్పుతాగిన (స్థితి).

**bestiality** sexual activity between a human and an animal జంతువులతో మనిషి చేయు మైథునం.

**betel leaves** *bot.* aromatic creeper తమలపాకు. 1. used to heal wounds, boils గాయములకు, పుండ్లకు వాడ్తారు. 2. used as an aphrodisiac, along with nuts – *Pan-supari* వీర్యవృద్ధికరము; కామోద్దీపకము, రతిని రేకెత్తించునది.

**bhang** the leaves and shoots of the Cannabis plant, used as a narcotic and intoxicant గంజాయి: జనపమొక్క-యొక్క ఆకులు, రెమ్మలు – వీటిని తిన్నా లేక వీటిపొగ పీల్చినా మత్తు, మైకం వస్తుంది.

**biceps** large two headed muscle at the front of the arm ద్విశిరస్క బాహు కండరము: బాహువు (చేయి పైపగము) ముందు భాగములోనున్న కండరము. [*Cf.* triceps].

**bicornuate** having two horns ద్విశృంగాకార. *e.g.* **b. uterus** ఉదా. ద్విశృంగాకార గర్భకోశము. *resemblance:* bifid stick పోలిక: పంగలకర్ర.

**bicuspid** having two cusps ద్విపత్ర. **b. tooth** premolar tooth అగ్రచర్వణకము, రెండుగా చీలినది – దంతమునకు ముందున్న పన్ను. **b. valve,** having two cusps; mitral valve situated between the left atrium and left ventricle అగ్రద్వయ కవాటము, ద్విపత్ర కవాటము: ఇది గుండెలో ఎడమ ఏట్రియమ్‌కు ఎడమ జఠరికకు మధ్యగల కవాటము.

**b.i.d.** or **BID** *abbr.* (Latin *bis in die*) the dose of the medicine, twice a day మందుయొక్క మోతాదు, దినమునకు రెండుసార్లు.

**bifid** cleft with two projections in the same organ, *e.g.* bifid uterus రెండుగా చీలిన: పంగలకర్ర (Y) రూపములో రెండుగా చీలియున్న అవయవము, ఉదా. రెండుగా చీలియున్న గర్భసంచి.

**bifocal** said of spectacles or contact lenses having two separate portions; the upper one for distant vision (to see objects), the lower one for near vision (*e.g.* for reading) రెండు భాగములుగా విభజింపబడిన కళ్ళద్దాలు; పైభాగం దూరపు వస్తువులు చూడడానికి, కిందిభాగం దగ్గరవస్తువులు చూడడానికి (ఉదా. చదివేటప్పుడు).

**bile** the secretion of the liver పిత్తం: కాలేయము తయారుచేయు స్రావము, పైత్యరసము.

**bile duct** the duct which carries the bile juice పైత్యరసనాళము.

**bile pigments** bilirubin, biliverdin పిత్త/పైత్యవర్ణకాలు.

**bilharziasis** schistosomiasis, abdominal pain and diarrhoea, infection with *Schistosoma mansoni* షిస్టోసోమా అను పరాన్నజీవివలన కలుగు కడుపునొప్పి మరియు అతిసారము (విరేచనాలు).

**biliary** relating to bile పిత్తమునకు సం. **b. calculi**, stones in the biliary tract పైత్యరస మార్గంలో శిలలు. **b. colic** ఇక్కడ శూలనొప్పి.

**bilious** 1. biliary పైత్యం. 2. *colloq.* suffering from indigestion అజీర్తి. వాడు.భా. నోరు పెండపెండ; అన్నం/తిన్నది సరిగ్గా అరగకపోవటం; వాంతులు, పసరు, కడుపులో త్రేపులు, పొట్టలో బరువు, పొట్టలో పెట్టె పెట్టినట్లుండటం, ఇత్యాది.

**biliousness** indigestion and feeling of nausea పైత్యోద్రేకము. 1. nausea, abdominal discomfort and headache due to increased bile production అన్నము చూస్తే డోకు/వాంతి వచ్చినట్లుండుట, పొట్టలో అసౌఖ్యము, తలనొప్పి – ఇవి పైత్యరసము ఎక్కువ ఉత్పత్తి అవుతున్నందున కలిగినవి. 2. upset of liver caused by dietary indiscretion ఆహారములో అజాగ్రత్తవలన/అభోజ్య భోజనం వలన సంభవించిన కాలేయ అస్వస్థత.

**bilirubin** a bile pigment; presence of excess of this in blood results in jaundice పైత్యరసములోని పచ్చరంగు పదార్థము: ఇది రక్తములో ఎక్కువైతే పచ్చకామెర్లు అంటారు.

**biliverdin** a green bile pigment పైత్యరసములోని ఆకుపచ్చవర్ణ పదార్థము.

**bimanual examination** [Latin *manus* = hand]. performed with both hands రెండు చేతులతో పరీక్షించుట. 1. internal genital organs, especially uterus examined with one hand (fingers) in vagina and the other hand over the abdomen యోనిలో వేళ్ళుపెట్టి రెండవ హస్తం పొట్టమీద ఉంచి, ముఖ్యముగా గర్భసంచిని పరీక్షచేయుట. 2. palpating tumour in abdomen bimanually రెండు హస్తములతో ఉదరకంతిని పరీక్షచేయుట.

**binovular** relating to two ova రెండు అండములకు సం. [*in contr.* uniovular].

**bioassay** the assessment of the potency, *i.e.* concentration of a compound or chemical substance by testing its effect on an animal or plant tissue బయో అస్సే, జీవమూపకం: ఒక రసాయనక పదార్థంయొక్క శక్తి లేదా దారుఢ్యం అనగా గాఢపరచేగుణం కనుక్కొనటానికి వాటి ప్రభావం జంతు లేదా వృక్ష కణజాలములమీద పరీక్షించడం.

**biochemistry** chemistry of living structures జీవరసాయనశాస్త్రము, జీవరసాయనిక శాస్త్రము.

**bioengineering** and **biological engineering** the application of engineering technology to biology and medicine, *e.g.* artificial limbs, joints, heart pace-makers, *etc.* – also called biomedical engineering. జీవశాస్త్రం మరియు వైద్యశాస్త్రంలో సాంకేతిక విజ్ఞాన పద్ధతులు.

**biofeedback** the technique by which a person learns to control some body functions, *e.g.* heart rate or blood pressure through signals from electronic devices/instruments ఎలక్ట్రానిక్ పరికరముల సాయంతో మనిషి కొన్ని శరీరవిధులను, ఉదా. గుండెవేగం, రక్తం ఒత్తిడిని, అదుపులోనికి తేగలుగుట.

**bioflavonoids** 1. *e.g.* citrin, rutin contained in fruits, showing vitamin P activity, *viz.* regulating the permeability of the blood capillary walls. రక్తకేశనాళికల కుడ్యములలోనుండి పారగమ్యత/ప్రవేశ్యశీలత (ప్రవేశం ఇవ్వటం) (permeability)ను క్రమబద్ధం చేసే పదార్థములు. ఇవి ఫలములలో ఉంటాయి; వీటికి 'విటమిన్ పి'యొక్క గుణం కలదు. 2. These are antioxidants, too.

**biology** *biol.* 1. includes botany and zoology జీవశాస్త్రము: వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము ఉన్న విద్య. 2. animal and plant life పశువుల మరియు మొక్కల జీవనము/జీవనవిధానములు. **molecular b.**, biology at molecular/genetic level of understanding, *viz.* dealing at the grass-root level అణువు/జన్యువు స్థాయిలో బయాలజీ అనగా అది అంశముల దశలోనుంచి వివరణ.

**biomedical engineering** *see/చూడండి* bioengineering.

**bionic** *colloq.* science fiction depicting extraordinary superhuman powers of speed or/and strength, *e.g.* 'Bionic woman' in TV serial శాస్త్రకల్పన/కట్టుకథ; మానవాతీత వేగంగాని బలంగాని ప్రదర్శించే అసామాన్యమైన వ్యక్తి, ఉదా. టి.వి.లో ధారావాహిక.

**biopsy** *colloq.* 'tissue diagnosis'. removal of, and microscopic examination of living tissue to establish a diagnosis of the disease జీవకణ పరీక్ష, సజీవకణజాల పరీక్ష: రోగనిర్ధారణ కొరకై కణజాలమును శరీరములో నుండి తీసి సూక్ష్మదర్శినిలో పరీక్షచేయుట.

**biotechnology** use of living microbes, బయోటెక్నాలజీ: సూక్ష్మజీవుల సాయంతో *e.g.* ఉదా. (i) to infect mosquitoes and kill their eggs దోమ గుడ్లను నిర్మూలించుట. (ii) in processing of waste చెత్త చదారాన్ని కలుషితరాహిత్యంగా మార్చుట. (iii) in manufacture of drugs ఔషధ తయారీకి తోడ్పడుట.

**biped** a being with two feet, *e.g.* human being. ద్విపాదజీవి, ఉదా. మానవుడు, అలంకార. రెండుకాళ్ల జీవుడు. [*Cf.* quadruped].

**birth** act of being born జననము: పుట్టుక అనెడు ఘట్టము.

**birth canal** consists of cervix, vagina and vulva జననకుల్య: శిశువు జన్మించు మార్గము; గర్భసంచి గ్రీవము, యోని మరియు గుహ్యప్రదేశము.

**birth control** 1. family planning methods కుటుంబ నియంత్రణ పద్ధతులు. 2. an agent/medicine which protects a woman from getting pregnant గర్భిణి రాకుండా/కాకుండా నివారించే సాధనము లేదా మందు.

**birth mark** indelible mark/naevus/pigmentation present at birth and continuing throughout life పుట్టుమచ్చ, పుట్టినతోపుట్టి జీవితమంతా చెరిపివేయుటానికి వీలుకాని మచ్చ/రంగు పొడ.

**bisexual** 1. a person desiring sexual contact with people of either sex, *i.e.* heterosexual as well as homosexual పరలింగ, స్వలింగ మైథున అభిలాషి. 2. hermaphrodite ఉభయలింగత్వంగల జీవి.

**bisexual libido** (in psychoanalysis) the tendency in a person to seek sexual gratification with persons of both sexes (మనోవిశ్లేషణలో) పరలింగ, స్వలింగ మైథునంలో లైంగికతృప్తియొక్క అనుభూతి వాంఛిస్తూ ఉన్న వ్యక్తి.

**Bishop's weed** *bot.* Indian Name *Ajwain* or *Omum* వాము. 1. carminative, used for dyspepsia జీర్ణకారి. పసిపిల్లలకు వాముపాలు గృహవైద్యం. 2. aphrodisiac రతిని రేకెత్తించేది, కామోద్దీపకము.

**bite** 1. cut with teeth పండ్లతో కొరుకుట. 2. bite by an arthropod, *e.g.* insect bite ఉదా. పురుగు కొరుకుట. 3. snake bite పాముకాటు.

**Bitot's spots** spots on the conjunctiva, caused by vitamin A deficiency విటమిన్ A లోపము వలన కలిగే కంటిపొరమీది మచ్చలు.

**black death** bubonic plague, buboes in groin or/and axilla (enlargement of lymph nodes), *see/చూడండి* plague. గజ్జలలోగాని, చంకల్లోగాని బిళ్ళలు కట్టడం (లింఫ్‌గ్రంథుల వాపు వలన): ఇది ఒక రకమైన ప్లేగువ్యాధి.

**black head** open comedo, dilated orifice of a hair follicle జుట్టుకుదురుయొక్క రంధ్రము పెద్దదగుట.

**black water fever** one type of malaria ఒక రకమైన మలేరియా.

**bladder** a membranous sac serving as a reservoir/receptacle for a fluid ఉత్పత్తి అయిన ద్రవమును స్వీకరించి, చేర్చిపెట్టు తిత్తి/ద్రవాశయము. 1. urinary bladder for storing urine మూత్రమును

నిల్వచేయు మూత్రకోశము లేదా మూత్రాశయము. 2. gall bladder for storing bile పైత్యరసమును నిల్వబెట్టు పిత్తాశయము.

**blain** a lesion on the skin, *see/చూడండి* lesion. చర్మంమీద క్షతము.

**bland diet** non-irritating food చప్పిడి ఆహారం.

**bleary-eyed** said of a person with red and dim, watery, tired-appearing eyes ఎరుపెక్కి, బాష్పతడితో (బాష్పార్ద్ర) మసకగా ఉండి, అలసిపోయిన ముఖంతో కనబడే వ్యక్తి. *N.B.* aftermath of overexertion or crying అతిశ్రమ లేదా రోదన/ఏడుపు యొక్క పర్యవసానం. (త్రాగుబోతువాడి కళ్ళుకాదు సుమా!) సానుభూతి: ముఖం పీక్కుపోయింది, పాపం.

**bleb** a flaccid vesicle 1cm. or more in diameter ఒక సెంటిమీటరు లేదా ఆపైని వడిమికొలత గల నీటిబుగ్గవలె పితపితలాడు (flaccid) బొబ్బ.

**bleeding** 1. the escape of blood, *e.g.* after injury రక్త/రుధిర స్రావము, రక్తము కారుట, ఉదా. దెబ్బ తగిలిన తర్వాత. 2. the letting of blood from a donor in a blood transfusion clinic రక్తదానము చేయువారినుండి రక్తసేకరణము.

**bleeding time** time taken for the natural stoppage of blood from a prick: 1 to 4 minutes (Duke method) సూదితో చర్మముపై గుచ్చిన తర్వాత రక్తము సహజముగా (దానంతట అదే) ఆగిపోవు వ్యవధి: 1 నుండి 4 నిముషములు.

**blennorrhagia** discharge from mucous membrane, especially from vagina or male urethra ముఖ్యంగా యోని లేదా పురుష మూత్రమార్గంయొక్క శ్లేష్మపొర నుండి శ్లేష్మజల్లు. అలంకార. శ్లేష్మవర్షం.

**blennorrhoea** or **blennorrhea** blennorrhagia. 1. copious mucous discharge from vagina or male urethra యోనినుండిగాని పురుష మూత్రమార్గం నుండిగాని శ్లేష్మం కారుట. 2. gonorrhoea గనేరియా.

**blepharal** pertaining to the eyelids కనురెప్పలకు సం.

**blepharitis** inflammation of the eyelids కనురెప్పల శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**blepharoplasty** plastic operation/repair of eyelid(s) కనురెప్ప(ల) మీద (స్వ)రూపకల్పన చికిత్స.

**blepharoplegia** paralysis of an eyelid కనురెప్పయొక్క పక్షవాతం.

**blepharoptosis** drooping of the upper eyelid పై కనురెప్ప క్రిందకు వ్రాలిపోవుట. అలంకార. నిమీలిత నేత్ర లేదా అర్ధనిమీలిత నేత్ర.

**blepharospasm** spasm of the eyelid muscle కనురెప్ప కండరం యొక్క ఈడ్పు/బిగువు.

**blindness** lack or loss of ability to see అంధత్వము, కన్నుచూపు లేకపోవుట, వాడు.భా. కళ్ళు (చూపు) లేని కబోదియొక్క స్థితి. **colour b.** వర్ణాంధత. **night b.** రేచీకటి.

**blind spot** in retina గుడ్డిచుక్క, అంధబిందువు: Light sensitive receptors are not present here, hence insensitive to light. ఇక్కడ కాంతి సంవేదక గ్రాహకాలు లేవు, కావున కాంతినిరోధక ప్రాంతం.

**blister** collection of fluid under the skin in the shape of a vesicle బొబ్బ: బొబ్బ రూపములో ద్రవము చర్మము అడుగున చేరుట.

**bloat** tympany (abnormal collection of gas) in stomach, caecum or intestine జఠరములోగాని, అంధనాళములోగాని, ప్రేగులలోగాని అధిక/అమిత వాయువు చేరుట.

**block** 1. stoppage (of impulse), *e.g.* heart block wherein there is an impairment of conduction of an impulse in heart excitation ప్రచోదనము యొక్క అవ్రుదల, ఉదా. గుండెను ప్రేరేపించు ప్రచోదన వాహకతలో దోషము. 2. regional anesthesia నొప్పి తెలియకుండాచేసే ప్రక్రియ (anaesthesia) కు ఆ ప్రాంతములోని నాడులను మొద్దుపరచుట.

**blood** 1. consists of plasma, erythrocytes, leucocytes and platelets; It circulates through the heart, arteries, capillaries and veins carrying nutriment and oxygen to tissues/cells and removing waste products and carbon dioxide produced by tissues/cells. రుధిరము/రక్తము, నెత్తురు; రక్తములో ప్లాస్మా, ఎర్రకణములు, తెల్లకణములు, ప్లేట్‌లెట్‌లు ఉంటాయి; గుండెలో, ధమనులలో, కేశనాళికలలో,సిరలలో దీని ప్రసరణ జరుగుతుంటుంది; తత్ఫలితంగా పోషకములను ప్రాణవాయువును కణజాలములకు/కణములకు అందజేసి,

వ్యర్థమైన/పనికిరాని పదార్థములను, బొగ్గుపులుసు వాయువును కణజాలములనుండి/కణములనుండి తీసుకొంటుంది. *figur.* blood, the elixir of life అలంకార. రక్తం ప్రాణానికి ఆధారం. 2. Blood, a medical journal వైద్యవార్తా పత్రిక.

**blood bank** storing place for blood which is collected from the donors రక్తనిధి, రుధిరనిధి: రక్తదానము చేయబడిన రక్తమును నిలువజేయు బాంక్.

**blood cell** cell contained in blood, *e.g.* erythrocyte (red blood cell), leucocyte (white blood cell). రక్తములోని కణము, ఉదా. ఎర్ర రక్తకణము, తెల్ల రక్తకణం.

**blood clot** coagulated portion/mass of blood గడ్డకట్టిన రక్తము యొక్క భాగము/ముద్ద.

**blood clotting** the process of the formation of a soft, semi-solid mass, also referred to as coagulation మెత్తటి, పాక్షిక ఘనస్థితిగల ముద్ద తయారగు ప్రక్రియ, రక్తస్కందన(ము). Plasma coagulation factors are Factor I to V, Factor VII to XIII. ప్లాస్మాస్కందన ఫాక్టర్లు.

**blood count** a procedure that determines the type and number of red blood cells, white blood cells, platelets ఎర్రకణములు, తెల్లకణములు, ప్లేట్‌లెట్‌లు – వీటి యొక్క వివరములు, సంఖ్య తెలియజేయు విధానము.

**blood donation** donation of blood by a person, to be stored, *see*/చూడండి blood bank. రక్తనిధికి రక్తం దానం చేయుట. an appeal: "Donate blood – Save Life" మనవి: "రక్తదానం చేసి ప్రాణాన్ని కాపాడండి, అన్నిదానాల్లోకల్లా రక్తదానం మిన్న".

**blood group** category of blood. There are two systems: రక్తము యొక్క వర్గము. రెండు రకములున్నవి: 1. ABO system in which there are four groups, A, B, AB and O. ABO రకము – ఇందులో నాలుగు గ్రూప్‌లున్నవి, A, B, AB మరియు O గ్రూప్. 2. Rh system in which there are two types, Rh positive, Rh negative. Rh రకము – Rh పాజిటివ్, Rh నెగిటివ్. Individuals differ in their blood groups. The same group of blood should be

given in blood transfusion. ఒక వ్యక్తికి మరియొక వ్యక్తికి రక్తగ్రూప్ వేరుగా ఉంటుంది. మనిషిలోనికి రక్తము ఎక్కించుతున్నప్పుడు సరిపడే (matching) రక్తమే ఎక్కించాలి.

**blood poisoning** a serious condition wherein the bacterial toxins or large amounts of bacteria circulate in the blood stream, *see*/చూడండి septicaemia. రక్తంలో పూతిదోషం.

**blood pressure** the pressure exerted on the walls of the arteries. The maximum/systolic pressure occurs when the left ventricle contracts (at the end of systole), and the minimum/diastolic pressure late in left ventricular relaxation (diastole). In people of middle age the B.P. (blood pressure) is 120/80 mm Hg. రక్తపీడనము/ఒత్తిడి: ఎడమ జఠరిక సంకోచ సమయంలో ధమనుల పరిధిలోని ఒత్తిడిని సిస్టాలిక్ ప్రెషర్ అంటారు, ఎడమ జఠరిక సడలినప్పుడు ఒత్తిడిని డయస్టాలిక్ ప్రెషర్ అంటారు. మధ్యవయస్సువారిలో బి.పి. 120/80 ఉంటుంది.

**blood sugar** fasting blood sugar/glucose పరగడుపున రక్తములో చక్కెర/గ్లూకోసు 75 to 105 mg/100 ml; post prandial blood sugar/glucose (two hours after lunch) < 140 mg/100 ml భోజనమైన 2 గంటల తర్వాత రక్తములో చక్కెర/గ్లూకోసు 140 mg/100 ml కు తక్కువ ఉండాలి.

**blood transfusion** replacement of required blood from donor/bank in the following circumstances రక్త ప్రవేశనము: ఈ క్రింది పరిస్థితులలో అవసరముపడినంత రక్తము దాత/బ్యాంక్ నుండి తీసుకోవాలి. 1. blood loss రక్తము శరీరమునుండి కారిపోయినప్పుడు. 2. disease of blood రక్తము యొక్క రుగ్మతలో. 3. in case of ineffective blood, the blood is let out and fresh blood is introduced నిష్ఫల రక్తము శరీరములో ఉన్నప్పుడు దానిని బహిష్కరించి తాజా/ఆరోగ్యవంతమైన రక్తమును ప్రవేశపెట్టుట. 4. during blood-thirsty surgical operations రక్తదాహమునకు దారితీసే శస్త్రచికిత్సలలో సంజీవిని/ప్రాణదాత.

**blood vessels** tubed structures that carry blood to all parts of the body; they are arteries, capillaries, and veins రక్తనాళములు:

నాళరూపములోనున్న ధమనులు, కేశనాళికలు, మరియు సిరలు; వీటిలో రక్తము శరీరములో అన్నిప్రాంతములకు సరఫరా అవుతుంది.

**blotch** a pigmented or erythematous lesion on the skin చర్మంమీద వర్ణకం కలిగిగాని లేదా ఎర్రబారిన క్షతము.

**blue baby** 1. temporary anoxia at birth శిశువు జన్మించగానే అశాశ్వత నీలవర్ణం. also called blue asphyxia relieved with crying భూమిమీద పడగానే ఏడుపుతో తగ్గుతుంది. 2. in congenital heart or lung disease పుట్టుకతో వచ్చిన గుండె లేదా ఊపిరితిత్తుల జబ్బులో.

**blue film** obscene, pornographic video cassette, a bane of the present day అశ్లీలమైన కౌక్కోకం చూపే విడియో కాశెట్, ఈనాటి చేటు, చెఱుపు.

**blue pus** bluish discharge from a wound with Pseudomonas microorganisms ఈ సూక్ష్మక్రిమి సంపర్కంలో గాయంనుండి నీల్వర్ణంగు రసిక/విసర్జనం.

**blurred vision** indistinct or distorted vision చెదిరినట్లు అస్పష్టముగా కనబడుట.

**BMR** *abbr.* basal metabolic rate, metabolism at rest మూల జీవ(న)క్రియ సూచి: మనిషి విశ్రమించి ఉన్నప్పుడు శరీరములో జీవకణములలో కలుగు రసాయనికపు మార్పులు తెలియజేయు సూచి.

**body** 1. the physical man శరీరము, దేహము: శారీరక, మానసిక తత్వములు గల మనిషి. వాడు.భా. పెయ్య. 2. the trunk – the frame/structure with organs ముఖ్యాధారము – అవయవములతోసహా ఉన్న గూడు. 3. the largest portion of any organ, *e.g.* the body of the pancreas ఏ అవయవములోనైనా ఉన్న విస్తారమైన భాగము, ఉదా. క్లోమము యొక్క మొండెము. 4. any mass/material ఒక ముద్ద/వస్తువు.

**body cavities** 1. thorax ఛాతిలోపలి ప్రదేశము. 2. abdomen పొట్టలోపలి పెద్ద కుహరము. 3. pelvis శ్రోణి, పొత్తికడుపులోని గుహ.

**body mass index** *abbr.* BMI. an index of obesity calculated by dividing a person's weight in kilograms by the square of his height in metres.

preserved/canned food. Progressive paralysis of ocular muscles, tongue and respiratory muscles ensues. విషపూరిత/కలుషితమైన ఆహారము వలన కలుగు ప్రమాదకరమైన విపత్తు. చెడిపోయిన/డబ్బాలలో విక్రయించిన తినుబండారములవలన సంభవిస్తుంది. కన్ను, నాలుక, ఛాతీ కండరముల పక్షవాతములోనికి దింపుతుంది.

**bovine** pertaining to an ox or cow, *e.g.* bovine tuberculosis ఎద్దు, గోవుకు సంబంధించినది, ఉదా. ఎద్దు/గోవు క్షయవ్యాధి.

**bowel** the intestine పేగు, అంత్రము. *N.B.* Loose bowels indicate diarrhoea. *గమనిక:* క్రమమునుండి విడివడిన/తప్పిన పేగులు అతిసారము కలుగజేస్తాయి.

**bowel obstruction** intestinal obstruction, an emergency to be tackled by surgery అంత్రనిరోధనము: అత్యవసర పరిస్థితి, శస్త్ర చికిత్స అవసరం.

**bow-legs** bandy-legs. genu varum, outward curvature of legs near the knee, *e.g.* aftermath of rickets దొడ్డికాళ్ళు: మోకాళ్ళ ప్రాంతములో కాళ్ళు బయటకు వంగి ఉండుట, ఉదా. రికెట్స్ వ్యాధియొక్క పర్యవసానము [*opp.* genu valgum, knock-knee వ్యతి. గాడిదకాళ్ళు].

**BP** 1. *abbr.* blood pressure బ్లడ్ ప్రెషర్ (రక్తపీడనము/ఒత్తిడి). 2. *abbr.* British Pharmacopoeia బ్రిటిష్ మందుల పట్టిక.

**brachialgia** pain in the arm దండ/బాహువులో నొప్పి.

**brachial plexus** nerve trunks at the shoulder బుజప్లక్షము.

**brachium** the arm (shoulder to elbow) బాహువు, భుజం, దండ, జబ్బ (బుజమునుండి ముడుకు వరకు). అలంకార. రాజులు భుజకీర్తులు ధరిస్తారు. అంగన దండకడియం ధరిస్తుంది. వస్తాదు జబ్బ బలం నిరూపిస్తాడు.

**brachycephalic** having a short broad head కురచగా ఉండి వెడల్పుగానున్న తల/శిరస్సు.

**brachydactylic** having short fingers పొట్టి వేళ్ళుగల.

**bradycardia** slowness of the heart beat to less than 60 per minute హృద్మందత: గుండె నిముషమునకు 60 సార్లకన్నా తక్కువగా కొట్టుకొనుట [*in contr.* tachycardia భిన్న. గుండెపరుగు].

**bradypnea** or **bradypnoea** slow breathing ఊపిరి తక్కువసార్లు పీల్చుట [*in contr.* tachypnoea భిన్న. శ్వాసవేగం].

**Braille** system of reading and writing for blind people గుడ్డివారికి చదివే, వ్రాసే పద్ధతి.

**brain** the central station in the nervous system which sends out orders/commands to the body and receives sensations from the body. It is contained in the cranium. It comprises the forebrain (cerebrum), midbrain (pons) and hindbrain (cerebellum and medulla oblongata). పుర్రె, బుర్ర (skull) కపాలమునకు పేర్లు. కాని వాడుకభాషలో మెదడుకు వాడ్తారు. మేధ, మెదడు – ఇది పుర్రెలోనున్నది, కేంద్ర నాడీమండలము (central nervous system) నకు కీలకస్థానము. ఇందు ఉపరిభాగములో మస్తిష్కము, మధ్యభాగములో పాన్సు, క్రిందిభాగములో అనుమస్తిష్కము మరియు మెడుల్లా అబ్లాంగేటా కలవు. మెదడు శరీరానికి ఆజ్ఞలు విధిస్తుంది, శరీరమునుండి ఇంద్రియజ్ఞానము సేకరిస్తుంది.

**brain death** also called clinical death; death of vital centres in the brainstem, when the person affected will not survive without the aid/support of a ventilator, *see/చూడండి* coma. రోగచికిత్స సం. (clinical) మృతి: మెదడులోని కీలక కేంద్రముల మృతి; తత్ఫలితంగా వెంటిలేటర్ (ventilator) అను మెషిన్ సాయం లేకుండా రోగి బతకడు.

**brain fever** *colloq.* encephalitis of unknown etiology. కారణం తెలియని మెదడువాపు వ్యాధి.

**brain stem** the stem shaped junction of the cerebral hemispheres with the spinal cord మస్తిష్కగోళార్థాలు మరియు వెన్నుపాము కలసిన సంధి ప్రదేశము. ఇది చెట్టుబోదెను పోలి ఉంటుంది.

**bran** covering over the rice grain తవుడు, పొట్టు: బియ్యపుగింజమీది పొర. 1. a good source of fibre and vitamin $B_1$ ఇందులో పీచు మరియు విటమిన్ $B_1$ పుష్కలంగా ఉంటాయి. 2. bran mixed in water, a renowned drink for cattle పశువులకు తవుడు నీళ్ళలో కలిపి త్రాగిపిస్తారు; దీనిని కుడితి అంటారు, ఇష్టంగా తాగుతాయి.

**brash** heartburn, retrosternal soreness, acidity, *e.g.* water brash which is regurgitation of sour fluid into the mouth ఎద కాలి నట్లుండుట, ఉదా. సామాన్య సంభాషణలో నోట్లో నీరు చేరటం – ఇది ఎట్లా జరుగుతుంది అంటే – జీర్ణాశయము, అన్నవాహికలో నుండి పులుపు/అమ్ల ద్రవము నోట్లోకి గుంజుకొనబడుతుంది.

**break-bone fever** dengue డెంగు జ్వరం. *see*/చూడండి dengue.

**breakdown** విచ్ఛిన్నం. **nervous b.** అధైర్యపాటు.

**breast** 1. front of thorax రొమ్ము/ఉరము యొక్క ఎదుటి దర్శనము. 2. the mamma/mammary gland కుచము. 3. monthly self examination of breast by females just after menses to detect any tumour (early cancer) ముట్టునీళ్లు పోసుకోగానే ప్రతిస్త్రీ ప్రతినెలా తన కుచములను ఒత్తి పరీక్ష చేసుకుంటుండాలి, కంతి (కేన్సరు ప్రథమదశలో) కనుక్కోటానికి.

**breast bone** bone in the front and middle of ribcage, called sternum ఉరోస్థి, ఉరఃఫలకము: ఎదురు రొమ్ములో మధ్యనున్న ఎముక.

**breast feeding** feeding a baby with human milk from the breast of the mother or milk donor. This natural milk cannot be equalled with any other known formula of artificial milk. Hence breast milk is the best milk. శిశువుచేత మాత్ర లేక పాలదాత స్తనములు చీకించుట. ఇది ఉత్తమోత్తమము – ఎందుచేతననగా, ఇంతవరకు పరిశోధనలలో అరితేరి, వినుతికెక్కిన ఏ విధమైన కృత్రిమపాలు సహజసమృద్ధి పోషకమైన తల్లిపాలకు సాటికావు/రావు. కుచక్షీరము క్షేమంకరము. తల్లి కుచక్షీరమే బిడ్డకు రక్ష.

**breathalyser** or **breathalyzer** *i.e.* breathanalyser or breathanalyzer, drunkometer. breath + analyser. an instrument to analyse the amount of alcohol in the breath ఊపిరితో వదిలే గాలిలో మద్యము (alcohol) ఎంత శాతం ఉన్నదీ అని తెలియజేసే సాధన/పనిముట్టు.

**breathing** the act of alternate expansion of chest (with inspiration) and contraction of chest (with expiration). Inspiration is intake of air and expiration is expelling air. ఊపిరి; శ్వాస: ఒకటి తరాత

ఒకటి చేయు ప్రక్రియ – ఊపిరి/శ్వాస పీల్చుట, వదలుట; ఉచ్ఛ్వాసము (inspiration) తో ఛాతి ఉబ్బించుట, నిశ్వాసము (expiration) తో ఛాతి ముడుచుకొనునట్లు చేయుట/సడలించుట.

**breathless** short of breath ఊపిరియాడని.

**breathlessness** state of shortness of breath ఊపిరియాడని స్థితి.

**breath test** a test to check the amount of alcohol in the breath by the use of breathalyser. *vide supra* పైన వివరించిన పనిముట్టుతో ఊపిరి (శ్వాస) గాలిలో మద్యం శాతం కొలుచుట.

**breech** the buttocks పిరుదులు, పిర్రలు, నితంబము.

**breech presentation** breech birth and breech delivery. visualisation of buttocks or feet at the vulval opening before delivery ఎదురుకాళ్ళతో పుట్టడం. ప్రసవమునకు ముందు పిర్రలుగాని పాదములుగాని యోని రంధ్రమందు కనబడుట.

**Bright's disease** inflammation of kidney, nephritis కిడ్నీయొక్క ఇన్‌ఫ్లమేషన్.

**bromidrosis** bromhidrosis. fetid or foul-smelling perspiration, repulsive to the neighbour కంపుకొట్టెడు, దుర్గంధ మరియు దుర్భర చమటవాసన. తోటివాళ్ళకు అసహ్యం.

**bronchadenitis** inflammation of bronchial lymph nodes శ్వాస నాళముల వద్దనుండు లింఫ్ గ్రంథుల ఇన్‌ఫ్లమేషన్.

**bronchi** *see/చూడండి* bronchial tubes.

**bronchial** pertaining to/affecting bronchi శ్వాసనాళికలకు సం.

**bronchial tubes** [bronchi *pl.* bronchus *sing.*] – The windpipe (trachea) divides into two branches, the right and left bronchus. These in turn, subdivide further. These provide passage for air to go in and out of lungs. వాయునాళము (trachea) రెండు శ్వాసనాళము (bronchus)లు, కుడి, ఎడమగా విభజింపబడుతుంది. ఇవి శాఖలు (bronchi శ్వాసనాళికలు)గా మళ్ళీ విభజింపబడుతాయి; గాలి ఊపిరితిత్తులలోపలికి వెలుపలికి తిరుగాడటానికి మార్గాన్ని కలిగిస్తాయి.

**bronchiectasis** bronchiectasia. ectasia means dilatation; dilatation of bronchi resulting in sac-like pockets which are filled with infectious

sputum/phlegm. There is copious expectoration with a foul breath. Haemoptysis could occur. శ్వాసనాళికలు విస్ఫారణమై, తిత్తులవలె మారి, వాటిలోనున్న కఫము/కళ్ళె/శ్లేష్మము విస్తారమై/అధికమై దుర్వాసనతో దగ్గుద్వారా బహిష్కరింపబడుతుంది. ఈ రుగ్మతలో కఫములో రక్తము రావచ్చును/దగ్గబడవచ్చును.

**bronchiole** smallest subdivision of the respiratory tree శ్వాసనాళవృక్షములో అన్నిటికన్నా చిన్న, ఆఖరి సైజు పిల్లశ్వాసనాళికల విభజనము.

**bronchitis** inflammation of bronchi రొమ్ము పడిశము: శ్వాసనాళముల మరియు శ్వాసనాళికల శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**bronchodilator** an agent which produces dilatation of the bronchi, e.g. drugs, inhalation of aerosol శ్వాసనాళికలను విస్ఫారణ చేసే సాధన, ఉదా. ఔషధములు, మందులు తుంపర్లలాగా ఎగసే పరికరమును నోట్లో పెట్టుకుని ఆ జల్లును పీల్చడం.

**bronchogenic** originating in a bronchus, e.g. **b. carcinoma** శ్వాసనాళమునుంచి పుట్టే, ఉదా. శ్వాసనాళపు కేన్సరు.

**bronchography** instillation of an opaque dye into the respiratory tree and taking X-ray to study its pattern శ్వాసనాళాల పటం తీయడము: వెలుగు చొరనియ్యని, అపారదర్శక, అద్దకములాంటి మందు శ్వాసనాళములలోనికి ప్రవేశపెట్టి ఎక్స్‌రే తీయుట. దీనివలన శ్వాసనాళవృక్షముయొక్క మార్గదృశ్యము విశదీకరించవచ్చును.

**bronchophony** increased vocal resonance over chest wall heard by stethoscope ఛాతిగోడమీద స్టెతెస్కోప్‌తో విన్నప్పుడు అధిక అనునాదము.

**bronchopneumonia** patchy, widespread inflammation of the lung distal to the terminal bronchiole శ్వాసనాళసంబంధ నిమోనియా: చిట్టచివరి/అంతిమ శ్వాసనాళిక తరువాత ఉన్న ఊపిరితిత్తియొక్క వాపు. ఇది రెండు ఊపిరితిత్తుల వైశాల్యములో మాసికలుగా (patchy)ను, విస్తారముగాను వ్యాపించి ఉండుట/ఉంటుంది.

**bronchorrhoea** or **bronchorrhea** increased secretion from bronchial mucous membrane శ్వాసనాళముల యొక్క శ్లేష్మపొర నుండి అధిక శ్లేష్మస్రావం.

**bronchoscope** an instrument for inspecting the tracheobronchial tree, useful in: శ్వాసనాళ అంతర్దర్శిని: శ్వాసనాళములలోకి దూర్చి శ్వాసనాళవృక్షమును తనిఖీ చేయు పనిముట్టు; దీని ఉపయోగములు: 1. removal of foreign bodies in air passages శ్వాసనాళములలో ఇరుక్కున్న/అటంకపరచు వస్తువులను తొలగించి బయటకులాగుట. 2. diagnosis of endobronchial diseases by taking biopsy of any growth, if present వ్యాధి నిర్ధారణ: ఏదైనా వ్రణము, కంతి ఉన్నట్లయితే దానిలోనుండి ఒక ముక్క తీసి పరీక్షచేయుట. 3. therapeutic measure to instill drugs or drain secretions చికిత్సకు దోహదము: మందులు పోయుట, కళ్ళె/కఫమును తొలగించుట.

**bronchospasm** spasmodic contraction of the smooth muscle of bronchi producing wheeze, *e.g.* bronchial asthma, *see/చూడండి* asthma. శ్వాసనాళికల పరిధిలోనున్న నునుపుకండరములు ముడుచుకు పోయినందువలన వాటి నడిమికొలత తక్కువై, అవి సన్నగిల్లుతాయి; అప్పుడు వాటిలో గాలి పోతున్నప్పుడు పిల్లికూతలు వినిపిస్తాయి, ఉదా. ఉబ్బసము.

**bronchospirometer** an instrument for recording the air capacity of lung ఊపిరితిత్తియొక్క శక్తి నమోదుచేసే పనిముట్టు.

**bronchus** [bronchi *pl.*] the first subdivision of trachea: it divides into right and left bronchus శ్వాసనాళము: వాయునాళము రెండు శ్వాసనాళములుగా విభజింపబడుతుంది – కుడి, ఎడమ *resemblance:* split stick *పోలిక:* పంగలకర్ర.

**bronze diabetes** *see/చూడండి* haemochromatosis.

**bronzed skin** bronze skin. *see/చూడండి* haemochromatosis.

**brood capsules** germinating areas in a hydatid cyst హైడాటిడ్ తిత్తిలో సంతాన గుళికలు, అలంకార. సంతానోత్పత్తి ప్రతిజీవికి (పరాన్నజీవితోసహా) సహజమే గదా!

**brow** 1. the eyebrow కనుబొమ్మ. 2. the forehead నుదురు, లలాటము, ఫాలము, ఫాలభాగము. **b. presentation,** presentation of the fetus at the birth canal with its brow జననకుల్యలో భ్రూణముయొక్క లలాట దర్శనం.

**brucellosis** disease caused by bacteria belonging to the family Brucellaceae and transmitted to human beings from animals, cattle, goats and sheep. Mode of transmission is through dermal contact with infected meat or through oropharynx with infected milk. ఈ జబ్బు బ్రూసెల్లాకు చెందిన బాక్టీరియావలన పశువులు, మేకలు, గొర్రెలనుండి మనిషికి సంక్రమిస్తుంది; ఏవిధంగా అంటే - అంటురోగమును తగిలించు జంతుమాంసము చర్మముతో సంపర్కమైనప్పుడు, మృతకళేబరములను తాకుటవలనను మరియు అంటు తగిలిన (infected) పాలు త్రాగినప్పుడు.

**bruise** contusion, aftermath of injury. In a bruise, the skin is discoloured but not broken. కమిలిన గాయము: నలగగొట్టు, చితుకగొట్టు దెబ్బ/గాయము యొక్క పర్యవసానము. ఇందులో చర్మము రంగు మారుతుంది కాని చర్మము తెగదు.

**bruit** an abnormal sound or murmur heard on auscultation over the heart or an aneurysm గుండెమీదగాని ధమని విస్తరణమీదగాని స్టెతస్కోప్‌తో వినే శబ్దము లేదా మర్‌మర్.

**bruxism** grinding of teeth during sleep, sometimes a pathological condition నిద్రలో పళ్ళుకొరకటం, ఒకప్పుడు జబ్బువలన.

**bubo** an enlarged, inflammed lymph node in the axilla or groin classically seen in 1. bubonic plague, 2. lymphogranuloma venereum (LGV) చంకల్లో, గజ్జలలో శోథము/'నొప్పి వేడి మంట వాపు'తోకూడిన లింఫ్‌గ్రంథి, ఉదా. 1. ప్లేగు 2. ఎల్.జి.వి. అను ఒక సుఖవ్యాధి.

**bubonocele** inguinal or femoral hernia presenting as a swelling in the groin గజ్జలో ఉబ్బుగా కనిపించే హెర్నియా.

**buccal** pertaining to the mouth and cheeks ఆస్య: నోటికి, బుగ్గలోపలి భాగమునకు సం.

**buccal cavity** oral cavity ఆస్యకుహరము, నోరు.

**Buerger's disease** thromboangiitis obliterans, an inflammatory and obliterative disease of blood vessels, chiefly of the legs, leading to loss of blood supply (ischaemia) and death of tissues

*en masse* (gangrene); heavy smoking of cigarettes is one of the chief causes. రక్తనాళములలో శోథము/'నొప్పి వేడి మంట వాపు', రక్తము గడ్డకట్టుట (thrombus formation), తత్ఫలితంగా నాళము పూడిపోవుట; దీనివలన రక్తసరఫరా నిలచిపోయి ఆ భాగములకు, ముఖ్యముగా కాళ్లకు కుళ్ళు (gangrene) సంభవిస్తుంది. సిగరెట్టు పొగ ఎక్కువగా పీల్చడం ఈ క్షోభమునకు ఒక ముఖ్య కారణము.

**bug-eyed** said of a person with eyes bulging out కళ్ళు ఉబ్బి ఉన్న వ్యక్తి.

**bugger** a person who practises oral sex ఆస్య సంభోగం చేసే వ్యక్తి, ఆస్యమైథునాభిలాషి.

**bulb** 1. a rounded mass or enlargement in the shape of an onion పెద్ద ఉల్లిపాయను పోలిన గుండ్రపుముద్ద. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **b. of aorta** బృహద్ధమని లశునం: మహాధమని యొక్క మొదలు. **b. of penis,** the enlarged proximal part of the shaft of the penis comprising erectile tissue, corpus spongiosum శిశ్నలశునము: రక్తముతోనిండి, పొంగి, ఉబ్బి, నిటారుగా అయ్యే పురుషాంగము యొక్క మొదలు. The glans penis resembles a bulb of onion. మేఢ్రమణి ఉల్లిగడ్డను పోలి ఉంటుంది. *micro. str.* సూక్ష్మ.చూ. **b. of hair,** proximal end of the hair shaft రోమకూపములో దాని మొదలు. **onion b.,** collection of Schwann cells ఈ కణముల కూటమి. 2. medulla oblongata మజ్జాముఖము.

**bulbar paralysis** paralysis involving medulla oblongata ఈ భాగమునకు సంక్రమించిన పక్షవాతము.

**bulbar poliomyelitis** polio affecting the brain మెదడుకు సోకిన పోలియో వ్యాధి. starts with mischievous diarrhoea చిలిపి అతి సారంతో మొదలిడుతుంది.

**bulbourethral glands** Cowper's glands: glands situated on either side of the shaft of the penis in its proximal part, the secretion of which lubricates the urethra, especially before coitus; also (this secretion) occurs at the thought of it. పురుషాంగము యొక్క మొదటిభాగమున ఇరువైపుల అమర్చబడిన గ్రంథులు. వీటి ద్రవం

సంభోగానికి ముందు మూత్రమార్గం తడిగావటానికి తోడ్పడుతుంది; అంతేకాదు, లైంగికవాంఛ రేకెత్తినప్పుడుగూడా ఈ ద్రవం స్రవిస్తుంది.

**bulge** a swelling ఉబుకు, ఉబ్బుకొనియుండుట.

**bulimia** a psychosomatic disorder in adolescent girls characterised by alternating episodes of binge (unrestrained) eating and fasting or normal food intake యౌవనదశలోనున్న అడపిల్లలలో మితిమీరి అహారము, మితాహారము – ఈ రెండు ఘట్టములు ఒకటి తరువాత మరియొకటి అనుభవిస్తూ ఉండే మనోశారీరక తారుమారు/అపవ్యవస్థ.

**bulla** [bullae *pl.*] overinflated space usually seen in pulmonary emphysema, a disease wherein the lungs are overinflated and increase in their volume, *resemblance:* plastic balloon, a play-tool of children గోళకము: గాలితో నిండబడిన శూన్యప్రదేశము. ఎమ్ఫిసీమా అను ఊపిరితిత్తుల జబ్బులో కనపడుతుంది; ఈ జబ్బులో ఊపిరితిత్తులు గాలితో ఉబ్బి/ఉప్పొంగించబడి పరిమాణములో పెద్దవై ఉంటాయి. పోలిక: పిల్లలు అడుకునే ప్లాస్టిక్ బెలూన్.

**bull gore injury** injury/hurt by the horns of a bull; inadvertent event while crossing the road పశుశృంగగాయం/క్షతం, గేదె/ఎద్దు కొమ్ము తగిలి గాయం: పరాకైన/ఏమరిన స్థితిలో, రోడ్డు దాటుతుంటే కలిగే క్షతము. The intestines may come out if the horn pierces the abdomen. తగలరానిచోట తగిలితే ప్రమాదం; పొట్టలో పొడుచుకుంటే పేగులు బయటకు వస్తాయి.

**bundle** a collection of muscle or nerve fibres, *e.g.* bundle of His, a band of cardiac muscle connecting the atria with the ventricles in the heart and is responsible for the conduction of impulses కట్ట, బంధనము: కండరముల లేదా నాడుల సముదాయము, ఉదా. బండిల్ అఫ్ హిస్ అనే గుండె కండరముల తంతువుల సముదాయము ఏట్రియమ్‌ల నుండి జఠరికలకు ప్రచోదనము/ప్రేరణ ప్రాకునట్లు చేస్తుంది.

**bunion** 1. prominence of the inner portion of the head of the first metatarsal bone. పాదం లోపలివైపు బొటనవ్రేలు మొదలున ఉబ్బు. 2. **tailor's b.**, bunionette, bunion on the outer side of fifth toe. దర్జీవాని వేలు: చివరివేలు వెలుపల ఉబ్బు. [*q.v.* sartorius].

**burn** injury caused by contact of the body with heat, fire, flame, chemicals like acids, electricity or radiation కాలినగాయము: శరీరభాగమునకు వేడిమి, నిప్పు, మంట, సెగ, ఆమ్లము, విద్యుచ్ఛక్తి, ఎక్స్‌రే లేదా రేడియమ్ తాకుడువలన కలిగిన చెరుపు/గాయము.

**burr-hole** drill into (i) bone (ii) tooth శోధన ఛిద్రం (i) ఎముకలోనికి (ii) పన్నులోనికి.

**bursa** a sac with fluid situated near rubbing parts/surfaces to act as a cushion and lessen the impact of friction, *e.g.* **synovial b.** in the knee joint, between the ends of bones భస్త్రిక, బర్సా: రాపిడికిగురియైన భాగముల/ఉపరిభాగముల దగ్గరగా ఉన్న, మరియు ద్రవముతోనిండిన తిత్తి; ఇది దిండువలె కాపాడి రాపిడియొక్క తీవ్రతను తగ్గిస్తుంది, ఉదా. మోకాలు కీలులో ఎముకల అంచుల మధ్య ఉన్న తిత్తి.

**bursitis** inflammation of bursa (see above) పైన చెప్పిన బర్సాయొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**buttocks** two fleshy prominences formed by the gluteal muscles on the back of the pelvis పిరుదులు, పిర్రలు: కటి (pelvis) వెనుక గ్లూటియల్ కండరములవల్ల ఏర్పడిన రెండు మాంసపు ముద్దలు.

**bypass** alternative passage ఉపమార్గము. 1. a surgically created pathway avoiding/circumventing the anatomical one because it is diseased, *e.g.* gastro jejunostomy in case of peptic/duodenal ulcer జబ్బు పడిన భాగమును వదలివేసి ఆ భాగమునకు అటు, ఇటు ఉన్న అంచులను కలుపుట, ఉదా. జఠరములోనుంచి డుయోడినమ్, జెజునమ్ మామూలు మార్గము. డియోడినమ్‌కు పుండు సంభవిస్తే జఠరము జెజునమ్ కలిపివేసే శస్త్రచికిత్స వల్ల డియోడినమ్‌కు విశ్రాంతి దొరుకుతుంది, పుండు నయమయే అవకాశము లభిస్తుంది. 2. In coronary artery bypass, a portion of the saphenous vein or any other conduit is grafted between the aorta and coronary artery distal to the obstruction. In such a surgical repair, the blood circulation is restored. గుండె కండరము వెలుపలి భాగములోనున్న కొరొనరి ధమని ఒకచోట పూడిపోతే, బృహద్ధమనిని, కొరొనరి ధమని

పూడిపోయిన ప్రాంతము తర్వాత ఉన్న ధమనిని ఒక నాళముతో కలుపుతారు, ఉదా. తొడలోనున్న సెఫినస్ సిరలో ముక్కను తీసి లేదా కృత్రిమ నాళమును (graft) అమర్చుతారు. అప్పుడు రక్తసరఫరా మళ్ళీ యధావిధిగా జరుగుటకు దిద్దిన శస్త్రచికిత్సోపాయము.

**byproduct** offspring ఉపఫలం, గౌణఫలం. *figur.* Offspring/Children are the byproducts of coitus. *అలంకార.* సంతానం రతికేళి ఉపఫలం.

**byssinosis** occupational lung disease; pneumoconiosis caused by inhalation of cotton fibres and dust, observed in textile mill workers గుడ్డలమిల్లులలోని కార్మికులకు వృత్తిరీత్యా కలుగు ఊపిరితిత్తుల రుగ్మత; పత్తినార మరియు పత్తిదుమ్ము పీల్చినందువలన సంభవిస్తుంది.

**bystander** onlooker simply ఏమి తెలియక తేరబారి చూసేవాడు. **innocent b.** అమాయకపు ప్రేక్షకుడు. *N.B.* Human being is an innocent bystander before the deadly devils, AIDS, Cancer and some autoimmune diseases. *గమనిక:* ఎయిడ్స్, కాన్సరు అనే మారణ పెనుభూతాలముందు మరియు కొన్ని ఆటోఇమ్యూన్ వ్యాధులలోను మనిషి శక్తిహీన ప్రేక్షకుడు.

# C c

**°C** *abbr.* degrees Centigrade. normal body temperature is 36.9°C శరీర ఉష్ణోగ్రత 36.9°C.

**cachexia** extreme, profound wasting and weakness observed in prolonged illnesses, starvation క్షీణత: అత్యంతమైన, విపరీతమైన, కృశించిన స్థితి; వశము/అలవి కాని బలహీనత – ఈ క్షీణత దీర్ఘవ్యాధుల యొక్క పర్యవసానము: ఇది నిరాహారదీక్షలో గూడ సంభవిస్తుంది.

**cachexic** *adj.* of cachexia.

**CAD** *abbr.* coronary artery disease గుండె ఉపరిభాగములోనున్న కొరొనరి ధమనుల జబ్బు.

**cadaver** corpse, dead body, generally applied to one preserved for anatomical dissection శవము, పీనుగు, చనిపోయిన దేహము: రసాయనములు ఇంజెక్షన్‌తో ఎక్కించి చెడిపోకుండ/కుళ్లిపోకుండ భద్రము చేసి, మానవనిర్మాణ శాస్త్రము (anatomy) తెలుసుకొనే సాధన (dissection)లో వినియోగిస్తారు.

**cadaveric, cadaverous** *adj.* of cadaver.

**caduceus** the staff/wand of Aesculapius. A rod with one serpent encircling it, is the symbol of the medical profession, *see/చూడండి* Aesculapius. వైద్యవృత్తి చిహ్నం. *Note:* The insignia of the Indian Medical Association depicts two oppositely twined serpents with 'jyoti' on the top.

**caecum** proximal part of the large intestine situated in the right iliac fossa అంధనాళము; పెద్దప్రేగుయొక్క మొదలు: ఇది కుడి శ్రోణ్యస్థి గుంట (right iliac fossa) లో నుండును.

**Caesarean** or **caesarean** or **Cesarian** or **Cesarean** or **cesarean section** operation cutting the anterior abdominal wall and uterus; delivering the baby out through this incision. ఉదరకుడ్యమును, గర్భకోశమును కోసి, శిశువును బయటకు తీసే శస్త్రచికిత్స.

conjunction with other drugs to relieve headaches, pains. ఈ మందు కేంద్ర నాడీవ్యవస్థ, హృదయము, ఊపిరితిత్తులను ఉత్తేజపరచేది, మూత్రమును ఎక్కువ చేసేది; ఈ వృక్షధాతువు (alkaloid) కాఫి, టీ లలో నున్నది. మరికొన్ని మందులతో మిళితమై తయారుచేయబడిన ఈ మందు తలనొప్పి, ఇతర నొప్పులకు ఉపశమనము కలుగజేస్తుంది.

**cage** enclosure, *e.g.* thorax; thoracic cage formed by ribs, vertebral column and sternum గూడు; ఉదా. ఛాతిగూడు/పంజరము: ఛాతి పక్క ఎముకలు, వెన్నుపూస, ఉరఃఫలకము – ఇవి ఈ గూడుచుట్టూ ఉంటాయి.

**caisson** a watertight chamber used to protect and transport workers during building underwater constructions, bridges, piers, *etc.* నీటి అడుగున పనిచేసే వారిని కాపాడే గది/అఱ.

**caisson disease** decompression sickness, seen in divers and miners who are suddenly/rapidly brought to the surface; and aviators who suddenly/rapidly ascend to high attitudes. This sickness is characterised by sensation of reeling and dryness, 'bends' (pains in joints, muscles, bones). సముద్రపు నీటిలో మునిగి పనిచేసేవారు, గనులలో కార్మికులు, విమానయానులు భూమి మీదకు అతిత్వరితగతిలో వచ్చినప్పుడు మరియు విమానయానులు అతిత్వరితగతిలో ఎక్కువ ఎత్తులకు వెళ్ళినప్పుడు కలిగే అస్వస్థత – తల/శరీరము తిరుగుట, శోషిల్లుట; కీళ్ళు, కండరములు, ఎముకల పోట్లు దీని లక్షణములు.

**calamine** a soothing topical application over skin, *e.g.* lotio calamine చల్లదనము కలుగజేయు ద్రవము: దీనిని చర్మముమీద ఆలేపనము చేస్తారు, ఉదా. కాలమీన్ ఆలేప(న)ము.

**calcaemia** or **calcemia** presence of calcium in blood రక్తంలో కాల్షియమ్ ఉండుట.

**calcaneal spur** a thorn like projection from calcaneum, a bone in the heel, giving rise to pain మడమ ఎముకమీద పొడుచుకువచ్చిన ముల్లు; దీనివలన మడమ వేదన, కాలు క్రిందపెట్టినప్పుడు బాధ కలుగుతాయి.

**calcaneum** calcaneus. bone in the heel మడమ అస్థి.

**calcareous** chalky సుద్దవలెనున్న (పదార్థము). 1. containing lime/calcium వెల్లవేయు సున్నముగల పదార్థము. 2. Also, lime used to smear betel leaf, which on eating imparts an aesthetic red colour to the tongue and lips. నాలుక, పెదవులు పండుటకు తమలపాకులతోపాటు వేసుకునే సున్నము. Also, these are digestants. ఇవి జీర్ణకారి పదార్థములు కూడా.

**calciferol** a compound having the activity of vitamin D విటమిన్ డి గుణము కలిగిఉన్న మిశ్రమము.

**calcific** forming lime, *e.g.* calcific lesion, commonly seen in healing in TB సున్నమును పుట్టించేది, ఉదా. సున్నపు పరిణామము చెందిన కణజాలము, తరచుగా టి.బి. వ్యాధి నయమగుట సూచిస్తుంది.

**calcification** deposition of calcium salts in a tissue, *e.g.* calcification in an old fibrotic tuberculous lesion ఖటికాకరణము: సున్నపు లవణములు కణజాలముయందు నిలువబెట్టుపడియుండుట, ఉదా. దీర్ఘకాలముగా గట్టిబడిపోయిన క్షయరుగ్ణత కణజాలములో ఈ పరిణామము కలుగుట కద్దు.

**calcinosis** abnormal deposition of calcium salts in a tissue in the form of small nodules కణజాలముయందు అధికశాతంలో సున్నపులవణములు నిలువజేయబడి ఉండుట; ఇవి చిన్నచిన్న కంతులవలె చేతికి తగులవచ్చును.

**calcium** chemical element which is the component of limestone, *e.g.* calcium in bone matrix కాల్షియమ్/ఖటికము, సున్నపురాయిలో నున్న రసాయనిక మూలపదార్థము, ఉదా. అస్థియొక్క మాత్రికలోని కాల్షియమ్.

**calculus** [calculi *pl.*] 1. an abnormal stony hard concretion containing mineral salts, *e.g.* stones in gall bladder (cholelithiasis), stone in kidney (renal calculus) శిల, రాయి: ఖనిజలవణములుగల అసాధారణమైన శిలయొక్క గట్టితనమున్న సుద్ద, ఉదా. పిత్తాశయములోని శిలలు, మూత్రపిండములోని రాయి. 2. a branch of mathematics గణితశాస్త్రంలోని ఒక శాఖ.

**calf** the fleshy part behind the upper part of the leg below the knee (కాలి) పిక్క: మోకాటి క్రింద వెనుక భాగము.

**caliper** a support ఒక ప్రాపు (ఆధారము). **Thomas walking c.** support for walking ఈ సాధనము నడవటానికి ప్రాపు.

**calix** or **calyx** a cup-shaped recess in the pelvis of the kidney మూత్రపిండములో వృక్కద్రోణియందు గిన్నెవలెనుండు గూడు.

**callosity** callus, keratoma. thickening of the keratin layer of the epidermis ఆనె.

**callous** 1. *adj.* relating to a callus or callosity. 2. **c. person,** unsympathetic, cruel person కనికరం లేనివాడు, కఠినాత్ముడు, అలంకార. ఆనెవలె కఠినత్వంగలవాడు.

**callus** 1. corn ఆనె. thickening and hardening of skin at the site of prolonged, continuous pressure/friction usually on the feet or hands కాలిమీదగాని చేతిమీదగాని పెరిగిన ఆనె; ఇది దీర్ఘకాలపు, ఎడతెగని ఒత్తడి/ఒత్తుడు/రాపిడి వలన ఉత్పన్నమవుతుంది. 2. new bone formed at the union of the fractured ends of a bone విరిగిన ఎముకల అంచుల కలయిక ప్రదేశమందు జమ అయిన నూతన ఎముక కణజాలము.

**calor** heat, sign of inflammation వేడిమి, వేడి; ఇన్ఫ్లమేషన్‌కు ఒక గుర్తు.

**calorie** a unit: a measure of the fuel or energy value of a foodstuff శక్తిప్రమాణము: ఆహారపదార్థము శరీరమునకునిచ్చు శక్తిని తెలుసుకొనే ప్రమాణము.

**calorific** 1. referring or relating to, or generating heat ఉష్ణమునకు సం., లేదా ఉష్ణము ఉత్పన్నము చేయు. 2. referring or relating to calories కేలరీలకు సం.

**calorific value** quantity of energy/heat generated, during the combustion of one unit of food, *see/చూడండి* calorie. ఆహారశక్తి కొలమానం: ఆహారపదార్థం యొక్క జ్వలనం (combustion) వలన ఉత్పన్నమయే శక్తి/వేడి.

**calvaria** or **calvarium** top of the skull కపాలము/పుర్రెయొక్క పైభాగము.

**camphor** 1. an ingredient of skin ointments; has anti-infective properties కర్పూరము: చర్మమునకు వాడు మలాములలో ఉపయోగిస్తారు. దీనికి క్రిమినిరోధక శక్తి ఉన్నది. 2. camphorated tincture of opium in cough mixtures/syrups దగ్గుమందులలో వాడేది.

**canal** a tubular structure, *e.g.* alimentary canal extending from mouth to anus కుల్య, కాలువ, నాళము, గుండ్రని గొట్టము, ఉదా. ఆహారనాళము: నోటినుంచి అసనమువరకుగలది. అన్నవాహిక మరియు అన్నాశయముతోకూడిన, ప్రేగుల సముదాయము.

**canaliculus** [canaliculi *pl.*] a small canal or channel కుల్యక A. *micro.str.* సూక్ష్మ.చూ. 1. Haversian canaliculi in bone ఎముకలో సూక్ష్మకుల్యకలు. 2. biliary canaliculi in between liver cells. Each canaliculus is 1$\mu$ or less in diameter. B. *naked eye str.* ప్రత్యక్ష.చూ. canal leading to lacrimal duct బాష్పనాళములో ప్రవేశించే కుల్య.

**cancellous bone** 1. light spongy bone tissue స్పంజి(క) వంటి ఎముక కణజాలము. 2. the lattice-like network in a bone ఎముకలోని కణజాలము అల్లిన తడకవలె అగపడును.

**cancer** 1. malignant neoplastic disease which is often fatal కేన్సర్, రాచకురుపు, పుట్టకురుపు: అతిత్వరితముగా వృద్ధిపొందే అపాయకరమైన రోగము. *e.g.* a cauliflower-like growth anywhere in the body, rapidly blazing ఉదా. శరీరంలో ఎక్కడైనా గోబిపువ్వు ఆకారంలో త్వరితగతిలో కంతి ప్రజ్వలించుట. The cancer cells spread to other parts of the body *via* blood/lymph vessels (metastases). కేన్సరు కణములు రక్తము/లింఫ్ ద్వారా శరీరమంతా పాకుతాయి, అక్కడ మళ్ళీ పిలకలు (metastases) వేస్తాయి. 2. Cancer, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**cancerous** *adj.* [Latin meaning 'crab' or 'cancerous growth'] ఎండ్రకాయ, పీత, కర్కాటము – పీత ఇసుకలో బొక్క పెట్టినట్లు శరీరాన్ని తొలిచివేస్తుంది.

**cancrum** gangrenous lesion of mouth, genitalia, *e.g.* cancrum oris, *see*/చూడండి noma. నోటిలోగాని లైంగిక అవయవములలోగాని పుట్టేకుళ్ళు, ఉదా. అస్యవ్రణము, నోటిలో కుళ్లు.

**Candida** or **Monilia** a genus of yeast-like fungi, *e.g. Candida (Monilia) albicans* ఈతకల్లు/తాటికల్లులోన ప్రవేశించిన ఫంగస్.

**candidiasis** or **candidosis** moniliasis. infection by *Candida,* chiefly of skin, mouth (thrush), respiratory tract and vagina ముఖ్యముగా చర్మము, నోరు, శ్వాసనాళికలు, యోనికి కాండిడా ద్వారా సోకు అంటురోగము.

**canine** 1. tooth between incisors and premolars; there are four such teeth ముూతి అంచు దగ్గర ఉండే కోఱపన్ను; ఇవి నాలుగు ఉన్నాయి. 2. pertaining to dog కుక్కకు సం.

**canker** mouth ulceration ఆస్యవ్రణం: నోటిలోపుండు.

**cannabis** *bot.* smoking dope, prepared from a plant *Cannabis indica* (Indian hemp) మైకంపొగ, భారత జనపమొక్కనుండి తయారు చేయుబడినది. also called marijuana, hashish, pot, spliff, bhang, shunk. 1. a narcotic drug, prepared from the leaves and flowers of the hemp plant. It causes euphoria in the beginning, later hallucinations, when smoked or swallowed. గంజాయి: జనప మొక్కనుండి తయారుచేస్తారు. ప్రథమంగా ఉల్లాసం, క్రమేణ విభ్రమము, మత్తు కలిగిస్తుంది. దీనిని పొగగా పీలుస్తారు లేదా మ్రింగుతారు. 2. addiction leads to cannabis/marijuana induced psychosis వ్యసనం మనోవిక్షిప్తికి దారితీస్తుంది. 3. heavy smoking of cannabis can cause lung cancer మిక్కుటముగా గంజాయి పొగ త్రాగుట/పీల్చుట వలన ఊపిరితిత్తుల కేన్సరు రావచ్చును.

**cannula** a tube for insertion into a vessel or cavity ప్రవేశిని, గొట్టము: ఏ నాళము/కుహరములోనైనా దూర్చే గొట్టము.

**canthus** the junction between the two eyelids కనురెప్పలు కలియుచోటు. **inner c.** లోపలి కొలికి. **outer c.** వెలుపలి కొలికి.

**cap** protective covering, *e.g.* knee cap, patella రక్షణ కప్పు, ఉదా. పెటల్లా అను ఎముక; మోకాలుకీలుకు ముంగిట ఉండే రక్షణ కప్పు/టోపి.

**capacity** 1. ability to contain భరించగలశక్తి. 2. a measure of the efficiency of an organ, *e.g.* vital capacity of lungs ఒక

అవయవముయొక్క సమర్థత/సామర్థ్యము తెలుపు కొలమానము, ఉదా. ఊపిరితిత్తుల యొక్క అవశ్యక విశాలత (vital capacity) నిర్ణయించుట.

**capillaries** microscopic vessels of $5\mu$ diameter connecting the anterioles and venules. The walls of the capillaries are semipermeable, facilitating the interchange of gases, water, salts, glucose, *etc.* between the blood and tissue fluids. రక్తకేశనాళికలు: ధమనికలను సిరికలను కలిపే అర్ధపారగమ్య/అర్ధప్రవేశ్యశీల కుడ్యములుగల సూక్ష్మనాళికలు: వీటి పరిధిలోనున్న సూక్ష్మరంధ్రముల (pores) ద్వారా రక్తమునకు కణద్రవములకుమధ్య వాయువులు, నీరు, లవణములు, గ్లూకోజు వగైరా సరుకులు దూరుతూంటాయి/ఇచ్చిపుచ్చుకొనబడుతుంటాయి.

**capitatum** the capitate bone, a bone in the wrist శీర్షాకార ఎముక: మణికట్టు ఎముకల సముదాయములోని ఒక ఎముక పేరు.

**capsule** 1. an easily swallowable bit, enclosing a dose of medicine for gulping smoothly గుళిక: మందు మెత్తగా జారి గొంతులోకి పోయే సాధన – ఇది మ్రింగటానికి వీలుగా ఉంటుంది. 2. a fibrous covering enveloping an organ, *e.g.* renal capsule అవయవము వెలుపల నారవలె ఉండు పొర.

**caput** 1. head తల. 2. expanded end of a part చెట్టుకొమ్మలు ఆకులు చెట్టుమొదలునకు తలలా కనబడేరీతిగా శరీరములోని ఏ భాగమునకైనా విస్తరించిన కొన. 3. interlaced dilated veins around the umbilicus, a sign in cirrhosis of liver, *viz.* caput medusae లివర్ జబ్బులో నాభిచుట్టూ ఉబ్బిన సిరలు అల్లికవేసినట్లు కనపడుతాయి.

**carbohydrates** energy-giving, heat-producing substances such as sugars, starches, celluloses and gums పిండిపదార్థములు, తీపి వస్తువులు, గంజిపదార్థములు, క్రనార, బంక/జిగురు – ఇవి శరీరమునకు కావలసిన శక్తినిచ్చి, జీవిలో ఉష్ణమును ఉత్పాదిస్తాయి.

**carbolic acid** phenol, a coal tar derivative used as an antiseptic and disinfectant కోల్ టార్ నుంచి తయారుచేయబడినది: దీనిని కుళ్ళుకు శత్రువుగాను, సూక్ష్మక్రిమిఘ్నిగాను వాడుతారు.

**carbondioxide** $CO_2$ formed in tissues and eliminated through expiration by lungs కార్బన్ డైఆక్సైడ్: బొగ్గుపులుసువాయువు కణజాలములలో తయారై నిశ్వాసముద్వారా ఊపిరితిత్తులనుండి బహిష్కరింపబడుతుంది.

**carbonic acid** $H_2CO_3$, an aqueous solution of carbondioxide కార్బానిక్ ఆమ్లము: బొగ్గుపులుసువాయువు నీళ్లలో కలిసినప్పుడు ఆవిర్భవించే ఆమ్లము.

**carbonic anhydrase** an enzyme ఫేనకద్రవ్యము, ఉత్ప్రేరకము.

**carbuncle** a cluster of boils over the skin, usually occurs in diabetes mellitus రాచపుండు, కురుపుల సమూహము: ఇది మధుమేహం వ్యాధిలో సంభవిస్తుంది.

**carcinogen** carcinogenic: that which produces cancer, *e.g.* coal tar products, automobile exhausts, hydrocarbons కేన్సరుకు కారణము, పుట్టకురుపు కలుగజేసే పదార్థము, ఉదా. ఉత్పాదితములు: తారు/డాంబరు నుండి వచ్చినవి, వాహనాలనుండి వచ్చే విషవాయువులు, హైడ్రోకార్బన్లు.

**carcinoid** a tumour usually arising in gastro-intestinal tract or bronchus అన్నవాహిక, ప్రేగుల మార్గములోగాని శ్వాసనాళములోగాని ఉత్పన్నమయ్యే కంతి.

**carcinoma** a malignant new growth (neoplasm, cancer) arising from epithelial structures ఉపకళ కణములనుంచి పుట్టిన అపాయకరమైన కంతి, ఉదా. ఒకరకమైన పుట్టకురుపు.

**cardamom** *bot.* 'queen of spices', a kind of aromatic seed, a spice, *e.g.* used in the preparation of *biryani*, a spicy food ఏలకికాయ (వాసన/సుగంధ ద్రవ్యము) ఉదా. బిరియానిలో వాడ్తారు. It has carminative and digestant properties వాయుహరణ గుణం కలది మరియు జీర్ణకారి. [*q.v.* black pepper, the 'king of spices'].

**cardia** 1. the cardiac opening between the oesophagus and upper portion of the stomach జీర్ణాశయ ప్రవేశద్వారము: అన్నవాహిక జఠరముయొక్క ఉపరిభాగములోనికి కలిసే సందు/రంధ్రము. 2. the cardiac portion of the stomach/oesophagogastric junction అన్నవాహిక జఠరము కలయిక ప్రదేశము.

**cardiac** 1. pertaining to the heart గుండెకు సం. 2. pertaining to the cardia అన్నవాహిక జఠరము కలయిక ప్రదేశమునకు సం.

**cardiac arrest** heart standstill. stopping of the heartbeat which may cause death unless emergency treatment is given గుండె కొట్టుకొనటం/గుండె ఆడటం యొక్క నిలుపుదల; గుండె స్తంభించిపోవుట – తత్క్షణమే అత్యవసర చికిత్స చేయకపోతే ప్రాణానికి ముప్పు తప్పదు.

**cardiac catheter** a tubed device to enter the chambers of the heart *via* a blood vessel ఒక రక్తనాళము ద్వారా గుండె కుహరములలోనికి పోవు గొట్టపు సాధనము.

**cardiac failure** heart failure, one type/end result of heart disease గుండె సోలిపోవుట – హృద్రోగము/గుండెజబ్బుయొక్క అంతిమ పరిణామము.

**cardiac massage** rhythmic stimulation of the heart by manual thumps over the precordium to revive heartbeat in case of cardiac arrest, *see/చూడండి* resuscitation. ఆగిపోయిన గుండెను మరల ఆడించుటకై గుండెమీద చేతులుపెట్టి తట్టుట.

**cardiac muscle** *see/చూడండి* muscle.

**cardiac neurosis** imagination of existence of heart disease in one's own body తనకు గుండెజబ్బు ఉన్నదని భ్రమ/భ్రాంతి.

**cardialgia** cardiodynia, pain in the cardiac region గుండె ప్రాంతంలో బాధ. 1. pain/ache in the heart హృదయ ప్రాంగణములో నొప్పి. 2. pain/ache due to oesophagogastritis – this is colloquially referred to as heartburn/acidity అన్నవాహిక జఠరసంధియొక్క 'నొప్పి వేడి మంట వాపు'. గుండెమంట, అమ్లపిత్తము – దీనిని సామాన్యసంభాషణలో 'ఎదకాలుట' అని అంటూ ఉంటారు.

**cardiogram** short form of electrocardiogram, *see/చూడండి* ECG. గుండె కొట్టుకొను విధమును చూపే గ్రాఫ్.

**cardiologist** specialist in heart diseases గుండెజబ్బుల చికిత్స నిపుణుడు, హృద్రోగశాస్త్ర ప్రవీణుడు.

**cardiology** study of heart and its diseases గుండె మరియు హృద్రోగముల శాస్త్రము.

**cardiomegaly** increase in the size (hypertrophy) of the heart గుండె యొక్క పరిమాణము పెరుగుట. దీని పర్యవసానం: అతివృద్ధి అనావృద్ధి.

**cardiomyopathy** disease of the myocardium, the cause of which is unknown హృదయజనిత రోగము: కారణం తెలియని గుండెకండరాల జబ్బు/రుగ్మత.

**cardiophobia** fear of heart disease హృద్రోగభయము.

**cardiopulmonary resuscitation** *see/చూడండి* resuscitation.

**cardiospasm** failure of oesophagogastric sphincter to relax which results in difficulty in swallowing అన్నవాహికజఠరసంధి తెరచుకొన లేకపోవుట; దీనివలన మ్రింగుట కష్టమవుతుంది.

**cardiovascular disease** disease of heart and blood vessels గుండె మరియు రక్తనాళముల జబ్బు.

**carditis** myocarditis; inflammation of the heart గుండె యొక్క శోథము/వాపు.

**caries** decay పుప్పి/క్షయము/క్షీణించుట. 1. dental caries wherein a hole forms in the tooth consequent on decay పుప్పిపన్ను – పన్నులో (పంటిలో) బొక్కపడుట; పన్ను పుచ్చింది అనికూడా అంటారు. 2. destruction of bone, *e.g.* spinal caries wherein there is destruction of vertebrae, a common cause is tuberculosis ఎముక పుప్పి చెందుట, ఉదా. వెన్నెముకలోని ఎముకలు క్షయము చెందుట; దీనికి క్షయ (టి.బి.) ఒక తరచు కారణము.

**carina** ridge at the division of windpipe (trachea) into the right and left bronchi. This is a sight/site to see through the bronchoscope వాయునాళము మెడ దిగువన పంగలకర్ర ⋏ లా రెండుగా అనగా కుడి మరియు ఎడమ శ్వాసనాళములు (bronchi) గా విభజింపబడుతుంది. ఈ విభజన దగ్గర కోణ ఉబుకును కెరీనా (carina) అంటారు. ఇది శ్వాసనాళ అంతర్దర్శిని (bronchoscope) లో కనువిందుగా కనపడుతుంది.

**carious** 1. relating to caries కేరీస్‌కు సం. 2. affected with caries క్షయించిన, క్షీణించిన.

**carminative** an agent to relieve flatulence, *e.g.* ginger, peppermint. Carminative mixture was very popular in the older apothecary. కడుపులో వాయు హరణము, జీర్ణము కొరకు మందు, ఉదా. శొంఠి, మిరియాలు. పూర్వం వాయుహరమైన ఔషధమిశ్రమం ప్రసిద్ధిలో ఉండెను. మరియొక ఉదా. అల్లం మురబ్బా.

**carotene** a pigment found in carrots, leafy vegetables, fruits. It is converted into vitamin A in the body. కారొటిన్, ఆకుకూరలు, పండ్లలోనున్న రంగు పదార్థము. శరీరములో ఇది విటమిన్ ఎ గా మారుతుంది.

**carotid arteries** principal arteries on both sides of the neck మెడగుండా పోయెడి పెద్ద ధమనులు, గళ ధమనులు, గ్రీవ ధమనులు.

**carpal** pertaining to carpus, *i.e.* wrist మణిబంధిక, మణికట్టుకు సం.

**carpal tunnel** situated underneath the carpal ligament through which the median nerve and flexor tendons pass కార్పల్ స్నాయువు క్రింద త్రోవ. ఇది మణికట్టు ఎదర/ముందు ఉంటుంది. దీనిలోనుంచి మీడియన్ నాడి, కండరబంధనములు చేతిలోకి పోతాయి. **c.t. syndrome,** entrapment neuropathy of the median nerve as it crosses underneath, due to pressure by the ligament లక్షణసంపుటి: బంధకము అడుగున చిక్కుకొనిన మీడియన్ నాడిమీద ఒత్తిడి.

**carphologia** or **carphology** floccillation. aimless plucking of bed clothes and pillows, as if one were picking cotton fibres, seen in delirium, *e.g.* typhoid fever సంధి ప్రేలాపన, ఉదా. సన్నిపాత జ్వరంలో విలక్ష్యముగా, తనకు తెలియకుండా పక్కబట్టలను దిండ్లను దారాలు పీకినట్లు పీకుట.

**carpus** wrist comprising eight bones మణిబంధము, మణిబంధాస్థి, అష్టాస్థి, ఎనిమిది ఎముకలుగల కీలు.

**carrier** a person who harbours disease-producing germs without manifest disease, thus distributing infection to others, *e.g.* typhoid bacilli carrier వాహకము: తను రుగ్మతతో బాధపడకుండా తనలో

సూక్ష్మక్రిములకు ఆశ్రయమిచ్చి వాటిని భరించుతున్న వ్యక్తి; తత్ఫలితంగా ఆ క్రిములను ఇంకొకరికి అంటపెడుతూ ఉంటాడు.

**carrying angle** the angle at which the humerus and radius articulate with each other at the elbow joint భుజాస్థి మరియు రత్ని మోచేతి కీలువద్ద ఆడుతున్నప్పుడు ఏర్పడే కోణం. *observation:* this is less in females (about 167°) when compared to males (about 173°) *గమనిక:* ఇది పురుషులలోకన్నా స్త్రీలలో తక్కువగా ఉంటుంది. *నిత్యానుభవం:* అతివలు నడుస్తున్నప్పుడు చూస్తుంటాం.

**car sickness** *see/చూడండి* travel sickness.

**cartilage** a specialised connective tissue – hyaline, fibrocartilage and elastic cartilage. It is rubbery and cushion-like and thus protects ends of bones. మృదులాస్థి, ఉపాస్థి: విశేషమైన ఆధారపు కణజాలము – మూడు రకములు. రబ్బరువలె, ఒత్తిడి భరించే దిండ్లవలె ఎముకల అంచులకు అమర్చబడి ఉంటాయి.

**caruncle** a small fleshy eminence మాంసాంకురము: చిన్న మాంసపు ఉబ్బు. 1. relics of torn hymen around the vaginal opening యోనిపైపొర చినిగిన గుర్తులు. 2. fleshy mass at the medial angle of the eye కన్నులోపలి కొలికి దగ్గర ఉబ్బు. 3. protuberance near the frenulum of the tongue నాలుక పైకెత్తితే అడుగున పరదా (frenulum) దగ్గర ఉబ్బు. 4. projection over the urinary meatus in women స్త్రీలలో మూత్రద్వార అంచు పైన ఉబ్బు.

**cascade** step like complex series of reactions (as in a physio logical process), *e.g.* **coagulation/clotting c.** సోపానపటము: అంచెలుగా సంక్లిష్ట ప్రక్రియలు (శరీర ధర్మశాస్త్ర రీత్యా), ఉదా. స్కందనప్రక్రియలో సోపాన అంచెలు.

**case** patient, sufferer రోగి, వ్యాధిగ్రస్తుడు, రోగపీడితుడు. *see/చూడండి* client.

**caseation** necrosis with cheese-like debris characteristic of tuberculous process/involvement కణజాలము క్షీణించి జున్నువంటి పదార్థముగా మార్పుచెందుట – క్షయవ్యాధి లక్షణము.

**casein** *syn.* caseinogen. protein in the milk క్షీరములోని ప్రోటీన్.

**cast** mold of a hollow structure సూక్ష్మనాళముయొక్క పోత/అచ్చు.
1. cast of renal tubule మూత్రగ్రంథిలో సూక్ష్మనాళముయొక్క పోత.
2. cast of bronchiole సూక్ష్మ శ్వాసనాళికయొక్క అచ్చు.

**castor oil** viscid oil జిగటునూనె, ఆముదము. 1. purgative విరేచనకారి. 2. lubricant జారునట్లు చేయు ద్రవము.

**castration** removal of the gonads, *i.e.* testicles or ovaries పుంస్త్వనాశము, జననవిరోధము, సంతానోత్పత్తి చేయు అవయవములు అనగా వృషణములు లేదా స్త్రీబీజాశయములు/స్త్రీబీజకోశములు తీసివేయుట.

**casualty** 1. accident ప్రమాదము. 2. department in a general hospital ఆసుపత్రిలో ఆపద/ప్రమాద భూయిష్ఠవ్యాధుల చికిత్స విభాగము.

**catabolism** the breaking down of complex compounds into simpler ones thereby releasing energy అపచయం, విచ్ఛిన్నక్రియ: జీవసంక్లిష్ట పదార్థములు విచ్ఛిన్నమయ్యే ప్రక్రియ. దీనిద్వారా విడుదల అయ్యేశక్తి జీవనచర్యలకు ఉపయోగబడుతుంది.

**catalase** an enzyme, ఒక ఎన్‌జైమ్, ఉత్ప్రేరకము.

**catalepsy** a state of waxy rigidity of muscles. It occurs in mental disorders and under hypnosis. కండరముల బిగువు. ఇదికొన్ని మానసిక రుగ్మతలలోను, సమ్మోహనావస్థలోను సంభవిస్తుంది.

**catamenia** menses, menstruation బహిష్టు, ఋతుస్రావము, ముట్టు.

**cataplasm** poultice. a soft magma or mush applied hot over a surface, to act as an emollient, soothing, counter-irritating agent పిండికట్టు, లేపనము: ఉడకబెట్టిన పిండి చర్మం/తలంమీద ధరించే వేడితో ఉంచుట. దీనివలన మార్దవకరమైన, ఉపశమనకరమైన, ప్రతిరేపెడు శాంతి కలుగుతుంది క్షతమునకు.

**catapiexy** muscular weakness due to emotions చిత్తక్షోభములో కలుగు కండరముల నిస్సత్తువ/బలహీనత.

**cataract** opacity of the lens in the eye; want of transparency of the lens which gives rise to dimness of vision, *e.g.* senile cataract కంటిపొర శుక్లము: కన్నులోని కటకములో పారదర్శకగుణము

తగ్గిపోవుట; కంటిలోని పొర అంటారు కొంతమంది. దీనివలన చూపు మందగిస్తుంది, ఉదా. వృద్ధాప్యములో వచ్చు శుక్లము.

**catarrh** inflammation of a mucuous membrane, e.g. coryza శ్లేష్మపొరకు 'నొప్పి వేడి ఎరుపు వాపు', ఉదా. జలుబు, పడిశము.

**catatonia** stiff posture usually assumed by a patient suffering from schizophrenia, a mental disorder షిజొఫ్రీనియా అను మానసికరోగము కలవాడు తాల్చు బిర్రయిన అంగవిన్యాసము.

**catecholamine** sympathomimetic amines, e.g. dopamine, epinephrine (adrenaline), norepinephrine (noradrenaline) అనుకంపిక మజ్జాతంతువులను ఉద్రేకపరచు మందులు.

**catgut** an absorbable collagen strand from the intestine of a mammal, well sterilised, used in surgery జంతువుల ప్రేగులనుండి తీసిన నారలాంటి దారము. దీనిని సూక్ష్మక్రిమినాశక ప్రక్రియకు గురిచేస్తారు. శస్త్రచికిత్సలో వాడుతారు. ఇది కణజాలములలో కలిసి జీర్ణమైపోతుంది.

**catharsis** purging/purgation విరేచనమగుట, పుష్కల పురీషం.

**cathartic** purgative విరేచనకారి, బేదిమందు.

**catheter** flexible tube inserted in a cavity కుహరప్రవేశిని: శరీరములో ఏ కుహరములోనైనా దోపుటకు వంపుతిరిగే గొట్టము.

**catheterization** procedure of passing a tube (catheter) గొట్టపు పరికరము దూర్చే పద్ధతి. **cardiac c.**, catheter passed into a heart chamber or a big vessel connected to the heart గుండె కుహరములోనికిగాని, గుండెతో కలిసిన పెద్ద రక్తనాళములోనికిగాని గొట్టమును పంపే ప్రక్రియ.

**cation** a positively charged ion ధనావేశిత అయాన్, పాజిటివ్ ఛార్జిగల అయాన్ [*Cf.* anion *తారత.* ఋణావేశిత అయాన్].

**CAT scanner** *abbr.* computer assisted tomography or computed axial tomography in the department of Radiology ఎక్స్‌రే విభాగములో ఒక పరీక్ష: సి.టి. స్కాను.

**cauda** tail like structure, resembling horse-tail, *e.g.* cauda equina, bunch of spinal roots at the lower end of the spinal cord

పుచ్ఛీయము: తోకవంటి ఆకారముగల నిర్మాణము, ఉదా. కాడా-ఈక్వైనా: గుర్రపుతోకనుపోలిన, వెన్నుపాము క్రిందభాగమున ఉన్న నాడుల గుత్తి.

**caudal** pertaining to a cauda పుచ్ఛీయ, పుచ్ఛ: కాడాకు సం.

**caul** a piece of amnion capping the baby's head at birth పుట్టుక సమయంలో శిశువు శిరస్సుమీద కనబడు ఉల్బపొర. పోలిక: టోపి. అపరాయువు టోపి.

**causalgia** burning pain due to nerve injury మండే నొప్పి: నాడికి కలిగిన దెబ్బ వలన కలుగు మంట.

**caustic** burning, irritating; corrosive, *e.g.* caustic potash, caustic soda రేపెడు మంట; కొరుకువేయునట్టి, ఉదా. దాహక పొటాష్, దాహకసోడా.

**cauterization** procedure to burn a tissue దహనీకరణము: కణజాలమును దగ్ధముచేసే ప్రక్రియ. **chemical c.** రసాయనిక దహనీకరణం. **electrical c.** విద్యుత్ దహనీకరణం (విద్యుద్దహనీకరణం).

**cautery** instrument to burn a tissue కణజాలమును దగ్ధముచేసే సాధన.

**cavernous** containing hollow spaces బోలు/గుల్లగానున్న తొర్రలు గల. **c. sinus,** in the brain మెదడులో కోటరము.

**cavity** 1. potential/real space in the body or in an organ, *e.g.* abdominal, uterine, oral cavity ఉదర, గర్భాశయ, ఆస్యకుహరము. 2. a vacant space in the lung in tuberculosis క్షయవ్యాధిలో ఊపిరితిత్తిలో శూన్యప్రదేశము. 3. a hole in the tooth in caries పుప్పిపన్ను – ఈ పంటిలో రంధ్రము. 4. tympanic cavity, middle ear మధ్యచెవి.

**CCU** *abbr.* critical care unit in a hospital ఆసుపత్రిలో అపాయకర/ఉపద్రవ రుగ్మతల పర్యవేక్షణ విభాగం.

**cell** A. the basic structural unit of all living organisms జీవాణువు, జీవకణం: జీవులలోని మూలమైన నిర్మాణాత్మకమైన అంశము. *micro. str.* సూక్ష్మ.చూ. unit of life, protoplasmic mass with a nucleus surrounded by cytoplasm కణము, జీవకణము, కోశికము, జీవన అంశము, జీవపదార్థపు ముద్ద. కణములో కేంద్రకము, దానిచుట్టూ

కణపదార్థము ఉంటాయి. **bone c.** అస్థికణం. **brain c.** మెదడు కణం. **fat c.** కొవ్వు కణం. **germ c.** బీజకణం. **giant c.** బృహత్ కణం. **liver c.** కాలేయకణం. **nerve c.** నాడీకణం. **red blood c.** ఎర్రరక్తకణం. **sickle c.**, red blood cell shaped like a sickle కొడవలి ఆకారములో ఉన్న ఎర్రరక్తకణం. **white blood c.** తెల్లరక్తకణం. B. *naked eye str.* ప్రత్యక్షచూ. 1. collection of cells constitute an organ కణముల సముదాయమును అవయవము అంటారు. 2. study cell చదువుకొరకు వినియోగించే గది/కక్ష్య.

**cellular metabolism** metabolism in a cell కణ జీవ(న)క్రియ.

**cellular tissue** loose connective tissue బోలుగా ఉన్న ఆధారపు కణజాలము.

**cellulitis** inflammation of connective tissue ఆధారపు కణజాలములో శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**cellulose** polysaccharide found in most plant structures సెల్యులోస్: వృక్షములలోనుండు కర్రనార.

**cement** filling material used in dentistry దంతవైద్య చికిత్సలో పండ్ల/పళ్ళ రంధ్రములలో నింపు పదార్థము.

**centigrade** *abbr.* C. Celsius scale, *e.g.* centigrade thermometer. Normal temperature of the body is 36.9° C. సెల్సియస్ కొలమానము, ఉదా. కొలత గీతలు పెట్టబడియున్న జ్వరముచూసే గొట్టము. ఆరోగ్యమైన జీవిలో ఉష్ణత 36.9° C..

**central nervous system** consists of brain and spinal cord కేంద్రనాడీ వ్యవస్థ – మెదడు మరియు వెన్నుపాము.

**central sulcus** *anat.* furrow between the frontal and parietal lobes of the cerebral hemisphere శరీరనిర్మాణశాస్త్రమురీత్యా కేంద్ర ఖనితము: లలాట లంబికనుంచి పార్శ్వలంబికను వేరుచేసే మస్తిష్క వల్కలంలోని గాడి.

**centre** or **center** place of activity కేంద్రం. **child welfare c.** శిశుసంక్షేమ కేంద్రం. **health c.** ఆరోగ్యకేంద్రం. **maternity c.** ప్రసూతి కేంద్రం. **primary health c.** ప్రాథమిక ఆరోగ్య కేంద్రం. **rural health c.** గ్రామీణ ఆరోగ్య కేంద్రం.

**centrifugal** away from centre కేంద్రాపసారక, కేంద్రపరాఙ్ముఖీ. **c. force** అపకేంద్ర శక్తి. **c. pump** అపకేంద్ర పంపు.

**centrifugation** the procedure to centrifuge కేంద్ర పరాఙ్ముఖీకరణం.

**centrifuge** machine separating the lighter portion from heavier portion, *e.g.* milk and cream అపకేంద్రణ యంత్రము, ఉదా. పాలను క్రిందకు చేర్చి మీగడను పైకి తేల్చునట్టి పనిముట్టు.

**centripetal** towards the centre కేంద్రాభిసరణ, అభికేంద్ర, కేంద్రోన్ముఖీ.

**cephalalgia** headache తలనొప్పి.

**cephalic** 1. pertaining to the head శిరస్థ, తలకు సం., శీర్ష సం. 2. head end of the body తలవైపు. **c. presentation,** the sight of the fetal head in the birth canal జననకుల్యలో భ్రూణశీర్షము/శిశువుతలయొక్క దర్శనము.

**cephalography** cephalology: a treatise on the head కపాల శాస్త్రం: కపాల ప్రబంధము.

**cephalohaematoma** or **cephalohematoma** cephalhaematoma, cephalhematoma. haematoma on the scalp seen in babies, especially in those delivered after prolonged labour కపాలచర్మం క్రింద రక్తం జమ అగుట, ముఖ్యంగా దీర్ఘకాల ప్రసవంలో.

**cephalometry** measurement of the size of the head తల కొలత నమోదు చేయుట.

**cephalopelvimetry see**/చూడండి pelvimetry.

**cephalotripsy** crushing of the fetal head in dystocia భ్రూణకపాల విచ్ఛిన్న శస్త్రప్రక్రియ.

**cerebellum** hindbrain అనుమస్తిష్కము, చిన్నమెదడు: పుర్రె వెనుక భాగములోనున్న మెదడు.

**cerebral** pertaining to the cerebrum, *e.g.* cerebral haemorrhage మస్తిష్క: సెరిబ్రమ్‌కు సం., ఉదా. మెదడులో రక్తస్రావము/రక్తనాళములు పగులుట. **c. cortex,** grey matter మస్తిష్క వల్కలము, మస్తిష్కాన్ని కప్పివేసే బూడిదరంగు పదార్థము.

**cerebral palsy** palsy ▿ partial paralysis. defect of motor power and coordination due to damage to the brain పాక్షిక పక్షవాతం:

మెదడుయొక్క చెఱుపువలన కలిగే చాలకదోషము మరియు సమానాధికార లోపము సంభవించుట.

**cerebration** activity of the brain మెదడు చురుకుదనము.

**cerebrospinal fluid** *abbr.* CSF. a secretion which surrounds the brain and spinal cord; acts as a shock absorber. Lumbar puncture is a procedure by which this fluid can be tapped with a needle inserted between the lumbar vertebrae, *see/చూడండి* meninges. మస్తిష్క మేరుద్రవము: మెదడు మరియు వెన్నుపామును ఆవరించియుండే స్రావము; అదరు తగ్గించే గుణము కలది. నడుము భాగం వెన్నెముకలమధ్య సూదిగ్రుచ్చి ఈ ద్రవమును కారునట్లు చేస్తారు.

**cerebrum** main part of the brain in the upper region in the skull, divided into two hemispheres మస్తిష్కము, పెద్దమెదడు: కపాలములో ఉపరిభాగములోనున్న ముఖ్యమెదడు – ఇది రెండు అర్ధగోళములుగా విభజింపబడి యుండును.

**cerumen** wax in the ear చెవిలో గులివి/జీవిలి/గులిమి/గుబిలి.

**cervical** 1. pertaining to the neck గ్రీవా, మెడకు సం. 2. pertaining to the cervix, the opening of uterus గర్భాశయము యొక్క ద్వారమునకు సం.

**cervical smear** obtaining a smear from the cervix of the uterus, to detect early malignancy (cancer), *see/చూడండి* smear. స్త్రీజననేంద్రియ మార్గములో కేన్సరు ప్రథమ దశలో కనుక్కొనటానికి ఉపాయము.

**cervicitis** inflammation of the cervix uteri గర్భాశయగ్రీవము/కంఠము/ద్వారముయొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**cervix** *syn.* cervix uteri. the region of exit from the uterus గర్భాశయగ్రీవము, గర్భాశయము యొక్క బహిర్గమనము/ద్వారము.

**cesarean section** *see/చూడండి* Caesarean section.

**Cesarian section** *see/చూడండి* Caesarean section.

**cestode** tapeworm నాడా/నవారు పురుగు/పాము.

**chafe** to cause irritation of skin by friction చర్మంమీద రాపిడివలన రేపటం కలుగజేయుట.

**chalazion** tarsal cyst due to inflammation of a Meibomian gland in the eyelid కనురెప్పలో ఉండే గ్రంథియొక్క తిత్తిలో 'నొప్పి వేడి మంట వాపు'.

**chamber** an enclosed space కక్ష్య, ఆవరణము. in the eye కన్నులోని ఆవరణములు: **anterior c.** పూర్వాంత కక్ష్య. **posterior c.** పరాంత కక్ష్య. **vitreous c.** కాచవత్ కక్ష్య.

**chancre** the primary sore in syphilis సుఖవ్యాధి కురుపు: కొరుకు సవాయి రోగము ప్రథమ దశలో వచ్చే పొక్కు/పుండు. అలంకార. ఫిరంగిరోగం (syphilis)లో ఫిరంగి మీద పొక్కు.

**chancroid** a sexually transmitted disease లైంగిక స్పర్శనముద్వారా సంభవించు రోగము. అలంకార. స్వయంకృతాపరాధం.

**change of life** climacteric in the female, menopause స్త్రీ జీవితంలో ముట్లుడుగు ఘట్టము.

**chap** red roughened skin due to rubbing, scratching రేపటం, గోకటంవలన చర్మంమీద పగుళ్ళు, చీటలు.

**CHD** *abbr.* coronary heart disease గుండె కండరమునకు రక్తము సరఫరాచేయు నాళముల రుగ్మత.

**check-up** పరీక్ష **health c.** ఆరోగ్యపరీక్ష . **medical c.** డాక్టరుచే పరీక్ష

**cheek** చెంప, బుగ్గ **c.bone**, maxilla జంభిక.

**cheilitis** or **chilitis** inflammation of lips పెదిమల యొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**cheiloplasty** or **chiloplasty** plastic surgical repair of the lips పెదవుల (స్వ)రూపకల్పన.

**cheilosis** or **chilosis** fissuring and dryness of lips and angles of the mouth పెదిమలు మరియు నోరు అంచులవద్ద పగుళ్ళు, తడిలేకపోవుట.

**cheiropompholyx** or **chiropompholyx** pompholyx on the hands and fingers, *see/చూడండి* pompholyx [*Cf.* podopompholyx].

**chemical burns** burns caused by acids, alkalies or chemicals ఆమ్లములు, క్షారములు, రసాయనముల వలన కలిగిన కాల్పులు.

**chemist** 1. a pharmacist ఔషధాలు తయారు చేసేవాడు. 2. a shop selling medicines మందులు అమ్మే షాపు.

**chemoreceptors** those receptors stimulated by change in the chemical composition of the environment, say, pH, *e.g.* receptors for taste and smell, visceral receptors రసాయన గ్రాహకాలు.

**chemosis** swelling/oedema of the conjunctiva of the eye తెల్లగుడ్డు (కన్ను) పైనున్న పొర యొక్క వాపు.

**chemosurgery** application of cauterizing chemicals like zinc chloride, as a means to removal of diseased tissue వ్యాధిగ్రస్త కణజాలములను రసాయనిక దహనీకరణం చేయుట.

**chemotaxis** chemotropism; attraction. Cells are attracted by acids, alkalies or other bodies. కణములు, ఆమ్లములు, క్షారములు లేక ఇతర వాటిచే ఆకర్షింపబడుట. **positive c.**, attraction పాజిటివ్: ఆకర్షణ. **negative c.**, repelling నెగెటివ్: తిరగగొట్టబడుట.

**chemotherapy** treatment of diseases by chemical agents రసాయనిక చికిత్స; రసాయన మందువస్తువులతో వ్యాధుల చికిత్స.

**chest** 1. the thorax ఛాతి, రొమ్ము. **c. wall**, wall of the thorax ఛాతి గోడ. *figur.* altar-like anterior chest wall in a female అలంకార. కుచవేదిక. **barrel-shaped c.**, seen in emphysema ఎమ్ఫిసీమా అను జబ్బులో పీపా ఆకారంలో ఉండే ఛాతి. **pigeon c.** కపోతవక్షం, పావురపు ఉరము. 2. CHEST, an American journal of medicine అమెరికన్ వైద్యవార్తాపత్రిక.

**chickenpox** varicella, a contagious disease caused by a virus characterized by vesicular eruptions on the skin ఆటలమ్మజాడ్యం, అతి సూక్ష్మక్రిమి (virus) వలన సంభవించు అంటురోగము. చర్మముమీద పొక్కులు కానవస్తాయి.

**chigger** bite of a mite తప్పుటిప్పురుగు కుట్టుటవలన కలిగిన దురద, చర్మము వాపు.

**chilblains** painful erythema (reddening of the skin) of fingers and toes caused by frost bite హిమస్పర్శజనిత అంగుళీశోథము: మంచుగడ్డ తాకుటవలన కలిగేవి – ఎర్రగా కంది, వాచి, నొప్పికి గురియైన చేతివేళ్ళు, కాలివేళ్ళు.

**child** a boy or girl between birth and physical maturity జననంనుండి శరీర/శారీరక పరిణత – ఈ పరిమితిలోనున్న బాలుడు, బాలిక. By tradition, paediatricians claim children aged 1 to 14 as their property. సాంప్రదాయ బాల్యవైద్య నిపుణత దృష్ట్యా 1 నుండి 14 సంవత్సరముల వయస్సుగల బాలబాలికలు వారిసొత్తు. *Note.* A tiny tot is a valuable possession. *గమనిక:* పాపసంబరం అమూల్యం/వెలకట్టలేం. **c. abuse** బిడ్డమీద లైంగిక దురాచారం. **c. bearing,** pregnancy and parturition గర్భం, కాన్పు దశలు. **c. birth,** baby-birth శిశుజన్మ. **c.welfare** శిశు సంక్షేమము. handicapped children అవిటి బిడ్డలు, అంగవైకల్యం పొందిన పిన్నలు, వికలాంగులు.

**childish behaviour** silly, immature foolish behaviour పరిపక్వతా జ్ఞానంలేని మూఢప్రవర్తన.

**chilitis** *see/చూడండి* cheilitis.

**chill** shivering of the body with coldness చలితో వణకుట.

**chilosis** *see/చూడండి* cheilosis.

**chin** the mentum గడ్డము, చుబుకము.

**chiropodist** podiatrist, one who takes care of the foot పాదచికిత్సా నిపుణుడు: పాదముయొక్క పోషణ చూచువాడు, అలంకార. పాదానికి, పునాదికి ఉన్నంత బలం ఉండాలి.

**chiropody** podiatry, pedicure, care of the feet పాదముయొక్క పోషణము. In diabetes, this is essential. మధుమేహంలో పాదరక్షణము ప్రాణరక్ష

**chiropompholyx** *see/చూడండి* cheiropompholyx.

**chloasma** melasma; brown pigmented patches (macules) on cheeks, forehead, often associated with pregnancy బుగ్గలు, నుదురు మీద గోధుమవర్ణముగల మచ్చలు – ఇవి ఎక్కువగా గర్భిణి స్త్రీలలో అగపడుతవి.

**chlorinate** 1. to treat/sterilize water with chlorine; the procedure is called chlorination క్లోరినీకరణం: తాగేనీటిని (పరి)శుభ్రపరచుట. 2. In actual practice bleaching powder is added నీటి సరఫరా శాఖవారు బ్లీచింగ్ పౌడర్‌ను కలుపుతారు.

**chlorine** greenish yellow irritating gaseous element. powerful germicide రేపటం కలిగించే పసుపు-ఆకుపచ్చ వాయు మూల పదార్థం. శక్తివంతమైన క్రిమినాశిని.

**chloroform** a liquid used to make people unconscious – an old method of anaesthesia క్లోరోఫారం: మత్తుమందు – పురాతనపు వాడుక/వైద్యం.

**chloroma** malignant green coloured tumour in leukemia (blood cancer) ప్రాణాపాయమైన రక్తకణముల కాన్సరులో ఆకుపచ్చరంగుగల కంతి.

**chlorophyll** *bot.* green pigment in plants that absorbs light energy from the sun during photosynthesis, *see/చూడండి* photosynthesis. పత్రహరితము: కిరణజన్య సంయోగక్రియ (photosynthesis)లో పాల్గొం టుంది.

**chlorosis** a form of chronic hypochromic microcytic (iron deficiency) anaemia ఒక రకమైన దీర్ఘకాలపు లఘువర్ణ, లఘుకణ (ఇనుపలవణ లోపంవలన) రక్తహీనత.

**choked** 1. strangled శ్వాస అడకుండా గొంతుపిసికిన స్థితి. 2. **c. disc** in the retina, seen in/by ophthalmoscope నేత్రాంతర్దర్శినిలో/తో చూసే రెటీనాలో ఉబ్బిన గుండ్రని బిళ్ళ.

**cholagogue** an agent that stimulates the gall bladder to contract and release bile పిత్తరేచకము: పిత్తాశయమును ముడుచుకొనునట్లు చేసి పైత్యరసమును వదిలే వస్తువు.

**cholangitis** inflammation of the bile duct పిత్తవాహిని శోథము: పైత్యరసనాళము యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**cholecystectomy** operation involving the removal of gall bladder శస్త్రచికిత్సచేసి పిత్తాశయమును తీసివేయుట.

**cholecystitis** inflammation of the gall bladder పిత్తాశయముయొక్క శోథము/'నొప్పి వేడి మంట పోటు వాపు'.

**cholecystogram** X-ray photograph of the gall bladder after the administration of a drug పిత్తాశయచిత్రణము: ఒక ప్రత్యేక మందు సేవించిన తర్వాత పిత్తాశయమునకు ఎక్స్‌రే తీయుట.

**cholelithiasis** presence of gall stones పిత్తాశయములోని రాళ్ళు: పైత్యరసమునుండి తయారైన శిలలు ఉండుట.

**cholemia** presence of bile or bile pigment in the blood పైత్యరసము గాని పైత్యరసము రంగు పదార్థముగాని రక్తములోనికి ప్రవేశించుట.

**cholera** an infectious disease marked by severe diarrhoea, vomiting, fluid loss and prostration ప్రాణహాని కలిగించు అతిసారము, వాంతులు, శరీరములోని ద్రవములు బహిష్కరింపబడి కణజాలముల తడి తగ్గుట, కండరముల పట్టు/బిగువు సడలుట, కండరములు సాగిలబడుట; ఇవి కలరాయొక్క లక్షణములు. ఇది ఒక అంటువ్యాధి.

**choleraphage** bacteriophage, a virus which is capable of dissolving the cholera-bacilli, the production of which marks the waning of the epidemic, *see*/చూడండి bacteriophage. ఒక విశేషమైన విచ్ఛిన్నశక్తికలిగి కలరా సూక్ష్మజీవులను హతమార్చు వైరస్. ఇది కలరా మహామారి (epidemic) ని అరికట్టుతుంది.

**cholestasis** stasis of bile flow పైత్యరసము పారుదలకు అటంకమువలన అది జమ అగుట.

**cholesteatoma** a cyst - like mass in the middle ear మధ్యచెవిలో తిత్తిలాంటి ముద్ద.

**cholesterol** a sterol synthesised by the liver and transported in plasma. It is present in fats, oils, prawns and cholesterologenous foods/snacks like ice cream, pastries, *etc.* It can get itself deposited in atheromas and gall stones. ఈ పదార్థము కాలేయములో సంయోగము/సంకలనము అయి ప్లాస్మాలోకి చేరి తద్వారా వివిధ స్థలములకు తీసికొనిపోబడుతుంది. ఇది క్రొవ్వు, నూనెలు, రొయ్యలు మరియు ఐస్‌క్రీమ్, పేస్ట్రీలలో ఉంటుంది. ఇది రక్తనాళములలోపల పేరుకుని ఎథెరోమాలో మిళితమై ఉంటుంది; పిత్తాశయములో శిలలలోగూడా మిళితమై ఉంటుంది.

**choline** a member of the vitamin B complex group విటమిన్ బి కాంప్లెక్స్ సముదాయములో ఒకటి.

**chondral** pertaining to cartilage మృదులాస్థికి సం.

**chondralgia** chondrodynia, pain in a cartilage మృదులాస్థిలో నొప్పి.

**chondritis** inflammation of cartilage మృదులాస్థి 'నొప్పి వాపు మంట తీపు'.

**chondrocostal** pertaining to the ribcage comprising ribs and costal cartilages, *e.g.* **c. junction** ఛాతి ప్రక్కఎముకలు/పర్శువులు మరియు మృదులాస్థులకు సం., ఉదా. ఛాతిప్రక్క ఎముకతో మృదులాస్థి కలసిన సంధి.

**chondroma** a benign tumour of cartilage మృదులాస్థి యొక్క నిరపాయ కంతి.

**chondromalacia** abnormal softness in a cartilage మృదులాస్థి మిక్కిలి మెత్తపడుట.

**chondrosarcoma** a malignant tumour arising from cartilage cells మృదులాస్థి కణములనుండి పుట్టే అపాయకరమైన కంతి.

**chordae tendineae** tendinous cords in the ventricles of the heart స్నాయురజ్జువులు, గుండె జఠరికలలోనుండు దారమువంటి కాడలు.

**chordee** painful erection of the penis శిశ్నంయొక్క బాధాకరమైన నిగిడింపు. (i) in gonorrhoea గనేరియాలో (ii) Peyronie's disease.

**chorditis** 1. inflammation of vocal cords స్వరతంతువుల శోథము/ 'నొప్పి వేడి మంట వాపు'. 2. inflammation of spermatic cords శుక్రవాహికల శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**chorea** rapid, jerky involuntary movements in the body తన వశములోలేని వేగమైన, చివుక్కున ఈడ్చు శరీరకదలికలు, కండరకదలికలు. 1. Huntington's chorea, a hereditary disease leading to mental deterioration/dementia వంశపారంపర్యముగా వచ్చే మానసిక దౌర్బల్యము/క్షీణత. 2. Sydenham's chorea, a rheumatic process involving the central nervous system, *see/చూడండి* rheumatic fever. వికృత నృత్యవాతము, కొంకరులుపోవు వాతము, కంప(వాత) రోగము; ర్హుమాటిక్ జబ్బులో కానవచ్చును, ఇది కేంద్రనాడీవ్యవస్థయొక్క రుగ్మత.

**choreiform** resembling chorea ఖోరియాను పోలిన.

**choriomeningitis** meningitis with lymphocytic infiltration of the choroid plexus మెదడుమీదపొర యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు', ఖోరాయిడ్ ప్లక్షములో లింఫ్‌కణములు చేరుట.

**chorion** membrane over the fetus పరాయువు: భ్రూణము మీది పొర.

**chorionic gonadotrophin** *see/చూడండి* gonadotrophin.

**chorioretinopathy** noninflammatory process involving the choroid and retina in the eye కన్నులోని ఖోరాయిడ్ మరియు రెటీనాకు సంభవించే పరిణామము.

**choroid** middle coat of the eye between the sclera and retina రంజిత నేత్రపటలము: కన్నులోని స్క్లెరా మరియు రెటీనా మధ్య ఉండే రక్తపటలము.

**choroiditis** inflammation of the choroid ఖోరాయిడ్‌కు కలిగే శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**choroid plexus** a part in the brain రక్తప్లక్షము: మెదడులో ఒక భాగము.

**chromatin** the substance of chromosomes క్రోమోసోమ్‌లలోని పదార్థము.

**chromophytosis** *syn.* tinea versicolor, *see/చూడండి* tinea. సోభి: చర్మంమీద రంగుమారిన మచ్చలు.

**chromosome** microscopic rod shaped bits of genetic material in the nucleus of an animal cell, *e.g.* X and Y chromosomes క్రోమోజోమ్: జంతు కణములోని కేంద్రకమందున్న జన్యుపదార్థపు సూక్ష్మతునకలు, ఉదా. X మరియు Y క్రోమోసోమ్‌లు. **c. mutation.**, క్రోమోసోమ్‌ల ఉత్పరివర్తనము.

**chronic** existing for a long time దీర్ఘకాలపు [*in contr.* acute].

**chyle** milky fluid of fats formed after absorption from intestines and passed into veins అన్నధాతుసారము: ప్రేగులనుండి పీల్చబడిన తెల్లటి, పాలవలెనుండు క్రొవ్వు; సిరలలోకి సరఫరా చేయబడే ద్రవము.

**chyluria** presence of chyle, a milky white fluid in urine మూత్రములో పాలతెలుపుగల ఖైల్ విసర్జింపబడుట. This is due to the presence of suspended fat globules. ఇది తేలుతున్న క్రొవ్వు నలుసుల వలన.

**chyme** creamy material after digestion of food విదగ్ధపాకము: ఆహారము జీర్ణమైన తర్వాత రూపొందే వెన్నలాంటి పదార్థము.

**chymotrypsin** a protein-digesting enzyme secreted by the pancreas క్లోమం స్రవించే, ప్రోటీన్లను జీర్ణించే శక్తిగల ఎన్‌జైమ్.

**cicatrix** a scar గాయపుమచ్చ. fibrous tissue after healing of a wound గాయము నయమైన తర్వాత తంతుయుత కణజాలము.

**cilia** [cilium *sing.*] *naked eye str.* ప్రత్యక్ష.చూ. the eyelashes రోమకాలు: రెప్పల వెలుపలి అంచులమీది రోమములు. *micro. str.* సూక్ష్మ.చూ. microscopic hair like processes on a cell surface, *e.g.* ciliated columnar cells in the respiratory tract and Fallopian tube moving mucus and secretions over the inner surface శైలికలు: శ్వాసవాహికల మరియు ఫాలోపియన్ నాళముల లోపలి అస్తరులోనున్న కణములమీది సూక్ష్మనూగు – శ్లేష్మము మరియు ద్రవములను జారునట్లు చేయుటలో తోడ్పడుతుంది.

**ciliary** 1. pertaining to the eyelashes పాక్ష్మిక: కనురెప్ప రోమకాలకు సం. 2. pertaining to cilia సిలియాకు సం., శైలికాయుత.

**ciliary body** structure in the eye కన్నులో భాగము.

**ciliary muscles** unstriped muscle in the ciliary body కన్నులోని నునుపుకండరములు.

**cinchona** *bot.* bark of a tree, bitter and astringent వగరు మందు మరియు స్రావనిరోధి. It contains the alkaloids quinine, quinidine. Quinine is antimalarial. క్వినీన్ మలేరియాకు వాడ్తారు.

**cinchonism** quininism. poisoning by cinchona, quinine, or quinidine characterised by tinnitus, headache, deafness. సింకోనా, క్వినీన్ లేదా క్వినిడీన్ యొక్క విషపరిణామము – చెవిలో గుయ్‌మనటం, తలనొప్పి, చెవుడు.

**cine-angiocardiography** recording fluoroscopic images of heart and great vessels by motion picture technique గుండె, పెద్ద రక్తనాళముల ఎక్స్‌రే బొమ్మలను సినిమా దృశ్యమువలె చిత్రించుట.

**cinnamon** *bot.* a tree whose bark is used as spice, *e.g.* in the preparation of *biryani*, a spicy food. దాల్చిని (చెట్టు బెరడు).

వాడు.భా. దాసిన చక్క, ఉదా. బిరియానిలో వాడ్తారు. It possesses carminative, astringent and stomachic properties. వాయుహరణ శక్తి కలిగి కొంచెము వగరుగా ఉండే జీర్ణకారి.

**circulation** 1. movement in a regular course, *e.g.* circulation of blood ప్రసరణ: ఒక క్రమమైన రీతిలో కదలిక, ఉదా. రక్తప్రసరణము/దేహమందలి రకచలనము. 2. Circulation, a medical journal వైద్యశాస్త్రవార్తాపత్రిక. 

**circulatory system** consists of heart, arteries, capillaries and veins రక్తప్రసరణ వ్యవస్థ – గుండెకాయ, ధమనులు, రక్తకేశనాళికలు మరియు సిరలయొక్క సముదాయము. 

**circumcision** 1. removal of the foreskin (prepuce) on the penis, *see/చూడండి* phimosis. సుంతి, పురుషాంగముమీది ముందు చర్మము తీసివేయుట. 2. female circumcision practised in Egypt and other parts of Africa; cutting a young girl's clitoris (clitoridectomy). In actual practice, it doesn't stop there; virtually the outer sex organ appendages (like labia) are also mutilated. ఆడపడుచులలో సుంతి: క్లైటోరిస్‌పై చర్మం కత్తిరించుట; కాని ఇంతటితో ఆగరు; గుహ్య అవయవముల ఉపాంగములను (నిలువు పెదవులు లాంటివి) ఛేదించి వేస్తారు.



**circumduction** circular turning of a limb or an eye వర్తులావర్తనము, పర్యావర్తనము: కాలు/చేయి/కన్ను గుండ్రముగా త్రిప్పుట.

**cirrhosis** interstitial inflammation of an organ, often applied to liver, as a result of which it gets hardened కాలేయ సంబంధవ్యాధి: అవయవములో కణపంజరముల/కణజాలముల మధ్య నారపదార్థము (fibrosis) ఉత్పన్నమగుట – ఇది ముఖ్యముగా కాలేయవ్యాధి; తత్ఫలితంగా అది గట్టిపడుతుంది.

**citric acid** vitamin C, found in citrus fruits such as lemons సిట్రిక్ ఆమ్లము: విటమిన్ సి, నిమ్మపండ్లలో ఉంటుంది.

**the clap** *sl.* venereal disease, especially gonorrhoea సుఖరోగం, ముఖ్యంగా గనేరియా.

**claudication** lameness due to deficient blood supply/flow, *e.g.* intermittent claudication; pain, lameness in legs encountered in

occlusive arterial disease అవసరమునకు చాలని రక్తసరఫరావలన కలుగు కుంటితనము, ఉదా. ఉండి ఉండికలిగే కుంటితనము – రక్తనాళములు పూడుకుపోయే రుగ్మతలో రక్తప్రవాహము సరిపోక కాళ్లలో నొప్పి, కుంటితనము.

**claustrophobia** uncomfortable feeling felt in confined spaces, *e.g.* lifts, tunnels. లిఫ్టులు, గుహలు, మొ. హద్దు/నిర్బంధం గల ప్రదేశములలో కలుగు అసౌఖ్యత. [*in contr.* agoraphobia].

**clavicle** collar bone జత్రుక, బోర ఎముక.

**clavus** 1. corn ఆనె. 2. severe headache తీక్షణ తలనొప్పి.

**clawhand** contracted hand due to atrophy of muscles of hand, *e.g.* Hansen's disease, *i.e.* leprosy కండరములు క్షీణించినందువలన ముడుచుకుపోయిన అరచేయి, ఉదా. కుష్ఠురోగము.

**cleanliness** a state free from dirt or contamination పరిశుద్ధత, స్వచ్ఛత, శుభ్రత, బాహ్యాభ్యంతర శుచి. a rule of health ఆరోగ్యానికి ప్రమాణము. 1. **outer c.** బాహ్యశుచి: నాలిక గీచుకుంటాం, శిరోజాలు సర్దుకుంటాం, శరీరం తోముకుంటాం, గోళ్ళు శుభ్రపరచుకుంటాం. 2. **inner c.** అంతర శుచి: పేగు, గుండె గీచుకోలేము గదా, నాలుక గీచుకున్నట్లు; దీనికి ఆరోగ్యశిక్షణే రక్షణ, ఆరోగ్య సూత్రాలు పాటించడమే అంతరశుచికి కొలబద్ద. *N.B.* Cleanliness is next to godliness *గమనిక:* నిర్మలత్వమే దైవత్వం.

**cleavage** *e.g.* splitting of fertilized ovum into blastomeres by mitosis. ఉదా. విదళనము.

**cleft** fissure, *e.g.* cleft palate which imparts a nasal twang to the voice చీలిక, తొర్ర, ఉదా. అంగిటిలో తొర్ర: ఇది ఉన్నవాళ్ళు మాట్లాడుతుంటే ముక్కుతో మాట్లాడినట్లుంటుంది.

**cleft palate** *see/చూడండి* palate. చీలికగల అంగిలి.

**clenching** intermittent forceful contracting effort, **c. of fist** పిడికిలి బిగించడం. **c. of jaw** పండ్లు కొరకడం.

**clergyman's sore throat** irritation of throat in an ever-talking profession సదా/నిత్యమూ మాట్లాడుతుండెడివారి గొంతు రాపిడి, కంఠం బొంగురుపోవటం. [*q.v.* housemaid's knee].

**client** 1. a person who receives help/advice from a professional expert, *e.g.* a lawyer, a medical doctor. కార్యార్థి: వృత్తిలో ప్రవీణుడు/ప్రవీణురాలు, ఉదా. ప్లీడరు లేదా వైద్యడాక్టరు వద్దనుండి సాయం/సలహా పొందే వ్యక్తి. *Note:* a dignified term for patient *గమనిక:* రోగి అనేబదులు సహాయార్థి/సలహార్థి అంటే బాగుంటుంది. 2. a person looked after by a social worker సాంఘిక కార్యకర్త పర్యవేక్షణలో ఉన్న వ్యక్తి.

**climacteric** *colloq.* 'change of life'. 1. menopause in women స్త్రీలలో ముట్లు ఉడుగుట/ఎండుకపోవుట. 2. diminution of sexual activity in men పురుషులలో లైంగికవాంఛ తగ్గుట.

**climax** 1. zenith అత్యున్నత స్థితి. 2. orgasm, *see/చూడండి* orgasm.

**clinic** a place wherein there is medical activity రోగిని పరీక్షచేసి మందులు ఇచ్చు స్థలము. **anti-obesity c.** కొవ్వుకాయం నివారించు/అరికట్టు శాఖ. **anti-smoking c.** పొగత్రాగుడు మాన్పించు శాఖ. **asthma c.** ఉబ్బసం శాఖ. **beauty c.**, beauty parlour అందాలు దిద్దే నెలవు. **chest c.** ఛాతి శాఖ. **diabetic c.** మధుమేహం శాఖ. **eye c.** నేత్రవ్యాధుల చికిత్సానిలయం. **poly c.** బహుళవైద్యసలహా. **skin c.** చర్మరోగ శాఖ. **TB c.** క్షయవ్యాధి విభాగము.

**clinical** pertaining to examination of a patient రోగిని పరీక్షచేయు ప్రక్రియ. **c. acumen**, c. shrewdness ఈ విషయంలో బుద్ధి సూక్ష్మత, చతురత. **c. sense** రోగి రుగ్మత అంచనా.

**clinical death** *see/చూడండి* brain death.

**clinical psychology** *see/చూడండి* psychology.

**clinical thermometer** a device to record the body temperature శరీర ఉష్ణమాని: ఉష్ణోగ్రత నమోదుచేయు/తెలుపు పరికరము.

**clinician** a doctor who examines and treats patients in a clinic క్లినిక్‌లో రోగులను చూసి, నయముచేసే డాక్టరు.

**clinics** instructions at the bedside of the patients రోగుల పడక ప్రక్కన జరుగు బోధనలు.

**clitoridectomy** surgical removal of clitoris క్లైటోరిస్‌ను కత్తిరించడం.

**clitoris** 1. small elongated erectile tissue at the top of vagina భగాంకురం, భగశిశ్నం, గుహ్యాంగాంకురము, యోనిలింగము, భగలింగము: యోనిపైభాగమున చిన్న పొడుగాటి ఉబ్బే స్వభావముగల కణజాలము. 2. counterpart of the penis పురుషాంగముయొక్క ప్రతిరూపము.

**clone** a group of individual organisms/cells, all derived from a single progenitor by asexual reproduction and genetically identical to it ఒకే పూర్వీకునినుంచి అలైంగిక ప్రత్యుత్పత్తి ద్వారా ఉద్భవించిన జీవ/కణ సముదాయము – ఇది జన్యురూపేణ ఆ పూర్వీకుని పోలి వుంటుంది.

**clonic movements** alternate contraction and relaxation of muscles in epilepsy కండరముల సంకోచములు మరియు పట్టు వదలుట – మూర్ఛలవ్యాధిలో రోగిని ఈ పరిస్థితిలో చూస్తూ ఉంటాము.

**clonus** continued stretch causes alternate involuntary contraction and relaxation of muscles, *e.g.* ankle clonus అప్రయత్నపూర్వకముగా / అసంకల్పితముగా ఒకటివిడిచి ఒకటి సంభవించు కండరముల పట్టు/బిగువు మరియు వదలు/సడలు, ఉదా. కాలిచీలమండ క్లోనస్.

**Clostridium botulinum** anaerobic rod shaped organism responsible for botulism, *see/చూడండి* botulism. కర్రరూపమును పోలిన అవాతజీవి. బోటులిసమ్ అనే జబ్బును కల్గిస్తుంది.

**clot** coagulated blood mass స్కందము: గడ్డకట్టిన రక్తపుముద్ద.

**clotting** the procedure of clot formation స్కందనము.

**clotting factors** *syn.* coagulation factors. Factor I to V and VII to XIII. group of proteins in the blood essential for the clotting of blood, *see/చూడండి* factor. రక్తము గడ్డకట్టుటకు కావలసిన ప్రోటీన్లు.

**cloves** *bot.* the unblossomed flowers of a tropical tree used as spice, *e.g.* in the preparation of *biryani*, a spicy food. లవంగాలు, ఉదా. బిరియానిలో వాడ్తారు. used for toothache, dyspepsia పన్నునొప్పికి, అజీర్ణమునకు వాడ్తారు.

**clubbing** swelling of tips of fingers or/and toes, *e.g.* drum-stick clubbing మునగకాడ/కాయ కణుపులవలె కనుపించు చేతివేళ్ళ లేదా/మరియు కాలివేళ్ల చివర ఉబ్బు.

**club foot** deformed foot వంకరపాదము.

**coagulation** formation of blood clot స్కందనం: రక్తము గడ్డకట్టుట.

**coagulum** a clot రక్తపుగడ్డ.

**coarctation** narrowing, *e.g.* **c. of aorta** సన్నగిల్లుట, ఉదా. బృహద్ధమని సన్నగిల్లిపోయిన స్థితి.

**cobalt-60** radioactive isotope used in the treatment of cancer కేన్సరు చికిత్సలో వాడే రేడియో ధార్మిక శక్తిగల ఐసోటోప్.

**coca** shrub whose leaves contain cocaine పొద: దీని ఆకుల్లో కొకైన్ ఉంటుంది. Coca-Cola, shortened to Coke, a popular drink పేరుపొందిన పానీయం.

**cocaine** 1. an addictive narcotic drug మెదడుకు మత్తు కలిగించే పొడు మందు, వ్యసనకారకం. 2. local anaesthetic ప్రాంతీయ/స్థానిక మత్తు కలిగించేది.

**coccus** [cocci *pl.*] a spherical bacterium less than 1$\mu$ in diameter, *e.g. staphylococcus* గోళాకార సూక్ష్మజీవి, వ్యాసము కొలత 1$\mu$ కన్నా తక్కువగా ఉన్న గుండ్రని బాక్టీరియమ్.

**coccydynia** or **coccygodynia** coccyalgia. pain in the region of the coccyx అనుత్రిక ప్రాంతమందు నొప్పి.

**coccyx** lower tip of the vertebral column గుదాస్థి, అనుత్రికము: వెన్నుపూసయొక్క చిట్టచివరి 4 పూసఎముకలు.

**cochlea** 1. anything in a spiral shape మరచుట్టువలెనుండు భాగము. 2. spiral tube in the inner ear 2mm at base, 9mm base to apex – organ of hearing, *resemblance:* the shell of a snail లోపలి చెవియందు మరచుట్టువలెనుండు గొట్టము – కర్ణావృత్తము, కర్ణావర్తము: శ్రోత్రావయవము, శబ్దములు వినే అవయవము, పోలిక: నత్తగుల్ల. cochlear implant, a new technique for restoring hearing in the deaf, *figur.* 'Happy new ear/era' అలంకార. 'నూతన శ్రోత్రము/శకము – శుభాకాంక్షలు'.

**codeine** 1. sedative శమనమును కలుగజేసెడు మందు. 2. narcotic నిద్రను కలుగజేసెడు మందు. 3. antitussive, *e.g.* linctus codeine దగ్గును అరికట్టేమందు, ఉదా. కోడీన్ తేనె.

**cod liver oil** oil rich in vitamin A and D from the liver of cod, a fish కాడ్ అనుచేప కాలేయమునుండి తీసిన నూనె – దీనిలో విటమిన్ ఎ మరియు డి పుష్కలంగా ఉంటాయి.

**coeliac** relating to the abdominal/peritoneal cavity ఉదరకుహర సం., కుక్షికుహర సం.

**coeliac plexus** *see/చూడండి* solar plexus.

**co-enzyme** a substance that helps/enhances the action of enzymes ఎంజైమ్‌లకు సహాయకారి.

**cognitive therapy** psychotherapy to set right the patient's false notions, in an attempt to cure depression, addictive behaviour, *etc.* అవసాదము, వ్యసనలోలత్వము, మొ. జబ్బులకు మానసిక చికిత్స.

**coitus** natural sexual intercourse between the penis and vagina, *figur.* Welcome into vagina మైథునము: పురుషాంగము మరియు యోని యొక్క సంగమము/సంభోగము/రాపిడి, *అలంకార.* యోనిలోనికి స్వాగతం.

**coitus interruptus** onanism. sexual intercourse is interrupted intentionally before ejaculation – not a practical method of contraception స్ఖలనమునకు ముందు పురుషాంగమును యోనిలోనుండి తీసి వేయుట – చెప్పటం తేలికేగాని రతికేళిలో రమింపు ఉండదు. గర్భనిరోధానికి అంత సులువైన మార్గం కాదు; పొరపాటున శుక్రం చుక్కలు పడవచ్చు.

**coitus reservatus** sexual intercourse in which ejaculation is deliberately avoided, so as to prolong coition కావాలని స్ఖలనం ఆపివేయుట, ఎందుకంటే – ఇంకా ఎక్కువసేపు రతివినోదం పొందాలని.

**colchicum** *bot.* a herb ఒక మూలిక. The active principle colchicine contained in the corms is a specific remedy for gout, *see/చూడండి* gout. గౌట్ అనే రోగమునకు విశిష్ట పరిహారము.

**cold** 1. low in temperature చల్లదనము. 2. common cold, which is of virus etiology పడిశము, రొంప, జలుబు – అతి సూక్ష్మజీవి (virus) వలన కలుగుతుంది. *అలంకార.* పడిశం పదిరోగాలపెట్టు

**cold abscess** a manifestation of tuberculosis, *e.g.* cold abscess in TB of vertebrae క్షయవ్యాధిలో ఒక లక్షణము, ఉదా. వెన్ను ఎముకలకు సంభవించు క్షయ (టి.బి.).

**colectomy** colon+ectomy. excision of a segment or whole of the colon (large intestine) పెద్దపేగు అంతాగాని లేక కొంతభాగం గాని తీసివేయుట.

**colic** 1. acute paroxysmal pain due to obstruction in a tubular structure or a hollow organ, *e.g.* biliary colic, gastric colic శూలనొప్పి: వాహిక/బోలు అవయవములో ఏదైనా అడ్డుపడినప్పుడు కలిగే ముమ్మరమైన బాధ, ఉదా. పిత్తవాహిక, జఠరములో కలిగే బాధ. 2. pain recurring periodically, spasmodic/intermittent ఉండి ఉండి వచ్చే నొప్పి. 3. intestinal colic అంత్రశూల. 4. renal colic వృక్కశూల. 5. uterine colic గర్భాశయ శూల.

**colicky** pertaining to colic కాలిక్‌కు సం.

**colitis** inflammation of the large intestine (colon), *e.g.* amoebic colitis due to *Entamoeba histolytica* బృహదాంత్ర శోథము: పెద్ద ప్రేగులో 'నొప్పి వేడి మంట వాపు', ఉదా. అమీబా వలన కలిగిన చీమురక్తవిరేచనములు.

**collagen** the protein fibres of skin, tendon, bone and connective tissue ప్రోటీన్ జాతికి చెందిన నారలు – ఇవి చర్మము, కండరబంధనము, ఎముక మరియు సంధాయక కణజాలములలో ఇమిడి ఉన్నవి.

**collapse** breakdown స్తంభనము, నిపాతము: 1. extreme prostration, feeling of 'end of life' పూర్తిగా సొగిలబడుట, 'జీవితం అంతమైంది' అనే భావము కలుగుట. 2. shock, insufficient circulation of blood, *e.g.* circulatory collapse అఘాతము, శరీర అవసరములకు సరిపడని రక్తసరఫరా, ఉదా. గుండె స్తంభించుట. 3. shrinkage of an air filled organ, *e.g.* lung (pulmonary) collapse గాలితిత్తులుగల అవయవము ముడుచుకొనిపోవుట, ఉదా. ఊపిరితిత్తి ముకుళింపు.

**collar bones** two clavicles జత్రుకలు, రెండు మెడకొంకులు, బుజపు ఎముకలు.

**collateral circulation** a secondary/alternative path to compensate blood supply, *e.g.* if one coronary artery is blocked,

daughter vessels crop up from the other patent arteries to establish collateral circulation రక్తసరఫరాలోని లోపము సరిదిద్దుటకు ప్రత్యామ్నాయ/వేరువిధమైన మార్గము, ఉదా. గుండె మీది/కొరొనరి ధమని ఒకటి పూడుకుపోయినప్పుడు మిగత ధమనులనుంచి పిల్లధమనులు ఉద్భవించి లోపమును సరిదిద్దుతాయి.

**Colles' fracture** *see/చూడండి* fracture.

**colloid** 1. glutinous or like glue జిగటగానున్న లేదా బంకవలెనున్న పదార్థము. 2. particles in emulsion or suspension కాంజికాభము: పాలరూపముగా నుండునట్టి మందులతో చేయబడిన రసాయనము.

**colloidal** state of emulsion కాంజికాభస్థితి.

**coloboma** congenital defect of any part in the eye కన్నులో ఏ భాగమునకైనా పుట్టుకతో వచ్చినలోపము.

**colon** large intestine, from caecum to rectum పెద్దప్రేగు; అంధ నాళము నుండి మలాశయము వరకుగల ప్రాంతము.

**colonoscope** an instrument/tube introduced into the colon for its examination బృహదాంత్ర అంతరదర్శిని: పెద్దప్రేగులోనికి పోనిచ్చి పరీక్షచేసే గొట్టము.

**colony** cluster of bacteria in a culture medium క్రిములకు పోషక పదార్థములనిచ్చి వాటిని పెంచే సంవర్ధనములోనున్న బాక్టీరియా గుంపు.

**colostomy** creation of an opening (stoma) between the colon and body surface, thus bypassing the rectum in diseases like cancer of rectum. A cup is placed at the opening, dressing applied; it is cleaned periodically, *i.e.* the opening acts as an artificial anus. బృహదాంత్ర ఛిద్రికాకరణము: పెద్దప్రేవునుండి పొట్టకండరములు, చర్మముద్వారా రంధ్రముచేసి తద్వారా మలమును విసర్జింపచేస్తారు. మలాశయము యొక్క కాన్సరు మొదలగు వ్యాధులలో దాన్ని మలమార్గమునుండి తప్పించుటకు ఈ ఉపాయము. ఆ రంధ్రముమీద ఒక గిన్నెపెట్టి పైన కట్టు కడతారు; ఆ గిన్నెను తరచు శుభ్రపరుస్తుంటారు. అనగా కృత్రిమ ఆసనం సృష్టించినట్లు.

**colostrum** virgin secretion of milky fluid after delivery (parturition) ప్రథమస్తన్యము: పురుటాలు స్తనములలో పాలయొక్క తొలివిడుత.

**colour** or **color** రంగు, వర్ణం. **c. blindness** వర్ణాంధత్వం. **c. vision** వర్ణదృష్టి.

**colour Doppler** *see/చూడండి* Doppler scanning.

**colpalgia** pain in the vagina యోనిలో వేదన/సలుపు.

**colpitis** vaginitis యోనియొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**colpospasm** vaginal spasm, *see/చూడండి* vaginismus. యోని యొక్క బిగువు/స్నాయువుల యీడుపు (spasm).

**column** 1. pillar-like supporting structure, *e.g.* vertebral column స్తంభమువలె ఆధారభూతమైన ఊత/ప్రాపు, ఉదా. వెన్నెముక. 2. longitudinal tracts in the structure of the spinal cord, *e.g.* posterior columns వెన్నుపాములోనున్న నిడుపు నాడీరజ్జువులు, ఉదా. వెన్నుపాము వెనుకభాగములోనున్న నాడి వరుసలు.

**coma** 1. profound loss of consciousness from which one cannot be awakened even by powerful stimuli, *e.g.* alcoholic intoxication, barbiturate poisoning due to overdosage, diabetic coma స్మారకము తప్పుట, అపస్మారకస్థితి: ప్రగాఢమైన చైతన్యలోపము/నిద్ర – ఈ స్థితిలోనుండి గిల్లినా/గుచ్చినా మనిషి లేవలేడు, ఉదా. కల్లు/సారాయి నిషా, బార్బిట్యురేట్ అనేమందు ఎక్కువమోతాదులో తీసుకున్నందువలన కలిగిన ప్రమాద పరిణామము, మధుమేహం వ్యాధిలో స్మారకము తప్పుట. 2. irreversible coma, so-called 'brain death', a state of vegetative existence స్థిరమైన దశగా స్పృహలేని స్థితి, 'మెదడు చావు', మొద్దుమ్రానువలె పడిఉండుట.

**comatose** the state of being/remaining in coma స్పృహలేని స్థితిలో ఉండుట.

**comedo** [comedones *pl.*] pimple, black-head, a plug of keratin and sebum with bacteriae in a hair follicle. Pimples are usually seen on the face and back. మొటిమె, రోమము యొక్క కుదురులో తయారైన గుల్ల – ఇందులో కెరటిన్ మరియు చర్మమునకు జిడ్డు పుట్టించే క్రొవ్వు, సూక్ష్మక్రిములు కలిసి ఉంటాయి. ఈ మొటిమలు ముఖ్యముగా ముఖముమీద, వీపుమీద లేస్తాయి.

**commensal** a living being harboured in another living being, the guest deriving benefit without harming or benefiting the host ఒక జీవి ఇంకొక జీవిలో జీవిస్తూ తను లాభము పొందుతూ ఉంటుంది, కాని అతిథేయి (host) కి లాభముగాని నష్టముగాని కలిగించదు.

**commensalism** a relationship between an organism and its host in which the host neither benefits nor suffers from the association ఒక జీవికి అతిథేయికి మధ్యనున్న సంబంధము – దీనివలన అతిథేయి మేలు పొందదు, బాధపడదు.

**comminuted** broken into small pieces/fragments, *e.g.* **c. fracture** of a bone చిన్నముక్కలు/తునుకలుగా విరుగగొట్టబడినది, ఉదా. పై విధముగా ఎముకయొక్క పగులు.

**commissure** a site of union of adjacent parts, *e.g.* fusion of both cusps of the mitral valve, called mitral stenosis కలయిక, సంధి: ప్రక్కప్రక్కనున్న భాగములు కలుసుకొనుచోటు, ఉదా. మైట్రల్ కవాటములోని రెండు తెరలు కలసిపోవుట.

**commissurotomy** disruption of the commissure కమ్మిషరును భేదించే/ఛేదించే విధానము. 1. surgical procedure శస్త్రచికిత్సచేసి ఛేదించుట. 2. digital dilatation వేలుతో వెడల్పుచేయుట. 3. wired balloon manoeuvre, to increase the size of the opening తీగెలతో చేసిన గుమ్మటమును గొడుగులా ముడిచి రక్తనాళముల ద్వారా పోనిచ్చి/దూర్చి ఆ కమ్మిషరు వద్ద గొడుగు తెరచినట్లుగా ఉబ్బించుట. ఈ రీతిగా చేసినయెడల ముడుచుకుపోయిన కవాటముయొక్క పరిమాణము (size) పెరుగుతుంది.

**the common cold** cold catarrh రొంప, జలుబు, పడిశం, సర్ది.

**communicable** capable of being transmitted from one person to another, *e.g.* diseases such as cholera, tuberculosis అంటుకొను/సంక్రమించు: ఒకరినుండి మరియొకరికి సంక్రమించు శక్తిగల, ఉదా. కలరా, క్షయవ్యాధి.

**community** సమాజం. **c. medicine** సమాజశ్రేయస్సు కొరకు అవలంబించే వైద్యవిధానము.

**compatibility** agreeable state, *e.g.* compatible blood is fit for transfusion. సరిపడిన, అనుకూలమైన, తగిన స్థితి, ఉదా. అనుకూలమైన రక్తము రక్తదానమునకు అర్హత కలది.

**compensation** something replaced to make good the loss/defect లోటుభర్తీచేయుట: నష్టపరిహారము కొరకు చేయు మార్పులు/బదులు క్రియలు. 1. amend the handicap ఆటంకమునకు సవరణ/దిద్దుబాటు. 2. psychological modification of self to make up for the deficiency మానసిక రుగ్మతలలో తన స్వభావమును సమయానుకూలముగా సవరించుకొనుట. 3. circulatory adjustments in some cardiac diseases to maintain an adequate blood flow to tissues and organs కొన్ని గుండెజబ్బులలో కణజాలములకు మరియు అవయవములకు కావలసిన రక్తసరఫరా సమకూర్చుటకై గుండె మరియు రక్తప్రసారవ్యవస్థలో సవరణలు జరుగుతుంటాయి.

**complaint** symptom, nature of the suffering of the patient వ్యాధిలక్షణము, రోగి బాధవివరణము.

**compliance** action to co-operate with సహకరించుట. **drug c.,** co-operation of the patient in taking drugs regularly, for the required period especially in a prolonged treatment like that of TB. పాటింపు: రోగిసహకారము, ముఖ్యముగా, దీర్ఘకాలపు చికిత్స కావలసిన క్షయవ్యాధిలాంటి జబ్బులలో రోగి డాక్టరు చెప్పినట్లు మందులు వాడుట.

**complication** expected/unexpected turn of events in the evolution/progression of a disease అవలక్షణం: వ్యాధిపరిణామము/ముదిరేగతిలో ఊహించిన/ఊహించని ఘట్టము.

**compound fracture** the fractured ends are visible through a wound. పగిలిన ఎముకల కొనలు చర్మమును తొలుచుకొని వచ్చి గాయములో కనపడుట.

**compress** 1. a pad applied with pressure, e.g. first aid to compress over an artery/arteries in the bleeding area ఒత్తిడిచేయుడము, ఒత్తుపెట్టుట, ఉదా. రక్తస్రావము అవుతుంటే ఆ భాగమునకు వచ్చే ధమని/ధమనుల మీద ఒత్తుపెట్టుట – ఇది ఒక ప్రథమచికిత్స సాధనము. 2. **cold c.** శైత్యోపచారం. **hot c.** ఉష్ణోపచారం.

**compression** effect of pressure over a vital structure, *e.g.* vertebral compression over the spinal cord resulting in paralysis of the muscles below the level of compression; may occur in injury or tuberculosis of the vertebrae ఒత్తిడి: వెన్నుపాముపంటి కీలక భాగముపైన ఒత్తిడి కలిగినచో అక్కడి అంతస్థుక్రింద ఉన్న కండరములు పక్షవాతమునకు గురి అవుతాయి. ఈ ఒత్తిడి కలుగటానికి రెండు ముఖ్యకారణములు: ఎత్తుమీదనుండి పడితే వెన్నెముకకు దెబ్బతగులుట, వెన్నుఎముకలకు టి.బి. వ్యాధి సోకుట.

**compulsion** obsessive compulsive reaction/neurosis నిర్బంధము, బలవంతం: అనియంత్రిత నిర్బంధాత్మక ప్రతిచర్య.

**conceive** to become pregnant గర్భముదాల్చుట/గర్భవతి యగుట.

**conception** union of an ovum and a sperm to form zygote – this is a sort of prologue for the ensuing drama, *viz.* evolution of pregnancy. గర్భధారణము: అండము మరియు శుక్ర గోళకము కలిసి సంయుక్తబీజమగుట – ఈ ఘట్టము గర్భమునకు నాంది. *figur.* In the universe, a woman is the mother of man. అలంకార. స్త్రీ మాతృమూర్తి.

**concha** the hollow around the external ear which resembles the shell of a conch. What a creation of God! శంఖాకారమైనది: చెవి వెలుపలిభాగము శంఖము అకారములో ఉంటుంది. సృష్టికర్తయొక్క చాతుర్యము!

**concretion** a stony hard mass, *e.g.* a calculus (gall stone or kidney stone), calcification in a tissue రాయిలాంటి ముద్ద, ఉదా. పిత్తాశయము/మూత్రపిండములో శిల, కణజాలములో సున్నము చేరుకొనుట/పేరుకొనుట.

**concussion** stunning, sometimes unconsciousness after a blow on the head మెదడు అదరడము, ఘాతపరిణామము: తలమీద దెబ్బ/ధాటి వలన దిమ్ము/దిగ్భ్రమ, స్పృహ తప్పటం కద్దు.

**condom** a family planning measure/device – rubber covering over the penis, *e.g.* Nirodh ఒక కుటుంబనియంత్రణ సాధనము – శిశ్నకంచుకము: పురుషాంగము మీది/మీద తొడుగు, ఉదా. నిరోధ్.

1. prevention of conception గర్భధారణము తప్పించుటకు – శబ్దవ్యుత్పత్తి గమనించండి: గర్భమును నిరోధించేది కావున నిరోధ్. 2. safe sex in suspected HIV carriers హెచ్.ఐ.వి. సోకినవారితో సంభోగించునప్పుడు రక్షణోపాయము.

**conduction** 1. transmission of an impulse, either cardiac or nervous in origin సంవహనము: గుండెలోగాని నాడీమండలములోగాని ఉత్పన్నమైన ప్రచోదనము ముందుకు పంపబడుట. 2. **c. deafness,** due to defect of conduction వహన బధిరత, సంవహనలోపంవల్ల కలిగే చెవుడు [*Cf.* nerve deafness *తారత. నాడీబధిరత*].

**condyle** rounded part of a bone at its end బుడిపి, కందము: ఎముక చివర గుండ్రని ఆకారముగల భాగము.

**condyloma** [condylomata *pl.*] **c. latum** lesions: thick tags on the skin over the genitals and around the anus, seen in viral infection or syphilis కాండైలోమా క్షతములు: వైరస్ సంపర్కము లేదా కొరుకు సవాయి వ్యాధిలో గుహ్యఅవయవములమీద, గుదముచుట్టూ దళసరి చర్మపుతోకలు. ఇవి చర్మము ముడుతలలో మరింత పెద్దవిగా కనపడుతాయి.

**cone** receptor in the retina for light sensitivity and colour vision; highly sensitive for night vision శంకువు: నేత్ర పటలం లోని కాంతిసంవేదనాత్మక మరియు వర్ణదృష్టి గ్రాహకము రాత్రివేళలందు చూపునకు అత్యంత సంవేదకంగా ఉంటుంది. [*Cf.* rod *తారత. శలాక*]

**confinement** parturition, giving birth to a baby ప్రసవం. *figur.* mother's mirth of maternity/motherhood. అలంకార. పాప సంబరం.

**congenital** found at the time of birth, *e.g.* congenital heart defect/disease జన్మజాత, జన్మతో వచ్చినది, పుట్టుకతోనే ఉన్నది, ఉదా. పుట్టుకలోనే/నుంచే కనపడిన గుండెలోపము/జబ్బు [*Cf.* acquired *తారత.* ఆర్జిత, ఆర్జించబడిన].

**congestion** 1. stasis/stagnation of blood in any part, *e.g.* pulmonary congestion రక్తచలనదోషము: రక్తము ఏభాగములోనైనా క్రమముగా పారకుండ ఉన్న స్థితి, ఉదా. ఊపిరితిత్తులలో రక్తము

క్రమముగా చలనములేకుండా నిల్వబడిన స్థితి. 2. inflammation of mucous membrane, e.g. coryza శ్లేష్మపొరయొక్క 'నొప్పి వేడి ఎరుపు వాపు', ఉదా. జలుబు, రొంప. When cold occurs, there is accumulation of blood in the nasal mucosa, body's attempt to fight the virus. రక్తాధిక్యత: జలుబు చేసినప్పుడు/రొంపపట్టినప్పుడు నాసిక శ్లేష్మపొరలో రక్తం ఎక్కువగా సరఫరా అయి, కొంత జమ అవుతుంది - ఇది జలుబు వైరస్‌లతో శరీర పోరాటం.

**conjugal** relating to husband and wife వైవాహిక/దాంపత్య; ఆలు మగలకు సం.

**conjunctiva** membrane lining the white portion of the eyeball and inner aspect of eyelids కంటిపొర: కన్నులోని తెల్లగుడ్డును, కనురెప్పలలోన అంటి ఉండే పొర.

**conjunctivitis** inflammation of the conjunctiva కన్‌జన్‌క్టైవా యొక్క శోథము/'నొప్పి ఎరుపు తీపు వాపు'.

**connective tissue** the tissue that connects and binds parts together బంధన/సంయోజక/సంధాయక కణజాలము.

**consanguineous marriage** matrimonial alliance amongst near relatives, not a preferred mating in genetic counselling సన్నిహిత రక్తబంధం ఉన్నవాళ్ళలో ఒకరినొకరు పెండ్లియాడుట, ఉదా. 1. మేనరికము - మేనత్త కుమారునితో మేనమామ కుమార్తెకు వివాహము. 2. ఒక స్త్రీ యొక్క తమ్ముడికి ఆమె కుమార్తెకు వివాహము. ఈ రీతి సంగమము జన్యుశాస్త్రరీత్యా మేలైన కలయికగాదు.

**consanguinity** blood relationship సమరక్త సంబంధం, రక్తబంధం, దగ్గర బంధుత్వము.

**consciousness** a state of awareness స్మారకము, స్మృతి: తెలివి/స్పృహ కలిగియుండు స్థితి.

**consolidation** a state wherein a spongy organ, the lung, becomes solid like the liver, as in pneumonia ఘనీభవం: ఊపిరితిత్తి, బోలుగా ఉన్న అవయవము, కాలేయమువలె ఘనీభవించుట - ఈ జబ్బును న్యూమోనియా అంటారు.

**constipation** after-effect of a greedy colon పెద్దపేగు జలలుబ్ధియై లోనమలమును గట్టిపరచుట. infrequent opening of bowels (evacuation of stools/feces) as a result of which the residue in the rectum gets converted into scybala that are difficult to be evacuated. మలబంధము, మలబద్ధము, మలబద్ధకము: ఆరోగ్యములో నున్నట్లు తరచుగా కాకుండా కొలదిరోజులకొకసారి విరేచనమగుట. దీని పర్యవసానము ఏమంటే – పురీషనాళములోని మలముయొక్క నిలువ వలన అది రాళ్ళలాగా ఉండలుకట్టి విసర్జించుటలో వేదన కలుగుతుంది. అలంకార. ప్రతి మలవిసర్జన ప్రసవవేదనే.

**constitution** 1. appearance and shape; familial inheritance శరీరాకృతి, ఒకవ్యక్తి అనువంశికంగా తయారైన స్థితి. 2. the set-up of the body, stamina, nature, the plus and minus points in one's being – the overall equation, *see/చూడండి* diathesis. దేహతత్వము: శరీరప్రకృతి, స్వభావము, మనస్తత్వము, పటుత్వము – ఇవన్నీ లెక్కలోనికి తీసుకున్న సూత్రము.

**constriction** a stricture, narrowing of a part కుంచనము: ఒక భాగము సన్నగిల్లుట.

**constrictive pericarditis** thickening of the pericardium, the outer covering over the heart thus constricting it గుండె పైనున్న పొర దళసరిగా మారుట మరియు గుండెను కుంచించుట.

**consumption** phthisis: body being consumed by disease, pulmonary tuberculosis క్షయము: జబ్బుచేత శరీరము హరించుకు పోవుట, ఊపిరితిత్తుల క్షయవ్యాధి.

**contact** 1. one who lives in the vicinity and in close touch with a patient having an infectious disease, *e.g.* contact of a patient of pulmonary tuberculosis స్పర్శ, తాకడము: ఒక అంటురోగముతో బాధపడేవాని పరిసరములోనున్న ఆరోగ్యవంతుడు, ఉదా. ఊపిరితిత్తుల క్షయరోగి దగ్గర జీవిస్తున్న ఆరోగ్యవంతుడు. ఇతనికి క్షయజబ్బు వచ్చే అవకాశమున్నది. 2. **c. lenses,** plastic appliance attached directly to the cornea in the place of the traditional spectacles బహుకాలంగా వాడుకలోనున్న కళ్ళద్దాల స్థానంలో ఇప్పుడు శుక్లపటలానికి అంటించే ప్లాస్టిక్ గుండ్రని బిళ్లలు వాడుతున్నారు.

**contagion** transmission of disease from one individual to another వ్యాధి ఒకరి దగ్గరనుండి మరియొకరికి ప్రాకుట/ప్రాకబడుట.

**contagious disease** also called communicable disease, *e.g.* the common cold ఒకరినుండి ఇంకొకరికి అంటుకునే వ్యాధి, ఉదా. జలుబు/పడిశం.

**contaminated** polluted/infected కలుషితమైన. **c.syringe** కలుషితమైన సిరెంజ్.

**continence** 1. ability to control the urinary bladder and/or bowels మూత్ర, మలవిసర్జనములు స్వాధీనములో ఉండుట [*opp.* incontinence వ్యతి. స్వాధీనములో లేకుండుట]. 2. power of control over natural instincts, *e.g.* hunger, sex, *etc.* ఇంద్రియనిగ్రహము, జితేంద్రియత్వము. సహజమైన, స్వభావసిద్ధమైన, పుట్టుకతోబుట్టిన ఉద్వేగములు/అవసరాలు, ఉదా. ఆకలి, లైంగికవాంఛ మొదలైన వాటిమీద నిగ్రహము/అదుపు.

**contraceptive** device to prevent conception సంతాన నిరోధకము, సంతాన నిరోధక సాధనము: గర్భము రాకుండా చేసేది. **temporary measures** తాత్కాలిక పద్ధతులు In males: Nirodh మగవారిలో నిరోధ్. In females: pessary; intra uterine device, *viz.* loop స్త్రీలలో లూప్. **permanent measures** శాశ్వత పద్ధతులు In males: vasectomy మగవారిలో అపరేషన్. In females: tubectomy స్త్రీలలో చిన్న అపరేషన్.

**contraction** 1. shrinkage of a structure/organ usually secondary to fibrosis, *e.g.* cicatrix on skin, fibrosis of lung, cirrhosis of liver సంకోచము: కణజాలముల కట్టడము/అవయవము ముడుచుకుపోవుట; ఇది నారలాంటి మార్పుచెందిన తరువాయి స్థితి, ఉదా. చర్మముమీద మచ్చ, ఊపిరితిత్తి ముడుచుకొనుట, కాలేయము యొక్క సంకోచము. 2. contraction of muscle కండరము ముడుచుకొనుట/అక్కళించుకొనుట.

**contracture** a permanent contraction or shortening of muscle tissue/fascia thus rendering it to be stiff నికుంచనము: *e.g.* 1. Dupuytren's contracture wherein the hand becomes stiff

నికుంచనం; కండరముగాని పీచులాంటి కణజాలముగాని శాశ్వతముగా ముడుచుకుపోయి అభాగము బిగువుగా మారుట, ఉదా. పై మార్పులో చేయి బిర్రుగా అవుతుంది. 2. Peyronie's disease, stiff penis బిర్రు పురుషాంగము.

**contraindication** a factor or line of action not suitable in the management of a disease నిషేధము: వ్యాధిని అదుపులో పెట్టడానికి తగని/సరిపోని చికిత్సా విధానము.

**contralateral** on the opposite side అవతలవైపు [*in contr.* భిన్న. ipsilateral].

**control** power to limit అదుపులో పెట్టుట. **birth c.,** family planning కుటుంబ నియంత్రణ. **girth c., width c.,** in obesity కొవ్వుకాయంలో నడుము చుట్టుకొలత తగ్గించాలి. అలంకార. మొత్త తగ్గించాలి; కటికైవారం తగ్గించాలి.

**contusion** 1. a bruise బొప్పి: నలిగి, కందిన మార్పు. 2. injury without a breach of skin చర్మముమీద పగులు లేకుండా తగిలిన దెబ్బ.

**conus medullaris** lower end of spinal cord from which the nerve roots emerge in the shape of a cone, *resemblance:* broom శంకువురూపమైన వెన్నుపాము చివరిభాగము; పోలిక: ఇది చీపురు అకారములో ఉంటుంది, నాడీతంతుల మూలములు చీపురులో చీపురుపుల్లలు ఏ విధముగా సూచ్యాకృతిలో ఉండునో అలాగే వ్రేలాడుతుంటాయి.

**convalescence** period of recovering from sickness వ్యాధినుండి కోలుకొనుట: రుగ్మత నయమయిన తర్వాత బలములోను ఆరోగ్యమందును యథాస్థితికి వచ్చు వ్యవధి/కాలము.

**convolutions** folds on the surface of cerebral hemispheres మెదడు గోళార్ధాల మీద కనపడు ముడతలు.

**convulsions** fits: transient or temporary loss of consciousness and involuntary alternate contraction and relaxation of muscles మూర్ఛలు: అసంకల్పితముగా/అప్రయత్నపూర్వకముగా కండరములు కొద్ది కాలంసేపు ముడుచుకోవడం, మళ్ళీ పట్టువదలడం – ఈ స్థితిలో స్మృతి తప్పుతుంది. **infantile c.,** quite common in fever

వాడు.భా. చంటిబిడ్డగుణం, చంటిబిడ్డ చేష్టలు, ఫిట్స్, కొంకర్లు. a crude treatment: counter-irritation with a burning object, *e.g.* beedi/cigarette burning end on the glabella; we see a scar as a vestige, in later life. మోటు వైద్యం: నొసలున ప్రతిరేపెడు గుణంకొరకు వాత పెడతారు, ఉదా. బీడి/సిగరెట్ కాలుతున్న అంచుతో – దీని పర్యవసానం ఆ మచ్చ జీవితమంతా ఉంటుంది.

**co-ordination** 1. harmonious functioning of organs సమన్వయము: అవయవములు పొందిక/పొత్తుతో కూడి పనిచేయుట. 2. 'get-together' functioning of muscles so as to achieve a purpose, *e.g.* touching the nose with a finger, *see/చూడండి* test. 'కలిసికట్టు'గా పనిచేయుట, ఉదా. ముక్కు కొనను వేలితో పట్టుకునేటప్పుడు ఎన్నో కండరములు ఒక్కుమ్మడిగా పనిచేస్తాయి; దీనినే సమానాధికారము, సమానావశ్యకత అని అంటారు.

**COPD** *abbr.* chronic obstructive pulmonary disease ఒక రకమైన ఊపిరితిత్తుల జబ్బు.

**coprolalia** [Greek *lalia*=talk] bad words, vulgar language తిట్లు, బూతుమాటలు.

**coprostasia** stasis of faeces in the rectum మలాశయంలో మలం పేరుకొనుట. దీని పర్యవసానం మలనిరోధ(న)ము. అలంకార. పురీషనాళం శరీరంలోని పాకీదొడ్డి.

**copulation** sexual intercourse, *see/చూడండి* coitus. స్త్రీపురుష సంభోగము, రతికేళి, మైథునము.

**cor** heart, the size of one's own fist హృదయము, గుప్పెడంత గుండె.

**cord** any elongated flexible structure రజ్జువు: వంగునట్టి గుణముకల పాశము/బంధము/వాహిక. **spermatic c.,** through which sperm flows శుక్రము పారు నాళము. **spinal c.,** which is the live wire of the central nervous system వెన్నుపాము: ఎలక్ట్రిక్ తీగవలె నాడులకు ఉద్రేకము కల్గిస్తుంది. **umbilical c.,** connection between the fetus and placenta భ్రూణమును మావిని కలుపు బంధము (మాతాశిశుబంధము).

**coriander** *bot.* 1. seeds from a herb ధనియాలు. good for digestive disorders జీర్ణఅపవ్యవస్థలకు మంచిది. 2. tender plants used in chutneys, soups కొతిమేర పచ్చళ్ళలో, చారులో వాడ్తారు.

**corium** the dermis, underneath the epidermis మనకు కనపడు త్వచము అడుగున ఉండే అసలు చర్మము.

**corn** a horny hardy mass over areas of pressure and friction, usually over the foot or hand, *see/చూడండి* callosity. ఆనె: కాలులోగానీ చేతిలోగానీ ఒత్తిడి/రాపిడి ఉన్న ప్రదేశములో పెరిగే గట్టి కొమ్ములాంటి ముద్ద.

**cornea** the transparent anterior black portion of the eye, *see/చూడండి* kerato. *resemblance:* transparent glass cover over the dial of the wrist watch. శుక్లపటలము: పారదర్శకమైన, కంటి నల్లగుడ్డుయొక్క ముందుభాగము. పోలిక: రిస్ట్‌వాచ్ పైన ఉండే పారదర్శకమైన గాజుకప్పు/మూత.

**cornification** keratinization. the conversion of cells into the horny layer of the skin కొమ్ములాగా గట్టిపడటం, శృంగీకరణం.

**corona** crownlike eminence కిరీటము: కిరీటముయొక్క ఆకృతిగల శరీరభాగము. 1. top of skull పుర్రె పైభాగము. ఇది మొండెము మీదనున్న అస్థికూటమికి టోపి. 2. crown of a tooth పన్నుయొక్క పైభాగము. 3. round ridge over glans penis శిశ్నాగ్రము చుట్టూరా వలయాకారములో నుండే కంకణము.

**coronal** structure resembling a crown కిరీటాకృతిగల నిర్మాణము. **c. plane,** plane of the body across the skull, *i.e.* from side to side at the level of the ears కిరీట; శరీరమునకు అడ్డముగా కపాలమునకు అడ్డముగా అనగా చెవుల సమములో ఒకప్రక్కనుండి మరియొక ప్రక్కకు ఉన్న అడ్డతలము. *figur.* crowning the beauty queen in a contest/pageant అలంకార. అందాల భామ శిరస్సు అలంకరించుట. **c. suture,** line of junction of the frontal bone with the two parietal bones లలాట ఎముక మరియు రెండు పార్శ్వఎముకల కలయిక చోటునగల కిరీట సీమంతము [*in contr.* sagittal భిన్న. సమమితార్థ].

**coronary** encircling an organ; coronary arteries supply blood to the muscles in the walls of the chambers of the heart (myocardium) అవయవముచుట్టూ ఉన్నవి, పరిహృదయ: గుండె కండరములకు రక్తమునిచ్చి పోషించే ధమనులు.

**coronary thrombosis** *colloq.* heart attack. blocking of coronary arteries గుండెపోటు: కొరొనరి ధమనులలో రక్తప్రవాహమునకు అడ్డను/ఆటంకము కలుగుట.

**coroner** officer to investigate the cause of an unnatural death, *i.e.* under suspicious circumstances సందిగ్ధావస్థలో అనుమానాస్పదమైన పరిస్థితులలో సంభవించు దుర్మరణము గురించి విచారణ జరుపు అధికారి.

**corporeal** pertaining to the physical body భౌతిక శరీర సం.

**corpse** cadaver శవము. a dead body మృతదేహము.

**corpulent** stout, obese, unduly fat బలిసిన, అమితముగా క్రొవ్వెక్కిన.

**cor pulmonale** pulmonary heart disease: heart disease due to pulmonary hypertension ఊపిరితిత్తుల రక్తపోటు అనే రుగ్మత వలన గుండెలో కలిగే పరిణామము/జబ్బు.

**corpus** [corpora *pl.*] body/structure శరీరములోని భాగము/నిర్మాణము. **c. callosum,** bridge of white matter connecting the two cerebral hemispheres మెదడు రెండు గోళార్ధములను కలుపు మజ్జాభాగము. **c. cavernosum,** erectile tissue in the penis and clitoris గుహ్య అవయవములలోనున్న, ఉబ్బును పొందే కణజాలము. **c. luteum,** a yellow mass in the ovary at the site of the extrusion of ovum అండము విసర్జింపబడిన తర్వాత అండకోశములో ఆ ప్రదేశమునందుండు పసుపుపచ్చముద్ద.

**corpuscle** A. *naked eye str.* ప్రత్యక్షచూ. పదార్థం, పదార్థరేణువు. amyloid change of Malpighian body, resembling boiled/cooked sago-grains ప్లీహంలో ఉడికిన సగ్గుబియ్యం గింజలవలె కనపడే ఎమైలాయిడ్ క్షీణత. B. a microscopic speck of protoplasm కణము. *micro str.* సూక్ష్మ.చూ. **genital c's,** nerve endings over the mucous membrane of genitals and around nipples గుహ్య అవయవములమీదను, చూచుకము చుట్టూతా ఉన్న సూక్ష్మనాడీతంతుల

కొనలు. **red blood c's** ఎర్ర రక్తకణములు. **tactile c's,** Pacinian c's, 2$\mu$ in diameter, nerve endings in the skin, *resemblance:* cocktail onion పెసీనియన్ కార్పసిల్స్, చర్మములోనున్న సూక్ష్మస్పర్శ నాడీతంతులకొనలు, *పోలిక:* ఉల్లిపాయపొరలవలె బంధనకణజాలపొరలు కలిగి ఉంటాయి. **white blood c's** శ్వేతరక్తకణములు.

**corrosive** a caustic agent which erodes tissues, *N.B.* stricture oesophagus after swallowing corrosive తినివేయు, సంక్షారము: కణజాలమును తొలిచివేయు క్షారము, *గమనిక:* క్షారము మ్రింగిన తర్వాత అన్నవాహికయొక్క అవరోధము/సంకోచము/అకుంచనము.

**cortex** outer coat in an organ వల్కలము: అవయవముయొక్క వెలుపలి కంచుకము. **adrenal c.,** the outer firm layer of the adrenal gland; it secretes life saving hormones, mineralocorticoids, glucocorticoids ఎడ్రినల్ కార్టెక్స్; ప్రాణాధారమైన హార్మోన్లు స్రవింపజేయును. **cerebral c.,** gray matter in the cerebral hemisphere మెదడు గోళార్ధములోని బూడిదరంగు పదార్థము. **renal c.,** outer part of kidney containing glomeruli and convoluted tubules మూత్రపిండములోని వెలుపలి భాగము.

**corticospinal tract** pyramidal tract. a massive bundle of nerve fibres originating in the brain (motor cortex) and descending down in the spinal cord మెదడులో బయలుదేరి వెన్నుపాము ద్వారా క్రిందకుజారే స్థూలమైన నాడీసముదాయం.

**corticosteroids** cortisol, cortisone – hormones secreted by the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్ హార్మోన్లు.

**cortisol** hydrocortisone, adrenal cortical steroid. It is essential to life. ఎడ్రినల్ కార్టికల్ స్టిరాయిడ్. మనుగడకు ముఖ్యం. *N.B.* Prednisolone is a synthetic steroid. ఇది సంయోగికమైన స్టిరాయిడ్.

**cortisone** It is converted into cortisol in the body శరీరంలో కార్టిసాల్‌గా మారుతుంది.

**Corynebacterium** a genus of bacteria, causes diphtheria, *see/చూడండి* diphtheria. బాక్టీరియాలో ఒక ప్రజాతి, కంఠవాతము నకు కారణభూతమైనది.

**coryza** cold, nasal catarrh, discharge from nose, *see/చూడండి* cold. ముక్కుపడిశము, జలుబు, రొంప, సర్ది.

**cosmetic** 1. beautifying అందమునిచ్చు. 2. giving proper shape and contour అంగరాగము, రూపురేఖలనిచ్చు, *e.g.* **c. surgery** అంగరాగ శస్త్రచికిత్స.

**costiveness** constipation మలబంధం, మలబద్ధం, మలబద్ధకం, మలనిరోధ(న)ము.

**costo-** combining form relating to the ribs ప్రక్కటెముకలకు సం.

**costochondral junction** the joining place of a rib and its cartilage ప్రక్కఎముక మరియు దాని మృదులాస్థి కలియుచోటు.

**costochondritis** thoracochondralgia, Tietze's disease, swelling and tenderness of costal cartilages ఛాతి మృదులాస్థులయొక్క వాపు, నొప్పి.

**couching** displacing the cataract lens downwards out of the line of vision which is practised by quacks by a needle inserted into the eye, *see/చూడండి* lens. This is a dangerous procedure. కంటిలో శుక్లమును సూదితో క్రిందకు తొలగించుట. వెంటనే చూపు వస్తుందిగాని ఇది ప్రమాదకరమైన చిటకా – బూటకపు వైద్యుడు చేసేపని.

**cough** a reflex ప్రతీకారచర్య. Cough is the watchdog of the respiratory tract; any little stimulus from anywhere evokes the reflex. violent forceful noisy expulsion of air from the lungs. దగ్గు: ప్రతీకారము – దగ్గు శ్వాసవాహికలకు కుక్కకాపలాకాస్తూ ఉంటుంది; ఈ ప్రతీకారము/దగ్గుతెర (bout of cough) రేకెత్తబడుటకు ఎక్కడైనా కాస్త ప్రేరేపణ చాలు. దగ్గు అంటే బలాత్కారముగా ఊపిరితిత్తులనుండి శబ్దముతో నిశ్వాసము. **dry c.**, associated with little expectoration పొడిదగ్గు. **ear c.**, cough produced by disease of ear చెవిజబ్బులో దగ్గు. **hacking c.** గొంతు గీరినట్లు దగ్గుబాధ. **nagging c.** గుర్రం/పోనీ సకిలింత వలె దగ్గు. **productive c.**, associated with lot of sputum ఎక్కువ కఫముతో కూడిన దగ్గు. **reflex c.**, due to irritation of some remote organ, *e.g.* stomach disease [illegible]

దూరమైన అవయవము, ఉదా. జఠరముయొక్క జబ్బులో ప్రతీకార దగ్గు. **whooping c.** కోరింత/కక్కాయి/కక్కువాయి దగ్గు; కుక్కదగ్గు.

**counselling** 1. patient counselling, giving advice, a helping process for your client (patient) to know about a disease, *e.g.* counselling before HIV testing, and for HIV test positives కొన్ని జబ్బులలో రోగికి తగు సలహా ఇచ్చుట, ఉదా. హెచ్.ఐ.వి. టెస్ట్ చేసేముందు, మరియు ఈ టెస్ట్ పాసిటివ్ ఉన్నవారిలో. 2. student counselling.

**count** numerical evaluation గణనము: సంఖ్య లెక్కించుట. **blood c.,** count of red cells, white cells, platelets ఎర్ర, తెల్ల రక్తకణముల మరియు ప్లేట్లెట్ల సంఖ్య ఎంచుట. **differential c.,** count of different types of white cells (leucocytes) తెల్లరక్తకణములలో వివిధ రకముల కణముల సంఖ్య లెక్కపెట్టుట.

**counter** a device that counts, *e.g.* **Geiger c.** లెక్కపెట్టే పరికరం.

**counter-** combining form meaning/denoting opposite, opposed, against. **c.irritant,** *e.g.* ointment ప్రతిరేపెడు గుణంకల, ఉదా. మలాం. **c. shock,** defibrillation in cardiology హృద్రోగములలో గుండె స్తంభనకు షాక్. **c. signature,** say of a medical certificate మెడికల్ సర్టిఫికెట్ పై రూఢిచేసే సంతకం.

**counting chamber** a glass slide with microscopic subdivisions to count cells underneath microscope సూక్ష్మదర్శినిలో చూసి కణములు లెక్కపెట్టే గాజుస్లైడ్/పలక/బిళ్ళ.

**Cowperitis** inflammation of Cowper's glands ఈ గ్రంథుల ఇన్ఫ్లమేషన్.

**Cowper's glands** glandula bulbourethralis. glands discharging mucoid secretion, situated above the bulb of corpus spongiosum, ducts opening into urethra; the secretion wets the inside of urethra, *see/చూడండి* bulbourethral glands. పురుషుల మూత్రనాళమును తడిచేయు, శ్లేష్మరూప స్రావమును తయారుచేసే గ్రంథులు.

**cowpox** vaccinia. eruptive disease in cattle, similar to smallpox in humans, but milder పశువులలో మశూచి, మనుష్యులలో మశూచివలె, కాని తక్కువ ఉద్ధృతంగా.

**coxa** 1. the hip తుంటి. 2. hip joint తుంటికీలు.

**coxalgia** 1. pain in the hip తుంటినొప్పి. 2. pain in the hip joint తుంటికీలు నొప్పి.

**cramps** painful spasms in muscles, *e.g.* **writer's c.** cramps in the hand muscles due to the act of excessive writing నొప్పితోకూడిన స్నాయువుల ఈడుపు, ఉదా. ఎక్కువసేపు/కాలం వ్రాస్తున్నప్పుడు చేతిలో సంభవించు యీడుపులు.

**cranial** side towards head తలదిక్కుగా [*Cf.* caudal తోరత. క్రింది దిక్కుగా].

**cranial nerves** 12 pairs of nerves pertaining to the brain, some sensory, some motor, some mixed 12 జతల కపాలనాడులు, కొన్ని జ్ఞానేంద్రియ, కొన్ని చాలక, కొన్ని మిశ్రమనాడులు.

**cranioclast** instrument to perforate the skull of a dead fetus and drag it out of the womb మృతశిశువుయొక్క కపాలములో రంధ్రముచేసి దానిని బయటకు లాగే పనిముట్టు.

**craniometry** measurement of the skull కపాలపు కొలతలు.

**craniostenosis** premature closure of cranial sutures, resulting in malformation of the skull కపాల ఎముకల సీమంతములు అకాల పక్వతచెంది, పుర్రె వికృతాకారం చెందుట.

**craniotomy** 1. opening into the skull కపాలములో రంధ్రంచేయుట. 2. perforation of the head of fetus భ్రూణకపాలచ్ఛేదన.

**cranium** the skull, bony box కపాలము, పుర్రె, ఎముకలపెట్టె.

**crap** *sl.* 1. faeces మలం. 2. nonsense ఛీ.

**craving** strong desire to enjoy, especially in an addict తీవ్రమైన కోరిక, తృష్ణ. **c. for alcohol** త్రాగుడుకు త్రాగుబోతుకుగల తృష్ణ.

**crease** any of the grooves over the joints in the hand అరచేతి కణుపులమీది గీత/ముడుత.

**creatine** an amino acid in muscle కండరములోనుండు అమైనో అమ్లము.

**creatinine** an anhydride of creatine అనార్ద్ర క్రియాటిన్.

**creatinuria** excretion of increased amounts of creatine through/in urine క్రియాటిన్ మూత్రంలో ఎక్కువగా విసర్జింపబడుట.

**crepitations** fine crackling sounds heard at the fag end of inspiration on auscultation by a stethoscope స్టెతాస్కోప్‌లో ఉచ్ఛ్వాసము చిట్టచివరకు వినపడే సున్నితమైన ధ్వనులు.

**crepitus** 1. crackling sounds felt by hand on pressing over (a) an organ which contains air in locular/loculated spaces, *e.g.* the lung (b) an area of subcutaneous emphysema చేతితోనొక్కితే తగులు స్పర్శ ధ్వనులు (a) ఊపిరితిత్తిమీద (b) గాలి చర్మము అడుగున గూడుకట్టుకొని ఉన్న ప్రదేశముమీద. 2. bony crepitus felt by movements/rubbing of the fractured ends of bone విరిగిన ఎముకల అంచుల రాపిడివలన కలుగు ధ్వనులు.

**cretin** a child with cretinism మరుగుజ్జు, థైరాయిడ్ లోపంవలన కురచగా ఉన్న పాప, పిల్ల.

**cretinism** congenital hypothyroid state or lack of thyroid secretion with resulting deformity, dwarfism and idiocy in infancy and childhood శైశవము మరియు బాల్యంలో థైరాయిడ్ గ్రంథి కొరత/లోపము వలన కలుగు వికారరూపము, మరుగుజ్జుతనము, మూఢత్వము.

**cricoid cartilage** circular cartilage beneath the voice box (larynx) ముద్రిక ఉపాస్థి: శబ్దపేటిక దిగువ భాగమున ఉండే వలయాకారపు మృదులాస్థి.

**crisis** 1. the turning point in a disease either (a) for better, *e.g.* in pneumococcal/lobar pneumonia, or (b) for worse, *e.g.* ventricular fibrillation in cardiac disease వ్యాధి తీవ్రతలో మార్పు (a) నయమగుట, ఉదా. న్యూమోనియా (b) ముమ్మరమగుట, ఉదా. గుండెజబ్బులో జఠరికలు సోలిపోయినప్పుడు. 2. outburst of activity in the evolution of the disease process, *e.g.* **adrenal c.**, in Addison's disease గండము, సంకటావస్థ: ఎడిసన్ వ్యాధి ఉద్ధృతము.

**critical** dangerous అపాయకరమైన. perilous విషమించిన/ఉపద్రవమైన.

**croup** obstruction of the larynx in infants and children resulting in barking cough and stridor పిల్లలలో శబ్దపేటికలో అడ్డువలన వాయువు

స్తంభించి, కుక్క మొరుగుడులాంటి దగ్గు మరియు గొంతులో కూత ఏర్పడే స్థితి.

**crown** top of a structure శిఖరము, మకుటము. 1. upper enamel-covered portion of a tooth పంటిమీద ఉండే గట్టిపింగాణివంటి కప్పు. 2. **artificial c.,** over tooth, usually metallic కృత్రిమమైన, లోహముతో తయారు చేసిన పన్ను తొడుగు.

**crude drugs** medical *bot.* ముడి ఓషధులు.

**crural** referring to the leg or thigh కాలికి గాని తొడకు గాని సం. (అలంకార. గమనిక: ఈ భాగం అప్పుడప్పుడు 'క్రూరం' అవవచ్చు).

**crust** dry brittle scab over wound పక్కు/చెక్కు.

**cry** 1. weep ఏడ్పు. 2. greeting card by CRY (Child Relief and You).

**cryosurgery** to freeze and destroy unwanted tissue పనికిరాని కణజాలమును మంచుగా మార్చి నశింపజేయుట.

**cryptic** occult గుప్తమైన. 1. **c. disease,** hidden disease గుప్తరోగము. 2. obscure disease మరుగైన వ్యాధి, మాయదారి జబ్బు [*in contr.* overt భిన్న. బహిరంగమైన, మరుగులేని].

**cryptomenorrhoea** or **cryptomenorrhea** hidden menses గుప్త బహిష్టు, ప్రచ్ఛన్న ఋతువు. causes haematocolpos గుప్త రక్తస్రావంవలన యోనిలో రక్తం జమ అగుట. causes: కారణములు: (i) imperforate hymen కన్నెపొర అఛిద్రము (ii) atresia of the vagina యోనియొక్క అవివర్తత, వికసించని ద్వారం, వికసించని రంధ్రం.

**cryptorchism** *syn.* cryptorchidism. failure of one testis or both testes to descend into the scrotal sac గుప్తవృషణస్థితి: వృషణము(లు) అది/అవి ఉండే సంచిలోనికి దిగకుండుట.

**cubitus** 1. elbow కూర్పరము: మోచేయి, చేతిముడుకు. 2. the portion of the upper extremity below the elbow చేతి ముడుకుయొక్క దిగువభాగము. **c. valgus,** the forearm deviates away from the mid-line of the body on extension of the elbow ముడుకు చాపినపుడు ముంజేయి శరీరమధ్యరేఖకు వెలుపలివైపుకి వంగుట. **c. varus,** the forearm deviates toward the mid-line of the body on extension of

the elbow ముడుకు చాపినపుడు ముంజేయి శరీరమధ్యరేఖ వైపుకు వంగుట.

**Culex** genus of mosquitoes, vectors of disease, *e.g. C. fatigans,* its bite producing filariasis దోమల ప్రజాతి, వ్యాధి ఆరోహకాలు, ఉదా. ఈ దోమకాటువలన ఫైలేరియా జబ్బు ప్రబలుతుంది.

**culture** propagation of organisms/living tissue cells సంవర్ధనము: సూక్ష్మజీవులనుగాని, కణములనుగాని, కణజాలములనుగాని సంరక్షించి వాటి సంఖ్య పెరుగునట్లు చేసేసాధన. **c. medium,** nutritious food for the above process పై సాధనకు పోషక ఆహారము. **hanging drop c.,** culture of material inoculated into a drop hanging from a slide గ్లాస్‌స్లయిడ్‌నుంచి వ్రేలాడుతున్న బిందువులోనికి పదార్థము ఎక్కించి దాని సంవర్ధనము చేయుట. **tissue c.,** maintenance of a tissue in vitro, *i.e.* 'in glass', a process carried outside the body బాహ్య జీవప్రక్రియలో కణజాలములను పోషించుట.

**cumin** or **cummin** *bot.* seeds of a herb used as a spice జీలకఱ్ఱ, జీలకర. 1. ingredient in cooking తిరగమూత/తాలింపులో ముఖ్యమైన దినుసు, రుచికారి. 2. useful in digestive disorders జీర్ణఅపవ్యవస్థల్లో వాడ్తారు.

**cunnilingus** or **cunnilinctus** stimulation of a woman's outer sexual organs with the mouth/tongue నోరు/నాలుకతో స్త్రీ యొక్క బాహ్యలైంగిక అవయవములను ప్రేరేపించుట. 1. [Latin *cunnus* vulva+*lingere* to lick] భగమును నాకుట. 2. *figur.* [Latin *cunnus* vulva linctus=honey] *అలంకార.* భగమధువుగ్రోలుట.

**curcuma** turmeric పసుపు. *see/చూడండి* turmeric.

**cure** restore a person to health స్వస్థత చేకూర్చు, నయం చేయు.

**curettage** scraping of the inner surface of an organ, *e.g.* uterus with a curet, a spoon-shaped device స్పూను/చమ్చావంటి పనిముట్టుతో గర్భాశయములాంటి అవయవములోపలివైపున కొబ్బరి తురుమునట్లు గోకి, ఆ పదార్థమును బయటికి తీయుట.

**curry leaves** *bot.* native plant of India కరివేప ఆకు, వాడు.భా. కరే పాకు. 1. ingredient in cooking తాలింపులో ముఖ్యమైనది. 2. useful in digestive disorders జీర్ణ అపవ్యవస్థలకు మంచిది.

**Cushing's disease** characterized by obesity, diabetes, hyper tension and hirsutism వ్యాధిలక్షణములు: కొవ్వుకాయం, మధుమేహం, అధికరక్తపోటు మరియు శరీర అతిరోమత్వం. causes: కారణములు: (i) hyperplastic adrenal glands or adrenal tumour ఉత్తేజమైన ఎడ్రినల్ గ్రంథులు లేదా ఎడ్రినల్ కంతి (ii) hyperplasia of the anterior pituitary పూర్వ పిట్యూటరి (గ్రంథి) యొక్క ఉత్తేజం.

**cuspid** a canine tooth కోఱపన్ను [*Cf.* bicuspid tooth: premolar *తారత.* అగ్రచర్వణకము].

**cusps** the doors in the valve in the chambers of the heart హృదయ కుహరములలోనున్న కవాటముయొక్క తలుపులు.

**cutaneous** pertaining to the skin చర్మమునకు *సం.*

**cuticle** *anat.* epidermis, *see/చూడండి* epidermis. బహిఃచర్మము (బహిశ్చర్మము), బాహ్యాచర్మము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. skin at the base of a finger/toe nail గోరు మొదలున చర్మము. **dental c.,** dental plaque, a film on the enamel of some teeth కొన్ని పండ్ల ఎనామిల్ మీది పాచి. *micro. str.* సూక్ష్మ.చూ. a layer on an epithelial cell ఉపకళాకణముమీది స్తరము.

**cutis** the skin చర్మము. *figur.* She has a cute cutis. *అలంకార.* కోమలాంగియొక్క కోమలమైన త్వచము.

**cyanide poisoning** poisoning to death by potassium or sodium cyanide మారణమైన సైనైడ్ విషమునకు గురియగుట.

**cyanocobalamin** vitamin $B_{12}$ విటమిన్ $B_{12}$.

**cyanosis** bluish discolouration of the skin and mucous membranes. This occurs mainly in diseases of the heart, lungs and blood. నీలవర్ణము: చర్మము మరియు శ్లేష్మపొర నీలవర్ణముగా మారుట. ఇది ముఖ్యముగా గుండె, ఊపిరితిత్తుల మరియు రక్తపు రుగ్మతల్లో అగపడును.

**cybernetics** *sing.n.* comparitive study of communications and automatic control processes in biological systems, *e.g.* in nervous system of humans ఉదా. మానవ నాడీ వ్యవస్థ జ్ఞానంలో కంప్యూటర్ పద్ధతులు.

**cyst** any closed sac మూసుకొని ఉన్న తిత్తి. 1. (a) containing fluid, *e.g.* **Baker's c.,** behind the knee ద్రవము కలది, ఉదా. మోకాలు వెనకాల బేకర్ తిత్తి (b) containing semisolid material, *e.g.* **sebaceous c.,** రోమకూపములలోనుండి పుట్టిన తిత్తి – ఇందులో క్రొవ్వులాంటి పదార్థము ఉంటుంది. 2. **parasitic c.,** *e.g.* **hydatid c.** పరాన్నజీవి ప్రభావమువలన పుట్టే తిత్తి, ఉదా. హైడాటిడ్ తిత్తి.

**cysteine** an amino acid, abundant in keratin ఎమైనో అమ్లం, కెరాటిన్‌లో సమృద్ధంగా ఉంది.

**cystic fibrosis** a hereditary disease affecting the pancreas, bronchi and intestinal glands due to blockage by thick mucus క్లోమము, శ్వాసనాళములు, పేగులలోని గ్రంథుల్లో చిక్కటి శ్లేష్మం పేరుకున్నందువలన కలిగే జబ్బు. ఇది వంశపారంపర్యముగా వస్తుంది.

**cystine** an amino acid ఎమైనో అమ్లము.

**cystinuria** metabolic disorder wherein there is urinary excretion of cystine and other amino acids ఎమైనో అమ్లములు మూత్రంలో కనపడే జీవ(న)క్రియ అపవ్యవస్థ. a cause of renal stones మూత్రపిండ వ్యవస్థకు సం. శిలలకారకం.

**cystitis** inflammation of the urinary bladder మూత్రాశయము యొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**cystocele** urinary bladder projecting into the vagina యోనిలోనికి మూత్రకోశము పొడుచుకొని వచ్చుట.

**cystoscopy** examination of the interior of the urinary bladder by passing an endoscope into it మూత్రాశయాంతర్‌దర్శిని: ఒక వంపుడు గొట్టముద్వారా మూత్రాశయములోపల పరీక్షించుట.

**cystostomy** surgical opening into the urinary bladder; a flexible tube is inserted for effective drainage of urine, *e.g.* **suprapubic c.**

మూత్రాశయ ఛిద్రీకరణము: మూత్రాశయములో రంధ్రముచేసి అందులో వంపుడు నాళము గ్రుచ్చి మూత్రము బయటకు రప్పించు ఉపాయము.

**cytogenetics** branch of genetics dealing with cells and chromosomes జన్యుశాస్త్ర విభాగము: కణములు మరియు క్రోమోసోమ్‌ల గురించిన విశదీకరణము.

**cytology** the study of cells కణశాస్త్రము: కణములగురించి తెలుసుకొనుట.

**cytosine** a base found in nucleic acid కేంద్రకామ్లములలో ఉన్న నత్రజని ఆధారము.

**cytotoxic** toxic to cells కణములకు విషపూరితమైన.

# D d

**dacryoadenitis** or **dacryadenitis** inflammation of the lacrimal gland బాష్పగ్రంథి ఇన్‌ఫ్లమేషన్.

**dacryocyst** lacrimal sac బాష్పవాయువు తిత్తి.

**dacryocystectomy** surgical excision of the wall of the lacrimal sac అశ్రుతిత్తి చుట్టూ పొరను శస్త్రచికిత్సద్వారా తీసివేయుట.

**dacryocystitis** inflammation of lacrimal sac అశ్రుకోశశోథము: కన్నీరుతిత్తి యొక్క 'నొప్పి వేడి మంట వాపు'.

**dacryocystotomy** incision into the lacrimal gland బాష్పగ్రంథిలో కత్తిగాటు.

**dactyl** dactylus. 1. a digit, finger or toe చేతి/కాలి వేలు/వ్రేలు. 2. bone inside finger or toe చేతి/కాలివేలు ఎముక.

**dactylia** syndactyly. webbed fingers or toes. *see/చూడండి* syndactyly.

**dactylitis** inflammation of a dactyl, *e.g.* TB dactylitis అంగుళియొక్క శోథము: డాక్టిల్ యొక్క 'నొప్పి వేడి మంట తీపు వాపు', *ఉదా.* డాక్టిల్‌కు టి.బి. సోకుట.

**dactylology** communication/sign language of the deaf and dumb with movement of fingers – seen in television programme వేళ్ళకదలికతో చెవిటి మరియు మూగవారి ఎరుక చేయు/గురుతు చూపు భాష – ఈ సంజ్ఞలతో టెలివిజన్/టి.వి.లో వార్తల ప్రోగ్రాము చూస్తుంటాము.

**D and C (D&C)** *abbr.* dilatation & curettage, *see/చూడండి* curettage. an operation in which the cervix is dilated and the inside of uterus is scraped or the contents in the uterus are brought out డి&సి సంకేతాక్షరములు: గర్భకోశము ద్వారము వెడల్పు చేసి, లోపలి భాగమును గోకుట/గీకుట లేదా గర్భాశయములోని పదార్థములు బయటకు తీసే శస్త్రచికిత్స.

**dandruff** a skin disease with dry scales on the scalp, *figur.* a popular TV advertisement చుండ్రు: తలపై కేశముల మధ్యనుండు

చంద్రుడువ్యాధి – ఇది ఒక చర్మవ్యాధి, అలంకార. టి.వి. ప్రకటనల్లో అకర్షణీయము.

**dapsone** drug for leprosy కుష్ఠరోగమునకు ఔషధం.

**datura** *bot.* a poisonous plant, its fruit ఉమ్మెత్త చెట్టు, కాయ.

**day blindness** hemeralopia. defective vision during day or a bright light పగటి చీకటి లేదా కాంతి చీకటి [*in contr.* night blindness భిన్న. రేచీకటి].

**DDT** dichloro diphenyl trichloroethane, formerly used as an insecticide; now not popular పూర్వం క్రిమినాశినిగా వాడేవారు; ఈ రోజుల్లో వినుతి తక్కువ.

**deaddict** to wean away from addiction, *e.g.* drug ఉదా. మందు అలవాటు/వ్యసనము నుండి తప్పించుట.

**deaf-mute** a person not able to hear and speak; deaf and dumb వినుట మరియు మాట్లాడుట చేతకానివాడు; చెవిటి మరియు మూగ stone-deaf = బ్రహ్మచెవుడు.

**deafness** inability to hear బధిరత్వము. **conduction d.**, due to defect of conduction to cochlea వహన బధిరత: కర్ణావర్తానికి సంవహనలోపంవల్ల కలిగే చెవుడు. **nerve d.** నాడీబధిరత: శ్రవణనాడుల లోపం వలన కల్గు చెవుడు.

**death** end of life మృత్యువు. *figur.* Death is a visitation from God. అలంకార. మరణం మృత్యుదేవత పిలుపు.

**death rattle** terminal gurgling noise in throat and respiratory passages, a sign of impending death మృత్యుఘర్ఘరం: అవసానకాలములో/అంతిమదశలో గొంతు మరియు శ్వాసనాళములలో గురక – రాబోయే చావు చిహ్నము/సూచన.

**debility** physical weakness బలహీనత, నీరసము, నిస్త్రాణ. **general d.** శరీరమంతా చతికిలబడిపోవుట.

**debridement** removal of or cutting the dead material in a wound till the margin of exposure of healthy tissue గాయాన్ని శుభ్రపరచటము: జీవకణజాలములు వెలిసే/కనపడేవరకు గాయములోని చెడిపోయిన కణజాలములను తొలగించే/కోసే శస్త్రచికిత్స.

**debris** dead material చెడిన/మృత కణజాలముల సముదాయము.

**decalcification** decrease in the normal mineral salts (chiefly calcium) of a bone or tooth ఎముకలోగాని పంటిలోగాని ఖనిజ లవణములు (ముఖ్యముగా సున్నం) క్షయించుట/తక్కువగుట.

**decapitation** to sever the head from the body in a fetus in unavoidable circumstances, during delivery, *e.g.* hydrocephalus పురిటిసమయములో భ్రూణముయొక్క తలను మొండెమునుండి విడదీసే అనివార్యమైన శస్త్రచర్య, ఉదా. జలశీర్షం అనగా భ్రూణము తలలో నీరు(ద్రవం) చేరి తల ఉబ్బురోగము.

**decay** 1. decomposition of dead tissue, *e.g.* **tooth d.** పుప్పి, దంతక్షయము; మృతకణజాలము కుళ్ళిపోవుట, ఉదా. పుప్పిపన్ను, పుచ్చిపోయిన పన్ను. 2. process of aging వయసు ముదిరి వృద్ధాప్యములోనికి దిగజారుట.

**deceased** dead person చనిపోయిన మనిషి [*Cf.* diseased person తారత. జబ్బు మనిషి].

**decerebrate rigidity** stiffness of the body in a brain-damaged person మెదడు చెడిపోయిన మనిషిలోని శరీరపు బిర్రు.

**decidua** endometrium of the pregnant uterus which is shed after delivery పతనమయ్యే పొర: కాన్పు/పురుడు సమయములో విసర్జింపబడే గర్భస్థ అంతఃపొరలు.

**decolo(u)ration** removal of colour విరంజనము, వివర్ణము.

**decolo(u)risation** help/cause removal of colour, *e.g.* in staining విరంజనకరణము, ఉదా. అభిరంజన ప్రక్రియలో.

**decompensation** inability/failure to compensate a handicap or inadequacy, usually refers to cardiac decompensation resulting in heart failure వికలమునుగాని అసమర్థతనుగాని సరిదిద్దలేకపోవుట, సాంప్రదాయక ఉదా. గుండె వీటిని సరిదిద్దలేక సోలిపోవుట.

**decomposition** decay, putrefaction కుళ్ళిపోవుట.

**decompression sickness** *see/చూడండి* caisson disease. *Note:* 1. Decompression sickness of aviators is a simillar one but of lesser severity. విమానయానుల సుస్తి. 2. Also another

similar discomfort. Passengers travelling by air develop 'ear block' if the ascent or descent is too rapid. గమనిక: విమానము ఆరోహణము/ ఊర్ధ్వగమనము, అవరోహణము/దిగుట అతి త్వరితగతిలో జరిగితే ప్రయాణికులు 'చెవిపోటుకు' గురి అవుతుంటారు.

**decongestant** an agent to relieve congestion, *see*/చూడండి congestion. శ్లేష్మపొరయొక్క 'నొప్పి వేడి మంట ఎరుపు వాపు' పోగొట్టు మందు.

**decongestion** relief of congestion రక్తాధిక్యత తగ్గించడం.

**decorticate** 1. removal of the outer covering of a structure వల్కలము తీసివేయుట. 2. absence of the above covering మస్తిష్కవల్కలం లేదు/లేని స్థితి.

**decortication** operation to remove the thickened outer layer of an organ, *e.g.* d.of pleura over the lung అవయవముమీద గట్టిపడి, లావెక్కిన పొరను శస్త్రచికిత్సతో ఛేదించి తీసివేయుట, ఉదా. ఊపిరితిత్తి మీది పొర కోసివేయుట.

**decubitus** 1. particular posture/position of the body, *e.g.* **lateral d. position** శరీరవిన్యాసము: ఒక ప్రత్యేకమైన అంగవిన్యాసము/రీతి, ఉదా. ఒకప్రక్కకు తిరిగి పరుండుట. 2. **d. ulcers,** so called bed sores శయన వ్రణములు, ఎక్కువకాలము వెల్లికిల పరుండి ఉంటే ఉత్పన్నమయ్యే నడుముమీద వ్రణములు.

**defaecation** or **defecation** passing of stools విరేచనమగుట, మలవిసర్జన. అలంకార. పురీషపుసుక్కు.

**defect** imperfection కొరత. **acquired d.,** acquired after birth పుట్టిన తర్వాత సంభవించినది. **atrial septal d.** గుండెలో రెండు ఏట్రియమ్‌ల మధ్యగోడలో లోపము. **congenital d., birth d.** పుట్టుకతో వచ్చిన దోషము. **filling d.,** any defect in the contour of any region in the gastro intestinal tract అన్నాశయాంత్రిక పథములో ఏ ప్రాంతంలోనైనా ఆకృతి వెలితి. **ventricular septal d.** గుండె జఠరికల మధ్యగోడలో అసంపూర్ణత.

**defence mechanism** 1. body's defence against the onslaught of infection, disease, *etc.* క్రిమిసంపర్కం, వ్యాధి, మొ. ఒడుదుడుకు

లను ఎదుర్కొనే శరీర రక్షణవ్యవస్థ. 2. in psychology: subconscious effort of blocking unpleasant memories మనోవిజ్ఞానశాస్త్రంలో: అసంతోషకరమైన/హేయమైన జ్ఞాపకాలను మరచిపోవుట.

**lefibrillator** an instrument that restores normal rhythm of the heartbeat గుండె కొట్టుకొను లయపద్ధతిని సరిదిద్దు/సక్రమము చేయు యంత్రము.

**leficiency** inadequate supply, *e.g.* **vitamin d.** లోపము: ఏదైనా పదార్థము శరీర అవసరములకు చాలని స్థితి, ఉదా. విటమిన్ లోపము.

**leformity** distortion or malformation in any part వైకల్యము: శరీరములో ఏ భాగమునకైనా విరూపము, వికారము, కురూపము.

**legeneration** deterioration, decline in the function and integrity ఉపభ్రష్టము, క్షీణించటం, క్షీణత, క్షీణము, హీనస్థితి/తక్కువ స్థితికి వచ్చుట/దిగజారుట; వికాసము క్షీణించుట.

**leglutition** the act of swallowing మ్రింగుట.

**lehydration** loss of fluids from the body, *e.g.* in states of diarrhoea, blood loss, vomitings, heat stroke/sunstroke, diabetes, excessive use of diuretics, burns, shock, *etc.* నిర్జలీకరణము: తడి తక్కువైన స్థితి. శరీరములోని ద్రవములు వెడలిపోవుట, ఉదా. అతిసారము, రక్తస్రావము, వాంతులు, ఎండవడ (దెబ్బ), మధుమేహము, మందులవల్ల విస్తారముగా మూత్రంపోవుట, శరీరముమీద కాల్పులు, అఘాతము కలిగించే సన్నివేశములు/ప్రమాదములు/జబ్బులు, మొ. స్థితులలో, అలంకార. ద్రవమూలమిదం శరీరమ్.

**dejection** 'low in spirits' – a state of depression and melancholy 'ఉరవడిలో తరుగు' – మనస్సు క్రుంగిపోయి వ్యాకులత చెందుట.

**delirium** mental instability in high fever, toxic state in infections, poisoning by drugs, *etc.*, *e.g.* in typhoid (enteric fever) సంధి ప్రేలాపన: చిత్తభ్రమ; సన్నిపాతము. విపరీతమైన జ్వరములోను, కొన్ని అంటురోగ జ్వరములలోను, మందుల విషపరిణామములోను కనపడే మనస్సు చాంచల్యము/చంచలత్వము, ఉదా. సన్నిపాత జ్వరములో సన్నిపాతము.

**delirium tremens** poisoning due to alcohol excess, marked by tremor, confusion, anxiety and hallucinations మద్యోన్మాదము: మద్యపాన నిషాలో వణుకు, కలవరం, ఆదుర్దా మరియు విభ్రమము.

**delivery** baby birth శిశుజన్మ, బిడ్డను కనుట. 1. natural expulsion of fetus called **normal d.** సహజ ప్రసవము/కాన్పు: శిశువు యోనిద్వారా నిష్క్రమించబడుట. 2. **abdominal d.**, *see/చూడండి* Caesarean section. శస్త్రచికిత్స. 3. **d. of goods** సరుకుల బట్వాడా.

**deltoid** 1. triangular in shape త్రిభుజాకారము. 2. deltoid muscle on shoulder ఈ పేరుగల కండరము, అధిస్కంధపేశి.

**delusion** a false belief based on incorrect judgement, *e.g.* **grandiose d.**, a common man posing himself as an emperor భ్రాంతి: నిజముకాని నిర్ణయముతో తప్పైన నమ్మకము, ఉదా. సామాన్యుడు నేను చక్రవర్తి/సార్వభౌముడు అని అనుకొను అపోహము.

**dementia** gradual deterioration in the intellectual faculties like memory, judgement and change in personality మతిభ్రంశము: తెలివితేటలు, జ్ఞాపకశక్తి, వివేకము క్రమేణ క్షీణించుట మరియు మూర్తిమత్వములో మార్పు.

**dementia praecox** or **precox** schizophrenia, a mental disease, *see/చూడండి* schizophrenia. మనోవిదళనము, ఒక మానసిక రుగ్మత.

**demography** science dealing with population parameters like health, disease/morbidity and mortality జనాభా విజ్ఞానము: జనాభాకు సం. ఆరోగ్యము, అనారోగ్యము, మరణము వగైరా అంశములు వివరించే శాస్త్రము.

**demulcent** 1. soothing, non-irritating ointment ఉపశమనము కలుగజేయు, రేపెడు గుణములేని మలాము/లేపనము. 2. bland oily, slimy, slippery medication నూనెలా జారే ఔషధము.

**dendrite** process of the nerve cell నాడీకణముయొక్క తంతుక. *micro. str.* సూక్ష్మ.చూ. fine threadlike process in a neuron తంత్రికాక్షిక: నాడీకణమునుండి వెడలు (దారమువంటి) తంతువు.

**dengue** *syn.* break-bone fever, dandy fever. a tropical viral fever characterised by unbearable pains in head, eyes, muscles

and joints, transmitted by a mosquito వైరస్‌వలన కలుగు జ్వరము. భరింపజాలని తల, కన్నుల, కండరముల మరియు కీళ్ళనొప్పులు దీని లక్షణములు – ఇది దోమకాటువలన సంభవిస్తుంది.

**dental caries** *see/చూడండి* caries.

**dentalgia** toothache పన్నునొప్పి.

**dentifrice** toothpaste పళ్లు శుభ్రపరచుటకు వాడే పదార్థం (పేస్టు).

**dentin** or **dentine** or **dentinum** the component of the teeth దంతధాతువు: నోటి పళ్లలోని అంశము/పదార్థము.

**dentist** a doctor practising filling, removal of teeth, fitting artificial teeth, *etc.* దంతవైద్యుడు.

**dentistry** the work of a dentist డెంటిస్ట్ చేయుపని.

**dentition** eruption of teeth దంతనిర్మాణము: పండ్లయొక్క మొలక. **deciduous d.,** the teeth that erupt first after birth (also called temporary teeth, milk teeth in childhood) చిన్నతనములో వచ్చు తాత్కాలిక పళ్ళు/పాలపళ్ళు, అలంకార. పాపపళ్ళు. **permanent d.,** the teeth that erupt after the temporary teeth fall out (there are 16 teeth above and 16 below, in health) తాత్కాలికపళ్లు ఊడిపోయిన తర్వాత మొలకెత్తు శాశ్వత పళ్ళవరుస (ఆరోగ్యవంతునిలో 16 పళ్లు పైన, 16 పళ్లు క్రింద ఉంటాయి).

**denture** 1. artificial set of teeth కృత్రిమముగా తయారుచేసిన పళ్లవరుస. 2. Nowadays dental implants are fixed permanently into the bones of both the lower and upper jaw by means of delicate metal bridges and screws. ప్రస్తుతం ఈ కృత్రిమ పళ్లను సున్నితమైన లోహపు వంతెనలు మరియు మరమేకులతో నోటిలో క్రింద పైన ఎముకలకు బిగిస్తున్నారు.

**deodorant** any substance which destroys or masks (unpleasant) odour, *e.g.* potassium permanganate, hydrogen peroxide దుర్గంధనాశిని.

**dependence** succour by way of drugs when the person has become an addict, otherwise he/she will suffer from withdrawal symptoms ఔషధాధీనత: మందుల ఆసరా తీసుకుని దురభ్యాసమునకు

బానిస అవటం, లేకపోతే ఆ మందు కొరత వలన క్షోభమునకు గురి అవుతాడు/అవుతుంది.

**depilatory** an agent to remove hair usually under arms and under legs and at unwanted places రోమనిర్మూలకం: చంకల లోను మరియు గుహ్యప్రదేశములోను, అవాంఛనీయమైన చోట్లలోను రోమములను తీసివేయు/నివారించు లేపనము.

**depressant** a drug to reduce physical or mental activity శారీరక లేదా మానసిక చురుకుదనం తగ్గించే మందు.

**depression** 1. a mental state of dejection, melancholy and battered/shattered spirits. The person in depression has no interest in surroundings, feels his life a waste and thus loses his career opportunities, especially in the prime of life. అవసాదము, క్రుంగిపోవుట: మానసికంగా క్రుంగిపోయి, వ్యసనముతో వ్యాకులత చెంది, దిగజారి, జీవిత హంగులు/హోదాలు వదలుకున్న పరిస్థితి. ఈ వ్యక్తి తన జీవితం వృధా అనుకుని, పైకివచ్చి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకునే ప్రౌఢ వయస్సులో తన పురోగమనము కోల్పోతాడు. 2. In **endogenous d.**, there are suicidal tendencies, in addition. ఈ రుగ్మతలో ఆత్మహత్య ఆలోచనలుకూడా వెంబడిస్తుంటాయి.

**depressive** related to depression (see above) అవసాదమునకు సం. **d. disorder** అవసాద అపవ్యవస్థ. **d. psychosis** అవసాద మనోవికారము. **d. reaction** అవసాదక ప్రతిచర్య.

**derange** to disrupt చిందరవందర చేయు; to throw into disorder or confusion అస్తవ్యస్తం చేయు.

**derangement** disruption అస్తవ్యస్తం, తారుమారు.

**Derbyshire neck** goitre. *see/చూడండి* goitre.

**derivative** derived from something ఉత్పన్నమైనది.

**dermalgia** or **dermatalgia** dermatodynia. pain over skin, localised చర్మంమీద నొప్పి, స్థానికంగా.

**dermatitis** inflammation of the skin చర్మముయొక్క శోథము/'నొప్పి వేడి మంట దురద వాపు'.

**dermatographism** dermatography, dermagraphy. urticaric whealing lesions after a stroke/scratch on the skin గోకిన, బరికిన తర్వాత చర్మంమీద ఎలర్జి ఎరుపు చారలు/క్షతములు.

**dermatologist** specialist in skin diseases చర్మవ్యాధులలో నిపుణుడు/పారీణత పొందినవాడు.

**dermatology** 1. branch of medicine dealing with skin diseases త్వక్‌శాస్త్రం: చర్మవ్యాధుల విజ్ఞానము/చికిత్సాశాఖ. 2. Dermatology, a medical journal వైద్యవార్తాపత్రిక.

**dermatome** 1. an instrument for cutting thin slices of skin, usually for grafting అంటుగట్టుటకు చర్మాన్ని సన్నని తునకలుగా చేసే పనిముట్టు. 2. area of skin supplied by a single spinal nerve ఒక్క కశేరునాడి యొక్క ప్రభావం చూపే చర్మప్రాంతం.

**dermatomycosis** fungus disease of the skin ఫంగస్‌వలన కలుగు చర్మవ్యాధి.

**dermatomyositis** a disorder of connective tissue/collagen involving the skin, subcutaneous tissues and muscles చర్మము, చర్మము దిగువనుండు కణజాలములు మరియు కండరములు గురియగు బంధనకణజాలముయొక్క వ్యాధులు.

**dermatophytosis** dermatomycosis, epidermophytosis: a fungal infection of the skin చర్మమునకు ఫంగస్ సోకుట.

**dermatosis** [dermatoses *pl.*] any skin disease, notably the one without signs of inflammation 'నొప్పి వేడి మంట వాపు' ముఖ్యాంశముగా లేని చర్మవ్యాధి.

**dermis** the true skin, situated underneath the epidermis: (Epidermis is the skin we see.) అంతశ్చర్మము: మనకు కనపడే త్వచముయొక్క అడుగున ఉండునది.

**dermographia** or **dermographism** or **dermography** dermatographism. *see/చూడండి* dermatographism.

**dermoid** cyst or tumour containing hair, teeth and bone; the latter two are visible on X-ray film జుట్టు, పళ్లు మరియు ఎముక ఉన్న తిత్తి లేదా కంతి; పళ్ళు, ఎముక ఎక్స్‌రే ఫోటోలో కనపడుతాయి.

**Dermo-jet** apparatus for delivery of fluid into the dermis under pressure చర్మంలోనికి ఏదైనా ద్రవం ఒత్తిడితో చొప్పించే పరికరం. employed in the mass vaccination of BCG బి.సి.జి. టీకాలు పలువురికి ఒక విడతలో వేయుటకు వాడ్తారు/వీలుగా ఉంటుంది.

**dermopathy** any skin disorder ఏదైనా చర్మ అపవ్యవస్థ. **diabetic d.** మధుమేహంలో కనపడే చర్మ అస్వస్థత.

**descending colon** descending part of the large intestine పెద్దప్రేగులోని అవరోహణ భాగము. [*Cf.* ascending colon ఆరోహణ భాగం].

**desensitisation** a course of injections given to a patient with allergy. The injection contains the allergen (that which causes allergy) in infinitesimal dose thereby accustoming his tissues to tolerate the offending allergen. గ్రాహకతను తగ్గించటము: వరుసగా కొన్ని ఇంజక్షన్లు ఇచ్చు క్రమము. 'తినగ తినగ వేము తియ్యనుండు' అను సూక్తి ననుసరించి రోగికి విలక్షణమైన పదార్థమును అతనికి అనంత సూక్ష్మమైన మోతాదులలో అలవాటుచేస్తే క్రమేణా ఆ విలక్షణమైన పదార్థము శరీరములో చేరినప్పుడు దానిని కణజాలములు ఒప్పుకుంటాయి/ఇముడ్చుకుంటాయి.

**desmoid** a benign projection of the periosteum, *e.g.* **periosteal d.**, in the femoral condyle ఒక సాధారణ/నిరపాయ ఎముకపిలక – ఇది ఊర్వస్థియొక్క కందమునకు రావచ్చును, పోలిక: కందపిలక, కందకు పిల్లకందము.

**desquamation** shedding of scales on the skin. These have resemblance to dried petals of chrysanthemum flower. చర్మము మీది పొరలు రాలిపోవుట, పోలిక: ఎండిన చామంతి పువ్వు రెక్కలవలె రాలిపోవుట.

**detachment** separation విడిపోవటము: **d. of retina** which is separation of the layer of retina in the eye కన్నులో రెటీనా అను పొర విడిపోవుట.

**detoxification** detoxication. measures to annul the toxic effects of a drug or disease మందు/వ్యాధి వలన కలుగు విషసంబంధమైన పరిణామము/పర్యవసానమును నిష్ఫలముచేయు సాధనలు.

**development** stages in growth ఎదుగుదలలోని మెట్లు/ఘట్టములు. **child d.**, milestones in the growth of a child like crawling, walking, *etc.* ఎదుగుదల, వికాసం, అభివృద్ధి, ఎదగడంలో ఘట్టములు: పారాడుట, నడచుట, మొ. అలంకార. ఈ ఘట్టములు ఆరోగ్యానికి గీటురాళ్ళు. developmental psychology especially in a growing child వికాసాత్మక మనోవిజ్ఞానము, ముఖ్యముగా ఎదిగేపిల్లలలో.

**deviant** 1. in psychology: one who deviates from the norms మనోవిజ్ఞానశాస్త్రంలో: నిర్ణీతపద్ధతులు తిరస్కరించి తప్పుదారి తొక్కేవాడు. 2. a person erratic in sexual behaviour అస్తవ్యస్తమైన లేక విడ్డూరమైన లైంగిక ప్రవర్తన కలవాడు.

**device** a contrivance for a purpose to be achieved, *e.g.* **intra uterine d.** (IUD), a metal loop is inserted into the womb (uterus) to prevent conception సాధనము, యుక్తి: ఒక లక్ష్యమునకు ఒక సాధన, ఉదా. గర్భనిరోధము కొరకై గర్భకోశములో లూప్ వేయుట.

**devitalize** to deprive the tissues of their life/vitality సజీవ కణజాలములయొక్క ముఖ్యావశ్యకమైన ప్రాణమును హరించుట.

**dextran** a substitute for blood plasma for I.V. (intravenous) use రక్తంలోని ప్లాస్మాకు బదులు వాడ్తారు, సిరలోనికి ఎక్కిస్తారు.

**dextrin** or **dextrine** a soluble polysaccharide.

**dextrocardia** position of the heart in the right hemithorax (normally it is in the left hemithorax) గుండెకాయ ఛాతీలో కుడి అర్ధభాగములో నుండుట (సహజస్థితిలో అందరిలో ఇది ఛాతీలో ఎడమ అర్ధభాగములో ఉంటుంది).

**dextrose** one form of sugar ఒకరకమైన చక్కెర పదార్థము.

**diabetes insipidus** insipid, tasteless చప్పని [*in contr.* mellitus భిన్న. తియ్యని] due to destructive lesion of posterior pituitary and deficient secretion of antidiuretic (water retaining) hormone, *see*/చూడండి vasopressin. అతిమూత్రవ్యాధి, ఉదకమేహము: పరాంత పిట్యూటరి నాశపరిణామమువలన అతిమూత్రమును అరికట్టు (ఉదకమును శరీరములో ఉంచుకొను) హోర్మోన్ స్రావముయొక్క లోపము ఉన్నవ్యాధి.

**diabetes mellitus** mellitus [Latin, sweetened with honey]. *figur.* the 'sweet disease'. a result of the inability of the body to handle glucose (sugar). Insulin, a secretion of the pancreas controls blood sugar. This disease is a disorder of carbohydrate (starch) metabolism marked by excessive sugar in blood and urine. అతి/మధు మూత్రము, మధుమేహము, మధుప్రమేహము, వాడు.భా. చక్కెరవ్యాధి: క్లోమములో తయారైన ఇన్సులిన్ రక్తములో చక్కెరను హద్దులో ఉంచుతుంది. కార్బోహైడ్రేట్ (పిండిపదార్థము) యొక్క జీవ(న)క్రియలోని దోషమువలన ఈ జబ్బు సంభవిస్తుంది.

**diabetic** 1. one who has diabetes డయాబిటిస్ జబ్బుగలవారు. 2. relating to diabetes డయాబిటిస్‌కు సం.

**diagnosis** recognizing – 'work-up' to know the name of a disease వ్యాధి నిర్ణయము, రోగనిర్ధారణము: రోగము 'ఫలానా' అని తెలుసుకొను ప్రయత్నము/కృషి. *N.B.* Doctor is worried about diagnosis; patient is worried about prognosis.

**dialysis** the procedure of separation of crystalloids and colloids in solution హంసక్రియ, సారాసార వివేకము: వరణాత్మక విసరణ పద్ధతిననుసరించి ద్రావణములోని వేరువేరు పరిమాణముగల ద్రావణ అంశములను ప్రవేశ్యశీల/పారగమ్యపొరద్వారా విడదీయుపద్ధతి. 1. *see/* చూడండి haemodialysis. 2. peritoneal dialysis, dialysis through the peritoneum ఆంత్రవేష్టనముద్వారా హంసక్రియ.

**diapedesis** escape of blood corpuscels through intact capillary walls in inflammatory conditions ఇన్‌ఫ్లమేషన్‌లో రక్తకేశనాళికల పరిధిగుండా రక్తకణములు బయలువెడలుట.

**diaphoresis** perspiration చెమట, స్వేదము.

**diaphoretic** sudorific, a drug or an agent causing diaphoresis స్వేదవర్ధకము: చెమట కల్గించే ఔషధం లేదా చెమటపోసేటట్లు చేసే సాధన(ము), అలంకార. చెమటపోసే కాయకష్టము/వ్యాయామము ఆరోగ్యమునకు సోపానము.

**diaphragm** musculotendinous partition between the thorax and abdomen ఉదరవితానము, విభాజకపటలము: ఛాతీకి ఉదరకుహరమునకు మధ్య ఉన్న పరదా. ఇది ఒక కండరస్నాయుబంధనము.

**diaphysis** the shaft of a long bone అస్థిఖండము: పొడుగు ఎముకయొక్క నిడుపు/నిడివి.

**diarrhoea** or **diarrhea** excessive evacuation of fluid stools from the bowels అతిసారము, ద్రవవిరేచనములు, బేదులు, దస్తులు.

**diastase** 1. contains enzymes to aid in the digestion of starches బీజశర్కరికము: గంజి పదార్థములను అరిగించే ఎంజైములు గలది. 2. used in dyspepsia అజీర్ణంలో వాడ్తారు.

**diastole** the period of dilatation of the ventricles; rest and relaxation for them as they fill with blood హృద్వ్యాకోచము: గుండెలోని జఠరికల విస్ఫారసమయము; ఈ సమయము జఠరికలకు కాస్త విశ్రాంతి, నిర్బంధ నివారణము. రక్తము లోనికి రాబట్టుకొన బడుట. అరోగ్యములో జఠరికలు నిముషమునకు 72 నుండి 75 సార్లు ముడుచుకుంటాయి, ఒక సంకోచము మరి తర్వాత సంకోచము మధ్య ఈ డయాస్టొలె విరామము [*in contr.* systole భిన్న. సంకోచము].

**diastolic** 1. pertaining to diastole డయాస్టొలెకు సం. 2. *see/చూడండి* blood pressure.

**diathermy** 'glorified fomentation', heating of body tissues by electrically operated devices, *e.g.* **short wave d.**, which produces amelioration of pain and inflammation 'ఉడుకు నీళ్లకాపడము మహిమ', శరీర కణజాలములను విద్యుచ్ఛక్తి యంత్రములతో వేడి చేస్తారు. దీనివలన 'నొప్పి వాపు' లో కొంత ఉపశమనము ఏర్పడుతుంది.

**diathesis** vulnerability to a particular disease, *e.g.* Adler's theory of organ/system susceptibility. In one family one may suffer from gastric ulcer, another blood relative may suffer from ulcerative colitis (susceptibility of the alimentary system). In another family one may suffer from asthma, another blood relative may suffer from emphysema (susceptibility of the respiratory system), *see/చూడండి* constitution. ప్రవృత్తి, అడ్లర్ సిద్ధాంతము: జబ్బుకు గురియగు తత్వము, ఉదా. ఒక వంశములో, రక్తసంబంధం ఉన్నవాళ్ళలో ఒకరికి పొట్టలో పుండు, మరియొకరికి ప్రేగుల జబ్బు (విరేచనములు) (అనగా జీర్ణవ్యవస్థ జబ్బులు) రావటం కద్దు. ఈ

వంశములో కడుపు, ప్రేవులు బలహీనంగా ఉండి జబ్బులకు గురి అవుతున్నాయి అని వైద్యశాస్త్రము చెబుతుంది. ఇంకొక వంశములో ఒకరికి ఊపిరితిత్తుల ఉబ్బసము, ఇంకొకరికి ఊపిరితిత్తి ఎమ్ఫిసిమా (అనగా శ్వాసవ్యవస్థ జబ్బులు) కనపడవచ్చు. ఈ వంశంలో ఊపిరితిత్తులు బలహీనంగా ఉండి జబ్బులకు గురి అవుతున్నాయి అని అంటారు.

**diazepam** sedative, anti-anxiety drug నిద్రాకారి, అదుర్దారాహిత్యమునకు తోడ్పడుతుంది. కలత/క్షోభము నివారణకు మద్దతునిస్తుంది.

**diclofenac sodium** a prostaglandin inhibitor, a drug for relief of pains of rheumatism రుమాటిసమ్ నొప్పులకు ఔషధము.

**diet** quantity and quality of food and drink items to sustain the metabolism of tissues ఆహారము, భోజనము: కణజాలముల జీవ(న)క్రియ నిలుపుటకై కొలతలోను శ్రేష్ఠతలోను సరిపడే తిను బండారములు మరియు త్రాగు ద్రవములు. **balanced d.**, adequate amounts of carbohydrates, proteins, fats, vitamins, minerals and water/beverages (fluids) సమతుల్య/సరితూగు ఆహారము: పిండి పదార్థములు, ప్రోటీన్లు, క్రొవ్వులు, విటమిన్‌లు, ఖనిజములు మరియు నీరు/పానీయములు (ద్రవములు) కావలసినంత మోతాదులో. **diabetic d.** మధుమేహం వ్యాధిలో ఆహారము. **low calorie d.**, in obesity క్రొవ్వుకాయులకు తక్కువ కేలరీలుగల తిండి. **low salt d.**, in hypertension and states of oedema గుండెపోటు మరియు శరీరములో నీరు పట్టినప్పుడు/చేరినప్పుడు ఉప్పు తగ్గించాలి.

**dietary fibre** *see/చూడండి* fibre.

**dietetics** the study about diet, *see/చూడండి* diet. పథ్యపానములు: ఆహారవిషయముల శాస్త్రం.

**dietician** or **dietitian** one who prescribes diet according to the needs in diseases జబ్బులలో ఆహారము ఏమి ఎంత తీసుకోవాలో నిర్ణయించు నిపుణుడు.

**differential diagnosis** method in the evaluation of a disease by comparison/elimination of similar diseases భేదాత్మక రోగ నిర్ణయము/నిర్ధారణము.

**diffuse** widely spread (as opposed to localised) విస్తరిత, సర్వత్రా వ్యాపించినది (వ్యతి. స్థానికమైనది).

**diffusion** the process of becoming widely spread వ్యాపనము, వ్యాపించుట, విసరణ ప్రక్రియ.

**digastric** muscle having two bellies రెండు వ్రక్కలుగానున్న కండరము.

**digestion** absorption and assimilation of food/drink జీర్ణక్రియ: తిన్నవి/త్రాగినవి పీల్చబడి మరియు సమానము చేయబడుట.

**digestive system** all the organs concerned with digestion, like liver, pancreas, stomach, intestines, *etc.* జీర్ణక్రియ వ్యవస్థ: జీర్ణమునకు సం. అవయవములు, అనగా లివర్, పాంక్రియాస్, అన్నాశయము, పేగులు, మొ.

**digestive tract** the alimentary canal జీర్ణక్రియమార్గము, ఆహారనాళము.

**digit** a finger or toe చేతివేలుగాని కాలివేలుగాని.

**digitalis** extract from foxglove, a plant. used in the treatment of heart diseases ఔషధం, వృక్షసారం: హృద్రోగములలో వాడ్తారు.

**dilatation** dilation 1. widening an orifice, *e.g.* **d. of cervix** during D & C, *see/చూడండి* D and C. విస్ఫారణము: రంధ్రము పరిధి వెడల్పు చేయుట, ఉదా. ఈ ఆపరేషన్‌లో గర్భకోశద్వారమును వెడల్పు చేయుట. 2. widening the inside of a tubular structure, *e.g.* bile duct, to enable stones to be expelled పిత్తనాళమును వెడల్పు చేసి దాని పరిమాణము పెంచుట – ఈ ప్రక్రియద్వారా లోపల శిలలు విసర్జింపబడుటకు అవకాశము కల్పించుట. 3. **d. of the heart,** compensatory enlargement of the chambers of the heart, with thinning of their walls హృదయ కుహరముల పరిమాణము పెరుగుట, కుహరముల గోడలు సన్నవగుట.

**dilatation and curettage** *see/చూడండి* D and C.

**dilator** instrument used to dilate వెడల్పుచేయు పనిముట్టు.

**diphtheria** an acute infectious disease caused by *Corynebacterium diphtheriae*, with formation of a greyish white pseudomembrane in the nose, throat/larynx and high fever, pain in the throat, difficulty in swallowing. The patient expresses a sensation

of 'sands in throat' due to the presence of the membrane; also, he has respiratory difficulty. A toxin is produced which causes myocarditis and neuritis. కంఠవాతము, కంఠరోహిణి: ఒక అంటువ్యాధి; ముక్కుకుహరము, గొంతు, స్వరపేటికలో బూడిద రంగుపొర కప్పబడి ఉంటుంది. విపరీతమైన జ్వరము, గొంతునొప్పి, మ్రింగుటలో కష్టము/సంకటము, 'గొంతులో ఇసుక చల్లినట్లు' బాధ ఉంటాయి. శ్వాసనాళములలోనికి గాలి పోవుటకు అటంకముంటుంది. ఈ బాక్టీరియా ఒక విషపదార్థము (toxin) ను తయారుచేస్తాయి; ఇది గుండె వాపు మరియు నాడుల వాపు కలుగజేస్తుంది.

**diphtheroid** 1. resembling diphtheria డిఫ్తీరియాను పోలి ఉంటుంది. 2. organism of *Corynebacterium* species other than *C. diphtheriae.*

**diplegia** paralysis of both legs or both feet with scissors gait ద్విపక్ష అంగవాతము: రెండుకాళ్ళకుగాని రెండుపాదములకుగాని సంక్రమించు పక్షవాతము, కత్తెరకాళ్లతో నడక. **spastic d.**, Little's disease.

**diplopia** double vision ద్విచిత్రదర్శన దోషం/ద్విబింబ దర్శనదోషం: ఒక వస్తువులో అ వస్తువుయొక్క రెండు ప్రతిమలు కనబడుట [*Cf.* triplopia].

**dipsomania** craving for alcoholic drink త్రాగుబోతుకు త్రాగుడు లేనప్పుడు వచ్చే పిచ్చి: త్రాగుడుకొరకు పడు అతురత/తపన, తాగుబోతు తంటాఖోరు తల్లడిల్లుట.

**disability** incapacity చేతకాని స్థితి. weakness బలహీనము. unwieldy condition అలవికాని స్థితి.

**disarticulation** separation of bones (amputation) at a joint కీలుయొక్క ఎముకలు విడదీయుట (అంగచ్ఛేదనము).

**disc** or **disk** a flat round structure గుండ్రటి బిళ్ళ. 1. intervertebral disc వెన్నెముకలో ఒక ఎముకకు మరియొక ఎముకకు మధ్యనున్న బిళ్ల. 2. optic disk visible through ophthalmoscope నేత్రాంతర్దర్శిని ద్వారా కన్నులో కనపడే బిళ్ల.

**discharge** 1. an excretion thrown out of the body: stools, urine, sweat విసర్జనము, శరీరమునుండి విసర్జింపబడునవి: మలము, మూత్రము, చెమట. 2. liquid/fluid eliminated from the body: mucous,

vomit, sputum, tears, semen, menstrual flow శరీరమునుండి వెడలు ద్రవములు: శ్లేష్మము, వాంతి, కళ్లె/కఫము, కన్నీరు, శుక్రము, ముట్టు (ఋతుస్రావము). 3. products from wound: lymph, serum, blood, pus గాయములో ఉండేవి: లింఫ్, సీరమ్, రక్తము, చీము. 4. exit from a hospital ఆస్పత్రి నుండి డిశ్చార్జ్/నిష్క్రమణ. 5. transmission of an action potential through a neuron, axon or muscle fibres నాడీకణము, తంత్రికాక్షము, కండరతంతువుల నారలద్వారా పయనించే ప్రేరణ. 6. perform the duty alloted/assigned తనవిధి నెరవేర్చుట.

**disease** dis-ease, lack of ease, deviation from normalcy, *e.g.* **Addison's d., von Recklinghausen's d.** అస్వస్థత, ఆరోగ్యక్రమము నుండి తొలగుట. affection, sickness, ill-health, disorder, illness, malady, scourge, ailment, trouble రోగము, జాడ్యము, వ్యాధి, సుస్తి, జబ్బు, రుగ్మత, తెవులు, కా(ఖా)యిలా, సంకటము.

**disease** types రకములు. **acute d.**, severe illness of short duration తక్కువకాలము ఉండే తీక్షణమైన/తీవ్రమైన వ్యాధి. **autoimmune d.**, due to break down of self-tolerance; reaction/revolt of self against self, *e.g.* rheumatoid arthritis సహజముగా మనిషిలో ఉండే స్వప్రయోజనము కొరకు ఓర్పు (self-tolerance) స్తంభించుట; 'తనకోపమె తనశత్రువు' అన్నట్లు తాను తన కణజాలములతో పోరాడుట, ఉదా. రుమటాయిడ్ కీళ్ళవాతం. **chronic d.**, illness of prolonged duration దీర్ఘకాలపు వ్యాధి. **congenital d.**, existing from birth, *e.g.* congenital heart disease పుట్టుకనుండి ఉన్న రుగ్మత, ఉదా. పుట్టుకతో వచ్చిన గుండెజబ్బు. **deficiency d.**, illness caused by deficiency of food factors, vitamins, minerals, hormones, *etc.* ఆహారపదార్థములు, విటమిన్‌లు, ఖనిజములు, హార్మోన్లు, మొ. లోపమువలన కలుగు జబ్బు. **degenerative d.**, produced by deterioration of tissues (mostly in aging), gradual decline in activity, *e.g.* osteoarthritis, say of the knee joint కణజాలముల క్షీణత వలన కలిగిన (ఎక్కువగా వృద్ధాప్యములో), చురుకుదనము మందగించుట, ఉదా. మోకాలు కీలులో వేదన. **familial d.**, occurring in more family members; it is usually but not always hereditary, *e.g.* familial polyposis, polyps in the colon and rectum కుటుంబసభ్యులలో పెక్కుమందికి సంభవించు

జాడ్యము; తరచుగా అనువంశికముగాని అన్ని జాడ్యములలోకాదు, ఉదా. పెద్దపేగు మరియు పురీషములో పాలిప్‌లు. **genetic d.**, chromosome aberration, Mendelian disorder జన్యువుకు సం. వ్యాధి, ఉదా. క్రొమోసోమ్ వ్యవస్థలో క్రమముతప్పిన పరిణామము, మెండేలియన్ సిద్ధాంతములో అపక్రమము. **hereditary d.**, occurring in successive generations in a family, *e.g.* 1. hereditary ataxia – Friedreich's ataxia, degeneration in spinal cord, cerebellum అనువంశిక వ్యాధి: వంశపారంపర్యముగా సంభవించు వ్యాధి, ఉదా. వెన్నుపాము, అనుమస్తిష్కము క్షీణతచెంది నీరసించుట, దుర్బలత్వము. 2. haemophilia in males with a tendency to haemorrhage హిమోఫీలియా, మగవారిలో రక్తస్రావము జబ్బు. **Iatrogenic d.**, resulting from the misadventure of the treating doctor/benefactor వైద్యుడు/ఉపకారి యొక్క దురదృష్టమువలన కలుగు/సంక్రమించు రోగము. **infectious d.**, those which sperad from one patient to another healthy individual, *e.g.* pulmonary tuberculosis, typhoid fever ఒకరోగినుండి మరియొక ఆరోగ్యవంతునకు సోకు అంటురోగము, ఉదా. ఊపిరితిత్తుల క్షయ, సన్నిపాత జ్వరము. **mental d.**, illness in psychiatry మానసిక వ్యాధి. **traumatic d.**, hot orthopedics: caused by injury, *e.g.* fracture of a bone ప్రమాదముల వలన కలిగిన క్షోభము, ఉదా. అస్థి విరుగుట.

**disinfectant** against infection, enemy of infection, an agent that kills disease germs సూక్ష్మజీవ నాశకము, రోగక్రిమినాశిని: అంటురోగక్రిములకు శత్రువు, క్రిమిఘ్ని, విషక్రిములను చంపు మందు.

**disinfestation** destruction of insects, (*e.g.* flies, mosquitoes) rats, or other animal sources that transmit diseases పురుగులు/కీటకములు, (ఉదా. ఈగలు, దోమలు), ఎలుకలు, మరి ఏమైనా రోగము కలిగించే జంతువులు – వీటిని నాశనము చేయుట/చంపుట, అలంకార: శత్రుఘ్ని.

**disintegrate** 1. a tablet to crumble into pieces/dust, to facilitate absorption of the drug in the stomach విచ్ఛిత్తి చేయుట: కడుపులో మందు పీల్చుకొనబడటానికి నోట్లో వేసుకున్న మాత్ర/బిళ్ల చిన్న

తునకలగుట/దుమ్ములా మారుట. 2. cells get decomposed in a disease process వ్యాధి పరిణామములో కణములు శిథిలమై/లయమై పోవుట.

**disk** *see/చూడండి* disc.

**dislocation** displacement of a part from its normal position చ్యుతము: శరీరములో ఒక భాగము స్వస్థానమునుండి తొలగుట. 1. the head of the humerus getting out of the glenoid cavity of the scapula, colloquially called shoulder dislocation కీలుతప్పుట, పైచేయిఎముక రెక్కఎముకనుండి వైదొలగుట – వ్యావహారిక భాషలో దీనిని బుజము జారింది అంటారు. 2. dislocation of the lens in the eye with a needle – a quack remedy for cataract *see/చూడండి* couching. శుక్లమునకు బూటకపు వైద్యుడు చేయు చికిత్స: శుక్లముగా మారిన ఆ కటకమును సూదితో తొలగించుట. ఇది చాల ప్రమాదకరము. 3. dislocation of work పనికి అటంకము.

**dismemberment** amputation of superior or inferior extremity or a part thereof ఊర్ధ్వాంగము లేదా అధోంగముకాని, వాటిల్లో కొంతభాగముగాని ఛేదించుట.

**disorder** derangement of the function of body systems or in behaviour అవ్యవస్థ: శరీర వ్యవస్థలలోగాని, మనిషి నడవడి/ప్రవర్తనలో గాని క్రమము తప్పుట. 1. **anxiety d.**, *see/చూడండి* anxiety. 2. **behaviour d.** ఒకరకమైన మానసిక వికలత. 3. **eating d.**, in obese individuals ఎక్కువ క్రొవ్వు పెంచినవారు అమితాహారులు. 4. **sleep d.** నిద్రాభంగము, మొ. 5. also, some diseases may be referred to as disorders, *e.g.* collagen disease or disorder కొన్ని జబ్బులనుకూడా ఈ పేరుతో వ్యవహరించుతూ ఉంటారు, ఉదా. కొల్లజన్ జబ్బులు.

**disorientation** a state of lack of recognition of place and time or identity seen in stuporous disorders/impending coma స్థితినిర్ధారణ రాహిత్యము: తానున్న స్థలము మరియు టైము లేదా మనిషిని గుర్తుపట్టలేని స్థితి. ఇది మైకములో కలుగుతుంది.

**dispensary** place where medicines are given/sold ఔషధశాల, మందులు ఇచ్చే/అమ్మే చోటు/ప్రదేశము, గ్రా. మందుల అంగడి.

**dispersion** 1. the act of scattering component parts of a tumour ప్రకీర్ణము: వెదజిమ్ముట, కంతిలోని భాగములు వెదజల్లబడుట. 2. **colloidal d.** కాంజికాభ పరిక్షేపణము.

**disproportion** disparity between two structures, e.g. **cephalopelvic d.**, the size of the foetal head greater than the mother's pelvic outlet. The fetus is like a frog in a crevice; the only salvation is operation, *see/చూడండి* Caesarean section. వ్యత్యాసము: రెండు నిర్మాణముల మధ్య వ్యత్యాసము/భేదము, ఉదా. తల్లి కూపకబాహ్యమార్గము కన్నా శిశువు మస్తకము పెద్దదిగా ఉండుట. కూపస్థ మండూకమువలె నున్న కూపము/కుహరములోని శిశువునకు శరణ్యమొక్కటే – అది శస్త్రచికిత్స (Caesarean section).

**dissection** 1. the act of exposing structures by dissection with scalpel and forceps performed in anatomy ఛేదనము: శరీర నిర్మాణ శాస్త్రంలో కణజాలములను కత్తిపెట్టి కోసి, స్రావణముతో పీకి, శరీరనిర్మాణములను శోధించుట. 2. **aortic d.**, longitudinal splitting of the arterial wall as a result of tear in the intima and seepage of blood into the split area. This usually occurs in thoracic aorta. బృహద్ధమని లోపలిపొర తెగి/చిరిగి ధమనిపరిధిలో నిలువుగా చీటవారి అందులోకి రక్తము ప్రవేశించుట. ఇది ఎక్కువగా బృహద్ధమని ఛాతీభాగములో జరుగుతుంది/కనపడుతుంది.

**disseminated** scattered (as opposed to localised); distributed in areas in one or different organs చల్లబడిన/వెదజల్లబడిన (వ్యతి. స్థానికముగానున్న); ఒకటిగాని లేదా ఎక్కువ అవయవములలో పంచబడినది. 1. **d. sclerosis.**, dissemination in location and time in the central nervous system, *i.e.* cerebrospinal axis. In this disease, small patches of hard tissue (sclerosis) develop in the brain and spinal cord in different regions and at different intervals of time, thereby rendering paralytic/paretic the muscles supplied by nerves starting in the area of sclerosis కేంద్రనాడీవ్యవస్థలో భాగములు వేరువేరు ప్రదేశములలో, వేరువేరు కాలములలో (అనగా ఇప్పుడు ఒకచోట మరికొంతకాలమునకు ఇంకొకచోట) గట్టిపడిపోవుట. దీని పర్యవసానము ఏమంటే – ఆ గట్టిపడిపోయిన ప్రదేశములనుండి

బయలుదేరే నాడుల అధీనములోనున్న కండరములకు పక్షవాతం/బలహీనత వాటిల్లుట/కలుగుట. 2. **d. tuberculosis,** *viz.* spread through blood stream called haematogenous dissemination రక్తముద్వారా అన్ని అవయవములకు ప్రాకిన క్షయవ్యాధి.

**dissolution** 1. separation of the components in a compound by chemical action విలీనమగుట, కరగటము, విద్రవణము: మిశ్రద్రవ్యము లోని అంశాలను రసాయన చర్యద్వారా విడదీయుట. 2. liquefaction ద్రవీకరణము: ద్రవపదార్థముగా మార్చుట/మారుట. 3. separation into component parts విలయ(న)ము, క్షయము, నాశము. 4. death అంతము/మరణము.

**distal** farther away from a point of reference. అగ్ర, దూరపు, నిర్ణీతస్థానము నుండి దూరంగా ఉన్న. [*in contr.* proximal భిన్న. సమీప].

**distend** 1. to strech out సాగదీయు. 2. to expand విస్తరింపజేయు.

**distension** or **distention** 1. streching సాగదీయుట. 2. expansion విస్తరింపు. 3. **d. of abdomen** ఉదరకుహరము ఉబ్బుట. (a) bloat with gas వాయువుతో ఉబ్బుట (b) fill with fluid ద్రవముతో నిండుట.

**distichia** or **distichiasis** The presence of two rows of eyelashes on one eyelid ఒకే కనురెప్ప అంచున రెండు వరుసల వెంట్రుకలు మొలచియుండుట.

**distilled water** water prepared by distillation స్వేదనజలం, బట్టీపెట్టి తయారుచేసిన శుద్ధజలం.

**distress** anguish ఘాతక/ఘాతుకమైన వేదన. *e.g.* **respiratory d.** శ్వాసకు సం. క్లేశము.

**disturbance** any departure from normal, *e.g.* **emotional d.** కల్లోలము: స్వస్థతకు అటంకము, ఉదా. ఉద్వేగ/ఉద్రిక్త స్థితి.

**diuresis** increased urination అతిమూత్రము: అధికముగా మూత్రవిసర్జన చేయుట.

**diuretic** an agent which augments production and the flow of urine మూత్ర వర్ధకము, మూత్రవిసర్జనమును ఎక్కువచేయు మందు/వస్తువు.

**diurnal** pertaining to or occurring during daytime or in light; పగటికి లేదా వెలుగుకు సం., పగటి యందు జరుగు [*in contr.* nocturnal భిన్న. రాత్రియందు జరుగు].

**divarication** state of diverging, రెండుగా చీలియున్న. **d. of recti, d. of rectus abdominis,** the muscle in the abdominal wall రెండుపాయలుగానున్న ఉదరకుడ్య కండరము.

**diverticulitis** inflammation of a diverticulum డైవర్టిక్యులమ్ యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**diverticulosis** presence of diverticula without inflammation 'నొప్పి వేడి మంట వాపు' లేకుండా డైవర్టిక్యులా ఉండుట.

**diverticulum** [diverticula *pl.*] a pouch or sac opening from the inside of a tubular/cavitary organ, commonly seen in the large intestine అల్పకోశము, అంధబాహువు: గొట్టపు/గుహా ఆకారములోనున్న అవయవములోపలినుండి పుట్టే జోలి/తిత్తి. ఇది తరచుగా పెద్దప్రేగులో కనపడుతుంది.

**dizygotic twins** fraternal twins, heterologous twins ద్విసంయుక్త బీజకవలలు అనగా రెండు అండాల కవలలు [*Cf.* monozygotic twins తారత. ఏకసంయుక్త బీజకవలలు, సమరూప కవలలు].

**dizziness** giddiness, unsteadiness, a sensation of reeling in head మైకము, నిలువలేకపోవుట, తలత్రిప్పడు. వాడు.భా. కళ్లు తిరగటం.

**DNA** *abbr.* 1. deoxyribonucleic acid, a component of gene జన్యువుయొక్క అంగము/అంశీభూతము. 2. *abbr.* deoxyribose nucleic acid, the hereditary material of the cell కణములోని అనువంశిక పదార్థము. **recombinant DNA,** artificially constructed DNA obtained by the insertion of a foreign DNA into the DNA in an organism. In such a set-up, the foreign DNA is replicated along with the host DNA. పునః సంయోజన DNA: ఒక జీవి DNA లోనికి పరాయి DNA ను మిళితం చేసినప్పుడు సంభవించు కృత్రిమ DNA. ఈ కృత్రిమ DNA ఆతిథేయి DNAతోపాటు ప్రతిపూరితత్వము/ప్రతికృతి/ప్రత్యుత్తరము (replication)లో పాల్గొంటుంది. This recombinant DNA technology is employed in the large scale preparation of vaccines, *etc.*

ఈ పునఃసంయోజనా విధానము/పద్ధతి బహుళ పరిమాణములో టీకామందులు, మొ. వాటిని తయారు చేయుటలో తోడ్పడుతుంది.

**doctor** 1. medical doctor వైద్యుడు. 2. D.M. Doctor of Medicine వైద్యనిపుణుడు. 3. Ph.D. in any discipline/science శాస్త్రవేత్త. 4. a learned man పండితుడు.

**dolor** pain; one of the cardinal signs of inflammation నొప్పి, వేదన: 'నొప్పి వేడి మంట వాపు'లో ముఖ్యమైనది బాధ.

**domiciliary** at home. **d. TB clinic,** medicines given and patients asked to take at home రోగికి టి.బి. జబ్బుకు మందులిచ్చి ఇంటిదగ్గర వేసుకొనమనటం. **d. treatment** గృహచికిత్స.

**donor** one who donates his body tissue for the use of others, *e.g.* **blood d., kidney d.** దాత: తనలోని కణజాలములను ఇంకొకరికి దానముచేయువ్యక్తి, ఉదా. రక్తదాత, మూత్రపిండమునిచ్చు దాత. **universal blood d.** O group, Rh negitive, one who can donate his blood to anyone సర్వజనీన రక్తదాత: O గ్రూపు, Rh నెగెటివ్ రక్తం ఎవరికైనా ఎక్కించవచ్చును.

**dopamine** a neurotransmitter; precursor of adrenalin and noradrenalin నాడీ సం. రవాణా ఔషధము. ఎడ్రినాలిన్‌కు మరియు నార్‌ఎడ్రినాలిన్‌కు అగ్రగామి.

**dope** 1. *colloq.* a drug taken for pleasure, *e.g.* bhang విలాసం/ఉల్లాసంకొరకు తీసుకునేది, ఉదా. భంగ్, గంజాయి. *figur.* twist for the brain అలంకార. మెదడును ముందు మేలుగుపరచి తరవాత మరుగున పడేసే మందు. 2. *colloq.* a drug to improve performance in athletes క్రీడాకారులను గెలుపుకొరకై ఉద్దీపించు మందు.

**Doppler scanning** ultrasound imaging of flowing blood or a beating heart ప్రవహిస్తున్న రక్తమునుగాని, కొట్టుకుంటున్న గుండెనుగాని అల్ట్రాసౌండ్ పరీక్షద్వారా చూచుట.

**dorsal** 1. pertaining to the back of the body, *e.g.* **d. spine** వీపువైపు, ఉదా. శరీరము వెనుకభాగములోనున్న వెన్ను. **d. vertebrae** వెన్నుపూసలు. 2. dorsum of any organ/part, *see/చూడండి* dorsum. [*opp.* ventral వ్యతి. బొడ్డు/ముక్కువైపు].

**dorsum** 1. the back of the body వెన్ను: శరీరముయొక్క వెనుకభాగము. 2. posterior aspect of any part/organ, e.g. **d. of hand (d. manus)** అంగము/అవయవము యొక్క వెనుక వైపు, ఉదా. అరచేయి వెనుకవైపు. 3. **d. of foot (d. pedis)** upper surface of the foot అరికాలు పైవైపు.

**dosage** details about the dose of medicine to be administered మోతాదు: ఇవ్వబోయే మందుయొక్క వివరములు.

**dose** quantity of medication or radiation to be administered at each time ఒక మోతాదు: ప్రతిసారి ఇచ్చే మందుయొక్క లేదా వికిరణముయొక్క మోతాదు.

**dosimetry** details about radiation therapy వికిరణముతో చేసే వైద్యము యొక్క వివరములు.

**DOTS** *abbr.* (Directly Observed Treatment, Short-course) is the WHO - recommended strategy for the cure of TB టి.బి./క్షయవ్యాధి చికిత్సకు ప్రపంచ ఆరోగ్యసంస్థవారు సిఫారసు చేసే విధానము - వైద్యసంస్థ వారి సమక్షమున రోగి నోట్లో మందులువేసి మింగమనుట.

**double blind trial** a procedure in which no one knows who received which drug – neither the patient nor the doctor; this enables impartial judgement regarding the effect of the drug ద్వైఅంధ విధానము: ఇందులో ఏ ఔషధం ఎవరికిచ్చింది ఎవరికి తెలియదు అనగా ప్రయోజ్యునికి (రోగికి) గాని ప్రయోక్త (డాక్టరు)కుగాని తెలియదు. ఈ పద్ధతివలన ఔషధప్రభావమును నిష్పాక్షికంగా కనిపెట్టవచ్చు.

**double pneumonia** *colloq.* pneumonia affecting both lungs వాడు.భా. రెండు ఊపిరితిత్తుల న్యూమోనియా.

**douche** 1. a jet of water forced into a body cavity to clean it, *e.g.* **vaginal d.** గొట్టంతో కడుగు: యోనిలోనికి బుస్సుమని నీటిధారపంపి శుభ్రపరచుట. 2. **air d.** The tube connecting nasopharynx and middle ear (Eustachian tube) gets blocked commonly in conditions like common cold; air is pumped into it to relieve the block. గొంతునుండి మధ్యచెవికి ఉన్న నాళము (యూస్టేషియన్ నాళము) దిబ్బడ వేసినప్పుడు అందులోనికి గాలి కొట్టుట - ఈ

దిబ్బెడ జలుబు చేసినప్పుడు తరచుగా అందరికి అనుభవము. Inflation of the Eustachian tube is called politzerization.

**Douglas' pouch** Douglas' cul-de-sac, rectouterine pouch, rectouterine excavation. a pocket between the rectum and uterus డగ్లస్ సొరంగము/బిలము, డగ్లస్ జోలె. మలాశయము గర్భసంచికి మధ్యనున్న కీచే.

**down** 1. fine, soft hair మృదువైన, సిల్కులా ఉండే, నిగనిగలాడుతూ ఉండే కేశములు, అలంకార. కేశసంపద. 2. down with illness జబ్బుతో క్రుంగిపోయి, కృశించిపోయి. 3. Drinking & Smoking 'down down' మద్యం, పొగతాగుట 'వద్దు వద్దు'.

**Down's syndrome** also called mongolism. mongol facies, retarded growth, mental retardation, caused by abnormality of chromosomes క్రోమోసోమ్‌లలోని లోపము వలన కలిగే శారీరక మానసిక క్షీణము, మంగోల్ ముఖము వగైరా దోషములు.

**DPT** *abbr.* diphtheria - pertussis - tetanus vaccine కంఠవాతము - కక్కాయి దగ్గు - ధనుర్వాతము రాకుండా వేయు టీకాలు.

**dracontiasis** guinea worm infection; infestation with *Dracunculus medinensis*, also called 'fiery serpent' నారికురుపు వ్యాధి.

**Dracunculus medinensis** *syn.* guinea worm. నారికురుపు పురుగు.

**drain** a tube for drainage of secretions in a cavity, wound, abscess, *etc.* అవయవము/శరీరములో ఏదైనా కుహరము, గాయము, చీముగడ్డనుండి ద్రవముల పారుదలకు ఏర్పరచునాళము.

**drainage** the procedure of putting a drain and discharging secretions కారిపోవడము: డ్రైన్ నాళముపెట్టి ద్రవములను బయటకు రానిచ్చుట. The dictum is that unwanted thing in the body must be let out. శరీరంలోని పనికిరాని పదార్థం తీసివేయుట డాక్టరు విధి.

**dressing** any material (usually gauze and cotton) to cover and protect any wound గాజుగుడ్డ మరియు దూదితో గాయమును కప్పి రక్షణముగావించుట.

**dribbling** leaking drop by drop, *e.g.* **d. of urine** బొట్లు బొట్లుగా కారుట, ఉదా. మూత్రం బొట్లు బొట్లుగా పడుట.

**drip** infusion of fluid drop by drop, *e.g.* **intravenous d.** చుక్కలు చుక్కలుగా ద్రవమును శరీరములోనికి ఎక్కించుట, ఉదా. సిరలోనికి ఎక్కించుట. **d.irrigation** *bot.* started in Israel first.

**droop** hang down, *e.g.* drooping breast; drooping upper eyelid వ్రేలాడు, ఉదా. వ్రేలాడుతున్న స్తనము; వ్రేలాడుతున్న పైకనురెప్ప (నిమీలితనేత్ర).

**drop** 1. minim, a sphere of fluid as it falls చుక్క, బిందువు, బొట్టు. 2. **wrist d.** పాణికి పక్షవాతము. 3. **foot d.** పాదమునకు పక్షవాతము. 4. descent in aeroplane విమానయానములో అది క్రిందకు దిగుట. 5. drop dead (cases of sudden death); instantaneous death, *colloq.* massive, 'heart attack' ఆకస్మిక మృతి: క్షణములో బొందిలో ప్రాణము బందు, మారణ గుండెఘాతము.

**droplet** minute sized wet particles especially when a person coughs – the secretions in the respiratory tract coughed out violently in a fine spray into the air. Air is ubiquitous/omnipresent. Pulmonary tuberculosis spreads through the tubercle bacilli in these droplets coughed by a patient, called **d. infection.** సూక్ష్మ బిందువు: మనిషి దగ్గినప్పుడు శ్వాసకోశవ్యవస్థనుండి బలాత్కారమైన దగ్గుతో కోటానుకోట్లు తుంపరలు గాలిలోనికి వెలువడుతాయి. గాలి సర్వవ్యాపి. క్షయరోగి దగ్గుతుంపరలలో ఈ బాసిల్లై ఉంటాయి. క్షయ ఒక అంటువ్యాధి. ఈ క్రిములను ఆరోగ్యవంతుడు పీలిస్తే టి.బి.కి గురి అవుతాడు.

**dropper** a device for putting drops of medicine in the mouth, eye, ear, *etc.* చుక్కలువేసే పరికరము: నోరు, కన్ను, చెవిలో మందుచుక్కలు వేసే సాధనము.

**dropsy** oedema, accumulation of fluid in the body, *see*/చూడండి oedema. ఉబ్బువ్యాధి: నంజు, ఒళ్ళు ఉబ్బు, దేహములో ద్రవము చేరుట.

**drug** 1. any medicinal material, *e.g.* nonsteroidal anti inflammatory drug (NSAID) ఔషధపదార్థము. **d. abuse,** a slogan against drug abuse by Ministry of Welfare: A puff, a pinch, a bite can push you into the darkness of night. 'Shun Drugs' సంక్షేమ శాఖ హితబోధ: ఒక నిషా దమ్ము, ఒక చిటికెడు పదార్థము, ఒక పంటిగాటు, ఒక సూది పోటు నిన్ను చీకట్లోకి నెట్టివేస్తాయి. కాబట్టి 'మాదకద్రవ్యాలు మాను', 'మాదకద్రవ్యముల మాట ఎత్తకు'. *N.B.* Athletes take recourse to drugs to enhance their performance levels, which is against sports ethics. *గమనిక:* క్రీడానీతికి విరుద్ధంగా క్రీడాకారులు తమ శక్తిని ఉత్తేజపరచే మందులు వాడుతారు. 2. Drug, a journal ఔషధశాస్త్ర వార్తాపత్రిక.

**drug addiction** *see/చూడండి* addiction.

**druggist** pharmacist, a trader dealing in/dispensing medicines మందుల అంగడివాడు.

**drug store** a chemist's shop, medical shop మందుల షాపు/దుకాణం.

**drug tolerance** agreement/well-being while using the drug without exhibiting any side/toxic effects ప్రతికూలమైన/విషసంబంధమైన పరిణామములు లేకుండా వాడుతున్నమందును ఇముడ్చుకొనగలుగుట.

**drunkenness** intoxication, inebriety: state after ingestion of liquor marked by disorientation and violent behaviour, *see/చూడండి* disorientation. త్రాగిన మైకము, త్రాగుబోతు లక్షణములు: మత్తు, మైకము, కైపు; గుర్తుపట్టలేకపోవుట మరియు దౌర్జన్యము.

**duct** tubed structure in which excretions or secretions flow, *e.g.* **bile d.** వాహిక, నాళము, గొట్టము: విసర్జన పదార్థాలుగాని గ్రంథిజనిత స్రావములుగాని పారు గొట్టము, ఉదా. పైత్యరసము పారు నాళము. **thoracic d.** వక్షీయ వాహిని.

**ductless gland** a gland which has no duct but the secretion enters directly into the blood stream; also called endocrine gland, *e.g.* thyroid gland వినాళగ్రంథి, వినాళికా గ్రంథి, నాళరహిత గ్రంథి, ఉదా. థైరాయిడ్ గ్రంథి [*Cf.* exocrine *తారత.* నాళసహిత గ్రంథి].

**ductus arteriosus** communication between the aorta and pulmonary artery in fetus which normally closes after birth.

If it does not close, the condition is named patent ductus arteroisus (PDA) బృహద్ధమనిని పుపుస ధమనిని కలుపు గొట్టము. ఇది గర్భస్థపిండములో ఉంటుంది; శిశువు భూమిమీద పడ్డతర్వాత మూసుకుపోతుంది. అట్లా మూసుకుపోని పక్షమున 'ప్రత్యక్ష ధమనీ వాహిని' (PDA) అంటారు.

**dull** 1. stupid మందబుద్ధియైన, మందకొడి. 2. not resonant on percussion, a method of clinical examination అనునాదము లేకపోవుట: వైద్యుడు రోగియొక్క ఛాతీమీదగాని పొట్టమీదగాని ఒక వేలుంచి దానిపైన మరొక చేతివేలుతో కొట్టి పరీక్షచేయుట.

**dumb** unable to talk మూగ. dumb-bell tumour ముద్గర/ఢమరుక ఆకారములోనున్న కంతి.

**duodenal** pertaining to the duodenum అంత్రమూలమునకు సం. **d. cap,** seen on barium meal examination (X-ray) డియోడినమ్ టోపి, ఎక్స్‌రే పరీక్షలో కనబడుతుంది. **d. ulcer,** డియోడినమ్‌లో పుండు.

**duodenitis** inflammation of the duodenum ప్రథమాంత్రం యొక్క 'మంట ఎరుపు వాపు' – శోథం, ఇన్‌ఫ్లమేషన్.

**duodenostomy** stoma=mouth, opening. a surgically created fistula, *e.g.* cholecystoduodenostomy, a fistula in between the gall bladder and duodenum శస్త్రచికిత్సానిర్మిత కృత్రిమనాళం, ఉదా. పిత్తాశయము మరియు ప్రథమాంత్రము కలుపుట.

**duodenotomy** a surgical cut into the duodenum అంత్రమూలము లోనికి కత్తిగాటు, శస్త్రచికిత్స.

**duodenum** C shaped structure – first 11 inches or 12 fingerbreadths (hence the name) of the small intestine అంత్రమూలము, ప్రేగు మూలము, ప్రథమాంత్రము, లఘ్వాంత్రము: C ఆకారములో ఉంటుంది. చిన్నప్రేగులోని మొదటి 11 అంగుళముల భాగము.

**dupp** 2nd heart sound in auscultation డుప్ప్: గుండె కొట్టుకొనుటలో రెండవ ధ్వని [*Cf.* lubb, first heart sound *తారత.* లబ్బ్, గుండె మొదటి ధ్వని].

**dura mater** outermost membrane over the brain and spinal cord పరాశిక: మెదడు మరియు వెన్నుపాముమీది వెలుపలి పొర, మేధకు దృఢమైనకాపు/రక్షణ.

**duty** a moral or legal responsibility ధర్మము, కర్తవ్యం, విధి. *N.B.* Medical doctor's duty is to prolong life of the patient. Work is worship; Duty is divine. *గమనిక:* వైద్యుని ధ్యేయం రోగి జీవితం పొడిగించుట. ప్రాణానికి వెలకట్టలేం. *హితము:* ధర్మాన్ని కాపాడండి, ఆ ధర్మం మిమ్ములను కాపాడుతుంది.

**dwarf** an undersized person, *e.g.* **pituitary d.**, as a result of hypofunction of the anterior pituitary మరుగుజ్జు, *ఉదా.* పూర్వ పిట్యూటరి గ్రంథిలోపమువలన.

**dwarfism** state of remaining as a dwarf వామనత్వము, మరుగుజ్జుగా ఉండు స్థితి.

**dye** any colouring agent రంగు, అద్దకము, రంజకము, వర్ణకారకము. 1. for staining in microbiology సూక్ష్మజీవశాస్త్రంలో అభిరంజనము/వర్ణీకరణము. 2. staining bodily structures, e.g. hair, nails *ఉదా.* కేశముల, నఖముల అభిరంజనము 3. vermilion బొట్టు, తిలకము, ఇంగిలీకము, *అలంకార:* ఏడురోజుల (వారములో రోజుకొక) సొమ్ములు; అదే కోవలో ఇంద్రధనుస్సు ఏడురంగుల (vibgyor) (వారంలో రోజుకొక రంగు) చీర, బ్లౌజ్, తిలకం, నెయిల్ పాలిష్‌తో అలంకరణ. 4. injecting a dye, *e.g.* methylene blue to track a sinus కోటరము/సరణి యొక్క మార్గము కనుగొనుటకు అద్దకమును ఇంజక్షన్ చేయుట.

**dysarthria** difficulty in articulation ఉచ్చారణయందు కష్టము.

**dysarthrosis** deformity of a joint కీలు వైకల్యము.

**dyschromatopsia** dichromatism. a form of defective colour vision ఒక రకమైన వర్ణదృష్టిలోపం.

**dyscrasia** disorder, *e.g.* **blood d.** వికారము, వికృతి: *ఉదా.* రక్తకణముల అవ్యవస్థ/తారుమారు.

**dysentery** inflammation of the large intestine, especially of the colon, resulting in frequent passage of blood and mucous in stools, e.g. **amoebic d.**, *see/చూడండి* amoebiasis. చీమురక్తవిరేచనములు:

పెద్దప్రేగు, ముఖ్యముగా కోలన్‌లో 'నొప్పి వేడి మంట వాపు' – దీనివలన చీము, రక్తముతోకూడిన విరేచనములు తరచుగా అవుతాయి. **bacillary d.** బాసిల్లై కారణంవలన చీమురక్తం విరేచనములు.

**dysesthesia** 1. impairment of sensation స్పర్శమాంద్యము. 2. disagreeable sensation to stimuli ప్రేరణకు అయిష్ట అనగా హితవుకాని ఇంద్రియజ్ఞానం.

**dysfunction** impairment of function, say of an organ అవయవము యొక్క కార్యనిర్వహణము బలహీనపరచు. విధిలోపం: సరిగాపనిచేయక/చేయలేక పోవటం.

**dysgenesis** defective embryonic development అపజననం: లోపముతో కూడిన పిండవృద్ధి, లోపభూయిష్టమైన పిండం పెరుగుదల.

**dyslexia** neurological disability in reading, writing, or spelling in a normal, intelligent person; it does not suggest mental retardation తగు తెలివి గలవానిలో చదువుట, వ్రాయుట లేదా స్పెల్లింగ్ చెప్పటలో, నరాల అపవ్యవస్థ మూలకంగా కలిగే అసామర్థ్యము; ఇది మానసిక క్షీణము సూచించదు. In fact, a dyslexic person may be even super-intelligent ఈ అపవ్యవస్థ ఉన్నవాడు మేధావి గూడా అయి ఉండవచ్చును.

**dysmenorrhoea** or **dysmenorrhea** painful menstruation బహిష్టునొప్పి: బాధతోకూడిన ఋతుస్రావము.

**dyspareunia** difficult and painful coitus రతిక్లేశము: కష్టతరమై, సలుపుతోకూడిన రతికేళి.

**dyspepsia** impaired digestion, indigestion, *see/చూడండి* indigestion. మందాగ్ని, జీర్ణశక్తి మందగించుట, అజీర్ణము, అపచన రోగం. వాడు.భా. నోరంతా పెండపెండగా ఉంది అంటారు.

**dysphagia** difficulty in swallowing (deglutition) మ్రింగుటకు కష్టము.

**dysphonia** difficulty in phonation (voice) స్వరవికృతి: శబ్దము పలుకుటలో లోపము.

**dysplasia** disorder of mature/adult cells సరిగా వికసించని స్థితి: జీవనకణముల అపవ్యవస్థ/కలత.

**dyspnoea** or **dyspnea** difficulty in breathing, labored breathing ప్రయాసతోకూడిన శ్వాస. వాడు.భా. ఆయాసము, గస, దమ్ము/మొస.

**dystocia** difficult labour కష్టమైన కాన్పు: కఠోర ప్రసవ వేదన, కష్టతరంగా పురుడు జరుగుట.

**dystonia** 1. impairment (may be hypo - or hyper - state of muscle tone) కండరబిగువులో లోపం (లఘు లేదా అతి). 2. often occurs as a side effect of a medication తరచుగా ఔషధంయొక్క అనుసంగప్రభావం.

**dystrophy** disorder due to defective nutrition, or degeneration, *e.g.* **muscular d's,** many types of myopathies పోషణదోషం/ పోషణలోపము లేదా క్షీణత, ఉదా. పలురకముల కండరముల బలహీనతలు.

**dysuria** painful or difficult urination (micturition) మూత్రకృచ్ఛ్రము: మూత్రవిసర్జన దోషము: క్లేశముతోకూడిన మూత్రవిసర్జనము, అలంకార. క్లిష్టమైన కాలుమడి.

# E e

**ear** the organ of hearing and of maintenance of equilibrium of the body చెవి: శ్రవణేంద్రియము మరియు శరీరములో సామ్యావస్థ నిలబెట్టు అవయవము. It is divided into three sections. ఇది మూడు భాగములుగా విభజింపబడినది. 1. **external ear,** left ear: question mark (?) styled cartilaginous hook-shaped pinna above and a lobe (a mass of flesh) below, giving an aesthetic appearance to the highest in creation, *Homo sapiens* వెలుపలి చెవి- ఎడమచెవి: బ్రహ్మసృష్టిలో గొప్పదైన మానవదేహమునకు సౌందర్యపిపాస కల్గించే ప్రశ్నగుర్తు (?) ఆకారముతో/లో ఉన్న కొక్కెములాంటి మృదులాస్థి ఉపరిభాగము, దానిక్రింద గుండ్రని మాంసపుముద్ద. 2. **middle ear** air space in the temporal bone bounded by the eardrum (tympanum) at its outer aspect and containing three auditory ossicles, malleus, incus and stapes మధ్యచెవి: చెవిగూబ/కర్ణభేరి వెలుపలికి కలిగి, లోన మూడు సున్నితమైన అస్థికలు కలిగి ఉన్న వాయుస్థలము. 3. **internal ear,** the labyrinth: the vestibule, cochlea and semicircular canals లోపలి చెవి, పద్మవ్యూహము: అళిందము, కర్ణావర్తము మరియు అర్ధచంద్రాకారములోనున్న నాళికలు.

**earache** ache/pain in the ear చెవిలో పోటు, *అలంకార.* చంటిపిల్లలో మహాతంట సుమా, అండీ!

**eardrops** 1. medicinal drops into the ear చెవిలో మందు చుక్కలు. 2. pendant earnings లోలాకులు, జూకాలు.

**eardrum** membrane inside the ear which transmits sounds కర్ణభేరి, చెవిగూబ, కర్ణదుందుభి.

**ear wax** cerumen గులిమి, వాడు.భా. గులివి, జివిలి.

**ebullient** 1. pertaining to ebullism 2. very high-spirited, full of cheerfulness or enthusiasm అతి చురుకుదనంగల, ఉత్సాహ పూరితమైన, ఉల్లాసప్రవృత్తిగల.

**ebullism** [ebullient *adj.*] formation of bubbles of water vapour in the tissues at an altitude above 63,000 feet due to extreme reduction in barometric pressure భారమితి వత్తిడి మిక్కిలి తక్కువై

నందువలన, 63,000 అడుగుల ఎత్తులో, కణజాలములలో ఆవిరి బుడగలు తయారగుట. Literally the blood boils (blood is a tissue). వాస్తవంగా రక్తం ఉడుకుతుంది, ఉబుకుతుంది, పొంగుతుంది (రక్తం ఒక కణజాలము).

**ecchymoses** [ecchymosis *sing.*] small haemorrhagic spots on the skin and/or mucous membranes చర్మములోనికి రక్తస్రావము: చర్మము మరియు/లేదా శ్లేష్మపొరలపైన రక్తపు గూళ్ళు.

**ECG** *abbr.* electrocardiogram, obtained from the instrument called electrocardiograph రేఖలు, తరంగములు గల నవారుపట్టీవంటి గ్రాఫ్/కాగితము, గుండె కొట్టుకొను విధమును చూపే గ్రాఫ్. అలంకార. ఈ గీతలు రోగి గీత యొక్క జోస్యం.

**Echinococcus** a genus of tapeworms, *e.g.* *E. granulosus*, measuring around 5 mm, producing hydatid cyst in human beings ఒక ప్రజాతి నవారు పురుగులు, 5 mm పొడవు, ఉదా. హైడాటిడ్ తిత్తి దీనివలన కలుగుతుంది. dog definitive host కుక్క ప్రాథమిక అతిథేయి. man intermediate host మనిషి మాధ్యమిక అతిథేయి. *see/చూడండి* host.

**echocardiogram** the record obtained from the instrument called echocardiograph గుండె ప్రతిధ్వనిని సూచించు రేఖాపటం.

**echocardiography** ultrasound examination of the heart, the record obtained is called echocardiogram గుండెయొక్క ప్రతిధ్వని ప్రేరిత ప్రత్యేక పరీక్ష

**echoencephalography** ultrasound (technique) in the diagnosis of intracranial lesions కపాలములోని క్షతముల నిర్ధారణలో అల్ట్రాసౌండ్ పరీక్ష

**echophony** or **echophonia** duplication of vioce sound occasionally heard in the auscultation of the chest (in stethoscope). ఛాతీమీద వింటున్నప్పుడు శబ్దములయొక్క ప్రతిధ్వని అప్పుడప్పుడు స్టెతెస్కోప్‌లో వినబడుట.

**echo virus** an enterovirus present in man ఈ వైరస్ మనుష్యులలో ఉండే అతిసూక్ష్మ (సూక్ష్మాతిసూక్ష్మ) జీవి.

**eclampsia** fits/convulsions in a pregnant or puerperal woman associated with hypertension and proteinuria ప్రసూతి వాతము:

గర్భవతిగాని, పురుటాలుగాని రక్తపోటు మరియు మూత్రంలో అల్బుమిన్ కలిగి, మూర్ఛలకు లోనగుట.

**ecmnesia** loss of memory of recent events ఇటీవల ఘట్టములు మరచిపోవుట. characteristic of ageing వృద్ధాప్యాన్ని సూచిస్తుంది.

**ecology** the relationship between living beings and their surroundings జీవావరణశాస్త్రం.

**Ecstasy** *abbr.* E. rapture ఆనందపరవశత. a powerful hallucinatory drug మిక్కుటముగా విభ్రమము కలుగజేసే మందు. *figur.* people use it to get a feeling of ecstasy – a jet for 'the jet set'. *అలంకార.* ఆనంద పరవశానికి అంతస్తు.

**ECT** *abbr.* electroconvulsive therapy as a treatment modality for some mental diseases మానసిక జబ్బులలో 'షాక్'లు ఇప్పించడం.

**-ectasia** or **-ectasis** dilatation, widening in the diameter of a tubular structure, *see/చూడండి* bronchiectasis. నాళికలాంటి నిర్మాణముయొక్క విస్ఫారణము.

**ecthyma** a form of impetigo which is characterized by ulceration and crust formation on the shins and/or forearms మోకాళ్ళకు మోచేతులకు సంక్రమించు వ్రణములు పక్కులుగట్టుట. ఇది సూక్ష్మజీవుల వలన కలుగు, చర్మమునకు సం. అంటువ్యాధి. **contagious e.,** orf, soremouth అస్యపుండ్లు. contagious pustular stomatitis of virus aetiology సాంసర్గిక అస్య చీముపొక్కులు – వైరస్‌వలన సంభవిస్తాయి.

**ectoderm** the outermost of the three layers of the embryo; the following are derived from it: epidermis, hair, nails, the nervous system, external sense organs and mucous membrane of the mouth and anus బహిస్త్వచము: పిండముపైనున్న వెలుపలి పొర; దీనినుండి ఈ క్రిందివి అంకురిస్తాయి: బహిశ్చర్మము, రోమములు, గోళ్ళు, నాడీవ్యవస్థ, కన్ను, చెవి, చర్మము, నోరు మరియు ఆసనముయొక్క శ్లేష్మపొర.

**-ectomy** suffix తుది జోడింపు. words ending in 'ectomy' indicate the surgical removal of that part, *e.g.* vasectomy, cholecystectomy ఈ అక్షర సముదాయముతో అంతమైతే ఆ పదము శస్త్రచికిత్సను సూచిస్తుంది, ఉదా. శుక్రవాహిక ఛేదించుట, పిత్తాశయము తీసివేయుట.

**ectoparasite** a parasite that thrives/lives on the external/outer (ecto) surface of the body, *e.g.* louse బాహ్యపరాన్నజీవి: శరీర ఉపరిభాగంమీద నివసించే పరాన్నజీవి, ఉదా. పేను. అలంకార. పెయ్యను అంటుకుని ఉండేది పేను. [*in contr.* endoparasite].

**ectopia** congenital displacement of a structure స్థానభ్రంశము: ఒక భాగము/అవయవము పుట్టుకతోనే స్వస్థానమునగాకుండా వేరొకచోట ఉండుట. **e. cordis,** heart situated outside the thoracic cage in front గుండె ఛాతీ పంజరము వెలుపలను, ఎదురుగాను వ్రేలాడబడి ఉండుట. **e. lentis,** displacement of the lens in the eye కన్నులోని కటకము ఉండవలసిన స్థలము తప్పుట. **e. vesicae**, urinary bladder outside the abdominal wall మూత్రాశయము ఉదరకుడ్యమునకు వెలుపల ఉండుట.

**ectopic** 1. pertaining to ectopia పై పదమునకు సం. 2. **e. beats,** heart beat arising elsewhere than in SA node (sino atrial node) గుండెధ్వనులు నిర్ణీత స్థానమైన SA నోడ్‌లో గాకుండా పరస్థానములో అంకురించుట. 3. **e. pregnancy**, e. gestation, fetus growing in a place other than the uterus, *e.g.* tubal pregnancy, pregnancy progressing in Fallopian tube ఉదా. గర్భకోశనాళములో పిండము పెరుగుట.

**ectropion** eversion of the margin of the eyelid కనురెప్ప బహిర్వలనము: దీని అంచు బయటికి తిరగబడి యుండుట [*opp.* entropion].

**eczema** a chronic, refractory (to treatment), inflammation of the epidermis characterised by weeping, oozing, encrustation and scaly pigmentation ఏనుగు గజ్జి: చర్మముమీద రసికారుతూ, పక్కులుకట్టి నల్లపొలుసులు గల దీర్ఘకాలపు చర్మవ్యాధి. ఇది చికిత్సకు అంతతేలికగా అలివికానిది/లొంగదు.

**edema** *see/చూడండి* oedema.

**edentulous** (mouth) without teeth పన్నులులేని నోరు.

**edible** fit for eating తినదగిన. *N.B.* Edible food and potable water are a nation's primordial needs. *గమనిక:* సురక్షితమైన తిండి, తాగే నీరు జాతిప్రజకు అత్యవసరాలు/నిత్యావసరాలు.

**EEG** *abbr.* electroencephalogram, a graph taken applying electrodes over the skull in diseases like epilepsy, to study the details విద్యుత్ మస్తిష్క గ్రాఫ్: మూర్ఛలులాంటి వ్యాధిలో పుర్రెమీద విద్యున్మార్గములు పెట్టి తీసే రేఖాపటము; దీనివలన వ్యాధి వివరములు తెలుస్తాయి.

**effect** the result of an action, *e.g.* side effect of a drug ప్రభావము: చేత/పని యొక్క ఫలితము, ఉదా. మందువలన కలుగు అవాంఛనీయ పరిణామము. **Doppler e.,** study of waves induced over an organ అవయవము మీద రేకెత్తించిన అలలను పరీక్షించుట.

**efferent** 1. an impulse, *e.g.* nerve impulse conducting away from a centre అపవాహి, కేంద్రమునుండి చివరకు వెళ్ళు ప్రచోదనము, ఉదా. నాడీ ప్రేరణ. 2. conveying an information away from a centre కేంద్రమునుండి బయటకు పంపబడు సమాచారము. **e. nerve,** the nerve which transmits impulses from the centre to periphery, *e.g.* nerve carrying orders from the brain and spinal cord to the periphery and organs అపవాహినాడి, బహిర్గమనముగలనాడి, ఉదా. మెదడు మరియు వెన్నుపామునుండి శరీరభాగములకు, అవయవములకు ఆజ్ఞలు తీసుకొనిపోయే నాడి [*opp.* afferent వ్యతి. అభివాహి].

**effort** 1. endeavour ప్రయత్నం. *Note:* Doubts arise in the minds of those only who put in effort to learn. *గమనిక:* విజ్ఞానకృషి జిజ్ఞాసతో సలిపేవారికే శంకలు బయలుదేరుతాయి. 2. exertion, strain due to labour అలసుగొలిపే ప్రయాస/కష్టం. **e. intolerance,** leads to effort syndrome కష్టం చేస్తే అలసట (గుండె జబ్బు సూచించవచ్చు). **e. syndrome** also called neurocirculatory asthenia characterized by dizziness, fatigue and palpitations; may mimic angina తలతిరుగుడు, అలసట మరియు గుండెదడ; గుండెనొప్పిని అనుకరించవచ్చును.

**effusion** accumulation/outpouring of fluid in body cavities/spaces, *e.g.* **pleural e., pericardial e., e. into joints** శరీర కుహరాల్లోని ద్రవము: ఉదా. పుపుసావరణంలోగాని, హృదయావరణంలోగాని లేదా కీళ్ళసందుల్లోగాని ద్రవము చేరుట.

**egg** *micro.str.* సూక్ష్మ.చూ. 1. an ovum అండము; a female gamete స్త్రీ సంయోగ బీజము, 2. an oocyte స్త్రీ బీజమాతృకణము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. oval object from which young ones are hatched గ్రుడ్డు. **e. white** తెల్లసొన. **e.yolk** పచ్చసొన.

**ego** 1. self నేను, అహం. 2. the facet of one's personality which brings about harmony between the instincts and reality మూర్తిమత్వ తత్వము: తనలోని అంతర్బుద్ధికి/జీవప్రవృత్తికి మరియు వాస్తవమునకు పొందిక గూర్చు వ్యక్తిత్వధోరణి.

**egocentric** self-centered స్వప్రయోజనమే ధ్యేయముగా కలిగిన.

**egoism** promotion of one's own self-interests అహంకారము, ఆత్మాభిమానము, తనమేలే కోరుకొనుట – దానికి ఎడతెగని కృషి సలుపుట [*in contr.* altruism భిన్న. పరహితము].

**egomania** morbid self-esteem తన్నుతాను గొప్పగా/పూజితుడుగా అంచనా కట్టుకొనే మానసికరోగ సంబంధమైన ఆలోచనగల స్థితి.

**egotism** selfishness; overestimation of one's own self స్వార్థపరత్వము; అహంభావము. *figur.* A selfish person is like a shellfish. అలంకార. స్వార్థపరునకు సముద్రపుగుల్లలోనున్న జలజీవి వలె 'తనలోకమే తనకు'.

**ejaculation** sudden, forcible, gush of semen from the male organ (penis) స్థలనము: తటాలున, వేగముతో, ఝల్లున పురుషాంగము నుండి శుక్రము బయలువెడలుట. *figur.* a pleasurable experience అలంకార. సుఖకరమైన అనుభూతి; స్థలనం అనుభోగం అమూల్యం. దీనిముందు మడులు, మాన్యాలు, రాజులు, రాజ్యాలు గడ్డిపోచలు, తృణప్రాయం/బలాదూర్.

**ejaculatio praecox** or **precox** premature/preanticipated ejaculation in the male in the sexual act రతికేళిలో సత్వరశుక్రస్థలనము అనగా యుక్తసమయానికి ముందే వీర్యము బహిర్గతమగుట.

**ejaculatory duct** one on either side, from the seminal vesicle passes through the prostate gland to end in the urethra స్థలనవాహిక: శుక్లం నిల్వచేయబడే తిత్తినుండి ప్రోస్టేట్ గ్రంథిద్వారా పయనించి

మూత్రమార్గంలో కలుస్తుంది. Semen enters through this at the time of ejaculation. స్ఖలన సమయంలో శుక్లము దీనిలోనుంచి పారుతుంది.

**elastase** *see/చూడండి* pancreatic elastase.

**elastic tissue** *see/చూడండి* tissue. సాగి ముడుచుకొను శక్తిగల కణజాలము.

**elastin** the essential protein of elastic connective tissue స్థితిస్థాపక బంధన కణజాలములోని ముఖ్య ప్రోటీన్.

**elbow** the region at which the arm and forearm are joined కూర్పరము, కూర్పర సంధి, చేతి ముడుకు, మోచేయి. **tennis e.,** strain/sprain in the elbow in players of tennis టెన్నిస్ ఆడేవారిలో మోచేతి బెణుకు.

**electric shock** shock produced by touching a live (electric) wire విద్యుద్ఘాతము. *Note:* Electrocution kills a person. *గమనిక:* కరెంటు ముట్టుకుంటే ముప్పు; చావు తప్పదు.

**electrocardiogram** *abbr.* ECG, EKG. the tracing produced by an electrocardiograph.

**electrocardiograph** an instrument which registers the electrical variations of the heartbeat. గుండెస్పందనలోని విద్యుత్ ప్రవాహ అలలను నమోదుచేసే పనిముట్టు.

**electrocautery** cautery by an agent heated by electric current విద్యుద్దహనము: విద్యుచ్ఛక్తిద్వారా వేడిచేసిన పరికరముతో చురకపెట్టుట, వాతవేయుట, లేదా కాల్చుట.

**electrocoagulation** hardening of tissue by electric device విద్యుచ్ఛక్తి పరికరముద్వారా స్కందనప్రక్రియ.

**electroconvulsive therapy** *see/చూడండి* ECT.

**electroencephalogram** EEG. a tracing produced by electroencephalograph ఇ.ఇ.జి. అనే రేఖాపటం.

**electroencephalograph** an instrument which registers the electrical activity of the brain మెదడులోని విద్యుత్ చురుకుదనం నమోదుచేసే యంత్రం. The tracing is called EEG.

**electrolysis** removal of unwanted hair by passage of a galvanic current విద్యుద్విశ్లేషణ: విద్యుచ్ఛక్తి పరికరము ద్వారా అవాంఛనీయమైన రోమములను తీసివేయుట.

**electrolyte** a substance which in solution, dissociates into ions which are electrically charged particles, like sodium, potassium, *etc.* Electrolyte imbalance occurs in certain diseases. విద్యుద్విశ్లేష్యపదార్థము, విద్యుద్వాహక లవణము: కొన్ని జబ్బులలో ఈ పదార్థముల సమతాస్థితి తప్పవచ్చును.

**electromagnetic radiation** radiation of eletromagnetic rays విద్యుదయస్కాంత వికిరణము.

**electromyography** recording and study of electrical potentials in skeletal muscle నియంత్రిత కండరములలో విద్యుత్సంభవనీయమైన గీతలను గ్రాఫ్‌లో నమోదుచేయుట, పరిశీలించుట.

**electron** a negatively charged particle in the atom ఎలక్ట్రాన్, ఋణావేశిత పరమాణు అంశము [*in contr.* proton *భిన్న*. ప్రోటాన్, ధనావేశిత పరమాణు అంశము].

**electron microscope** *see/చూడండి* microscope.

**electroshock** shock produced by applying electric current to the brain as a modality of treatment విద్యుచ్ఛక్తిచే అఘాతము కల్పించుట – ఇది ఒక వైద్యరీతి.

**electrotherapy** the use of low intensity electric power as a cure for insomnia or depression, *e.g.* **cerebral e.** (CET) విద్యుత్ చికిత్స: తగ్గుస్థాయిగల విద్యుచ్ఛక్తిని ఉపయోగించుట; నిద్రలేమి, మనస్సు క్రుంగిపోవుట మొదలగు మానసిక వ్యాధుల్లో ఇది ఒక చికిత్స.

**element** [Latin rudiment, beginning] మూలపదార్థం. a substance composed of atoms of only one kind ఒకే రకమైన పరమాణువులు గల పదార్థము. **trace e.'s** శరీరంలో అతి స్వల్పమోతాదులో ఉండే మూలపదార్థములు. present in traces in the body, *e.g.* iodine, zinc, copper, cobalt, manganese, molybdenum, selenium, *etc.*

**elephantiasis** elephant legs or swollen hands 1. chronic filariasis as a result of blockage of lymphatics by filarial worms, *Wuchereria*

*bancrofti* producing marked swelling of legs, scrotum, vulva, *etc.* *see*/*చూడండి* lymphangitis, microfilaria. బోదవ్యాధి: బూరకాలు, బోదకాలు, ఏనుగకాలు, సొరకాయలాగా చెయ్యి, బోద వృషణముల తిత్తి, బూరయోని, బూరస్త్రీ గుహ్య అవయవములు. కొందరిలో చేతులు బూరగా అగును. ఫైలేరియా పురుగులు శోషరసనాళికల్లో అడ్డుపడినందున పర్యవసానము. 2. swollen upper extremity due to lymphoedema and lymph stasis after radical mastectomy with block dissection of the axillary lymph nodes and lymphatics, as in cancer breast స్తనగ్రంథి కేన్సరులో స్తనము పూర్తిగా పెరికివేసి చంకలోనున్న లింఫ్ గ్రంథులు మరియు లింఫ్ నాళములను త్రుంచివేసి శస్త్రచికిత్స చేసిన తరువాత ఆ వైపు చెయ్యి అంతా ఇంతలా వాచిపోయి ఈ బూరరూపము దాలుస్తుంది. ఈ బూరరూపము లింఫ్ నిల్వ/జమ అయిన స్థితివలన కలుగుతుంది, ఎందుచేతనంటే – చంకలో లింఫ్ వ్యవస్థను త్రుంచివేశారు కాబట్టి.

**elimination** expulsion. removal of/getting rid of waste (unwanted) material in the body వ్యర్థపదార్థమును శరీరంలోనుంచి నెట్టివేయుట/ తీసివేయుట. *e.g.* **carbon dioxide e.** కార్బన్ డైఆక్సైడ్‌ను తోసివేయుట అనగా బయటికి పంపుట.

**ELISA** *abbr.* 1. Enzyme-Linked Immuno Sorbent Assay for detection of antibodies ప్రతిరక్షకాల పరిశోధన(ము) కొరకు అమాపన/నిర్ధారణ మాపనం. 2. It is used in the diagnosis of HIV infection and AIDS. హెచ్.ఐ.వి. సంపర్కం మరియు 'ఎయిడ్స్ వ్యాధి' కనుగొనుటలో ఉపయోగిస్తారు.

**elixir** sweetened medicinal liquid for oral use తియ్యని మందు: త్రాగుటకు మధురరసముతో మిళితమైన మందు.

**emaciation** losing flesh and getting wasted శుష్కించుట; కృశించుట. encountered in 1. chronic debilitating illness, *e.g.* tuberculosis దీర్ఘమైన, దుర్బలపరచు వ్యాధులు, ఉదా. క్షయవ్యాధి. 2. in states of prolonged fasting నిరాహారదీక్ష బూనినప్పుడు. 3. malabsorption syndrome: diseases wherein the intestinal absorption of food is hampered కొన్ని పేగుల జబ్బులలో ఆహార

పదార్థములు లోనికి గుంజుకొనబడుటలో ప్రతిబంధకము కలుగు శరీర స్థితి.

**emasculation** ablation of the penis or testes పుంస్త్వహరణము: పురుష గుహ్య అవయవములను (పురుషాంగము, వృషణములు) ఛేదించుట.

**embalming** treatment of a dead body to prevent decomposition/putrefaction శవము కుళ్ళిపోకుండా కాపాడు ఉపాయము. 1. In anatomy dissection hall: A solution containing formalin, glycerine, carbolic acid and salt is injected under pressure (through compressor) into the carotid artery of the corpse so as to preserve the tissues for dissection by students. ఉప్పుతోకూడిన ద్రవము శవముయొక్క కారోటి ధమనిలోనికి ఒత్తిడితో ఎక్కించుట; అప్పుడు కణజాలములు చెడిపోకుండా ఉంటాయి; విద్యార్థులు వాటినికోసి చదువు నేర్చుకుంటారు. 2. temporary preservation for few days తాత్కాలిక పద్ధతులు, కొద్దిరోజులపాటు కాపాడుటకొరకు: (a) keeping in ice cover మంచుగడ్డలో ఉంచుట (b) inject formalin to avoid putrefaction; also, for aesthetic purposes, *e.g.* while transporting by air or rail ఫార్మలీన్ శరీరంలోకి ఎక్కించుట; చనిపోయిన కణజాలములను క్రుళ్లిపోకుండా నివారించి ముఖవర్చస్సు నిలబెట్టు కళ, ఉదా. శవమును రవాణా చేయవలసివస్తే ఇది జనప్రియదృశ్యముగా ఉంటుంది.

**embolectomy** surgical removal of an embolus from the inside of a blood vessel రక్తనాళములోని ఎంబొలస్ అను అడ్డును శస్త్రచికిత్సద్వారా తొలగించుట.

**embolisation** or **embolization** therapeutic introduction of an agent to occlude a blood vessel, *e.g.* bronchial artery embolisation to arrest haemoptysis చికిత్స రూపేణ ఒక మందు రక్తనాళములోనికి ఎక్కించి ఆ నాళములో అడ్డు ఏర్పరచుట, ఉదా. ఊపిరితిత్తులలోనుండి రక్తస్రావము అరికట్టుటకు బ్రాంఖియల్ ధమనిలోనికి మందు ఇంజక్షన్ చేసి అందులో రక్త సరఫరా ఆపుచేయుట.

**embolism** block of a blood vessel by a blood clot or any foreign substance, *see/చూడండి* embolus. రక్తప్రసారము అగటము: రక్తనాళములోపల రక్తపుగడ్డగాని మరి ఏపదార్థమైనా అడ్డుపడుట.

**embolus** [emboli *pl.*] a blood clot or any substance like air, fat, septic matter, or tumour cells blocking a blood vessel, as a result of which blood circulation is impeded రక్తపుగడ్డ/నెత్తురు కరుడు, గాలి, క్రొవ్వు, క్రిమికుళ్లు లేదా కంతికణములు రక్తనాళములలోపల అడ్డుపడుట; తత్ఫలితంగా రక్త సరఫరాకు ఆటంకము కల్గుతుంది.

**embryo** the developing organism from two weeks after fertilization of the ovum to about two months. Later it is called fetus. పిండము: అంగక్రమముగల నిర్మాణమునకు నాంది. అండము ఫలదీకరణమైన తరువాత రెండు వారములనుండి రెండు నెలలవరకు దీనిని పిండము అంటారు. ఆ తర్వాత భ్రూణము అంటారు [*Cf.* fetus తారత. భ్రూణము].

**embryology** the science of the development of the embryo పిండోత్పత్తి శాస్త్రము; పిండోత్పత్తి విజ్ఞానము.

**embryoma** neoplasm derived from embryonic cells/tissues, *e.g.* **e. of kidney:** Wilms' tumour. A dermoid cyst is a classic example. పిండము యొక్క కణజాలముల నుండి అంకురించిన/మొలకెత్తిన కంతులు ఉదా. కిడ్నీకంతి, డెర్మాయిడ్ తిత్తి.

**emergency** a serious situation that needs immediate medical attention. అత్యవసర పరిస్థితి. **e. room** *abbr.* ER in a big hospital, for patients requiring immediate attention తక్షణ చికిత్సా కక్ష్య విభాగం.

**emesis** the act of vomiting కక్కు, డోకు, వాంతి, వమనము; వాంతి చేసుకునే విధానము. *N.B.* Haematemesis means vomiting of blood. *గమనిక:* హెమటెమసిస్ అనే పదం వాంతిలో రక్తం సూచిస్తుంది.

**emetic** an agent that produces vomiting వమనకారి: వాంతి చేసుకొనుటకు సాధన. *e.g.* 1. Elicting a gag reflex may produce vomiting. వ్రేళ్లతో గొంతులో రాపిడి కలిగిస్తే వాంతి వస్తుంది. 2. A drug, apomorphine, induces vomiting. ఈ మందువలన వాంతి అవుతుంది.

**emigration** *syn.* diapedesis. the escape of blood cells through the walls of capillaries, *see/చూడండి* diapedesis. రక్తకేశనాళికల గోడలద్వారా రక్తకణములు బయలువెడలుట.

**eminence** a projection ఉబుకు. **thenar e.,** at the base of the thumb బొటనవేలు మొదలున అరచేతిలోని ఉబుకు.

**emission** spontaneous discharge of semen, e.g. **nocturnal e.,** ejection/outflow of semen during sleep వీర్య/ఇంద్రియ స్ఖలనము, ఉదా. రాత్రులందు నిద్రలో శుక్రస్ఖలనము.

**emmenagogue** an agent that promotes menstruation ఋతు స్రావము/ముట్టు కల్గించు సాధన(ము).

**emmenia** the menses ముట్టు, ఋతువు, అలంకార. ముట్లు ఎండిపోయేవరకు స్త్రీకి స్త్రీత్వమునొసగే సూచన.

**emmetropia** normal state of refraction in the eye సామాన్యదృష్టి: కన్నులో సహజమైన/స్వాభావికమైన/క్రమమైన వక్రీకరణము.

**emollient** 1. an agent that soothes and smoothens the skin or mucous membrane చర్మమును లేదా శ్లేష్మపొరను మృదువుగా, నునుపుగానుంచి మరియు ఉపశమనము చేయు సాధకము. 2. a substance that softens and comforts an irritated, inflammed surface 'నొప్పి వేడి మంట వాపు' గల ప్రాంతమును చల్లార్చి, ఊరడించి, మెత్తబరుచు గుణముగల పదార్థము.

**emotion** 1. excitement ఉద్వేగము, మనస్తాపము, చిత్తక్షోభము. 2. excessive specific feeling, as love, hate, anger, *etc.* రాగము, ద్వేషము, కోపము, మొ. మనోవికారములలో అధిక భావతీవ్రత.

**emphysema** 1. large lungs, excess air filled lungs: a disease of lungs characterised by overdistension and loss of elasticity of the alveoli in lung tissue, *see/చూడండి* hyperlucency. గాలితో ఉబ్బిన ఊపిరితిత్తులు: గాలితో పొంగి పెద్దవై స్థితిస్థాపక గుణము కోల్పోయిన ఊపిరితిత్తి వాయుకోశాల (alveoli) జబ్బు. 2. **mediastinal e.,** *syn.* pneumomediastinum. accumulation of air around the mediastinum మీడియాస్టినమ్ చుట్టూరా గాలి చేరుట. 3. **subcutaneous e.,** accumulation of air or gas underneath the skin చర్మము క్రింద గాలి/వాయువు చేరుట.

**empirical** approach to a medical problem, based on scientific testing or practical experience అనుభావిక: స్వానుభవమునసుసరించి

లేదా శాస్త్రీయపరిశోధనను అనుసరించి ఇచ్చే ఔషధము లేదా చేసే చికిత్స.

**empyema** 1. accumulation of pus in a body cavity శరీరములోని కుహరములో చీముచేరుట. 2. most often, this term is used for the collection of pus in the layers around the lung, *viz.* in the pleural cavity బహూతరచుగా, ఊపిరితిత్తి చుట్టుముట్టి ఉండే ప్లూరా పొరలలో (కుహరములో) చీముచేరుటకు ఈ పదం వాడుతారు.

**emulsion** 1. one liquid suspended/dispersed in tiny droplets in another liquid తరళ పదార్థము: ద్రవ ఔషధ మిశ్రమ రసాయనము లేదా ద్రవమిశ్రమ రూపము; క్షీరరూపౌషధము. 2. colloid system, *see/చూడండి* colloid. emulsification తరళీకరణ. emulsifier తరళీకారకం.

**enamel** hard covering which protects the tooth. It consists of calcium salts. పింగాణీ: దంతిక; పంటిపై నిగనిగలాడు పదార్థం. పంటి పైపూత, పన్నుమీది కంచుకము. ఇది పన్ను శిఖరమును కాపాడుతుంది; ఇందులో సున్నపు లవణములుంటాయి.

**enanthema** or **enanthem** eruption on a mucous surface శ్లేష్మపొర ఉపరిభాగమున పొక్కులు [*Cf.* exanthema, skin eruption తారతె. చర్మముమీద పొక్కులు].

**enarthrosis** ball and socket joint, hip joint బంతిగిన్నె కీలు, తుంటికీలు.

**encapsulated** covered by a capsule పొర/తొడుగుతో కప్పబడిన. **e. tumour** ఇట్టి కంతి.

**enceinte** pregnant *i.e.* in the family way అంతర్వత్ని, గర్భిణితో ఉన్న చూలాలు.

**encephalalgia** cephalalgia, headache తలనొప్పి.

**encephalic** 1. pertaining to the brain మెదడుకు సం. 2. within the skull కపాలములోపల.

**encephalitis** [encephalitides *pl.*] inflammation of brain tissue మెదడువాపువ్యాధి: మెదడుకణజాలముల శోథము/'నొప్పి వేడి మంట వాపు'. **HIV e.**, AIDs e. ఎయిడ్స్ జబ్బు. **Japanese B e.**, caused by virus వైరస్‌వలన సంభవించును.

**encephalitis lethargica** von Economo's disease. encephalitis means inflammation of the brain మెదడువాపు. lethargica = state of lethargy నిద్రమత్తు కమ్మిన/కలిగిన స్థితి.

**encephalocele** craniocele. congenital gap in the skull through which brain substance herniates పుట్టుకతో/జన్మతో వచ్చినట్టి కపాలంలో సందు – ఇందులోనుండి మెదడు పదార్థం వెలుపలికి గిలక (hernia)లా ఉబ్బుతుంది.

**encephalogram** X-ray photograph of the contents of the skull. కపాలములోని భాగముల ఎక్స్‌రే ఫోటో.

**encephalography** X-ray examination of ventricles in the brain after injecting air మస్తిష్క లేఖనం: మెదడులోని కోష్ఠకములలోనికి గాలి ఇంజెక్షన్ చేసి ఎక్స్‌రే ఫోటోతీయుట.

**encephalomyelitis** inflammation of the brain and spinal cord మెదడు మరియు వెన్నుపాముయొక్క వాపు. **acute disseminated e.,** occurs after a virus infection, especially measles ముఖ్యముగా పొంగు, తడపర, చిన్నమ్మవారు అటువంటి వైరస్ వ్యాధుల తర్వాత రావచ్చును.

**encephalomyeloneuropathy** disease affecting the brain, spinal cord and peripheral nerves మెదడు, వెన్నుపాము మరియు పరిధీయ నాడుల కాయిలా/జబ్బు.

**encephalon** the brain మెదడు. *N.B.* Brain is a mysterious master/super computer. *గమనిక:* మెదడు నిగూఢ, మేలైన, ప్రతిభావంతమైన కంప్యూటర్.

**encephalopathy** degenerative brain disease మస్తిష్క వికృతి: మెదడు క్షీణించు సుస్థి.

**enchondroma** a benign growth of cartilage మృదులాస్థియొక్క నిరపాయ కంతి.

**encopresis** incontinence of stools, not due to any organic defect మలము అపుకొనలేకపోవుట. ఇది అవయవ వికలమువలన కలుగు జబ్బుకాదు.

**encyesis** normal uterine pregnancy ప్రమాణ ప్రకారము కలిగే గర్భాశయ గర్భము/గర్భధారణము. కడుపుతోనుండుట అని వాడుక భాష/పదము. *idiom:* She is in the family way. చూలాలు.

**encysted** enclosed in a pocket, *e.g.* encysted parietal pleural effusion గూడు కట్టుకొనిన, ఉదా. ఊపిరితిత్తి పొర (pleura)లో గూడుకట్టుకొని ఉన్న ద్రవము.

**endangium** innermost coat (tunica intima) of a blood vessel రక్తనాళములోని లోపలి కంచుకము.

**endarteritis** inflammation of the innermost coat (tunica intima) of an artery ధమనిలోని లోపలి కంచుకముయొక్క వాపు.

**end-artery** an artery which ends blind, *viz.* It does not anastomose with other arteries. మరి కొన్ని ధమనులతో అనుమేళకముగాని ధమని.

**endaural** within the ear చెవిలోపల.

**endemic** a disease that is constantly prevalent in a community, *e.g.* tuberculosis స్థలవిశిష్ట: ఒక ప్రాంతంలో లేక ఒక జనసముదాయంలో నిరంతరముగా/ఎల్లప్పుడు ప్రబలి ఉండే వ్యాధి, ఉదా. క్షయవ్యాధి. [*Cf.* epidemic].

**endoblast** *syn.* endoderm, entoderm. అంతస్త్వచము.

**endobronchitis** inflammation of the epithelial lining of the bronchi శ్వాసనాళికలయొక్క ఉపకళాస్తరము (epithelial layer) నందు శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**endocardial** 1. pertaining to the inner wall of the heart గుండెలోపలి గోడకు సం. 2. inside the heart గుండెలోపల. 3. pertaining to the heart valves గుండె కవాటములకు సం.

**endocarditis** inflammation of the endocardium with vegetations on the inner wall and over the heart valves, *e.g.* **bacterial e., rheumatic e.** ఎన్‌డొకార్డియమ్ వాపుతో సహా గుండెలోపలి గోడకు, కవాటములమీద ఉద్భిజ్జములు పెరుగుట.

**endocardium** endothelial lining membrane inside the heart on a base of connective tissue అంతర హృదయస్తరము, గుండెకాయ

లోపలిపొర: గుండెలోపల గోడలో బంధన కణజాలము యొక్క పునాది మీద ఉన్న అంతరస్తరము (endothelium).

**endocervicitis** inflammation of the mucous membrane lining the cervix uteri గర్భాశయ ద్వారమును అంటిపట్టియుండు శ్లేష్మపొరయొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**endocervix** mucous membrane lining the cervix uteri, *see/చూడండి* cervix. గర్భాశయ ద్వారమును అంటిపట్టి యుండు శ్లేష్మపొర.

**endocolitis** inflammation of the mucous membrane of the colon పెద్ద ప్రేవులోపల అంటిపట్టియుండు శ్లేష్మపొరయొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**endocrine** hormonal, secreting internally; the glands secrete directly into the blood stream అంతస్స్రావి: గ్రంథులు తమ స్రావమును నేరుగా రక్తములోనికి కలుపుతాయి. [*Cf.* exocrine *తారత.* బాహ్యస్రావి].

**endocrine glands** traditionally styled 'ductless', *e.g.* thyroid, adrenal, pituitary glands అంతస్స్రావీ గ్రంథులు, వినాళికాగ్రంథులు, వినాళగ్రంథులు, నాళరహిత గ్రంథులు, ఉదా. థైరాయిడ్, ఎడ్రినల్, పిట్యూటరి.

**endocrinology** study and treatment of diseases of endocrine glands అంతస్స్రావీ గ్రంథుల శాస్త్రము, వాటి జబ్బుల చికిత్స.

**endocrinopathy** disease due to disorder of endocrine system అంతస్స్రావీ గ్రంథుల వ్యవస్థయొక్క ఖాయిలా/సుస్తి (అపవ్యవస్థ).

**endoderm** *see/చూడండి* entoderm.

**endodontics** branch of dentistry dealing with tooth pulp, root canal treatment పన్నులోని జిగురుపదార్థము, పన్నుమూలములోని కుల్యను గురించి తెలిపే దంతశాస్త్రభాగం.

**endogenous** produced within, *see/చూడండి* depression. అంతర్జాత, అంతర్జనిత: శరీరములో జనించిన. [*in contr.* exogenous].

**endometriosis** the presence of tissue similar to the endometrium (inside uterus) at other areas (ectopic occurrence) in the pelvis. కటివలయం (pelvis) లో గర్భాశయంలోని లోపలి పొర (endometrium) గర్భసంచి (uterus) లో కాకుండా వేరేచోట ఉండుట.

**endometritis** inflammation of the endometrium, *e.g.* **tuberculous e.** గర్భాశయ ఉపకళయొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు', ఉదా. ఈ భాగములో క్షయవ్యాధి.

**endometrium** epithelial tissue lining the inner wall of the womb గర్భాశయ ఉపకళ: గర్భాశయములోపలి గోడలోని కణజాలములు.

**endomyocarditis** inflammation of the endocardium and myocardium ఎండోకార్డియమ్ మరియు హృదయ కండర కుడ్యము యొక్క శోథం.

**endoparasite** a parasite living within the body of its host, *e.g.* intestinal worm అంతర పరాన్నజీవి: అతిథేయి యొక్క శరీరంలో నివసిస్తున్న పరాన్నజీవి, ఉదా. పేగులలోని పురుగు. [*in contr.* ectoparasite].

**endopelvic** within the pelvis శ్రోణి చక్రములోపల, కటివలయం లోపల, *e.g.* **e. fascia,** ఉదా. శ్రోణి చక్రములోపల తంతుయుత కణజాలము.

**end-organ** one of the endings of sensory nerves జ్ఞాననాడుల కొన.

**endorphin** group of compounds naturally occurring in the brain, having pain-relieving properties మెదడులో తయారై, నొప్పిని ఉపశమనం కలుగజేసే సంయోగ పదార్థము.

**endoscope** instrument for visualising the inside of a hollow viscus/organ కుహరాంతర దర్శిని: బోలుగానున్న అవయవములోపలి దృశ్యము చూపే పనిముట్టు. 1. gastroscope for examining the inside of the stomach జఠరాంతర్దర్శిని: అన్నకోశములోపల పరీక్షచేయు పనిముట్టు. 2. proctoscope for examining the inside of the rectum పురీషనాళాంతర్దర్శిని: మలాశయములోపల పరీక్షచేయు పనిముట్టు.

**endothelioma** tumour arising from the inner lining of blood vessels రక్తనాళముల అంతరస్తరమునుండి పుట్టే కంతి.

**endothelium** the layer of epithelial cells ఉపకళ కణములయొక్క పొర. *micro. str.* సూక్ష్మ.చూ. the layer of epithelial cells lining the cavities of the heart, the serous cavities, (corresponds

to the mesothelium of serous cavities) and the lumen of the blood and lymph vessels, అంతరస్తరము: హృదయకుహరములు, సీరస్ కుహరములయొక్క లోపలి పొర, రక్త/లింఫ్ నాళములలోపల అంటిపెట్టుకొని ఉన్న ఉపకళాస్తరము.

**endotoxin** toxin present in the intact bacterial cell but not in cell-free filtrates or cultures of the same bacteria జీవాంతస్థ విషపదార్థము: బాక్టీరియాలో ఉండే కణజన్య విషము; కాని అవే పెరిగిన ద్రవములోగాని సంవర్ధనములోగాని ఈ విషము ఉండదు. [*in contr.* exotoxin].

**endotracheal** in the trachea, in the wind pipe వాయునాళంలోని. **e. tube** ఇక్కడి గొట్టం.

**endovasculitis** endangiitis, inflammation of the inside of the wall of the blood vessel రక్తనాళముయొక్క కుడ్యము లోపలి వైపు శోథం.

**enema** 1. material introduced into the rectum for opening of bowels, *i.e.* evacuation of faeces, *e.g.* **soap and water e.** విరేచనకారి, ఉదా. గోరువెచ్చని సబ్బునీళ్ళు మలాశయములోనికి పంపుట. 2. for introducing nutrients or medicinal substances, *e.g.* **retention e.** వస్తికర్మ: పోషకములుగాని ఔషధములుగాని నిలవ ఉంచుట. 3. **barium e.,** introducing radio-opaque material into the colon and taking X-ray film తెల్లటి పాలలాంటి అపారదర్శక బేరియమ్ ద్రవము పెద్దప్రేవులోనికి పోనిచ్చి ఎక్స్‌రే ఫోటో తీయుట.

**energy** physical capacity for doing work శక్తి, త్రాణ: పనిచేయుటకు సత్తువ కలిగియుండుట. *figur.* Energy is the pep of life. అలంకార. శక్తి జీవితానికి రక్తి.

**enervation** 1. lack of nervous energy నాడుల నిస్సత్తువ. 2. neurectomy నాడిని ఛేదించుట.

**enfeeble** 1. to make someone weak బలహీనపరచు. 2. enfeebled heart/myocardium నీరసించిన గుండె/గుండెకుడ్యపేశి.

**engagement** 1. in obstetrics: arrival of the fetal head at the plane of the inlet of the pelvis, *resemblance:* sight of the engine of the railway train at the signal. పురిటిశాస్త్రంలో: కటివలయం

లోపలి సమతల ప్రాంతంలో భ్రూణశిరస్సు దర్శనం, పోలిక: సిగ్నల్ దగ్గర రైలు ఇంజన్ దృశ్యం/అగపడుట. 2. agreement prior to marriage, between two persons నిశ్చితార్థం. 3. to spend sometime with somebody కాలక్షేపం. 4. to arrange in advance, say for a doctor 'consultation by appointment' డాక్టరు రోగికి 'సంప్రదించు వేళ' ముందుగా తెలియపరచుట.

**engorgement** 1. hyperaemia రక్తము కూడుట. 2. congestion in tissue రక్తముతో క్రిక్కిరిసిన కణజాలము. *e.g.* congested mucous membrane in common cold which causes nose block ఉదా. పడిశెములో ఉబ్బిన శ్లేష్మపొర. దీనివలన ముక్కులో దిబ్బడ వేసినట్లుంటుంది.

**enophthalmos** shrinkage of the eyeball into the socket of the orbit అంతర్గతాక్షి: నేత్రకోటరములోనికి కన్నుగుడ్డు ముడుచుకొనిపోయి ఉండుట [*in contr.* exophthalmos భిన్న. కన్ను ఉబ్బు].

**ensiform** sword-shaped, *see/చూడండి* xiphoid. ఖడ్గమువంటి ఆకారముగల. **e. cartilage**; *processus* xiphoideus, bottom part of the breastbone or sternum ఉరోస్థి దిగువ భాగం వద్ద మృదులాస్థి.

**ENT** *abbr.* ear, nose and throat department in a general hospital పెద్ద ఆసుపత్రిలో చెవు ముక్కు గొంతు విభాగము.

**Entamoeba** also spelled Entameba. a genus of a amoebae parasitic to man పరాన్నజీవి, ఎంటమీబా ప్రజాతికి చెందినది. 1. *E.Coli* found in the intestine of man మనిషి ప్రేవులలో ఉండునది. 2. *E.gingivalis (E. buccalis)* found in the mouth నోట్లో ఉండునది. 3. *E. histolytica* causes amoebiasis. It is the causative agent for dysentery and hepatic abscess, *see/చూడండి* amoebiasis. దీనివలన చీము రక్తము జిగట విరేచనములు, లివర్‌లో చీమునెత్తురుగడ్డ కలుగుతాయి.

**enteral** taken by mouth (drug), *i.e.* into the intestine నోటిద్వారా తీసుకున్న అనగా ప్రేగుల్లోనికి పోయే (ఔషధం) [*in contr.* parenteral].

**enteralgia** pain in the intestines ప్రేవులలో తీపు, బాధ.

**enterectomy** resection (removal) of a portion of the intestine పేగులోని భాగము తీసివేయుట.

**enteric** 1. pertaining to the small intestine చిన్న ప్రేగుకు సం. 2. enteric fever: fever associated with intestinal lesions ఆంత్ర క్షతములతో కలిగే జ్వరం. typhoid, paratyphoid – toxic fever in which ulcers are produced in the small intestine సన్నిపాత జ్వరము: పేగులలో వ్రణములు తేలి సన్నిపాతము (delirium) కల్గించు విషజ్వరము. features: లక్షణములు: (a) light yellowish brown coated tongue నాలుకమీద లేతపసుపుపచ్చ మరియు నీరుకావి వర్ణములు మిళితమైన పాకుడు/పాకురు. (b) splitting headache శిరస్సు ఛేదించే నొప్పి.

**enteric-coated** a coating over a tablet or capsule to ensure that the release of the active ingredients does not take place in the stomach but takes place in the intestine, *i.e.* past the stomach, so as to facilitate absorption in the intestines మాత్ర/కాప్సూల్ మీద పొర; దీనివలన దీనిలోని మూల/ముఖ్యపదార్థములు అన్నాశయములో విడుదలగాకుండా, అన్నాశయము దాటి, పేగులలో విడుదల అవాలని ధ్యేయము. అప్పుడు పేగులలోనుండి ఆ పదార్థములు పీల్చుకొనబడుతాయి.

**enteritis** inflammation of the small intestine చిన్నపేగు శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'. 1. due to infection సూక్ష్మజీవుల సంపర్కము వలన. 2. due to irritant foods ఎక్కువ కారము, మసాలా లేదా పాసిపోయిన ఆహారము తీసుకున్నందువలన (అభోజ్య భోజనము).

**Enterobius** a genus of intestinal nematodes (super family Oxyuroidea – *Oxyuris vermicularis,* older nomenclature); *E. vermicularis*. The intestinal parasite causes irritation around the anus, hence the name seat-worm. It is also called thread worm or pin worm because of its small size (the female averages 10 mm in length, the male 3 mm) ఒక ప్రజాతి పురుగు, పరాన్నజీవి. ఇది మనిషి పేగుల్లో నివాసముంటుంది. దీనిని నులిపురుగు అంటారు. ఆడ పురుగులు ఆసనము దగ్గర గుడ్లు పెడతాయి. అప్పుడు ఆసనము చుట్టూ దురదపుడ్తుంది.

**enterocele** a hernia of the intestine, *e.g.* inguinal hernia, *see/చూడండి* hernia. పేగుయొక్క హెర్నియా, ఉదా. గజ్జలో హెర్నియా.

**Enterococcus** a genus of bacteria ఒక బాక్టీరియా ప్రజాతి.

**enterococcus** belongs to a genus of bacteria, *Enterococcus* ఒక ప్రజాతి బాక్టీరియాకు చెందినది.

**enterocolitis** inflammation of the small intestine and colon resulting in diarrhoea చిన్నపేగు మరియు కోలన్ యొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'. దీనివలన అతిసారము కలుగును. 1. **antibiotic-induced e.** ఆంటిబయాటిక్స్ వేసుకున్న తర్వాత సంభవించును. 2. **necrotizing e.,** associated with necrosis కణక్షయముతో కూడుకొనియున్న వాపు.

**enterogenous** 1. congenital; arising from the primitive foregut, *e.g.* **e. cyst** అంత్రజని, పేగునుంచి పుట్టిన, పుట్టుకతో వచ్చినది; పూర్వాహారనాళము నుండి పుట్టినది, ఉదా. ఈ రీతిగా పుట్టిన తిత్తి. 2. arising in the small intestine చిన్నపేగు లోపలనుండి పుట్టేది.

**enterolith** a calculus in the intestine పేగులో రాయి/శిల.

**enteropathy** any disease of the intestine, *e.g.* **gluten e.,** gluten - induced enteropathy. coeliac disease. ఆంత్ర అవ్యవస్థ: పేగులయొక్క సుస్తి/ఖాయిలా.

**enteropexy** surgical fixation of a part of the intestine to the abdominal wall ఉదరకుహర కుడ్యమునకు పేగులోని భాగం అతికించి, వెలుపలకు మార్గము ఏర్పరచుట.

**enteroptosis** [Greek *ptosis* = a falling]. a descent down, of the intestine in the abdominal cavity ఉదరకుహరంలో పేగులు క్రిందకు జారుట.

**enterospasm** intestinal colic, *see/చూడండి* colic. పేగులలో శూల; ఉండి ఉండి వచ్చు నొప్పి.

**enterotoxin** 1. a toxin arising in the intestine పేగులలో పుట్టే విషపదార్థము. 2. an exotoxin produced by staphylococci స్టెఫైలోకాకై అను సూక్ష్మజీవులు తయారుచేసే విషపదార్థము.

**enterovirus** a virus of the genus *Enterovirus*, *e.g.* poliovirus. ఒక ప్రజాతియొక్క వైరస్, ఉదా. పోలియోవైరస్.

**entoderm** endoderm. the innermost of the three primitive germ layers in the embryo; the epithelium of the pharynx, respiratory tract, digestive tract, bladder and urethra derived from it. అంతస్త్వచము: పిండములోని మూడు జననస్తరాల (germ layers)లో లోపలిది. గొంతు, శ్వాసమార్గము, ఆహారమార్గము, మూత్రాశయము మరియు మూత్రమార్గముయొక్క ఉపకళ ఈ అంతస్త్వచమునుండి ఉత్పన్నమవుతాయి.

**entrapment** compression of a nerve or vessel by adjacent tissue, *e.g.* carpal tunnel syndrome: **e. neuropathy** due to pressure on the median nerve as it passes underneath the carpal ligament at the region of the wrist దగ్గర కణజాలము వత్తిడివలన నాడి మీదగాని రక్తనాళము మీదగాని వచ్చు పరిణామము, ఉదా. మణికట్టు ప్రాంతంలో స్నాయువు (carpal ligament) ఒత్తిడివలన మీడియన్ నాడి బంధింపబడి దానికి సుప్తి సంభవించుట.

**entropion** enstrophe, turning inward of the edge of the eyelid కనురెప్ప అంతర్వలనము: దీని అంచు లోపలికి తిరిగి/ముడుచుకొని పోవుట [*opp.* ectropion].

**enucleation** removal of an organ in toto, after cutting the supporting tissues, *e.g.* **e. of the eyeball.** సమూలంగా తీసివేయుడము: ఆధారమిచ్చు కణజాలములను ఛేదించి అవయవమును పూర్తిగా బయటికి లాగుట, ఉదా. కన్నుగుడ్డు పీకివేయుట.

**enuresis** *colloq.* bed-wetting; involuntary passage of urine during sleep పక్కలో మూత్రవిసర్జన, పక్కతడుపుట; తెలియకుండా నిద్రలో మూత్రము విసర్జింపబడుట. **nocturnal e.**, involuntary urination in the bed in the night while asleep, an embarrassing happening తనకు తెలియకుండా రాత్రి నిద్రలో పక్కలో మూత్రముపడిపోవుట, వాడు.భా. పక్కలో ఉచ్చపోసాడు – మనస్సు కలవరపెట్టే ఘట్టం, తను సిగ్గుపడే సంఘటన.

**environment** sum total of social setting/surroundings, *i.e.* milieu exterior వాతావరణము, బాహ్యపరిస్థితి [*Cf.* milieu interior లోపలి. అంతఃపరిస్థితి].

**enzyme** a protein that promotes (catalyses) chemical reactions, *e.g.* **proteolytic e.**, peptidase. ఫేనకద్రవ్యము; ఎన్‌జైమ్, రసాయనిక మార్పులను త్వరితగతిలో సాగనిచ్చే ప్రోటీన్; జీవరసాయనిక ఉత్ప్రేరకము, ఉదా. పెప్టిడేస్.

**enzymology** study of enzymes ఎంజైమ్‌ల శాస్త్రం.

**eosin** red or rose-coloured stain/dye ఎర్ర లేదా రోజా (గులాబి) వర్ణము కలిగిన అద్దకము.

**eosinophil** a granular leukocyte; a white blood cell with a horse shoe shaped nucleus and coarse round granules stained rose-red (eosin) by Leishman's stain కణికామయ తెల్లరక్తకణము; గుర్రపులాడము ఆకారములోనున్న కేంద్రకము, కణజీవద్రవ్యములో దళసరి అయిన గుండ్రపు చిన్న అణువులు గలది; ఈ చిన్న అణువులు అద్దకములో ఎర్రగులాబి రంగుతో ప్రకాశిస్తూ ఉంటాయి.

**eosinophilia** increase in the number of eosinophils in the blood and tissues, classic *e.g.* pulmonary eosinophilosis. రక్తములోను మరియు కణజాలములలోను ఈ జాతి రక్తకణములు వృద్ధియగుట; ప్రసిద్ధమయిన ఉదా. ఊపిరితిత్తుల ఇస్‌నోఫిలియా.

**ependyma** the membrane lining the cerebral ventricles and spinal canal మస్తిష్క కోష్ఠకములను మరియు కశేరుకుల్యను అంటి పట్టుకునియుండు పొర.

**ependymoblast** an embryonic ependymal cell ఒక పిండదశకు సం. ఎపెండైమా కణము.

**ependymocyte** an ependymal cell ఒక ఎపెండైమా కణము.

**ependymoma** a tumour arising from ependymal cells ఎపెండైమా కణములనుండి పుట్టే కంతి.

**EPI** childhood vaccination (WHO): *abbr.* expanded programme of immunisation against diphtheria, measles, pertussis, poliomyelitis, tetanus and tuberculosis పిల్లలలో టీకాలు: ఈ ప్రణాళికలో డిఫ్తీరియా

(కంఠవాతం), తట్టు, కోరింతదగ్గు, పోలియో జబ్బు, ధనుర్వాతం మరియు టి.బి. నివారణ కొరకు టీకాలు వేస్తారు. Of late, vaccination against hepatitis B has been included as a mandatory seventh childhood vaccine. ఇటీవల హెపటైటిస్ బి వాక్సిన్ తప్పనిసరిగా పిల్లలలో వేసే ఏడవ వాక్సిన్.

**epiblast** ectoderm బహిస్త్వచము.

**epicanthus** a vertical fold of skin covering the inner canthus కన్నులోపలి కొలికిని కప్పే చర్మపు నిలువుమడత.

**epicardia** the portion of the oesophagus beneath the diaphragm విభాజక పటలము దిగువన ఉన్న అన్నవాహిక భాగము.

**epicardium** the visceral pericardium, a membrane which closely invests the heart గుండెను అంటిపట్టుకుని యుండు పెరికార్డియమ్‌యొక్క పొర.

**epicondyle** a projection upon the condyle of a bone, *see/* చూడండి condyle. కాండైల్ (గుండ్రపు అకారము దాల్చు ఎముకయొక్క చివరిభాగము) మీద ఉబుకు.

**epicranium** flesh, muscles and skin over the skull పుర్రెపైనున్న మాంసము, కండరములు మరియు చర్మము.

**epicyte** cell membrane కణత్వచము.

**epidemic** an illness that is rapidly spreading among many persons in a community at the same time, as a contagious disease, *e.g.* **cholera e.** మహామారి: జనాభాలో పెక్కుమందికి ఒకే సమయములో సంక్రమించి అతి త్వరితగతిలో వ్యాపించు అంటురోగము, ఉదా. కలరా వ్యాధి. [*Cf.* endemic].

**epidemiology** 1. the study of factors pertaining to a disease like the occurrence, the prevalence, the distribution, mortality, *etc.* జబ్బుయొక్క సంగతి/సంభవము/సంఘటనము, వ్యాప్తి, ప్రాబల్యము, మొ. అంశములు మరియు దానివలన కలుగు జననష్టము గురించి తెలుసుకొను శాస్త్రము. 2. Epidemiology, a medical journal వైద్యవార్తా పత్రిక.

**epidermis** the outermost layer of the skin derived from the embryonic ectoderm, see/చూడండి epithelium. చర్మం పైపొర, బాహ్యచర్మము, అధిచర్మము: చర్మములోని పొరలలో అన్నిటికన్నా బయటిపొర – ఇది పిండ బహిస్త్వచమునుండి ఉత్పన్నమైనది.

**epidermoid** 1. pertaining to the epidermis బాహ్యచర్మమునకు సం. 2. resembling the epidermis బాహ్యచర్మమును పోలిన. 3. **e. cyst** ఎపిడెర్మాయిడ్ తిత్తి.

**epidermophytosis** a fungus infection of the skin; dermatophytosis చర్మముమీద ఫంగస్ జబ్బు.

**epididymis** a coiled duct situated along the posterior aspect of the testis, carrying spermatozoa; continuous with the ductus deferens/vas deferens వృషణమునకు వెనుకభాగమున అంటిపెట్టుకుని, చుట్టుకొని ఉన్న నాళము. ఇందులో పురుషబీజ కణాలు జారుతూ ఉంటాయి. శుక్రవాహిక దీని యొక్క పొడిగింపు.

**epididymitis** inflammation of the epididymis ఎపిడిడైమిస్‌యొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**epididymo-orchitis** inflammation of the epididymis and testis ఎపిడిడైమిస్ మరియు వృషణముయొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**epidural** located outside the dura mater అధిపరాశిక: పరాశిక యొక్క వెలుపలయున్న.

**epigastrium** the region of the abdomen beneath the sternal angle, wherein the stomach is present ఉరఃఫలక కోణము దిగువ ప్రాంతము. ఇక్కడ అన్నాశయము ఉన్నది.

**epiglottis** a cartilaginous lid guarding the entrance to the voice box (larynx) so as not to allow food enter the wrong way, *i.e.* into the larynx, while swallowing. The moment a food particle enters the wrong passage, the respiratory tree swings into action by cough (the watch dog) to force the particle out. అధికంఠబిలము: తిన్న పదార్థముయొక్క తునకనుగూడా శబ్దపేటికలోనికి జొరబడకుండా కాపలా కాచే మృదులాస్థిమూత. ఒకవేళ తిన్న తునక రవంతైనా శబ్ద

పేటికలోనికి జారబడినట్లయితే వెంటనే కాఅటోయి/సరానబడినప్పుడు, శ్వాసవృక్షము దగ్గర కుక్కా కాపలాకాస్తున్న 'దగ్గు' ఆ తునకను బయటికి నెట్టివేస్తుంది.

**epiglottitis** also epiglottiditis. acute severe inflammation of the epiglottis, caused by *Haemophilus influenzae*, type B ఎపిగ్లాటిస్ ఇన్ఫ్లమేషన్. *N.B.* emergency in children *గమనిక:* పిల్లలలో ఉపద్రవం.

**epilation** removal of hair at the roots, *see/చూడండి* depilatory. రోమచ్ఛేదన: జుట్టు కుదుళ్ళదగ్గర తీసివేయుట.

**epilepsy** 1. a chronic disease/disorder in the brain characterized by convulsions (fits) and, often, unconsciousness caused by disturbance in the electrical activity in the brain. Epilepsy is a condition in which seizures (sudden attacks) occur. Three major variants are described: grandmal, petilmal, and focal seizures. అపస్మారము, మూర్ఛలరోగము; తరచుగా మూర్ఛలో స్పృహ తప్పిపోవుట, నోట్లోంచి నురుగురావడము, కాళ్ళుచేతులు కొట్టుకొనుట, మూత్రవిసర్జనచేయుట, మొ. లక్షణములతో కూడిన వ్యాధి. మెదడులో విద్యుత్ చురుకుదనములోని కలత వలన సంభవిస్తుంది. 2. Epilepsy, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**epileptic** 1. one who suffers from epilepsy మూర్ఛలరోగంతో బాధ పడేవాడు. 2. referring or relating to epilepsy అపస్మారమునకు సం.

**epileptoid** epileptiform; resembling epilepsy మూర్ఛలరోగమును పోలిన.

**epinephros** on the top of kidney; adrenal gland మూత్రపిండముపైన టోపీలాగా అమర్చబడిన ఎడ్రినల్ గ్రంథి.

**epineural** outside the nerve అధితంత్రిక.

**epipharynx** above the pharynx; nasopharynx అధిగ్రసని: నాసిక కుహరముతో కలసిన గొంతుయొక్క ఉపరిప్రాంతము; నాసికాగ్రసని.

**epiphora** outflow of tears as a result of obstruction to the lacrimal duct కంటినీరు ఎక్కువగా కారటము: అశ్రువాహిక అడ్డుపడినందువలన కన్నీరుకారుట.

**epiphysis** the expanded end portion of a long bone ఎముక కొనభాగము: పొడుగాటి ఎముకయొక్క విస్తరించిన చివరిభాగము.

**epiploon** the omentum, *see*/చూడండి omentum.

**episclera** the loose connective tissue between the sclera and conjunctiva స్క్లెరాకు కంటిపొరకు మధ్యనున్న, వదులుగా లేదా బోలుగానున్న బంధన కణజాలము.

**episcleritis** inflammation of the episclera ఎపిస్క్లీరాయొక్క శోథము/' నొప్పి ఎరుపు మంట వాపు'.

**episiotomy** surgical incision into the perineum and wall of vagina to dilate the birth canal during childbirth (delivery) to avoid a tear in that region భగచ్ఛేదన: ప్రసవ సమయంలో గర్భస్థశిశువు వచ్చే కుల్యను విస్తరించుటకొరకు మూలాధారము మరియు యోనియొక్క కుడ్యమును కోసే శస్త్రచికిత్స. దీనివలన ఆ ప్రాంతాన్ని చిరుగకుండా కాపాడవచ్చును.

**epispadias** congenital deficiency in the upper wall of the urethra with its opening seen on the dorsum of the penis మూత్రమార్గము యొక్క ఉపరికుడ్య భాగము దోషము/లోపమువలన ఆ మార్గముయొక్క ద్వారము పురుషాంగము మీద ఎక్కడైనా కనబడుట.

**epistaxis** nosebleed; haemorrhage from the nose; bleeding from Little's area, the congested region in the nostril, usually seen in young adults ముక్కునుండి రక్తము: ముక్కు కుహరములో రక్తాధిక్యమైన (congested) ప్రదేశమునుండి నెత్తురు చుక్కలు పడుట; సాధారణముగా ప్రౌఢదశ (adult stage)లో నున్నవాళ్ళలో చూస్తుంటాము.

**epithelioma** any tumour arising from the epithelium ఉపకళనుండి పుట్టే కంతి.

**epithelium** cellular covering కణముల రక్షణపొర. sheet of cells lining the cavities and tubes in the body and covering the exposed surfaces of the body ఉపకళ/ఉపకళాకణత్వచము: the cellular covering of (a) internal body surfaces, *i.e.* mucous membrane శరీర లోపలితలము అనగా శ్లేష్మపొర (b) external body surface, *i.e.*

skin శరీర బాహ్యతలము అనగా చర్మము. *micro.str.,* సూక్ష్మ.చూ **ciliated e.,** bearing motile cilia, *see/*చూడండి cilia. కదిలే/ఆడే (చలనశక్తి గల) శైలికలుగల. **columnar e.,** elongated cells పొడుగాటి కణములు. **simple e.,** that having one layer ఏకాస్తర ఉపకళ. **squamous e.,** scaly or plate like cells శల్కాల ఉపకళ. **stratified e.,** rows of cells arranged in layers కణముల వరుసలు పొరలుగా ఉండుట. *e.g.* skin on palmar and plantar surface consists of five layers from within outward: i) basal layer ii) prickle-cell layer iii) granular layer iv) clear layer v) horny layer.

**epulis** a fleshy growth on the gingiva చిగురుమీద పెరిగే/ఎదిగే పంటిమాంసము.

**equilibrium** postural balance of the body శరీర సమతౌల్యము, సామ్యావస్థ, సమతాస్థితి, ఒళ్ళు తిరుగకుండా/తూలకుండా ఉండే స్థితి.

**eradication** put an end to నిర్మూలన. NMEP National Malaria Eradication Programme జాతీయ మలేరియా నిర్మూలన పథకము.

**erectile** capable of erection, *see/*చూడండి erection. **e. tissue** నిగుడుకొనే శక్తిగల కణజాలము.

**erection** sex-related organs/structures becoming stiff and rigid *pari passu* the sexual emotion నిగిడించుట: సంభోగవాంఛ కలుగగానే లైంగిక సంబంధమైన స్త్రీ పురుష సంభోగేంద్రియములు అనగా అవయవములు/నిర్మాణములు బిరుసై, గట్టిపడుట. **In the male:** the penis gets swollen, becomes erect, stiff, rigid, warm and elongated; sag in the scrotum gets corrected, testes move up పురుషులలో: పురుషాంగము ఉబ్బి, నిఠారుగా నిలిచి, బిరుగా అయి, గట్టిపడి, వెచ్చనై, పొడుగుగా సాగుతుంది; వృషణముల సంచి సడలు వీడి, వృషణములు పైకెగయుట. **In the female:** the clitoris gets swollen, becomes stiff, rigid, warm and elongated, labia majora and minora get swollen, nipples get rough స్త్రీలలో: క్లైటోరిస్ ఉబ్బి, బిరెక్కి, గట్టిపడి, వెచ్చనై సాగుట; యోని ఇరుప్రక్కల ఉన్న క్రింద నిలువు పెదిమలు ఉబ్బుట; స్తనముయొక్క చూచుకములు కరుకుబారుట. **In both sexes:** erection of hair shafts due to the contraction of arrector pili రోమములు నిక్కబొడుచుకొనుట. stimulation of

the sympathetic nervous system, *see/చూడండి* nervous system. స్వతంత్ర నాడీవ్యవస్థయొక్క ఉద్దీపనము.

**ergot** alkaloid used 1. for uterine contraction గర్భాశయ సంకోచ కౌషధము and మరియు 2. in migraine తలనొప్పిలో వాడ్తారు.

**erosion** 1. cleft due to erosion of skin or any tissue చర్మముగాని కణజాలముగాని తినివేయబడిన తర్వాత మిగులు మొరక. 2. shallow ulcer పైపైని/లోతుగాలేని వ్రణము. 3. erosion in a tooth; corrosion in tooth పన్నులో మొరక.

**erotic** 1. pertaining to lust కామోద్దీపక, కామమునకు సం. 2. sexual appetite లైంగిక సం. కామేచ్ఛ.

**erotism** also eroticism. 1. a sexual instinct లైంగిక ప్రకృతి/పశుబుద్ధి. 2. sexual hunger సంభోగ వాంఛ. 3. sex drive కామశాస్త్ర మార్గంలో ముందడుగు.

**erotomania** [Greek *eros.* love+*mania* frenzy]. morbid inclination to erotic thoughts మద(న)పిచ్చి, కామోన్మాదము. *figur.* Cupid's slave అలంకార. మదనతాపం.

**eructation** belching; regurgitating wind or surge gas from the oesophagus/stomach into the mouth త్రేపుట, తేపు, 'బ్రేవ్' అని తేన్పు (త్రేణుపు).

**eruption** 1. **creeping e.** cutaneous larva migrans. itching skin caused by larvae of parasites which creep/enter skin పరాన్నజీవుల డింభకములు చర్మములోనికి చొచ్చుకున్నప్పుడు కలిగే/సంభవించే దురద. 2. **drug e.,** rash; black or red raised patches as a side-effect of drug administration దద్దుర్లు, పొక్కులు: మందు తీసుకున్న తర్వాత కొందరిలో కనపడు దద్దుర్లు లేదా నలుపు ఎరుపు మచ్చలు. 3. vesiculo-pustular eruption of viral origin, *e.g.* herpes, vaccinia సర్పి మరియు కొన్ని టీకాల తర్వాత శరీరముమీద లేచే పొక్కులు/పుండ్లు. 4. eruption of teeth నోట్లో పండ్లు/పళ్ళు పైకి వచ్చుట.

**erysipelas** an infection of the skin with *Streptococcus pyogenes* producing vesicles and pustules విషదద్దురు రోగం: సూక్ష్మజీవుల సంపర్కమువలన చర్మముమీద బొబ్బలు మరియు పొక్కులు.

**erythema** redness of the skin due to congestion of capillaries చర్మము ఎర్రబడటము: చర్మములోని రక్తకేశనాళికలలో రక్తాధిక్యమువలన సంభవించు ఎర్రదనము.

**erythema multiforme** desquamation, ulceration and necrosis of the skin and mucous membranes which occur after the use of some drugs చర్మము మరియు శ్లేష్మపొరల మీద చీరుకొనిపోయి, వ్రణములయి అవి కుళ్ళిపోవుట. ఈ స్థితి కొన్ని మందులు వాడిన తర్వాత కలుగు పర్యవసానము.

**erythema nodosum** tender red patches and nodules on the shins and forearms seen as a sign, especially in primary complex in tuberculosis; may be associated with rheumatic fever ముఖ్యముగా క్షయవ్యాధి ప్రథమదశలో లేదా రుమాటిక్ జ్వరంలో సంభవించే, మోకాళ్ళక్రింద మోచేతులక్రింద నొప్పితోగూడిన ఎర్రని మచ్చలు మరియు మొటిమలులాంటి గడ్డలు.

**erythraemia** or **erythremia** polycythaemia of unknown cause, *see/చూడండి* polycythaemia.

**erythr(o)** red ఎర్రని.

**erythroblast** the nucleated precursor of the red blood cell (erythrocyte) ఎర్రరక్త కణముయొక్క కేంద్రకముగల అగ్రగామి.

**erythroblastosis** 1. the presence of erythroblasts in the peripheral (circulating) blood శరీరములో ప్రవహించే రక్తములో ఎరిథ్రొబ్లాస్టులు కనబడుట. 2. **e. fetalis**, haemolytic anaemia in the new born due to incompatibility between the Rh blood group of the mother and baby, *see/చూడండి* Rh system. తల్లియొక్క బిడ్డయొక్క Rh రక్తవర్గములు అసంగత స్థితిలో బిడ్డలో సంభవించు రక్తక్షీణత, కామెర్లు – అనగా తల్లియొక్క మరియు పిల్లయొక్క రక్తములోని ఆర్ హెచ్ రక్తవర్గములు భిన్నముగా నున్నప్పుడు పుట్టినబిడ్డకు సంక్రమించువ్యాధి.

**erythrocyte** a mature red blood cell/corpuscle circulating in the peripheral blood: biconcave disk; 7.5$\mu$ in diameter, 2$\mu$ thick, *resemblance:* fig. ఎర్రరక్తకణము: రక్తప్రవాహములో సంచరిస్తున్న ఎదిగిన ఎర్రరక్తకణము. పోలిక: అత్తిపండు.

**erythrocytopenia** decreased number of red blood cells ఎర్రరక్త కణముల సంఖ్య తక్కువగుట.

**erythrocytosis** increase in the number of total red blood cells ఎర్రరక్త కణముల సంఖ్య పెరుగుదల.

**erythroderma** abnormal redness on the skin చర్మముమీద అసాధారణమైన ఎర్రదనము.

**erythromycin** an antibiotic used to treat bacterial infections, *see/చూడండి* antibiotic. యాంటి బయాటిక్: క్రిమిసంహారిణి: సూక్ష్మజీవినాశక ఔషధము.

**erythropenia** erythrocytopenia, decrease in the number of total red blood cells ఎర్రరక్త కణముల సంఖ్య తగ్గుదల.

**erythropoiesis** the formation of erythrocytes ఎర్రరక్త కణములు రూపొందుట.

**erythropoietin** a hormone secreted by the kidney in the adult and by the liver in the fetus to stimulate erythropoiesis ఎర్రరక్త కణములు రూపొందించుటలో ఉత్తేజపరచు హార్మోన్; ఈ హార్మోన్ పెద్దలలో మూత్రపిండాలలోనూ, గర్భస్థపిండములో కాలేయములోనూ స్రవింపబడుతుంది.

**eschar** sloughed tissue after a fire/burn, corrosive or gangrene అగ్నివలన కాల్పుగాని, లేదా తినివేయు/వ్రణముచేయు ద్రావకము/క్షారము వలనగాని, లేదా కుళ్లిన కణజాలములోగాని రూపొందే/సంభవించే అడుసు (slough) లాంటి పరిణామము.

**Escherichia** *E. coli*, gram-negative bacteria of the genus *Escherichia* (family Enterobacteriaceae,) causes urinary tract infection and diarrhoea ఈ సూక్ష్మజీవి వలన మూత్రమార్గంలో బాక్టీరియా సంపర్కము మరియు అతిసారము కలుగును. (*N.B.* don't confuse with *Entamoeba coli* – *see/చూడండి* Entamoeba.).

**esophagectasia** *see/చూడండి* oesophagectasia.

**esophagitis** *see/చూడండి* oesophagitis.

**esophagoscopy** *see/చూడండి* oesophagoscopy.

**esophagus** *see/చూడండి* oesophagus.

**ESR** *abbr.* erythrocyte sedimentation rate రక్తకణములు ఒక గొట్టము అడుగున చేరు ప్రమాణము.

**estradiol** *see/చూడండి* oestradiol.

**estrogen** *see/చూడండి* oestrogen.

**ethics** science of morals, *e.g.* medical ethics నీతిశాస్త్రం, నైతికవిలువల అవగాహన, ఉదా. వైద్యనీతి.

**ethmoid** 1. sieve like; cribriform జల్లెడవలె చిల్లులుగల. 2. **e. bone** ఎథ్మాయిడ్ ఎముక. 3. **e. sinus**, paranasal sinus ముక్కుకు ప్రక్కన ఉన్న సైనస్.

**ethmoidectomy** surgical excision of a part of the ethmoid bone ఈ ఎముకలో కొంతభాగం తొలగించుట.

**ethmoiditis** inflammation of the ethmoid sinuses ఎథ్మాయిడ్ కోటరముల ఇన్ఫ్లమేషన్.

**ethnic** pertaining to the races of human beings జనులలో జాతి, దేశమునకు సం. *e.g.* Tuberculosis is more prevalent in Africans and Indians. ఉదా. క్షయవ్యాధి ఆఫ్రికాదేశస్థులలోను, ఇండియా దేశస్థులలోనూ ఎక్కువగా ప్రబలియున్నది.

**etiology** also *see/చూడండి* aetiology. the causative factors of a disease హేతు విజ్ఞానము: వ్యాధికి కారణభూతమైన కారకములు/ అంశములు.

**eugenics** science of the production of healthy intelligent human genetic stock సుజనన విజ్ఞాన శాస్త్రము: ఆరోగ్యకరమైన, తెలివిగలిగిన మానవ జననశాస్త్రము.

**eugonic** bacterial culture with luxurious growth సూక్ష్మజీవులు సంవర్ధనములో విరివిగా వృద్ధిచెందుట [*in contr.* dysgonic భిన్న. ఎదగకుండుట].

**eunuch** 1. a male with congenital absence of testes and genital organs కొజ్జా, నపుంసకుడు: వృషణములు మరియు పురుష జననేంద్రియములు పుట్టుకతోనే లేనివాడు. 2. a castrated or emasculated male విత్తులు తీసివేయబడిన మగవాడు; పుంస్త్వనాశము అయిన పురుషుడు.

**eupepsia** good digestion మంచి జీర్ణశక్తి [*in contr.* dyspepsia భిన్న. అజీర్ణము].

**euphoria** 1. sense of well-being ఉల్లాసస్థితి: శరీరములో స్వస్థత. 2. in psychiatry, an exaggerated feeling of well-being మానసిక రోగములలో అతిశయోక్తితో గూడిన శరీర స్వస్థత. 3. a side effect of isoniazid (INH), an anti-tuberculosis drug క్షయవ్యాధిలో వాడే ఐసోనియాజిడ్ అను మందుయొక్క ప్రభావము.

**Eustachian tube** or **eustachian tube** auditory tube connecting the nasopharynx and middle ear కంఠకర్ణనాళము, కర్ణకంఠనాళము, శ్రోతఃపథనాళము: నాసికాగ్రసని మరియు మధ్య చెవిని కలుపు శ్రవణ వాహిని.

**euthanasia** 1. mercy killing; a patient in agony, with absolute disgust for his body due to suffering from an intense pain/disease which is incurable, pleads to put an end to his life బాధా నివారణకోసము చంపటము: దయ, దాక్షిణ్యము, కరుణ ఆశిస్తూ, భరింపరాని క్షోభముతో జీవితముతో ఇక పోరాడలేని దుర్భరస్థితిలోనున్న రోగి తన జీవితము (ముదరష్టపు బ్రతుకు)నకు అంతముపెట్టమని ఒక దయాళువును వేడుకొనుట. 2. effecting an easy and painless death to the above patient పైన ఉదహరించిన రోగికి తేలికతోకూడిన సునాయాస మరణము ఇప్పుడు అతనికి ఒక వరముగా భావించాలి.

**euthenics** science of maintenance of good living standards, environment సుజీవన విజ్ఞానశాస్త్రము; మంచి జీవనవిధానము, పరిసరప్రాంతము సూచించే శాస్త్రము.

**eutocia** easy labour సుఖప్రసవము [*in contr.* dystocia].

**evacuant** an agent that produces easy motion సుఖవిరేచనకారి.

**evacuation** 1. emptying/release of the bowels, *see/చూడండి* enema. విరేచనమగుట. 2. removal of material from the inside of any organ, *see/చూడండి* D and C. గర్భకోశములోని పదార్థములు బయటకు తీయు శస్త్రచికిత్స.

**eventration** congenital or acquired defect in the diaphragm, *see/చూడండి* diaphragm. ఉదర వితానము/విభాజకపటలములోని లోపము.

**eversion** a turning outward, *e.g.* **e. of the eyelid** while examining for trachoma, foreign body, *etc.* బహిర్వర్తనము: బయటకు తెరచుట/తీయుట, ఉదా. దుర్మాంసములను లేదా నలుసుపడ్డదా అను పరీక్షకొరకై కనురెప్పను బయటికి వంచుట [*opp.* inversion వ్యతి. అంతర్వర్తనము].

**evisceration** viscera = internal organs. removal of internal organs అంతరవయవములను (లోపలివి) తీసివేయుట.

**evolution** a process of natural and gradual development క్రమ వికాసము; పరిణామము. 1. evolution of man from monkey – development of more complex functions and differentiation of parts; theory of evolution పరిణామ సృష్టివాదము; కోతినుండి మనుష్యరూపము దాల్చుటలో జరిగిన పరిణామము. 2. stages of development in a disease process వ్యాధి పురోగమనములోని పరిణామ ఘట్టములు తెలుపు భోగట్టా.

**evulsion** extraction/dragging by force బలముకొద్దీ లాగుట, పీకుట. *e.g.* shoulder evulsion producing dislocation in the shoulder joint ఉదా. బుజము కీలు తొలగుట, వాడు.భా. 'కీలు జారింది' (dislocation) అంటారు.

**exacerbation** increase of the intensity of the illness వ్యాధి ముమ్మరము: వ్యాధిప్రకోపం, వ్యాధియొక్క తీక్ష్ణత/తీవ్రత పెరుగుదల.

**examination** inspecting and investigating పరీక్షించు, పరిశోధన చేయు. 1. **clinical e.**, (a) inspection కండ్లతో చూచుట (b) palpation చేతులతో తాకుట (c) percussion వేళ్ళతో కొట్టి నాదము వినుట, స్పర్శ చేయుట (d) auscultation స్టెథోస్కోప్‌తో వినుట. 2. **radiological e.**, plain X-ray and with contrast media ఎక్స్‌రే మరియు పాలలాంటి మందు (barium) ఇచ్చి పరీక్షచేయుట. 3. intravenous urogram, angiogram, *etc.* సిరలోనికి ఇంజక్షన్ చేసి ఎక్స్‌రే తీయుట, వగైరా.

**exanthema** or **exanthem** 1. skin rash accompanied by fever, usually of viral etiology, **e.g.** measles, chickenpox. వైరస్ వ్యాధివలన కలుగు జ్వరము, చర్మముమీది దద్దుర్లు, ఉదా. పొంగు/తట్టు,

అటలమ్మ. 2. an acute disease, *e.g* measles, chickenpox accompanied by an eruption on the skin చర్మదద్దుర్లతో కూడిన తీవ్రమైన జబ్బు, ఉదా. పొంగు/తట్టు, అటలమ్మ. [*Cf.* enanthema, eruption on a mucous surface *తారత.* శ్లేష్మపొరమీద పొక్కులు].

**exanthematous** eruption-like/rash-like lesions పొంగువలె/దద్దుర్ల వలె వచ్చు క్షతములు.

**exchange transfusion in the newborn** the introduction of whole blood in exchange for 75% to 85% of an infant's circulating blood, *e.g.* in erythroblastosis neonatorum శిశువులో ప్రవహిస్తున్న రక్తంలో 75 నుంచి 85 శాతం వరకు తీసివేసి కొత్తరక్తం (దాత ఇచ్చినది) ఎక్కించుట, ఉదా. పసికందులో ఎరిథ్రోబ్లాస్టోసిస్ అనే జబ్బులో.

**excipient** a fluid or other vehicle for a medicine, *e.g.* syrup, honey, aromatic powder, elixir, *etc.* అనుపానము: మందు మింగేలా చేసే సాధన (మాత్ర చేయడంగాని, అరకు చేయడంగాని), ఉదా. సిరప్, తేనె, సుగంధపొడి, తియ్యనిద్రవం.

**excise** to remove by cutting surgically శస్త్ర చికిత్సద్వారా కోసి వేయుట.

**excision** the surgical act of cutting out a part విచ్ఛేదనం: ఒక భాగాన్ని శస్త్రచికిత్సతో ఛేదించి, తొలగించుట.

**excitation** the method of irritation or stimulation ప్రేరేపణ: రాపిడి/రేపెడు పద్ధతి లేదా ఉద్రేకము/ఉత్తేజకము కల్గించుట.

**excoriation** an abrasion/scratch on the body/skin covered with blood or serous crusts రక్తం లేదా సీరమ్ పక్కులు గట్టిన చర్మక్షతము (lesion).

**excrement** 1. faecal matter మలవిసర్జనము, విరేచనము. 2. waste product వ్యర్థపదార్థము.

**excrescence** an abnormal outgrowth in any tissue అపవృద్ధి: ఏ కణజాలములోగాని దాని అత్యధిక పెరుగుదల, ఉదా. బుడిపి, కాయు, కంతి, కణితి, మొ.

**excreta** excretion/waste product like faeces, urine, sweat విసర్జితము: బహిష్కరించవలసిన మలము, మూత్రము, చెమటలాంటి వ్యర్థ పదార్థము.

**excretion** physiological process of elimination of waste products that are formed in the body విసర్జనక్రియ: శరీరములో తయారైన వృథా/వ్యర్థ పదార్థములను అవతలకు నెట్టివేయు/త్రోసివేయు శారీరక శాస్త్ర ప్రక్రియ [*Cf.* secretion *తారత.* స్రావము]. *N.B.* Excretion is useless to the body; secretion is useful. *గమనిక:* విసర్జనపదార్థం నిరుపయోగము; స్రావము ఉపయోగము.

**excystation** escape from a cyst తిత్తిలోనుండి బహిర్గతము. *e.g.* a stage in the life cycle of a parasite *ఉదా.* పరాన్నజీవి పెరుగుదలలో ఒక దశ.

**exercise** 1. practice (especially by the body or mind) of effort కృషి సలుపుట. **muscular e.** కండర కసరత్తు, పేశీవ్యాయామం, కండర కదలిక. 2. Exercise is the key to health. చురుకైన కండర కదలిక ఆరోగ్యానికి ఆయువుపట్టు/పట్టుకొమ్మ.

**exfoliation** falling off in scales or layers (usually of the skin), *e.g.* exfoliative dermatitis. కణాలు రాలిపోవటము: చర్మముమీద – ముఖ్యముగా అరచేతులలో, అరికాళ్ళలో పొట్టు ఊడిపోవుట; చర్మము పొలుసులుగా/పొరలుగా ఊడిపోవుట.

**exhalation** the act of breathing out నిశ్వాసము; నిశ్వాసచర్య; ఊపిరి వదలుట [*in contr.* inhalation *భిన్న.* ఉచ్ఛ్వాసము].

**exhaustion** 1. extreme/marked mental/physical fatigue క్లాంతి, విపరీతమైన/విశేషమైన మానసిక/శారీరక అలుపు. 2. **heat e.**, an after-effect of exposure to excessive heat characterized by subnormal body temperature, shock and collapse ఎండదెబ్బ/ఎండవడ దెబ్బ: విపరీతమైన వేడిమి తాకిడికి ఒళ్ళు/ఒడలు చల్లబడుట, అఘాతము మరియు నిస్త్రాణ.

**exhibitionism** 1. a paraphilia characterized by exhibiting/exposing one's genitals to (a) a stranger (b) a person of the opposite sex అసభ్యమైన/అసభ్యతతో కూడిన లైంగిక భ్రంశము/వెర్రి/పిచ్చి. ఈ చర్యలో (a) తన గుహ్య అవయవములను ఒక ముక్కూ మొహము ఎరుగని పరాయివాని ఎదుట ప్రదర్శించుట (b) తనకు భిన్న లింగమైన వ్యక్తి ఎదుట ప్రదర్శించుట. 2. the tendency to exhibit one's body, especially by a female, in such a way as to attract attention (of

others) to oneself, *e.g.* a damsel exhibiting her navel/umbilicus ఇతరులచేత ఆకర్షింపబడాలని కుతూహలంతో, ముఖ్యముగా స్త్రీలు, వారి శరీరాన్ని ప్రదర్శించుట, ఉదా. కన్యాలలామ చీరగాని, పావడ/స్కర్ట్ (skirt) గాని తన నాభిని తప్పించి ధరిస్తుంది. *Note.* in advertisement, to become a box-office hit in cinema *గమనిక:* గోడలమీద ఈ సినీమా తారల బొమ్మలు చూస్తుంటాం.

**exhumation** the digging up of a body from a grave శవోత్ఖననం, శవోత్థాతము: పాతిన శవాన్ని తిరిగి పైకి తీయడం.

**exocrine** secreting *via* a duct to outside the gland బాహ్యస్రావి, బహిస్స్రావ: నాళముద్వారా స్రావము గ్రంథినుండి బయటకు వచ్చుట [*Cf.* endocrine *తారత.* అంతఃస్రావి, అంతస్స్రావ].

**exoerythrocytic** development occurring outside/in cells other than the erythrocyte, *e.g.* hepatic (exoerythrocytic) phase of the development of malarial parasites ఎర్రరక్త కణములోగాకుండా వేరైన కణములో, ఉదా. లివర్/కాలేయ కణములలో మలేరియా పరాన్నజీవి పెరుగుట.

**exogenous** 1. originating outside బహిర్జాత: వెలుపల వెలిసే. 2. **e. superinfection** in the etiopathogenesis of tuberculosis క్షయ జబ్బు కణజాలములలో అంకురించి వృద్ధిపొందుటకు క్షయక్రిముల బాహ్యసంపర్కము ఒక కారణము [*in contr.* endogenous reactivation from old primary complex *భిన్న.* అంతర్జాత, శరీరంలో జనించిన. శరీరములో చిన్నతనములో అనుభవించిన ప్రథమ క్రిమికాటు (primary infection) నాటి క్షయక్రిములు మరల విజృంభించుట అనునది మరియొక ప్రమాణము].

**exophthalmos** abnormal protrusion/bulging of the eyeball కన్నుగుడ్డు ఉబ్బు: కన్నుగుడ్డు వికృతముగా బయటకు పొడుచుకొని ఉండుట/ఉబ్బుట (a) **bilateral,** usually due to overactivity of the thyroid gland, *viz.* hyperthyroidism రెండు కన్నుగుడ్లు ఉబ్బి ఉన్నట్లయితే థైరాయిడ్ స్రావము అధికముగానున్న పరిస్థితి (b) **unilateral,** proptosis; forward bulging of the eye due to a space-occupying lesion, *viz.* a tumour in the back of the eyeball in the orbit ఒక కన్నుగుడ్డు ఉబ్బినట్లయితే కంటి గుంట వెనుక ఒక కంతి కారణమై

ఉండవచ్చును [*in contr.* enophthalmos భిన్న. కన్నుగుడ్డు సంకోచము].

**exorcism** the belief (especially religious) of driving out evil spirits by prayers or magic, practised as a modality of treatment for mental diseases భూతవైద్యము, ప్రార్థన, క్రతువుల, కళాప్రహారాల వంటి మార్గములతో భూతప్రేతాలను పారదోలే ప్రయత్నం. ఇది ఒక చికిత్సోపాయం [*Cf.* oracle తారత. సోదె].

**exostosis** 1. a benign outgrowth from the surface of a bone ఎముక వెలుపలకు కనపడే నిరపాయ ఎముక కణజాలము ఉబ్బు. 2. osteochondroma ఎముక మరియు మృదులాస్థినుండి ఉద్భవించిన ఒక కంతి.

**exotic** introduced from a foreign country, especially from a tropical country అన్యదేశీయమైన, ముఖ్యంగా ఉష్ణమండలంనుంచి. **e. disease** అన్యదేశీయ వ్యాధి.

**exotoxin** a toxin formed by the bacterial cell, and is present in the cell-free filtrates or cultures of the same organisms జీవ బాహ్యస్థవిషము/విషపదార్థం: సూక్ష్మజీవి తయారుచేసే బాక్టీరియమ్ కణజన్య విషము; ఈ విషము అవి పెరిగిన ద్రవములో లేదా సంవర్ధనములో ఉంటుంది [*in contr.* endotoxin భిన్న. జీవాంతస్థ విషపదార్థం].

**expectoration** 1. sputum కళ్ళె, కఫము. 2. material coughed out from the throat, bronchi and lungs దగ్గిన తర్వాత గొంతు, శ్వాసనాళికలు మరియు ఊపిరితిత్తులనుండి వచ్చు పదార్థము.

**experimental** trying out new techniques ప్రయోగాత్మకమైన. **e. medicine** ప్రయోగాత్మకమైన వైద్యవిజ్ఞానం.

**expiration** the act of breathing out నిశ్వాసము, రేచకము: ఊపిరి బయటకు వదలుట [*in contr.* inspiration భిన్న. ఉచ్ఛ్వాసము, పూరకము].

**expire** 1. to breathe out, exhale నిశ్వాసము. 2. to breathe one's last breath, die మరణించు.

గర్భస్థశిశువు కాళ్ళతోగాని, పిరుదులతోగాని యోని కుల్య (birth canal)లో కనపడినప్పుడు దానిని లాగుట. 2. **e. of tooth** పన్నుపీకడం. 3. The process of preparing an extract of a vegetable or animal product, *vide supra* in extract సారము (extract) తయారుచేయుట – పైన extract లో చూడండి.

**extrapyramidal** matter in the brain other than the pyramidal tracts సూచి స్తంభనాడులు కాకుండా ఉన్న వ్యవస్థ ప్రాంతము. **e. system.,** It consists of the corpus striatum, subthalamic nucleus, substantia nigra and red nucleus, along with their interconnections with the reticular formation, cerebellum, cerebrum and spinal cord.

**extra-systole** premature cardiac contraction that arises in response to a stimulus outside the sinoatrial node (SA node), *e.g.* **atrial e.,** premature atrial complex నిర్ణీతకాలముకన్నా ముందు వచ్చే హృదయ సంకోచము (cardiac contraction). శాస్త్రరీత్యా SA కణుపు కాకుండా వేరొకచోట ప్రేరేపకమువలన సంభవిస్తుంది, ఉదా. నిర్ణీతకాలము కన్నా ముందు వచ్చే ఏట్రియమ్ సంకోచము.

**extrauterine pregnancy** ectopic gestation, *see/చూడండి* ectopic.

**extravasation** the escape or forceful flow of any fluid (blood, lymph, urine, *etc.*) from a vessel or tube into the surrounding tissues పరిస్రావం: నాళము/గొట్టము నుండి చుట్టూరా ఉన్న కణజాలములలోనికి ద్రవము (రక్తము, లింఫ్, మూత్రము, మొ.) తప్పించుకొనిపోవుట/ పారుట). 1. after injury to blood/lymph vessels రక్త/లింఫ్ నాళములు గాయపడినప్పుడు. 2. extravasation of fluid into the tissues outside the vein during intravenous drip due to the needle slipping out of the vein సిరలోనికి ద్రవము ఎక్కిస్తున్నప్పుడు పొరపాటున సూది సిరలోనుండి జారిపోతే అప్పుడు ఆ ద్రవము చుట్టూరా ఉన్న కణజాలములలోనికి తప్పించుకొని పోవుట. 3. extravasation of urine into the tissues in the perineum after rupture of urethra due to injury in the region of the perineum (an accident which occurs when one puts his foot near the

circumference/edge of a loose manhole cover in the drainage system while walking) మూలాధారము ప్రాంతంలో దెబ్బ తగిలినప్పుడు మూత్రమార్గము చిరిగిపోయి మూలాధార కణజాలములలోకి మూత్రము తప్పించుకుపోతుంది (ఈ ప్రమాదము ఎట్లా సంభవిస్తుంది అంటే, నడుస్తున్నప్పుడు వదులుగానున్న డ్రైనేజి గుండ్రపు మూత అంచున కాలుపడితే ఆ కాలు డ్రైనేజి గుంటలోకి పోయి డ్రైనేజి కవరు/మూత మూలాధారమునకు కొట్టుకుంటుంది; అప్పుడు మూలాధారపు మూత్రమార్గము చిరుగుతుంది).

**extremity** 1. (a) upper/superior extremity ఊర్ధ్వాంగము, పై అంగము, వాడు.భా. చెయ్యి (b) lower/inferior extremity అధోంగము, క్రింది అంగము, వాడు.భా. కాలు. 2. the terminal portion of an elongated structure ఏదైనా పొడుగాటి భాగముయొక్క తుది/చివర ప్రాంతము.

**extrinsic** of external origin బాహ్యాజన్య, *e.g.* extrinsic pressure over a nerve/blood vessel ఉదా. నాడి/రక్తనాళము మీద బయటనుంచి ఒత్తుడు/ఒత్తిడి [*in contr.* intrinsic భిన్న. అంతర్జన్య].

**extrovert** a personality trait; one who is active and expressive - dashing వ్యక్తిత్వ లక్షణము; బహిర్ముఖుడు, చురుకైన ధీమంతుడు; మాటలతో ఆకట్టుకొను/ఆకర్షించు గుణముకలవాడు, కార్యనిర్వహణకు నడుముకట్టుకుని దూకేవాడు; చొరవగల/చొరవ చేసుకొనగలవాడు, చొరవకాడు. [*in contr.* introvert భిన్న. అంతర్ముఖుడు].

**exuberant** copious, luxuriant, *e.g.* **e. growth** of bacilli in a culture medium పుష్కలమైన, సమృద్ధమైన, ఉదా. సంవర్ధనము (culture medium)లో విస్తారమైన బాసిల్లై సంపద/పెరుగుదల.

**exudate** a fluid with high protein content (more than 3 g/dl) and cellular debris exuded from inflammatory surfaces and wounds శోథసహిత స్రావము, శోథస్రావము: 'నొప్పి వేడి మంట వాపు' గల తలములనుండి మరియు గాయములనుండి అధిక ప్రోటీన్ శాతము, కణములయొక్క శిథిలపదార్థము గల ద్రవము [*in contr.* transudate భిన్న. శోథరహితస్రావము, పారస్రావం].

**exudation** 1. the act of exuding or oozing శోథస్రావం కొంచెము కొంచెముగా చెమర్చుట (oozing). 2. passage of exudate into tissues or cavities in the body శోథస్రావము కణజాలములలోనికిగాని శరీరకుహరములలోనికిగాని పాకుట.

**eye** 1. oculus, ophthalmos; the special sense organ of vision కన్ను, నేత్రము, లోచనము 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్'. 2. *figur.* as viewed from another angle, the eyes radiate concealed sex appeal with enchanting looks; exotic eye-popping exercises practised by Eve అలంకార. మరియొక దృష్ట్యా పరికించితే నిగూఢమైన, ప్రగాఢమైన, అంతరాంగిక కామస్ఫూరితమైనవి కండ్లు; మన్మథ బాణాల్లాంటి వాడి చూపులు గలవి.

**eyeball** sphere/globe of the eye కన్నుగుడ్డు, నేత్రగోళము composed of three layers – sclera, choroid and retina మూడు కంచుకములు – దృఢస్తరము, రక్తపటలము, నేత్రపటలము కలది.

**eye bank** Consequent on the philanthropic appeal 'Donate your eyes', normal eyeballs from the deceased are picked up and stored in preservative for future corneal graft to the needy patients. ఇప్పుడు ప్రతిచోట, TV లోను, సర్వజనహితేచ్ఛగల మనవి 'నేత్రదానం చేయండి' వింటున్నాము. దానముచేసిన కన్నులను నేత్రనిధిలో దాచి, కాపాడి, భవిష్యత్తులో అక్కర ఉన్న రోగికి, శుక్లపటలము మార్పు/ అంటుకట్టడం (corneal graft) కొరకు వాడుతారు. *గమనిక:* నేత్రదానం విలువ అమూల్యం!

**eyebrow** hairy bony ridge/edge at the upper border of the orbit భ్రూవు, కనుబొమ్మ/కనుబొమ: కంటిగుంట ఉపరిభాగమున ఉన్న రోమసహితమైన ఎముక కప్పు/గట్టు. *idiom:* raise one's eyebrows భాషీయము: ఆశ్చర్యం వెలిబుచ్చు.

**eye-drops** medicinal drops to be put in the eye కంట్లోవేసే మందు చుక్కలు, నేత్రౌషధం.

**eye glasses** a pair of spectacles worn సులోచనములు. 1. to improve vision చూపు/దృష్టి సమముగా ఉండుటకు సులోచనముల

ధారణము, అలంకార. సునయనములకు సాధనము. 2. cooling glasses to avoid glare వెలుతురు తగ్గించుటకు రంగు కళ్ళఅద్దాలు.

**eye ground** fundus of the eye as seen through the ophthalmoscope నేత్రాంతర్దర్శనితో కన్నులోపల పరీక్షించుట.

**eye lashes** hairs at the edge/border of both eyelids కన్నురెప్పల అంచున ఉండే రోమములు.

**eyelids** the two (upper and lower) protective covers for the eyeball కనురెప్పలు: కన్నుగుడ్డు యొక్క తలమును కాపాడుతూ ఉన్న రెండు (పైది, క్రిందిది) రెప్పలు.

**eyepiece** the set of lenses in a microscope or telescope nearest the examiner's eye with a purpose to magnify the images of objects being seen సూక్ష్మదర్శినిలోగాని దూరదర్శినిలోగాని చూడబడే వస్తువుల ప్రతిమలు పెద్దవిగా చేయుటకు వాటిలో అమర్చబడిన భూతద్దములు.

**eyesore** a thing that is unpleasant to look at చూడటానికి దుర్భరముగా తోచే దృశ్యము.

**eye strain** fatigue in the eyes producing headache కన్నులకు అలసట – దీని పర్యవసానము గ్లాని/తలనొప్పి.

**eye tooth** the canine tooth in the upper jaw నోట్లో పైన ఉన్న కోఱ పన్ను.

**eye wash** a lotion for the eyes కండ్లు శుభ్రపరచుటకు లోషన్.

# F f

**$^0$F** *abbr.* degrees Fahrenheit scale, normal body temperature 98.6° F శరీర ఉష్ణోగ్రత 98.6° *F*.

**face** 1. anterior part in the head from the hairy margin above to the chin below ముఖము, తలకాయ యొక్క ముందు భాగము, జుట్టుయొక్క మొదలునుండి గడ్డమువరకు. 2. presentation of face ముఖము యొక్క దర్శనము, e.*g*. face presentation of the fetus during delivery ఉదా. ప్రసవకాలములో శిశువు ముఖము యోనిద్వారము (birth canal) లో కనుపించుట 3. moon face, seen in excessive use of adrenal corticosteroids; Cushing's syndrome కార్టికోస్టిరాయిడ్స్ అను మందులు ఎక్కువగా వాడినందువలన ముఖములో కలుగు పరిణామము, ముఖవర్చస్సులో మార్పు. ఇది కుషింగ్స్ జబ్బులో గూడా అగపడుతుంది. 4. Face is the index of the mind. ముఖము భావ సూచకము.

**face-ache** 1. neuralgia of face ముఖనాడుల నొప్పి. 2. *sl.* gloomy-looking person ఉత్సాహము/సంతోషము లేని మనిషి.

**facial** pertaining to the face ముఖమునకు సం. **f. nerve,** 7th cranial nerve 7వ కపాలనాడి.

**facies** countenance, the appearance of/expression in the face ముఖవైఖరి. **adenoid f.,** *see/చూడండి* adenoids. child breathing through the mouth పిల్ల/పిల్లవాడు మామూలుగా ముక్కుతో గాలి పీల్చలేక నోటితో గాలిపీల్చుట. **anaemic f.,** pallor of the skin and mucous membranes చర్మము మరియు శ్లేష్మపొరలు పాలిపోయి ఉండుట (రక్తపు లేమివలన). **anxious f.,** denoting anxiety in certain psychiatric diseases and dangerously ill states కొన్ని మానసిక వ్యాధుల్లో మరియు ప్రమాదకరమైన జబ్బుల్లో అదుర్దా, ఆతురత, ఆతురము, ఆత్రము తెలుపు ముఖవైఖరి. **leonine f.** సింహాకృతిగల ముఖం. **Parkinsonian f.,** mask like face, expressionless face seen in paralysis agitans, *viz.* Parkinsonism ముఖ కండరములలో ఏ మాత్రము చలనములేకుండా భావరహితమైన (ముఖానికి తొడుగు ఉన్నట్లు) ముఖము: పార్కిన్సోనిసమ్ అనే జబ్బులో ఇట్లా ఉంటుంది.

**facioplegia** facial paralysis ముఖ కండరములకు పక్షవాతము.

**factor** a substance present in the tissues కారకము, కణజాలము లలోనున్న పదార్థము. **antihaemophilic f.,** Factor VIII used in the treatment of haemorrhage in haemophilia A హిమోఫిలియా A అను జబ్బులో రక్తస్రావము నిలిపే వస్తువు. **coagulation f's,** agents essential for normal blood clotting – Factor I to V and VII to XIII రక్తము గడ్డకట్టుటకు కావలసిన పదార్థములు. **extrinsic f.,** cyanocobalamin, vitamin $B_{12}$ విటమిన్ $B_{12}$. **intrinsic f.,** secreted in the stomach జఠరములో స్రవించు పదార్థము. **rheumatoid factor** (RF) a protein found in the serum of patients suffering from rheumatoid arthritis కీళ్ళ వాతముతో బాధపడుతున్నవారి సీరమ్‌లోనుండు పదార్థము.

**faecalith** or **fecalith** a concretion formed around a faecal particle, in the intestine పేగులో మలముయొక్క నలుసునుండి వృద్ధిపొందిన, కంకరవలెనుండే, గట్టి రాయివంటి పదార్థము.

**faeces** or **feces** waste matter expelled from the bowels; motion, excrement మలము, విరేచనము, పురీషము, ఆసనము ద్వారా విసర్జించే వృథా/వ్యర్థ పదార్థం, వాడు.భా. దస్తు, బేది, దొడ్డికి, చెంబట్టుకు (అనగా, నీళ్ళతో ఉన్న చెంబు పట్టుకొని మలవిసర్జనకు దూరముగా నిర్మానుష్యమైన ప్రదేశమునకు వెళ్ళే అనవాయితీ ఉన్నది కాబట్టి ఈ పదమునకు గ్రామ్యంలో ఇది వివరణము); గ్రా. పియ్యి.

**failure** not able to perform the function allotted తప్పుటము, సోలిపోవుట: అచరించవలసిన విధి నిర్వర్తించలేకపోవుట. **circulatory f.** రక్తప్రసార లోపం. **congestive heart f.,** results in breathlessness, swelling of the body and congestion in the lungs and tissues గుండె సోలిపోవుట, తత్ఫలితంగా అయాసము, నంజో అనగా శరీరము ఉబ్బుట, ఊపిరితిత్తులలోను కణజాలములలోను రక్తాధిక్యము కలుగుట (రక్తప్రసరణ సరిగా లేనందున). **hepatic (liver) f.** కాలేయ క్రియాలోపము. **kidney (renal) f.,** swelling of the face first and body next, occurs in this condition మూత్రపిండాలు సోలిపోవుట: ఈ జబ్బులో ముందుగా ముఖములో, ఆ తర్వాత శరీరమంతా వాపు వస్తుంది. **peripheral circulatory f.** పరిధీయ రక్తప్రసరణ లోపం.

**faint** syncope మూర్ఛిల్లుట, సొమ్మసిల్లుట. 1. feeling weak, dizzy and dim బలహీనమై, కండ్లు తిరుగుతున్న స్థితి, మందకొడిలా ఉండుట. 2. swoon: a condition of temporary loss of consciousness మూర్ఛపోవు: స్వల్పకాలము స్పృహతప్పిపోవు స్థితి.

**faith** belief in doctor డాక్టరుమీద నమ్మకము; అయన హస్తవాసి మంచిదని దృఢవిశ్వాసము. **f. cure,** relief on grounds based on faith నమ్మికవలన కలుగు ఉపశమనము. *e.g.* 'fish cure' for asthma practised in Hyderabad: forcibly introducing a small live fish into the throat and asking him to swallow –implict faith in 'miracle cure' ఉదా. ఉబ్బసమునకు చికిత్స: బ్రతికి ఉన్న చిన్న చేపను గొంతులోనికి నెట్టి మ్రింగమని సూచన. హైదరాబాదులో జనసమూహమునకు ఇదొక వింత నమ్మకము అని భోగట్టా. *N.B.* Faith is the best healer. *గమనిక:* నమ్మకం ఉంటే ఫలితం లభిస్తుంది; గుటికుదిరితే నమ్మకం ఉంటుంది.

**Fallopian** or **fallopian tubes** uterine tubes, two tubes, one on both sides of the womb (uterus) connecting the two ovaries. This tube transports the ovum from the ovary to the uterus. These tubes are divided in family planning operation – 'tubectomy'. గర్భాశయమునకు రెండువైపుల ఉండు నాళములు. ఇవి అండాశయము నకు కలుపబడుతవి; వీటిద్వారా అండము రవాణా అవుతుంది. కుటుంబ నియంత్రణ పథకములో పిల్లలు కలుగకుండా ఉండుటకు చేసే అపరేషనులో ఈ నాళములను త్రుంచివేయుట, వాడు.భా. చిన్న అపరేషన్.

**Fallot's tetralogy** *see/చూడండి* tetralogy of Fallot.

**fall out** 1. radiation produced by nuclear explosion which may produce bodily and genetic damage పరమాణువుల ప్రేలుటవలన కలుగు కిరణప్రసారము, దీని వలన శారీరక మరియు జన్యువు సం. కీడు కలుగుతుంది. 2. fall-out, a quarrel జగడము.

**false-negative** true positive, but a report/result given as negative లేదని తప్పు రిపోర్టు; కాని నిజంగా ఉన్నది.

**false-positive** true negative, but a report/result given as positive కాదు; ఉన్నదని తప్పు రిపోర్టు; కాని నిజంగా లేదు.

**falx** a sickle shaped structure కొడవలిని పోలిన నిర్మాణము. **f. cerebri,** the fold of duramater separating the two cerebral hemispheres రెండు మస్తిష్క గోళార్ధాలను వేరుచేయు పరాశిక మడత.

**familial** occurring in many members of a family కుటుంబంలో పలువురికి కలిగే. **f. disease** కుటుంబ సభ్యులలో పెక్కుమందికి సంక్రమించు వ్యాధి.

**family** members of the same lineage/ancestry కుటుంబము. **f. doctor,** family physician కుటుంబ వైద్యుడు. **f. planning** కుటుంబ నియంత్రణ. **f. tree** వంశవృక్షము.

**family welfare** 1. wellbeing of families కుటుంబ క్షేమం. 2. in Ministry of Health and Family Welfare ఆరోగ్యం, కుటుంబ శ్రేయస్సు మంత్రిత్వ శాఖలో.

**fascia** a sheet of fibrous tissue that invests muscles, *e.g.* **Scarpa's f.**, subcutaneous abdominal fascia కండరములను అంటి పట్టుకొని ఉండు తంతుయుత కణజాలము, ఉదా. స్కార్పా ఫేసియా: ఉదర చర్మముక్రిందనున్న కండరాలను అంటిపెట్టుకొని ఉన్న తంతుమయ కణజాలము.

**fascicle** a small bundle of nerve, tendon or muscle fibres నాడుల, స్నాయు బంధనముల, లేదా కండరముల తంతువులయొక్క చిన్న సముదాయము.

**fasciculation** a small local contraction of muscle bundles innervated by a single motor nerve filament, observed in motor neuron disease, *see/చూడండి* fibrillation, sclerosis. స్థానిక కండర తంత్రీసమూహ సంకోచ తరంగం. ఒక చాలకనాడి తంతువుచే నాడీ ప్రసారమువలన కలుగు చిన్న కండరతంతువుల సంకోచము. ఈ సంకోచములు చర్మముక్రింద పరికించి చూస్తే గమనించవచ్చు; ఇవి ఒక రకమైన కేంద్ర నాడీవ్యవస్థ జబ్బులో కనబడుతాయి.

**fasciculus** a tract of nerve fibres, **f. cuneatus, f. gracilis of the spinal cord** నాడీతంత్రుల కట్ట, ఉదా. వెన్నుపాములో ఉన్న పొడుగాటి క్యూనియేటస్ కట్ట, గ్రాసిలిస్ కట్ట.

**fasciitis** or **fascitis** inflammation of the fascia 'ఫేసియాయొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**Fasciola** a genus of flukes, a parasitic worm ఒక ప్రజాతి పురుగులు, పరాన్నజీవి. liver fluke, *F. hepatica*, found in liver, produces jaundice కాలేయములో ఉంటుంది; కామెర్లు కల్గిస్తుంది.

**fascioliasis** *see/చూడండి* platyhelminthes. infection of the intestines caused by a parasite, liver fluke producing fever, jaundice, diarrhoea with abdominal pain లివర్ ఫ్లూక్ అనే పరాన్న జీవి సంపర్కమువలన సంభవించే జ్వరము, పచ్చకామెర్లు, విరేచనాలు, కడుపునొప్పి.

**fastigium** 1. acme; zenith, *e.g.* of fever జ్వరముయొక్క ఉద్ధృతము. 2. the highest point in the roof of the fourth ventricle in the brain మెదడులోని నాల్గవ కోష్ఠకము/కుహరముయొక్క పైభాగము.

**fat** 1. adipose tissue in the body క్రొవ్వు, చమురుపదార్థం. *see/చూడండి* obesity. శరీరములోని కొవ్వుకణజాలము. 2. saturated and polyunsaturated fat in oil నూనెలోనున్న కొవ్వు. 3. health hint: Be fit, not fatty especially in post middle age. ఆరోగ్య చిటకా: మధ్యవయస్సు దాటిన తర్వాత స్వస్థతకు కొవ్వు చేరనీయకండి.

**fatigue** tiredness, lassitude, exhaustion of strength అలపు, గ్లాని, అలసట, బడలిక.

**fatty acid** the constituent of fat కొవ్వు ఆమ్లము: కొవ్వులో నున్నది.

**fauces** the space from the back of the tongue to the pharynx అంగిలి, అంగుటి: నాలుక వెనుకనుండి గొంతువరకుగల భాగము.

**favus** a variety of tinea capitis, caused by a fungus, *Trichophyton* ఒకరకమైన ఫంగస్ జబ్బు/శిలీంధ్రవ్యాధి.

**febrile** 1. feverish జ్వరంతో కూడిన, తాపము. 2. pertaining to fever జ్వర సం. **f. state** జ్వరస్థితి.

**fecalith** *see/చూడండి* faecalith.

**feces** *see/*చూడండి faeces.

**fecundation** 1. impregnation గర్భాదానము. 2. fertilisaton పిండోత్పత్తి అవటము, ఫలదీకరణము; గర్భధారణము.

**fecundity** 1. the ability to produce offspring ప్రజననశక్తి: సంతానోత్పత్తి చేయగల సామర్థ్యము [*in contr.* sterility భిన్న. వంధ్యత్వము]. 2. productivity ఉత్పాదనము.

**feedback** 1. in endocrinology: a signal of regulatory mechanism; feedback of an endocrine organ such as the adrenal, thyroid or gonads to the pituitary which is the origin of adrenocorticotrophic, thyrotrophic, or gonadotrophic hormone అంతస్స్రావీగ్రంథుల శాస్త్రములో: స్రావము బయలుదేరిన గ్రంథికి మిగతా గ్రంథులనుండి సమాచారమునిచ్చు పద్ధతులు. 2. comments about a book to be sent to the author of the book from the readers పుస్తకము గురించి విమర్శలు చదువరులు గ్రంథకర్తకు తెలుపుట.

**feeding** 1. giving food ఆహారమునిచ్చుట. **bottle f.** సీసా పాలివ్వడం. **breast f.**, *see/*చూడండి breast feeding. **forced f.** బలవంతముగా తినిపించుట లేదా గొంతులో Ryle's tube వేసి ద్రవములు పోయుట. **infant f.** శిశుపోషణ. 2. taking food ఆహారము తీసుకొనుట.

**fellatio** an act of sexual perversion in which the penis is placed in the mouth of another. అస్యమైథునం: ఇది ఒకవిధమైన లైంగిక వైపరీత్యము; పురుషాంగము ఇంకొకరి నోటిలోనికి పెట్టుట.

**felon** purulent infection of the pulp of the finger or toe వేలు చివరన, అరచేయి లేదా అరికాలు వైపున ఉన్న గుజ్జు (pulp) వంటి మెత్తటి భాగమునకు చీముపట్టుట.

**female condom** a device of contraception consisting of a thin polyurethane pouch which fits inside the vagina యోనిలోనికి దూర్చే సన్నని రబ్బరుసంచి – ఇది గర్భనిరోధమునకు ఒక ఉపాయము.

**feminism** 1. male appearing as a female మగవాడు ఆడుదానివలె అగపడుట. 2. existence of female secondary sex characteristics in the male పురుషునిలో స్త్రీయొక్క లక్షణములు అగపడుట అనగా, మూతిమీద మీసము, గడ్డముమీద వెంట్రుకలు, గుహ్య అవయవము పైన

దట్టమైన రోమములు లేకుండుట; స్తనములు మరియు పిరుదులు స్త్రీకి ఉన్నట్లు పెద్దవిగా, మృదువుగా, గుండ్రము తిరిగి ఉండుట.

**feminization** to make feminine, especially to produce female characteristics in the male ఆడంగిగా చేయుటము, ఆడురూపము కలుగ జేయు; ఆడంగి లక్షణములుగల మగవాడు [*in contr.* masculinization భిన్న. మగరాయుడుగా మారుట].

**femoral** relating to the femur or the thigh ఊర్వస్థి లేదా తొడకు సం.

**femur** thigh bone ఊర్వస్థి, ఊర్విక, తొడఎముక.

**fenestra** a window-like opening రంధ్రము, గవాక్షము: కిటికీ వలెనుండు రంధ్రము. **f. cochleae, f. rotunda,** round window in the middle ear వర్తులాకార గవాక్షము, మధ్య చెవిలో రంధ్రము. **f. ovalis, f. vestibuli,** oval window in the middle ear అండాకార గవాక్షము. మధ్య చెవిలో రంధ్రము.

**fenestration** the surgical creation of an opening inside the structures in the ear as a cure for deafness గవాక్షీకరణము: చెవి లోపలి భాగములలో శస్త్రచికిత్స చేసి రంధ్రముచేయుట; చెవుడు/చెముడును బాగుచేసే సాధన.

**fenugreek** *bot.* leaves and seeds of a herb మెంతికూర, మెంతులు. 1. ingredient in cooking వంటకాలలో వాడ్తారు. 2. seeds used in diabetes mellitus మెంతులు మధుమేహం వ్యాధిలో వాడ్తున్నారు.

**fermentation** decomposition of carbohydrates into simpler compounds by enzymes కిణ్వనము, పులియుట, పులియబెట్టే చర్య: ఎన్‌జైముల సహాయంతో కార్బోహైడ్రేట్లను విడగొట్టుట.

**fertility** the capacity to conceive ప్రజనన శక్తి; సంతానోత్పత్తి చేయగలగటం, గర్భము ధరించు సామర్థ్యము [*in contr.* infertility భిన్న. వంధ్యత్వము].

**fertilization** the union of a male sex germ cell (spermatozoon) with a female sex germ cell (ovum) ఫలదీకరణము, ఫలీకరణము, గర్భోత్పాదనము: పురుష బీజకణము అండముతో కలయిక/కలయుట – ఈ సాంగత్యమువలన పిండము ఏర్పడుతుంది.

**fetal** or **foetal** relating to a fetus భ్రూణమునకు సం.

**fetal alcohol syndrome** mental retardation in a newborn baby whose mother indulged in alcohol abuse/excess during pregnancy. తల్లి గర్భిణీకాలంలో మితిమీరి మద్యము సేవించినట్లయితే శిశువుకు సంక్రమించు మానసిక క్షీణత.

**feticide** or **foeticide** killing of the fetus భ్రూణహత్య.

**fetid** or **foetid** having stinking smell కంపుకొట్టెడు.

**fetish** 1. an object believed to possess magical power మాహాత్మ్యం ఉందని నమ్మి పూజించే ప్రాణరహితమైన వస్తువు (భూత వస్తువు). 2. in psychiatry: any non-sexual object that evokes/provokes fetishism కామ విషయకమైన చేష్టలు ప్రేరేపించే అలైంగిక వస్తువు.

**fetishism** 1. worship of/belief in fetishes వస్తుకాముకత: భూతవస్తువుల పూజ/నమ్మకము. 2. erotic feelings excited by a non-sexual object, *e.g.* foot, glove *etc.* కామకళాశాస్త్రము/కొక్కోకమునకు సం. తలపులు, ఉదా. పాదము, వేళ్ళకు తొడుగు, మొ. అలైంగిక వస్తువుల చూపుతో రతి ఊహ రేకెత్తబడుట.

**fetor** or **foetor** stench కంపు, దుర్గంధము. **f. oris,** halitosis నోటి దుర్వాసన.

**fetoscope** or **foetoscope** a stethoscope designed to hear the fetal heart sounds భ్రూణముయొక్క గుండె చలనము పరీక్షించు/విను సాధనము.

**fetus** or **foetus** the developing baby from the period of eight weeks to birth భ్రూణము: ఎనిమిది వారములనుండి పుట్టుకవరకు పెరుగుతున్న శిశువు [*Cf.* embryo: upto 8 weeks *తారక.* పిండము: 8 వారాలవరకు].

**fever** A. pyrexia తాపము, జ్వరము. elevation of the body temperature above the normal ($37°C$ or $98.6°F$) శరీర ఉష్ణోగ్రత $37°C$ లేదా $98.6°F$ మించి యుండుట. **drug f.,** reaction to an injection, vaccine, *etc.* సూది, టీకా, మొ. వాటికి ప్రతిఘాతమైన జ్వరము. **f. due to infection:** bacterial, fungal, protozoal, rickettsial, spirochetal, viral, *etc.* క్రిమి సంపర్కము వలన కలుగు జ్వరము: బాక్టీరియా, ఫంగస్, ప్రొటోజోవా, రికెట్సియా,

స్పైరొకీటా, వైరస్, మొ. **f. due to infestation,** *i.e.* invasion of the body by parasites శరీరంలోనికి పరాన్నజీవి దాడివలన. **f. due to malignancy,** *e.g.* in leukaemia (blood cancer), other cancers అపాయ స్థితులలో, ఉదా: లుకేమియా (రక్త కేన్సరు), మిగత కాన్సరు వ్యాధుల్లో. **malaria f.** మలేరియా జ్వరము, వాడు.భా. చలిజ్వరము. **paratyphoid f.** పారాటైఫాయిడ్ జ్వరము. **puerperal f.** పురిటిబాలింతకు వచ్చే జ్వరము. **rheumatic f.** టాన్సిల్సు పెరిగి, కీళ్ళవాతంతో వచ్చే జ్వరము. **typhoid f.** సన్నిపాత జ్వరము. **viral f.** వైరస్ వలన జ్వరం. B. **cricket f., football f., tennis f.** enthusiasm about the game ఆటసరదా. C. **election f.,** keen contest ఎలక్షన్ పోటీ/హడావిడి.

**feverishness** feeling of fever జ్వరలక్షణాలు, వాడు.భా. సలపరింత.

**fibre** or **fiber** an elongated thread like structure తంతువు, పోగు, నార. A **adrenergic f's,** sympathetic fibres that liberate adrenaline/epinephrine ఎడ్రినాలిన్ అను ద్రవము స్రవింపజేసే స్వతంత్ర నాడీవ్యవస్థ తంతువులు. **afferent nerve f's,** *see*/చూడండి afferent nerves. **collagen f's,** connective tissue fibres బంధన కణజాలపు తంతువులు. **dietary f.,** the part of the whole grains, vegetables, fruits and nuts, carbohydrates (cellulose *etc.*) తవుడు, కాయగూరలు, పండ్లు, పప్పుగింజలు మరియు సెల్యులోస్, మొ. వాటితో కూడిన ముడిబియ్యం (దంపుడుబియ్యం) – వీటిలోనున్న పీచుపదార్థం. **efferent nerve f's,** *see*/చూడండి efferent nerves. **elastic f's,** present in connective tissue బంధన కణజాలపు తంతువులు. **muscle f's,** of the skeletal (10 to 100$\mu$ in size) and cardiac muscles నియంత్రిత కండర తంతువులు మరియు గుండె కండర తంతువులు. **nerve f's,** నాడీ తంతువులు. B. *figur.* moral fibre నీతిప్రవర్తన.

**fibrillation** small local involuntary muscular contractions తంతు వికంపనము: స్వల్ప ప్రాంతీయ కండర సంకోచములు. 1. **atrial f.,** irregular heart rate due to rapid contractions of small areas of atrial myocardium ఏట్రియ స్వల్పప్రాంతీయ కండరముల యొక్క సంకోచములవలన కలిగే క్రమము తప్పిన గుండె వేగము. 2. **f.** or

**fasciculation in motor neurone disease,** *see/చూడండి* motor neuron disease, sclerosis.

**fibrils** microscopic fibres సూక్ష్మతంతుకలు. *micro. str.* సూక్ష్మ. చూ. 1. microscopic collagenous bundles, *e.g.* fibrils between the dentinal tubules, 2 to 4$\mu$ thick తంతుకలు, సూక్ష్మతంతువుల కట్టలు, ఉదా. పన్నులోని డెంటిన్‌లో సూక్ష్మనాళికల మధ్యనున్నవి. 2. myofibrils కండర తంతుకలు. 3. neurofibrils నాడీ తంతుకలు.

**fibrin** a protein responsible for the clotting of blood, present in the body రక్తము గడ్డకట్టుటకు కారణమైన ప్రోటీను – ఇది శరీరంలో ఉంటుంది.

**fibrinase** coagulation factor XIII స్కందనకారకము.

**fibrinogen** precursor of fibrin, present in the blood. This is a protein. ఫైబ్రిన్‌కు అగ్రగామి, అనగా ఫైబ్రినోజన్ నుండి ఫైబ్రిన్ తయారవుతుంది. ఇది ఒక ప్రోటీన్. blood clotting factor, Factor I రక్తస్కందన ఫాక్టర్.

**fibrinoid** resembling fibrin ఫైబ్రిన్‌ను పోలిన.

**fibrinolysin** an agent promoting the dissolution of fibrin ఫైబ్రిన్‌ను కరిగించే పదార్థము.

**fibroadenoma** adenofibroma, a benign tumour నిరపాయ కంతి.

**fibroadipose** consisting of fibrous and fatty tissue తంతు కణ జాలము మరియు కొవ్వుకణములు కలది.

**fibroblast** an immature fibre-producing cell of the connective tissue బంధన కణజాలములోని అపక్వమైన, తంతువును ఉత్పత్తిచేయు కణము.

**fibroblastoma** tumour arising from fibroblasts ఫైబ్రోబ్లాస్టులనుండి ఉత్పన్నమయ్యే కంతి.

**fibrocalcific lesion** calcified fibrous tissue, *e.g.* healed tuberculous lesions సున్నపు పరిణామము చెందిన తంతు కణజాలము, ఉదా. నయమైన క్షయవ్యాధి క్షతముల యొక్క గుర్తులు.

**fibrocarcinoma** scirrhous/scar carcinoma, *e.g.* cancer arising from a scar (fibrous tissue) in the lung in healed pulmonary

**filiform** 1. extremely slender అతిసన్నమైన. 2. thread-like and having a sharp and fine edge సూక్ష్మతంతువు, తంతురూప, మరియు వాడియైన మొనగల. **f. papillae**, on the tongue నాలుకమీద సూక్ష్మాంకురాలు.

**fillet** a long bundle of nerve fibres పొడుగాటి నాడీతంతుల కట్ట.

**filling** material inserted into the cavity in a tooth, which is one form of treatment పన్ను తొర్రలోన నింపే పదార్థము; ఇది ఒక చికిత్సమార్గము.

**film** 1. a layer of application of a medicament (balm, *etc.*) on the skin or mucous membrane చర్మము మీదగాని శ్లేష్మపొరమీదగాని లేపనము అనగా ఒక పొరగా పూయుట. 2. **in radiology:** ఎక్స్‌రే విభాగములో: **contrast f.**, film taken after giving/administering a contrast medium (barium, I.V. dye, *etc.*) బేరియమ్ ఇచ్చిగాని, సిరలోకి మందు ఎక్కించిగాని ఫోటోతీయడం. **plain f.**, taking X-ray photo of a part రోగికి సాదా ఎక్స్‌రే ఫోటో తీయుట. **spot f.**, taking X-ray photo at a particular juncture during fluoroscopy, *i.e.* while doing screening స్క్రీనింగ్ చేసేటప్పుడు కావలసిన దృశ్యము ఎక్స్‌రే ఫోటోతీయుట. **X-ray f.**, the raw, protected film before use వాడుకకు ముందు స్టోర్సునుంచి పెట్టెలో ప్యాక్‌చేసి వచ్చిన ఎక్స్‌రే ఫిల్మ్.

**filum** a slender thread like fibre సన్నని దారపు పోగులాంటి తంతువు. **f. terminale,** a thread like fibrous tissue which is a continuation of the spinal cord from the conus medullaris to the back of the coccyx అంత్యతంతువు: వెన్నుపాము అంతమునుండి అనుత్రికము వరకు గల వెన్నుపాము కొనతంతువు.

**fimbriae** of the Fallopian tube, *resemblance:* fronds (leaf like part of a fern) ఫాలోపియన్ నాళము యొక్క అంచులు, *పోలిక:* ఫెర్న్ దళములు.

**finger** a digit of the hand చేతివేలు, అంగుళి, హస్తాంగుళి. **clubbed f's,** *see/చూడండి* clubbing వేళ్ళచివరి భాగము ఉబ్బు – ఇది ఊపిరితిత్తి మరియు గుండె జబ్బులలో ఎక్కువగా చూస్తుంటాము. **first f.**, thick

short and stout first digit, the thumb బొటనవేలు, అంగుష్ఠము. **index f.,** the second digit, the forefinger చూపుడు వేలు. **little f.,** the fifth or last digit కనిష్ఠిక, చిటికెనవేలు. **middle f.,** the third digit మధ్యవేలు. **ring f.,** the fourth digit ఉంగరపు వేలు. **webbed f's,** syndactyly, the fingers being united at the bases వేళ్ళ మొదట్లో చర్మము కలసియుండుట.

**fingerprint** 1. skin (cutaneous) ridges on the palmar aspect of the distal end of a finger, the pattern of which remains unchanged throughout life, unless injury defaces it. Hence this is of paramount importance in the identification of a person. వేలు ముద్ర: పుట్టుకనుండి జీవితాంతము ఒకేమాదిరి (గాయము చెరపకుండా ఉంటే) మార్పుచెందకుండా ఉండే నమూనా. కావున ఈ వేలుముద్రకు వ్యక్తియొక్క గుర్తింపు (identification)లో ప్రాముఖ్యతనిస్తారు. 2. This is of great importance in medical jurisprudence (forensic medicine), crime detection and legal matters. ఈ వేలుముద్ర పరీక్ష న్యాయవైద్య శాస్త్రములోను, నేరస్థుని అన్వేషణలోనూ మరియు న్యాయ చట్ట సంబంధమైన విషయములలోనూ సహాయపడుతుంది; కావున దీనికి ఎంతో ప్రాముఖ్యం ఉన్నది. *N.B.* DNA fingerprinting, latest technique *గమనిక:* DNA సూక్ష్మముద్రల పరిశోధన ఆధునిక పద్ధతి.

**first aid** an emergency temporary aid on the spot (say, an accident) to tide over a fatal outcome, *viz.* as a stop gap aid till the patient reaches a hospital; *figur.* First aid is also the last aid in emergencies like CPR (cardiopulmonary resuscitation). ప్రథమ చికిత్స – ఇది ఒక శాస్త్రము; వ్యక్తిని ఆసుపత్రికి తరలించేవరకు ప్రమాదము లేదా ప్రాణమునకు హాని/ఆపద కల్గించు ఘట్టమునుండి కాపాడుట.

**fission** 1. splitting విచ్ఛిత్తి, విడదీయుట/చీల్చుట. 2. **binary f.,** cell dividing into two ఒక కణము రెండుగా విభజింపబడుట. 3. **nuclear f.,** splitting of the nucleus in the atom, producing/generating energy అణుకేంద్రక విచ్ఛేదనము – దీనివలన అణుశక్తి ఉద్భవించును.

**fissure** 1. cleft పగులు, విదారము: రెండు భాగముల మధ్య చీలిక. *e.g.* **horizontal f.** in the right lung seen on x-ray film ఉదా. కుడి

ఊపిరితిత్తిలో అడ్డముగానున్న చీలిక; ఇది ఎక్స్‌రే ఫోటోలో కనబడుతుంది. 2. **anal f.,** fissure-in-ano గుద విదారం. a painful crack/tear in the wall of the anus; causes agony during defecation మిక్కుటమైన వేదనతో కూడుకొని ఆసనము చుట్టున ఒక ప్రదేశములో చిరుగు; దీనివలన మలవిసర్జన సమయమందు విపరీతమైన వ్యథకు గురి అవుతారు. 3. **central f.,** (central sulcus of cerebrum) one in the cerebral hemisphere కేంద్రీయ విదరము: మస్తిష్కవల్కలముల (gyri) మధ్య గాడి/చీలిక.

**fistula** [fistulas, fistulae *pl.*] (a) a communicating passage between two hollow organs, *e.g.* **gastrocolic f.,** between the stomach and colon నాళవ్రణం: రెండు బోలు అవయవములమధ్య ఏర్పడిన మార్గము, ఉదా: అన్నాశయము, పెద్ద పేగు మధ్య మార్గము ఏర్పడుట. (b) from a space to the exterior, *e.g.* fistula in ano draining pus, blood, fecal matter గుదనాళ వ్రణం: ఆసనము ప్రక్కన ఒక మార్గము ఏర్పడుట; దీనిలోనుంచి చీము, నెత్తురు, మలముతో కూడిన రసి కారుతూ ఉంటుంది.

**fit** 1. convulsion, seizure, *see/చూడండి* convulsions. 2. epileptic fits, *see/చూడండి* epilepsy. 3. fits in cerebrovascular disorders, *e.g.* cerebral thrombosis, brain tumour మస్తిష్క రక్తనాళముల వ్యాధులలో, ఉదా. మెదడు థ్రాంబోసిస్, మెదడులో కంతి. 4. febrile fits in children పిల్లలలో చంటిబిడ్డ గుణము – జ్వరములో వచ్చే ఫిట్స్, చంటిబిడ్డ చేష్ట, కంపము. 5. fits in tetanus, spasms of muscles ధనుర్వాతములో కండరముల యీడుపులు. 6. appropriate, suitable సరియైన, తగిన. 7. accommodate one structure into another ఒక నిర్మాణములోనికి ఇంకొకదానిని అమర్చుట/ఇముడ్చుట.

**fitness** being fit అర్హత, యోగ్యత. physical fitness certificate శరీర స్వస్థత కలదని ధ్రువపత్రం.

**flaccid** weak, soft, yielding to pressure బిగితప్పిన, సత్తువలేని, సామర్థ్యములేని, మెత్తని, పితపితలాడుతున్న. *e.g.* **f. muscle,** hypotonic muscle, flabby muscle గట్టితనము చూపని/లేని కండరము, మెత్తనైన కండరము, పితపితలాడు పేశి. [*in contr.* spastic].

**flagellate** microorganism having flagella, *e.g.* protozoa: *Giardia, Trichomonas, Trypanosoma* కశాభములు కల్గిన, ఉదా. సూక్ష్మజీవి.

**flagellation** 1. to beat or whip కొట్టుట లేదా కొరడాతో కొట్టుట. 2. a bad behaviour: whipping or being whipped to derive erotic pleasure కొరడాతో మరియొకరిని కొట్టుట లేదా దెబ్బలు కొట్టుకొనుట/తినుట – ఇది ఒక కామ/లైంగిక ప్రేరితమైన దుష్ప్రవర్తన. 3. exflagellation కశాభములు తీసివేయుట/తొలగించుట.

**flagellum** [flagella *pl.*] a mobile whip-like appendage on the surface of a microorganism సూక్ష్మజీవి తలముమీద కదలికగల కొరడాలాంటి ఉపాంగము.

**flail** 1. a farm tool: free swinging stick attached to a long handle employed to thresh grain బడితె: ధాన్యమును నూర్చు/నూర్పు సాధనము. 2. exhibiting abnormal movement like the above tool, *e.g.* flail chest wall; flail joint బడితెలాగ అసాధారణ చలనశక్తి గల్గిన ఛాతియొక్క గోడ/కుడ్యము; అతి చలన శక్తిగల కీలు. 3. అలంకార. బడితెలాగా తిరుగుతున్నది అని అడపిల్లను మందలిస్తారు.

**flakes** thin pieces or slices తరకలు తరకలుగా. 1. cream on milk పాలమీద మీగడ. 2. exfoliation of skin layers చర్మం మీది కణములు పొరలు పొరలుగా రాలిపోవటం.

**flank** the region of the side of the abdomen between the ribs and ilium ఛాతీపక్క ఎముకలు మరియు శ్రోణ్యస్థికి మధ్య ప్రాంతము.

**flat foot** absence of the arches (longitudinal and transverse) in the foot, *see*/చూడండి arch. చదును పాదము: పాదములో నిడువులోను, అడ్డములోను ఉండెడు కమానులు/చాపములు లేకుండుట.

**flatulence** excessive production of gases in the stomach or intestine కడుపు ఉబ్బరము: అన్నాశయములోగాని, పేగులలోగాని అధికముగా వాయువులు ఉత్పత్తియగుట.

**flatus** 1. gas or air in the alimentary canal ఆహారనాళములోనున్న వాయువు లేదా గాలి; జీర్ణాశయమందలి మ్రింగిన గాలి లేదా పేగులలో తయారైన వాయువులు. 2. gases expelled through the anus

పిత్తులు, అపానవాయువు. **f. tube**, a tube inserted to expel flatus వాయువును వెళ్ళగొట్టే నాళము.

**flea** small wingless blood-sucking insect that acts as a vector (carrier of disease) గోమారు, తుళ్ళుపురుగు, మిణ్ణల్లి. ఇవి రోగవాహకాలు (vectors) అనగా జబ్బును తమద్వారా వ్యాపింపజేసేవి. చిన్న, రెక్కలులేని, రక్తము పీల్చే పురుగులు.

**flex** 1. to bend వంగు, వంచు. 2. being bent వంపబడు, వంచబడు *e.g.* a joint ఉదా. కీలు [*opp.* extend వ్యతి. చాపు].

**flexion** 1. the act of bending వంగుట, వంచుట. 2. the act of being bent వంచబడుట, వంపబడుట *e.g.* a joint ఉదా. కీలు [*opp.* extension వ్యతి. చాపుట].

**flexor** a muscle that bends or flexes a joint ముడిచే: కీలును ముడుచుకునేటట్లు చేసే కండరము [*opp.* extensor వ్యతి. చాపే కండరము.].

**flexure** bend, fold, curvature వంపు, ముడుపు, మడత, వంకర. **hepatic f.** of the colon పెద్దపేగుయందలి కాలేయము దగ్గర ఉన్న వంపు. **splenic f.** of the colon పెద్దపేగుయందలి ప్లీహము దగ్గర ఉన్న వంపు.

**floaters** 'spots before the eyes' due to degeneration of the vitreous humor in the eyeball 'కండ్లముందు మచ్చలు' – కన్నులోని తర్పకము క్షీణించుటవలన కలిగిన పరిణామము.

**flooding** profuse bleeding from uterus గర్భసంచినుండి అత్యధిక రక్తస్రావం, అలంకార. గర్భాశయంలో రక్తవరద, ఋతువర్షం.

**floor** the inferior surface in a space/of an organ, *e.g.* floor of the fourth ventricle in the cerebrum కుహరములోని క్రిందతలము; అవయవముయొక్క క్రిందభాగము, ఉదా. మస్తిష్కములోని నాల్గవ కోష్ఠకముయొక్క క్రిందితలము.

**flora** 1. microorganisms (chiefly bacteria and fungi) found in an organ, *e.g.* **intestinal f.** ముఖ్యముగా బాక్టీరియా మరియు శిలీంధ్రాలు, అవయవములోనుండు సూక్ష్మజీవులు, ఉదా. పేగులలోనుండు సూక్ష్మజీవులు. 2. *bot.* plants మొక్కలు, వనస్పతి సమూహము.

**flow** to move along like water. **menstrual f.** ఋతుప్రవాహం, బహిష్టుమైల.

**fl oz** fluid ounce ఔన్సు ద్రవము.

**flu** *colloq.* term for influenza ఫ్లూ: ఇన్‌ఫ్లూయన్‌జాకు వాడు.భా.

**fluctuation** the act of eliciting the impact of pus inside an abscess by the tips of the two index fingers of both hands kept pressed over the abscess in two directions, *viz.* horizontal and vertical స్పర్శాతరంగ పరిశీలన: చీముగడ్డలోని చీముయొక్క అభిఘాతము రెండు చూపుడువేళ్ళ ద్వారా అడ్డముగాను నిలువుగాను ఒత్తి పరీక్షించుట.

**flukes** trematodes; parasitic flatworms ఆకువలె, పరచినట్లున్న పరాన్నజీవులు. 1.*Schistosoma mansoni*, blood fluke రక్తనాళములలో నుండు పురుగులు. 2. *Paragonimus westermani*, the lung fluke ఊపిరితిత్తులలో ఉండే పురుగులు. 3. *Fasciola hepatica*, the liver fluke కాలేయము/లివర్‌లో ఉండే పురుగులు. 4. Chinese fluke *(Clonorchis sinensis)* adult lives in bile ducts పైత్యరస నాళములో నివసించే పురుగులు.

**fluoridation** the addition of fluorides to prevent dental caries పళ్ళు పుచ్చిపోకుండా ఫ్లోరైడ్స్ కలుపుట. 1. in drinking water త్రాగే నీళ్ళలోను. 2. in tooth pastes టూత్‌పేస్ట్లోను.

**fluoroscopy** screening స్క్రీనింగ్, ప్రతిదీప్తి దర్శనము. examination of structures of the body by means of X-rays passed through the body, projected on a fluorescent screen. The mobility of structures is appreciated in this procedure, *e.g.* movement of the diaphragm. ప్రతిదీప్తిగల ప్రత్యేక అద్దముమీద శరీరభాగములలో నుంచి దూరిన ఎక్స్‌రే కిరణముల సహాయముతో శరీరభాగములు పరీక్షించుట; శరీరములోని కొన్ని నిర్మాణముల/భాగముల చలనము చూచుటకు చక్కని దృశ్యమునిస్తుంది, ఉదా. విభాజక పటలముయొక్క చలనశక్తి గమనించుటకు అనువైన/సులువైన సాధనము.

**fluorosis** disease due to excess of fluorides in the system, affecting chiefly the bones and teeth శరీరములో ఫ్లోరైడ్స్ అధిక శాతములో వున్నందువలన ఎముకలకు మరియు పండ్లకు సంక్రమించు

వ్యాధి. 1. **dental f.**, appearance of mottled enamel in the tooth పన్నులోని పింగాణి భాగములో నానావిధములైన రంగుల మచ్చలు పన్ను తలముమీద కనుపించుట. 2. **endemic f.**, chronic f., as a result of ingestion of water containing excessive fluorine/fluorides, for prolonged periods స్థానిక, ముదిరిపోయిన వ్యాధి: అత్యధిక శాతంలో ఫ్లోరిన్/ఫ్లోరైడ్స్ ఉన్న నీళ్ళు దీర్ఘకాలము పాటు తాగినప్పుడు సంక్రమించే వ్యాధి. 3. **skeletal f.**, chalky white bones on X-ray film సుద్దవలె తెలుపు వర్ణముగల ఎముకలు ఎక్స్‌రే పటములో అగపడుతవి. In many cases, we see a combination of 1 & 3, *vide supra.* పైనవ్రాసిన పన్ను మరియు ఎముకవ్యాధి – ఈ రెండు జబ్బులు కలసి ఉండటం పెక్కుమందిలో చూస్తాము.

**flush** 1. to blush ఎర్రబారు, ఎర్రబారించు Fever flushes the cheeks. జ్వరములో బుగ్గలు ఎర్రపడుతాయి. 2. *figur.* A girl's face flushes at the sight of a boy. అలంకార. గుంట ముఖము గుంటడిని చూడగానే సిగ్గుతో ఎర్రబారుతుంది. 3. animate మనస్సును పొంగించు/ఉప్పొంగించు. 4. to force water, *e.g.* flush the toilet after use, *viz.* clean with a jet of water నీరు జోరుగా పోయుట, ఉదా. మలము పింగాణి టాయిలెట్‌నుండి జారిపోవునట్లు చేయుట.

**flutter** rapid pulsation త్వరితగతిలో కొట్టుకొనుట. **atrial f.**, regular rapid atrial contractions ఏట్రియమ్‌ల త్వరితగతి సంకోచములు. **diaphragmatic f.** విభాజక పటలపు సంకోచములు. **mediastinal f.** గుండెచుట్టూ ప్రాంతముయొక్క సంచలనము. **ventricular f.** గుండె జఠరికల యొక్క వేగమైన సంకోచములు.

**flux** any excessive flow of any of the body excretions అధిక విసర్జనములు. **alvine f.**, simple diarrhoea నీళ్ళ విరేచనాలు. **bloody f.**, dysentery చీము రక్తం విరేచనాలు. **monthly f.**, menses బహిష్టు, రుతువు.

**fly** housefly, domestic fly ఈగ, మక్షిక, మక్షికము. an insect, a danger/threat to the health of mankind; carries/spreads disease producing germs from one place to another place/person మనిషి ఆరోగ్యమునకు ప్రమాదము తెచ్చిపెట్టు కీటకము; ఒక ప్రదేశమునుండి

మరియొక ప్రదేశము/మనిషి వద్దకు ఎగిరి వ్యాధి బీజములు నాటి, విషక్రిములను వ్యాపింపజేస్తుంది.

**focal seizures** fits due to affection of centres in the brain మెదడులోని కేంద్ర సం. జబ్బుల వలన మూర్ఛలు.

**focus** [focal *adj.*] the centre of a morbid process వ్యాధిగ్రస్త ప్రాంతముయొక్క కేంద్రము. **epileptogenic f.**, area responsible for epileptic seizures అపస్మారము/మూర్ఛలయొక్క వ్యాధికారక ప్రాంతము. **f. of infection,** nidus of infection వ్యాధి క్రిమి సంక్రమణంయొక్క ఉనికిపట్టు. **primary f.** in primary complex in tuberculosis క్షయవ్యాధిలో ఆరంభ/ప్రాథమిక దశ.

**foetal** *see/చూడండి* fetal.

**foeticide** *see/చూడండి* feticide.

**foetid** *see/చూడండి* fetid.

**foetor** *see/చూడండి* fetor.

**foetoscope** *see/చూడండి* fetoscope.

**foetus** *see/చూడండి* fetus.

**folic acid** a member of the vitamin B complex group, the deficiency of which causes megaloblastic anaemia బి కాంప్లెక్సుకు చెందిన ఒక విటమిన్. దీని కొరత వలన రక్తలేమి (anaemia) సంభవిస్తుంది; ఈ రక్తలేమిని పాండురోగము, రక్త క్షయరోగము అనికూడా వ్యవహరిస్తుంటారు/అంటారు.

**follicle** a sac or pouch like invagination తిత్తి/జోలెవలె లోనికి చొరచుకొని పోవునది. *naked eye str.* ప్రత్యక్షచూ. 1. **ripening or maturing f., Graafian f., vesicular ovarian f.,** less than 6 mm in diameter అపక్వపుటిక నడిమి కొలత 6 మి.మి. కంటె తక్కువగా ఉంటుంది. 2. **mature ovarian f.,** its antrum (cavity in the follicle) 6 to 12 mm in diameter పక్వమైన పుటిక. దీని నడిమి కొలత 6 నుండి 12 మి.మి. *micro str.,* సూక్ష్మ.చూ. (a) a pouch or sac పుటిక, ఫాలికిల్. **lymph f.,** collection of cells underneath the outer border (cortex) of the lymph node లింఫ్ గ్రంథి అంచుక్రింద కణసమూహము. (b) microscopic pores సూక్ష్మరంధ్రములు: **hair f.,**

small invagination of the epidermis from which hairs originate రోమకూపము: బాహ్యచర్మము సూక్ష్మముగా లోనికి చొరచుకొనిపోయి అందులోనుంచి రోమములు ఉద్భవించుట. **sebaceous f.,** hair follicle on a base of sebaceous gland చర్మ తైలగ్రంథి మూలము చేసుకొని ఉద్భవించు రోమపుటిక. 3. follicle stimulating hormone, *abbr.* FSH పుటికోద్దీపన హార్మోన్.

**folliculitis** inflammation of a follicle పుటికయొక్క శోథము/'వాపు ఎరుపు మంట వాపు'. **f. barbae**, sycosis barbae, infection generated from the hair-removing/shaving instruments, especially from a razor మంగలి గొరుగు కత్తివలన కలుషిత స్థితిలో ఫాలికిల్‌కు కలుగు సూక్ష్మజీవి సంసర్గ/సంపర్క దోషము.

**follow-up** to keep track of గమనించడం. **f. of a patient** రోగి యొక్క తదుపరి తనిఖీ.

**fomentation** 1. bearable-hot moist application (say, by a cloth) కాపడము: భరించే అంత వేడిగల నీళ్ళలో గుడ్డ ముంచి శరీరములోని ప్రాంతముమీద కాపుట/కాపడము పెట్టుట. 2. short wave diathermy, a glorified/refined method of fomentation కరెంటు సాధనముతో కాపడముపెట్టుట నాజూకైన పద్ధతి.

**fomites** articles used by a patient which transmit infection, such as handkerchief, towel, book, newspaper, telephone receiver, soapcase, vessel and the like used by a person with a disease, *e.g.* conjunctivitis రోగి వాడే వస్తువులు, ఉదా. కండ్లకలక ఉన్న వ్యక్తి వాడిన దస్తి, జేబుగుడ్డ, చేతిరుమాలు, తువ్వాలు, పుస్తకము, వార్తాపత్రిక, టెలిఫోన్ పరికరము, సబ్బుపెట్టె, పాత్ర వగైరా. ఇవి సూక్ష్మజీవి సంపర్కమును వ్యాపింపజేస్తాయి.

**fontanelle** fontanel, the membrane-covered soft spot on a baby's head at the junction of skull bones which later gets ossified శిశువు కపాలముమీద కపాలపు ఎముకల కలయిక ప్రాంతమున పొరతో కప్పబడిన మెత్తటి (ముట్టుకుంటే మైనపు ముద్దలాగా తగిలే) చోటు; క్రమేణ ఇది ఎముకలోనికి కలసిపోయి గట్టిపడుతుంది, వాడు.భా. మాడు.

**food** the entity which nourishes – source of energy for the body. A man is what he eats. వ్యక్తికి పోషక/సత్త్వము – శక్తికి మూలము. వాస్తవానికి తిండే మనిషికి మనుగడ. అన్నం పెట్టినవాళ్ళకి కృతజ్ఞత 'అన్నదాత సుఖీభవ!' **f. allergy,** sensitization of the body to particular food, reacting unfavourably, *see/చూడండి* allergy. శరీర కణజాలములు ఒక రీతి తిండికి శీఘ్ర గ్రాహకము (sensitization) చేయబడి, ఆ తిండి తిన్న తర్వాత ఆ పదార్థమునకు విద్వేషణతో ప్రవర్తిస్తాయి. **f. faddism,** considering eating as a hobby/freak తిండి చాపల్యము. **overeating of f.,** leads to obesity మితిమీరి తిన్నందువల్ల కొవ్వు శరీరం అవుతుంది. **f. poisoning,** *see/చూడండి* botulism. Eating food contaminated with toxins gives rise to food poisoning. కలుషిత, విషపూరిత ఆహారము తీసుకున్నందువలన కలుగు హాని. **f. stuff** భోజ్యపదార్థము, తినుబండారము.

**foot** the distal horizontal portion of the leg, which is the base on which a human being stands పాదము: కాలియొక్క చివరి అడ్డతలము; దీనిమీద జీవి నిలబడును. **athlete's f.,** tinea pedis, fungus infection ఫంగస్ జబ్బు. **club f.** స్థూలపాదము. **diabetic f.,** a diabetic prone to infection, gangrene, *etc.* of the foot మధుమేహం వ్యాధిగ్రస్తుడు తన పాదాలను భద్రపరచుకోవాలి, లేకపోతే వ్రణములు, కుళ్ళు మొ. సంభవించవచ్చు. **drop f.,** foot drop పాదపక్షవాతం. **flat f.** సాగిలబడిన పాదము. **trench f.** నాని, పాచిన పాదము.

**foot drop** sag of the foot due to paralysis of leg muscles కాలు కండరముల పక్షవాతము వలన కలుగు వాలుపాదము/వంగిన పాదము; వాడు.భా. పాదం పడిపోయింది.

**footprint** 1. impression of the foot పాదముద్ర, చిహ్నము, గుర్తు. 2. footprints of the great మహానుభావుల అడుగుజాడలలో.

**foramen** [foramina *pl.*] any natural opening in a bone or elsewhere రంధ్రము: ఎముకలోగాని మరి ఎక్కడైనా సహజముగానున్న సందు/రంధ్రము. 1. **intervertebral f.,** in between vertebrae for the exit of the spinal nerve వెన్నెముక ఎముకల మధ్యనున్న రంధ్రము; ఇందులోనుండి కశేరునాడి బయటపడుతుంది. 2. **f. magnum,** the opening in the occipital bone through which the spinal cord

comes out మహారంధ్రము: వెన్నుపాము బయలువెడలే అనుకపాలపు ఎముకలోని రంధ్రము. 3. **f. ovale,** interatrial opening in the heart గుండెలోని రెండు ఏట్రియమ్‌ల మధ్యరంధ్రము.

**forceps** two-pronged instrument for catching any structure పటకారు: ఏ వస్తువునైనా పట్టుకొనేది కావున పటకారు అనిపేరు; స్రావణము. **artery f.** ధమనిని పట్టుకొనేది. **dental f.** పన్నుపట్టుకుని పీకేది.

**forearm** the portion of the superior/upper extremity between the elbow and the wrist ముంజేయి; మోచేయి: చేతిముడుకునుండి చేతిమణికట్టువరకు గల భాగము.

**forefinger** the second digit, index finger చూపుడువేలు.

**forehead** the portion of the face above the eyebrows and beneath the hairy margin నొసలు, నుదురు, లలాటము, ఫాలభాగము.

**forensic** relating to legal matters, *e.g.* forensic medicine, medical jurisprudence వైద్య-న్యాయచట్టమునకు సం.; న్యాయవైద్యశాస్త్రము.

**foreskin** the prepuce: skin over the glans penis శిశ్నాగ్రచర్మము, ముందోలు: శిశ్నాగ్రము/పురుషాంగము చివరి ఉబ్బును కప్పియుండు చర్మము; మేఢ్రమణిపైని చర్మము.

**forewaters** the portion of the amniotic sac which heralds the arrival of the fetus in front of the presenting part in the birth canal యోనికుల్యలో ఉమ్మనీరుతిత్తిలోని కొంతద్రవము శిశువు బయట పడేటప్పుడు కారుట. The amniotic sac with fluid serves as a shock-absorber for the baby. ఈ ఉమ్మనీరును శిశువుకు అదరు తగ్గించే నిమిత్తమై/అణచే నిమిత్తమై సృష్టికర్త సృష్టించాడు.

**formaldehyde** a pungent gas, used as an antiseptic and disinfectant తీక్షణమైన వాయువు అనగా నాలుకకు, ముక్కుకు రేపుడు కల్గించేది; పూతిరోధి మరియు రోగక్రిమి నాశనిగా వాడ్తారు.

**formication** a sensation of small insects crawling over the body which is a side effect of drug చిన్న పురుగులు శరీరంమీద పాకుతున్నట్లు తోచుట – ఇది ఔషధము/మందు యొక్క ప్రభావము అయి ఉండవచ్చును.

**formula** a prescription ఔషధపత్రం, మందు చీటి, ఔషధ వివరాలు. **chemical f.** structure of a molecule అణువుయొక్క నిర్మాణము.

**formulary** a collection book of formulas ఫార్ములాల పుస్తకం.

**fornication** 1. voluntary sexual intercourse outside marriage వ్యభిచారం. 2. sexual immorality లైంగిక అవినీతి.

**fornix** [fornices *pl.*] an arch shaped curve విల్లు ఆకారములోనున్న వంపు. 1. **f. of cerebrum** మస్తిష్కపు వంపు. 2. **f. of vagina,** also called vault of vagina యోనికుడ్యము మరియు గర్భకోశద్వారము మధ్యనున్న వంపు.

**fossa** pit, depressed area గుంట, నొక్కు/క్రుంగిన స్థలము, ఖాతము. 1. **f. ovalis cordis,** in the right atrium of the heart గుండె కుడి ఎట్రియమ్‌లో అండాకార ఖాతము. 2. **lacrimal f.,** space for the lacrimal gland బాష్పగ్రంథికి చోటు. **mandibular f.,** space for the condyles of the lower jaw హనువు/దవుడ యొక్క కణుపులకు చోటు. **navicular f.,** (a) space between the vaginal orifice and the frenulum of the labia యోని మరియు క్రింద పెదిమల కలయిక పొర మధ్యనున్న చోటు. (b) the lateral expansion of the portion of urethra inside the glans penis శిశ్నాగ్రము లోపలనున్న మూత్ర మార్గము యొక్క రెండువైపుల విస్తరించిన చోటు. **zygomatic f.,** infratemporal fossa కణత క్రింద చోటు.

**fourchette** frenulum of the pudendal labia ఉపస్థ/యోనిక్రింద అంచునగల పెదిమల కలయికతోకూడిన పొర.

**fovea** a cup shaped depression or pit కప్పవలె ఉన్న లోతు లేదా గుంట. **f. centralis,** 0.44 mm, *i.e.* 440$\mu$ in size; most sensitive part, a depression in macula lutea (yellow spot) in the retina కేంద్రిక ఖాతము, నేత్రపటలములో అతి సున్నితమైన మచ్చ.

**foxglove** *bot.* a plant whose leaves are a source of digitalis, *see/చూడండి* digitalis.

**fracture** break in a bone అస్థిభంగము: ఎముక విరుగుట. **Colles' f.,** fracture of the lower end of the radius, the lateral bone in the forearm మోచేయి క్రింది భాగమున (చేతి మణికట్టుపైన) వెలుపలి

ఎముక (రత్ని) యొక్క విరుగు. **comminuted f.**, bone ends are crushed విరిగిన ఎముకల కొనలు చితుకగొట్టబడుట. **compound f.**, The broken ends burrow the muscles and skin and appear outside; the fracture site invariably gets infected. మిశ్రమ విరుగు; విరిగిన అంచులు కండరములను కోసుకొని చర్మములో కన్నమువేసి బయటకు అగపడుతవి; ఈ స్థితిలో ఎముక విరిగిన స్థలములో సూక్ష్మజీవి సంపర్కము (infection) తప్పదు. **depressed f.**, of skull, a fragment of skull bone depressed and pressing upon the brain కపాలము ఎముక తునక క్రిందకు జరిగి, మెదడు మీద ఒత్తిడి కలిగించుట. **green stick f.**, crack on one side and bent on the opposite side పచ్చిబెండువలె ఒకవైపు చీటువాసి, రెండవవైపు వంగిన ఆకారము. **impacted f.**, one fragment firmly driven into the other ఒక విరిగిన కొన మరియొక విరిగిన అంచులోనికి దూరి గట్టిగా బిగిసికొనుట. **Pott's f.**, at ankle చీలమండ దగ్గర విరుగు. **simple f.**, The broken ends are inside. అక్లిష్ట/తేలికగా నయమయే విరుగు; విరిగిన అంచులు లోపలనే ఉండుట. **wedge-compression f.**, the vertebra getting compressed at the anterior border, leaving a wedge-shaped deformity వెన్నెముక ముందు అంచు ఒత్తిడివలన క్రుంగి, ఉలికొన రూపముగల మొద్దువలె వికారము చెందుట/కురూపము దాల్చుట.

**fragility** a state of being fragile/brittle పెళుసైన/సులభముగా విరిగెడు స్థితి. **capillary f.**, brittle capillary walls liable for easy rupture కేశనాళికల గోడలు పగిలి తేలికగా చిరుగుట. **erythrocyte f.**, haemolysis of red blood cells in saline సెలైన్‌లో వేసినప్పుడు ఎర్రరక్తకణములు విచ్ఛిన్నమగుట.

**framboesia** or **frambesia** [from French *framboise* raspberry]. the yaws, *see/చూడండి* yaws. a disease with raspberry-like excrescences on the skin చర్మముమీద కోరిందకాయ వంటి కణితిలుగల వ్యాధి.

**freckle** a small benign yellowish-brown macule on the skin. The lesions increase in number on exposure to the sun చర్మంమీద నిరపాయమైన పసుపుపచ్చ - నీరుకావి వర్ణంగల మచ్చలు. సూర్యరశ్మి సోకితే ఈ క్షతములు (lesions) ఎక్కువ అవుతాయి.

**Frei test** an intracutaneous/intradermal test for lympho-granuloma venereum (LGV) ఎల్.జి.వి. జబ్బు నిర్ధారణ కొరకు టెస్ట్, చర్మ పరీక్ష

**fremitus** vibration కంపనము. 1. **vocal f.** vibration of the sound felt with the palm on the chest wall when the patient speaks, *e.g.*, when he utters one, two, three రోగి మాట్లాడుతున్నప్పుడు ఛాతీమీద చేయి ఉంచితే స్పర్శద్వారా తగిలే కంపనము, ఉదా. రోగి 'ఒకటి, రెండు, మూడు' అని ఉచ్ఛరిస్తుంటే. 2. **rhonchial f.** feeling rhonchi by the hand on the chest, *e.g.* cat-mewing sounds in asthma ఉబ్బసంలో పిల్లికూతలు చేతికి స్పర్శద్వారా తెలుసుకొనబడటం నిత్యానుభవం డాక్టర్లకు.

**frenulum** a small frenum, a fold underneath a part which restrains/limits the mobility of the part ఒక భాగముయొక్క చలనము అరికట్టు/హద్దులోబెట్టు మడత – ఇది ఆ భాగము దిగువన గుడారపు త్రాడువలె అమర్చబడి ఉంటుంది. **f. of clitoris,** band underneath the clitoris in females స్త్రీలలో గుహ్యాంగాంకురము క్రింద మడత. **f. of prepuce of penis,** fold under the glans penis restricting the movement of the prepuce పురుషాంగముయొక్క మేఢ్రమణి క్రింద ఉన్న మడత/గుడారపు త్రాడు. ఇది ఆ ఉబ్బుపై నున్న చర్మముయొక్క సాగేగుణమును అదుపులో పెడ్తుంది. **f. of tongue,** the vertical tent-rope underneath the tongue నాలుక క్రింద నిలువుపాటి శ్లేష్మపొర మడత.

**frenum** or **fraenum** [Latin meaning a bridle, curb] కళ్ళెము. *see/చూడండి* frenulum. a narrow fold of mucous membrane passing from the gum to the deep/inner surface of the lip at its centre. *self-observation:* one can feel it with the tip of one's tongue చిగురునుండి పెదిమలోపలి మధ్యభాగమునకు తగిలే సన్నని శ్లేష్మపొర. స్వానుభవం: నాలుక అంచుతో దీనిని స్పర్శించవచ్చును/తాకవచ్చును.

**friable** liable to be easily crumbled, *e.g.* tissue, పొడిపొడిగా, రాలునట్టి/చేయబడే స్వభావముగల, ఉదా. అట్టి కణజాలము.

**friction** the act of rubbing of one part against another రెండు భాగముల ఘర్షణ/రాపిడి **f. rub,** two parts rubbing against each

other రెండు భాగములు ఒకదానిని మరియొకటి రాచు/రుద్దుకొనుట. 1. **pleural f.,** rub due to friction between the parietal and visceral pleural layer, which elicits unbearable pain on deep inspiration ఊపిరితిత్తి పైనఉన్న పొరలమధ్య రాపిడి; దీనివలన ఊపిరిపీలిస్తే భరింపరాని వేదన కలుగుతుంది. 2. **pericardial f.,** rub over pericardium, same mechanism as in 1 above గుండెమీద పొరలపైని రాపిడి.

**frigidity** 1. coldness అతిశీతలము, చలి. 2. aversion to sexual desire in the woman స్త్రీలో రతి రేకెత్తక పోవుట/రేకెత్తబడకపోవుట, లైంగికేచ్ఛ లేకుండుట; రతికేళిలో అయిష్టము/ఉదాసీనత చూపించుట మరియు స్తబ్ధత వెలిబుచ్చుట.

**frontal** 1. relating to the forehead, *e.g. colloq.* f. headache; correct word is **f. ache** నుదురు నొప్పి, నొసలుయొక్క వేదన. **f. bone** లలాటాస్థి. 2. **f. plane** of the body శరీరముయొక్క ముందు సమతలము.

**frost** a deposit resembling dew in a refrigerator తుషార తరకలు; ఫ్రిజ్‌లో పేరుకొన్న, మంచువలెనుండు, అందులో జమగూడిన పదార్థము. **urea f.,** deposits of urea on the skin చర్మముమీద జమగూడిన మూత్రికతరకలు.

**frostbite** freezing of tissues as a result of exposure to severe/biting cold హిమాఘాతము, మంచుతాకిడి; విపరీతమైన శీతలమునకు కణజాలములు గురియగుట, కణజాలములు మంచువలె ఘనీభవించుట/గడ్డకట్టుట. Trekking in the Himalayas may produce this condition. హిమాలయ పర్వతారోహణలో ఈ పరిస్థితి తటస్థపడవచ్చును/ఏర్పడవచ్చును.

**fructose** a sugar present in semen, honey and sweet fruits ఫలశర్కర/ఫలచక్కెర: శుక్రరసము, తేనెలోను మరియు తీపిపండ్లలోనున్న చక్కెర.

**fructosuria** the presence of fructose in the urine; differential diagnosis of glucosuria మూత్రములో ఫ్రక్టోస్ ఉండుట. *గమనిక:* మధుమేహము (diabetes mellitus) వేరేజబ్బు – అందులో మూత్రములో గ్లూకోస్ ఉంటుంది.

**fulguration** destruction of tissue with the help of feeble electric current కణజాలమును తక్కువ శక్తిగల విద్యుత్ పరికరముతో కాల్చివేయుట, *see/చూడండి* also cauterization.

**full-blown** fully developed. **f. AIDS** వ్యాధిలక్షణాలు పూర్తిగా కనిపిస్తున్న ఎయిడ్స్, పక్వానికి వచ్చిన జబ్బు.

**full term** a pregnant woman who has completed full period (37 to 40 weeks) of gestation నిండు చూలాలు: 37 నుండి 40 వారములపాటు గర్భము ధరించి పురుడుకు సిద్ధముగానున్న గర్భవతి.

**fulminate** to take an explosive/fatal turn in the evolution of a disease వ్యాధిలో ప్రాణాంతకమైన పరిణామము *e.g.* **fulminant hepatitis** in the course of viral hepatitis ఉదా. కామెర్లతో కూడిన వైరల్ కాలేయము జబ్బులో ప్రాణహానికరమైన పరిణామము సంక్రమించుట.

**fumigation** the process of disinfecting by fumes ధూపనము, సూక్ష్మక్రిమిఘ్నియగు పొగ పొరించుట/ధూపము వేయుట.

**functional** 1. relating to a function, say of an organ ఒక అవయవముయొక్క విధికి సం. 2. affecting a function of some organ without apparent structural or organic changes (a functional disease) అవయవ (సహజ) వ్యాపార భేద జనితవ్యాధి; ఇంద్రియ వ్యాపార లోపమువలన కలుగువ్యాధి; అంతేకాని అవయవముయొక్క కనబడుచున్న నిర్మాణరీత్యా దోషపరిణామము కాదు. *e.g.* Intestinal colic is pain resulting from indigestion; as soon as the digestive upset sets right, the pain disappears – there is no structural or organic change in the intestine. ఉదా. పరిణామ శూల పేగులలో అజీర్తివలన సంభవిస్తుంది; జీర్ణశక్తి సరిదిద్దబడగానే నొప్పి మాయమవుతుంది – పేగులలో నిర్మాణరీత్యా దోషపరిణామము లేదు. [*in contr.* organic].

**functional heart disease** fault in the function of the heart, but not due to any structural abnormality, *e.g.* neurocirculatory asthenia characterized by fatigue, dizziness, palpitation, rapid heart action గుండె విధి నిర్వర్తించడంలో పొరపాటు, అంతేకాని నిర్మాణ

వైపరీత్యము వలన గాదు, ఉదా. మానసిక తెవ్వులు నేపథ్యంలో అలసట, తల/కండ్లు తిరుగుట, గుండెదడ/వేగము [*in contr.* organic heart disease].

**fundament** base, foundation ఆధారము, పునాది/బునాది. 1. breech or rump ముడ్డి లేదా పిర్రలు/పిరుదులు, నితంబము. 2. the anus and surrounding area గుదము: ఆసనము మరియు దానిచుట్టూరా ఉన్న ప్రాంతము.

**fundus** base of/in an organ మూలము: అవయవములోని కీలకస్థానము. **f. of eye,** fundus oculi, eye ground, the interior back portion of the eyeball visible through an ophthalmoscope నేత్రాంతర్దర్శిని ద్వారా పరీక్షించే కన్నుగుడ్డులోని/లోపలి వెనుక ప్రాంతము. **f. of stomach,** the region underneath its upper curve అన్నాశయము యొక్క పై వంపు క్రింద ప్రాంతము. **f. of uterus,** fundus uteri, the region below the upper curve of the uterus and above the joining of uterine (Fallopian) tubes గర్భాశయములో దానిపైవంపు క్రింద మరియు ఫాలోపియన్ నాళములపైనగల ప్రాంతము.

**funduscope** ophthalmoscope to examine the fundus in the eye నేత్రాంతర్దర్శిని, కన్నుగుడ్డులోపలి భాగమును పరిశీలించు పనిముట్టు. *figur.* a delightful variegated view through the beam of light అలంకార. కాంతిపుంజముతో చూచే వివిధ వర్ణముల/రంగుల రమణీయ దృశ్యం.

**fungal** relating to/caused by a fungus ఫంగస్‌కు సం., ఫంగస్ కారణమైన.

**fungi** *pl.* of fungus. శిలీంధ్రాలు. velvety greyish patches on a rotting orange or stale bread, *see/చూడండి* yeast. కుళ్ళిన పండుమీదగాని, పాసిపోయిన రొట్టెమీదగాని సన్నని బూడిదవర్ణపు బూజు (mould, mold) – they are classified as mushrooms, yeasts, molds *etc.* వీటిలో వర్గములు: కుక్కగొడుగులు, సారాయి యొక్క పొంగు, బూజు వగైరా.

**fungicide** an agent that kills fungi ఫంగస్‌ను హతమార్చు వస్తువు, శిలీంధ్ర సంహారిణి, శిలీంధ్రనాశిని.

**fungiform** 1. resembling a mushroom కుక్క గొడుగును పోలిన. 2. **f. papillae** on the tongue, mould-like papillae నాలుకమీద బూజుతంతుల గుచ్ఛమువలె నుండే సూక్ష్మాంకురాలు.

**fungus** 1. *Aspergillus,* may produce a fungus ball, which is freely movable inside a cavity in the lung ఊపిరితిత్తిలోని శూన్యప్రదేశము (cavity) లోపల బంతివలె దొర్లు ఫంగస్‌ముద్ద. 2. candidiasis (moniliasis) అను జబ్బు. 3. **ray f.,** *Actinomyces*. 4. **dimorphic f.** ద్విరూప ఫంగస్. 5. **mycelial f.,** any fungus that forms mycelia బూజుగా మారే ఫంగస్. 6. ringworm తామర (చర్మవ్యాధి).

**funiculitis** 1. inflammation of the spermatic cord శుక్రవాహిక యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'. 2. inflammation of a portion of a spinal nerve root కశేరునాడిమొదలులో కొంతమేర యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**funiculoepididymitis** inflammation of the spermatic cord and epididymis శుక్రవాహిక మరియు ఎపిడిడైమిస్ యొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**funiculus** a cordlike sturcture త్రాడు, పగ్గము, దారము వలెనుండు నిర్మాణము. A. **anterior f. of spinal cord,** white substance (bundle of nerve tracts) in the anterior aspect వెన్నుపాములో ముందరివైపున ఉన్న నాడులకట్ట. **lateral f. of spinal cord,** white substance (bundle of nerve tracts) in the lateral aspect వెన్నుపాములో పక్కవైపున ఉన్న నాడులకట్ట. **posterior f. of spinal cord,** white substance (bundle of nerve tracts) in the posterior aspect వెన్నుపాములో వెనుకవైపున ఉన్న నాడులకట్ట. B. **f. spermaticus,** the spermatic cord శుక్రవాహిక.

**fur-fur** scurf, dandruff చుండ్రు (వ్యాధి).

**furor** fury, rage ఉగ్రము, ప్రకోపము. **f. epilepticus,** a bout of rage in epilepsy మూర్ఛలవ్యాధిలో మూర్ఛవచ్చినప్పుడు ప్రకోపతెర.

**furrow** groove, trench గీత, గాడి. **digital f.,** crease, groove across a joint in the finger seen on the palmar aspect వేలు కణుపు.

**gluteal f.,** natal cleft, the trench between the buttocks రెండు పిరుదుల మధ్యగాడి.

**furuncle** a boil సెగగడ్డ. staphylococcal infection through hair follicles in the skin రోమముల కుదుళ్ళగుండా చర్మమునకు దాపురించు సూక్ష్మజీవి సంపర్కము.

**furunculosis** occurrence of crops of furuncles తెరలుతెరలుగా/ ఉండిఉండి బాధపెట్టు సెగగడ్డలు. ఎండాకాలంలో నిత్యానుభవం.

**fusion** united (structure) ఒకటిగా కలిసిపోయిన. 1. f. of vertebra వెన్నుపూసలు రెండు అతికిఉండుట. (a) congenital పుట్టుకనుండి ఉన్నది (b) acquired తరువాత సంభవించినది. 2. bony ankylosis, joining the ends of two bones surgically శస్త్రచికిత్స చేసి రెండు ఎముకల కొనలు కలుపుట. 3. f. in myositis ossificans, *e.g.* stiff elbow, complication of fracture of elbow ఉదా. ముడుకుదగ్గర ఎముకలు విరిగిన తదుపరి మోచుగట్టి కండరములలో ఎముక కణజాలములు చేరుట. 4. melting కరగించుట, కరగుట.

# G g

**g** *abbr.* for gram గ్రామ్‌కు సంకేతము.

**Gaffky scale** a numerical rating of tubercle bacilli in the sputum according to the number of stained bacilli seen under the microscope, per one field. సూక్ష్మదర్శినిలో రంజిత క్షయవ్యాధి క్రిములను లెక్కపెట్టే పరీక్ష

**gag** 1. a device to keep the mouth open నోరు తెరచియుంచుటకు ఒక సాధనము. 2. to retch డోకు.

**gait** the manner of walking నడచే రీతి, విధము. **ataxic g.,** unsteady walking నిలకడలేని నడక. **beauty g.,** gait adopted by girls in beauty contest. Beauty flows in curves, an explosion of feminine grace. అందం ఒలుకబోసుకుంటూ అందాల పందెంలో అడుగులు వేయుట, ప్రేక్షకులు శరీరసౌష్ఠవమును తిలకించుట; అలంకార. శరీరవంపులు అందానికి అలలు. **cerebellar g.,** reeling, staggering అనుమస్తిష్కము జబ్బుల్లో తూలుతూ నడక. **festinating g.,** Patient of Parkinson's disease moves with accelerating short steps. తడబడుతూ చిన్న అడుగులు త్వరితగతిలో వేయుట. **hemiplegic spastic g.,** patient with hemiplegia (paralysis of one half of the body) walking with rigid and dragging limbs శరీరములో ఒక సగమునకు పక్షవాతము వచ్చినవాడు ఆ సగమువైపు కాళ్ళూ చేతులూ ఊపుకుంటూ అడుగులు వేయుట. **reeling g.** drunken g., తాగుబోతు తూలుతూ తప్పటడుగులు వేయటం. **scissors g.** కత్తెర కాళ్ళ నడక. **spastic g.,** both feet are held together and move in a rigid manner రెండు పాదములు దగ్గరగా పెట్టుకొని బొమ్మవలె బిగువుగా కదలుట. **waddling g.,** like the walking of a duck బాతునడక.

**galactagogue** an agent promoting milk flow from the breast in a female క్షీరవర్ధిని: స్తనముల/పాలిండ్ల నుండి తల్లిపాలధార పెంచు వస్తువు, అలంకార. తల్లి వక్షం/పాలు పాపాయికి ప్రాణరక్ష; పిల్లమేలుకు తల్లిపాలు.

**galactocele** 1. milk-containing cysts in the breast పాలిండ్లలో పాలతోనిండిన తిత్తివంటి కుహరములు. 2. hydrocele containing milky fluid (chylocele) పాలవంటి ద్రవముతోనిండిన బుడ్డ/వరిబీజము.

**galactorrhoea** or **galactorrhea** a continuous discharge of milk from the female breasts 1. in the intervals between nursing/ feeding పాపకు పాలిచ్చి ఆపిన తర్వాత కూడా మాతృస్తనములనుండి పాలధార. 2. after weaning పాపకు పాలివ్వటం మానేసిన తర్వాతకూడా.

**galactosaemia** or **galactosemia** an inherited disorder produced by the accumulation of galactose, a monosaccharide in the blood రక్తములో గాలక్టోజ్ జమ అగు వారసత్వపు జాడ్యము.

**galactose** a simple sugar found in lactose (milk sugar) పాలచక్కెర.

**galacturia** a condition wherein the urine has a milky turbid colour because of the abnormal presence of galactose అసాధారణంగా గాలక్టోస్ మూత్రంలో విసర్జింపబడుట, దీనివలన మూత్రం పాలతెలుపురంగులో ఉంటుంది. [*distinguish* from chyluria.]

**gall** bitter చేదు. the bile పైత్యరసము. **g. bladder,** reservoir of bile పిత్తాశయం. **g. stone** పిత్తాశయ రాయి/శిల.

**gall bladder** the reservoir of bile, situated underneath the liver పిత్తాశయము: కాలేయము దిగువనున్న అవయవము; పైత్యరసమునకు ఆశయము.

**gallop** 1. any fast pace comparable to the fastest gait of a horse దాట్లు వేసి పరుగెత్తు, బలముకొద్దీ పరుగెత్తు, వేగవంతమగు గుర్రపు దౌడు. 2. galloping phthisis/consumption wherein the tissues are consumed at a rapid tempo. The disease gallops until it reaches doom. దౌడుతీస్తున్న క్షయవ్యాధి – ఇందులో శరీరకణజాలములు త్వరితగతిలో క్షయించి/క్షీణించి రోగిని అవసానదశకు లాగుతాయి; క్షీణము కలుగజేసే వ్యాధికాబట్టే క్షయ అని పేరు వచ్చింది. 3. gallop rhythm – disordered rhythm of the heart గుర్రపు దౌడు వలె గుండె కొట్టుకొనడం. క్రమము తప్పిన తాళము/లయతో ఆడే గుండె.

**gall stone** 1. a calcific hard mass formed in the gall bladder or bile duct పిత్తాశయములోగాని పైత్యరస నాళములోగాని తయారైన రాయి. 2. It may produce gall bladder colic, a stabbing pain in the right upper quadrant, may be referred to the right shoulder, with or without yellow discoloration of eyes (jaundice). దీనివలన పిత్తాశయశూల, పై కడుపులో కుడివైపు పోటు కలుగవచ్చు – ఇది కుడిబుజమునకుగూడ పాకవచ్చును; పచ్చకామెర్లు ఉంటే ఉండవచ్చును.

**galvanocautery** cautery by heat with galvanic current application గాల్వానిక్ విద్యుత్ దహనీకరణం.

**galvanofaradization** treatment by heat with the simultaneous application of galvanic and faradic current గాల్వనిక్ మరియు ఫారడిక్ విద్యుత్ ప్రవాహములను ఒకేసారి ఉపయోగించి చికిత్స చేయుట.

**gamete** 1. female (ovum) or male (spermatozoon) reproductive cell సంయోగబీజాలు, యుగ్మకములు, స్త్రీలోని అండము లేదా పురుషునిలోని శుక్రకణము – ప్రత్యుత్పత్తికి సం. కణములు. 2. sexual forms of the malarial parasite మలేరియా పరాన్నజీవి యొక్క లైంగిక రూపములు. male (microgamete) మగ, or female (macrogamete) ఆడుది.

**gametocide** an agent that kills gametes or gametocytes. సంయోగ బీజ మారణి.

**gametocyte** 1. precursor of gamete సంయోగబీజ మాతృక, యుగ్మక జనకము, గామీట్ యొక్క అగ్రగామి. 2. oocyte స్త్రీబీజమాతృకణము or spermatocyte పురుషబీజమాతృకణము.

**gametogenesis** genesis of gamete సంయోగబీజ జననము, యుగ్మకజననము, బీజకణోత్పత్తి.

**gammaglobulins** immunoglobulins, protein globulins, IgA, IgD, IgE, IgG and IgM ప్రోటీన్ గ్లాబ్యులిన్‌లు.

**gammopathy** abnormal proliferation of lymphoid cells producing immunoglobulins శోషరస కణముల అసాధారణ/అనారోగ్య అతివృద్ధి. 1. multiple myeloma బహుళ అస్థిమజ్జారుగ్మత. 2. Hodgkin's disease.

**gamogenesis** sexual reproduction లైంగిక ప్రత్యుత్పత్తి.

**ganglion** [ganglia *pl.*] a knot ఒక ముడి, గండిక, నాడిముడి. 1. a group of nerve cell bodies నాడీకణముల సముదాయము, నాడిముడి. **autonomic ganglia,** in the autonomic nervous system, *see/చూడండి* nervous system. స్వయంచోదిత నాడీవ్యవస్థలోని నాడిముడులు. certain groups of nerve cells in the brain, *e.g.* **basal ganglia** *ఉదా.* మెదడులోని నాడిముడులు. **celiac g.,** on each crus of the diaphragm విభాజకపటలము రెండు తెరల మొదలున ఉన్నవి. **geniculate g.,** the sensory ganglion of the VII cranial/facial nerve ఏడవ కపాలనాడి యొక్క జ్ఞాననాడిముడి. **parasympathetic g.,** situated in the wall of the organ or near to it అవయవకుడ్యములోగాని, దాని దగ్గరగాగాని ఉన్న పరానుభూత నాడిముడి. **splanchnic g.,** knot near 12th thoracic vertebra 12 వ వెన్నుపూస దగ్గరగా నున్నది. **sympathetic ganglia,** chain of ganglia on both sides of the spinal cord వెన్నుపాము ఇరువైపులా పేర్చబడిన సహానుభూత ముడుల వరుస. 2. benign cyst over a tendon sheath, frequent *e.g.* **g. over the wrist** తరచుగా స్నాయుబంధనముయొక్క పొరమీద జనించు నిరపాయ తిత్తి, *ఉదా.* మణిబంధము మీది తిత్తి.

**ganglionectomy** 1. surgical excision of a ganglion నాడిముడి తీసివేయడం: శస్త్రచికిత్సద్వారా నాడిముడి నిర్మూలనము. 2. surgical removal of a cyst on a tendon స్నాయు బంధనము మీది తిత్తి ఛేదించుట.

**ganglioneuroma** a benign tumour of the ganglion cells నాడిముడి యొక్క కణముల నిరపాయకంతి.

**gangrene** death of tissue *en masse* (as a whole) with loss of vascular (hence, nutritive) supply to the part, followed by bacterial invasion and putrefaction పూతిమాంసము, కోథము, కుళ్ళిన పుండు: ఒక ప్రాంతపు కణజాలముల ఒక్కుమ్మడి మృతి – ఈ భాగంలో రక్తప్రసరణ లేక, పోషణ లేక, ఆపైని బాక్టీరియా సంపర్కము వలన కణజాలములు కుళ్ళిపోతాయి. **diabetic g.,** especially of the foot, the most dreaded complication in diabetes mellitus. Usually it starts in a toe and spreads up. మధుమేహం వ్యాధిలో భయంకరమైన/భీతి

గొలుపు దుష్పరిణామము, ముఖ్యముగా పాదముల వేళ్ళలో అంకురించి, పైకి పాకుతుంది. **dry g.**, tissues become discolored, dry and shrivelled, an agonisingly painful condition తడిలేని కుళ్ళిన పుండు. కణజాలములు రంగుమారి, ఎండి, ముడుతలుపడి/ముడుచుకొనిపోయిన స్థితి – దుర్భరమైన వ్యథతో కూడిన నొప్పి. **gas g.**, extremely painful condition wherein there is accumulation of gas in the tissues due to invasion by gas-producing anaerobic bacteria, species of *Clostridium*. This is commonly seen in war wounds. కణజాలములో అవాతజీవుల దాడి/దండయాత్ర వలన, మరియు వాటి వాయుజన్యగుణము వలన జనించే వాయువులు కణజాలములో జమ అగుట. ఇది అమిత వేదనతో కూడుకున్న దుర్ఘటన; తరచుగా యుద్ధరంగములో గాయముల పరిణామము. **moist g.**, occurs when venous drainage is obstructed. Tissues are sodden/swollen with fluid. చెమ్మతో కూడిన, కుళ్ళిన పుండు. సిరలలో రక్తప్రసరణకు అడ్డు సంభవించినప్పుడు; కణజాలములు ద్రవములతో పాసిపోయిన/ఉబ్బిన స్థితి.

**garbage** waste material, especially domestic refuse చెత్తాచెదారం, ముఖ్యంగా ఇంట్లో చెత్త. It is a potent transmitter of contagion, allergy, *etc.* దీనిలోని బూజు, బాక్టీరియా, ఎలర్జి పదార్థములు, మొ. స్పర్శవలన అరిష్టాలు కలుగుతాయి. *N.B.* Also travels with us in style in trains. *గమనిక:* మనతోపాటు రైలుపెట్టెలో దర్జాగా రవాణా అవుతుంది.

**gargle** 1. solution for rinsing and cleansing the mouth and throat పుక్కిలించుద్రవం: నోట్లోను గొంతులోను పోసుకుని పుక్కిలించి, ఖాండ్రించి, నోరు శుభ్రము చేసుకొనే ద్రవం. 2. keeping solution at the back of the mouth with closed glottis, bending the neck backwards and rinsing the pharynx; later to force it out by sudden/forcible expulsion of air from the lungs గండూషము, పుక్కిలింత: కంఠబిలము (glottis) మూసి ఉంచి, ద్రవము నోటివెనుక నిలవనిచ్చి, మెడ వెనుకకి వంచి, శబ్దముచేస్తూ, ఆ ద్రవమును అటుఇటు కదలిస్తూ ఒత్తిడితో కూడిన నిశ్వాసముతో ఉమ్మేయుట, *గమనిక:* గ్రామీణ వాతావరణంలో ఇది ఒక దృశ్యం.

**garlic** *bot.* 1. a herbal bulb of the onion family వెల్లుల్లిపాయ, ఉల్లిపాయ జాతిలోనిది. 2. most beneficial for the digestive system జీర్ణవ్యవస్థకు మంచిది. 3. *అలంకార.* తల్లి చేయలేనిమేలు వెల్లుల్లి చేస్తుంది. *figur.* A garlic a day keeps the doctor away.

**gas** 1. vapour వాయువు. **alveolar g.**, the gas in the alveoli of the lungs వాయుకోశాలలోని వాయువు. Here gaseous exchange with the capillary blood takes place, *viz.* diffusion of oxygen from the air in the alveoli into the blood in the capillaries and diffusion of carbondioxide in the reverse direction. ఇక్కడ ఒకటి ఇచ్చి మరియొకటి పుచ్చుకోవడం జరుగుతుంది. ఆక్సిజన్ వాయుకోశాలనుండి కేశనాళికలలోని రక్తంలోనికి వ్యాపనము అయి కార్బన్‌డైఆక్సైడ్ కేశనాళికల రక్తంనుండి వాయుకోశాలలోనికి వ్యాపనము అవుతుంది. **laughing g.**, nitrous oxide, anaesthetic drug మత్తు కలిగించే మాదక వాయువు. **marsh g.**, methane పంకవాయువు, దుర్గంధవాయువు. **tear g.**, బాష్పవాయువు. 2. natural gas used as a fuel for cooking (in gas cylinder) వంటకు ఉపయోగించే గాస్ (సిలిండర్‌లోనిది). 3. In America *colloq.* gasoline, petrol అమెరికాలో వాడు.భా. పెట్రోల్.

**gasserectomy** excision of the Gasserian ganglion ఈ నాడిముడిని తొలగించుట.

**Gasserian** or **gasserian ganglion** situated on the fifth cranial nerve or trigeminal nerve, the involvement of which produces trigeminal neuralgia (tic douloureux) 5వ కపాలనరము మీదనున్న నాడిముడి – దీని సుస్తీ వలన ముఖము మరియు ఫాలభాగములో ఒక పక్కన (కుడిగాని, ఎడమగాని) ఝల్లుమని పోట్లు, వేదన రోగిని సతాయిస్తాయి. దీనిని త్రిధారానాడీవేదన అంటారు.

**gastralgia** stomach ache or colic జఠరవేదన లేదా శూల, అన్నాశయము నొప్పి లేదా శూల, వాడు.భా. కడుపునొప్పి.

**gastrectomy** the surgical excision of all or a portion of the stomach అన్నాశయము మొత్తమునుగాని, అందులో కొంత భాగమునుగాని శస్త్రచికిత్సచేసి తీసివేయుట.

**gastric** relating to the stomach, జీర్ణాశయమునకు/అన్నాశయమునకు సం. **g. acid,** hydrochloric acid secreted by the parietal (oxyntic) cells in the wall of the stomach అన్నాశయకుడ్యములో కణములు స్రవించే హైడ్రోక్లోరిక్ అమ్లము. **g. cancer** అన్నాశయములో కేన్సరు. **g. emptying** అన్నాశయములోని ఆహారము ఖాళీయగుట. The emptying time is more with fatty foods. క్రొవ్వుపదార్థములు ఖాళీయగుటకు ఎక్కువసేపు పడుతుంది. **g. intubation,** a flexible tube passed into stomach, *see*/చూడండి feeding. **g. juice** జఠరరసము. It contains an enzyme named pepsin. ఇందులో పెప్సిన్ అను ఎన్‌జైమ్ కలదు. **g. lavage,** to wash and clean the stomach with fluid by a tube జఠరధావనము: రబ్బరుగొట్టముద్వారా ద్రవముతో అన్నాశయములోపల శుభ్రపరచుట. **g. ulcer** అన్నాశయములో వ్రణము.

**gastrin** a hormone secreted by pyloric glands in the stomach అన్నాశయములోని పైలోరిక్ గ్రంథులలో స్రవించే హార్మోన్.

**gastritis** inflammation of the stomach జీర్ణాశయ శోథము, ఆమాశయ వేదన, అన్నాశయములో 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు', అలంకార. జఠరాగ్నికి ఆజ్యం పోసినట్లు మరింత మంట.

**gastrocele** 1. hernia of the stomach అన్నాశయముయొక్క హెర్నియా. 2. hernia of a gastric pouch అన్నాశయజోలె యొక్క హెర్నియా.

**gastrocnemius** the calf muscle పిక్కకండరము, అలంకార. పిక్కబలం దీని మహిమ. *figur.* beauty muscle of a girl in a beauty contest అలంకార. అందాల పోటీలో భామపిక్క.

**gastroduodenitis** inflammation of the stomach and duodenum అన్నాశయము మరియు డుయొడినమ్ యొక్క శోథము/ 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**gastrodynia** pain in the stomach, అన్నాశయములో వేదన, వాడు.భా. కడుపులో నొప్పి.

**gastroenteralgia** pain in the stomach and intestine అన్నాశయము మరియు పేగులో నొప్పి. వాడు.భా. పొట్టలో నొప్పి.

**gastroenteritis** inflammation of the stomach and intestine, usually due to contaminated food/water అన్నాశయము మరియు

పేగుయొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు', తరచుగా కలుషిత ఆహారం/నీరు వలన. *figur.* The result is revolt at both ends of the alimentary canal, *viz.* vomit and purge. అలంకార. అన్న ఆసననాళముయొక్క రెండు కొనలలో అలజడి/గడబిడ అనగా వాంతి, బేది.

**gastroenteroanastomosis** gastroenterostomy: anastomosis (joining) between the stomach and small intestine అన్నాశయము నకు మరియు చిన్నపేగుకు అనుమేళకము/కలపటం.

**gastroenterology** 1. study of the stomach, intestines and alimentary/digestive system and their diseases జీర్ణాశయాంత్ర వైద్యశాస్త్రము: అన్నాశయము, పేగులు మరియు ఆహారనాళము, జీర్ణనాళము/జీర్ణవ్యవస్థ – వీటిని గురించి మరియు వీటికి సంక్రమించు వ్యాధుల గురించి తెలుసుకొను శాస్త్రము. 2. Gastroenterology, a medical journal వైద్యవార్తాపత్రిక.

**gastroenteropathy** any disease of the stomach and intestines, *e.g.* **allergic g.**, *see/చూడండి* allergy. allergy in children to some foods particularly cow's milk అన్నాశయము మరియు పేగుల యొక్క సుస్తి, ఉదా. పిల్లలలో కొన్ని ఆహారపదార్థములకు, ముఖ్యముగా ఆవుపాలకు ఎలర్జి.

**gastroesophagitis** inflammation of the stomach and oesophagus అన్నాశయము మరియు అన్నవాహిక యొక్క శోథము/ 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**gastrofiberscope** an instrument/tube for seeing/observing the inside of stomach జఠరాంతర దర్శిని: అన్నాశయములోపల పరిశీలించు/పరీక్షించు సాధనము/గొట్టము.

**gastroileostomy** surgical anastomosis between the stomach and ileum అన్నాశయమునకు శేషాంత్రికము (చిన్నపేగు, ఇలియమ్)కు శస్త్రచికిత్సద్వారా అనుమేళకము/కలపటం.

**gastrojejunostomy** surgical anastomosis between the stomach and jejunum అన్నాశయమునకు మధ్యాంత్రికము (చిన్నపేగుయొక్క రెండవభాగము, జెజునమ్)కు శస్త్రచికిత్సద్వారా అనుమేళకము/కలపటం.

**gastromalacia** [Greek *malakia*=softness]. softening of the wall of the stomach జీర్ణాశయ కుడ్యము మెత్తబడుట.

**gastromegaly** enlargement of the stomach ఘన జఠరము: అన్నాశయము పెద్దది యగుట.

**gastromycosis** fungal infection of the stomach అన్నాశయమునకు ఫంగస్/శిలీంధ్ర సోకుడు.

**gastropathy** any disease of the stomach అన్నాశయముయొక్క సుస్తి.

**gastrophrenic** relating to the stomach and diaphragm అన్నాశయము మరియు విభాజకపటలమునకు సం.

**gastroplasty** plastic repair of stomach, *e.g.* hour-glass contraction అన్నాశయ(స్వ)రూపకల్పన, ఉదా. ముడుచుకుపోయిన, ఇసుక గడియారం ఆకృతిలోనున్న అన్నాశయమును సరిదిద్దుట.

**gastroptosis** downward displacement of the stomach usually manifest on barium meal examination అన్నాశయము తనతావునుండి క్రిందకు తొలగుట – ఈ పరిణామము బేరియమ్ ఫోటోలో విశదమవుతుంది.

**gastrorrhagia** haemorrhage from the stomach అన్నాశయమునుండి రక్తస్రావము, జఠరరుధిరస్రావము.

**gastroscope** an endoscope to inspect the interior of the stomach జఠరాంతర్దర్శిని, అన్నాశయాంతర్దర్శిని: అన్నాశయము లోపల పరిశీలనముచేయు గొట్టము.

**gastroscopy** inspection of the inside of the stomach అన్నాశయాంతర్దర్శనం, జఠరాంతర్దర్శనం, జీర్ణకోశ పరిశీలన.

**gastrospasm** spasm of the stomach wall అన్నాశయము గోడలో స్నాయువుల యీడుపు, జఠర శూల.

**gastrostomy** (stoma=opening) creation of an artificial opening into the stomach by surgery. This facilitates feeding when there is a block in oesophagus, for *e.g.* cancer. జఠరఛిద్రీకరణము: శస్త్రచికిత్సచేసి అన్నాశయములో రంధ్రము సృజించుట; అన్నవాహికలో అడ్డు సంభవించినప్పుడు, ఉదా. దాని కాన్సర్‌లో, ఈ రీతిగా ఆహారము పోషణ కొరకు ఎక్కించుట సులభము.

**gastrotomy** surgical incision into the stomach అన్నాశయములోనికి కోత/గంటు/గాటు.

**gauze** thin muslin cloth of mosquito net design used in the dressing of wounds గాజ్ గుడ్డ, జాలీగుడ్డ: దోమతెరగుడ్డ నమూనా గల సన్నని మెత్తని బట్ట. గాయముల మీద ఇది పెట్టి, దానిపైన దూది ఉంచి కట్టుకడతారు.

**gavage** forced feeding through a tube బలవంతంగా గొట్టముద్వారా ఆహారాన్ని అందించుట.

**gel** a colloid in gelatinous form జిగటుగానున్న కాంజికాభము *e.g.* aluminium hydroxide g., aluminium phosphate g.

**gelatine** or **gelatin** 1. a substance prepared by hydrolysis of animal collagen derived from skin, connective tissue and bones పశువుల చర్మము, కండరబంధనములు/బంధనకణజాలము మరియు ఎముకలను జలవిశ్లేషణద్వారా కాచితీసిన పదార్థము. 2. used as a vehicle for drug administration, *i.e.* in the form of capsule/kapseal ఔషధము సేకరణకు వీలుగా/మింగుటకు తేలికగానుండు మందుగొట్టము (capsule ఔషధము పెట్టి కట్టిన చిన్న కోశము). 3. used as an adjuvant protein food అనుబంధ ప్రోటీన్ గా వాడుతారు.

**gelatinous** resembling jelly లేత ముంజెవలెనున్న పదార్థము; ద్రవము గాక, గట్టిగానుగాక, కొంచెము హల్వాలాగనుండు పదార్థము.

**gene** the biologic/basic unit of heredity జీన్, జన్యువు, అనువంశిక లక్షణ కారకమైన జీవపదార్థ అంశము. This is located at a definite position (locus) on a chromosome. ఈ జీన్ క్రోమోసోమ్ మీద ఒక నిర్ణీతస్థానములో ఉంటుంది. **dominant g.,** ప్రభావక జన్యువు. **recessive g.,** అప్రభావక జన్యువు.

**genealogy** enumeration of the ancestors; pedigree, lineage వంశములో పూర్వీకుల గణన; వంశవృక్షము, వంశావళి, వంశపరంపర, వంశచరిత్ర.

**generation** 1. the process of reproduction ప్రత్యుత్పత్తి క్రమము. 2. individuals at one step or stage in a pedigree వంశపరంపరలో ఒక తరమునకు చెందినవారు. **g. gap,** variation/change in

the living/lifestyle between generations ఒక తరమునకు మరియొక తరమునకు మనుగడలో ఉన్న వ్యత్యాసము/జీవిత సరళిలో మార్పు.

**generic name** the name of a drug not protected by a trademark; non-proprietary. non-brand name, *e.g.* aspirin (acetylsalicylic acid), paracetamol, penicillin, tetracycline. [*in contr.* proprietary, brand].

**genesis** origin ఉత్పత్తిక్రమం. pathogenesis వ్యాధి జననం.

**gene therapy** *see/చూడండి* genetic.

**genetic** 1. relating to reproduction or to birth or to origin వంశాంకుర: ప్రత్యుత్పత్తికి లేదా పుట్టుకకు లేదా ఆరంభమునకు సం. పుట్టుపూర్వోత్తరాలు. 2. hereditary/inherited అనువంశిక, వంశపరంపరగా వచ్చిన. **g. counselling**, advice from a specialist in genetics regarding the above matters to the would be wife and husband కాబోయే పరిణీత (wife) మరియు పరిణేత (husband) జెనెటిక్స్‌లో నిపుణుని వద్ద పై విషయముల గురించి సలహా పొందుట. **g. engineering**, manipulations of the genetic make-up of an organism; addition/deletion/repair of the gene ఒక జీవియొక్క జన్యువు నిర్మాణము నేర్పుతో మార్పు చేయుట; జన్యువులను కొన్నిటిని కలుపుట/తొలగించుట/మరమ్మతు చేయుట. **g. therapy**, replacement of healthy genes from gene bank, in place of their defective genes రోగిలోని లోపముతోకూడిన జన్యువులను తొలగించి వాటి స్థానములో ఆరోగ్యవంతమైన జన్యువులను జన్యువునిధినుండి అమర్చుట. genetherapy being tried not only in inherited diseases but also in acquired diseases ఈ జీన్ వైద్యము వంశపారంపర్యముగా వచ్చు జబ్బులలోనేగాక, వ్యక్తికి సంక్రమించిన కొన్ని జబ్బులలోగూడ ఉపయోగకరమని భోగట్టా.

**genetic code** DNA sequence encoding genetic information in the cell. జన్యుసంకేతము.

**genetic engineering** *see/చూడండి* genetic.

**genetic fingerprinting** also called DNA fingerprinting. 1. procedure of analyzing samples of DNA from body fluids, *e.g.* blood, saliva, semen to pinpoint the culprit, say in parental

disputes, *etc.* పుట్టుక తగాదాల్లో తల్లితండ్రులు ఎవరో అని తెలుసుకొనటానికి, శంకించినవారి రక్తం, లాలాజలం, వీర్యం తీసి DNA ప్రత్యేక పరీక్ష చేయుట. 2. to establish identification of the culprit in a criminal investigation నేరస్థుని గుర్తింపులో సహాయపడుతుంది.

**genetics** the science and study of genes జన్యుశాస్త్రము, అనువంశిక విజ్ఞానము.

**genetic screening** [screening = to examine a group of individuals in order to check for the presence of a widespread disease, *e.g.* tuberculosis. వ్యాధి ప్రబలత కనుక్కొనడానికి పెక్కుమందిని పరీక్షచేయుట. ఉదా. టి.బి.] 1. the systematic testing for detecting hereditary diseases వంశపారంపర్యముగా వచ్చే జబ్బులు కనిపెట్టడానికి వంశీయులందరిని పరీక్షించుట. 2. another *e.g.* testing of women whose close relatives had breast cancer, to detect it in the early stage మరియొక ఉదా. ఒక స్త్రీ స్తనగ్రంధి కేన్సరుకు గురియైతే ఆమె దగ్గరబంధువులైన స్త్రీలలో ఈ స్తనగ్రంధి కేన్సరు సూచనలు ఉన్నవా అని పరీక్షిస్తే కేన్సరు ప్రథమ దశలో గుర్తింపవచ్చు.

**genial** 1. relating to the chin గడ్డమునకు సం. 2. genial temperament: cheerful, friendly ఉల్లాసముగల స్వభావము: ఉత్సాహపూరితమైన, స్నేహముగల అభినయము.

**genic** 1. concerning the genes జన్యువులకు సం. 2. caused by the genes జన్యువులవలన కలిగిన. 3. used as a suffix, *e.g.* pathogenic తుది ముగింపు, ఉదా. వ్యాధికారకం (pathogenic).

**genicular** relating to the knee కూర్పర సం. జానువుకు సం.

**geniculate** 1. bent వంగిన. 2. like a knee మోకాలుకీలు వలె.

**geniculum** space resembling a knee (bent like a knee) in anatomic nomenclature శరీరనిర్మాణశాస్త్ర పరిభాషాప్రకరణము రీత్యా జానువు రూపముతోనున్న స్థలము.

**genital** 1. relating to reproduction or reproductive organs జననేంద్రియ సం., ప్రత్యుత్పత్తి లేదా ప్రత్యుత్పత్తి అవయవాలకు సం. 2. genitals, the reproductive organs జననేంద్రియములు, ప్రత్యుత్పత్తి అవయవములు.

**genitalia** reproductive organs ప్రత్యుత్పత్తి అవయవములు, జననేంద్రియములు. **external g.** బాహ్యలైంగిక అవయవములు in the female: pudendum, clitoris స్త్రీలలో ఉపస్థ/యోని, క్లైటోరిస్ in the male: scrotum, penis పురుషులలో వృషణములసంచి, పురుషాంగము.

**genitourinary** urogenital మూత్రజననేంద్రియ వ్యవస్థ. the genital and urinary system ప్రత్యుత్పత్తి వ్యవస్థ మరియు మూత్రవ్యవస్థ.

**genotype** 1. the genetic set up of an organism జన్యురూపము, ఒక జీవియొక్క జన్యువుజనిత తత్వము. 2. genetic constitution జన్యు నిర్మాణము [*Cf.* phenotype *తారత.* అనుజనిక రూపము].

**genu** 1. the knee కూర్పరము, జానువు. 2. pertaining to the knee మోకాలుకు సం. **g. valgum,** knock-knees లోపలికి వంగిన మోకాళ్ళు, గాడిద కాళ్ళు. **g. varum,** bow-legs, bandy-legs దొడ్డికాళ్ళు, దొప్పలాగా బయటికి వంగిన మోకాళ్ళు.

**genus** [genera *pl.*] *biol.* biological classification of organisms ప్రజాతి; జీవశాస్త్రములో జీవుల వర్గీకరణము. [*Cf.* species *తారత.* జాతి].

**geophagia** eating of earth/mud మన్నుతినుట. Children harbouring intestinal worms indulge in this habit. పేగులలో ఎలికపాములు/నట్టలుఉన్న పిల్లలు ఈ పని చేస్తూ ఉంటారు.

**geriatrics** medical study of aging and diseases of the elderly వృద్ధాప్య వైద్యశాస్త్రము: వార్ధక్యపరిణామము మరియు వృద్ధులలో/వృద్ధాప్యములో సంక్రమించు వ్యాధుల శాస్త్రము [*Cf.* paediatrics *తారత.* బాల్యవ్యాధుల శాస్త్రము].

**germ** 1. pathogenic microorganism రోగక్రిమి, వ్యాధిని కలిగించు సూక్ష్మజీవి. 2. primitive beginning ఉత్పత్తికి ఆదిమమైన బీజము. **g. cells** బీజకణాలు. **g. plasm** బీజ ద్రవ్యము. **g. wall** బీజ కుడ్యము/ప్రహరి.

**German measles** rubella, a viral infection of the skin and mucous membrane, mainly involving the respiratory tract, characterised by red papules రూబెల్లా: ఎర్రదద్దుర్లు, పొంగు; చర్మము మరియు శ్లేష్మపొర (ముఖ్యముగా శ్వాసవ్యవస్థ యొక్క) వైరస్ సోకు/అంటు.

**germicidal** killing the germs (pathogenic microorganisms) రోగ క్రిమినాశక; సూక్ష్మజీవులను చంపు. **g. soap** రోగక్రిమి నాశక సబ్బు.

**germicide** an agent killing the germs (pathogenic microorganisms) రోగక్రిమినాశిని; సూక్ష్మజీవులను చంపు వస్తువు.

**germinal** 1. relating to a germ cell బీజకణమునకు సం., బీజసంబంధమైన. 2. relating to the earliest stage of development వృద్ధియొక్క ప్రాథమిక దశకు సంబంధమైన. **g. epithelium** జననోపకళ. **g. layer** జనన స్తరము. **g. vesicle** జనన ఆశయము.

**geroderma** gerodermia; wrinkling/dystrophy of skin, seen in old age వృద్ధాప్యములో అనగా ముసలి/ముదుసలితనములో చర్మము ముడుతలు పడుట, *గమనిక:* వార్ధక్య పరిణామము.

**gerodontics** dental problems in old age వృద్ధాప్యములో పన్ను బాధలు, పండ్ల పరిరక్షణము/సంరక్షణ(ము).

**gerontology** problems of aging వృద్ధాప్యములో శారీరక మానసిక సమస్యలు మరియు వాటియొక్క శాస్త్రము.

**gestation** period of pregnancy గర్భధారణకాలము; అలంకార. మాతృమూర్తి ఓర్పుకు గీటురాయి.

**giant** very large అతిపెద్దదైన. a human being of huge size మహాకాయి, మహాకాయుడు. *micro.str.* సూక్ష్మ.చూ. **g. cell** బృహత్ కణము.

**giantism** *see/చూడండి* gigantism.

**Giardia** a genus of flagellate protozoa infesting the intestines in man, causing diarrhoea and malabsorption; disease called giardiasis కశాభము కలిగిన ప్రోటోజోవా ప్రజాతి – ఇవి మనిషి పేగుల్లో నివసించి అతిసారము/అతివిరేచనములు మరియు పోషకపదార్థములు శరీరములోనికి గుంజుకొనబడని స్థితిని కలుగజేస్తాయి.

**giardiasis** lambliasis. intestinal infection with *Giardia lamblia* giving rise to diarrhoea or dysentery విరేచనాలు కలుగజేయు పరాన్నజీవి సంపర్కం.

**gibbus** a hump గూను/ఉబుకు. వాడు.భా. గూని. **g. of spine,** commonly due to tubercular destruction of vertebrae వెన్నెముకమీద మూపురము – ఇది తరచుగా ఎముకల టి.బి. వలన, వెన్నుపూసలు క్షీణించినందువలన కలుగు పర్యవసానము.

**giddiness** giddy feeling, an unbalancing spinning sensation తలతిప్పు, *see/చూడండి* also vertigo.

**gigantism** giantism మహాకాయత. **pituitary g.,** *see/చూడండి* acromegaly.

**ginger** *bot.* a rhizome. [Latin *Zingiber*] carminative, stomachic వాయుహరమైన, ఆకలి పుట్టించు. **dry g.** శొంఠి. **green g.** అల్లం. *colloq.* ginger cake గ్రా. అల్లం మురబ్బా.

**gingiva** 1. the gum చిగురు. 2. mucous membrane supported by fibrous tissue which surrounds the teeth పళ్ళ ఇరుప్రక్కలా వాటిని అంటిపెట్టుకునియుండు తంతుకణజాలముతో కూడిన శ్లేష్మపొర.

**gingivitis** inflammation of the gingiva చిగుళ్ళవాపు, చిగురు శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**gingivostomatitis** inflammation of the gingiva and oral cavity చిగురు మరియు నోరు యొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**girdle** an encircling part చుట్టూరా ఆవరించే భాగం. **pelvic g.** శ్రోణిమేఖల. **shoulder g.** స్కంధమేఖల.

**girth** the measurement around the waist కటికొలత, కటిపరిధి, నడుము చుట్టుకొలత. *N.B.* girth/width control to achieve weight control *గమనిక:* బరువు భారం తగ్గించాలంటే నడుము/ఉదర పరిధి అదుపులో ఉంచాలి. అలంకార. మొత్త తగ్గించాలి/కరిగించాలి. కైవారం తగ్గించాలి.

**glabella** region in the middle of forehead at the level of supraorbital ridges భ్రూమధ్యము, తిలకస్థానం: బొట్టుపెట్టుకొనే చోటు. *N.B.* Allergy here due to vermilion (tilak) application is an annoying discomfort. *గమనిక:* బొట్టు (తిలకం)నకు ఎలర్జి చికాకు, అసౌకర్యకర అనుభూతి.

**gladiolus** [Latin *gladius* = a sword]. corpus sterni, body of the sternum, sword-shaped structure ఉరోస్థి, ఉరఃఫలకము, ఖడ్గం ఆకారంలో ఉన్న నిర్మాణం. ఎదురురొమ్ము ప్రాంతం ఎముక.

**gland** a set of cells designed to produce a secretion or excretion గ్రంథి, స్రావము స్రవించు లేదా విసర్జనక్రియనొనర్చు కణముల నిర్మాణము. **endocrine g's,** ductless glands వినాళికాగ్రంథులు pituitary, thyroid, adrenal gland and the gonads పిట్యూటరి, థైరాయిడ్, ఎడ్రినల్ గ్రంథి మరియు బీజకోశములు. **large g's,** liver, pancreas కాలేయము, క్లోమము. **lymph g's,** lymph nodes situated at junctions in the body, as in axilla, groin and along lymphatic vessels in the body చంక, గజ్జలు మరియు శరీరములోని శోషరసనాళముల వెంబడి ఉండునవి. **mammary g's,** breast glands స్తనగ్రంథులు. **mucous g's** శ్లేష్మము తయారుజేయునవి. **prostate g.** పౌరుషగ్రంథి. **submandibular g.,** salivary gland లాలాజలము స్రవించు గ్రంథి. **sweat g.** చెమటను విసర్జించు గ్రంథి.

**glanders** a contagious disease transmitted to man from horses characterised by skin ulcers and inflammation of mucous membranes; the chronic form called 'farcy' గుర్రములనుండి మనుష్యులకు అంటు/సంక్రమించు రోగము. చర్మముమీద వ్రణములు మరియు శ్లేష్మపొరల వాపు సంభవిస్తాయి.

**glandular fever** *colloq.* 'the kissing disease'. *syn.* infective/infectious mononucleosis. common in age group 3 to 5 years and 15 to 25 years. fever, lymph node enlargement, skin eruption, mononuclear predominance in blood – transmitted by direct contact అలంకార. 'ముద్దుతో ముసలము'. జ్వరము, లింఫ్ గ్రంథుల వాపు, చర్మదద్దుర్లు, రక్తంలో లింఫ్ కణములు జాస్తి అగుట – ఒకరి నుండి మరియొకరికి వ్యాపించు రుగ్మత.

**glans** cone shaped mass of erectile tissue at the end of the penis and clitoris మేఢ్రమణి, గుహ్యమణి: పురుషాంగము చివర మరియు దీనికి స్త్రీలలో ప్రతిరూపమైన క్లైటోరిస్ చివర కిరీటాకృతి కల్గిన, నిక్కుడుగా ఉబ్బెడు కణజాలము.

**glasses** spectacles సులోచనములు, కళ్ళజోడు, అలంకార. సునయనముల కొరకు సులోచనములు.

**glaucoma** a disease due to rise in intraocular tension, characterised by pain in the eye and progressive loss of vision నీరుకాసులు, నీటికాసులు: కన్నుగుడ్డులో ఒత్తిడి పెరిగి, గుడ్డు గుంజుతూ, నొప్పిచేసి, క్రమేణ దిగజారుతున్న చూపు అనగా చూపు మాంద్యము.

**gleet** chronic gonorrheal urethritis and urethral discharge సెగ వ్యాధిలో దీర్ఘకాలపు మూత్రమార్గపు మంట, వాపు మరియు అందులోనుండి రసి కారుట.

**glenohumeral** relating to the glenoid socket in the scapula and humerus అంసఫలకములోని గ్లీనాయిడ్ పల్లము మరియు దండ ఎముకకు సం.

**glenoid cavity** the socket in the scapula అంసఫలకము/బుజం ఎముకలోని గ్లీనాయిడ్ పల్లం.

**glioblastoma** a tumour ఒక కంతి. **g. multiforme,** highly malignant tumour in the brain; may occur in the spinal cord మెదడులో పుట్టే అతి అపాయకరమైన కంతి; వెన్నుపాములోకూడా పుట్టవచ్చును *figur.* a tumour that blasts tissues అలంకార. కణజాలములను బాంబ్‌లా పేల్చేది.

**glioma** a tumour composed of neuroglia న్యూరోగ్లయా గల కంతి. **g. retinae,** retinoblastoma నేత్రపటలములో అపాయకరమైన కంతి. *figur.* a tumour which blasts the retina అలంకార. నేత్రపటలమును బద్దలుచేయు బాంబ్ – బీభత్స సూచకం.

**globin** the protein portion in haemoglobin రక్తరంజక ద్రవ్యములోని ప్రోటీన్ భాగము.

**globule** 1. a tiny spherical mass చిన్న గుండ్రపుముద్ద. 2. a pellet of medicine ఔషధపు చిన్న ఉండ, ఔషధ గుళిక.

**globulin** a class of proteins ప్రోటీన్‌లలో ఒక వర్గము. **gamma g.,** immunoglobulins A, D, E, G and M. **serum g.,** globulin in the blood రక్తములోని సీరమ్‌లోనున్న గ్లాబ్యులిన్.

**globulinuria** excretion of globulin in the urine మూత్రంలో గ్లాబ్యులిన్ విసర్జింపబడుట.

**globus** 1. a ball or sphere గుండ్రముగా బంతివలెనున్న ముద్ద. **g. hystericus,** abnormal sensation of 'a lump in the throat,' a hysterical tendency హిస్టీరియా అను మానసిక జబ్బులో 'గొంతులో ఉండ' ఉన్నట్లు అపోహ. 2. **g. pallidus,** a part of the lentiform nucleus in the brain మెదడులో ఒక భాగము.

**glomerular** relating to a glomerulus, especially renal glomerulus రక్తకేశనాళికల గుత్తికి సం., ముఖ్యముగా మూత్రపిండములోని గ్లామెర్యులస్‌కు సం.

**glomerulonephritis** inflammation of the kidney substance with glomerular inflammation; seen often in children గ్లామెర్యులైతో కూడిన మూత్రగ్రంథి పదార్థమునకు సంభవించు శోథము/వాపు. ఈ జబ్బు తరచుగా పిల్లలలో చూస్తుంటాము.

**glomerulopathy** any disease of the glomerulus గ్లామెర్యులైకు కలుగు ఖాయిలా/సుస్తి. **diabetic g.,** intercapillary glomerulosclerosis మధుమేహంలో ఎదుర్కొనే కిడ్నీ సుస్తి.

**glomerulosclerosis** fibrosis and scarring of the glomeruli resulting in non-function తంతుకణజాలముతో గట్టిపడి గ్లామెర్యులై నిర్వర్తించవలసిన విధిని చేయలేకపోవుస్థితి. a notorious complication of diabetes mellitus characterised by albuminuria, oedema and hypertension మధుమేహం వ్యాధిలో ఇది చెడువు చూపించే దుర్లక్షణము/పరిణామము – ఇందులో మూత్రములో అల్బుమిన్, శరీరం ఉబ్బటం మరియు బ్లడ్‌ప్రెషర్ పెరగడం కద్దు.

**glomerulus** [glomeruli *pl.*] a tuft/mass of blood vessels or nerve fibres, seen under the microscope సూక్ష్మదర్శినిలో చూసే రక్తనాళికల లేదా నాడీతంతిపోగుల పిలక/ముద్ద. **olfactory g.,** in the olfactory bulb ఘ్రాణగోళికలోనున్న నాడీతంతిపోగుల పిలక. **renal g.,** This term is principally referred to tufts of blood capillaries in the kidney, each 200 $\mu$ in diameter రక్తనాళికా గుచ్ఛము, రక్తకేశనాళికల పిలక; ప్రాధాన్యముగా మూత్రపిండంలో నున్న గ్లామెర్యులైకు ఈ పదము వాడుతారు.

**glomus** a small arteriolovenous shunt having rich nerve supply, sometimes referred to as glomus tumour పుష్కలమైన నాడీ తంతువులతో కూడి, ధమనికకు సిరకు కలిగిన సంధి; దీనిని కంతి అనికూడా అంటారు.

**glossal** relating to the tongue నాలుకకు సం., జిహ్వా/రసజ్ఞ తాలూకు.

**glossectomy** excision of the tongue నాలుకను తొలగించుట. అలంకార. పగవారికైనా ఈ కష్టం కలగకూడదు సుమా!

**Glossina** genus of African flies such as tse tse flies, vectors in trypanosomiasis causing sleeping sickness. **G. palpalis,** a trypanosome carrier, ట్రిపనసోమ్ రోగవాహకము – ట్రిపనసోమియాసిస్ జబ్బును నిద్రరోగము అంటారు.

**glossitis** inflammation of the tongue జిహ్వాశోథము, నాలుక యొక్క 'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు', రసజ్ఞ యొక్క రేపుట; నాలుక పూత.

**glossopharyngeal** 1. relating to the tongue and pharynx/throat నాలుక మరియు గొంతుకు సం. 2. **g. nerve,** 9th cranial nerve జిహ్వాగ్రసనీ తంత్రిక, 9వ కపాలనాడి.

**glossoplasty** plastic repair (by surgery) of the tongue, say in a wound నాలుకకు గాయమైన పిమ్మట, తిరిగి దాని స్వరూపము చేకూర్చు శస్త్రచికిత్స.

**glossoplegia** paralysis of the tongue నాలుకకు కలుగు పక్షవాతం.

**glossorrhaphy** suture of the tongue wound నాలుకలోని గాయమునకు కుట్లు వేయుట.

**glossotrichia** hairy tongue, hairy leucoplakia; rough on its surface కఱకు నాలుక. highly characteristic of HIV infection ఈ కఱకు నాలిక హెచ్.ఐ.వి. సంపర్కానికి రూఢి నిదర్శన.

**glottis** vocal opening also called glottic opening కంఠబిలము, తంత్రీద్వారము – the space between the two vocal cords; *figur.* Movement of these gives melody to a song. రెండు స్వరతంత్రుల మధ్యనున్న సందు; అలంకార. వీటి కదలిక/చలనము గానమాధుర్యాన్ని చిందిస్తుంది. *caution.* glottic oedema life-threatening *జాగ్రత్త:* కంఠబిలం వాపు ప్రాణాపాయకరం.

**glucagon** a hormone produced by alpha cells in the pancreas క్లోమములో అల్ఫా కణములలో తయారగు హార్మోన్.

**glucocorticoid** in the group of corticosteroids; hormones secreted by adrenal glands - cortisol (hydrocortisone) and cortisone ఎడ్రినల్ గ్రంథులు తయారుచేయు హార్మోన్లు.

**gluconeogenesis** the synthesis of glucose from non-carbohydrate sources, *viz,* amino and fatty acids కార్బోహైడ్రేట్ కానివాటి మూలమునుండి అనగా ఎమైనోఆమ్లములు మరియు క్రొవ్వు అమ్లములనుండి సంయోగము చెందే గ్లూకోస్.

**glucose** main source of energy for living organisms చక్కెర; జీవులకు ప్రధానశక్తి ప్రదాత. Its utilization is controlled by insulin. ఇన్సులిన్ అను హార్మోన్ ఈ చక్కెర శరీరావసరాలకు ఉపయోగపడుటను అదుపు చేస్తుంది. **g. liquid:** 1. syrup షర్బత్. 2. **intravenous g.,** used in the state of dehydration శరీరములో ద్రవలోపము ఏర్పడినప్పుడు సిరలోనికి గ్లూకోస్ ద్రవము ఎక్కిస్తారు.

**glutamic acid** an amino acid found in many proteins పెక్కు ప్రోటీన్లలోగల ఎమైనో అమ్లము.

**gluteal** relating to the buttocks పిరుదులకు సం. **g. artery** పిరుదులకు సం. ధమని. **g. cleft** furrow between the two buttocks నితంబ చీలిక.

**gluten** protein part in wheat గోధుమలోని ప్రోటీన్ భాగము. **g. enteropathy,** gluten not tolerated in coeliac disease సీలియక్ జబ్బులో గోధుమలోని ప్రోటీన్ వైషమ్యము.

**gluteus** name of a muscle పేశి/కండరము పేరు. **g. maximus,** buttocks muscle పిరుదుల/నితంబ మహాపేశి. **g. minimus,** buttocks muscle పిరుదుల/నితంబ చిన్న/లఘుపేశి.

**glutton** *figur.* glut+ton glut=gulp; ton=a lot. a person who eats too much తిండిపోతు. *N.B.* next stage obesity. *గమనిక:* తరువాత దశ ఉబక శరీరం/క్రొవ్వుకాయం.

**glycerine** or **glycerin** 1. clear syrupy liquid used for medicinal purposes ఔషధోపయోగమగు తేటయైన/నిర్మలమైన, తియ్యని ద్రవము.

2. used in the manufacture of soaps, e.g. glycerine soap సబ్బుల తయారిలో ఉపయోగిస్తారు.

**glycerol** colourless syrupy liquid prepared by the hydrolysis of fats and oils, used as a skin lotion. Glycerine is the commercial/pharmaceutical name for glycerol. కొవ్వులు మరియు నూనెల యొక్క జలవిశ్లేషణ వలన కలుగు రంగులేని, తియ్యని ద్రవము; వ్యాపార రీత్యా మరియు ఔషధములు తయారుచేయు ప్రక్రియలలోను దీని పేరు గ్లిసరిన్ అని వ్యవహరిస్తుంటారు.

**glycogen** the storage form of carbobydrates, stored primarily in the liver and muscle, and changed into a primary sugar when body needs it కాలేయములోను మరియు కండరములోను నిల్వ ఉన్న కార్బోహైడ్రేట్ యొక్క రూపము – ఇది శరీర అవసరాలనుబట్టి చక్కెరగా మారుతుంది. **g. storage disease,** inborn error of carbohydrate metabolism కార్బోహైడ్రేట్ జీవ(న)క్రియలో పుట్టుకతో ఉన్న దోషము.

**glycogenesis** the transformation of glucose into glycogen which is stored in the liver గ్లూకోస్ గ్లైకోజన్‌గా మారి కాలేయములో నిల్వ ఉండుట.

**glycogenolysis** conversion of/splitting glycogen into glucose in the liver కాలేయములో గ్లైకోజన్ విచ్ఛిన్నమై గ్లూకోస్‌గా మారుట.

**glycohaemoglobin** or **glycohemoglobin** glycosylated haemoglobin తీపితిన్న/తీపితో నిండిన రక్తరంజకద్రవ్యము. This is a finer index of judging the tempo/severity of diabetes mellitus in a patient. మధుమేహం వ్యాధి తీవ్రత నిర్ణయంలో సున్నిత సూచిక.

**glyconeogenesis** gluconeogenesis, *see*/చూడండి gluconeogenesis.

**glycoside** any compound containing a carbohydrate molecule (sugar) కార్బోహైడ్రేట్ గల పదార్థము. **digitalis g.,** plant glycoside, an alkaloid used in heart diseases డిజిటాలిస్ మొక్కయొక్క ఆకులనుండి తీసిన ఆల్కలాయిడులను గుండెజబ్బులలో వాడ్తారు.

**glycosuria** the presence of glucose in the urine మూత్రములో చక్కెర ఉండుట, *see/చూడండి* diabetes. The patient notices ants crawling over the site of urination. రోగి మూత్రముచేసిన చోట చీమలు చేరి పాకుతూ ఉండుట గమనిస్తాడు.

**glycyrrhiza** *bot.* 1. licorice, liquorice అతిమధురము, యష్టిమధురము అను మందు. the dried rhizome and roots of the leguminous plant, used as a flavoured vehicle for drugs లెగూమ్ జాతికి చెందిన, ఎండిపోయిన చెట్ల కొమ్ము మరియు వేళ్ళు – వీటినుండి తయారుచేసిన, రుచిగల పదార్థమును ఔషధములలో అనుపానముగా వాడుతారు. 2. used as a demulcent, mild laxative మంటను తగ్గించు లేప(న)ము, విరేచనకారి.

**gnathic** relating to the jaw దవుడ/దవడకు సం.

**gnathoplasty** plastic repair of the jaw, *figur.* to beautify the face దవుడ(స్వ)రూపకల్పన, ప్లాస్టిక్ ఆపరేషన్, అలంకార. అందంకోసం పాకులాట.

**goblet cells** cells in mucous membrane secreting mucus, especially in the respiratory tract, *resemblance:* wineglass శ్లేష్మ పొరలో శ్లేష్మము స్రవించే, కూజా ఆకారంలో ఉన్న ·కణములు, విశేషంగా శ్వాసవ్యవస్థ మార్గంలో ఇవి కనబడతాయి.

**goitre** or **goiter** enlargement of the thyroid gland గొంతు కణితి, థైరాయిడ్ గ్రంథి పెరుగుట. **exophthalmic g.**, Graves' disease characterised by bulging of eyeballs కన్నుగుడ్లు రెప్పలలోనుండి బయటకు పొడుచుకొని వచ్చినట్లుండుట. **iodine deficiency g.**, due to the deficiency of iodine in drinking water, prevalent in some areas in Kashmir; iodised salt advocated for use in those places త్రాగేనీళ్లలో అయొడిన్ లోపమువలన ఈ వ్యాధి కలుగును; కాశ్మీరులో కొన్ని ప్రాంతములలో కానవచ్చును. అయొడైజ్డ్ ఉప్పు వాడుక దీనికి ఒక నివారణ చర్య. **retrosternal g.**, goitre behind the sternum ఉరోస్థి వెనుక థైరాయిడ్ కణితి. **simple g.**, simple enlargement సరళమైన గ్రంథి వాపు.

**gonad** a gland which produces gametes: an ovary or testis బీజకోశము, సంయోగబీజమును పుట్టించు గ్రంథి: స్త్రీ బీజకోశము/ అండాశయము లేదా పురుషబీజకోశము/వృషణము.

**gonadotrophic** or **gonadotropic** stimulating the gonads బీజకోశములను ఉత్తేజపరచు. hormones produced by the anterior pituitary which stimulate the gonads గొనేడోట్రోఫిక్ హోర్మోన్లు పూర్వ పిట్యూటరి గ్రంథిచే స్రవింపబడుతాయి – ఇవి బీజకోశములను ఉత్తేజపరుస్తాయి.

**gonadotrophin** or **gonadotropin** follicle stimulating hormone (FSH) and luteinizing hormone (LH) which stimulate the gonads గొనేడోట్రోపిన్; పుటికోద్దీపన హోర్మోన్ మరియు లుటినైజింగ్ హోర్మోన్. **chorionic g.,** produced by placenta, the basis for pregnancy tests in urine జరాయువు ఉత్పత్తిచేయు పదార్థము; గర్భిణి స్త్రీలలో ఉండును కావున ఇది మూత్రములో విసర్జింపబడును. గర్భిణి బుజువుకు టెస్ట్.

**gonion** the angle of the mandible అధోహనుకోణము, క్రింది దవడ ఎముకయొక్క కోణము.

**goniotomy** an operation for glaucoma, *see/చూడండి* glaucoma. నేత్రకోణఛిద్రన: గ్లకోమా అను కంటి జబ్బుకు శస్త్రచికిత్స.

**gonioscopy** measuring the angle of the anterior chamber of eye with an instrument called gonioscope నేత్రకోణదర్శిని అనే పనిముట్టుతో నేత్రకోణం కొలుచుట.

**gonococcus** cause of gonorrhoea, a sexually transmitted disease by the species of the bacterium, *Neisseria gonorrhoeae* సెగ (గనేరియా) అను సుఖరోగము/ముండజబ్బు – నైస్సేరియా జాతి సూక్ష్మజీవి వలన సంభవిస్తుంది.

**gonorrhoea** or **gonorrhea** infection with the gonococcus most often transmitted venereally సెగవ్యాధి: ఈ బాక్టీరియా అంటు ఉన్న స్త్రీ సంభోగమువలన కలిగిన వ్యాధి. in males: urethritis and purulent discharge per urethra పురుషులలో: మూత్రమార్గములో 'నొప్పి వేడి మంట వాపు' మరియు పురుషాంగముగుండా చీము కారుట.

in females: usually asymptomatic but may produce salpingitis, oophoritis or tubo-ovarian abscess స్త్రీలలో: తరచుగా ఏ లక్షణములు కనబరచకుండా ఉంటుంది, కాని ఫెల్లోపియన్ ట్యూబ్ యొక్క నొప్పి వాపు, స్త్రీబీజకోశముయొక్క నొప్పి వాపు మరియు ఆ ప్రాంతంలో చీముగడ్డ సంభవించవచ్చును.

**gonorrhoeal** or **gonorrheal** resulting from gonorrhoea గనేరియా వలన కలిగే. **g. arthritis,** joint pains కీళ్ళనొప్పులు. **g. ophthalmia** one form of ophthalmia neonatorum అప్పుడే ప్రసవించిన తల్లి జననేంద్రియ గనేరియా బిడ్డ కళ్ళకు సోకి కళ్ళు కలుగుట, కంటి శోథము/'నొప్పి ఎరుపు వాపు పుసికట్టుట', వాడు.భా. కండ్లొచ్చాయి.

**goose-skin** body hairs become erect when exposed to cold or fear, due to contraction of arrector pili muscles, *see/చూడండి* arrector muscle. చలి లేదా భయము వేసినప్పుడు, ఒడలు గగుర్పాటు చెంది, రోమములు నిక్కబొడుచుకొనుట. also called goose flesh, goose pimples, goose bumps.

**gout** disease of upset in the metabolism of uric acid, *see/చూడండి* uric acid. శరీరములో యూరిక్ అమ్లము యొక్క జీవ(న) క్రియలో లోపమువలన కలుగు వ్యాధి. marked by deposits of uric acid salts in tissues and joints యూరిక్ అమ్లలవణాలు కణజాలములు మరియు కీళ్లలో జమ అవుతాయి/పేరుకొంటాయి. arthritis – usually the first/big toe becomes very painful. కీళ్లయొక్క 'నొప్పి వేడి మంట వాపు', తరచుగా కాలి బొటనవేలు వ్యథకు గురియవుతుంది. **tophi of g.,** deposition of sodium biurate in tissues, *e.g.* over the pinna of the ear, fingers యూరేట్ లవణములు కణజాలములలో జమ యగుట, ఉదా. చెవి అంచుమీద, వేళ్ళ కణుపుల దగ్గర. Colchicine, a drug gives dramatic remission in the disease process. ఈ మందు ఈ జబ్బులో శీఘ్రమైన విమోచనము కలుగజేస్తుంది.

**GP** *abbr.* general practitioner, family vaid ఇంటి వైద్యుడు.

**Graafian follicle** *see/చూడండి* follicle.

**grade** class or degree శ్రేణి. low grade fever తచ్చు/తక్కువ స్థాయిలో జ్వరం.

**graft** A. 1. piece of tissue taken from a body for transplantation into the same (autograft) ఒకే శరీరములో ఒక కణజాలము యొక్క ముక్కను ఒకచోటనుండి మరియొక చోట నాటుట. 2. organ for transplantation, *e.g.* kidney from a human donor (homograft) అవయవము ఒకరినుండి స్వీకరించి మరియొకరి శరీరములో నాటుట, ఉదా. కిడ్నీ మార్పిడి. 3. from one animal to another animal of a different species (heterograft), *e.g.* (a) baboon's heart into man (b) hog's pancreas into man (still in experimental stage) ఒక జాతి జంతువునుండి మరియొక జాతి జంతువులోనికి, ఉదా. (a) కోతిగుండె మనిషిలో (b) పంది క్లోమము మనిషిలో (ఇది ఇంకా ప్రయోగ దర్శిత/ప్రయోగాత్మక దశలో ఉన్నది). B. **corneal g.**, replacement of opaque cornea by a healthy clear cornea from a donor eye. The eye donor is respected as immortal/ever living. కిరణాభేద్యమైన/అపారదర్శకమైన శుక్లపటలముయొక్క స్థానమున దాత ఇచ్చిన సజీవమైన, స్వచ్ఛమైన శుక్లపటలమును అమర్చుట/బదులుగా పెట్టుట; ఈ కన్నుగుడ్డు దానముతో దాత చిరంజీవిగా పరిగణింపబడుతాడు. **coronary artery bypass g., (CABG),** *see/చూడండి* bypass. **skin g.,** the surgical procedure of taking skin from the thigh and grafting it over a scarred area/keloid, say after a burn. The advantage of a skin graft, apart from the cosmetic value, is that the grafted area remains more supple than the scarred area. మచ్చ/తంతుయుత త్వచము ఉన్న ప్రాంతములోని చర్మమును శస్త్రప్రక్రియద్వారా తొలగించి, ఆ స్థానములో తొడమీదనుంచి తీసిన సజీవచర్మమును అంటుకట్టడం. దీనివలన చూపునకు/దర్శనమునకు సౌష్ఠవమేగాక చర్మము మృదువుగా ఉంటుంది.

**Gram's stain** staining procedure for the identification of bacteria బాక్టీరియాను పోల్చుటకు జరుగు అభిరంజన/వర్ణీకరణ ప్రక్రియ. gram-positive organisms stained purple or black; gram-negative organisms stained pink గ్రామ్ పాసిటివ్: ఎరుపు, నీలము కలిసిన (ధూమ్రవర్ణము) లేదా నల్లని రంగుదాల్చు జీవులు. గ్రామ్ నెగెటివ్: గులాబి రంగుదాల్చు జీవులు.

**grandiose** in psychiatry, a delusion, *see/చూడండి* delusion.

**grand mal** *see/చూడండి* epilepsy. a variety of epilepsy వాడు.భా. మూర్ఛలు. అపస్మారము అనే వ్యాధిలో ఒకరీతి.

**granulation** 1. the process of wound healing by formation of granulation tissue లేతకణజాలము, కణాంకురము: ఈ పేరుగల కణజాలము ఏర్పడి గాయము నయమయే పద్ధతి. 2. the breaking of a hard substance into small granules ఒక గట్టి పదార్థము చిన్న కణికలుగా విభజింపబడుట.

**granule** grain-like particle or microscopic particle కణిక లేదా సూక్ష్మనలుసు. *naked eye str.* ప్రత్యక్ష.చూ. 1. a small particle చిన్న కణిక. 2. a tiny sand particle సన్నని ఇసుక రేణువు. 3. a small pill made from sucrose సుక్రోస్ గుళిక. *micro.str.* సూక్ష్మ.చూ. **eosinophil g's,** those staining rose-red with eosin (a dye), present in the leucocyte, eosinophil ఇసనోఫిల్ అను తెల్లరక్తకణములో నుండు ఎర్రని/రోజారంగు కణికలు. **neutrophil g's,** in a polymorphonuclear leucocyte న్యూట్రోఫిల్ అను తెల్లరక్తకణములోని సూక్ష్మకణికలు. **oxyphil g's,** acidophil g's in the cells in the parathyroid glands పారాథైరాయిడ్ గ్రంథి కణములలోని కణికలు. **pigment g's,** colouring particles in pigment matter రంగుపదార్థములోని రంగునిచ్చే కణికలు.

**granulocyte** granular leucocyte కణికాభకణము, కణికలుగల తెల్లరక్త కణము. *e.g.* neutrophil, eosinophil, basophil *ఉదా.* ఈ పేర్లుగల కణములు.

**granulocytopenia** a decrease in the number of circulating granulocytes in the blood రక్తప్రవాహములోనున్న కణికాభకణాల యొక్క సంఖ్య తక్కువగుట.

**granulocytopoiesis** *see/చూడండి* granulopoiesis.

**granulocytosis** an increase in the number of circulating granulocytes in the blood రక్తప్రవాహములోనున్న కణికాభకణాల యొక్క సంఖ్య ఎక్కువగుట.

**granuloma** [granulomas, granulomata *pl.*] an imprecise term సూక్ష్మకణిక గుల్మం. ఖరాగాలేని/బహుళనిర్వచన పదము. 1. any nodular inflammatory cell collection ఏదైనా కణుపు/కంతిలాంటి

వాపుకణముల సముదాయము. 2. resembling granulation tissue గ్రాన్యులేషన్ కణజాలమువలె నున్నది. 3. a collection of macrophages surrounded by a rim of lymphocytes (near in description to giant cell systems in tuberculosis) చుట్టూరా లింఫ్ కణములు, మధ్యలో మహాభక్షులు – (ఇలాంటి సముదాయమునకు, క్షయవ్యాధిలో బృహత్కణ నిర్మాణ నమూనాకు దగ్గర పోలిక ఉన్నది). **chronic infective g,** (a) tuberculosis క్షయవ్యాధి (b) syphilis కొఱుకు సవాయి రోగం. **eosinophilic g,** i) of bone అస్థి యొక్క ii) of stomach అన్నాశయము యొక్క iii) of lung ఊపిరితిత్తి యొక్క గ్రాన్యులోమా. **g. inguinale,** a sexually transmitted disease ఒక సుఖరోగము. **pyogenic g.,** nodule resembling granulation tissue గ్రాన్యులేషన్ కణజాలములబోలిన కణుపు.

**granulomatosis** the formation of multiple granulomas పెక్కు గ్రాన్యులోమాలు ఉత్పత్తియగుట. **Wegener's g.,** necrotising granulomas in the respiratory tract, vasculitis, glomerulonephritis శ్వాసవృక్షములో గ్రాన్యులోమాలు, రక్తనాళముల వాపు, కిడ్నీజబ్బు; అన్నిచోట్లా కణజాలములు చచ్చుబడతాయి, దేహభాగముల నాశము కలుగుతుంది.

**granulopoiesis** granulocytopoiesis. production of granulocytes, chiefly in the red bone marrow of flat bones గ్రాన్యులోసైట్ల ఉత్పత్తి, ముఖ్యంగా పలచని ఎముకల ఎర్ర అస్థిమజ్జలో.

**gravel** urinary calculi disintegrating into small granules – pain during their passage మూత్రాశయములో రాళ్ళు విచ్ఛిన్నమై చిన్న, సన్న రేణువుల రూపంలో మూత్రమార్గంనుంచి బహిష్కరింపబడుట – ఈ వేదనను సూచిస్తూ ఉన్న స్థితిని మూత్రకృచ్ఛ్రరోగము అంటారు.

**Graves' disease** thyrotoxicosis; exophthalmic goitre in hyperthyroidism, *see/చూడండి* exophthalmos.

**gravid** pregnant గర్భిణితో ఉన్న. *idiom:* She is in the family way. వాడు.భా. కడుపుతో ఉన్న.

**gravida** a pregnant woman గర్భిణి స్త్రీ. primigravida or simply primi during first pregnancy తొలిచూలు, వాడు.భా. తొలుచూరు.

secundigravida during second pregnancy మలు/మలు/మలిచూలు, రెండవ చూలు. multigravida బహుగర్భ.

**gray** or **grey matter** 1. a slang term used to denote the essence in the brain, brain=మెదడు. మెదడులోని బూడిద రంగు పదార్థము, కణభాగము; గ్రాంథిక భాష బుద్ధికుశలత. వాడు.భా. బుర్ర, పుర్రె: కాని వీటి నిఘంటువు అర్థము కపాలము (skull, cranium). [*Cf.* white matter *తారత.* శ్వేతపదార్థము, నాడీ తంతువులు]. 2. hair turning gray/ash-coloured వెంట్రుకలు నెరయుట. *N.B.* Grayness is a sign of greatness; that is why some people dye their hair gray. *గమనిక:* నెరసిన జుట్టు నెలవాడి లక్షణం; అందుకనే కొందరు మేధావులు కావాలని ఆ రంగు వేసుకుంటారని భోగట్టా/వినికిడి.

**gripe** *verb.* feel or cause sudden sharp pain in the stomach or intestines, *e.g.* in diarrhoea. నులిపెట్టు, కుట్టుపట్టు (బాధ) అన్నాశయంలోగాని లేదా పేగుల్లోకాని, *ఉదా.* అతిసారము/విరేచనములు.

**the gripes** *n.pl.* sharp pain in the intestines, *etc.* పేగుల్లో పిసికినట్లు, బిగబట్టినట్లు నొప్పులు.

**gripe-water** medicine to cure stomach or intestinal pain in babies చంటిపిల్లల్లో పొట్టలో కుట్టునొప్పికి ఔషధం.

**grippe** flu, influenza ఫ్లూ, *figur.* He is in the grip of grippe. అలంకార. ఫ్లూ అనే వ్యాధిపంజరములో చిక్కుకున్నాడు.

**grittiness** [gritty *adj.*] gritty feeling, sandy feeling, *see/చూడండి* microlithiasis. ముట్టుకుంటే ఇసకలాగా గరగరలాడుతూ తగలటం.

**groin** inguinal region; the space between the abdomen and thigh *గజ్జ.* **g. lymph nodes,** inguinal lymph nodes *వాడు.భా.* గజ్జల్లో బిళ్ళలు.

**group** one of the groups into which human blood is classified మనిషి రక్తంయొక్క వర్గీకరణం. **blood g.** *see/చూడండి* blood group. రక్తవర్గం, రుధిరవర్గం, బ్లడ్ గ్రూప్.

**growth** 1. biological growth; increase in size పెరుగుదల, ఎదుగుదల. 2. an abnormal proliferation of tissue, as in tumour కణజాలముల యొక్క అసాధారణ పెరుగుదల, *ఉదా.* కంతి. 3. the growth of

microorganisms/cells in a culture medium, *see/చూడండి* culture. వృద్ధి, సంవర్ధనము/పోషకాహారములో పెరుగు సూక్ష్మజీవులు/కణములు. **g. hormone,** produced by pituitary gland పిట్యూటరీ గ్రంథి స్రవించే మరియు పెరుగుదలనిచ్చే హార్మోన్. శరీరవృద్ధిని అదుపులో పెడుతుంది. **new g.,** neoplasm, benign or malignant నిరపాయ లేదా అపాయకరమైన కంతి.

**gubernaculum** a guiding structure దారిచూపే నిర్మాణము. **g. testis,** a foetal ligament, a vestige at the lower end of the testis వృషణము దిగువనున్న అవశేషము – ఒక భ్రూణబంధకము/స్నాయువు.

**guillotine** [In France it was used for decapitation of criminals]. a surgical device with a sliding blade, the edge of which sweeps a clean cut of a tonsil or uvula ఛేదించే యంత్రం/సాధన: టాన్సిల్‌నుగాని కొండనాలుక/చిన్నాలుకనుగాని ఒక జరిగే బ్లేడ్‌తో కసుక్కున నరుకు శస్త్రసాధనము.

**guinea worm** *see/చూడండి* Filaria. *Dracunculus medinensis* నారికురుపు కలుగజేయు పురుగు.

**gullet** the oesophagus, the food tube, అన్నవాహిక, ఆహారనాళము. *figur.* gulp tube అలంకార. గుటుక్కున గుటకతో మింగు తోవ/నాళము.

**gum** 1. gingiva, the tissue that supports the teeth ఇగురు, చిగురు, పండ్లకు ప్రాపు. 2. adhesive substance derived from plants తుమ్మ జిగురు. **chewing g.,** pasty, sticky 'time-pass' eatable, employed in chewing spree by urchins బంకపదార్థము: పండ్లక్రింద నములుతూ, నానబెడుతూ ఉన్న దృశ్యం. పిల్లల్లో పరిపాటి. **g. boil,** an abscess on the gum చిగురుమీది చీముగూడు.

**gumma** (tertiary) third stage of syphilis. Any organ/tissue may be affected with gumma, a gummy tumour. కొరుకు సవాయి రోగంయొక్క మూడవదశలో సంభవించు మెత్తటి కంతి – ఇది ఏ అవయవము/కణజాలమునకైనా సంక్రమించవచ్చును.

**gustatory** relating to gustation, or taste రుచికి సం. అలంకార. రసజ్ఞ రుచికి ఆలవాలం.

**gut** 1. the intestine or bowel కడుపు/పొట్ట లోని పేగు. 2. catgut, the material used for suturing muscles and tissues, *see*/చూడండి catgut. కండరములను మరియు కణజాలమును కుట్టే నారలాంటి దారము. 3. Gut, an international journal in gastroenterology వైద్యవార్తా పత్రిక.

**gutta** 1. a drop బిందువు. 2. **g. percha,** useful as a dental cement.

**guttural** relating to the throat గొంతుకు సం., సప్తపథకు సం.

**gymnasium** 1. *colloq.* gym – a place for physical training; training body muscles శరీరవ్యాయామశాల. 2. Gymnasium, a secondary school in the European countries, in the past పూర్వపు రోజుల్లో యూరప్ దేశాల్లో మాధ్యమిక పాఠశాల.

**gynaec** or **gynec** *sl./abbr.* for gynaecology. వాడు.భా.సంకేతము. స్త్రీజననేంద్రియ వ్యాధుల శాస్త్రము.

**gynaecoid** or **gynecoid** womanish, characteristic of a woman స్త్రీ స్వాభావికమైన. **g. pelvis,** pelvic cavity in a woman స్త్రీ అంశముగల/స్వాభావికమైన కూపకము/కటికుహరము.

**gynaecologist** or **gynecologist** one who specialises in the diseases of women స్త్రీ జననేంద్రియ/ప్రత్యుత్పత్తి అవయవాల వ్యాధులలో నిపుణత గల డాక్టరు.

**gynaecology** or **gynecology** the study of the generative/reproductive organs in the female and their diseases స్త్రీ జననేంద్రియ/ప్రత్యుత్పత్తి అవయవాలను గురించి మరియు వాటికి వాటిల్లు వ్యాధులు తెలుసుకునే శాస్త్రము.

**gynaecomastia** or **gynecomastia** 1. enlargement of breasts in a male మగవానిలో స్తనవృద్ధి, పురుషులలో స్తనములు పెద్దవగుట. 2. a side effect of a drug, *e.g.* isoniazid (INH), an anti-tuberculous drug మందుయొక్క అవాంఛనీయ ప్రభావము, ఉదా. టి.బి. కొరకు ఐ.ఎన్.హెచ్. అనెడు మందు వాడిన తర్వాత.

**gyrectomy** surgical removal of a gyrus సంవలిత వికలత/విచ్ఛేదము: మెదడులోని సంవలితమును శస్త్రచికిత్సద్వారా తొలగించుట.

**gyrus** [gyri *pl.*] one of the convolutions of the cerebral cortex of the brain మెదడులోని మస్తిష్క వల్కలము మీద/యొక్క మెలికలు తిరిగిన సంవలితాలు (convolutions). **cerebral gyri,** the convolutions on the surface of the cerebral hemisphere మస్కిష్కగోళార్ధముమీద సంవలితాలు. **frontal g.,** one in the frontal lobe లలాటిక లంబికలోని సంవలితము. **occipital g.,** one in the occipital lobe అనుకపాల లంబికలోని సంవలితము. **temporal g.,** one in the temporal lobe (కణత భాగపు) శంఖ లంబికలోని సంవలితము.

# H h

**habit** a practice done often which is automatic and difficult to abstain from/refrain from అలవాటు; తరచుగా ఆచరించే, మాను కొనుటకు/ఆపుటకు వీలుకాని, స్వయంప్రవర్తక చర్య. **drinking h.** త్రాగుడుకు అలవాటుపడుట. **drug h.,** an addiction, especially to narcotics, *see/చూడండి* addiction. మాదకద్రవ్య లోలత్వం. **smoking h.** పొగపీల్చుట (సిగరెట్, బీడి) వాడు.భా. సిగరెట్ తాగడం, చుట్ట/బీడి కాల్చడం అంటారు.

**habitat** the natural abode of an animal/parasite నివాసస్థానం: పరాన్నజీవికి ఆవాసము/ఉనికి.

**habitation** place of living తావు, వాసస్థానము, నివాసము.

**habit-forming** resulting in addiction, usually drug addiction వ్యసన లోలత్వం, తరచుగా మందుకు అలవాటుపడిన స్థితి.

**hacking cough** harsh, short, dry persistent cough, *see/చూడండి* cough. కరుకైన, పొడి దగ్గు. కొద్దిపాటిగా, విడువకుండా ఉండే దగ్గు.

**haem** or **heme** the iron compound which combines with the protein globin to form haemoglobin ప్రోటీన్ గ్లోబిన్‌తో కలిసి హెమొగ్లోబిన్ అయే ఇనుము పదార్థం. This gives red colour to red blood cells. ఎఱ్ఱరక్తకణములకు ఎఱ్ఱరంగునిస్తుంది.

**haema-** or **hema-** combining form meaning blood.

**haemagglutinin** or **hemagglutinin** an antibody that causes agglutination of red blood cells ఎఱ్ఱరక్తకణములయొక్క గుచ్ఛకరణము చేయు ప్రతిరక్షకము. **cold h.,** test done at 4°C (temperature in the refrigerator). **warm h.,** test done at 37°C (normal body temperature).

**haemangioblastoma** or **hemangioblastoma** a benign cerebellar neoplasm/tumour composed of capillary vascular endothelial cells అనుమస్తిష్కము/చిన్నమెదడులో రక్తకేశనాళికల అంతరస్థకణ నిరపాయ కంతి.

**haemangioma** or **hemangioma** benign tumour of the blood vessels రక్తనాళముల నిరపాయ కంతి.

**haemarthrosis** or **hemarthrosis** accumulation of blood in a joint కీలులో రక్తము కూడుకొనుట.

**haemat-** or **hemat-** combining form meaning blood.

**haematemesis** or **hematemesis** blood in vomit, especially from the stomach or oesophagus వాంతిలో రక్తము, ముఖ్యముగా అన్నాశయము లేదా అన్నవాహిక నుండి.

**haematic** or **hematic** 1. relating to blood రక్తమునకు సం. 2. a haematinic, *see/చూడండి* haematinic.

**haematin** or **hematin** a bluish or brownish derivative of haemoglobin హెమొగ్లోబిన్ యొక్క నీలి లేదా నీరుకావి రంగుగల ఉత్పన్నం (derivative).

**haematinic** or **hematinic** an agent that increases haemoglobin and red blood cells రక్తవర్ధిని: రక్తరంజక ద్రవ్యమును మరియు ఎర్రరక్తకణములను వృద్ధిజేయు వస్తువు.

**haemato-** or **hemato-** combining form meaning blood.

**haematocele** or **hematocele** in males: accumulation of blood in the scrotal sac బుడ్డలో రక్తము. in females: **pelvic h.**, blood in the pouch of Douglas యోనిపైని జోలిలో రక్తము గూడుకట్టుట.

**haematocolpos** or **hematocolpos** accumulation of blood in vagina యోనిలో రక్తము చేరుట.

**haematocrit** or **hematocrit** 1. volume percentage of RBCs in whole blood రక్తములోని ఎర్రరక్తకణ శాతము. 2. apparatus determining the above parameter పై విలువ కనిపెట్టు సాధన(ము).

**heamatogenous** or **hematogenous** dissemination (scattering into other organs) through the blood stream రక్తనాళములద్వారా మిగత అవయవములకు వెదజల్లబడుట. 1. disseminated (second) stage in tuberculosis; miliary and meningeal tuberculosis క్షయ వ్యాధి రెండవదశలో క్షయబాసిల్లై ఈ విధముగా వెదజల్లబడి మరికొన్ని అవయవములలో జబ్బును నాటుట; ఒక ప్రాంతము: మెదడు మీద పొర (meninges). 2. disseminated haematogenous carcinomatosa కేన్సరు కణములు రక్తముద్వారా అవయవములకు వెదజల్లబడుట.

**haematology** or **hematology** study of blood and blood forming tissues రక్తముయొక్క మరియు రక్తజనన కణజాలములయొక్క శాస్త్రము.

**haematolysis** or **hematolysis** hemolysis రక్తము విచ్ఛిన్నమగుట.

**haematoma** or **hematoma** collection of clotted blood in an organ/region, *e.g.* **subdural h.** రక్తపుగడ్డ: గడ్డకట్టిన రక్తము ఒక అవయవములోగాని ఒక ప్రాంతములోగాని గూడుకట్టుకొనుట, ఉదా. పరాశిక అడుగునగూడిన రక్తపు ముద్ద.

**haematometra** or **hematometra** accumulation of blood in the uterus గర్భాశయములో రక్తము గూడుకట్టుకొనుట.

**haematopoiesis** or **hematopoiesis** *see/చూడండి* haemopoiesis.

**haematosalpinx** or **hematosalpinx** accumulation of blood in the uterine (Fallopian) tube ఫెల్లోపియన్ నాళములో రక్తము జమ అగుట.

**haematuria** or **hematuria** passing blood in urine మూత్రములో రక్తము పోవుట. There are two important causes: filariasis, tuberculosis. రెండు ముఖ్యకారణములు: ఫైలేరియా, క్షయవ్యాధి.

**haeme** or **heme** the pigment portion of haemoglobin రక్తరంజక ద్రవ్యములో రంజకపదార్థము.

**haemo-** or **hemo-** combining form meaning blood.

**haemochromatosis** or **hemochromatosis** bronze diabetes: deposition of iron in tissues, bronze pigmentation of skin, hepatic cirrhosis and diabetes mellitus కణజాలములలో ఇనుము లవణములు చేరుట, చర్మమునకు కంచురంగు, కాలేయము గట్టిపడి క్షయించుట మరియు మధుమేహం – ఇవన్నీ కలిసియున్న జబ్బు.

**haemocytoblast** or **hemocytoblast** the free stem cell from which other blood cells are derived ఆది/మూల రక్తకణం.

**haemocytometer** or **hemocytometer** or **hemacytometer** an instrument for counting the number of blood corpuscles రక్తకణములను లెక్కపెట్టే పనిముట్టు.

**haemodialysis** or **hemodialysis** *colloq.* artificial kidney వాడు.భా. కృత్రిమపు కిడ్నీ. In a patient with kidney failure, blood is allowed to flow into a machine containing a membrane for diffusion of the waste products, and the purified blood is returned to the patient. కిడ్నీజబ్బు ఉన్నరోగిలోని రక్తము ఒక యంత్రములోనికి వెళ్ళనిస్తారు. అక్కడ విసర్జింపవలసిన పదార్థములను వరణాత్మక విసరణపద్ధతి (dialysis)లో విడదీసి, వాటిని ఒకపొర మీద వ్యాపించుట (diffusion) కు ప్రయత్నిస్తారు. తరువాత శుద్ధమైన రక్తమును తిరిగి రోగిలోనికి పంపిస్తారు. ఈ dialysis ను హంసక్రియ లేదా సారాసార వివేకం అంటారు. అలంకార. హంస పాలను నీళ్ళను వేరుచేస్తుంది.

**haemoglobin** or **hemoglobin** the oxygen carrying pigment in the erythrocytes రక్తవర్ణం, రక్తరంజకద్రవ్యము, రక్తములోని ఎర్రకణములకు రంగునిచ్చు పదార్థము.

**haemoglobinometer** or **hemoglobinometer** an instrument for estimating the percentage of haemoglobin in the blood రక్తంలో హెమొగ్లోబిన్ శాతం కనిపెట్టే పనిముట్టు.

**haemoglobinuria** or **hemoglobinuria** the appearance of free haemoglobin in the urine, *e.g.* as in paroxysmal nocturnal haemoglobinuria మూత్రములో రక్తరంజక ద్రవ్యము కనబడుట, ఉదా. ఈ పైజబ్బు.

**haemolysis** or **hemolysis** the liberation of haemoglobin after lysis of red cells రక్తవిచ్ఛిన్నం: ఎర్రకణములు విచ్ఛిన్నమై రక్తరంజక ద్రవ్యము రక్తములో కనబడుట.

**haemopericardium** or **hemopericardium** accumulation of blood in the pericardium గుండెమీది పొరలో రక్తం చేరుట/జమ అగుట.

**haemophilia** or **hemophilia** disease due to AHG (antihaemophilic globulin; factor VIII) deficiency - a hereditary disease of males; haemorrhages occurring due to deficiency of a blood coagulation factor రక్తములో గడ్డకట్టు గుణముగల కారకముయొక్క లోపము

వలన కలుగు రక్తస్రావము. ఇది పురుషులలోనే వంశపారంపర్యముగా సంక్రమించు వ్యాధి.

**Haemophilus** or **Hemophilus** Haemophilus influenzae A,B and C types ఫ్లూ: ఇన్‌ఫ్లూయన్‌జా అను వైరస్ వలన కలుగు జబ్బు.

**haemopoiesis** or **hemopoiesis** haemo = blood; poiesis = production – the formation of blood (cells) రక్తకణోత్పాదనం.

**haemoptysis** or **hemoptysis** coughing out blood in sputum రక్తకఫరోగము, దగ్గులో రక్తముపడుట. The commonest cause in our country is pulmonary tuberculosis. మనదేశములో ముఖ్యకారణము ఊపిరితిత్తుల క్షయవ్యాధి.

**haemorrhage** or **hemorrhage** bleeding from vessels రక్తస్రావం: రక్తనాళములనుండి రక్తము కారుట. **capillary h.,** oozing from capillaries రక్తకేశనాళికలనుండి స్రవించు నెత్తురు. **cerebral h.,** bleeding into the cerebrum మస్తిష్కములోన నెత్తురు కారుట. **intrapartum h.,** bleeding during delivery కాన్పులో రుధిరస్రావము. **postpartum h.,** bleeding soon after child birth ప్రసవోత్తర రక్త స్రావము, శిశువు తల్లియొక్క యోనిలోనుండి భూమిమీదకు రాగానే, తల్లి గర్భాశయమునుండి రక్తస్రావము. *N.B.* Haemorrhage anywhere is alarming. *గమనిక:* రక్తంచూస్తే బెదరు సహజం.

**haemorrhoidectomy** or **hemorrhoidectomy** excision of piles శస్త్రచికిత్సచేసి అర్శ మూలలను ఛేదించుట.

**haemorrhoids** or **hemorrhoids** piles; మూలవ్యాధి, అర్శ మూలలు, వాడు.భా. అర్శమొలలు. varicose dilatation of vein/veins in the vicinity of the anus, *see/చూడండి* piles. ఆసనము దగ్గర ఉబ్బి మెలికలు తిరిగిన సిర/సిరలు. **external h.,** those palpable at the margin of the anus గుదము అంచున చేతికి తగిలేవి. **internal h.,** inside and little above the anal opening ఆసనములోపల కొంచెము లోతుకి తగులు మూలలు. associated with intense pain and bleeding తీవ్రబాధతోకూడి రక్తము చిందించే మూలలు.

**haemosiderin** or **hemosiderin** iron salts stored in tissues కణజాలములలో చేరిన ఇనుప లవణములు.

**haemosiderosis** or **hemosiderosis** an increase in the tissues of the reserve of iron stores కణజాలములలో ఇనుప లవణములయొక్క అధిక్యత. **pulmonary h.**, deposition of haemosiderin in the lungs ఊపిరితిత్తులలో హీమోసిడరిన్ జమ అగుట.

**haemostasis** or **hemostasis** [haemostatic *adj.*] arrest of haemorrhage రక్తస్తంభన, రక్తస్రావము నిలుపుట, రుధిర ప్రతిబంధము.

**haemostat** or **hemostat** 1. an agent/drug which stops bleeding రక్తము కారుటను అరికట్టు సాధనము/ఔషధము. 2. a device, for *e.g.* a clamp to occlude a vessel ఒక పన్నుగడ/ఉపాయము, ఉదా. రక్తనాళమును బంధించు పటకారు.

**haemostatic** or **hemostatic** styptic, arresting haemorrhage రక్తస్తంభకి: రక్తస్రావం ఆపునది.

**haemothorax** or **hemothorax** collection of blood in the pleural cavity ఊపిరితిత్తిపైన పొరలమధ్య నెత్తురు కూడుట; పుపుసావరణ కుహరములో నెత్తురు జమ అగుట.

**Hahnemann** founder/father of homeopathy, *see/చూడండి* homeopathy హానెమన్, హోమియోపతిపిత.

**hair** pilus; threadlike structures growing from the skin of mammals క్షీరదములు అనగా పాలిచ్చు జంతువులలో చర్మములో జనించు వెంట్రుకలు; రోమములు. *naked eye str.* ప్రత్యక్షచూ. **body h.**, in males: thick body hair, a mannish feature శరీరముమీద, విస్తారముగా వెంట్రుకలుండుట ఒక పురుషలక్షణము. **h. over the beard and moustache,** a mannish symbol గడ్డాలు (గడ్డముమీద వెంట్రుకలు) మీసాలు పురుష చిహ్నములు. *figur.* These arouse erotic feelings in the woman, besides the cosmetic effect. అలంకార. ఇవి పురుషుడికి సొగసునిచ్చును, స్త్రీకి కామవిషయికమైన ఉద్రేకము కలిగించును. **pubic h.**, hair over the private parts గుహ్య అవయవముల ప్రాంతములోనున్న వెంట్రుకలు. in males: thick and bushy పురుషులలో మందముగాను, గుబురుగాను ఉండును. in females: thin and sparse స్త్రీలలో దట్టముకాకుండా, ఎడమెడముగా ఉండును. **scalp h.,** Besides adding grace to the face in both sexes; especially in men, the erotic feelings arouse in direct proportion to the

beauty/grandeur of the hair style maintained by women. *figur.* Beauty is embedded in the hairdo/coiffure, beauty flows in her plait. స్త్రీ పురుషుల్లో శిఖలు (తలవెంట్రుకలు) శృంగారము/సొగసు నిస్తాయి; అంతేగాక, ముఖ్యముగా పురుషులలో స్త్రీల కేశాలంకారము ఎంత రాణించుతుంటే అంత కామోద్రేకమును రేకెత్తిస్తుంది. అలంకార. కేశముల అందం కొప్పుముడిలో దాగి ఉంటుంది, వారు నడుస్తున్నప్పుడు జడలో ఒలకబోసుకుంటుంది. *micro.str.* సూక్ష్మ.చూ. **h. cells,** in the organ of Corti in the inner ear రోమకణములు, లోపలిచెవిలో సూక్ష్మనూగు.

**half-life** the time taken for half the administered dose of a substance to disappear from the body అర్ధాయువు; శరీరములోనికి వచ్చిన పదార్థములో సగము వినియోగింపబడి మిగతాసగము మిగులుట – దీనికి పట్టే కాలము. **antibody h-l.,** time required for 50 percent of antibodies to disappear శరీరములో తయారైన ప్రతిరక్షకాలు సగము ఉపయోగపడి మిగతాసగము మిగులుట – దీనికి పట్టిన కాలము. **biological h-l.,** time required to eliminate one half of an administered radioactive substance శరీరములోని ఎక్కించిన రేడియో ధార్మిక శక్తిగల పదార్థములోని సగము త్రోసివేయబడుటకు పట్టినకాలము. **drug h-l.,** time required for half the administered dose to be metabolised in the body సేవించిన ఔషధములో సగము మోతాదు జీవ(న)క్రియకు అహుతి కావడానికి పట్టిన సమయము.

**halitosis** 1. bad-smelling breath నోటి దుర్వాసన, కంపుకొట్టు నోరు *see/చూడండి* bronchiectasis. 2. oral sepsis and pyorrhoea alveolaris నోటిలోపుండ్లు మరియు చిగుళ్ల జబ్బు. 3. smoker's mouth పొగపీల్చు/త్రాగు వాళ్ళనోట్లో దుర్వాసన.

**hallucination** perception of a sense without stimulation, especially noticed in some mental disorders *e.g.* విభ్రమము; ముఖ్యముగా కొన్ని మానసిక పరిణామములలో ప్రేరేపణ లేకుండానే ఇంద్రియజ్ఞానము కలుగుట. experience of (మానసిక భ్రాంతి) sound (శబ్ద) touch (స్పర్శ) sight (రూప) taste (రస) smell (గంధము)ల అనుభవము.

**hallucinogen** [hallucinogenic *adj.*] a drug that causes hallucination, *see/చూడండి* hallucination. భ్రాంతికారక పదార్థం. విభ్రమము కలిగించే మందు.

**hallux** hallus. big/great toe పాదము బొటన/మొదటి వేలు. **h. rigidus,** stiff toe due to osteoarthritis బిర్రెక్కిన బొటనవేలు. **h. valgus,** great toe bent towards the other toes బొటనవేలు మిగతవేళ్ల వైపుకి వంగి యుండుట. **h. varus,** big toe bent towards the other foot మొదటి వేలు రెండవపాదము వైపుకి వంగియుండుట.

**hammer** malleus, *see/చూడండి* malleus.

**hamstring** one of the tendons at the back of the knee, the contraction of which helps bend the knee జానువువెనుకనున్న ఒక కండరస్నాయువు. ఈ కండరము మోకాలు ముడుచుటలో పాల్గొంటుంది.

**hand** manus. the extremity of the upper limb comprising the wrist (carpus) palm (metacarpus) and fingers కరము, చేయి, హస్తము: మణికట్టు (మణిబంధాస్థి), అరచేయి (కరాంగుళ్యాధారాస్థి) మరియు వేళ్ళు. **claw h.,** hand in leprosy కుష్ఠరోగియొక్క ముడుచుకుపోయిన చేయి. **drop h.,** wrist drop చేయి కండరముల పక్షవాతమువలన కలిగిన, పడిపోయిన చేయి. **h. shake,** *colloq.* shake hands, a gesture of goodwill కరచాలనం, ప్రియభావ సూచన/వెల్లడి.

**handicap** any physical or mental defect, congenital or acquired, hindering the activity, *e.g.* physically handicapped ప్రతిబంధము: చురుకుదనమును అరికట్టే, పుట్టుకతో వచ్చినదిగాని లేదా తరువాత సంభవించినదిగాని అయిన, శారీరకంగా గాని లేదా మానసికంగాగాని ఉన్న లోపము, ఉదా. వికలాంగులు.

**hangnail** a thorn-like structure by the side of the finger nail at its edge, a highly painful condition చేతి వేలిగోరు ప్రక్క అంచున పెరిగే ముల్లులాంటి నిర్మాణము – ఇది తీవ్రమైన తీపుతో కూడిన గోటి అస్వస్థత, అలంకార. కోతిపుండు బ్రహ్మరాక్షసి.

**hang-over** headache, nausea, *etc.* occurring as an after effect of excessive alcohol intake, *colloq.* binge. శేష దుష్ప్రభావం:

తప్పుతాగిన తర్వాత తలనొప్పి, డోకు/వాంతి వచ్చునట్లుండుట – ఇత్యాది పర్యవసాన పరిణామములు/పరిస్థితి.

**Hansen's disease** leprosy, an infectious disease caused by *Mycobacterium leprae* మైకోబాక్టీరియమ్ లెప్రె వలన కలుగు అంటు వ్యాధి – కుష్ఠ/కుష్ఠురోగము.

**hapten** partial antigen; a nonprotein అసంపూర్ణమైన ప్రతిజనకము – ఇది ప్రోటీన్ కాదు.

**hare lip** upper lip with a cleft, may be single or double, of congenital origin; often associated with cleft palate తొర్రి పెదవి: పై పెదిమలో తొర్ర(లు); పుట్టుకతో ఉన్న పరిణామము/లోపము. దీనితోపాటు అంగిట్లోకూడా తొర్ర ఉన్నట్లయితే తొస్సిపలుకు/మాట వస్తుంది.

**harvest** preservation of donor tissue/cells for transplantation into the person who needs them, *resemblance:* plantation దాతయొక్క కణజాలము/కణములు దాచుట. వీటిని అవసరము వచ్చినప్పుడు ఇంకొకరిలో నాటుటకు వినియోగించవచ్చును, పోలిక: పొలములో నారు నాటినట్లు.

**hashish** dried leaves and tender parts of the hemp plant, for chewing/smoking – a narcotic drug గంజాయి, నములటానికి/పొగ పీల్చడానికి – మాదకద్రవ్యము.

**haunch** fleshy (muscular) part of the buttock and thigh రొండి. **h. ache** రొండి నొప్పి/తీపు.

**haustration** 1. formation of a haustrum గూడు రూపొందుట. 2. haustrum, a recess గూడు. a recess in the wall of the colon: this is an X-ray finding పెద్దపేగుయొక్క గోడలో గూడు: ఇది ఎక్స్‌రే ఫోటోలో కనపడుతుంది.

**Haversian or haversian** relating to structures in bone ఎముకలోని నిర్మాణములకు *సం. micro.str.* సూక్ష్మ.చూ. **H. canal,** microscopic channels in compact bone దట్టమైన/సాంద్రమైన ఎముకలో సూక్ష్మ కుల్యలు (కుల్యకలు). **H. system,** osteon in bone ఎముకలో హెవర్షియన్ సముదాయము.

**hay fever** an allergic reaction characterised by an acute inflammation of the eyes and respiratory tract caused by air borne pollens, *see/చూడండి* allergy. కసవువల్ల వచ్చే జ్వరం: పుప్పొడి పీల్చుట వలన కలుగు ఎలర్జి ప్రక్రియ. దీనివలన కండ్లు మరియు శ్వాసవృక్షముయొక్క తీవ్రమైన 'నొప్పి వేడి మంట వాపు' ఏర్పడుతుంది/సంభవిస్తుంది.

**hazard** danger, risk అపద, హాని. **occupational h.** వృత్తికి సం. అపద. **radiation h.** వికిరణ విపత్తు, వికిరణకు సం. అపద.

**HCG** *abbr.* human chorionic gonadatrophin. chorionic gonadotrophin. anterior pituitary-like substance, produced by the placental trophoblastic cells పూర్వ పిట్యూటరివలె నుండే పదార్థం. prepared from the urine of pregnant women గర్భిణి స్త్రీల మూత్రంనుండి తయారుచేస్తారు.

**HDL** *abbr.* high density lipoproteins హెచ్చు సాంద్రతగల లైపో ప్రోటీన్లు. HDL is good/protective cholesterol [*in contr.* LDL is bad cholesterol].

**head** caput తల, తలకాయ, శిరస్సు. 1. the part of the body supported by the neck మెడపైన ఉన్న తల. 2. the upper part of a structure, *e.g.* **h. of the humerus** ఒక నిర్మాణము యొక్క పైభాగము, ఉదా. భుజాస్థియొక్క పైభాగము. **h. of the pancreas** క్లోమముయొక్క తలభాగము.

**headache** pain in the head, తలనొప్పి, శిరోభారం. **h. due to eye strain,** headache on reading, eye strain and watering of eyes. Testing of vision and prescription of glasses is the remedy. చదువుతుంటె తలనొప్పి, ప్రయాస మరియు కళ్ళునీరుగారుట; చూపును పరీక్షచేసి కళ్ళద్దములు నియమించుట దీనికి నివారణోపాయము **h. due to sinusitis,** due to inflammation of sinuses in the skull, usually unilateral but may be bilateral కపాలములోని కుహరముల 'నొప్పి వేడి మంట వాపు'. ఒకవైపు బాధ ఉన్నప్పుడు దీనిని పార్శ్వపునొప్పి అంటారు; రెండువైపులగూడ బాధ పీడించవచ్చును. **cluster h.,** paroxysmal nocturnal cephalalgia occurring during REM sleep తెరలు తెరలుగా రాత్రులయందు వచ్చే తలనొప్పి. **meningeal h.,**

*see/చూడండి* meningitis. **migraine h.**, *see/చూడండి* migraine. **tension h.**, due to tension in lifestyle దినచర్య/జీవితధోరణిలో అదుర్దా వలన తలనొప్పి. **tumour h.**, due to space-occupying intracranial tumour కపాలములో కంతివలన తలనొప్పి.

**Heaf test** a test done in the field of tuberculosis, using an intradermal 'gun' టి.బి. జబ్బు విషయంలో చేసే టెస్ట్; చర్మంలోనికి గుచ్చి చేస్తారు.

**heal** restore health స్వస్థత చేకూర్చు. 1. Time heals all wounds. గాయం నయమవటానికి టైమ్ పడుతుంది. 2. Time heals all sorrows. కాలం దుఃఖాన్ని తొలగించేస్తుంది.

**healing** process of cure of a disease రోగము నయమగుట.

**health** A. 1. maintenance of a state of physical and mental well-being; in the pink of health; glow with health ఆరోగ్యము, స్వస్థత, శారీరక మరియు మానసిక సుస్థిరత నిలుపుకొనుట, ఆరోగ్యముతో తులతూగుట. 2. freedom from disease రుగ్మత లేకుండుట. (a) WHO definition 'Health is a state of complete physical, mental and social well-being and not merely the absence of disease or infirmity' ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్వచనము: ఆరోగ్యమంటే శారీరక, మానసిక మరియు సాంఘిక (సామాజిక) స్వస్థత/క్షేమము; వ్యాధి రాహిత్యత, అశక్తి లేకుండుట మాత్రమేకాదు. (b) definition by the Office of Health Economics: 'A person should be regarded as healthy provided he can remain socially and economically active, eventhough he may have to suffer some health disability or discomfort' ఆరోగ్య ఆర్థిక కార్యాలయము వారి నిర్వచనము: కొంత ఆరోగ్య దుర్బలత లేదా అసౌఖ్యముతో బాధపడాల్సివచ్చినా; సాంఘికంగా, ఆర్థికంగా స్తోమత కలిగి వుండగలిగినట్లయితే ఆ వ్యక్తిని ఆరోగ్యవంతునిగా భావించాలి. **h. centre** ఆరోగ్యకేంద్రము. **h. hazard, h. risk** ఆరోగ్యవిపత్తు, ఆరోగ్యానికి అపాయము. **h. visitor** ఆరోగ్య సిబ్బంది ఉద్యోగి. B. 'Health is wealth' O.K., but nowadays 'Wealth is health'.

**health care** care of the health of the nation జాతియొక్క (అనగా పౌరునియొక్క) ఆరోగ్య పర్యవేక్షణ మరియు పరిరక్షణము.

**health care workers** doctors, nurses, laboratory technicians, multipurpose workers, traditional birth attendants; laundry workers and cleaners in a hospital డాక్టర్లు, నర్సులు, లేబొరేటరి టెక్నీషియన్లు, బహుళవిధులు నిర్వర్తించే వర్కర్లు, పురుడుపోసే మంత్రసానులు; హాస్పిటల్ గుడ్డలు ఉతికి చలువ చేసేవారు మరియు పరిసరాలు శుభ్రపరచేవారు.

**health food** food naturally occurring, free of additives, *e.g.* whole-grain cereals, honey, fruit and vegetables. ప్రకృతి మనకిచ్చినవి, కల్తీ లేనివి, ఉదా. ధాన్యం, తేనె, ఫలములు మరియు కాయగూరలు.

**hearing** perceiving sound వినుట, ధ్వనిని గ్రహించుశక్తి. **h. aid,** a device to amplify sounds, used by the deaf శబ్దమును హెచ్చుచేయు సాధనము – ఇది చెవిటివారికి ధ్వనిని పెద్దదిగా చేసి వినిపింపజేసే పనిముట్టు. *greeting:* 'Happy New Ear'.

**heart** cor: The powerful muscular organ which pumps blood out of it; it is a master organ. గుండె, గుండెకాయ, హృదయం: రక్తమును తనలోనుండి ఒత్తిడితో పంపు అతిశక్తివంతమైన అవయవము, అలంకార. అవయవముల అవధానములో అవధాని. It works without rest. నిర్విరామంగా పనిచేస్తుంది. It is of the size of one's own fist. గుప్పెడంత గుండె. It beats about one lakh times each day. రోజుకు లక్షసార్లు గుండె కొట్టుకుంటుంది. The heart receives impure (deoxygenated) blood from all parts in the body through veins, sends it to lungs for purification (oxygenation) and receives the pure (oxygenated) blood from the lungs. Then it pumps this pure (oxygenated) blood to all parts of the body through arteries by contractions of the heart at the rate of 72 per minute. This process is called circulation of blood. శరీరములోని అన్ని ప్రాంతములనుండి సిరలద్వారా అపరిశుద్ధ (ఆక్సిజన్‌రహిత) రక్తమును స్వీకరించి, దానిని ఊపిరితిత్తులకు ఆక్సిజన్ గ్రహించుట కొరకు పంపి, శుద్ధ (ఆక్సిజన్‌సహిత) రక్తమును ఊపిరితిత్తులనుండి గ్రహించి, దానిని నిముషమునకు 72 సార్లు గుండె సంకోచములతో ధమనులద్వారా శరీరప్రాంతములకు తిరిగి పంపిస్తుంది. ఈ క్రమమునే రక్తప్రసరణము అని అంటారు.

**heart attack** *colloq.* term for coronary thrombosis or simply 'a coronary', when a blood clot blocks a coronary artery or obstruction occurs due to spasm. *dread:* Heart attack, a master-killer. గుండెరోద: కొరొనరి ధమనిలో థ్రాంబస్ అడ్డుపడుట లేదా దాని ఈడుపు. దిగ్భ్రాంతి: మిన్నువిరిగి మీదబడుట. [Cf. 'stroke' is a brain attack].

**heartbeat** contraction of the heart గుండె కొట్టుకొనుట, హృదయ స్పందనము. పోలిక: గడియారం 'టిక్ టిక్' అన్నట్లు.

**heart block** *see/చూడండి* block.

**heartburn** pyrosis, *see/చూడండి* acidity. అమ్లపిత్తము. retrosternal burning with reflux of acid fluid in the mouth from oesophagus and stomach గ్రా. గుండెలో మంట, ఎదగాలుట. అమ్లద్రవము అన్నవాహిక మరియు అన్నాశయము నుండి నోట్లోకి గుంజుకొనబడుట.

**heart disease** disease of the heart గుండె జబ్బు, హృద్రోగం.

**heart failure** *see/చూడండి* failure. గుండె సోలిపోవుట.

**heart lung machine** *see/చూడండి* machine.

**heart murmur** abnormal heart noise గుండె అదనపు చప్పుడు.

**heart sounds** sounds produced in the heart గుండె ధ్వనులు, ముఖ్యముగా రెండు: 'lubb', the first sound – 'లబ్బ్', మొదటి ధ్వని; 'dupp', the second sound – 'డుప్ప్', రెండవ ధ్వని.

**heat** 1. warmth వేడిమి, ఉష్ణము. 2. increase in temperature of varying degrees ఉష్ణోగ్రత డిగ్రీలవారిగా ఎక్కువగుట. 3. heat produced in metabolism జీవ(న)క్రియలో ఉత్పన్నమయిన వేడిమి. **h. cramps,** spasms of muscles while engaged in strenuous labour in surroundings of high temperatures అధికఉష్ణత కలుగు ప్రదేశములలో కష్టతరమైన పనులు చేయు కార్మికులలో సంభవించే కండరముల ఈడుపులు. **h. exhaustion** collapse from the effects of heat. The individual is conscious, of course. అలసు; ఎండవడదెబ్బ: వేడిమియొక్క ప్రభావము వలన నిస్త్రాణ, దుర్బలత, శక్తిపాతము; చల్లబడి చమటలు పోసి దిగజారుట; వ్యక్తి స్పృహతప్పలేదు సుమా! **h. stroke** hyperpyrexia, fever above 105°F, a stage advanced than heat

exhaustion. He may go into unconscious state. It may turn fatal if not treated in time. 105°F మించిన జ్వరము, ఎండవడదెబ్బ తాకిడి పెరిగిన దశ; స్పృహతప్పి పోవచ్చుకూడా. యుక్తచికిత్స జరుగకపోతే ప్రాణాంతకమవచ్చును. needs treatment in an intensive care unit అత్యవసర ప్రాణమునిలుపుదల కేంద్రములో చికిత్స అవసరము. **prickly h.**, miliaria rubra ఒళ్ళుపేలుట, చమటకాయలు.

**hebephrenia** a type of schizophrenia, *see/చూడండి* schizophrenia.

**hectic** 1. constituitional శరీర/దేహ తత్వమునకు సం. 2. denoting afternoon rise of temperature in TB టి.బి. జబ్బులో సాయంత్రం జ్వరం. **h. activity,** very excited హడావిడితో కూడిన. **h. fever,** fever with flush జ్వరంలో బుగ్గలు కందినట్లుండుట.

**heel** hind portion of the foot (కాలి) మడిమ, పాదమూలము. pain in heel, *see/చూడండి* calcaneal spur. **cracked h's,** fissures/cracks in the skin of feet, painful, seen especially in a sodden state పాదముల అడుగున/అంచున పగుళ్ళు; బాధకలిగించు సన్నివేశము, ముఖ్యంగా నీళ్లలో పనిచేయు పనివాళ్ళలో ఇవి నాని, పాసిపోయిన స్థితిలో తరచుగా చూస్తూ ఉంటాము.

**Hegar's sign** softening of the cervix at about the seventh week of pregnancy గర్భిణి 7వ వారంలో గర్భసంచి ద్వారం మెత్తగా తగులుట.

**height** height and weight, usual co-measurements, *see/చూడండి* Appendix. ఎత్తు, బరువు సహ కొలతలు.

**heliotherapy** treatment by exposure to direct sunlight సూర్యరశ్మి సోకేటట్లుచేసే చికిత్స.

**helix** 1. curved structure వంకర తిరిగిన నిర్మాణము. 2. the free edge of the pinna of the ear, the curve in the question mark, *see/చూడండి* ear. వెలుపలి చెవియొక్క పై అంచుయొక్క వంపు పృచ్ఛకగుర్తు (?)లో వంపును పోలి ఉంటుంది.

**Heller's test** test for proteinuria in urine మూత్రంలో ప్రోటీన్లకు టెస్ట్.

**helminth** a parasitic worm పరాన్నజీవి పురుగు; ఉదా. ఎలికపాము (*resemblance:* rat tail పోలిక: ఎలికతోక) వంటి పరాన్నజీవి.

**helminthiasis** state of infestation with worms పురుగుల సంపర్కమున్న స్థితి.

**helminthology** the science about parasitic worms పరాన్నజీవి పురుగుల గురించిన శాస్త్రము.

**hemacytometer** *see/చూడండి* haemocytometer.

**hemeralopia** *see/చూడండి* day blindness.

**hemi** half అర్ధ *e.g.* hemicolectomy: removing half of the colon కోలన్ (పెద్దపేగు)లో సగము తీసివేయుట.

**hemianaesthesia** or **hemianesthesia** anaesthesia of one half/side of the body శరీరములో ఒకవైపు సగమునకు మొద్దుబారి నట్లుండుట.

**hemianopia** *colloq.* half sight. blindness in one half of the visual feild of one or both eyes అర్ధదృష్టి ఆవరణ అంధత్వం.

**hemicrania** one sided headache ఒంటి కణతనొప్పి.

**hemiparesis** 1. weakness of one half of the body శరీరములో ఒకవైపు సగమునందు బలహీనత. 2. slight paralysis of one half of the body శరీరములో ఒకవైపు సగమునకు కొద్దిస్థాయిలో పక్షవాత పీడన.

**hemiplegia** paralysis of one half of the body శరీరములో ఒకవైపు సగమునకు పక్షవాతము; అర్ధాంగ వాతము.

**hemisphere** half of a spherical organ గోళార్ధము. **cerebellar h.,** అనుమస్తిష్కముయొక్క గోళార్ధము. **cerebral h.,** మస్తిష్క గోళార్ధము.

**hemo** *see/చూడండి* haemo. combining form meaning blood.

**hemochromatosis** *see/చూడండి* haemochromatosis.

**hemocytoblast** *see/చూడండి* haemocytoblast.

**hemocytometer** *see/చూడండి* haemocytometer.

**hemodialysis** *see/చూడండి* haemodialysis.

**hemoglobin** *see/చూడండి* haemoglcbin.

**hemoglobinometer** *see/చూడండి* haemoglobinometer.

**hemoglobinuria** *see/చూడండి* haemoglobinuria.

**hemolysis** *see/చూడండి* haemolysis.

**hemophilia** *see/చూడండి* haemophilia.

**Hemophilus** *see/చూడండి* Haemophilus.

**hemopoiesis** *see/చూడండి* haemopoiesis.

**hemoptysis** *see/చూడండి* haemoptysis.

**hemorrhage** *see/చూడండి* haemorrhage.

**hemorrhoidectomy** *see/చూడండి* haemorrhoidectomy.

**hemorrhoids** *see/చూడండి* haemorrhoids.

**hemosiderin** *see/చూడండి* haemosiderin.

**hemosiderosis** *see/చూడండి* haemosiderosis.

**hemostasis** *see/చూడండి* haemostasis.

**hemostat** *see/చూడండి* haemostat.

**hemothorax** *see/చూడండి* haemothorax.

**henna** *bot.* a shrub గోరింట: ఒక పొద. leaves made into a paste.
1. useful for skin diseases గోరింటాకు చర్మ జబ్బులకు మంచిది.
2. used for decoration of palms చేతుల అలంకరణకు ఉపయోగిస్తారు.

**hepar** the liver కాలేయము, యకృత్తు, కార్జము.

**heparin** 1. an agent/drug having anticoagulant properties రక్తము గడ్డ/కరుడు (clot) గట్టే గుణమును అటంకపరచు/అరికట్టు వస్తువు/ఔషధము. 2. adding little heparin to a blood sample collected for, say a biochemical test (heparinisation) జీవరసాయనిక రక్తపరీక్ష కొరకు రక్తము గడ్డకట్టకుండా స్వల్పంగా హెపరిన్‌ను సీసాలో ఉంచుతారు.

**hepatic** relating to the liver కాలేయమునకు సం.

**hepatalgia** hepatodynia. pain in the liver కాలేయములో నొప్పి.

**hepatectomy** removal of part of the liver లివర్‌లో కొంతభాగం తీసివేయుట.

**hepatic abscess** abscess in the liver కార్జపు/కాలేయపు చీముగడ్డ. One commonest cause in tropics is amoebiasis, *see/చూడండి* amoebiasis. ఉష్ణమండలములలో తరచుగా సంక్రమించేది అమీబియాసిస్ జబ్బువలన చీముగడ్డ.

**hepatitis** inflammation of the liver and icterus (jaundice) కాలేయము యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు' మరియు పచ్చకామెర్లు. **fulminant h.**, with rapid tempo and termination శీఘ్రముగా ఉధృతమునొంది, మారణశక్తిగల కాలేయవాపు. **neonatal h.**, occurring soon after birth or till the age of 4 weeks శిశువు జన్మించగానే లేదా 4 వారముల వయస్సువరకు అంకురించు కామెర్లు. **post transfusion h.**, after transfusion of blood రక్తము ఎక్కించిన తదుపరి కనబడు కామెర్లు. **viral h.**, originally called 'infective hepatitis'. The term is now used as an all-embracing one, *i.e.* for many varieties of hepatitis, A, B, non-A, non-B, *etc.* ఒక వైరస్ వలన సంక్రమించు కామెర్లు.

**hepatitis B** viral hepatitis type B, *see/చూడండి* hepatitis, vaccine. వైరస్ వలన సంభవించు కాలేయ శోథము. It is transmitted through blood transfusion, contaminated intravenous procedures, hypodermic syringes, *etc.* రక్తసేకరణ, సిరలలోకి కలుషితమైన ప్రక్రియలద్వారా, చర్మంక్రింద సూది/సిరెంజ్‌తో మందు ఎక్కించుట ద్వారా ఒకరినుండి మరియొకరికి ఈ వైరస్ సరఫరా చేయబడుతుంది. It causes jaundice. కామెర్లు కలుగజేస్తుంది. Also it can cause liver cancer at a later age. జీవితంలో తరువాత లివర్ కేన్సరు కలుగజేయవచ్చును. Vaccination against Hepatitis B is mandatory in children. పిల్లల్లో ఈ జబ్బురాకుండా వాక్సీన్ తప్పనిసరిగా వారికి వేయించాలి.

**hepatization** lung becoming like liver, *i.e.* Lung which is a spongy organ becomes solid like liver, in pneumonia. న్యూమోనియాలో స్పంజిక (sponge) వలెనున్న ఊపిరితిత్తి జబ్బుప్రభావమువలన కాలేయమువలె గట్టిగా మారుతుంది.

**hepatoblastoma** malignant hepatic tumour, one which blasts/explodes the liver and body మారణశక్తిగల కాలేయపు కంతి, లివర్‌ను శరీరాన్ని బద్దలు చేసేది, అలంకార. బీభత్స బాంబ్.

**hepatocarcinoma** cancer in the liver లివర్‌లో కేన్సరు.

**hepatocele** herniation of liver లివర్ పొడుచుకొని రావటం, హెర్నియా (i) into anterior abdominal wall ఉదరకుడ్యములోనికి (ii) into the diaphragm విభాజక పటలంలోనికి.

**hepatocellular** relating to or affecting the cells in the liver కాలేయ/లివర్ కణములకు సం., లేదా వాటికి వాటిల్లే జబ్బు.

**hepatocirrhosis** cirrhosis of the liver, *see/చూడండి* cirrhosis. hardening of the liver యకృత్సంకోచము, కార్ణము క్షయించుట/ గట్టిపడుట.

**hepatocyte** a liver cell కాలేయ కణము.

**hepatodynia** *see/చూడండి* hepatalgia.

**hepatogastric** concerning the liver and stomach కాలేయము మరియు అన్నాశయమునకు సం.

**hepatojugular reflux** meaning the observation of a sign, *viz.* distension of the jugular vein on manual pressure over the liver, an informative sign in cardiology ఒక పరీక్ష: కాలేయముమీద చేతితో ఒత్తిడి కలిగిస్తే గళసిర ఉబ్బుతుంది – ఈ గుర్తు హృద్రోగ పరీక్షలో సహాయకారి.

**hepatologist** a doctor who specialises in liver diseases కాలేయ (లివర్) వ్యాధుల్లో నిపుణుడు.

**hepatology** 1. the study of the liver and its diseases లివర్‌ను గురించిన శాస్త్రం. 2. Hepatology, a journal in medicine వైద్యవార్తాపత్రిక.

**hepatoma** 1. a tumour of the liver లివర్‌లో కంతి. 2. hepatocellular carcinoma, a malignant tumour ఒక మారణశక్తిగల కేన్సరు.

**hepatomegaly** enlargement of the liver కాలేయము పెరుగుట; వాడు.భా. కడుపులో బల్ల.

**hepatorenal syndrome** liver and kidney failure due to any cause ఏ కారణం వల్లనైనా కాలేయము, కిడ్నీ నోలిపోవుట.

**hepatosplenomegaly** enlargement of the liver and spleen, a not uncommon combination కాలేయము మరియు ప్లీహాము పెరుగుట;

వాడు.భా. కడుపులో బల్లలు. ఈ రెండు అవయవములు తరచుగా తోడుదొంగలుగా ఎదుగుతూ ఉంటాయి.

**hepatotoxic drug** a drug which produces an adverse side effect of hepatotoxicity కాలేయమునకు విషసంబంధమైన ప్రతికూల పరిణామము కలుగజేయు ఔషధము.

**hepatotoxicity** the unwanted/side effect of an agent/drug producing damage to the liver ఏదైనా వస్తువు/ఔషధం వాడుక యొక్క దుష్ఫలితం వలన లివర్‌కు వాటిల్లే హాని/నష్టము.

**hepatotoxin** 1. an agent which is inimical to the liver కాలేయమునకు ప్రతికూలమైన వస్తువు. 2. a toxin that destroys liver cells కాలేయకణములను రూపుమాపే విషపదార్థము. Glory to Liver! It has a virtue, *viz.* vicarious suffering, *i.e.* suffering for the fault of others. Whenever a toxin is introduced into or produced in the body, it gets detoxicated in the liver, the internal biochemical laboratory. కాలేయమునకు జోహార్లు! ఒకరు మరియొకరి అక్రమాలకు గురియై, నాశనమై పోవుటకు సిద్ధముగా నున్న త్యాగము. ఎప్పుడైతే విషపదార్థము బయటనుంచిగాని లేదా శరీరములోనుంచిగాని చేరిందో, దానిని విషవిచ్ఛిన్నముజేసి, జీవికి హానిని తప్పిస్తుంది. కాలేయము మనిషిలోనున్న జీవరసాయనిక ప్రయోగశాల. Fortunately liver possesses remarkable power of regeneration. అదృష్టవశాత్తు ఈ కాలేయము విశేషమైన పునరుత్పత్తి శక్తిగలది.

**herb** *bot.* plant whose leaves, stems, roots, flowers, fruits or seeds have medicinal properties మూలిక: ఔషధగుణముకల మొక్కయొక్క ఆకులు, దంట్లు, వేళ్ళు, పువ్వులు, పండ్లు, లేదా విత్తనములు. *N.B.* Herbs heal. *గమనిక:* మూలికలు మూలుగులను నయం చేస్తాయి.

**herbalist** a specialist in herbs మూలికల శాస్త్రవేత్త.

**hereditary** being passed down from one generation to another వంశపారంపర్య, వంశానుగత. 1. passed on from parent to child or from one generation to following generations, such as characteristics, diseases తల్లి తండ్రి నుండి పిల్లకు లేదా ఒక తరమునుండి తరువాత తరములకు వచ్చే విశిష్టలక్షణములు, వ్యాధులు. 2. also includes inheritance వారసత్వంకూడా [*Cf.* familial]

also *see/*చూడండి disease. **h. disease,** occurring in families on a hereditary basis వంశానుగతంగా కుటుంబసభ్యులలో సంక్రమించు వ్యాధి.

**heredity** inheritance: genetic transmission of a trait/disease from parent to the descendants అనువంశికత.

**hermaphrodite** bisexual. person or animal that has both male and female organs or characteristics ఉభయలింగజీవి [*Cf.* pseudohermaphrodite].

**hermaphroditism** a state of both male and female sex characteristics in one person ఉభయలింగత, ఉభయ లింగత్వం: ఒక వ్యక్తిలోనే పురుష మరియు స్త్రీ స్వాభావిక చిహ్నములుండుట. **lateral h.,** presence of male gonads on one half of the body giving male appearance and female gonads on the other half giving female appearance అర్ధనారీశ్వరత్వం.

**hermetic** impervious to air గాలి దూరని. hermetically sealed గాలిదూరకుండా/గాలి చొరకుండా మూతవేయబడిన.

**hernia** protrusion/bulge of a portion of an organ/tissue through a yielding, weak spot/area గిలక: మెత్తని, బలహీనమైన స్థలము/ప్రాంతములో అవయవము లేదా కణజాలము యొక్క భాగము చొరవ చేసుకొని ఉబ్బుట. **abdominal h.,** one through the abdominal wall ఉదర కుడ్యములో నుండి హెర్నియా. **diaphragmatic h.,** stomach or intestines herniating into the thorax through the diaphragm విభాజక పటలముద్వారా అన్నాశయము లేదా పేగులలో భాగము ఛాతి/రొమ్ములోనికి హెర్నియా. **hiatus h.,** the above organs herniating through the oesophageal hiatus in the diaphragm పైన పేర్కొన్న అవయవములు విభాజక పటలములోని అన్నవాహిక సందులోనుంచి హెర్నియా. **femoral h.,** protrusion through the femoral canal beneath the groin గజ్జక్రింద ఫెమొరల్ కుల్యగుండా ఉబుకు. **incisional h.,** hernia occurring through the site of an old incised area, usually on the abdominal wall పూర్వపు శస్త్రగాటు గుండా అగపడే హెర్నియా, తరచుగా ఉదరకుడ్యముమీద. **inguinal h.,** hernia of the intestine in the groin గజ్జలోని హెర్నియాలో పేగులు

కానవస్తాయి. **strangulated h.**, gangrene of the hernial sac due to constriction of blood vessels in a tight opening, *see*/చూడండి gangrene. హెర్నియా యొక్క బిగుతైన సందులో రక్తనాళములు ఒత్తిడికిలోనై హెర్నియాతిత్తి కుళ్ళిపోవుట. **umbilical h.**, hernia in the region of the umbilicus నాభి/బొడ్డు దగ్గర హెర్నియా. **ventral h.**, through the abdominal wall ఉదరకుడ్యములో కన్నము వేసుకొని హెర్నియా వెలువడుట.

**hernioplasty** plastic repair of hernia హెర్నియాయొక్క సందుకు దృఢత్వము కల్గించే/కల్పించే శస్త్రసాధనము.

**herniorrhaphy** surgical repair of hernia, sometimes inserting a mesh and suturing it to occlude the opening గిలకకు శస్త్రచికిత్స: హెర్నియా సందును వలతో బంధించి ఆ కన్నమును సంవరణము (occlude) కావించుట అనగా మూసివేయుట.

**herniotomy** operation for the relief of hernia హెర్నియా/గిలకకు అపరేషన్.

**heroin** a sinister drug; causes initial feeling of euphoria, later narcosis బహు చెడ్డమందు. ముందు ఉల్లాసాన్ని కలుగజేసి, తరువాత మత్తును కలుగజేస్తుంది. *Note:* heroin hero/heroine (smuggler) caught by customs authorities *గమనిక:* సుంకము చెల్లించకుండా చట్టవిరుద్ధంగా దొంగరవాణాచేయు వీరులను కస్టమ్స్ అధికారులు పట్టుకుంటారు. *N.B.* the term 'heroin chic' was coined in 1997–drug addiction among the jet-set. *గమనిక:* ధనమదాంధుల ఫాషన్/జల్సా–హిరాయిన్ వ్యసనపోదా.

**herpes** inflammatory skin vesicles on the skin with burning pain due to herpes virus (especially in zoster). The burning is so intense in h. zoster that patient feels as if fire is kept on the skin. విసర్పిణి, సలిపి, సర్పి: సలుపు/'నొప్పి వేడి మంట వాపు'తో కూడిన బొబ్బలు. జొస్టర్‌లో మంట ఎంత దుర్భరంగా ఉంటుందంటే – అగ్గి/నిప్పు కణములు చర్మముమీద పెట్టినట్లుంటుంది. **h. genitalis**, herpes simplex over genitals గుహ్య అవయువముల మీద సర్పి. **h. labialis**, herpes over lips పెదిమల మీద సలిపి. **h. zoster**, shingles; neurotropic modification of the dermatropic virus, chicken-pox

మేఖలిక విసర్పిణి: జోస్టర్ సర్పి; అటలమ్మ వైరస్‌యొక్క పరిణామము. **h. zoster ophthalmicus**, vesicles with burning and lancing pain over the forehead, eyelid and cornea. This may lead to corneal ulceration – a formidable condition. నేత్రజోస్టర్ సర్పి: నుదురు, కనురెప్ప మరియు శుక్లపటలముమీద బల్లెముతో పొడుస్తున్నట్లున్న మంటతోకూడిన బొబ్బలు – పగవారికైనా రాకూడదు సుమా!

**herpetiform** resembling herpes సర్పిని పోలిన.

**heterosexual** sexual desire and connection with one of the opposite sex, which is natural పరలింగ (సంభోగము): స్త్రీకి పురుషునితోను, పురుషునికి స్త్రీతోను కలియవలెనని లైంగికవాంఛ/ సాంగత్యసాధన. ఇది సహజప్రవృత్తి. [*in contr.* homosexual భిన్న. స్వలింగ].

**heterotrophism** *bot.* nutritional pattern of depending on other organisms, dead matter or chemicals పరపోషితత్వము: ఆహారము కొరకు ఇతర జీవులమీద, నిర్జీవ పదార్థములపైన లేదా రసాయనిక పదార్థములపై ఆధారపడు విధానము [*Cf.* autotrophism తారత. స్వయంపోషణ]. heterotrophs పరపోషితాలు.

**heterozygous** having non-identical alleles at the same locus on homologous chromosomes విషమయుగ్మజ: సమజాత క్రోమొసోమ్‌ల లోని ఒకేస్థానములో ఉన్న భిన్న ఎల్లెల్‌లు [*in contr.* homozygous భిన్న. సమయుగ్మజ].

**hexapoda** 1. insect: living organism with six legs (three pairs) షట్పది: ఆరు కాళ్ళుగల జీవి. 2. vector of diseases వ్యాధులకు ఆరోహకము.

**hiatus** a gap or opening సందు లేదా కన్నము. **hiatus h.,** *see/ చూడండి* hernia. **oesophageal h.,** opening in the diaphragm through which oesophagus passes విభాజక పటలములో అన్నవాహికకు మార్గము.

**hiccough** hiccup ఎక్కిళ్ళు 'హిక్‌హిక్' శబ్దములు sudden, sharp, quick and involuntary inspiratory sound associated with spasm of the glottis and diaphragm అకస్మాత్తైన, వాడి, త్వరితమైన మరియు

అప్రయత్నపూర్వకమైన ఉచ్ఛ్వాసశబ్దము – ఇది కంఠబిలము మరియు విభాజక పటలము యొక్క ఈడుపు వలన కలుగుతుంది. **terminal h.,** premortal signal in a dangerously ill patient ప్రమాదస్థితిలోనున్న రోగిలో అవసాన దశయందు ఎక్కిళ్ళు. *N.B.* There is a near resemblance to the sound of hiccup during the pronunciation of the word 'hiccup'. *గమనిక:* hiccup శబ్ద ఉచ్చారణలో ఎక్కిళ్ళకు సన్నిహితమైన శబ్దం వినబడుతుంది.

**hidroa** *see/చూడండి* hydroa.

**hidrosis** production of sweat చెమట తయారగుట, స్వేదోత్పత్తి. **hyper h.,** excessive sweating ఎక్కువ చెమట పట్టుట, అధిక స్వేదోత్పత్తి.

**hilar enlargement** *see/చూడండి* hilum. **h. flare,** fullness at the hilum of the lung. an X-ray finding ఎక్స్‌రే ఫోటోలో కనపడే హైలమ్ దగ్గర ఉబ్బు.

**hilitis** inflammation of a hilus (hilum) హైలస్ (హైలమ్) యొక్క వాపు/ఉబ్బు.

**hilum** or **hilus** [hili *pl.*] 1. depression in an organ నాభిక, అవయవములో ఉన్న గుంట ప్రాంతము. 2. root in an organ అవయవములోని మూలము. **h. of kidney** వృక్కనాభి. **h. of lung,** the depression where the blood vessels enter/leave, and bronchi enter the lung, an X-ray finding పుపుసనాభి: రక్తనాళములు పోయే/వచ్చే, మరియు శ్వాసనాళికలు ఊపిరితిత్తిలోనికి ప్రవేశించే స్థానము దగ్గర గుంట – ఇది ఎక్స్‌రే ఫోటోలో కనబడుతుంది.

**hip** coxa తుంటి. the upper part of the thigh where it joins the pelvis తొడయొక్క ఊర్ధ్వభాగము; కటి (pelvis) తో కలియు ప్రాంతము. **h. joint** తుంటికీలు.

**Hippocrates** the Greek physician, "Father of Medicine" గ్రీక్ వైద్యుడు, వైద్యపిత.

**Hippocratic facies** countenance. expression of the face on death bed మృత్యువు ఒడిలోకి పోతున్నప్పటి ముఖాకారం, ప్రేతకళ.

**Hippocratic Oath** preaching ethics for the medical profession హిపాక్రటిస్ ప్రమాణము, వైద్యవృత్తిలో పాటించవలసిన నీతులు ఉపదేశించుట. Modern version of Hippocratic Oath: – his = doctor's. 'To consecrate (his) life to the service of humanity. Not to permit consideration of religion, nationality, race, party politics or social standing to intervene between (his) duty and (his) patient. Not to use (his) knowledge contrary to the laws of humanity'. హిపాక్రటిక్ ప్రమాణముయొక్క అధునిక పాఠాంతరము: 'డాక్టరు జీవితం రోగుల సేవకు అంకితం చేయాలి. మత, జాతి, వంశ, కుల, రాజకీయ, వర్గ భేదములు డాక్టరుకు తన రోగికి మధ్య ఎట్టి జోక్యము కలుగజేసుకోకుండా మెలగాలి. మానవతానిబంధనలకు ప్రతికూలంగా డాక్టరు తన విజ్ఞానమును ఉపయోగించరాదు.'

**Hirschsprung's disease** megacolon మహాంత్రము, బృహదాంత్రము. congenital condition పుట్టుకతో వచ్చిన అవస్థ.

**hirsuties** or **hirsutism** *slang* 'hair suit ism': excessive hairiness all over the body, especially in a woman అతిరోమత్వం: ముఖ్యముగా స్త్రీలలో ఒళ్ళంతా వెంట్రుక/కేశ సంపద.

**hirudin** secretion (saliva) of leech which prevents coagulation of blood రక్తం గడ్డకట్టకుండా ఆపే జలగస్రావము (దాని లాలాజలం). older remedy: applying leeches over the temple, *e.g.* in the treatment of glaucoma కణతమీద జలగచే రక్తం గుంజింపబడటం, ఉదా. గ్లాకోమా చికిత్సలో – ఇది పురాతన వైద్యం.

**histamine** a substance released in the tissues during their damage కణజాలముల క్షయమప్పుడు వెలువడే పదార్థము.

**histidine** an amino acid obtained from proteins ప్రోటీన్లలో ఉన్న ఎమైనో అమ్లము.

**histiocyte** macrophage మహాభక్షి, ఒకరకపు కణము.

**histology** science of cells and tissues జీవకణజాల శాస్త్రము, కణముల మరియు కణజాలముల శాస్త్రము, ఊతక విజ్ఞానము. microscopic anatomy సూక్ష్మశరీర నిర్మాణశాస్త్రము.

**histolysis** lysis of tissues కణజాల విచ్ఛిన్నము.

**Histoplasma** a genus of fungi ఒక ప్రజాతి ఫంగస్ e.g. *H. Capsulatum.*

**histoplasmosis** infection with the above fungus పై ఫంగస్ సంపర్కమువలన కలుగు వ్యాధి.

**history** *figur.* his story, *i.e.* story of the patient. **family h.** కుటుంబ చరిత్ర. **h. of past illness** గత వ్యాధి చరిత్ర. **h. of present illness** ప్రస్తుత రోగచరిత్ర. **h. taking** చరిత్ర సేకరణ.

**history of medicine** a department in a medical college మెడికల్ కాలేజీలో వైద్యశాస్త్ర చరిత్ర విభాగము.

**histotoxic** poisonous to tissues కణజాలమునకు విషమైనది.

**HIV** *abbr.* human immunodeficiency virus which causes AIDS (acquired immunodeficiency syndrome) HIV అలంకార. వ్యుత్పత్తి హింస ఐన వైరస్ – ఎయిడ్స్ వ్యాధి కలుగజేసే వైరస్.

**hives** 1. urticaria, a vascular reaction producing wheals on the skin దద్దుర్లు, చర్మముమీద ఎర్రని రక్తనాళపు ప్రతిక్రియ (reaction). 2. nettle-rash, irritation on the skin with the leaves and plant itself దురదగొండి/దురదగుంట ఆకు స్పర్శవలన దురదపుట్టడం కద్దు – ఈ రోగానికి 'కుక్కముండ్లు' అని పేరు.

**hoarseness** husky voice; harsh, rough and grating voice గొంతు రాసిన స్థితి, గొంతు రాసుకుపోయింది, గొంతు రాపు. It occurs in the most benign condition, sore throat. నిరపాయ గొంతు రొంపలో గొంతు బొంగురుపోతుంది, రాసుకుపోతుంది. Chronic intractable hoarseness, especially in a smoker – rule out the malignant condition, cancer of larynx దీర్ఘకాలపు, చికిత్సకు లొంగని గొంతు బొంగురు ముఖ్యంగా పొగపీల్చేవారిలో – అపాయస్థితి, శబ్దపేటిక కాన్సరు అనుమానం తీర్చాలి.

**hobnail liver** cirrhosis of the liver కాలేయము గట్టిపడుట. *resemblance:* The surface of liver looks like the sole of a heavy shoe (worn by military personnel) nailed with short nails with heavy heads *పోలిక:* కాలేయ తలము దొడ్డు/లావు తలలు, చిన్న ముల్లులు గల బూట్ మేకులు (మిలిటరి వాళ్ళు వాడేవి) అడుగున కొట్టినట్లు కనబడుతుంది.

**Hodgkin's disease** a disease with rubbery enlargement of lymph nodes and enlargement of spleen రబ్బరువలె చేతికి తగిలే ఉబ్బిన లింఫ్ గ్రంథులు మరియు పెద్దదయిన ప్లీహము (కడుపులో బల్ల) గల జబ్బు.

**holistic medicine** a theory which considers the person/patient as a whole, physically and psychologically – not organ-targeted వ్యక్తి/రోగిని శారీరక మరియు మానసిక శక్తి/జ్యోతిగా భావించే సిద్ధాంతం. – అవయవధ్యేయం మాత్రమే కాదు. treatment directed to the whole of the body, *e.g.* homeopathy, ayurveda *figur.* 'as a whole'. చికిత్స పూర్తి దేహానికి [distinguish from allopathy, which is disease-oriented అల్లోపతి వ్యాధి ప్రాతిపదిక ఉద్యమం, అనగా వ్యాధికి ప్రాముఖ్యత నిస్తుంది].

**holy basil** *bot.* plant with medicinal properties *గమనిక.* holy=పూజనీయమైన, basil=తులసిచెట్టు. తులసి ఆకు. దీనిని తింటారు. 1. good for colds, cough జలుబు, దగ్గుకు మంచిది. 2. mouth-freshener నోరు, పళ్ళు శుభ్రపరచేది.

**homeopathy** or **homoeopathy** 1. homoeo = similarity పోలిక. pathy = curative treatment నయముచేయు ప్రక్రియ. law of similarity – 'like cures like' సాదృశ్య సిద్ధాంతం – అలంకార. వజ్రం వజ్రాన్ని ఛేదిస్తుంది. 2. principle on which homeopathy is based: A drug which produces a disease also cures similar natural diseases when given in minute doses. Hahnemann, founder of homeopathy took a decoction of the cinchona bark (from which quinine, the drug for malaria was obtained) and felt sensation of chills, heat and sweating as found in malaria. హోమియోపతి యొక్క విధానము: ఏ ఔషధము ఒక వ్యాధి లక్షణములు కలుగజేస్తుందో అదే ఔషధము సూక్ష్మమోతాదులో అటువంటి వ్యాధులను నయము చేస్తుంది. హోమియోపతి కనిపెట్టిన శాస్త్రవేత్త, హానేమన్ సింకోనా/క్వైనా చెట్టు పట్ట/బెరడు కషాయము త్రాగిన తర్వాత (క్వైనా/క్వినీన్ – మలేరియాకు మందు) ఆయనకు మలేరియా వలె చలి, జ్వరము వచ్చి, చెమటలు పట్టాయి.

**homeostasis** maintenance of stable physiological state of the organism by balancing levels of oxygen, heat, glucose, minerals, *etc.* సమానావస్థస్థితి, సమస్థితి; శరీరములోని ఆక్సిజన్, ఉష్ణోగ్రత, చక్కెర, ఖనిజాలు, మొ. వాని సమతౌల్యతను నిర్వహించు ప్రవృత్తి.

**homicide** killing of a person నరహత్య, ఖూని [*Cf.* suicide తారత. ఆత్మహత్య].

**homoeopathy** *see/చూడండి* homeopathy.

**homolateral** on the same side స్వపార్శ్వ [*opp.* contralateral వ్యతి. పరపార్శ్వ].

**homologous** corresponding in structure, position, origin, *etc.* సమజాత, సంగత; నిర్మాణము, స్థానము, పుట్టుకలో సమానమైన (corresponding).

**Homo sapiens** the species to which man belongs to మానవజాతి.

**homosexual** sexual desire and connection with one of the same sex, which is unnatural స్వలింగ (సంభోగము): పురుషునికి మరియొక పురుషునితో కలియవలెనని లైంగికవాంఛ/ఆసన సంభోగము – ఇది అసహజము. ఈ విడ్డూరం హేయం. *N.B.* Homosexuality aids AIDS. *గమనిక:* దీనివలన ఎయిడ్స్ వ్యాధి వ్యాపిస్తుంది. [*in contr.* heterosexual భిన్న. పరలింగ].

**homozygous** having identical alleles at the same locus on homologous chromosomes సమయుగ్మజ: సమజాత క్రోమొసోమ్‌ల లోని ఒకేస్థానములో ఉన్న అభిన్న ఎల్లైల్‌లు [*in contr.* heterozygous భిన్న. విషమయుగ్మజ].

**honeycomb lung** a radiological term denoting the presence of cysts 0.5 to 2 cm in diameter in both lungs, *resemblance:* honey comb. ఎక్స్‌రే ఫోటోలో కనపడేది. రెండు ఊపిరితిత్తుల్లో 0.5 నుండి 2 సెంటిమీటర్ల సైజులో తిత్తులు, *పోలిక:* తేనెతుట్టె.

**hookah** or **hooka** tobacco-pipe – the smoke is cooled in water and passed through a tube, and then inhaled హుక్కా: పొగాకు పొగ నీళ్ళల్లో నుంచి పోనిచ్చి, చల్లబరచి పీలుస్తారు. *figur.* cooled cigarette, though burning.

**hookworm disease** caused by nematode parasite producing ancylostomiasis, *see/చూడండి* Ancylostoma. కొంకిపురుగు జబ్బు.

**hordeolum** *syn.* stye. a furuncle on the eyelid కనురెప్పమీద సెగగడ్డ.

**hormone** a chemical substance secreted by an endocrine (ductless) gland హార్మోన్, అంతస్స్రావి (వినాళికా) గ్రంథి స్రవించే రసాయనిక పదార్థము. **adrenocortical h.,** any of the corticosteroids secreted by the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్ స్రవించు హార్మోన్లు. **growth h.,** secreted by the anterior pituitary, that influences growth ఎదుగుటను క్రమపరచు హార్మోన్ – పూర్వ పిట్యూటరీ గ్రంథి నిర్వహణము. **ovarian h.,** estrogen secreted by the ovary అండాశయములో తయారైన హార్మోన్. **sex h's** స్త్రీ, పురుష లైంగిక హార్మోన్లు. **thyroid h's** థైరాయిడ్ స్రావము.

**hormone replacement therapy** 1. administering a hormone (drug) to treat deficiency. హార్మోన్ లోపంలో ఆ హార్మోన్ (ఔషధము)ను ఇచ్చుట. 2. especially giving oestrogenic hormones to post-menopausal women ముఖ్యముగా ముట్లు ఎండిపోయిన తర్వాత స్త్రీలకు ఈస్ట్రోజన్ హార్మోన్లు ఇచ్చుట.

**horripilation** erection of the hairs రోమముల యొక్క గగుర్పాటు చెందుట/నిక్కబొడుచుకొనుట.

**hospice** an institution/home for the care of the terminally ill, and provides support for their families అవసానదశలోనున్న రోగులను ఉంచే సంస్థ/నిలయం. ఇంతేగాక, వారి కుటుంబ సభ్యులకు ప్రాపు ఇస్తారు.

**hospital** a place for treating patients ఆసుపత్రి: రోగులకు చికిత్స చేసే స్థలము. **eye h.** కంటివైద్యశాల. **infectious diseases h.** అంటురోగుల ఆసుపత్రి. **maternity h.** ప్రసూతి వైద్యశాల. **tuberculosis h.** టి.బి. ఆసుపత్రి/దవాఖానా.

**host** an organism that plays host to a parasite, *see/చూడండి* habitat. అతిథేయి: పరాన్నజీవికి ఆతిథ్యము/ఆవాసమునిచ్చు జీవి. **definitive h., primary h.,** the body in which a parasite spends its adult

and sexual stage/existence ప్రాథమిక అతిథేయి; పరాన్నజీవి తన ప్రౌఢజీవిదశ మరియు లైంగికదశ గడుపు శరీరము. **intermediate h.**, the body in which a parasite spends its larval and asexual stage/existence మాధ్యమిక అతిథేయి; పరాన్నజీవి తన డింభకదశ మరియు అలైంగికదశ గడుపు శరీరము.

**hourglass contraction** contraction at the middle of a hollow organ, *e.g.* stomach, uterus గుల్లగానుండే/బోలుగానుండే అవయవములు, ఉదా. అన్నాశయము, గర్భాశయము యొక్క మధ్యభాగంలో సంకోచం. *resemblance:* hourglass పోలిక: ఇసుక గడియారం.

**housemaid's knee** bursitis. kneepain in a person accustomed to physical work పనికత్తె జానువు/మోకాలు; అలంకార. శరీరకష్టానికి రుజావు [*q.v.* tennis elbow].

**houseman** house-surgeon. training for a recently qualified doctor అప్పుడే పాస్ అయిన డాక్టరుకు శిక్షణ.

**humerus** long bone of the arm, భుజాస్థి, దండ ఎముక.

**humidity** amount of moisture in the atmosphere ఆర్ద్రత: గాలిలో తేమ.

**humor** body fluid శరీర ద్రవము. **aqueous h.**, that in the anterior and posterior chambers in the eye కన్ను గుడ్డులోని పూర్వాంత, పరాంత కక్ష్యలలోనున్న ద్రవము. **vitreous h.** కన్నుగుడ్డులోని కాచవత్ కక్ష్యలోనున్న ద్రవము.

**humpback** hunchback, kyphosis, a spine which is bent outwards గూను, గూనివాడు; విల్లువలె వెలుపలికి వంగిన వెన్ను.

**hunger** 1. natural instinct ఆకలి, సహజబుద్ధి, ప్రకృతి, ఉత్సుకము. 2. craving, say for food తినాలని తృష్ణ. Hunger is a sign of health. ఆకలి ఆరోగ్యచిహ్నం. **air h.**, distressing dyspnoea in diseases శ్వాస సంకటము, వ్యాధులలో వాయుతృష్ణ. **h. for health**, desirable ఆరోగ్యం కొరకు తృష్ణ, వాంఛనీయం. **h. for wealth**, greed for riches ధనార్జనపై అత్యాశ. *figur.* If greed overwhelms need, mental tension sets in. అలంకార. పేరాశ/అత్యాశ అవసరాన్ని మించితే, మానసిక పోటు తప్పదు. **h. pain** ఆకలి అరుపు. **h. pain(s)**,

h. contractions ఆకలిగొని ఉన్నప్పుడు ఆహారంకోసం పొట్టలో నుంచి పిలుపు. *N.B.* Hunger is the key to health. *గమనిక:* ఆకలి ఆరోగ్య సూచన/సూచిక. **h. strike,** refusal to take food, as a note of protest నిరాహార దీక్ష. **sex h.,** ఉద్ధృతమైన లైంగికవాంఛ. **taste of h.,** appreciated when once he leaves his home ఆకలి రుచి అవలకు వెళ్తేగాని తెలియదు.

**hurt** injury గాయం. 1. physical injury శరీరానికి గాయం. 2. to hurt one's feelings, mental injury మానసిక గాయం.

**hyaline** glassy and transparent స్ఫటిక, పారదర్శక; కాచాభ. **h. cartilage** స్ఫటిక మృదులాస్థి. **h. degeneration** కాచాభ క్షీణత. **h. substance** కాచాభ పదార్థము.

**hyaline cartilage** translucent, bluish-white cartilage, *e.g.* at the bony ends in a joint. పారప్రకాశకమైన, నీలి-తెలుపు వర్ణం కలిగిన మృదులాస్థి, ఉదా. కీలులో ఎముకల అంచులకు పట్టుకొని ఉన్న మృదులాస్థి.

**hyalitis** inflammation of the vitreous in the eye కన్నులోని కాచవత్ భాగంయొక్క శోథం/'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**hyaloid membrane** hyaloid = clear and transparent నిర్మలమైన మరియు పారదర్శకమైన. a surface layer of the vitreous humour of/in the eye నేత్రగోళాంతర శ్లేష్మం మీది పొర.

**hyalosis** degenerative changes in the vitreous humour కాచవత్ శ్లేష్మంలో క్షీణతా పరిణామం.

**hybrid** cross-bred, mongrel. animal or plant produced by crossing two different species, varieties, races or breeds సంకర(ము), మిశ్రితమైన: రెండు భిన్న జాతులకుగాని, రకాలకుగాని, తెగలకుగాని లేదా కుటుంబములకు చెందిన జీవుల కలయికవలన కలిగిన సంతతి లేదా ఉద్భవము.

**hydatid** 1. a hydatid cyst హైడాటిడ్ తిత్తి. 2. a vesicular structure resembling an ecchinococcus cyst, *i.e.* hydatid-like హైడాటిడ్‌ను పోలిన పదార్థంతో ఉన్న తిత్తి.

**hydatid cyst** *see/చూడండి* Echinococcus. హైడాటిడ్ తిత్తి.

**hydatidiform mole** grape like cystic degeneration in the chorionic villi forming into a fleshy mass, in the uterus ఎలుకలు పోగుచేసే మట్టి దిబ్బ/పుట్ట వలెను, ద్రాక్షపండ్లగుత్తివలెను ఉన్న, క్షీణించి, పరాయువు అంకురికలు చుట్టూతా పోగైన మాంసపుముద్ద – ఇది గర్భాశయములో ఉంటుంది. The nomenclature implies 'resembling a hydatid cyst'. పరిభాషా ప్రకరణము రీత్యా 'హైడాటిడ్ తిత్తిని పోలిన'.

**hydraemia** or **hydremia** a relative excess of plasma volume in the blood which occurs in late pregnancy రక్తంలో ప్లాస్మా శాతం ఎక్కువగా ఉండుట – ఇది గర్భిణి నెలలు నిండే సమయంలో కానవస్తుంది.

**hydragogue** cathartic విరేచనకారి, బేదికి ఔషధం.

**hydramnios** an excess of amniotic fluid గర్భసంచిలో ఉమ్మనీరు అధికంగా చేరటం.

**hydrarthrosis** hydrops articuli. collection/accumulation of synovial/serous fluid into a joint cavity కీలులో ద్రవము కూడుట. **intermittent h.**, in young women (probably allergic) appears spontaneously, disappears as mysteriously as it started అడ పడుచులలో ఉండి ఉండి, తిరిగి తిరిగి, మరల మరల (బహుశ ఎలర్జి వలన) వచ్చేది – ఎట్లా తెలియకుండా వచ్చిందో అట్లాగే మటుమాయం అయిపోతుంది.

**hydroa** or **hidroa** any bullous eruption ఏదైనా గోళక దద్దురు/ పొక్కు.

**hydrocele** accumulation of fluid in the tunica vaginalis of the testis or around the spermatic cord బుడ్డ, ఒలి/ఒలు బీజము, వాడు.భా. వరిబీజము: వృషణము మీది పొరలో లేదా శుక్రవాహిక చుట్టూ ద్రవము చేరుట.

**hydrocephalus** enlargement of the skull due to dilatation of the cerebral ventricles ద్రవశీర్షము, జలశీర్షము, శీర్షబూదరము, మస్తిష్కకోష్ఠకములయొక్క విస్ఫారణ వలన కపాలము ఉబ్బుట.

**hydrochloric acid** normally present in gastric juice in the stomach అన్నాశయములోని జఠరరసములోనున్న హైడ్రోక్లోరిక్ అమ్లము, అలంకార. జఠరాగ్ని.

**hydrocortisone** natural or synthetic cortisol, a hormone of the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్ హార్మోన్; శరీరములో స్రవించునది లేదా మందులకంపెనీలో సంయోగికమైనది.

**hydrometra** accumulation of thin mucous or fluid in the uterine cavity గర్భసంచిలో పల్చటి శ్లేష్మం/ద్రవం కూడుట.

**hydromyelia** increase of CSF in the dilated central canal of the spinal cord or in such a congenital space కశేరుకుల్యగాని లేదా అటువంటి పుట్టుకతోవచ్చిన కుహరంలోగాని మస్తిష్కమేరుద్రవం ఎక్కువగుట.

**hydronephrosis** distension of the pelvis of the kidney with urine, due to obstructed outflow మూత్రనాళము మూసుకుపోయి నందువలన లేదా దానిలో అడ్డు సంభవించిన యెడల వృక్కద్రోణి (pelvis of kidney) లో మూత్రం నిల్వఅయి, అది ఉబ్బిపోయిన స్థితి.

**hydropathy** *see/చూడండి* hydrotherapy.

**hydropericarditis** pericarditis with a large serous effusion ఎక్కువ సీరస్‌ద్రవంతో కూడిన గుండెపైపొర శోథం/'నొప్పి మంట వాపు'.

**hydrophobia** rabies నీటిభీతి, జలోన్మాదము, జలభయరోగం: వాడు.భా. పిచ్చికుక్కకాటు జబ్బు. A fatal disease wherein there is intense fear of water; the disease is caused by the bite of a rabid dog, *see/చూడండి* rabies. వెర్రి/పిచ్చికుక్కకాటువలన సంభవించిన వైరస్ అంటువ్యాధి. ఈ మారణజబ్బులో నీరునుచూసినా, నీటిశబ్దంవిన్నా భీతి మరియు కండరముల యీడుపులు (spasms) రోగిని సతాయిస్తాయి/పీడిస్తాయి. No patient with hydrophobia ever lived. ఈ వ్యాధివస్తే మరణము తథ్యము; చావు తప్పదు.

**hydropneumothorax** accumulation of fluid and gas in the pleural cavity ఊపిరితిత్తిపైన పొరలో ద్రవము మరియు వాయువు చేరుట.

**hydrops** oedema: accumulation of fluid in tissues, as a result of which the person bloats కణజాలములలో ద్రవము చేరుట, తత్ఫలితంగా శరీరము ఉబ్బుట. **fetal h.**, bloated fetus/newborn, with severe anaemia due to hemolytic disease అప్పుడే జన్మించిన శిశువులో రక్తవిచ్ఛిన్నమువలన దాపురించిన, రక్తహీనతతో కూడిన, శరీర ఉబ్బు.

**hydrosalpinx** accumulation of fluid in the uterine tubes (Fallopian tubes) and their swelling అండవాహక నాళములలో ద్రవముచేరి, అవి ఉబ్బుట.

**hydrotherapy** the use of water externally in the treatment of diseases, *see/చూడండి* naturopathy. It includes tub baths, wet sheet packs, or shower sprays జలచికిత్స: తొట్టిస్నానం, తడి బట్టలు కప్పడం, లేదా నీటి తుంపరలకు గురిచేయుట.

**hydrothorax** accumulation of transudate in the pleural cavity ఊపిరితిత్తి మీది పొరలో పారస్రావము చేరుట.

**hydroureter** distention/dilatation of the ureter due to obstruction below మూత్రనాళము యొక్క మార్గము అడుగున అడ్డువలన అది విస్తరణ/విస్ఫారణ చెందుట.

**hygiene** science of maintaining health ఆరోగ్యమును కాపాడుట/ కాపాడుకొనుట గురించి వైద్యశాస్త్ర విభాగము. **mental h.** మానసిక ఆరోగ్యం. **oral h.** ఆశ్యశౌచము/నోటి పరిశుభ్రత. **personal h.** వ్యక్తిగత పరిశుభ్రత.

**hygroma** a cystic swelling containing watery fluid. **cystic h.**, a translucent swelling in the neck, a lymphangioma లింఫ్‌నాళికల తిత్తి, మెడలో ఒక పాక్షిక పారదర్శక ఉబ్బు.

**hymen** a fold of membrane covering either partially or fully the vaginal orifice, usually intact in a virgin, *see/చూడండి* virgin. కన్నె పొర: యోని ద్వారమును అసంపూర్ణముగాగాని లేదా సంపూర్ణముగాగాని మూసి ఉంచు తెర/పొర, మడత, సామాన్యముగా ఇది కన్యలలో అక్షతముగా ఉండవచ్చును. *N.B.* Some praise this as a prestige of virginity. *గమనిక:* కొందరు కన్యాత్వ హోదాకు రుజువు అని భావిస్తారు.

**hymenectomy** excision of the hymen కన్నెపొర కత్తిరించటం. *see/చూడండి* virginity tests.

**hyoid** U shaped. **h. bone:** U shaped bone situated with its arms facing backward, on the front of the neck at the site of the root of the tongue – U ఆకృతిలోనున్న జిహ్వామూలాస్థి, కంఠాస్థి, కాంఠిక ఎముక – ఇది మెడముందు భాగంలో దవడక్రింద గోచరమవుతుంది.

**hypaesthesia** or **hypesthesia** hypoaesthesia, hypoesthesia. diminished sensibility లఘు/తక్కువ చురుకుదనం.

**hypalgesia** hypoalgesia. decreased sensibility to pain వేదన లఘుగ్రాహ్యత, తక్కువగా నొప్పి తెలియుట.

**hyper-** combining form signifying 1. over ఎక్కువ. 2. excessive అతి. 3. more than normal మిక్కిలి.

**hyperacidity** excess of acid in the stomach జఠర అధికామ్లత: అన్నాశయములో అధిక అమ్లము; పులిత్రేణుపులు, నోట్లో నీళ్ళూరుట, గొంతులో మంట, అజీర్ణము, ఎదకాలినట్లుండుట, ఛాతిలో ఎదురురొమ్ము ఎముక వెనుక మంట (retrosternal burning, soreness) – ఇత్యాది లక్షణములు ఇందులో పరిపాటి. అలంకార. అధిక జఠరాగ్ని.

**hyperaemia** or **hyperemia** excess of blood in an area in the body శరీరంలో ప్రాంతీయ రక్తాధిక్యత/అధికరుధిరత.

**hyperaesthesia** or **hyperesthesia** 1. increased sensitivity to stimulation ఉద్దీపనమునకు సూక్ష్మగ్రాహ్యత హెచ్చు స్థాయిలో ఉండుట. 2. excessive sensibility/sensitivity, particularly to touch ముఖ్యంగా విశేషించి స్పర్శకు సం. అధిక చురుకుదనం.

**hyperalgesia** hyperalgia. increased sensibility to pain వేదన అతిగ్రాహ్యత, ఎక్కువగా నొప్పి తెలియుట.

**hyperbilirubinaemia** or **hyperbilirubinemia** serum bilirubin is high in this condition. సీరమ్‌లో బైలిరూబిన్ అధికముగానుండుట.

**hypercalcaemia** or **hypercalcemia** an excess of calcium in the blood రక్తములో కాల్షియమ్ జాస్తిగా ఉండుట.

**hypercapnia** hypercarbia, an excess of carbondioxide in the blood నెత్తురులో కార్బన్ డైఆక్సైడ్ ఎక్కువగా ఉండుట [*in contr.* hypocapnia].

**hypercholesterolaemia** or **hypercholesterolemia** an excess of cholesterol in the blood రక్తములో కొలెస్టరాల్ అధికముగా ఉండుట. (*N.B.* cholesterologenous foods: cake, pastry, chocolate, yellow of egg, ice cream and prawns *గమనిక:* కేక్, పేస్ట్రి, చాక్లెట్, గుడ్డులోని పచ్చపదార్థము, ఐస్‌క్రీమ్ మరియు రొయ్యలలో కొలెస్టరాల్ సమృద్ధిగా ఉంటుంది).

**hyperchromia** 1. hyperchromatic staining of the nucleus in a cell అధిరంజనము చేసిన తర్వాత కణములో కేంద్రకము ముదురురంగులో కానవస్తుంది. 2. increase in the haemoglobin of red blood cells ఎర్రరక్తకణములలో రక్తరంజకద్రవ్యము ఎక్కువగుట.

**hyperemesis** excessive vomiting అధికముగా వాంతులగుట. **h. gravidarum,** vomiting in the early weeks of pregnancy వేవిళ్ళు: గర్భిణి ప్రథమదశలో కలుగు వాంతులు, నాలుకకు అరుచి, ఏదైనా పుల్లటి పదార్థము నోట్లో వేసుకోవడం వగైరా పోకడలు; గర్భిణికి గుర్తు.

**hyperemia** *see/చూడండి* hyperaemia.

**hyperesthesia** *see/చూడండి* hyperaesthesia.

**hyperglycaemia** or **hyperglycemia** an excess of glucose in the blood characteristic of diabetes mellitus మధుమేహం జబ్బులో రక్తంలో చక్కెర ఎక్కువగా ఉండుట [*in contr.* hypoglycaemia].

**hyperhidrosis** *syn.* hyperidrosis. excessive sweating ఎక్కువగా చెమటపోయుట. *అలంకార. సతతార్ద్రిత.*

**hyperinsulinism** 1. excessive secretion of insulin by the pancreas క్లోమము ఎక్కువగా ఇన్సులిన్‌ను స్రవించుట. 2. Administration of excess of insulin by injection lands the patient in hypoglycaemia with weakness and sweating (also called insulin shock). ఇన్సులిన్ ఇంజక్షన్ మోతాదు ఎక్కువైతే రోగి బలహీనం చెంది, దిగజారి, చెమటలు పట్టి, అఘాతము (shock) నకు గురిఅవుతాడు. Giving glucose at this stage dramatically brings him back to normal. ఈ సమయంలో గ్లూకోస్ ఎక్కిస్తే వెంటనే పూర్తి స్వస్థత ఏర్పడుతుంది.

**hyperkalaemia** or **hyperkalemia** hyperpotassaemia, an excess of potassium in the blood రక్తములో పొటాసియమ్ ఎక్కువగుట.

**hyperlipaemia** or **hyperlipemia** hyperlipidaemia; elevation of lipids in the plasma ప్లాస్మాలో క్రొవ్వుపదార్థములు పెరుగుట.

**hyperlucency** increased radiolucency (hypertranslucency), a term in X-ray nomenclature, *e.g.* X-ray film in emphysema of lungs, excess air filled lungs, *see/చూడండి* emphysema. కిరణ భారలేఖనము (radiograph, *i.e.* X-ray) యొక్క పరిభాషాప్రకరణములో అతిపారప్రకాశకమైన (hypertranslucent) అనగా ఎక్కువ స్పష్టముగా కనపడేది, ఉదా. ఎమ్ఫిసీమా (ఊపిరితిత్తి వాయుకోశాలలో గాలి ఎక్కువైన జబ్బు)లో ఎక్స్‌రే ఫోటోలో మరింత నలుపుగాను, స్పష్టముగాను గోచరమవుతుంది.

**hypermastia** increased growth and size of breast(s) కుచవృద్ధి, స్తనవృద్ధి, కుచము(ల) సైజు పెరుగుట. అలంకార. ఇవికలది ఘనకుచవతి, ఘనస్తనవతి. చెట్టుకు కాయలు బరువా!

**hypermature cataract** excessively ripe cataract మితిమీరిన పక్వమైన శుక్లం [*q.v.* postmature labour].

**hypermetabolism** state of increased metabolism జీవ(న)క్రియ వేగముగా జరుగుట *e.g.* in thyrotoxicosis ఉదా. థైరాయిడ్ విజృంభణములో.

**hypermetropia** hyperopia. *colloq.* farsightedness, long-sightedness; a state of the eye vision wherein far vision is good but near vision is poor దీర్ఘదృష్టి: వస్తువు దూరము పెట్టుకుంటే బాగా కనపడుతుంది; చదివే పేజి/పుట దూరముగా పెట్టుకుంటే బాగా కనపడుతుంది – అనగా ఈ పైవి దగ్గరగా పెట్టుకుంటే దృష్టి/చూపు మాంద్యముగా ఉంటుంది [*in contr.* myopia భిన్న. నికటదృష్టి].

**hypermotility** increased motility/motion (of any organ) (ఏ అవయవములోనైనా) ప్రబలమగు చలనము *e.g.* A ride in a bus for 12 hours results in soft stool; increased motion of the intestine results in a free motion. ఉదా. పేగులలో చలనశక్తి పెరిగితే పురీషము పుస్సుమని/దఢాలున బయటపడుతుంది. బస్సులో 12 గంటలు

ప్రయాణము చేసివచ్చిన తర్వాత బస్సు/కదలిక/కుదుపుతోపాటు పేగుల చలనము పెంపొంది విరేచనం సాఫీగా అవుతుంది.

**hypernatraemia** or **hypernatremia** an excess of sodium in the blood రక్తములో సోడియమ్ ఎక్కువగుట.

**hypernephroma** renal cell carcinoma వృక్కకణముల కేన్సరు.

**hypernutrition** overfeeding, excessive eating and consequent ill effects, *see/చూడండి* obesity. మితిమీరి తినుట, తత్ఫలితంగా శరీరంలో దుష్పరిణామము.

**hyperostosis** hypertrophy of bone ఎముక పెరుగుదల.

**hyperparathyroidism** increased activity of the parathyroid endocrine glands; produces osteitis fibrosa cystica wherein bones become brittle due to decalcification పేరాథైరాయిడ్ అను వినాళికా గ్రంథులు ఎక్కువగా పనిచేయుట. దీనిమూలకంగా ఎముకలు కాల్షియమ్ కోల్పోయి, పెళుసుగా తయారైన/మారిన స్థితి. This is a disease of bones, groans and stones (in kidney). ఖటికరాహిత్యమైన ఎముకలు, మూలగటం, కిడ్నీలో రాళ్లు – ఇవి ఈ జబ్బు లక్షణములు.

**hyperphagia** overeating అధిక భక్షణము. gluttony తిండిపోతుతనం.

**hyperpiesis** or **hyperpiesia** essential hypertension అధిక రక్తపోటు వ్యాధి.

**hyperpituitarism** overactivity of the pituitary gland resulting in acromegaly, gigantism, *see/చూడండి* acromegaly, gigantism. పిట్యూటరి గ్రంథి ఎక్కువగా పనిచేయుట వలన మామూలు మనిషి మహాకాయుడుగా మారుట.

**hyperplasia** 1. Increase in the number of cells in an organ/tissue which in turn, increases its size అవయవము/కణజాలములోని కణములు సంఖ్యరీత్యా పెరిగి, తత్ఫలితంగా దాని పరిమాణం (size) పెరుగుట. 2. increased activity as a result of 1. ఉత్తేజం.

**hyperplastic** 1. relating to hyperplasia హైపర్ ప్లేసియాకు సం. 2. hyperactive ఉత్తేజ.

**hyperpnoea** or **hyperpnea** increase in the rate of respiration and depth of inhalation శ్వాసక్రియ ప్రమాణముపెరిగి, దీర్ఘ ఉచ్ఛ్వాసము చేయుట.

**hyperpyrexia** hyperthermia, increase in the body temperature above 105°F, *see/చూడండి* heat stroke. అమితజ్వరం: 105°F మించి శరీర ఉష్ణత నమోదగుట.

**hypersecretion** excessive secretion అధికస్రావము.

**hypersensitivity** allergy, *see/చూడండి* allergy. అతిసంవేదన శీలత, అతిగ్రాహకత్వం.

**hypertension** high blood pressure, *see/చూడండి* blood pressure. అధిక రక్తపోటు: రక్త ప్రసరణములో హెచ్చు ఒత్తిడి. definition నిర్వచనము Normal blood pressure is below $\frac{140}{90}$ mm Hg; a reading above it is called hypertension. $\frac{140}{90}$ mm Hg లోపు రీడింగ్ (reading) ఉంటే నార్మల్; దీనికి ఎక్కువ నమోదు అయితే అధికము. When there is no known cause, it is termed essential, idiopathic or primary hypertension. కారణములేనిచో ప్రైమరి హైపర్‌టెన్షన్ అంటారు. when there is a cause, secondary hypertension, *e.g.* renal disease కారణమున్నచో సెకండరి హైపర్ టెన్షన్ అంటారు, ఉదా. కిడ్నీవ్యాధిలో హైపర్ టెన్షన్. **endocrine h.,** adrenocortical hyperfunction, adrenal tumour ఎడ్రినల్ యొక్క విధి మరింత చురుకుగా నిర్వర్తించుట, ఎడ్రినల్ కంతి. **malignant h.,** when B.P. is above $\frac{200}{140}$mm Hg మారణమైన హైపర్‌టెన్షన్. **portal h.,** increase of pressure in the portal circulation, say in liver cirrhosis లివర్ జబ్బులో కాలేయములోని రక్తప్రసరణములో ఒత్తిడి ఎక్కువగుట. **pulmonary h.,** cor pulmonale; pulmonary heart disease wherein there is an increased pressure in the pulmonary circulation, say in mitral stenosis, lung fibrosis గుండెలో మైట్రల్ కవాటము ముడుచుకుపోయిన జబ్బులోను, ఊపిరితిత్తి గట్టిపడిపోయిన స్థితిలోను పుపుస ప్రసరణము (pulmonary circulation) లో ఒత్తిడి ఎక్కువగుట.

**hypertensive** an individual with high blood pressure తనలో రక్తపు ఒత్తిడి ఎక్కువగానున్న వ్యక్తి.

**hyperthermia** therapeutically produced hyperpyrexia అధికోష్ణ స్థితి: చికిత్సరీత్యా తెప్పించిన తీవ్రజ్వరం (hyperpyrexia). [*in contr.* hypothermia. భిన్న. అల్పోష్ణస్థితి].

**hyperthyroidism** Graves' disease, thyrotoxicosis: increased activity of the thyroid gland; goitre, *see/చూడండి* exophthalmos. థైరాయిడ్ తేజము, థైరాయిడ్ విజృంభణము: థైరాయిడ్ గ్రంథి చురుకుదనము/విధి ఎక్కువగుట; గళగండము, గొంతుకమీద పెరుగుతున్న కాయ.

**hypertonia** a state of increased tone of the voluntary/skeletal muscles, as a result of which they become stiff నియంత్రిత కండరాలయొక్క పట్టు (tone) ఎక్కువగుట, అప్పుడు అవి బిరుసైనవిగా అవుతాయి [*in contr.* hypotonia *భిన్న.* పితపితలాడు పేశి/కండరము].

**hypertonic** 1. pertaining to hypertonia బిరుసు ఎక్కువైన స్థితికి సం. 2. **h. saline** having greater osmotic pressure than body fluids అతిగాఢ: శరీరద్రవములలోకన్నా ఎక్కువ ద్రవాభిసరణ పీడనముగల ఉప్పునీరు [*Cf.* isotonic *తారత.* సమగాఢ].

**hypertrophy** increase in the size of cells in an organ/tissue which in turn, increases its volume. *N.B.* However, hypertrophy is not desirable. అతివృద్ధి; అవయవము/కణజాలములోని కణముల పరిమాణము పెరిగి, తత్ఫలితంగా అది పెద్దదగుట. *గమనిక:* అతివృద్ధి అనావృద్ధి.

**hyperuricaemia** or **hyperuricemia** a state of increase in uric acid in the blood, characteristic of gout రక్తంలో యూరిక్ ఆమ్లము శాతం పెరుగుట – ఈ స్థితి గౌట్ అను కీళ్ళనొప్పి వ్యాధికి అభిలక్షణిక సూచన.

**hyperventilation** pumping air in and out of the lungs rapidly శ్వాసప్రక్రియ జోరుగా జరుపుట. **hysterical h.,** overbreathing in hysteria హిస్టీరియా వ్యాధిలో శ్వాస పరుగులా తీయుట.

**hypervitaminosis** excessive intake of vitamins, especially of A and D, which produces ill effects విటమిన్‌లు అధిక మోతాదులో సేవిస్తే కలుగు దుస్థితి, ఉదా. విటమిన్ A మరియు D ఎక్కువైతే దుష్పరిణామాలు సంభవిస్తాయి.

**hypervolaemia** or **hypervolemia** increase in the plasma portion of blood రక్తములో ప్లాస్మా శాతం పెరుగుట.

**hyphaema** or **hyphema** hyphaemia, hyphemia. blood in the anterior chamber in the eye కన్నులోని పూర్వకక్ష్యలో రక్తం కూడుట.

**hypnoanalysis** psychoanalysis and psychotherapy under hypnosis రోగిని వశీకరణం చేసుకుని, మనో/అధివిశ్లేషణము, పరిశీలనము చేసి మరియు మనో/అధిచికిత్స చేయు మార్గము/పద్ధతి.

**hypnosis** a trance induced by the hypnotist wherein the patient becomes amenable to suggestions and commands. This is an art. వశీకరణం, సమ్మోహనము. రోగియొక్క మనస్సును సూచనలకు మరియు ఆజ్ఞలమేరకు అనువుగా తీర్చిదిద్దుట. ఇది ఒక నేర్పు. రోగి పరవశుడు అవుతాడు అనగా పరునకు (hypnotist కు) వశుడవుతాడు.

**hypnotherapy** 1. treatment of illness by hypnosis, *see/చూడండి* hypnosis. సమ్మోహనంద్వారా జబ్బులు నయం చేయుట. 2. altering of habits, *e.g.* smoking, by hypnosis సమ్మోహనము ద్వారా అలవాట్లను మార్చుట, ఉదా. పొగతాగే అలవాటును మాన్పించుట.

**hypnotic** an agent that induces sleep, a drug or lullaby (though lullaby is for a baby) నిద్రాకారి/నిద్రాకారకం, నిద్రపుచ్చే వస్తువు/సాధనము – మందుగాని లాలిపాటగాని (లాలిపాట శైశవంలో ఉన్నవారికి).

**hypnotism** the art of practising hypnotism పారవశ్యం కలుగజేయు కళ; సమ్మోహనశాస్త్రం.

**hypo-** combining form signifying 1. under తక్కువ. 2. inadequate సరిపోని. 3. less than normal మామూలుకన్నా తక్కువ. 4. defective లోపముగల, లోపముతో కూడిన.

**hypoadrenalism** waning of adrenal activity, Addison's disease ఎడ్రినల్ గ్రంథి క్షయించుట/క్షీణించుట, ఎడిసన్ పేరుగల రుగ్మత.

**hypocalcaemia** or **hypocalcemia** decrease in the blood calcium, producing tetany, *see/చూడండి* tetany. రక్తములో కాల్షియమ్ తక్కువగుట. దీనివలన టెటాని సంభవిస్తుంది.

**hypocapnia** hypocarbia, deficiency of carbon dioxide in the blood రక్తములో కార్బన్‌డైఆక్సైడ్ తక్కువగా నుండుట [*in contr.* hypercapnia].

**hypochlorhydria** decreased hydrochloric acid in the gastric juice లఘు జఠరామ్లత. అలంకార. నివురుగప్పిన నిప్పు (జఠరాగ్ని).

**hypochondria** or **hypochondriasis** anxiety about one's health రుగ్ణత బెంగ: తన ఆరోగ్యము గురించి ఆతురత.

**hypochondriac** 1. a person imagining illnesses attributable to his complaints రోగభ్రమగ్రస్తుడు, తన అస్వస్థలకు కారణము జబ్బులని మరియు తనకు జబ్బులు ఉన్నవని ఊహించుకొనుచుండు వ్యక్తి. 2. pertaining to the hypochondrium, *viz,* the region in the abdomen beneath the costal margin పక్కయెముకల క్రింది అంచు దిగువన ఉన్న ఉదరకుహరము యొక్క ప్రాంతమునకు సం.

**hypochondrium** the upper lateral region (right and left) of the abdomen, beneath the costal margin కోస్టల్ అంచు దిగువన ఉండే ఉదరప్రాంతం (కుడి మరియు ఎడమ).

**hypochromia** 1. hypochromatic staining of the nucleus in a cell అభిరంజనము చేసిన తర్వాత కణములో కేంద్రకము లేతరంగులో అగపడుతుంది. 2. decrease in the haemoglobin of red blood cells, *e.g.* anaemia ఎర్రరక్తకణములలో రక్తరంజక ద్రవ్యము తక్కువగుట, ఉదా. రక్తహీనము జబ్బు.

**hypodermic** beneath the skin చర్మము అడుగున. **h. injection,** injection underneath the skin చర్మము అడుగున ఇచ్చే సూది. **h. syringe** syringe to administer above injection పై సూదినిచ్చు సిరెంజి.

**hypodermis** tissue beneath the epidermis or surface of the skin, *see/చూడండి* hypodermic. అధశ్చర్మము: బాహ్యచర్మం అడుగున ఉన్న కణజాలము.

**hypofibrinogenaemia** or **hypofibrinogenemia** abnormally low concentration of fibrinogen, the blood clotting factor, Factor I in the blood రక్తంలో ఫైబ్రినోజన్, రక్తస్కందన ఫాక్టర్ యొక్క గాఢత బహుతక్కువగా ఉండుట.

**hypogastrium** the pubic region wherein the urinary bladder is situated అధోజఠరప్రాంతము, భగాస్థి ప్రాంతము, భగపీఠమువద్ద, జఘనప్రాంతము – ఇక్కడ మూత్రాశయమున్నది.

**hypogenitalism** diminutive sex organs కురుచ గుహ్య అవయవములు.

**hypoglossal** 1. under the tongue నాలుక అడుగున. 2. **h. nerve,** 12th cranial nerve 12 వ కపాలనాడి.

**hypoglottis** the undersurface of the tongue నాలుక దిగువ ప్రాంతం.

**hypoglycaemia** or **hypoglycemia** marked decrease of glucose in blood, *see/చూడండి* hyperinsulinism. *N.B.* Glucose is the key to metabolism. రక్తంలో చక్కెరశాతం ప్రమాదస్థాయికి తగ్గుట. *గమనిక:* చక్కెర జీవ(న)క్రియకు కీలకము – కణప్రాణము. [*in contr.* hyperglycaemia]

**hypogonadism** deficient activity of the gonads, *viz.* testes or ovaries with retarded growth of the reproductive organs బీజకోశముల (వృషణములు లేదా అండాశయములు) విధిలో లోపము మరియు ప్రత్యుత్పత్తికి సం. అవయవముల లోపము.

**hypohidrosis** hypoidrosis, hyphidrosis. diminished sweating చమట తక్కువగా పోయుట, లఘుస్వేదము.

**hypoinsulinism** 1. diabetes mellitus మధుమేహం. 2. lack of adequate insulin ఇన్సులిన్ తగిన పాళంలో లేకపోవుట.

**hypokalaemia** or **hypokalemia** hypopotassaemia, low level of potassium in the blood రక్తములో పొటాసియమ్ తక్కువగుట.

**hypomania** one type of mania, a mental disease మేనియా అను మానసిక రుగ్మతలో ఒకరకము/రీతి.

**hypomastia** hypomazia. smallness of the breasts చిన్నకుచములు/స్తనములు. *అలంకార.* ఇవి కలది కుఱుకుచవతి, చిఱుస్తనవతి.

**hypometabolism** state of decreased metabolism జీవ(న)క్రియ మందముగా జరుగుట. *e.g.* myxoedema *ఉదా.* థైరాయిడ్ మాంద్యము.

**hyponatraemia** or **hyponatremia** salt depletion, low level of sodium in the blood – One common cause is excessive sweating; salted buttermilk drink quenches the thirst and corrects the depletion. రక్తములో సోడియమ్ తక్కువగుట; శరీరములో ఉప్పుకొరత – తరచుగా, అధికముగా చమటపోసిన తదుపరి స్థితి; ఈ

స్థితిలో మజ్జిగలో ఉప్పువేసి తాగించి దాహము తీర్చాలి. గమనిక: ఉప్పు ఉత్కృష్ట లవణము. అలంకార. అందుచేతనే 'మీ ఉప్పుతిని బతికాను' అని కృతజ్ఞత వెలిబుచ్చుతూ ఉంటారు.

**hypoosmolarity** *syn.* hypotonicity. osmotic pressure lower than that of plasma. ద్రవాభిసరణ పీడనము ప్లాస్మాయొక్క ద్రవాభిసరణ పీడనముకన్నా తక్కువగా ఉండుట.

**hypoparathyroidism** state of inadequacy of parathormone, the hormone secreted by parathyroid glands, leading to tetany పారాథైరాయిడ్ గ్రంథులు స్రవించే హార్మోన్ తక్కువైతే సంభవించు స్థితి – దీనిని టెటాని అంటారు. Tetany is a disease with carpopedal (wrist and ankle) muscle spasm, cramps in muscles due to calcium deficiency. టెటాని జబ్బులో మణికట్టు మరియు చీలమండ కొంకర్లుపోవటం (కండరముల ఈడ్పువలన) కండరములలో, కాళ్లల్లో, పిక్కల్లో పిసికినట్లు పీకుడు (cramps) – వీటికి కారణం రక్తంలో కాల్సియమ్ తక్కువగుట.

**hypopharynx** laryngopharynx; గొంతులోని స్వరపేటిక ప్రాంతము. portion below the pharynx అధోగ్రసని, గొంతు దిగువభాగము.

**hypophysis** pituitary gland, the bandmaster of the endocrine orchestra పిట్యూటరి గ్రంథి, వినాళికా గ్రంథుల సహకారవాయిద్యంలో సూత్రధారుడు.

**hypopituitarism** defective pituitary function, *e.g.* failure of sexual maturation, dwarfism and obesity పిట్యూటరి గ్రంథి విధి/క్రమములో లోపము, ఉదా. గుహ్యాఅవయవములు కురుచగా నుండి, వికసించక, పరిపక్వతనొందకపోవటము మరియు బాలుడు/బాలిక కొవ్వుతోకూడిన ఒళ్ళు/ఒడలు చేసి మరుగుజ్జుగా ఉండుట.

**hypoplasia** deficient/under development of organ/tissue అవయవము/కణజాలముయొక్క పెరుగుదలలో లోపము.

**hypoproteinaemia** or **hypoproteinemia** deficiency of protein in blood రక్తంలో ప్రోటీన్‌లు తక్కువగుట. due to (i) deficient intake, *e.g.* poverty తిండిలోపం, ఉదా. దీదరికం (ii) increased excretion, *e.g.* proteinuria (albuminuria) ప్రోటీన్ (అల్బుమిన్) మూత్రంలో విసర్జింపబడటం.

**hypopyon** collection of pus in the anterior chamber of the eye కన్నుగుడ్డులోని పూర్వాంతకక్ష్యలో చీముచేరుట. **h. ulcer,** ulcer of the cornea due to the above pus పై చీమువలన శుక్లపటలముయొక్క వ్రణము.

**hyposecretion** reduced secretion, say by a gland స్రావము తక్కువగుట, ఉదా. గ్రంథి తక్కువగా స్రవించుట.

**hyposensitization** a treatment for allergy: habituating the tissues to the allergen (offending agent) by injecting gradually increasing, small doses of the same. Habit makes a man perfect, *see/* చూడండి allergy. ఈ పడని పదార్థము (allergen) చిన్నచిన్న మోతాదులలో శరీరమునకు సూది (injection) ద్వారా ఎక్కించి, కణజాలమునకు ఆ వైరిని విధేయుడుగా మార్చుట, అనగా అలవాటు పరచుట, అలంకార. తినగతినగవేము తియ్యనుండు.

**hypospadias** a developmental defect పిండము ఎదుగుతున్నప్పుడు లోపము. in males: The urethral opening is situated underneath the penis or on the perineum. పురుషులలో: మూత్రమార్గద్వారము పురుషాంగము క్రిందగాని/మూలాధారము (perineum) మీదగాని ఉండుట. in females: The urethra opens into the vagina. స్త్రీలలో: మూత్రమార్గద్వారము యోనిలోనికి తెరుచుకొనుట.

**hypostasis** hypostatic congestion, due to pooling of venous blood consequent on inadequate circulation రక్తప్రసరణ లోపంవలన సిరరక్తం నిల్వఅయి, ఆ ప్రాంతంలో రక్తాధిక్యత కలుగుట. hypostatic pneumonia, occuring in this state, especially in a weak, debilitated, old, bed-ridden patient ఈ స్థితిలో నుమోనియా ముఖ్యంగా బలహీన, ము(దు)సలి, మంచంపట్టిన రోగిలో చూస్తుంటాం.

**hyposthenia** weakness దుర్బలత్వం, బలహీనత, సత్తువ/పటుత్వంలో లోపము.

**hypotension** low blood pressure అల్పరక్తపోటు: బ్లడ్ ప్రెషర్ తక్కువ ఉండుట.

**hypothalamus** the part below the thalamus in the brain మెదడు లోని అధోపర్యంకము, థాలమస్ యొక్క క్రింది భాగము.

**hypothermia** subjecting the system (body) to low temperature thereby diminishing the metabolism of tissues and the need for oxygen, to enable time-consuming surgery, *e.g.* coronary artery bypass graft (CABG) అల్పోష్ణస్థితి: ఎక్కువకాలం పట్టే శస్త్రచికిత్సలో, ఉదా. గుండె బైపాస్‌లో శరీరాన్ని చల్లపరుస్తారు; ఈ స్థితిలో కణజాలముల జీవ(న)క్రియ తగ్గి, ప్రాణవాయువుయొక్క అవశ్యకతగూడా తక్కువ అవుతుంది, అపరేషన్‌కు తగిన వ్యవధి లభిస్తుంది.

**hypothyroidism** diminished thyroid activity; termed myxedema in adults, cretinism in children థైరాయిడ్ గ్రంథి తక్కువగా పనిచేయుట.

**hypotonia** a state of diminished tone of the skeletal muscles, as a result of which they become flaccid/flabby నియంత్రిత కండరాలయొక్క పట్టు (tone) తక్కువగుట, అప్పుడు అవి మెత్తబడి, పితపితలాడుతూ ఉంటాయి. [*in contr.* hypertonia భిన్న. పేశీ యొక్క బిర్రు/బిరుసు].

**hypotonic** 1. pertaining to hypotonia బిరుసు తగ్గిన స్థితికి సం. 2. having low osmotic pressure than isotonic సమగాఢ స్థితికన్నా తక్కువ ద్రవాభిసరణ పీడనము గల.

**hypovolaemia** or **hypovolemia** decrease in the plasma portion of blood రక్తంలో ప్లాస్మా శాతం తరుగుట.

**hypoxaemia** or **hypoxemia** 1. deficient oxygenation of the blood రక్తములో అమ్లజనిశాతం తగ్గుట. 2. reduced oxygen saturation in arterial blood ధమని రక్తంలో ప్రాణవాయువు సంతృప్తత తగ్గుట.

**hypoxia** less of oxygen supply to a tissue ఒక కణజాలమునకు ఆక్సిజన్ సరఫరా/పంపిణీ తక్కువగా ఉండుట.

**hystera** Greek root word for womb గర్భసంచికి మూలపదం.

**hysteralgia** pain in the uterus గర్భాశయవేదన.

**hysterectomy** surgical removal of the womb (uterus) గర్భాశయ ఛేద(న)ము: గర్భసంచి శస్త్రచికిత్సద్వారా తొలగించుట, వాడు.భా. పెద్ద అపరేషన్ [*Cf.* tubectomy *తారత.* చిన్న అపరేషన్].

**hysteria** a psychiatric disorder with outbreaks of rude, wild, uncontrolled excitement, *e.g.* stamping the legs on the cot; a trick to invite the attention of others/onlookers; the patient seldom hurts herself/himself! ఇది ఒక మానసిక జబ్బు. మోటు, వెర్రి, ఎడతెగని, ఉద్రేక కంపములతో చేయు చేష్టలు, ఉదా. కాళ్ళు మంచపు పట్టెలకు దఢాలున కొట్టడం. ఈ చేష్టద్వారా ఇంకొకరి/చూసేవాళ్ళ దృష్టి తన మీద ప్రసరించుకొనుటకు ఎత్తుగడ; రోగి తన్నుతాను గాయపరచుకోకుండా కాపాడుకుంటుంది/కాపాడుకుంటాడు సుమా!

**hysteritis** metritis, uteritis, inflammation of the uterus గర్భాశయం యొక్క ఇన్‌ఫ్లమేషన్.

**hystero-** or **hyster-** combining form denoting (i) the uterus గర్భాశయం. (ii) hysteria హిస్టీరియా.

**hysterodynia** hysteralgia. *see/చూడండి* hysteralgia.

**hysteropathy** any disease of the uterus గర్భసంచి యొక్క ఏదైనా జబ్బు.

**hysteroptosia** *see/చూడండి* hysteroptosis.

**hysteroptosis** or **hysteroptosia** metroptosis, metroptosia. prolapse of the uterus గర్భాశయం క్రిందకు జారుట.

**hysterotrachelorrhaphy** [Greek *trachelos* = neck]. repair with sutures of a lacerated cervix uteri గర్భాశయద్వారంయొక్క చితికిన గాయాన్ని కుట్లువేసి సరిదిద్దుట.

**hysterotomy** uterotomy. incision of the uterus గర్భసంచికి కత్తిగాటు.

**hysterosalpingectomy** excision of the uterus and Fallopian tubes గర్భాశయమును మరియు ఫెల్లోపియన్ నాళములను శస్త్రచికిత్స చేసి తొలగించుట/తీసివేయుట.

**hysterosalpingography** introducing a radioopaque dye into the uterus and taking X-ray film to study the patency of the uterine tubes గర్భాశయ ఫాలోపియన్ నాళముల చిత్రణం/చిత్రీకరణం; అపార దర్శకమైన/కాంతినిరోధక/కిరణాభేద్యమైన (radioopaque) అద్దకము గర్భాశయములోని కెక్కించి, అది ఫెల్లోపియన్ నాళములలోనికి పాకే నమూనా పరిశీలించుట; నాళముల మార్గము తెరచుకొని ఉన్నదా అని నిరూపించవచ్చును.

# I I

**iamatology** [Greek *iama* = remedy; *logos* = science]. the study or science of remedies. therapeutics. పరిహార ఉపాయములు (ఔషధం ఒకటి).

**iatrogenic** 1. 'induced by doctors' – adverse effects of treatment చికిత్సాప్రేరిత: 'డాక్టర్లవల్ల జనించినది/జరిగినది' – చికిత్సయొక్క దుష్ఫలితములు. 2. caused by a physician's words or actions, *see/చూడండి* misadventure. వైద్యునియొక్క పలుకులవలనగాని, చర్యల వలనగాని కలుగు పరిణామము. *Caution!* Consumer Protection Act is in force. *జాగ్రత్త!* వినియోగదారుల రక్షణ చట్టము అమలులోనున్నది.

**iatrology** medical science వైద్యశాస్త్రం.

**ibuprofen** a non-steroidal anti-inflammatory drug (NSAID) used to relieve arthritic, myalgic pains కీళ్ళనొప్పులు, కండరపోట్లు తగ్గించే ఔషధం.

**ICCU** *abbr.* intensive cardiac care unit in a hospital ఆస్పత్రిలో 'ముమ్మరమైన గుండెజబ్బుల పర్యవేక్షణ' విభాగం.

**ichor** a thin watery discharge from ulcer/wound రసి, కురుపురసి: వ్రణం/గాయం నుండి వచ్చే పల్చని నీరులాంటి ఊట.

**ichthyosis** dry rough scaly skin disorder, *see/చూడండి* xeroderma. ఎండిపోయి, కరకైన/గరకుగానున్న చేపలపైనున్న పొలుసులనుపోలే చర్మము యొక్క పరిణామము గలిగిన అపవ్యవస్థ.

**ICMR** *abbr.* Indian Council of Medical Research, New Delhi భారతీయ వైద్యవిజ్ఞాన పరిశోధన సంస్థ, క్రొత్తఢిల్లీ.

**icterus** jaundice పచ్చకామెర్లు, కామెర్లు, పసిమిరోగము, పసిరిక. **i. neonatorum**, jaundice in the newborn, *see/చూడండి* erythroblastosis. అప్పుడే జన్మించిన శిశువులో కలుగు కామెర్లు.

**ICU** *abbr.* intensive care unit in a hospital ఆస్పత్రిలో 'ముమ్మరమైన జబ్బుల పర్యవేక్షణ' విభాగం.

**identical twins** monozygotic t's, uniovular t's, twins developed from one fertilised ovum, with same features ఏకసంయుక్త బీజ కవలలు; పిండోత్పత్తి సమయమున ఒక ఫలదీకరణమైన అండమునుండి

ఏర్పడిన ఒకేరకమైన ఒకేలింగ కవలలు, సమరూపకవలలు, [*Cf.* fraternal twins తారత. రెండు అండాల కవలలు].

**idiocy** extreme mental retardation జడత్వం; మిక్కుటమైన మానసిక మాంద్యము.

**idiopathic** the cause of which is not known కారణము తెలియని.

**idiosyncrasy** 1. abnormal susceptibility to the adverse effects of an agent/drug peculiar to that particular patient. Many will not react. విపరీత ప్రకృతి: ఒక వస్తువు/ఔషధముయొక్క కీడైన దుష్ఫలితములకు లొంగే స్థితి – ఇది ప్రత్యేకించి ఒకానొక వ్యాధిగ్రస్తునకే వర్తించేది; అందరిలో ఇది చూడము. 2. temperament peculiar to a person విశేషముగా తన వ్యక్తిత్వ స్వభావము; నైజము; వ్యక్తియొక్క విచిత్రప్రవర్తనము.

**idiot** a person with idiocy, *see/చూడండి* idiocy. జడుడు, మూర్ఖుడు.

**Ig** *abbr.* immunoglobulin, a protein with antibody activity, present in the body fluids: 5 types Ig A, Ig D, Ig E, Ig G and Ig M శరీరద్రవములలోనున్న ప్రతిరక్షక గుణము కలిగిన ప్రోటీన్.

**IHD** *abbr.* ischaemic heart disease హృదయకుడ్య రక్తసరఫరా ప్రతిబంధము; గుండెగోడకు రక్తసరఫరా/పంపిణీలో లోపముగల హృద్రోగము.

**ileitis** inflammation of the ileum **regional i.,** Crohn's disease ఇలియమ్ (చిన్నప్రేగు, శేషాంత్రికము) యొక్క 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు', ఉదా. క్రోహ్న్ కనిపెట్టిన జబ్బు.

**ileocolitis** inflammation of ileum and colon శేషాంత్రికము మరియు బృహదాంత్రము యొక్క ఇన్ఫ్లమేషన్/శోథం.

**ileostomy** ileo=into ileum, stoma=opening. Ileum is brought out of the anterior abdominal wall and an opening made into it and it is fixed there. శేషాంత్రికమును ఎదుటి ఉదరకుడ్యము ద్వారా బయటకు తీసి, అందులో రంధ్రముచేసి, దానిని అక్కడ కుట్టివేయుట. This acts as an artificial anus. ఇది కృత్రిమ పాయువువలె అమర్చబడి ఉంటుంది. This procedure is adopted in diseases like cancer of the colon, thereby bypassing the colon. పెద్దపేగు (colon)

కేన్సరులో ఈ పద్ధతి అవలంబిస్తారు అనగా పెద్దపేగునుండి మలాన్ని ఉపమార్గం (bypass) ద్వారా తరలించడానికి.

**ileum** the distal portion of the small intestine శేషాంత్రికము, చిన్నపేగు ఆఖరి భాగము.

**ileus** intestinal obstruction ఆంత్రావరోధము, పేగులకు అడ్డము. **adynamic i.,** due to inhibition of motility of the bowel పేగులో చలనము మందముగా నుండుటవలన. **mechanical i.,** due to mechanical causes, adhesion, stricture, *etc.* ప్రాంతీయ కణజాలములకు కట్టుబడిపోయిన స్థితి, పేగు పరిధి ముడుచుకొని పేగులో మార్గము సన్నగిల్లుట, మొ. **paralytic i.,** due to sluggish peristalsis in the intestine, a complication after abdominal surgery పేగులలో చలనశక్తి క్షీణించి సోమరి అయిన పేగులు (తమవిధి నిర్వర్తించలేకపోవుట) – ఈ పరిణామము ఉదరకుహర శస్త్రచికిత్స తరువాత ఎదుర్కొనెడి ఘట్టము.

**iliac** relating to the ilium శ్రోణ్యస్థికి సం. **right i. fossa** కుడి శ్రోణ్యస్థి పల్లపు ప్రాంతం. **left i. fossa** ఎడమ శ్రోణ్యస్థి పల్లపు ప్రాంతం.

**ilium** os ilium. upper wide portion of the hip bone శ్రోణ్యస్థి, కటికపాలము.

**illusion** misinterpretation of an entity, *e.g.* mistaking a rope for a snake ఆరోపము, భ్రాంతి, భ్రమ, ఉదా. తాడును చూసి పాము అని భయపడుట.

**IM** or **i.m.** *abbr.* intramuscular కండరంలోనికి. **IM injection** or **i.m. injection** కండరములోనికి సూది/ఇంజెక్షన్.

**IMA** *abbr.* Indian Medical Association భారతీయ వైద్యసంస్థ.

**imageology** the science of producing images ప్రతిబింబ నిర్మాణ శాస్త్రం. Images of various organs in the body can be picturized on a photographic film. Formerly, these pictures have been prepared with the use of X-rays ఫొటోఫిల్మ్ మీద వివిధ అవయవముల ప్రతిబింబములు నమోదు చేయునగును. పూర్వం ఎక్స్‌రే వాడుక ద్వారా ఈ ప్రతిబింబములను నిర్మించేవారు. In recent years, ultrasonography, computerised tomography (C.T. scan), isotopes

and magnetic resonance imaging (MRI) have been introduced; amongst these ultrasonography and MRI do not use harmful radiations ఇటీవల అల్ట్రా సోనోగ్రఫీ, సి.టి. స్కాను, ఐసోటోపులు మరియు MRI అమలులోనికి వచ్చాయి; వీటిలో అల్ట్రాసోనోగ్రఫీ మరియు MRI ప్రక్రియల్లో హానికల్గించే వికిరణముయొక్క దుష్ఫలితాలు లేవు/ఉండవు.

**imaging** the production of diagnostic (radiological) images, *e.g.* radiography, fluoroscopy, ultrasonography, scintillation photography. **magnetic resonance i.**, MRI, a method of visualising the soft tissues of the body శరీరంలోని కండరాలు, నాడులు విశదీకరించడం.

**imbalance** want of balance అసమానత్వం. **acid-base i.** అమ్ల - క్షార అసమానత్వం. **electrolyte i.** విద్యుద్వాహక లవణ అసమానత్వం.

**immobilisation** making a part immovable, *e.g.* applying a plaster cast over the site of fracture of a bone ఒక భాగమును కదలికలేకుండా చేయుట, ఉదా. ఎముక విరిగినచోట విరిగిన అంచుల కదలికను అరికట్టుటకై ప్లాస్టర్ పట్టీ వేయుట.

**immune** resistant to a disease అసంక్రామ్య, ప్రతిరక్షిత, వ్యాధినిరోధక, వ్యాధినెదుర్కొను.

**immune body** an antibody ప్రతిరక్షకము, శరీర రక్షక పదార్థం.

**immune response** response of the body to an antigen by way of producing antibodies, *see/చూడండి* immunity, immunization. ఏంటిజన్‌కు విరుగుడుగా శరీరం ప్రతిరక్షకాలను (antibodies) తయారు చేసుకొనుట.

**immune system** tissues of the body that recognize and attack antigens, *see/చూడండి* immune. వ్యాధినిరోధక వ్యవస్థ: ఏంటిజన్‌లను గుర్తించి వాటితో పోరాడే కణజాలములు.

**immunity** 1. development of resistance to a disease అసంక్రామ్యత (సంక్రమించకుండా ఉండుట), ప్రతిరక్షితము, ప్రతిరక్షకము, వ్యాధినిరోధకశక్తి, శరీరరక్షణశక్తి, వ్యాధినెదుర్కొనుశక్తి పొందుట. 2. development of ability to check a disease process వ్యాధినరికట్టు

శక్తిని చేకూర్చుకొనుట. 3. security against a disease వ్యాధినుండి నిర్భయత. 4. mustering defences to attack/oppose a disease, *e.g.* through vaccination రక్షణోపాయములు క్రోడీకరించి వ్యాధిని ప్రతిఘటించు శక్తి, ఉదా. టీకాల ద్వారా. There are two types of active acquired immunity స్వయముగా ఆర్జించిన వ్యాధినెదుర్కొను శక్తి రెండు రకాలు. **I(a) active acquired immunity after disease,** *e.g.* After an attack of measles, the person develops antibodies (defensive agents) against measles to defend the body, *i.e.* he develops immunity against subsequent attacks of measles. జబ్బుపడ్డతర్వాత, స్వయముగా ఆర్జించిన వ్యాధి నెదుర్కొనుశక్తి, ఉదా. పొంగు (measles) ఒకసారి సంక్రమిస్తే, వ్యక్తి దానికి ప్రతిరక్షకాలు (antibodies) తనశరీరంలో తయారుచేసుకుంటాడు. వీటి మద్దతువలన తదుపరి మరల పొంగువ్యాధిరాకుండా నివారించుకొనగలడు. **I(b) active acquired immunity after vaccination,** *i.e.* injecting the individual with attenuated or dead bacteria or viruses. The dose/amount of bacteria or virus is potent enough to enable the body to develop antibodies but not strong to cause disease, *e.g.* BCG vaccination against tuberculosis, diphtheria toxoid, tetanus toxoid టీకా తర్వాత, స్వయముగా ఆర్జించిన వ్యాధి నెదుర్కొను శక్తి, ఉదా. నిర్వీర్యమైన/దిటవులేని (attenuated) లేదా మృతమైన, బాక్టీరియా లేదా వైరస్‌ను టీకాద్వారా శరీరంలోకి ఎక్కించుట. ఈ చర్యతో ఈ క్రిములు శరీరం ప్రతిరక్షకాలు తయారు చేసుకోవటానికి దోహదం చేస్తాయి, కాని జబ్బును కల్గించేటంత దృఢవంతమైనవి కావు (దిటవులేనివి కాబట్టి), ఉదా. క్షయనివారణములో బి.సి.జి. టీకాలు, డిఫ్తీరియా టాక్సాయిడ్, టెటానస్ టాక్సాయిడ్. **II passive acquired immunity after immunisation:** This is conferred by injecting foreign antibodies into an individual. These antibodies are the ones formed in an immune animal, *i.e.* one which has been immunised against the disease under consideration, say in tetanus, diphtheria. This procedure is resorted to in patients already in the grip of disease; there is no meaning in waiting for antibodies to develop as in **I(a) or I(b)** above, since he needs immediate protection. టీకా

సహాయంతో అర్జించిన వ్యాధి నెదుర్కొనుశక్తి: ధనుర్వాతము (tetanus), కంఠవాతము(diphtheria) లో ఈ జబ్బులకు ప్రతిరక్షకాలు పశువులలో తయారుచేసిన వాటిని టీకాద్వారా మనిషిలోనికెక్కించడం. రోగికి తన శరీరంలో ప్రతిరక్షకాలు తయారుచేసుకొనటానికి వ్యవధి పడుతుంది; జబ్బుయొక్క కోరలలో చిక్కుకున్న వారికి ఈ ఆలస్యం తగదు, అందుచేత ఈ మార్గం అవలంబిస్తారు.

**immunization** induced by vaccination టీకాతో కలుగజేయు. the process of artificially inducing/conferring immunity to a specific disease నిరోధీకరణము, ప్రతిరక్షీకరణము, అసంక్రమీకరణము, వ్యాధి నిరోధక శక్తి కలుగజేయుట, వ్యాధినెదుర్కొను శక్తి కలుగజేయు కృత్రిమ కృషి/పద్ధతి. **active i.,** *see/చూడండి* immunity I(b). . **passive i.,** *see/చూడండి* immunity II.

**immunoassay** a bioassay; quantitative assessment of antigen-antibody reaction జీవమాపకం; ఏంటిజన్-ప్రతిరక్షక ప్రతిచర్యను కొలచే నిర్ధారణ మాపనం (assay).

**immunocompetence** the capability to develop immune response following exposure to antigen ఏంటిజన్ సంపర్కమువలన వ్యాధి నెదుర్కొను శక్తి పొందుటకు దక్షత.

**immunocompromised** a state of attenuated immune response నిర్వీర్యమైన/దిటవుతప్పిన వ్యాధినెదుర్కొను శక్తిగల స్థితి. during i) use of immunosuppressive drugs వ్యాధినెదుర్కొను శక్తిని అణచివేయు ఔషధముల వాడుకలోను, ii) by irradiation రేడియోధార్మిక చికిత్సలోను, iii) by malnutrition శరీరపోషణ లోపములోను, iv) by cancer కేన్సరులోను.

**immunocyte** a leucocyte capable of producing antibodies ప్రతిరక్షకాలు తయారుచేసే తెల్ల రక్తకణం.

**immunodeficiency** waning immune response due to disorder or deficiency of lymphoid cells లింఫాయిడ్ కణముల లోపమువలనగాని, సంఖ్యతగ్గుటవలనగాని వ్యాధినెదుర్కొను శక్తి లోపించుట.

**immunology** 1. biomedical science dealing with the phenomena of immune systems in the body వ్యాధినిరోధక విజ్ఞానం: శరీరములో

వ్యాధినెదుర్కొను విధానముల గురించి తెలియజేయు జీవవైద్యశాస్త్రము. 2. Immunology, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**immunostimulation** stimulation of an immune response, e.g. by the use of BCG vaccine in tuberculosis వ్యాధినెదుర్కొను శక్తి విధానములను ఉత్తేజపరచుట, ఉదా. క్షయవ్యాధిలో బి.సి.జి. టీకా.

**immunosuppression** artificial suppression of the immune response, *see/చూడండి* immunocompromised. వ్యాధినెదుర్కొను శక్తిని కృత్రిమముగా అణచివేయుట.

**immunotherapy** వ్యాధినిరోధక శక్తిని పెంచే చికిత్స. 1. passive immunisation, *see/చూడండి* immunity II. టీకాతో కలుగజేయు. 2. replacement with immunocompetent tissue, *e.g.* lymphoid tissue, say thymus వ్యాధినెదుర్కొనుశక్తి దక్షతగల థైమస్‌ను శరీరంలోకి చేర్చుట.

**impacted** wedged in firmly. **i. bone end in a fracture** విరిగిన ఎముకలలో ముక్క ఇరుక్కొనుట. **i. tooth** ఇరుక్కున్న పన్ను.

**impaction** the state of getting stuck బంధింపబడి నిలచిపోవుట. **fecal i.**, scybala; hardened feces stuck in rectum అంతర్ఘటన: విరేచనము గట్టిరాళ్ళలాగా తయారై మలాశయములో నిర్బంధింపబడుట, అలంకార. ప్రతి మలవిసర్జన ప్రసవవేదనే.

**impair** 1. weaken బలహీనపరచు. 2. damage health ఆరోగ్యం చెడిపోవు. 3. impair defences (in the body) (శరీర) రక్షణ అరికట్టు/అరికట్టి.

**impalpable** not felt to touch (palpation), *e.g.* spleen not palpable చేతికి అందక, ఉదా. ప్లీహము చేతివేళ్ళకు తాకకుండుట.

**imperforate** unopened అఛిద్రము. **i. anus,** అఛిద్ర ఆసనము. *N.B.* A wise midwife looks at the anus after the birth of the baby for the patency of the os. *గమనిక:* తెలివైన మంత్రసాని బిడ్డపుట్టగానే ఆసనద్వారము తెరచియున్నదా అని ముడ్డిని పరిశీలించు తుంది. **i. hymen,** test proof of virginity, *see/చూడండి* virgin. అఛిద్రయోనిపొర, కన్యాత్వమునకు ఋజుత్వము.

**impermeable** not allowing a liquid to pass through ద్రవాన్ని పోనీయకుండా. **i. membrane** అపారగమ్య పొర.

**impetigo** impetigo contagiosa; strepto/staphylo coccal skin infection with pustules and yellow crusts సూక్ష్మజీవులవలన చర్మమునకు సోకుడు, కురుపులు, పుండ్లు; పసుపుపచ్చ చీము పక్కులుగట్టుట.

**implant** to insert లోపల దోపుట. **penile i.**, in case of impotence, planting a structure into the shaft of the penis to help erection of the same నపుంసకత్వంలో పురుషాంగములో ఒక నిర్మాణమును దోపుట; ఇది అంగమును నిటారుచేయుటలో తోడ్పడుతుంది.

**implantation** process of inserting/grafting a drug, tissue, living or inert material, radioactive material into the body, *e.g.* 1. implanting a pellet నాటటం: ఒక ఔషధముగాని, కణజాలముగాని, జీవ లేదా జడ పదార్థముగాని రేడియోధార్మిక శక్తిగల పదార్థముగాని శరీరములోనికి దోపుట/అంటుగట్టుట, ఉదా. ఒక చిన్న ఉండ దోపుట. 2. accidental implantation of malignant tumour cells in an incision/wound అపాయకరమైన కంతి కణములు గాటు/గాయములో నాటుకొనుట. 3. silicon breast implantation to beautify the shape of breast (plastic surgery) స్తనములకు సౌందర్యము వృద్ధి జేయు రూపకల్పన శస్త్రవైద్యవిన్యాసము.

**impotence** lack of strength, especially copulative బలహీనత, ముఖ్యంగా సంభోగ దుర్బలత్వము.

**impregnation** 1. fertilisation ఫలదీకరణము. 2. rendering a woman pregnant వాడు.భా. కడుపుచేయుట. 3. saturation సంతృప్తస్థితి, పూర్ణముగ నిండియుండుట.

**impulse** *physiol.* stimulus. ప్రచోదనము, ప్రేరణ. 1. an impelling sudden force ముందరకు త్రోయు, అకస్మాత్తైన విద్యుచ్ఛక్తిలాంటి ప్రసారము. **cardiac i.** గుండె ప్రచోదనము. **nerve i.** నాడీప్రచోదనము. 2. a sudden inclination to act on the spur of the moment, without conscious thought విచక్షణ లేకుండగానే, అనాలోచితంగా, అప్పటికప్పుడు నిర్ణయం తీసుకునే ఆకస్మిక ప్రేరిత చర్య.

**inanition** 1. exhaustion అలుపు. 2. state due to starvation నిరాహార, నిర్జల దీక్షలో నిస్త్రాణ, అన్నపాన రాహిత్యముయొక్క పర్యవసానము.

**inarticulate** 1. disjointed కలయికలేని, సంబంధములేని. 2. without joint కీలులేని. 3. defective articulation/speech ఉచ్చారణ స్పష్టముగా లేకపోవుట.

**inborn** congenital పుట్టుకతో వచ్చిన. *e.g.* inborn error of metabolism ఉదా. పుట్టుకతో వచ్చిన జీవ(న)క్రియదోషము.

**inbreeding** *biol.* breeding (reproduction) within a closely related group which results in increased frequency of abnormalities, *e.g.* certain mental defects in humans, *see/*చూడండి consanguineous marriage. దగ్గర సంబంధం ఉన్న వాళ్ళలో ప్రత్యుత్పత్తివలన అవాంఛనీయ దుర్ఘటనలు, ఉదా. మనుష్యులలో మానసిక లోపములు.

**incest** coitus between persons too closely related to marry రక్తసంబంధమున్న వాళ్ళమధ్య లైంగిక సంభోగము. వావివరసలు తప్పి వ్యభిచరించడం. ఇది విచిత్రమైన, వింతయైన విడ్డూరము; హేయము. As legend goes, Cleopatra indulged in this. చారిత్రాత్మకంగా చదివితే క్లియోపాట్రా ఈ చేష్టచేసేదట.

**incidence** number of new cases occurring in a certain period of time (usually one year) సంభవము: కొంత కాలప్రమాణము (ఒక సంవత్సరము) లో జబ్బుకు గురిఅయ్యే ప్రజానీకము, *e.g.* incidence of tuberculosis ఉదా. ఒక సంవత్సరములో ఎన్ని క్షయవ్యాధి కొత్తకేసులు వస్తాయో అంచనావేయుట.

**incipient** initial, in its early stages, *e.g.* **i. heart failure** గుండె సోలిపోవుదశ ప్రారంభము. **i. tooth decay** పన్ను పుచ్చుటలో ప్రథమదశ.

**incision** surgical cut with a scalpel గంటు, కోత: శస్త్రచికిత్సలో పదునుకత్తితో కోయుట. *N.B.* incision by doctor, healing by Lord Almighty *గమనిక:* డాక్టరు గాటు పెడ్తాడు. భగవంతుడు మాన్పుతాడు. *figur.* Incision is the operating surgeon's signature on the body. *అలంకార.* సర్జన్‌గాటు ఆయన శరీరంమీద చేసిన చేవ్రాలు/సంతకం.

**incisor** 1. designed for cutting కొరుకుటకు వీలుగానున్న. 2. four teeth in the upper jaw, four in the lower jaw for cutting food items కత్తెరపండ్లు, కొరికేపండ్లు; ఆహారపదార్థములను కొరికే పండ్లు; నాలుగు పైవి, నాలుగు క్రిందవి.

**incompatible** not suitable జతకాని, సరిపడని. *e.g.* incompatible blood for transfusion ఉదా. రక్తము ఎక్కించుటకు అనువుకానిది.

**incontinence** lack of control/inability to hold something అపుకొనలేకపోవటము. **fecal i., urinary i.** మలమూత్రములు అపుకొనలేకపోవుట.

**inco-ordination** 1. lack of co-ordination of muscles, *see/చూడండి* co-ordination. సమన్వయలేమి: కండరములు 'కలిసికట్టుగా' పనిచేయలేకపోవుట. 2. ataxia as a result of 1. పైనచెప్పిన దాని పర్యవసానము చలనములో తూలటం.

**incrustation** formation of a crust or scab over a wound or healing ulcer. పుండు లేక గాయంపై ఎండిన పక్కు కట్టుట.

**incubation** 1. provision of proper environment for culture, especially maintenance of temperature, *see/చూడండి* culture. పొదగటము: సూక్ష్మక్రిముల సంవర్ధనమునకు తగిన వాతావరణము సృష్టించుట, ముఖ్యముగా ఉష్ణతమీద దృష్టి ఉంచుట. 2. incubation period of an infectious disease, the period from the entrance of the pathogen into the body to the development of symptoms అంతరగత కాలము: రోగబీజములు శరీరములో నాటిన రోజు లగాయతు మొదటి రోగలక్షణం కనపడేవరకుగల వ్యవధి. 3. process wherein a premature baby is nursed after birth నెలలు పూర్తికాకుండానే జన్మించిన శిశువును కాపాడే ప్రక్రియ. 4. hen hatching its eggs కోడి తన గ్రుడ్లు పొదుగుటకు సరియైన ఉష్ణత కలుగజేయుటానికి వానిపైన కూర్చుండును.

**incubator** an apparatus/contrivance for providing incubation స్థిరోష్ణ

**incura**

2. sa

తన ;

**Incus** anvil, one of the ossicles in the ear, *see/చూడండి* anvil, ear. అస్థిక, చెవిలో ఒక నలుసు ఎముక, కంసాలివాని దాగలి(ని పోలిన) ఎముక.

**Indian gooseberry** *bot.* the fruits have high vitamin C content ఉసిరికాయలు. వీటిలో సి విటమిన్ సమృద్ధిగా ఉంటుంది.

**Indian hemp** *bot.* 1. a fibre-bearing plant జనపమొక్క; its fibre జనపనార. 2. bhang or ganja prepared from it and it is an intoxicant ఈ మొక్కనుండి భంగ్/గంజాయి తయారుచేస్తారు – ఇది నిషాకారి.

**Indigenous** native దేశీయ. belonging naturally to the same soil or country స్వదేశీయమైన. **i. medicine** నాటుమందు.

**Indigestion** dyspepsia, a consequence of indigestion: acid eructations, belching, hyperacidity, heartburn, stimulation of saliva, vomiturition, lack of well-being, lack of concentration on domestic chores అజీర్ణముయొక్క పర్యవసానము: పుల్లిత్రేపులు/త్రేపులు, అస్వవాయువులు, ఎదగాలుడు/ఛాతీమధ్యలో అన్నవాహికవెంబడి మంట, నోట్లో నీరు ఊరడం అనగా లాలాజలం స్రవించడం, డోకు వచ్చినట్లుండటం/ఓకరించుకొనడం, తోచకపోవడం, దైనందిన జీవిత విధులలో మనస్సు/ఆసక్తి లేకపోవడం. These subjects often complain of headache which is relieved after vomiting or use of antacids. దీనికి గురియైనవారు అప్పుడు తలనొప్పి అంటారు; వాంతితర్వాతగాని, ద్రావకవిరుగుడు ఔషధములతోగాని ఈ తలభారం తగ్గుతుంది. **acid i.**, hyperchlorhydria, *see/చూడండి* acidity, hyperacidity. అజీర్తి, పుల్లిత్రేపులు. **fat i.**, steatorrhea, fatty stool కొవ్వు జాస్తి అయిన మలము. **gastric i.**, in stomach diseases; in tummy abuse అన్నాశయము జబ్బులలో అభోజ్య భోజనంలో అజీర్తి. **intestinal i.**, in diseases of intestines పేగుల జబ్బులో అజీర్తి. **sugar i.**, fermental diarrhoea with much gas పొంగు, నురుగుతో కూడిన మలము; అధిక అసనవాయువులు/అపానవాయువులు (పిత్తులు).

**indole** a substance which gives the offensive odour to the faeces విరేచనములోని దుర్గంధమునకు కారణము. *N.B.* Indole and skatole are twin malodours. *గమనిక:* ఈ రెండూ జంట హేయములు.

**indolent** slow to heal నెమ్మదిగా నయమగు. **i. ulcer.,** slow growing, less painful and refractory to treatment మెల్లగా పెరిగే, నొప్పి కొంచమే ఉన్న, చికిత్సకు లొంగని వ్రణము. may undergo malignant change అపాయ పరిణామము గమనిస్తుండవలెను.

**induced abortion** *see/చూడండి* therapeutic abortion in abortion. చికిత్సరీత్యా ప్రేరేపించబడిన (మందులతోగాని, శస్త్రచికిత్సతోగాని) గర్భస్రావం.

**induction** the act of initiation ఆరంభము. 1. **i. of anaesthesia** మత్తుమందు మొదలు పెట్టుట. 2. **i. of labour** పురుడు/కాన్పు ప్రారంభము. 3. induction of medical students into the course of study వైద్య విద్యార్థులను కాలేజ్‌లో ప్రవేశపెట్టడం.

**indurated** stony hard రాయిలాంటి గట్టితనం. **i. growth,** exclude malignancy in this. ఈ పెరుగుదలలో అపాయ పరిణామము వచ్చిందా అని జాగరూకతతో పరీక్షచేయవలెను/చేస్తూ ఉండవలెను.

**indwelling** remaining inside లోపల నిలచియుండే. **i. catheter** in an organ; for drainage or introduction of medicines, nutrients అవయవములో స్థిరమైన గొట్టము; ఇది విసర్జనమార్గముగాగాని, ఔషధములు లేదా పోషకములు ఎక్కించడానికిగాని ఉపయోగపడుతుంది.

**inebriation** intoxication, especially in a habitual drunkard, drunkenness త్రాగుబోతుతనం వలన మైకం: తాగుడుకు అలవాటు పడి ఆ వ్యసనమునకు బానిస అయినవారిలో మైకం.

**inertia** no movement; lifeless జడత్వము; స్తబ్దత. **uterine i.,** strike of the uterus గర్భాశయము సమ్మె/బందు.

**infant** toddler from one month upto one year (British opinion) or two years (American opinion) of age శిశువు: పుట్టిన ఒకనెల నుండి ఒక సంవత్సరము (బ్రిటిషువారి అభిప్రాయం) లేదా రెండు సంవత్సరముల (అమెరికన్ వారి అభిప్రాయం) వయస్సువరకు పసికందు, పసిపాప; [తరువాత క్రమేణ పసివాడు/పసిపిల్ల].

**infanticide** murder of an infant శిశుహత్య, శిశువధ.

**infantilism** continuation of infantile characteristics further in life శిశుత్వం: రెండు సంవత్సరములు దాటినతర్వాతగూడ శైశవం (infancy) నిలచియుండుట.

**infarct** an area of ischaemic necrosis caused by the occlusion (block) of the arterial supply to that region or venous drainage from that region ఇన్‌ఫార్క్ట్ (చచ్చు): ఒక ప్రాంతములోని ధమనులలో అడ్డము సంభవించినప్పుడు లేదా ఆ ప్రాంతపు సిరలలో అడ్డము సంభవించినప్పుడు ఆ ప్రాంతములో రక్తసరఫరా లేకపోవుట వలన ధాతువిచ్ఛిన్నత జరుగుతుంది.

**infarction** 1. the process of the formation of an infarct రోధ గలనము: ఇన్‌ఫార్క్ట్ (చచ్చు) అవతరణ తర్వాత జరుగు పరిణామము. 2. *colloq.* infarct. **acute myocardial i.,** the process of necrosis in the heart muscle which is in progress గుండె కండరములో ధాతువిచ్ఛిన్నత జరుగుతున్నది. **cardiac i.,** an area of myocardial infarct హృదయపేశీచచ్చు: హృదయకుడ్యములో ప్రాంతీయ ధాతు విచ్ఛిన్నత. **cerebral i.,** an area of ischaemic necrosis in the brain మస్తిష్కములో ప్రాంతీయ ధాతువిచ్ఛిన్నత/చచ్చు. **pulmonary i.,** an area of ischaemic necrosis in the lung ఊపిరితిత్తిలో ప్రాంతీయ ధాతువిచ్ఛిన్నత/చచ్చు.

**infection** invasion of tissues by harmful microorganisms and their multiplication producing heat, redness, swelling and pain around the region affected సూక్ష్మజీవి సంపర్కము, సంక్రమణం, క్రిమిసంసర్గము, సోకుడు, అంటు(వ్యాధి), సంసర్గదోషము, క్రిమికాటు. సూక్ష్మజీవులు కణజాలములోనికి ప్రవేశించి, అక్కడ సంఖ్యలో వృద్ధి చెంది, వేడిమి, ఎర్రదనము, వాపు, నొప్పి, మంట కలుగజేయుట. అలంకార. బాక్టీరియా బెడద. **airborne i.,** through air and dust గాలి మరియు దుమ్ముద్వారా. **droplet i.,** through droplets on coughing from a patient, *e.g.* tuberculosis, cold (coryza) ఊపిరితిత్తుల క్షయ జబ్బు ఉన్నవాళ్ల దగ్గిన కళ్లె తుంపరలలో క్రిములుంటాయి. జలుబు, పడిశం చేసినవారు దగ్గిన, తుమ్మిన తుంపురులలో జలుబు వైరస్ ఉంటుంది. ఇవి ఆరోగ్యవంతులు పీలిస్తే, వాళ్లు ఆ జబ్బుకు గురి

అవుతారు. **endogenous i.,** reactivation of tubercle bacilli in a dormant primary focus, as in tuberculosis క్షయవ్యాధి: ప్రథమ బాసిల్లై సంపర్కము (primary infection) లోని క్షయబాసిల్లై తరువరి వాడిచేంది విజృంభించుట. **water borne i.,** through drinking water: diarrhoea, cholera, infective hepatitis (jaundice), *etc.* త్రాగేనీరు ద్వారా సంక్రమించునవి: అతిసారము, కలరా, కాలేయము జబ్బు (కామెర్లు), వగైరా.

**infectious** 1. contagious సంపర్కదోష. **i. disease,** said of a disease caused by bacteria, viruses, parasites or fungi బాక్టీరియా, వైరస్‌లు, పరాన్నజీవులు లేదా శిలీంధ్రాల వలన కలిగే జబ్బులు. 2. said of an emotion, infectious enthusiasm. Laughter is very infectious. రాగ, భావ అనుభూతి. నవ్వు నలుగురిని జతచేస్తుంది; ఒకరు నవ్వుతుంటే పదిమందీ నవ్వటం మొదలుపెడతారు.

**inferior** in anatomy lower structure శరీరనిర్మాణ శాస్త్రములో దిగువన, క్రింద ఉన్నది, ఉదా. అధో నిర్మాణము [*in contr.* superior భిన్న. పైన, అధి].

**inferiority complex** 1. Alfred Adler's hypothesis: an attitude of frustration while attempting to assume superiority న్యూనతా కాంప్లెక్స్, ఆల్‌ఫ్రెడ్ అడ్లర్ ప్రతిపాదన: ఆధిపత్యంకోసం పెనుగు/ పాకులాడటంలో కుంఠనం (frustration)/నిరాశ లేదా నిస్పృహ మూలకంగా జనితమైన వైఖరి. 2. an attitude of low self-esteem ఆత్మగౌరవాన్ని తక్కువ అంచనా వేసుకునే స్థితి.

**infertility** sterility వంధ్యత్వము, సంతానప్రాప్తి లేకుండుట. lack of reproduction ప్రత్యుత్పత్తి లేకుండుట, గొడ్డుమోతుతనము, గొడ్రాలు తనము.

**infestation** 1. insects, ticks, mites harbouring on animals infesting/troubling the skin and/or its appendages (nails, hairs) of man పురుగులతో బాధపడుస్థితి: జంతువులను ఆశ్రయించి ఉండెడు పురుగులు, కొణుజులు/గోమార్లు, తవుటి పురుగులు, మనిషియొక్క చర్మము మీద మరియు చర్మము యొక్క ఉపాంగముల (నఖములు, వెంట్రుకలు)మీద నెలవు ఉండి పీడించుట/సతాయించుట. 2. infestation

by parasitic helminths having dual existence in an animal and man and trouble/harass him పశువులోను మరియు మనిషిలోను రెండు నివాసము గల పరాన్నజీవి పురుగులు (parasitic helminths) మనిషి కణజాలములను బాధించుట/పీడించుట.

**infiltration** process by which substances pass into/insinuate tissues, cells, or the spaces in between cells చొచ్చుకొనిపోవటము: పదార్థములు మెల్లగా, ఉపాయముగా కణజాలములోనికి, కణములలోనికి, లేదా కణముల మధ్యకు చొరబడుట. **adipose i.,** infiltration of fat cells leading to obesity కొవ్వు కణములు దూరుట, క్రమేణ కొవ్వుకాయుడు అవుతాడు. **cellular i.,** especially malignant cells, the process is called malignant infiltration, metastases. This is the result of migration of the malignant cells through blood or lymph stream. ముఖ్యముగా అపాయకర కణములు, ఉదా. కేన్సరు కణములు రక్తముద్వారా, లింఫ్‌ద్వారా మిగత కణజాలములలోనికి చొరబడుట – దూరప్రాంతములో పిలకలు వేయుట (distant metastases). **fatty i.,** deposit of fat in between cells, say in an organ, liver (also called fatty change) కణముల మధ్యలో కొవ్వుచేరుట, ఉదా. కాలేయకణముల మధ్య కొవ్వుచేరుట (కొవ్వు పరిణామము). **i. anaesthesia,** infiltrating tissues with local anaesthetic కణజాలములలోనికి మత్తుమందు విస్తరింపజేసి, ఆ ప్రాంతమును మొద్దుబారినట్లు చేయుట.

**infirm** weak or ill, especially from old age బలహీనంగా లేదా సుస్తీగా, ముఖ్యంగా వృద్ధాప్యంలో.

**infirmary** a hospital where infirm people are treated వైద్యశాల, ముఖ్యంగా వయోవృద్ధులకు.

**infirmity** 1. the state of being sick రోగంతో ఉండటం. 2. a disease or illness వ్యాధి లేదా జబ్బు.

**inflammation** a protective, self-limited tissue reaction/response to an offending insult, usually by way of infection/injury శోథము, ప్రదాహము: సూక్ష్మజీవి సంపర్కమువలనగాని/గాయములవలనగాని శరీరానికి బెడద కలిగినప్పుడు క్షేమకవచమై, నాశకణజాలములకు హద్దునొసగే ప్రక్రియ/ప్రతిఘాతము. This is a proof of the wrath expressed by

the body to the offending insult and fight put up, which is a primordial instinct of every living being. ఇది సజీవ ప్రాణులలోని ఉత్సుకతకు నిదర్శన: శరీరము పగవాటిని ఎదుర్కొనుటకు సన్నాహము చేయుట, పోరాడుట. Inflammation indicates that the body is alert. శోథములో దేహం మెలకువగా ఉన్నదని సూచన. అలంకార. పరాకు చిత్తగించకుండా, ఏమరుపాటులేని జాగరూకత. Tissues are on war-footing. కణజాలములు యుద్ధప్రాతిపదికమీద పోరాడుతున్నాయి. The classical signs are pain (dolor), heat (calor), redness (rubor), swelling (tumor). దీనిని సూచించు విస్పష్ట వికారములు: నొప్పి, వేడి, ఎరుపు/కందు, వాపు. *N.B.* vicious sequence: injury → dust → germs → infection → inflammation; mellow it by medicine గమనిక: దుష్టపరంపర: దెబ్బ/గాయం → దుమ్ము/మురికి → క్రిమి సంపర్కం → ఇన్‌ఫ్లమేషన్. ఇన్‌ఫ్లమేషన్ అనగా ఊతక (tissue) ఆగ్రహం; ఈ ఆగ్రహానికి అనుగ్రహం డాక్టర్ ఔషధం. **acute i.**, of sudden onset; all above features present అకస్మాత్తుగా సంభవించినది; పై చెప్పిన వికారములతో కూడినది. **catarrhal i.**, especially of mucous membranes, marked by outpouring of exudative fluid, *e.g.* common cold శ్లేష్మపొరల కందు, ఉదా. రొంప/జలుబులో ముక్కు వెంబడి నీరుకారుట. **chronic i.**, prolonged inflammation, *e.g.* chronic sinusitis దీర్ఘకాలపు బాధ, ఉదా. కపాలకుహరముల వాపు. **purulent i.**, suppurative; pus formation చీము చేరుట. **ulcerative i.**, necrosis of tissues and ulcer formation కణజాలముల విచ్ఛిన్నత జరిగి, వ్రణము అగుట.

**influenza** *colloq.* flu. 1. an acute viral infection of the upper respiratory tract, with fever, chills, headache, sorethroat, cough, myalgic pains and exhaustion విషపడిశము: వాడు.భా. ఫ్లూ, ఉద్రిక్తమైన రుగ్మత; ఊర్ధ్వశ్వాసనాళప్రాంతములో వైరస్ సంపర్కము వలన కలుగుతుంది; జ్వరము, వణకు, తలనొప్పి, గొంతుకనొప్పి, దగ్గు, కండరములలో నొప్పులు, అలసట. 2. Flu can lead to encephalitis in kids. పిల్లల్లో మెదడువాపు వ్యాధికి దారితీయవచ్చును.

**infrared** electromagnetic radiation, *e.g.* **i. radiation** ఉదా. పరారుణ విద్యుదయస్కాంత వికిరణము. [*q.v.* ultraviolet].

**infundibulum** funnel shaped structure గరాటా రూపంలో మున్న నిర్మాణము. *e.g.* 1. **i. of the uterine tube** అండవాహికలోని భాగం. 2. expanding portion of a calix as it opens into the pelvis of the kidney వృక్కద్రోణిలోనికి తెరుచుకునే కాలిక్స్ యొక్క విస్తరించే భాగం.

**infusion** administration of a fluid into a vein, other than blood (in case of blood, the term transfusion is used) ఏ ద్రవమైనా సిరలోనికి ఎక్కించుట (రక్తము ఎక్కించుటకు వేరే పదం వాడ్తారు).

**ingestion** 1. taking by mouth, eating తినుట; drinking త్రాగుట; *figur.* Food is a festive pleasure for the mouth. అలంకార. ఆహారం ఆస్వవినోదం, శరీర సుఖానుభవం. 2. taking a drug by mouth ఔషధము నోటిద్వారా సేవించుట.

**inguinal** region of groin గజ్జ. *anat.* **i. canal** గజ్జకుల్య. **i. hernia,** *see/చూడండి* hernia. **i. lymph nodes** గజ్జలో లింఫ్‌గ్రంథులు.

**inhalant** a drug in the form of a gas, vapour or aerosol గాస్, ఆవిరి లేదా గాలితుంపర రూపంలో ఉన్న ఔషధం.

**inhalation** 1. inspiration ఉచ్ఛ్వాసము. 2. **oxygen i.** వాడు.భా. ఆక్సిజన్ పెట్టుట/ఇచ్చుట. 3. inhalation therapy; inhaling drugs in the form of nebuliser or aerosol, *see/చూడండి* aerosol. 4. Tr. Benzoin inhalation టింక్చర్ బెంజాయిన్ సలసలకాగే నీళ్లలో వేసి ఆవిరిపట్టుట.

**inhaler** a device used for inhaling, *e.g.* inhaler in asthma పీల్చే సాధన(ము), ఉదా. ఉబ్బసంలో ఈ సాధన.

**inheritance** derive qualities, physical or mental characteristic from an ancestor పూర్వీకుల నుండి గుణములు, విశిష్టలక్షణము పొందుట [*Cf.* hereditary].

**inhibitor** inhibiter. one which inhibits (a drug or agent) నిరోధకము – గతియొక్క చురుకుదనం తగ్గించేది (మందుగాని వస్తువుగాని).

**injection** 1. forcing a fluid into a part by means of a syringe సూదిమందు: సిరెంజ్‌ద్వారా శరీరములోనికి ద్రవమును ఎక్కించుట. **hypodermic i.**, subcutaneous, underneath the skin చర్మముక్రింద

ఇచ్చేది. **intraarticular i.**, into a joint కీలులోనికి. **intradermal i.**, *e.g.* Mantoux (tuberculin) testing చర్మములోనికి అనగా చర్మము పొరల లోనికి. **intramuscular i.**, into a muscle కండరములోనికి. **intravenous i.**, into the vein సిరలోనికి సూదిమందు. 2. in pharmacy: drug in the form of injection ఇంజక్షన్ రూపంలో ఉన్న ఔషధము. 3. congestion, say of a mucous membrane – redness and swelling శ్లేష్మపొరయొక్క కందు/ఎర్రదనము మరియు ఉబ్బు.

**injured person** wounded/hurt person క్షతగాత్రుడు, క్షతము = lesion.

**injury** physical harm శారీరక హాని. **grievous i.** ఘాతకమైన, తీవ్రమైన గాయం. **simple i.** సామాన్యమైన గాయం/దెబ్బ.

**innards** *n.pl.* stomach and/or bowels అన్నాశయము మరియు/లేదా పేగులు. *colloq.* pain in my innards వాడు.భా. కడుపులో నొప్పి.

**innate** 1. inherent at birth పుట్టుకలోనే అంతర్గతమైన. 2. natural, *e.g.* natural resistance స్వాభావికమైన, స్వభావసిద్ధమైన, *ఉదా.* స్వాభావిక నిరోధకశక్తి. [*in contr.* acquired *భిన్న.* ఆర్జించబడిన].

**innervation** 1. nerve supply to a part నాడీప్రసరణ, నాడీ ప్రసారము: ఒక భాగానికి నాడీతంతులు విస్తరించుట. 2. supply of nervous energy to a part ఒక భాగానికి నాడీశక్తి ప్రసారమగుట.

**inoculation** 1. introduction of microorganisms, secreta/excreta, *etc.*, into a culture medium, as a diagnostic tool వ్యాధినిర్ణయమునకై సూక్ష్మజీవులను, స్రవము లేదా విసర్జనము వగైరా పదార్థములను కల్చర్ చేయుట. 2. vaccination, also called inoculation as a method of immunization, *e.g.* **cholera i.**, *see/చూడండి* immunisation. టీకాలు వేయుటము: *ఉదా.* కలరా టీకా.

**inoperable** not in a stage for surgical operation, *e.g.* inoperable cancer ఆపరేషన్‌కు అలవికాని, *ఉదా.* శస్త్రచికిత్స వీలుకాని కేన్సర్.

**inorganic** 1. not organic, not containing carbon అకార్బనిక. 2. not composed of living substances, *i.e.* neither animal nor vegetable, *e.g.* minerals జడ, అచేతన, నిర్జీవ, నిరింద్రియ: జీవరహిత

పదార్థాలు అనగా వృక్ష లేదా పశు జాతికి చెందనివి, ఉదా. ఖనిజములు [*in contr.* organic. భిన్న. కార్బనిక; సేంద్రియ].

**inpatient** indoor patient ఆస్పత్రిలో చేరిన రోగి. one who is admitted in the hospital [*in contr.* outpatient భిన్న. బయటనే ఉండి మందులు తీసుకునేరోగి].

**inquest** judicial enquiry regarding the manner of death which occurred under suspicious circumstances మరణ విచారణ: సంశయాత్మక పరిస్థితులలో చావు ఎలా సంభవించినదో అని చర్చించే న్యాయశాస్త్రపు చట్టరీత్యా విచారణ.

**insanity** mental illness ఉన్మాదము, వెర్రి, పిచ్చి.

**insect** belongs to the class of arthropods; a small animal having six legs, *e.g.* fly, ant, mosquito; vectors/carriers of disease-producing organisms కీటకము, ఆరుకాళ్ళ చిన్నజంతువు, ఉదా. ఈగ, చీమ, దోమ; జీవులకు వ్యాధి కల్గించే ఆరోహకాలు/వాహకాలు.

**insecticide** -cide=killing. an agent that kills insects కీటక సంహారి.

**insemination** process of depositing seminal fluid into the cervical canal వీర్యసేచకము, వీర్యసేచనము, వీర్యనిక్షేపము: శుక్రద్రవము యోనిద్వారములోనికి చేర్చుట. **artificial i.**, through artificial means, *e.g.* through a syringe కృత్రిమ/కల్పిత పద్ధతిద్వారా, ఉదా. సిరెంజ్ ద్వారా. methods: సంతాన సాఫల్యమార్గములు/పద్ధతులు: 1. **IVF In Vitro Fertilization** – test tube fertilization (in vitro), so called *colloq.* test tube baby గాజుగొట్టములో ఫలదీకరణము, (శరీరమునకు బహిర్గతము). 2. **GIFT Gamete Intra Fallopian Transfer** (in vivo) – Both sperm and eggs are collected from the man and woman and injected into the Fallopian tube through laparoscopy. సంయోగబీజాలు ఫెల్లోపియన్ నాళములోనికి చేర్చు ప్రక్రియ (జీవిలో అంతర్గతము). పురుష శుక్రకణములు మరియు స్త్రీనుండి గుడ్లు కలిపి ఫెల్లోపియన్ నాళములోనికి శస్త్రచికిత్సద్వారా చేర్చుట. 3. **SIFT Semen Intra Fallopian Transfer** (in vivo) In case of cervical hostility to semen, *viz.* rejection of sperm by cervix, semen is processed and healthy spermatozoa are introduced into the

woman's Fallopian tube through laparoscopy. శుక్రము ఫెల్లోపియన్ నాళములోనికి చేర్చు ప్రక్రియ (జీవిలో అంతర్గతము) – గర్భసంచి ద్వారము శుక్రమునకు వైరత్వముచూపి, నిషేధించిన పరిస్థితిలో, ప్రత్యేక పద్ధతిలో పరిణామము చేసిన సజీవ ఆరోగ్యవంతమైన శుక్రకణములను ఫెల్లోపియన్ నాళములోనికి శస్త్రచికిత్సద్వారా చేర్చుట. *N.B.* Babies are no longer a gift of God, but a miracle of Science. *గమనిక:* భ్రూణములు/శిశువులు దైవసృష్టి అని పరిపాటి కాని, ఈ రోజుల్లో శాస్త్రసృష్టిమహిమగా మారుతున్నాయి.

**insensible** without our knowledge/cognizance స్మృతిలేని: తెలియకుండా జరిగే. **i. perspiration,** sweating not cognizable అజ్ఞేయమైన స్వేదము/చమట.

**insertion** 1. putting in దోపుట. *e.g.* insert penis into vagina పురుషాంగమును యోనిలోనికి ప్రవేశపెట్టుట. 2. inserting a canula into a vein సిరలోనికి ప్రవేశిని ప్రవేశపెట్టుట. 3. inserting a tube into an opening ఒక రంధ్రంలోనికి ట్యూబ్‌ను పోనిచ్చుట. 4. inserting a 35mm slide in a slide projector 35 మి.మి. స్లైడును ప్రొజెక్టర్‌లో అమర్చుట. 5. attachment of a muscle on the bone [*in contr.* origin] కండరము ఎముకమీద ఇన్‌సర్షన్ అనగా అతుకుకొనుట [భిన్న. మొదలు]. 6. in dentistry, intraoral placement of a dental prosthesis కృత్రిమపన్ను పరికరము నోట్లో అమర్చుట. 7. insertion of an artificial valve in the heart గుండెలో కృత్రిమ కవాటం పెట్టుట. 8. insertion of thread in a needle సూదిలో దారం గుచ్చుట. 9. insertion of a refill in a ball point pen బాల్‌పాయింట్ కలంలో రీఫిల్ వేయుట. 10. putting cells inside an ophthalmoscope నేత్రాంతర్దర్శినిలో బాటరీలు వేయుట. 11. inserting cells into the remote control of a TV set టి.వి. రిమోట్ కంట్రోల్‌లో బాటరీలు నింపుట.

**insidious** coming surreptitiously and causing harm ప్రచ్ఛన్నమైన: దొంగతనముగా రూపొందు మరియు హానికలిగించు. gradual and subtle progress, *e.g.* **i. disease** క్రమేణ గుప్తంగా వృద్ధిపొందే వ్యాధి. *e.g.* cancer *ఉదా.* కాన్సర్.

**in situ** 1. in position స్వస్థానంలో. 2. describes a cancer that has not metastasized or invaded neighbouring tissues, called carcinoma in situ పరిసరప్రాంతాలకు ప్రాకకుండా, పుట్టిన ప్రాంతానికే స్థానికమైన కేన్సరుకంతి.

**insolation** 1. exposure to the sun's rays సూర్యరశ్మి సోకుట. 2. sunstroke ఎండవడదెబ్బ.

**insomnia** lack of adequate sleep to annul exhaustion నిద్రలేమి రోగం: నిద్రారాహిత్యము, అలసటను నివృత్తిచేసేనిద్ర లేకపోవుట, సుఖనిద్రలేమి.

**inspiration** breathing in ఉచ్ఛ్వాసము, గాలిపీల్చుకొనుట. taking air into lungs ఊపిరితిత్తులలోనికి గాలితీసుకొనుట, పూరకము [*in contr.* expiration భిన్న. నిశ్వాసము].

**inspissated** hardened చిక్కబడటము, గట్టిపడిన. dried ఎండిపోయిన. fluid part of a mass evaporated ఒక ముద్దలోని ద్రవభాగము ఆవిరైపోయిన. **i. material/mass,** ఈ పై పరిణామము చెందిన పదార్థము.

**instil** or **instill** to pour/put in by drops చుక్కలు వేయుట.

**instillation** 1. insertion of drops into (a) eye (b) ear. (a) కంట్లో (b) చెవిలో చుక్కలు వేయుట. 2. instilling courage in/into a patient రోగికి ధైర్యము చెప్పుట.

**instinct** a natural inborn tendency ప్రవృత్తి, ప్రకృతి, స్వభావం, ఉత్సుకత, ఉత్సుకము, అంతర్బుద్ధి; సహజాతము, స్వాభావిక, సహజమైన ప్రకృతి. 1. **parental i.,** to protect children తల్లిదండ్రులకు పిల్లలను కాపాడుకోవాలని తపన/యావ/ధ్యాస. 2. **i. of love** ప్రేమ, జన్మముతో పుట్టిన ప్రకృతి/అంతర్బుద్ధి. 3. **i. for survival,** longing for survival; an instinct of a dying patient to survive upto the last minute ప్రాణం మీద తీపితో అవసానదశలోకూడా అఖరి క్షణం వరకు బ్రతకాలని వాంఛ. గమనిక: ప్రాణం మీద ప్రేమ అపారం.

**insufficiency** incompetence. function not adequate to the need చాలకుండటము: ధర్మము/విధి అవసరానికి తగినట్లు నిర్వర్తించలేకపోవుట. **adrenal i.,** hypoadrenalism ఎడ్రినల్ గ్రంథి విధి మాంద్యము.

**aortic i.**, lack of proper closure of the aortic valve, *see/చూడండి* aortic regurgitation. బృహద్ధమని కవాటముయొక్క చలనదోషము. **coronary i.**, lack of proper blood supply to the myocardial wall గుండె కుడ్యమునకు రక్తసరఫరా ఇబ్బంది. **mitral i.**, producing mitral regurgitation మైట్రల్ కవాటముయొక్క చలనదోషము. **thyroid i.**, slackness of the thyroid gland, hypothyroid state థైరాయిడ్ గ్రంథి మాంద్యము.

**insufflation** blowing of air, powder into a body cavity or space around an organ గాలితో కొట్టుటము: శరీరములోని కుహరము లేదా అవయవము అంచున స్థలములో గాలిగాని, పొడిగాని ఒత్తిడితో నింపుట. **Eustachian i.**, of air to remove block; politzerization స్రోతః పథములోని అడ్డు తొలగించుటకు అందులోనికి గాలిపంపుట. **perirenal i.**, of air around kidney and take an X-ray film మూత్రపిండ పరిధిలో గాలినింపి ఎక్స్‌రే ఫోటో తీయుట. **tubal i.**, of carbondioxide into the Fallopian tubes and take an X-ray film, to study the patency of the tubes ఫాలోపియన్ నాళములోనికి కార్బన్‌డైఆక్సైడ్ పోనిచ్చి ఎక్స్‌రే ఫోటో చిత్రించుట, నాళముయొక్క మార్గము పరిశీలించుట.

**insulin** secretion of the pancreas which governs the metabolism of glucose. When there is lack of adequate insulin or unresponsiveness to it, glucose accumulates in the blood and gets excreted in the urine. This state is called diabetes, *see/చూడండి* diabetes. ఇన్సులిన్ క్లోమముయొక్క స్రావము. గ్లూకోస్ జీవ(న)క్రియ కొరకు ఇన్సులిన్ అవసరము. ఇన్సులిన్ తక్కువైతే లేదా అది వినియోగింపబడకపోతే రక్తంలో చక్కెర ఎక్కువ అవుతుంది, మూత్రంలో చక్కెర పోతుంది. ఈ స్థితిని డయాబిటీస్ అనగా మధుమేహ వ్యాధి అంటారు.

**integument** 1. skin చర్మము. 2. serves as a cover కవచమువలె కాపాడుతుంది.

**intellectual** 1. having great mental ability బుద్ధిశాలి, ధీమంతుడు. 2. person of high intelligence మేధావి, ప్రజ్ఞాశీలి, గొప్ప/ఎక్కువ తెలివిగలవాడు. 3. having power of discrimination వివేకవంతుడు.

**intelligence** inborn mental ability పుట్టుకతో వచ్చిన మేధాశక్తి. charm of/in life జీవితపు రంజు/ఆకర్షకము. lost in some diseases, e.g. sequel to encephalitis కొన్ని జబ్బుల్లో మేధ మరుగున పడుతుంది, ఉదా. మెదడువాపు వ్యాధి పర్యవసానము. **i. quotient, IQ** ప్రజ్ఞాప్రమాణము, ప్రజ్ఞాన ప్రమాణశీలత; ప్రజ్ఞాలబ్ధి, తెలివి/వివేక సూచిక.

**intemperate** 1. habitually indulging in drinking too much alcohol త్రాగుబోతు. 2. said of climate: extreme/high temperature వాతావరణంలో అమిత వేడిమి.

**intensive care** 1. the care of critically/dangerously ill patients అపాయకరమైన స్థితిలో ఉన్న రోగుల పర్యవేక్షణ. 2. ICU – intensive care unit in a hospital ఆసుపత్రిలో ముమ్మర/తీవ్ర వ్యాధుల చికిత్స విభాగం.

**intercostal** in between ribs రెండు పక్కయెముకల మధ్య. **i. drainage,** tube inserted in the intercostal space for drainage of fluid in the pleural cavity రెండు పక్కయెముకల మధ్య గొట్టము బిగించి, దాని ద్వారా ఊపిరితిత్తి పైనపొరలో చేరిన ద్రవము ద్రవించటానికి/కార్చటానికి ఉపాయము/సాధనము.

**intercourse** connection, association సాంగత్యం. 1. **sexual i.,** coitus రతికేళి. 2. dealings with people ప్రజలతో వ్యవహారము.

**intercurrent** occurring during something ఒక ఘట్టములో తోడు/ఉపరి ఘట్టము. **i. illness,** 1. an illness occurring during the course of the original disease and influencing/modifying it, *e.g.* superadded bacterial (staphylococcal) infection on coryza/cold, a viral disease అసలు జబ్బులో ఇంకొక కొసరు జబ్బు; ప్రథమజాడ్యము తాలూకు అదనపు జాడ్యము, ఉదా. జలుబు (వైరస్ వ్యాధి)లో బాక్టీరియా దాడి. 2. a second disease which is unrelated to the original one, in a patient already suffering from one disease, e.g. a gastric ulcer patient getting scabies. ఒక జబ్బుతో బాధపడుతున్న రోగికి మరియొక జబ్బు సంక్రమించుట, ఉదా. జఠరవ్రణంతో బాధపడుతున్న రోగికి గజ్జి సంక్రమించుట, అలంకార. మూలిగే నక్కమీద తాటికాయ పడినట్లు.

**interferon** 1. a protein effective against some viruses. కొన్ని వైరస్ జబ్బులలో ఉపయోగించే ప్రోటీను. 2. used in the treatment of a tumour, multiple myelomatosis ఈ కంతిని తగ్గించడంలో వాడ్తారు.

**intermittent** 1. exhibiting alternating episodes of activity and inactivity of the disease process విడిచి విడిచి వచ్చే: జబ్బు స్థితి కొంతకాలం అణగి ఉండుట, కొంతకాలం ప్రకోపించుట. 2. occurring at intervals ఎడముగల. **i. claudication,** *see/చూడండి* claudication.

**intern** also interne. advanced student trainee in a hospital ఆసుపత్రిలో పురోగమించిన, అధిక ఆసక్తి మరియు జ్ఞానం కలిగిన వైద్యవిద్యార్థి. Internship is the stage of training of an intern. వైద్యశిక్షణలో ఒక దశ.

**internal** situated inside లోని, లోపలి, అంతర. [*opp.* external. వ్యతి. వెలుపలనున్న]. **i. organs** అంతర్గత అవయవములు, అంతర అవయవములు.

**internatal** between the buttocks రెండు పిరుదులమధ్య.

**internist** specialist in internal medicine వైద్యనిపుణుడు.

**interosseous** in between bones ఎముకల మధ్య. **i. membrane** ఎముకల మధ్యపొర.

**interphalangeal** between the phalanges అంగుళ్యాస్థులమధ్య. **i. joints** వేళ్ళకణుపులు (చేతివేళ్ళమీద అగపడుతాయి).

**interscapular region** area between the two shoulder blades రెండు అంసఫలకముల/బుజఫలకముల మధ్య ఉన్న ప్రాంతము.

**intersex** 1. any individual who has anatomic characteristics of both sexes to varying degrees స్త్రీ, పురుష లైంగిక శరీరనిర్మాణ విశిష్టలక్షణములు వివిధ నిర్మాణదశలలో (అనగా కొద్దిగానో, గొప్పగానో) ఉన్న వ్యక్తి. 2. in whom the external genitalia are either ambiguous or inappropriate for either the normal male or female బాహ్యలైంగిక అవయవములు సందిగ్ధంగా ఉండుట; లేదా స్త్రీ, పురుష భేదం తగిన రీతిలో సూచించకుండా ఉండుట. also *see/చూడండి* hermaphroditism, pseudohermaphrodite.

**interstices** interstitium. 1. *naked eye str.* ప్రత్యక్ష.చూ. spaces in an organ. అవయవములలో ఖాళీస్థలములు. 2. *micro.str.* సూక్ష్మ.చూ. spaces in between cells in a tissue కణజాలములో కణముల మధ్య ఖాళీ స్థలములు.

**interstitial** relating to the interspaces in a tissue మధ్యాంతర: కణజాలములలో కణముల నడుమ/మధ్య ఉన్న స్థలము (మధ్యస్థలము). **i. fibrosis of lungs** ఈ మధ్యస్థలములలో నారతంతువుల పదార్థము (fibrosis) నెలవుకొనుట.

**interstitial pulmonary fibrosis** 1. *naked eye str.* ప్రత్యక్ష.చూ. diffuse interstitial lung disease/fibrosis, grade V advanced stage, lung converted into cystic spaces, say diameter of one centimetre or more జబ్బు 5వ దర్జ అనగా ముదిరిన జబ్బు – ఇందులో రెండు ఊపిరితిత్తులలోనూ ఒక సెంటిమీటర్ లేదా అపైన ఖాళీస్థలాలు కనపడతాయి. 2. *micro.str.* సూక్ష్మ.చూ. diffuse fibrosing alveolitis, grade I mildest stage when the disease is confined to the alveolar walls జబ్బు ప్రథమదర్జ అనగా లేత జబ్బు – ఇది వాయుకోశకుడ్యముల శోథం ప్రారంభిస్తున్నప్పటి దశ.

**intertrigo** erythematous irritated area over the flexural aspect, say in front of the elbow, in the groin రాపిడిగల ప్రాంతములో, ఉదా. చేతి ముడుకులో, గజ్జలో ఒరసికొని పోవుట.

**intervertebral** in between vertebrae కశేరుకల/వెన్నెముకల మధ్య. **i. disc** అంతర్ కశేరుక చక్రిక.

**intestinal** *adj.* of intestine. pertaining to the intestine ఆంత్రిక/ఆంత్ర. పేగులకు సం.

**intestine** lumen of digestion ఆంత్రము, పేగు, ప్రేవు. **large i.**, about 5 feet long పెద్దపేగు, బృహదాంత్రము, షుమారు 5 అడుగుల పరిమాణము. **small i.**, about 20 feet long చిన్నపేగు, షుమారు 20 అడుగుల పరిమాణము. duodenum, the proximal portion ఆంత్ర మూలము, చిన్నప్రేగు యొక్క మొదటిభాగము. jejunum, the middle portion, మధ్యాంత్రము, చిన్నపేగు యొక్క రెండవభాగము; ileum, the distal portion, శేషాంత్రికము, చిన్నపేగు యొక్క మూడవభాగము.

**intima** innermost లోపలి. *e.g.* **tunica i.**, innermost layer in the blood vessel రక్తనాళములోని లోపలిపొర.

**intolerance** inability to tolerate అసహనము: సహించుటకు వీలుకాని స్థితి. **drug i.** ఔషధము సహించలేకపోవుట. **lactose i.**, diarrhoea, vomitings even after little consumption లాక్టోస్ అను చక్కెర పదార్థము సహించలేకపోవుట అనగా ఇది మోతాదులో తీసుకున్న తర్వాతగూడ విరేచనములు, వాంతులు అగుట. **lysine i.** ఎమైనోఆమ్లము లైసీన్‌కు విరుద్ధ పరిణామము.

**intoxicant** an intoxicating agent, such as alcohol మాదక పదార్థం, ఉదా. కల్లు, సారాయి.

**intoxication** 1. drunkenness కైపు, నిషా, మాదకత. 2. poisoning విషపరిణామము.

**intra-abdominal** within the abdomen ఉదరకుహరంలో. **i. tumour** ఉదరకుహరంలో కంతి.

**intra-articular** within a joint కీలులోపల. **i. injection,** injecting a drug into a joint cavity కీలులోనికి సూది, ఔషధం ఎక్కించుట.

**intracardiac** inside the heart గుండెలోపల.

**intracellular** within a cell or cells కణము(ల)లో.

**intracranial** within the skull కపాలములోపల. **i. tumour** కపాలములో కంతి.

**intradural** inside or beneath the duramater, a covering over the brain పరాశిక (మెదడుమీది పొర) లోపల/క్రింద. *e.g.* **i. haematoma,** blood clot underneath the dura ఉదా. పరాశిక క్రింద రక్తపుగడ్డ/గూడు.

**intramedullary** 1. inside the spinal cord వెన్నుపాము లోపల. 2. marrow cavity of bone అస్థిమజ్జ.

**intramuscular** into a muscle, *e.g.* **i. injection** కండరములోనికి సూదిమందు ఇచ్చుట.

**intraocular** within the eyeball కన్నుగుడ్డులోపల. **i. tension** కన్నుగుడ్డులోని ఒత్తిడి.

**intrapartum** during the act of child birth, i.e. delivery ప్రసవ సమయమునందు, కాన్పులో.

**intraspinal** into the spinal canal కశేరుకుల్యలోనికి. *e.g.* **i. anaesthesia,** introducing anaesthetic drug into the spinal canal which produces anaesthesia below that level, thereby facilitating surgery వెన్నుపూసకుల్య/కశేరుకుల్యలోనికి మత్తుసూది మందు ఎక్కిస్తే, ఆ క్రిందిభాగము మొద్దుబారిపోతుంది; శస్త్రచికిత్స సాధ్యమవుతుంది.

**intrathecal** theca=sheath తొడుగు. through the theca of the spinal cord into the subarachnoid space కశేరుతొడుగు ద్వారా లౌతికళ క్రింది స్థలములో.

**intratracheal** endotracheal వాయునాళములో.

**intrauterine** inside the uterus (womb) గర్భసంచి లోపల. **i. device, loop** గర్భసంచిలో లూప్ అనగా గర్భనిరోధమునకు సాధనము. (*Cf.* 'nirodh', a brand name for condom used by males *వారత.* పురుషులువాడే కాండమ్‌కు నిరోధ్ అనేపేరు).

**intravenous** into a vein సిరలోనికి. *e.g.* **i. injection** సిరలోనికి సూది (వాడుకభాషలో నరములోనికి అని ప్రతీతి).

**introitus** entrance into a cavity/space in the body శరీరములోని కుహరము/సందు/అంతరము లోనికి ప్రవేశము. **vaginal i.** యోనిద్వారములోనికి, *అలంకార.* బహుపరాక్!

**intubation** passing a tube into a tube in the body, *e.g.* trachea, oesophagus or into a hollow organ, *e.g.* stomach. గొట్టము వేయుటము: శరీరములోని నాళము/బోలుగానున్న అవయవములోనికి గొట్టమును వేయుట, ఉదా. వాయునాళము, అన్నవాహిక లేదా అన్నాశయములోనికి.

**intumescence** the process of swelling ఉబ్బే ప్రక్రియ.

**intussusception** A condition in which a segment of the intestine prolapses, *i.e.* folds inside itself; in this process intestinal obstruction occurs and it is a surgical emergency. అంత

రాంతర ప్రవేశము: పేగులలోని ఒక నిడుపు దానిలోనికి అది ముడుచుకుపోవుట/చొచ్చుకొనిపోవుట. దీనికి శస్త్రచికిత్స అత్యవసరము.

**inunction** the act of anointing an ointment on the skin మర్దన: చర్మముపై ములాము/మలాము అంటుట/రుద్దుట, ఉదా. తలంటి పోసుకున్నప్పుడు తల అంటినట్లు.

**in utero** within the uterus గర్భాశయములో.

**invagination** intussusception అంతర్వర్తనము *see/చూడండి* intussusception.

**invasion** 1. of organisms, సూక్ష్మజీవి దండయాత్ర. 2. infiltration of malignant cells/tissue, *see/చూడండి* infiltration. అపాయకరమైన కణములు కణజాలములో చొరబడుట.

**invasive** procedure of entering into something ఎందులోకైనా ప్రవేశించే ప్రక్రియ. **i. technique,** said of diagnostic methods: involving puncture of skin, passing of a tube, giving an intravenous injection, operation, *etc.* వ్యాధి నిర్ణయ పద్ధతులు: చర్మము పొడుచుట, నాళము/అవయవములో గొట్టముపేయుట, సిరలోనికి సూది, శస్త్రము వగైరా [*in contr.* non-invasive భిన్న. చొరబడని].

**invasiveness** destruction of tissues after invasion, *see/చూడండి* invasion. సూక్ష్మజీవులుగాని అపాయకరమైన కణములుగాని నాశము/ఊతక క్షయము కలుగజేయుట.

**inversion** turning inside of a structure ఒక నిర్మాణము తిరగదిప్ప బడుట. **i. of uterus,** turning inside of the uterus and its prolapse into the cervical canal or vagina గర్భకోశ విలోమము: గర్భాశయము లోనికి తనంతటతానే ముడుచుకొని గర్భాశయద్వారములోనికిగాని, యోనిలోనికిగాని జారుట.

**invertase** enzyme in the intestine which splits sucrose సుక్రోస్‌ను విచ్ఛిన్నంచేసే ఎంజైమ్, ప్రేగుల్లో ఉంటుంది.

**invert sugar** a mixture of glucose and fructose present in many fruits, named as such because it is formed by the breakdown of sucrose by invertase పెక్కు ఫలములలోగల చక్కెర – గ్లూకోస్ మరియు ఫ్రక్టోస్ మిళితం.

**investigation** test, examination అన్వేషణ, పరిశోధన(ము) *e.g.* **blood i.** రక్తపరీక్ష. **radiological i.** ఎక్స్‌రే పరీక్ష

**inveterate** chronic and difficult to cure దీర్ఘకాలపు మరియు చికిత్సకు అలవికాని/లొంగని.

**invigorate** vigor=strength. to strengthen బలం చేకూర్చు.

**in vitro** literally means 'in glass', a phenomenon observed outside a living body, *e.g.* test tube baby బహిర్గతము: శబ్దార్థప్రకారము 'గాజులో' అనగా శరీరమునకు బహిర్గతముగా జరుపు ప్రక్రియ, ఉదా. గాజుగొట్టంలో ఫలదీకరణము [*Cf.* in vivo తారత. అంతర్గతము].

**in vivo** literally means 'in life', within the living organism జీవిలో అంతర్గతము: శరీరంలోపల [*Cf.* in vitro తారత. బహిర్గతము].

**involucre** 1. *anat.* an enveloping membrane చుట్టూరా ఉన్న పొర. 2. *bot.* a crowd of bracts around an inflorescence. పుష్పగుచ్ఛమునకు చుట్టూరా వలయాకారములో వున్న పరిపుచ్ఛములు.

**involuntary** independent of the will అనియంత్రిత, అనైచ్ఛిక, అసంకల్పిత. **i. muscle** అనియంత్రిత కండరం.

**involution** 1. turning inward అంతర్వలనము, అంతర్వలితము. shrinking in the size of an organ అవయవము ముడుచుకొనుట. **i. of uterus** to normal size after delivery ప్రసవము తర్వాత స్వపరిమాణమునకు సంకోచించు గర్భసంచి. 2. period of decline as age advances; aging వృద్ధాప్యదశలో అవయవముల చురుకుతగ్గి, క్షీణించుట.

**ion** charged atom ఛార్జిగల పరమాణువు. charged molecule, ఛార్జిగల అణువు. **anion,** that with a negative charge ఏనయాన్, ఋణావేశిత అయాన్. **cation,** that with a positive charge కేటయాన్, ధనావేశిత అయాన్.

**ipsilateral** on the same side/half of the body or affecting the same side/half of the body స్వపార్శ్వ, శరీరములో ఒకే సగమునకు సం. [*opp.* contralateral వ్యతి. పరపార్శ్వ].

**IQ** *abbr.* intelligence quitient, denotes level of intelligence తెలివి/బుద్ధి/ వివేక సూచిక; ప్రజ్ఞాన ప్రమాణశీలత, ప్రజ్ఞాలబ్ధి.

**iridectomy** surgical excision of part of the iris తారకలో కొంత భాగము శస్త్రచికిత్సద్వారా తొలగించుట, కృష్ణపటల విచ్ఛేదనం.

**iridocyclitis** inflammation of the iris and ciliary body కన్నులోని తారక మరియు సిలియరి బాడీయొక్క శోథము/'నొప్పి వేడి వాపు మంట'.

**iridodilator** Iris, the curtain muscle shrinks, thus the pupil dilates. తారకవిస్తరణ కలుగజేయు: తారకలో తెర ముడుచుకున్నప్పుడు కనుపాప పెద్దది అవుతుంది. [*in contr.* iridoconstrictor *భిన్న.* తారక కుంచనము కలుగజేయు].

**iridokeratitis** inflammation of the iris and cornea తారక మరియు శుక్లపటలము యొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**iris** curtain muscle in the eye; with a central opening, the pupil కృష్ణపటలం, తారక: ఇది ఒక తెరవలె తెరచుకొనుచూ, ముడుచుకొనుచూ ఉండే పేశి; దీని మధ్యప్రదేశాన్ని కనుపాప/కంటిపాప అంటారు.

**iritis** inflammation of the iris కృష్ణపటల శోథము, తారకయొక్క 'నొప్పి వేడి మంట వాపు'. *figur.* wrath of the iris *అలంకార.* తారక తామసము చూపించుట.

**iron** found mainly in the haemoglobin of red blood cells. Depletion of iron results in iron-deficiency anaemia. ఎర్రకణములలోనున్న రక్తరంజక ద్రవ్యములో ఇనుము ఉంటుంది; ఇదిగనుక తక్కువైతే రక్తహీనత సంభవిస్తుంది. **i. lung,** artificial respirator కృత్రిమ శ్వాస సాధన.

**irradiate** to expose to radioactive energy కిరణీకరణము: రేడియో ధార్మిక శక్తికి గురిచేయుట, కిరణములకు గురిచేయుబడుట.

**irreducible** cannot shrink/reduce, *e.g.* **i. hernia** *ఉదా.* ముడుచుకొనిపోవుటకు వీలులేని హెర్నియా.

**irrigation** process of cleansing an organ, mucous membrane, sac, sinus, *etc.* with water or saline , *e.g.* urinary bladder ధావన, కడగటము: ఒక అవయవమునుగాని, శ్లేష్మపొరనుగాని, తిత్తినిగాని, కణజాలములలో సందునుగాని నీరులేదా ఉప్పనీటితో కడిగి శుభ్రపరచుట, *ఉదా.* మూత్రాశయమును ఇట్లు శుభ్రముచేయుట.

**irritable** something which is excessively sensitive and hence liable for irritation అతి సున్నితముగా ఉండి రేపుదు పుట్టించే. **i. bowel syndrome** irritable intestines causing enteritis/diarrhoea పేగులలో రేపుడు పుట్టించి అతిసారము కలుగజేయు వ్యాధిలక్షణ సంపుటి/సముదాయము.

**ischaemia** or **ischemia** deficiency in blood supply to an organ, often caused by obstruction to blood vessels రక్తప్రసరణహీనత/లోపం: రక్తనాళములలో అడ్డము సంభవించినప్పుడు ఆ అవయవమునకు రక్తసరఫరా లోపము *e.g.* Blockage of coronary arteries results in myocardial ischemia; the result is angina pectoris, the cry of the heart consequent to pain. ఉదా. కొరొనరి ధమనులలో అడ్డము సంభవించినప్పుడు గుండె గోడకు రక్తకొరత ఏర్పడుతుంది; దీని పర్యవసానము గుండె ఏంజైనా, హృదయవేదనతో కూడిన గుండెరోదన.

**ischiorectal** 1. referring to the ischium and rectum ఇస్కియమ్ ఎముక మరియు మలాశయమునకు సం. 2. **i. abscess,** an abscess which forms in the space between the ischium and the rectum ఈ ప్రాంతంలో చీముద్రక్తం గడ్డ. It may burst into the rectum producing fistula in ano. మలాశయంలోనికి పగిలి, ఆసననాళవ్రణం అవవచ్చు.

**ischium** [ischia *pl.*] The bone in the pelvis on which one sits. శ్రోణి చక్రములో ఒక ఎముక. మనిషి దీనిమీద కూర్చుంటాడు; ఆసనాస్థి – ఈ రెండు ఎముకల మీద ఆసీనుడవుతాడు.

**islet** a small group of cells, also called island కణములయొక్క చిన్న సముదాయం, కణద్వీపం. **i's of Langerhans,** islands of Langerhans, pancreatic islets, size 76 x 175$\mu$. The B or beta cells secrete insulin, deficiency of which gives rise to diabetes. ద్వీపిక, లాంగర్‌హాన్స్ పుటికలు: క్లోమములో బి లేదా బీటా కణములు ఇన్సులిన్‌ను స్రవిస్తాయి; ఈ స్రావముయొక్క లోపమువలన మధుమేహం వ్యాధి వస్తుంది. A or alpha cells secrete glucagon. ఎ లేదా ఆల్ఫా కణములు గ్లూకగాన్ అను పదార్థమును స్రవిస్తాయి.

**isograft** or **syngraft** graft of tissue from an identical twin ఏక సంయుక్త బీజ కవలలయందు ఒకరినుండి ఇంకొకరికి కణజాలాన్ని అంటుగట్టే విధానం.

**isolation** procedure of keeping someone aloof కొందరిని వేరు చేయుట. **i. hospital,** patients with communicable diseases are hospitalised రోగులను అంటుజాడ్యముల ఆసుపత్రిలో వేరుపరచటము.

**isoleucine** an essential amino acid ఒక ముఖ్యమైన ఎమైనో ఆమ్లము.

**isotonic** having the same osmotic pressure ఒకే ద్రవాభిసరణ పీడనముగల. **i. saline** సమగాఢ సెలైన్/ఉప్పునీరు.

**isotope** a chemical element having the same atomic number as another but having a different atomic mass. **radio active i.,** రేడియోధార్మిక శక్తిగల ఐసోటోప్. used in the diagnosis of the severity of a disease, say radioactive uptake, and in the treatment of malignant disorders రుగ్మత ప్రభావము శరీరములో ఎంతవరకు ప్రబలి ఉన్నదో అని తెలుసుకొనుటకు మరియు కొన్ని అపాయకరమైన రుగ్మత (కేన్సర్)ల్లో చికిత్సకు వాడ్తారు.

**isthmus** a bridge or connection రెండు భాగములను కలిపే వంతెన. **i. of thyroid gland,** the connection between the two lobes, the transverse part in H shaped structure సంయోజకము, రెండు నిర్మాణములను కలుపు అడ్డభాగము.

**itch** sensation to scratch దురద. **bakers' i.** రొట్టెలు చేయువాని చేతికి ఉన్న చర్మపుతెగులు. **barbers' i.,** sycosis barbae క్షురకర్మకీటః: మంగలిపని చేయువారు ఉపయోగించే కత్తులద్వారా సోకు చర్మవ్యాధి దురదలు. **ground i.,** creeping eruption caused by the entrance of larvae of *Ancylostoma* in the feet usually, in hookworm disease, *see/చూడండి* Ancylostoma. ఏన్‌క్లైలోస్టోమా అను పరాన్నజీవి డింభకములు (larvae) శరీరములోనికి (తరచుగా పాదములద్వారా) చొరబడునప్పుడు పాదముచుట్టూ పాకుతున్న, దురదతో కూడిన దద్దులు (గ్రా. దద్దుర్లు). **i. in contact dermatitis,** e.g. (a) allergy on feet due to plastic chappals ప్లాస్టిక్ చెప్పులవలన పాదములమీద దురదలు (b) allergy at the site of vermilion application ఫాలభాగమున బొట్టు/తిలకము పెట్టుకునే ప్రదేశములో దురద.

**itching** pruritus తీట. an irresistible desire to scratch the skin (self emanating sensory nerve irritation). Just like cough produces cough, itching strengthens the desire for further itching. It should be stopped by will power. వశముకాని, గోకవలెనను అభిలాష. గోకుడు గోకుడుని రేకెత్తిస్తుంది. దగ్గుకు దగ్గునాంది, దగ్గుతెరవస్తే అప్పుట తేలికకాదు, అట్లాగే దురద బెడద కూడాను. తీటను తేల్చివేయాలంటే 'ఇక గోకను' అను మనోబలం ముఖ్యం.

**-itis** suffix తుదిజోడింపు. word ending in 'itis' means inflammation, *e.g.* bronchitis, inflammation of bronchi బ్రాంకై ఇన్‌ఫ్లమేషన్; sinusitis, inflammation of sinus సైనస్ ఇన్‌ఫ్లమేషన్.

**IUCD** or **IUD** *abbr.* intrauterine contraceptive device, intrauterine device గర్భసంచిలో గర్భనిరోధక సాధనము. *e.g.* loop లూప్. *colloq.* copper T వాడు.భా. కాపర్ టి.

**IVP** *abbr.* intravenous pyelogram; Intravenous urogram (IVU) is a better term, since it visualizes not only the pelvis of the kidney but the entire urinary tract. కిరణాభేద్యమైన/అపారదర్శకమైన అద్దకము సిరలోనికి ఎక్కించి, మూత్రవ్యవస్థ చిత్రణను పరీక్షించుట/పరిశీలించుట.

# J j

**jacket** any protective casing రక్షణ పట్టీ/కట్టు. **plaster-of-Paris j.,** 1. treatment for fractures తొడుగు: ప్లాస్టర్ పిండికట్టు – ఎముకలు విరిగిన సందర్భములో ఆ భాగము కదలకుండాచేయు సాధనము. 2. immobilisation in TB spine వెన్నెముకకు క్షయవ్యాధి సంభవించి నప్పుడు వెన్నుపూస కదలకుండా ఈ పై పిండికట్టుతో బంధిస్తారు.

**Jacksonian epilepsy** a type of epilepsy where the jerking movements start in one part of the body and spread to other parts. చిప్పుక్కున ఈడ్చే శరీర కదలికలు ఒక భాగంలో బయలుదేరి తతిమ్మా/మిగతా ప్రాంతములకు వ్యాపించుట.

**jactitation** extreme restlessness అస్థిమితము. tossing about తోచకుండా ఇటు అటు కొట్టుకొనుట.

**Japanese encephalitis** *colloq.* brain fever వాడు.భా. మెదడు జ్వరం. It is caused by Japanese B encephalitis virus. ఈ వైరస్‌వలన సంభవిస్తుంది.

**jargon** 1. technical words difficult to be understood by laymen జార్గన్: సామాన్యులు అర్థం చేసుకోలేని సాంకేతిక విజ్ఞాన పదాలు. **medical j.** such words in medical technology వైద్యసాంకేతిక విజ్ఞానంలో ఇట్టి పదములు. 2. paraphasia.

**jaundice** icterus, yellow discolouration of the skin, eyes and mucous membranes పసిరికలు, పచ్చకామెర్లు, కళ్లు ఒళ్ళు పచ్చబడుట. increase in bile pigments in blood causing yellow tinge to the visible structures in the body, as above పైన చెప్పినట్లు శరీరంలో బయట కనపడే చోట్ల పచ్చగా కనపడుట – ఈ రంగు పైత్యవర్ణకాలు (bile pigments) రక్తములో జమ అయినందువలన. Jaundice is caused by disease of liver, gall bladder, bile duct system or blood. కామెర్లు ఈ జబ్బుల్లో కలుగును: కాలేయము జబ్బు, పిత్తాశయము జబ్బు, పైత్యరసనాళ వ్యవస్థ జబ్బు లేదా ఒకరక మైన రక్తజబ్బు. **acholuric j.,** spherocytosis; haemolytic anemia, splenomegaly, tendency to gall stones; elevated unconjugated bilirubin not excreted by kidney, therefore no bile pigments in

urine ఎర్రరక్తకణములు బంతివలె గుండ్రముగానుండును. రక్తహీనత, ప్లీహము (spleen) పెరుగుట, పైత్యరసశిలలు ఉత్పన్నమగు వాతావరణము ఎక్కువగానున్న స్థితి. ఈ జబ్బులో మూత్రములో పచ్చదనము ఉండదు. **haemolytic j.**, dissociated jaundice; due to increased haemolysis, *i.e.* destruction of red blood cells ఎర్రరక్తకణములు విచ్ఛిన్నమగుటవలన కలుగును. **hepatocellular j.**, injury to liver cells, *e.g.* viral hepatitis, side effect of drugs, *etc. see/చూడండి* hepatitis, hepatotoxin, hepatotoxic drug. కాలేయకణముల నాశము, ఉదా. కాలేయపు వైరస్ జబ్బు, కొన్ని మందుల దుష్ప్రభావము, మొ. **obstructive j.**, due to mechanical obstruction of bile flow, *e.g.* cholangitis, stone in bile duct పైత్యరసము పారుదలకు అటంకము, ఉదా. పైత్యరసనాళము వాచి, తద్వారా మార్గమునకు అడ్డముకలుగుట, పైత్యరసనాళములో రాయి/శిల అడ్డుపడుట.

**jaw** 1. tooth bearing bone పండ్లపట్టుకొమ్మ ఎముక. **lower j.**, mandible హనువు, క్రింద దవుడ ఎముక. **upper j.**, maxilla జంభిక, పై దవుడ ఎముక. 2. *zool.* jaws, the mouth with its bones and teeth ఆస్య, కంకాళ, దంత బిలం. *figur.* into the jaws of death *అలంకార.* మృత్యువు ఒడిలోనికి.

**jejunectomy** removal of a part or all of the jejunum మధ్యాంత్రములో అంతాగాని, కొంతభాగంగాని తీసివేయుట.

**jejunum** the middle portion of the small intestine from the duodenum to ileum మధ్యాంత్రము: చిన్నప్రేగు యొక్క మధ్య/రెండవ భాగము.

**jerk** a sudden sharp reflex muscular contraction (reflected action) to a stimulus రేపు/ప్రేరేపునకు చివుక్కున లాగుకొను/వాడి ఈడ్పు (ప్రతీకార చర్య). *e.g.* A hit/tap on the patellar ligament with a knee hammer causes jerky extension of the leg upon the thigh (due to contraction of quadriceps, the muscle of the thigh). This is termed 'knee jerk', *see/చూడండి* reflex. జానువును ఎదుట కప్పుతూ, త్రికోణాకారము దాల్చిన పటెల్లా యొక్క స్నాయువుమీద రబ్బరు అంచుగల పరికరము (knee hammer)తో తట్టిన వెంటనే కాలు చివుక్కున పైకిలేస్తుంది. దీనినే 'జానువు ఈడ్పు' అంటారు.

**jigger** a flea, sandflea మిన్నళ్ళి, గోమారు, తుళ్ళుపురుగు. *Tunga penetrans.* It burrows under the skin causing intense itching/irritation చర్మాన్ని తొలిచి దురద/రేపెడు గుణం కల్గిస్తుంది.

**joint** the site of junction of two or more bones or cartilages కీలు: రెండు లేదా అపైని సంఖ్యగల ఎముకల లేదా మృదులాస్థుల కలయిక/సంధి. two varieties: 1. **immovable j's,** *e.g.* bones in the skull కదలికలేని కలయిక, ఉదా. కపాలములోనున్న ఎముకల సంధులు. 2. **movable j's,** *e.g.* the elbow కదలిక కల కలయిక, ఉదా. చేతి ముడుకు. movable joints are of four types: (a) **ball and socket j.,** hip joint. The rounded end of thigh bone (femur) fits into the socket in the pelvic bone (acetabulum). బంతిగిన్నెకీలు: తుంటికీలు; తొడ ఎముకపై అంచున ఉన్న బంతివంటి ఎముకభాగము శ్రోణ్యస్థిలోని గిన్నె (acetabulum) లో అడుట. (b) **gliding j.,** allows two bones to glide/slide over each other. The ankle and wrist are examples. జారేకీలు: ఒక ఎముక మరియొక ఎముకమీద జారుట/జరుగుట. చీలమండ, మణికట్టు ఉదాహరణములు. (c) **hinge j.,** door hinge action: up and down movement in elbow; back and forth movement in knee కూర్పర సంధి, మడతబందు కీలు: చేతిముడుకులో పైకి, క్రిందికి కదలిక; జానువులో వెనుకకు, ముందుకు కదలిక. (d) **pivotal j.,** The outer forearm bone (radius) rotates over the lower end of armbone (humerus). గుడిదె కీలు: వెలుపలి మోచేతి ఎముక అయిన రత్ని భుజాస్థి అడుగుభాగమున తిరిగెడు కీలుచీల.

**joule** *abbr.* J: SI unit of measurement of energy శక్తి కొలమానము. one calorie = 4.184 J.

**jugular** 1. pertaining to the neck or throat గండిక; మెడకు సం. 2. jugular vein గళసిర, గండికసిర.

**juice** a secretion in the body organs శరీరంలో అవయవముల స్రావము. **gastric j.,** secretion of stomach/gastric glands జఠర రసము. **intestinal j.** పేగులలో స్రావము. **pancreatic j.,** enzyme-containing secretion ఎన్‌జైమ్‌తో కూడిన క్లోమస్రావము.

**junction** a meeting place సంధి, కలయిక. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **atrioventricular j.**, in heart – AV j. గుండెలో ఏట్రియ జఠరిక సంధి. **gastroesophageal j.** అన్నాశయ అన్నవాహిక సంధి. **mucocutaneous j.**, transition between the skin and mucous membrane చర్మము శ్లేష్మపొరలోనికి మారుతున్న అనగా అవస్థాంతరము పొందేచోటు. *micro str.* సూక్ష్మ.చూ. **myoneural j., neuromuscular j.**, the union between the nerve fibre and muscle నాడీతంతువు కండరములో చేరిక.

**jurisprudence** juris = pertaining to justice, prudence = wisdom. **medical j.**, forensic medicine, legal medicine న్యాయవైద్యశాస్త్రం, న్యాయచట్టముల సం. వైద్యశాస్త్రము.

**juvenescent** becoming youthful యౌవనము గల స్థితిని పొందుట.

**juvenile** child/young బాల/చిన్న [*Cf.* adult *తారత.* వయోజనుడు].

**juvenile hormone** *zool.* a hormone necessary for growth and development during the immature stages in the life cycle of an insect జువెనైల్ హోర్మోన్: కీటకముయొక్క జీవితచక్రంలోని అపరిపక్వమైన దశలలో దాని పెరుగుదలకు కావలసిన హోర్మోను.

**juxtaglomerular apparatus** *micro.str.* సూక్ష్మ.చూ. in the kidney కిడ్నీలో.

# K k

**ahn test** precipitin (flocculation) test for syphilis కొఱుకు సవాయి రోగ నిర్ధారణకు టెస్ట్.

**ala-azar** Hindi word accepted in medical literature; visceral leishmaniasis కాలా (నలుపు మచ్చల) జ్వరము. It is caused by the parasite protozoan, *Leishmania donovani* and transmitted by sandfly, a midge. లైష్మేనియా అను పరాన్నజీవివలన కొత్తిమెర పురుగు (చిన్నదోమ) ద్వారా ప్రసరింపబడే వ్యాధి.

**alium** potassium పొటాసియమ్.

**aolin** powdered aluminium silicate – uses: ఈ పౌడరు వాడుక:
(a) dressing in ulcers వ్రణములకు కట్టు కట్టేటప్పుడు వాడ్తారు.
(b) adsorbent, used in combination with pectin, for diarrhoea అతిసారములో వాడుతారు.

**Kaposi's sarcoma** a form of cancer characterised by multiple malignant tumours of the skin or lymph nodes, now-a-days a common feature of AIDS చర్మంలేదా లింఫ్‌గ్రంథుల్లో పెక్కుచోట్ల పెరిగే కేన్సరు కంతులు – ఇవి ఎయిడ్స్ వ్యాధిలో కానవస్తాయి.

**karyology** *biol.* a former name for the study of cell nuclei, especially of chromosomes, which is now included under molecular biology పూర్వపు పేరు: కణకేంద్రకాల శాస్త్రం, ముఖ్యముగా క్రొమొసోమ్‌ల గురించి. ప్రస్తుతం అణుజీవశాస్త్రంలో ఒక భాగంగా ఎంచబడుతున్నది.

**karyon** the nucleus of a cell కణములోని కేంద్రకము.

**karyorrhexis** rupture of the cell nucleus కేంద్రకము పగులుట.

**karyotype** the chromosomal constitution of the cell nucleus కేంద్రకములోని క్రోమోసోమ్ నిర్మాణము.

**keloid** 1. scar formation, *e.g.* BCG scar బి.సి.జి. టీకా, మచ్చ.
2. excessive collagen formation in the skin during connective tissue repair, consequent on a wound, *e.g.* keloid after burns. Plastic surgery may be required to correct the cosmetic defect. గాయము అయిన తర్వాత, ఉదా. ఒళ్ళు కాలిన తర్వాత బంధనకణజాలము కూడుకొని, ఎక్కువ కొల్లేజన్ చర్మముమీద జమ అగుట. అంగ

దోషము నివారించుటకు, తిరిగి నిజస్వరూపము/యథాస్థితి నెలకొల్పుటకు రూపమిచ్చుశక్తిగల శస్త్రచికిత్స (plastic surgery) ఒక ఉపాయము.

**keratectomy** surgical removal of a portion of the cornea కార్నియా ఛేదన: శుక్ల/స్వచ్ఛపటలములో కొంతభాగం శస్త్రచికిత్సతో తీసివేయుట.

**keratin** in the family of scleroproteins, present in the epidermis, hair, nails కెరాటిన్; బాహ్యచర్మములోను, వెంట్రుకలలోను, గోళ్ళలోను ఉన్న పదార్థము.

**keratitis** inflammation of the cornea శుక్లపటలముయొక్క శోథము/ 'నొప్పి వేడి మంట వాపు'. **herpetic k.**, *see/చూడండి* herpes. **microbial k.**, due to invasion by microorganisms సూక్ష్మజీవుల దాడి. **trachomatous k.** కంటిరెప్పయొక్క దుర్మాంసములతో కూడుకొని ఉన్నది/ఉన్నవాపు. **ulcerative k.** వ్రణముతోకూడిన వాపు.

**keratoconjunctivitis** inflammation of the cornea and conjunctiva శుక్లపటలము మరియు కంటిపొర యొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'. **epidemic k.** కండ్లకలక – అంటువ్యాధి; మారి. **phlyctenular k.**, associated with tuberculosis or hypersensitivity to TB క్షయవ్యాధి లేదా క్షయ అతిసంవేదనశీలత లక్షణముతోకూడిన కండ్లకలక.

**keratoiritis** inflammation of the cornea and iris శుక్లపటలం, కృష్ణపటలం – ఈ రెండింటి ఇన్‌ఫ్లమేషన్.

**keratoleucoma** or **keratoleukoma** a white opacity/spot on the cornea శుక్లపటలముమీద తెల్లటి మచ్చ, వాడు.భా. కంట్లోపువ్వు.

**keratoma** a callus or callosity, *see/చూడండి* callosity. ఆనె.

**keratomalacia** malacia=softening. softening and necrosis of cornea due to vitamin A deficiency శుక్ల పటలము మెత్తబడి, నాశమైపోవుట – ఇది విటమిన్ ఎ లోపములో సంభవించును.

**keratoplasty** corneal grafting, plastic repair of the cornea శుక్ల పటలము అంటుకట్టుట; తిరిగి నిజరూపము మరియు చూపు నిచ్చుశక్తిగల శస్త్రచికిత్స. removal of the opaque portion and transplantation of healthy cornea to restore vision, *see/చూడండి* eye bank. కిరణా

భేద్యమైన/కాంతినిరోధక/అపారదర్శక శుక్లపటల భాగమును తొలగించి, ఆ స్థానములో సజీవ శుక్లపటలము అమర్చుట – దీనివలన చూపు తిరిగి స్పష్టతకు చేరుకుంటుంది; అనగా మామూలుగా, స్పష్టముగా కనబడుతుంది.

**keratosis** any horny growth on the skin such as a wart or callosity చర్మముమీద పులిపిరికాయగాని, ఆనెగాని.

**keratotomy** incision of the cornea శుక్ల/స్వచ్ఛపటలంలో గాటు. **radial k.**, multiple incisions in the cornea like spokes in a cycle wheel, to correct near-sightedness (myopia) శుక్లపటలచ్ఛేదనము: శస్త్రచికిత్సద్వారా శుక్లపటలములో సైకిలు చక్రములో కడ్డీలవలె గాట్లుపెడతారు. ఇది దగ్గరచూపు (myopia) సరిచేసే చికిత్స.

**kernicterus** bile staining of the basal ganglia in the brain occurring in icterus gravis neonatorum పసికందులో తీవ్రమైన కామెర్ల వ్యాధిలో మెదడులోని నాడిముడులు పసుపుపచ్చ వర్ణం పొందుట.

**ketoacidosis** a state of acidosis and accumulation of ketone bodies in the tissues and body fluids. కణజాలములలో, శరీర ద్రవములలో ఆమ్లము, కీటోన్లు ఎక్కువగుట. **diabetic k.**, if not corrected, leads to diabetic coma పైనచెప్పిన ఆమ్లము, కీటోన్లు సరిదిద్దకపోయినట్లయితే మధుమేహంలో స్మారకము తప్పుతుంది.

**ketonuria** excretion of large quantities of ketone bodies in urine, e.g. in diabetes mellitus మూత్రంలో అధికంగా కీటోన్లు విసర్జింపబడుట, ఉదా. డయాబిటీస్‌లో.

**ketosis** accumulation of excessive amounts of ketone bodies in the tissues and body fluids. Ketone bodies (one such is acetone) are produced in the body due to incomplete metabolism of fatty acids. శరీరకణజాలములలోను, ద్రవములలోను కీటోన్లు అధికమగుట. కొవ్వు ఆమ్లముల అసంపూర్ణ జీవ(న)క్రియ (metabolism) వలన కీటోన్లు (ఇందులో ఎసిటోన్ ఒకటి) శరీరంలో ఉత్పన్నమవుతాయి.

**kibes** cracking of heels and feet పాదాల పగుళ్ళు.

**kidney** organ lying on each side of the spine in the upper loin (upper lumbar region) excreting urine, the waste/end product of body metabolism. మూత్రపిండము: కటి/నడుము ఉపరిభాగములో వెన్నెముకకు రెండువైపులా మూత్రపిండములు నిక్షిప్తమై ఉన్నవి. శరీర జీవ(న)క్రియ అను ప్రక్రియలో వ్యర్థ/విసర్జింపవలసిన ద్రవము ఈ మూత్రము. About 19 gallons of blood pass through the kidneys every hour, thus cleansing the blood of waste products. ప్రతిగంటకు షుమారు 19 గాలన్ల రక్తం మూత్రపిండములద్వారా ప్రసరిస్తుంది; ఈ ప్రసారములో వ్యర్థపదార్థములు గుంజుకొనబడి రక్తం శుభ్రమవుతుంది. Kidney disease is one cause for high blood pressure (hypertension). హెచ్చు బ్లడ్ ప్రెషర్ జబ్బుకు కిడ్నీవ్యాధి ఒక కారణము. **amyloid k.**, renal amyloidosis ఒక విధమైన పరిణామక్షీణత. **artificial k.**, *see/చూడండి* haemodialysis. **contracted k.** వ్యాధివలన ముడుచుకున్న (fibrosed) కిడ్నీ. **floating k.**, mobile kidney బంధింపబడని కిడ్నీ. **polycystic k.**, multiple cysts of different sizes in a disease called polycystic disease of the kidney, usually bilateral బహుసంఖ్యలో, వివిధ పరిమాణములోనున్న తిత్తులతో నిండిన కిడ్నీ, తరచుగా రెండు కిడ్నీలు ఈ స్థితికి గురి అవుతాయి. **thoracic k.**, ectopic kidney in thorax, a congenital condition ఉండవలసినచోటగాకుండా అన్యప్రదేశము (ఛాతీ)లో నున్న కిడ్నీ – ఇది పుట్టుకముందే పరిణామము.

**kidney machine** also called artificial kidney, *see/చూడండి* haemodialysis, dialysis.

**kidney stone** a calculus in kidney, *see/చూడండి* calculus.

**kinaesthesia** or **kinesthesia** kinaesthesis, 1. muscle sense కండరజ్ఞానము. awareness of position, weight and movement స్థానము, బరువు, చలనము యొక్క విచక్షణజ్ఞానము. 2. movement sense కదలిక విచక్షణజ్ఞానము.

**kinaesthetic receptors** receptors embedded in muscles and joints, conveying the muscle and joint sense గతి సంవేదక గ్రాహకాలు: కండరాలు, సంధులలో నిక్షిప్తమై ఉన్న జ్ఞానేంద్రియాలు; శరీర అంగాలయొక్క స్థానాన్ని గురించి సమాచారము అందించేవి.

**kinesia** travel/motion sickness; giddiness and vomitings while travelling, say motion in a bus కొంతమందికి ప్రయాణము చేస్తున్నప్పుడు, ఆ కదలికకు తలతిరుగుడు, వాంతులు (గమనిస్తుంటాము).

**kinesis** movement చలనము. చలనం జీవనగమనం/ఉల్లాసం.

**kinetic** pertaining to motion కదలికకు/చలనమునకు సం.

**Klebsiella** a genus of pathogenic bacteria causing respiratory infections శ్వాసవ్యవస్థను అవరించే రోగజనక/వ్యాధిజనక బాక్టీరియా ప్రజాతి.

**kleptomania** persistent irresistible urge/impulse to steal; one type of mania స్తేయాభిలాష: స్తేనచర్య; చౌర్యరుచి, దొంగబుద్ధి. దొంగిలించవలెనను మూర్ఖపు పట్టుదల; ఇది ఒక వెర్రి.

**knee** genu; కూర్పరము, 1. the hinge joint between the lower end of the thigh bone (femur) with the upper end of leg bone (tibia) కూర్పరసంధి, జానువు, మోకాలు. తొడ ఎముక చివర, కాలి ఎముక మొదలునగల కీలు. ఇది ఒక మడతబందు కీలు. 2. any knee shaped structure, *e.g.* genu of internal capsule. ఈ ఆకారములో ఉన్న నిర్మాణము, ఉదా. మెదడులోని భాగము. **house maid's knee,** patellar bursitis పెటల్లా దగ్గర బర్సాపొరయొక్క 'నొప్పి వేడి మంట వాపు'. **knee elbow position** in clinical examination వ్యక్తి/రోగిని మోకాళ్ళు మోచేతులమీద బోర్ల ఉంచి పరీక్షచేయుట.

**kneecap** 1. patella, a mobile bone at the front of knee పెటల్లా, జానుఫలకము, మోకాలి చిప్ప: పెటల్లా అను పేరుగల ఎముక మోకాలుకు ఎదురున ఉన్నకప్పు. 2. an elastic wear worn by sportsmen ఆటగాళ్ళు ధరించే జానువు తొడుగు.

**knock knees** genu valgum. *see/చూడండి* genu. గాడిదకాళ్ళు [*Opp.* bow legs వ్యతి. దొడ్డికాళ్ళు].

**knot** a fastening made by any material ఏ పదార్థముతోనైనా బిగించే ముడి. **surgeon's k.,** knot of thread/catgut, *see/చూడండి* catgut. ముడి: శస్త్రచికిత్సలో వేయు దారపుముడి లేదా ప్రేగు నుండి తీసిన తంతిముడి. *figur.* Surgeon's knot seals the trouble of the patient. అలంకార. శస్త్రచికిత్సకారుని ముడి రోగి బాధానివారిణి.

**knuckle** back of the phalangeal joint, used for knocking with a clenched fist వేలికణుపు, మెటికలు: చేతివేళ్ళ మధ్యన ఉన్న కీళ్ల వెనుకభాగము; అలంకార. పిడికిటపట్టి వీటితో మొట్టికాయ మొట్టుతారు.

**Koch's bacillus** the *Mycobacterium tuberculosis* microorganism, which causes tuberculosis క్షయబాసిల్లస్, క్షయవ్యాధి కారకము అనగా వ్యాధిని కలుగజేసేది.

**koilonychia** concave (spoon shaped) nails, thin and brittle, seen in iron-deficiency anaemia చెంచా వంటి గోళ్ళు: పల్లముగానున్న/ ఉత్తానమైన, పల్చని, పెళుసైన గోళ్ళు – ఇవి ఇనుములోపమువలన కలుగు రక్తహీనతజబ్బులో కానవచ్చును.

**Koplik's spots** red spots with bluish white centre seen on the lingual and buccal mucosa a day or two before the appearance of skin rash of measles తట్టు/పొంగు/దద్దులో చర్మపొక్కులు లేచే ఒకటి లేదా రెండురోజులముందు నాలుకమీద మరియు నోట్లో బుగ్గలోపలిభాగంలో కనపడే మచ్చలు – ఇవి నీలపు కేంద్రం కలిగి ఎర్రగా అగపడుతాయి.

**kraurosis** a dried, shrivelled state ఎండిపోయి ముడుతలు పడిన స్థితి. **k. vulvae**, atrophy of the female external genitalia with dryness, shrivelling and pain స్త్రీబాహ్యలైంగిక అవయవముల క్షయము – తడిలేక, కృశించిన పరిణామము; ఈ బాధ సిగ్గుచేటు.

**Kreb's cycle** a sequence of biochemical reactions in the metabolism of carbohydrates, fatty acids and amino acids కార్బోహైడ్రేట్లు, కొవ్వు మరియు ఎమైనో అమ్లముల జీవ(న)క్రియలో కలుగు జీవరసాయన ప్రతిచర్యల వరుసక్రమము.

**Kveim reaction** skin test in sarcoidosis సార్కాయిడోసిస్ అనే జబ్బులో చర్మంమీద చేసే పరీక్ష.

**kwashiorkor** PEM, *abbr.* protein energy malnutrition due to extreme deficiency of food and protein తిండి, ప్రోటీన్‌ల అత్యధిక లోపము వలన కల్గిన, పోషణములో దోషమున్న రుగ్మత. symptoms: thinness of skin and hair, oedema, liver dysfunction వ్యాధిలక్షణములు: కళావిహీనత, చర్మము మరియు వెంట్రుకల క్షీణత, ఒళ్ళువాపు,

కాలేయముయొక్క మాంద్యము. **marasmic k.,** *see/*చూడండి marasmus.

**kypholordosis** coexistence of kyphosis and lordosis, *see/* చూడండి lordosis. కశేరుప్రాంతం ఒక భాగం వెనుకకు మరియొక భాగం ముందుకు వంగియుండుట, అలంకార. కైపులోనున్న లార్డ్ (దార) వలె నడక.

**kyphoscoliosis** sideward and backward curvature/bending of the thoracic spine గూని, ఆపైని వంపు – ఈ రెండు వికారములుగల ఛాతీవెనుక వెన్నుభాగము.

**kyphosis** hump/hunch backed గూనితనము. convex backward curvature of the thoracic spine ధనుస్సువలె వంగిన వెన్ను; ఛాతీవెనుక వెన్నుప్రాంతము వెలుపలికి వంగియుండుట.

# L l

**labia** [labium *sing.*] lips పెదవులు, అధరములు **l. majora, l. externa,** two big vertical fleshy folds externally, bordering the vaginal opening స్త్రీ బాహ్యలైంగికాంగాలు – యోని ఇరుప్రక్కల రెండు పెద్ద బాహ్య నిలువుటధరములు (వెలుపలివి). **l. minora, l. interna,** two small vertical fleshy folds internally bordering the vaginal opening స్త్రీ బాహ్యలైంగికాంగాలు – యోని ఇరుప్రక్కల రెండు చిన్న అంతర నిలువుటధరములు (లోపలివి). అలంకార. వీటిని లైంగికదృష్ట్యా ఊహిస్తే మధురాలు (రసవంతము); శారీరశాస్త్రరీత్యా చూస్తే మాంసపు ముద్దలు (హేయము).

**labor** *see/చూడండి* labour.

**laboratory** a place used for testing samples పరీక్షశాల. **clinical l.,** the place where blood, urine, stool and such investigations are done, to establish the diagnosis of a disease రోగనిర్ణయ ప్రయోగశాల: ఆసుపత్రిలో రక్త, మూత్ర, మల ఇత్యాది పరీక్షలుచేసి రోగనిర్ధారణకు తోడ్పడు స్థలము. **pharmaceutical l.,** the factory wherein life-saving and disease-curing drugs are manufactured జీవన రక్షణము, వ్యాధి నిర్మూలనము చేకూర్చు ఔషధములను తయారుచేయు కర్మాగారము. **research l.,** Research implies a stage ahead of search, which is a challenge for any scinece including medicine. పరిశోధన శోధన తర్వాత మెట్టు; శాస్త్రపురోగమనమునకు ఇది ఒక గీటురాయి, కలికితురాయి. **science l.** శాస్త్రపరిశోధనాలయము.

**labour** or **labor** the process by which a baby is delivered from the mother's body ప్రసవము, కాన్పు: తల్లిదేహమునుండి బిడ్డ బయటపడు/భూమికివచ్చే ప్రక్రియ. **artificial l.,** *e.g. see/చూడండి* Caesarean section. **natural l.,** Labour pains mean that the muscles of the uterus tighten and relax. The process of tightening and relaxation is involved in a contraction. సహజకాన్పు, ప్రసవవేదన అనగా గర్భాశయము కండరములు బిగిసి మరల వదులు అగుట. ఈ 'బిగువు వదులు'ను సంకోచము (contraction) అంటారు. A sudden gush/rush of water from the birth canal indicates that

the bag of waters surrounding the baby has given way. This is the prologue/prelude for the drama. ఉమ్మనీరు గలుక్కున జననకుల్యలోనుండి చిందబడుట ఈ నాటకమునకు నాంది/అవతారిక. The first stage begins with the onset of uterine contractions, dilatation of cervix big enough for the baby to pass through. ప్రథమ దశలో గర్భకండర సంకోచములు, గర్భాశయద్వారము (cervical canal) శిశువు తలపట్టేటంత పరిమాణము వరకు విస్తరించుట. During the second stage, the baby glides through the birth canal and comes out of the vaginal opening. రెండవదశలో శిశువు జననకుల్య గుండా జారుతూ యోనినుంచి భూమిమీదకు/బయటకు త్రోయబడుట. In the third stage, the placenta and membranes (the afterbirth) are loosened, detached from the inside of the womb (uterus) and expelled. మూడవదశలో మావి/మాయ (placenta) పొరలు గర్భాశయపుగోడలో వదులై, గోడను వీడి యోనిబయటకు బహిష్కరింపబడుతవి. *figur.* The cry of the baby is the bomb of the obstetrician. *అలంకార.* శిశువురోదన ప్రసవగర్జన. **premature l.,** labour occuring earlier than the expected date నెలలు నిండకుండానే ప్రసవమగుట.

**labyrinth** the internal ear, *see/చూడండి* ear. లోపలి చెవి – పద్మవ్యూహం.

**labyrinthectomy** excision of the labyrinth పద్మవ్యూహ విచ్ఛేదనం.

**labyrinthitis** inflammation of the labyrinth; otitis interna ఈ భాగమునకు శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**laceration** Lacerated wound is an injury producing crushing / mashing of tissues with torn rugged edges caused by a blunt trauma, in contrast to an incised wound caused by a sharp cut. The tissue injury is more, blood supply to tissues is impaired in a lacerated wound; hence healing is delayed. Further, infection gets a foothold easily. చీలినగాయము, విదారణక్షతము: కణజాలములు చితికి, కరకైన, చిరిగిన చర్మము మరియు అంచులు గల గాయము; కణజాలములు పచ్చడి అయిన స్థితి. మొద్దులాంటి మొరటు పనిముట్టుతో తగిలిన దెబ్బ. నలిగిన కణజాలములకు రక్తసరఫరా సరిగా

లేనందున గాయము నయమవ్వటకు టైము పడుతుంది; మీదుమిక్కిలి సూక్ష్మజీవులు తావు ఏర్పరచుకొని విధ్వంసక చర్యకు దారితీస్తాయి. దీనితో పోలిస్తే కత్తికోతవలన కల్గినగాయం త్వరగా నయమవ్వుతుంది.

**lachrymal** or **lacrimal** or **lacrymal** 1. pertaining to tears కన్నీటికి సం. 2. **l. sac** బాష్పజలతిత్తి, కన్నీటి తిత్తి.

**lachrymose** 1. in the habit of weeping ఏడుపుగొట్టు. 2. tearful, *figur.* tearful adieu/goodbye to the departed soul. అలంకార. అస్తమించినవారికి బాష్పతర్పణ వీడ్కోలు. 3. **l. indisposition** ఏడుపుముఖము.

**lacrimation** or **lachrymation** shedding of tears కన్నీళ్ళుకార్చుట, అలంకార. బాష్పవర్షం, కన్నీటిజల్లు, అశ్రుతర్పణం.

**lacrimator** or **lachrymator** an agent that induces flow of tears, *e.g.* tear gas, glycerine బాష్ప్రప్రేరకము: కళ్ళవెంబడి నీరుకారేటట్లు చేసే వస్తువు, ఉదా. బాష్ప(జల)వాయువు, గ్లిసరిన్, లేదా కట్టెలపొయ్యి పొగ.

**lactagogue** substance to stimulate lactation చన్ను పాలిచ్చుటను రేకెత్తించు వస్తువు, ఉదా. మోడీకారం.

**lactation** 1. secretion of milk by the mammary gland స్తనములోని పాలయొక్క స్రావము; పాలిండ్లలోని పాలు. *గమనిక:* ప్రసవించిన మూడోరోజుకే కుచములలో క్షీరవర్షం; మీదుమిక్కిలి పుట్టిన శిశువుకు పాలు చీకటం చేతగాక స్తనములు మరింత ఉబ్బి తల్లికి పాలజ్వరం – ఇవన్నీ పురిటి బాలింతకు సమస్యలు. 2. period of lactation మాతృస్తన్యపానదశ, పిల్లలకు పాలిచ్చుకాలము.

**lacteal** 1. pertaining to milk క్షీర సం. 2. duct carrying milk క్షీరవాహిక. 3. intestinal lymphatics that transport chyle (resembling milk) (పాలను పోలిన) ఖైల్ రవాణాచేయు అంత్రశోషరసవాహికలు. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **l. sinuses,** lactiferous sinuses, enlargements of the lactiferous ducts just before they open at the mammary papilla క్షీర సం. కోటరములు; చూచుకము వెలుపలికి తెరచుకొనే క్షీరవాహికల ఉబ్బులు. *micro. str.* సూక్ష్మ.చూ. network of capillaries and a lymphatic vessel in the intestinal villus

రక్తకేశనాళికలు మరియు ఒక శోషరసనాళిక కలిగియున్న చిన్నపేగులలోని చూషకము.

**lactic** 1. pertaining to milk పాలకు సం. 2. **l. acidosis,** metabolic acidosis జీవ(న)క్రియ తాలూకు అమ్లరక్తత.

**lactic acid** 1. an acid formed in the body by anaerobic metabolism of carbohydrates, *e.g.* One condition in which it occurs is diabetes mellitus. లాక్టికామ్లము; కార్బోహైడ్రేట్స్ యొక్క అవాతజీవ(న)క్రియవలన ఉత్పన్నమైన అమ్లము, ఉదా. మధుమేహం వ్యాధిలో చూడనగును. 2. produced by the action of bacteria in milk క్షీరామ్లము; పాలలో బాక్టీరియా ప్రభావము వలన పాలు పులియుట.

**lactiferous ducts** ductus lactiferi, milk ducts, galactophorous canals/ducts, canalicular ducts, mammary ducts, galactophores: 15 to 20 ducts drain the lobes of the mammary gland పాలవాహికలు: 15 నుండి 20 వరకు ఉంటాయి. స్తనగ్రంథి లంబికలలోని పాలను సరఫరా చేస్తాయి. They open at the nipple. చూచుకము వద్ద తెరుచుకుంటాయి.

**lactifuge** an agent which stops secretion of milk స్తన/స్తన్య స్తబ్ధత కలుగజేయు వస్తువు, పాలస్రావము నిలిపివేయు వస్తువు.

**lactigenous** producing milk క్షీరోత్పత్తి కలుగజేయు.

**lactobacillus** bacteria producing lactic acid in milk పాలు పులిసిపోయేటట్లు చేయు బాక్టీరియా.

**lactogenic** stimulating production of milk క్షీరోత్పత్తిని రేకెత్తించుట.

**lactose** sugar in milk పాలచక్కెర: పాలలో తీపిపదార్థము.

**lactosuria** presence of lactose in the urine మూత్రంలో లాక్టోస్ ఉండుట.

**lacuna** 1. small space/pit సందు, చిన్న స్థలము/గుంట. 2. defect or gap లోపముగాని, ఖాళీ/మొర్రి/తొర్రిగాని.

**laevocardia** or **levocardia** normal left-sided heart with transposition of viscera (situs inversus), *viz.* liver on the left side and spleen on the right గుండె తన సహజ స్థానములో (ఛాతీలో

ఎడమవైపున) ఉండుట, కాని కొన్ని అవయవములు స్థానవ్యతిరేకముగుట, అనగా లివర్ ఎడమప్రక్కన, స్ప్లీన్ కుడిప్రక్కన ఉండుట.

**lag** 1. interval between application of a stimulus and its response/reaction ప్రేరేపకమునకు దాని ప్రతిఘాతమునకు మధ్య గడచే కాలము. 2. lag period between inoculation into a culture medium and beginning of growth కల్చర్‌లోనికి సూక్ష్మజీవులను ఎక్కించినప్పటినుండి వాటి వృద్ధి మొదలగువరకు పట్టే సమయము. 3. fall behind వెనుకబడటము.

**lambliasis** giardiasis, *see/చూడండి* giardiasis.

**lamella** [lamellae *pl.*] 1. bony lamellae, thin layers in bone, 2. *micro.str.* సూక్ష్మ.చూ. **Haversian lamellae** ఎముకలోని పొరలు.

**lamina** *anat.* 1. flat layer or plate చదునైన పొర లేదా బిళ్ల. 2. **l. of vertebra** వెన్నెముక వెనుకభాగము/కమాను.

**laminectomy** surgical excision of the lamina, *viz.* the posterior arch of a vertebra వెన్నెముక వెనుక కమానుని శస్త్రచికిత్స ద్వారా తొలగించుట.

**lancet** 1. short double-edged piercing surgical knife శస్త్రచికిత్సలో వాడే రెండువైపుల పదునున్న చిన్న బల్లెములాంటి కత్తి/ఈటెవంటి శస్త్రం. 2. Lancet, a reputed journal of medicine పేరుమ్రోగిన వైద్యపత్రిక.

**lancing** piercing with a spear-shaped weapon called lance బల్లెముతో పొడిచినట్లు. **l. pain,** simulating that caused by piercing with a lance బల్లెముతో పొడిచినప్పుడు కలిగిన వ్యథను పోలిన బాధ.

**Landry-Guillain-Barre syndrome** AIDP *abbr.* autoimmune demyelinating polyradiculoneuropathy; infectious polyneuritis; myeloradiculopolyneuronitis. acute ascending rapidly progressive motor paralysis with variable disturbance of sensory function బహుళనాడీ వ్యథ, పలునాడీ శోథం: పక్షవాతం కాళ్ళదగ్గర మొదలిడి త్వరితగతిలో పైకి ప్రాకుతుంది, స్పర్శజ్ఞాన అపవ్యవస్థ ఒక రోగికి మరియొక రోగికి వేరువేరుగా ఉంటుంది.

**lanolin** (*syn.* adeps lanae hydrosus). wool fat containing 30% water. Anhydrous lanolin is fat obtained from sheep's wool, used in ointment bases గొఱ్ఱె ఉన్ని నుండి తయారు చేసిన కొవ్వు, మలాంయొక్క తయారీలో వాడ్తారు [*q.v.* lard].

**lanugo** [Latin *lana*=wool]. fine, soft, downy, woolly hair which appears on the fetus at the end of $3^{rd}$ month of gestation, *resemblance:* wool. 3వ నెలాఖరు భ్రూణము మీది మెత్తని, మృదువైన, కోమలమైన నూగు, పోలిక: ఉన్ని.

**laparoscope** an endoscope passed into the peritoneal cavity అంత్రవేష్టన కుహరాంతర్దర్శిని: అంత్రవేష్టన కుహరములోనికి ఒక గొట్టము వేయుట.

**laparoscopy** procedure to pass a laparoscope for examination or as a modality of treatment, *e.g.* laparoscopic tubectomy పైగొట్టము ఉదరకుహరములోనున్న అవయవములను పరీక్షించుటకు మరియు కొన్ని చికిత్స సదుపాయములకు వినియోగిస్తారు, ఉదా. లాపరోస్కోప్‌ద్వారా స్త్రీలలో పిల్లలు పుట్టకుండా చేయు అపరేషన్ (చిన్నఅపరేషన్) అనగా ఫెల్లోపియన్ నాళములను తుంచివేయుట. Laparoscopic keyhole surgery is becoming popular nowadays for operations on abdominal viscera. ఇటీవల లేపరాస్కోప్ గొట్టము ద్వారా పనిముట్లు పోనిచ్చి, ఉదరకుహర అవయవముల అపరేషన్లు చేయుట ప్రసిద్ధమవుతున్నది.

**laparotomy** exploration of the inside of the abdomen and its organs through a surgical incision ఉదరచ్ఛేదనము: సర్జన్ కత్తిగాటు గుండా ఉదర కుహర పరిశీలనము, ఉదరములోని అవయవములను సోదాచేయుట. **diagnostic l.**, వ్యాధి నిర్ణయమునకు తోడ్పడుతుంది. Biopsy/operation can be done, if needed. అవసరాన్నిబట్టి కణజాల ములో ముక్కతీసి పరీక్షకు పంపుట లేదా అపరేషన్ చేయుట నిర్ధారణ చేస్తారు.

**lard** fat of swine, used in the preparation of ointments (as a base) పందికొవ్వు, వరాహ/సూకర కొవ్వు నూనె మలాంయొక్క తయారీలో వాడ్తారు [*q.v.* lanolin].

**larva** stage of larva డింభకము. 1.the first stage of an insect from its egg; అప్పుడే గ్రుడ్డులోనుండి వచ్చిన పిల్ల; కీటకముయొక్క జీవితములో ఒక దశ; కోశాంతర్గత కీటకము. *e.g.* The caterpillar is the larva of the butterfly. ఉదా. గొంగళిపురుగు సీతాకోకచిలుకయొక్క డింభకము. 2. independent motile developmental stage in the life history of a parasite పరాన్నజీవియొక్క జీవితచరిత్రలో స్వతంత్ర చలనదశలోనున్న జీవి, దేహనిర్మాణమున తల్లినిబోలకుండా స్వేచ్ఛావిహారముచేయు పిల్ల. **l. migrans,** creeping eruption, *see/చూడండి* Ancylostoma; ground l., in itch.

**laryngeal** concerning the larynx శబ్దపేటికకు సం.

**laryngismus** muscular spasm of the voice-box శబ్దపేటికయొక్క కండరముల ఈడ్పు. **l. stridulus** (*adj.* of stridor), abrupt laryngeal spasm with crowing inspiration and cyanosis తటాలున సంభవించు, కాకి 'కావ్'ను పోలిన ఉచ్ఛ్వాసము; నీలిపెదిమలతో కూడిన, శబ్దపేటిక స్నాయువుల ఈడుపు.

**laryngitis** inflammation of the larynx, hoarseness due to sore voice-box శబ్దపేటిక కందుట, స్వరపేటిక యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'. గొంతు బొంగురుపోవుట, మ్రింగుటలో నొప్పి, అలంకార. స్వరపేటికయొక్క అపస్వరం.

**laryngoscope** 1. an endoscope to examine the larynx శబ్దపేటి కాంతర్దర్శిని: శబ్దపేటికను పరికించు పరికరము/పరిశీలనా పనిముట్టు. 2. Laryngoscope, a medical journal వైద్యవార్తా పత్రిక.

**laryngospasm** spasm of the larynx స్వరపేటిక యొక్క ఈడ్పు.

**laryngotracheitis** inflammation of the larynx and trachea శబ్ద పేటిక మరియు వాయునాళంయొక్క ఇన్ఫ్లమేషన్/శోథం.

**laryngotracheobronchitis** inflammation of the larynx, trachea and bronchi స్వరపేటిక, వాయునాళము మరియు శ్వాసనాళికల శోథము/'నొప్పి కందు మంట వాపు'.

**larynx** voice box or noise box స్వర/శబ్ద/ధ్వనిపేటిక, స్వరయంత్రము, గొంతుక్రోవి. *figur.* chatter box అలంకార. అతివాగుడు రాయుడు. the passage way connecting the pharynx and windpipe (trachea)

గొంతుక, వాయునాళముల మధ్య మార్గము. Larynx consists of nine cartilages (one of it is Adam's apple, the front prominence in the neck caused by the thyroid cartilage). స్వరపేటికలో తొమ్మిది మృదులాస్థులున్నవి (ఇందులో ఒకటి థైరాయిడ్ మృదులాస్థి – కంఠమణి, గొంతుకముడి). Voice box is a boon/gift given by God to singers. స్వరపేటిక గాయకులకు దేవుడిచ్చిన వరము.

**laser** acronym for light amplification by stimulated emission of radiation – a device that transforms light into heat, used as a tool in surgery, *e.g.* YAG laser used for photocoagulation వెలుతురును వేడిలోనికి మార్చి, శస్త్రచికిత్సలో ఉపయోగపడు సాధనము, *ఉదా.* కిరణజన్య స్పందనప్రక్రియ.

**lassitude** weariness బడలిక. languor నిస్సత్తువ, నీరసము.

**lateral** 1. *anat.* away from the mid-line of a structure/organ, *e.g.* away from the umbilicus పార్శ్వ; పక్క, ఒక నిర్మాణము/అవయవము యొక్క మధ్యరేఖకు వెలుపల, *ఉదా.* బొడ్డుకు వెలుపల [*in contr.* medial *భిన్న.* మధ్య]. 2. pertaining to a side of the body, right or left శరీరములో కుడి లేదా ఎడమవైపు.

**latex** 1. thick milky juice produced by some plants and used in the manufacture of rubber చిక్కటి తెల్లపాలలాంటి సొన/రసం; రబ్బరు తయారీలో ఉపయోగిస్తారు. 2. synthetic product used in manufacture of surgeon's gloves కృత్రిమ రబ్బర్‌నుండి సర్జన్ చేతితొడుగు తయారు చేస్తారు.

**latissimus** widest అతి విశాలమైన. *anat.* **l. dorsi**, back muscle ఛాతివెనుక వెడల్పైన కండరము.

**laudanum** a tincture containing opium నల్లమందు యొక్క ఈష న్మిశ్రమ/ఈషత్సంసర్గద్రవం.

**laugh** risus నవ్వు. *see/చూడండి* risus.

**laughing gas** nitrous oxide, *see/చూడండి* nitrous oxide.

**lavage** *see/చూడండి* g. lavage in gastric. ధావనము.

**laxative** an agent which causes/enables the bowels to evacuate; aperient మృదువిరేచనకారి: విరేచనమగునట్లు చేయు పదార్థము,

విరేచనకారి, ఉదా. గోంగూర, సునాముఖి, ఆకుకూర (పాలకూర), పచ్చిబెండకాయ. *N.B.* A soft silky stool is a pleasure. *గమనిక:* పట్టులా జారిపడే పురీషము సుఖానుభూతిని కలిగిస్తుంది.

**layer** stratum స్తరము/పొర. a sheet of tissue కణజాలము యొక్క అట్ట. *e.g.* 1. layer superimposed one above the other, as in the epidermis, *see/చూడండి* epithelium. ఉదా. బాహ్యచర్మములోని దొంతరలుగా (అనగా ఒకదాని పైన ఇంకొకటి) తీర్చిదిద్దబడిన ఉపకళపొరలు. 2. layer of rods and cones in the retina రెటీనాలో రాడ్‌లు, కోన్‌లు ఉన్న పొర.

**LDL** *abbr.* low density lipoprotein, *colloq.* bad cholesterol తక్కువ సాంద్రతగల లైపోప్రోటీన్. (*N.B.* Lower the level of your LDL to avoid heart disease. *గమనిక:* గుండె జబ్బుల నివారణకొరకు తక్కువ సాంద్రతగల లైపోప్రోటీన్ల స్థాయి తగ్గించాలి).

**lead** 1. chemical element సీసము, ఒక లోహము. chronic poisoning called plumbism affecting the brain, causing neuritis and intestinal colic, and producing blood changes, *see/చూడండి* lead l., in line. సీసము దీర్ఘకాలముగా శరీరములోనికి ప్రవేశించిన ఫలితంగా మెదడుకు, నాడులకు, పేగులకు జబ్బు వచ్చుట, రక్తములో దోషములు బయలుదేరుతాయి. పొట్టలో పేగుల పరిణామశూల (intestinal colic) కు సీసము ఒక కారణము. **l. encephalopathy**, affection of the brain సీసమువలన మెదడు సుస్తి. 2. High levels of lead in atmospheric air above 10 micrograms per decilitre is a risk of pollution in cities with increasing vehicular traffic. Sale of unleaded/deleaded petrol is a preventive measure. పట్టణాల్లో పెరుగుతున్న వాహనాల వలన గాలిలో సీసం వాయువుల శాతం ఎక్కువ అవుతుంది – దీనివలన వాయుకాలుష్యం కలుగుతుంది. పెట్రోలులో సీసం భాగం మినహాయించి అమ్ముట ఒక నివారణోపాయం.

**lead** the wires connected to the electrocardiograph; ఈ పనిముట్టులో తీగలు. Leads I to III, $aV_R$ to $aV_F$ and $V_1$ to $V_6$ నవారుబద్దలాంటి కాగితంమీద రేఖలు, తరంగములు.

**LE cells** *abbr.* lupus erythematosus cells. found in the bone marrow of patients with lupus erythematosus ఈ జబ్బుతోనున్న రోగుల అస్థిమజ్జలో కనబడు కణములు.

**leech** *Hirudo medicinalis,* an aquatic worm, *see/చూడండి* hirudin. జలగ, నీటిపురుగు. *figur.* By virtue of its name, it came close to the medical man and his medicine. అలంకార. వైద్యశాస్త్ర పురోగమనంలో జలగపట్టు(దల).

**left anterior oblique** *abbr.* **LAO** position of X-ray [*opp.* right anterior oblique RAO].

**left lateral** view of X-ray ఎడమప్రక్కనుండి ఎక్స్‌రే ఫోటో [*opp.* right lateral].

**left side** వామపక్ష ఎడమవైపు. [*opp.* right side వ్యతి. దక్షిణపక్ష].

**leg** the portion from the knee to ankle; by traditional usage the entire lower limb కాలు: మోకాలు కీలునుండి చీలమండ వరకుగల ప్రాంతము; వాడుకభాషలో అధోంగమును కాలు అంటారు.

**leiomyoma** benign tumour derived from smooth muscle, usually of the womb (uterus) నునుపు కండరాలనుండి (తరచుగా గర్భసంచిలో) పుట్టే/ఉద్భవించే నిరపాయ కంతి.

**leishmaniasis** infection with *Leishmania, see/చూడండి* kala-azar. *Leishmania donovani* causes kala-azar. *Leishmania tropica* causes an ulcer known as Oriental Sore; Baghdad Button; Delhi Boil.

**lens** 1. transparent biconvex lens in the eye కటకము: ఒకవైపునుండి మరియొకవైపుకు వెలుతురును, రూపములను పోనిచ్చెడు పారదర్శకమైన, ఇడ్లీ ఆకారములోనున్న బిళ్ళ. ఇది అపారదర్శకమైన యెడల శుక్లము అంటారు, *see/చూడండి* cataract. 2. intraocular lens (IOL) implantation: The cataract lens is removed and an artificial transparent lens is inserted into the eye. శుక్లము తీసివేసి కృత్రిమ పారదర్శకమైన కటకమును కంట్లో పెడతారు. 3. glass lenses, *i.e.* spectacles గాజుబిళ్ళలు అనగా సులోచనాలు. **contact l.,** a plastic shield, applied in contact with the cornea సంపర్క కటకం,

స్పర్శకటకము, శుక్లపటలమునకు అంటిపెట్టుకుని ఉండే ప్లాస్టిక్ కవచము. This is useful to correct error of refraction, *i.e.* avoiding an outer pair of spectacles. సులోచనాలు/కండ్లజోడు బయటపెట్టుకునే బదులు శుక్లపటలమునకు ఈ కవచము అంటించుట.

**lenticular** lenti-form, lens-shaped కటకము ఆకారములోనున్న. **l. opacity** కటకములో అపారదర్శక భాగం.

**lentigines** [lentigo *sing.*] lesions like freckles: melanin pigmented spots on the skin ఫ్రెకిల్స్‌లాంటి క్షతములు: చర్మముమీద నల్లని మచ్చలు.

**lentigo** a brown macule, *resemblance:* freckle నీరుకావి వర్ణము కల మచ్చ, పోలిక: పుట్టుమచ్చ.

**leonine** lion-like సింహమునుపోలిన. 1. **l. facies,** appearance of the face in lepromatous leprosy కుష్ఠరోగములో తారుమారు చెందిన సింహాకారమైన ముఖము. 2. **l. dignity** సింహమువలె గంభీరత, అలంకార. నరసింహా.

**leper** a person afflicted with leprosy కుష్ఠరోగి.

**lepidosis** any scaly or desquamating lesion on the skin, especially eruption చర్మముపై పొలుసులుగా వచ్చే క్షతము, ముఖ్యంగా పొక్కు.

**lepromata** [leproma *sing.*] nodules in leprosy: granulomatous cutaneous eruptions లేతనైన కణజాలముగల చర్మపు బుడిపెలు; *గమనిక:* కుష్ఠరోగిని కురూపిగా చేస్తాయి; కుష్ఠరోగికి కష్టంకూడాను.

**lepromatous** One variety of leprosy wherein the face presents leonine features; the skin becomes red and oedematous, nodules appear over face, ears and body. సింహాకృతిగల ముఖము, ఒళ్ళు కంది, ఉబ్బి, కంతులు ముఖముమీద, చెవులమీద, శరీరమంతటా వ్యాపించియున్న కుష్ఠరోగము. **l. reaction,** the above features in acme, associated with high fever ఈ పై లక్షణములు ఉత్కృష్టస్థితిలోనికి వచ్చి, ఉష్ణోగ్రత జాస్తి అగుట అనగా తీవ్రమైన జ్వరము బాధించుట.

**lepromin test** a skin test in leprosy కుష్ఠరోగములో చేసే చర్మపరీక్ష

**leprosy** Hansen's disease కుష్ఠరోగము. caused by *Mycobacterium leprae*; a chronic communicable/contagious disease producing granulomatous lesions in the skin, mucous membranes and peripheral nerves. దీర్ఘకాలపు, స్పర్శమువలన రోగవ్యాపనము చెందు అంటురోగము. చర్మము, శ్లేష్మపొరలు, నాడుల మీద కణికామయ క్షతములు (granulomatous lesions) కల్గించు రోగము. **lepromatous l.,** characterized by the development of lepromas (nodules) which contain plenty of bacilli లెప్రోమాకంతులు శరీరమంతా వ్యాపించి, వాటిలోని లెప్రె బాసిల్లై పుష్కలముగా సూక్ష్మదర్శినిలో అగపడుట. **polyneuritic l.,** characterized by thickening of peripheral nerves with anaesthesia of the part, *e.g.* thickening of the ulnar nerve producing clawhand పరిధీయనాడులు లావెక్కి, ఆ ప్రాంతములో స్పర్శజ్ఞానము లేకపోవుట, ఉదా. మోచేతి లోపలివైపు ఎముక కందము (condyle) అడుగున ఉన్న అరత్ని నరము (ulnar nerve) ఉబ్బి, పక్షి వంకరగోళ్ళవలె ముడుచుకుపోయిన వేళ్ళుగల అరచేయి. **tuberculoid l.,** raised, macular anaesthetic patches over the skin చర్మముపైన కొంచెము ఉబ్బిన, రంగుమారిన, తిమ్మిరి మచ్చలు శరీరమంతా లేదా ఒక ప్రాంతములో విస్తరించి యుండుట. *N.B.* Leprosy was being referred to as *kusht* from Vedic times. కుష్ఠరోగమని వేదాలలో పేర్కొన బడినది. Unfortunately a social stigma is attached to the disease even now-a-days. దురదృష్టవశాత్తు ఈ కాలంలోగూడా సాంఘిక దృష్ట్యా ఒక కళంకముగా భావింపబడుచున్నది/పరిగణింపబడుచున్నది.

**leptomeninges** coverings over the brain and spinal cord: pia mater and arachnoid మెదడుమీద మరియు వెన్నుపాము మీద ఉన్న పొరలు: పయామేటర్ మరియు లౌతికళ.

**leptospirosis** Weil's disease. infection by bacteria, *Leptospira icterohaemorrhagiae* characterized by meningitis, hepatitis and nephritis, separately or in combination లెప్టొస్పైరా అను బాక్టీరియా వలన సంభవించును. మెదడు పొరల వాపు, కాలేయము జబ్బు మరియు మూత్రపిండాల రుగ్మత – వీటిలో ఏ ఒకటైనా లేదా అన్నీ తటస్థించవచ్చును.

**lesbian** homosexual woman స్వలింగ సంపర్కాభిలాషియైన స్త్రీ.

**lesbianism** tribadism: homosexuality between women ఇద్దరు స్త్రీలు ఒకరితో ఒకరు రమించటం; ఒక స్త్రీకి మరియొక స్త్రీకి మధ్య లైంగికవాంఛ/సాంగత్యసాధన, స్త్రీలలో స్వలింగ సంపర్కం.

**lesion** a pathological deviation from normalcy – (a) acquired, as a wound, hurt, injury, sore, growth/tumour, degeneration, infection, infestation, pigment disorder or (b) a congenital defect/condition in an organ, tissue of the body or mucous membrane, resulting in derangement of function of that structure క్షతము: శరీరములో ఏ అవయవమునకుగాని, కణజాలమునకుగాని, శ్లేష్మపొరకుగాని కలుగు అస్వస్థత; వివరము – (a) సంక్రమించినది: గాయము, దెబ్బ, హాని/చెరుపు/కీడు, వ్రణము, పెరుగుదల/కంతి, క్షీణించి దిగజారుట, సూక్ష్మజీవి/పరాన్నజీవి సంపర్కము, వర్ణకము వికృతి. (b) పుట్టుకతో వచ్చినది: భూమి మీదకు వచ్చినప్పుడే ఉన్న లోపము. ఈ అస్వస్థత వలన విధి/కార్యాచరణకు ఆటంకము కలుగుతుంది. *N.B.* This term is an oft-used, omnifarious entity in medical parlance; a gem of a term. *గమనిక:* వైద్యపదముల విసురుట/వ్రాయుటలో తరచుగా వాడబడే, పలువిధముల జాడ్యములను సూచిస్తున్న, బహుళాధారమైన/బహుళార్థ సూచకమైన పదరత్నము ఈ క్షతము.

**leucine** an essential amino acid found in proteins ప్రోటీన్లలో ఉన్న ముఖ్యమైన ఎమైనో అమ్లము.

**leuco** or **leuko** = white తెల్లని.

**leucoblast** or **leukoblast** precursor of leucocyte; immature white blood cell తెల్లరక్తకణము యొక్క అగ్రగామి, పక్వముకాని తెల్లరక్తకణము.

**leucocyte** or **leukocyte** white blood cell శ్వేత/తెల్లరక్తకణము. colourless blood corpuscle *abbr.* WBC. They fight infection, destroy microorganisms. సూక్ష్మజీవులతో పోరాడి, వాటిని నిర్మూలనము చేయు శక్తిగలవి. the differential white cell count in normal health: basophils – 1%, eosinophils – 3%, lymphocytes – 30%, monocytes – 6%, neutrophils (polymorphonuclear) – 60%.

**leucocytolysis** or **leukocytolysis** dissolution or lysis of *leucocytes* తెల్లరక్తకణముల విచ్ఛిన్నము.

**leucocytopoiesis** or **leukocytopoiesis** *see/* చూడండి leucopoiesis.

**leucocytosis** or **leukocytosis** transient increase in the number of white blood cells తెల్లరక్తకణముల సంఖ్యలో తాత్కాలిక పెరుగుదల.

**leucoderma** or **leukoderma** leuco = white, derma = skin. localised loss of pigmentation in the skin బొల్లి, తెల్లమచ్చలు, శ్వేతకుష్ఠము: చర్మములోని వర్ణకము హరించిపోయి తెల్లమచ్చలు బయలు దేరుట. *N.B.* This is not a bar/hindrance to general health, it is cosmetically embarrassing. *గమనిక:* ఇది ఆరోగ్యమునకు ఆటంకముగాదు, చూపులకు ఆకర్షణ రహితము – అంతే, కాని చెడుజబ్బు అని కొందరిలో అపోహ ప్రబలియున్నది. వ్యాఖ్యానము: శ్వేతకుష్ఠము అనేపదం ఖండించాలి. శ్వేతచర్మం అని ఉండాలి.

**leucokraurosis** or **leukokraurosis** kraurosis vulvae, roughening of the vulva, *see/చూడండి* kraurosis. భగము కరకు ఎక్కుట/అగుట. అలంకార. స్త్రీకి సిగ్గుచేటు.

**leucoma** or **leukoma** a dense, white corneal opacity, *see/* చూడండి corneal g. in graft. గ్రా. కంటిపూవ్వు, శుక్లపటలములో సాంద్రమైన/దట్టమైన, అపారదర్శకమైన/కిరణాభేద్యమైన, కాంతినిరోధక తెల్లటి మచ్చ/చుక్క.

**leuconychia** or **leukonychia** white spots on the nails నఖముల మీద తెల్లమచ్చలు.

**leucopenia** or **leukopenia** decrease in the number of leukocytes in the blood below 5000 per cubic mm. తెల్లరక్తకణములు క్యూబిక్ మి.మి.కు 5000 కన్నా తక్కువగుట.

**leucoplakia** or **leukoplakia** a white patch on the mucous membrane that cannot be erased చెరిపివేయలేని, శ్లేష్మపొరమీద తెల్లమాసిక/మచ్చ. **oral l.** నోరు, అంగిలి, బుగ్గలోపల ఎక్కడైనా అగపడు తెలుపు మచ్చ(లు). **vulval l.** భగ శ్లేష్మపొరలో తెలుపు మచ్చ(లు).

**leucopoiesis** or **leukopoiesis** leucocytopoiesis. [Greek *poiesis* = a making]. The formation/manufacture of white blood cells తెల్లరక్తకణముల ఉత్పత్తి.

**leucorrhoea** or **leukorrhea** 1. (also 'the whites') *colloq.* white discharge. వాడు.భా. తెల్లబట్ట అవుతుంది, బట్టతెలుపు, తెలుపుపోతుంది; ఈ తడివలన తరచుగా బట్టలు మార్చడం కద్దు. whitish viscid discharge from the womb and vagina తెలుపు పోతుంది, తెల్లటి, జిగటలాంటి ద్రవము యోనినుండి కారుట. 2. This has to be differentiated from the normal physiological stimulus of mucous output preparatory to coitus, to enable lubrication. సంభోగమునకు ముందు ఉద్దీపన (stimulus) గా శ్లేష్మము యొక్క జల్లు ఆరోగ్యసూచకము, ఈ ప్రక్రియకు నాంది; అది పురుషాంగము సులువుగా జారుటకు తోడ్పడుతుంది.

**leucotomy** or **leukotomy** often pre-frontal leucotomy or lobotomy, *see/చూడండి* prefrontal lobotomy.

**leukaemia** or **leukemia** purposeless proliferation of white blood cells and their precursors, a malignant condition of the blood-forming organs, chiefly bone marrow and to a small extent lymph nodes రక్తకేన్సరు/కాన్సర్, రక్తోత్పత్తి అయ్యే అవయవములు (ముఖ్యముగా ఎముక మజ్జ, స్వల్పముగా లింఫ్‌గ్రంథులు) కాన్సర్‌కు గురిఅయి – తెల్లకణములు, వాటి అగ్రగాములు నిరుపయోగకరమైన సంఖ్యావృద్ధి చెందుట. *figur.* tyranny of white blood cells *అలంకార.* తెల్లరక్తకణములయొక్క క్రూరత్వము. **acute l.**, different types ఉద్ధృతము కలిగిన దశ; వివిధరకములు. **chronic l.**, different types దీర్ఘపరిమితిగల ప్రవర్తనము చూపు జబ్బు; వివిధరకములు. **myeloid l.** affecting the granulocyte precursor cells in the bone marrow అస్థి మజ్జలో కణికామయ అగ్రగామి కణములయొక్క లుకీమియా. Diagnosis rests on blood and bone-marrow examination. రోగనిర్ధారణకు రక్తము మరియు అస్థిమజ్జ పరీక్ష అవసరము. Bone marrow transfusion is one modality of treatment in some cases. అస్థిమజ్జదానము కొందరిలో చికిత్సోపాయము.

**leukaemoid** or **leukemoid** resembling leukaemia but the cause is different లుకీమియానుపోలిన వ్యాధి, కాని కారణము వేరు.
**l. reaction** in Hodgkin's disease, tuberculosis.
**levator** one which elevates పైకెత్తు. 1. levator palpebrae superioris, the smallest muscle in the body with the longest name. It elevates the upper eyelid. పొడుగు పేరుతోనున్న పిన్నకండరము; కంటి పైరెప్పను పైకెత్తు కండరము. 2. instrument in surgery శస్త్రచికిత్సలో పనిముట్టు.
**levocardia** *see/చూడండి* laevocardia.
**libido** 1. sexual urge, primordial instinct; sex hunger కామేచ్ఛ, కామాతురత, లైంగిక వాంఛ; ఆదిమ, బీజభూతమైన అంతర్బుద్ధి. 2. in Freudian psychology: energy of the psyche మనోగతి శాస్త్ర సంబంధమైన శక్తి. *N.B.* word given by Freud *గమనిక:* ఫ్రాయిడ్ ఇచ్చిన పదము.
**lichen** a skin disease ఒక చర్మవ్యాధి. **l. planus,** an inflammatory skin disease with violaceous, shiny papules మొటిమలతో కూడు కున్న చర్మము యొక్క 'వేడి ఎరుపు మంట వాపు'. **l. scrofulosorum,** papules in tuberculosis క్షయవ్యాధి చర్మమునకు సోకుట.
**lichenification** thickening of skin secondary to scratching గోకుడుతో మొద్దు/బండబారిన చర్మము, అలంకార. దురదబెడద.
**lien(o)** – splen(o)- relating to spleen ప్లీహమునకు సం.
**lienorenal** relating to the spleen and kidney స్ప్లీన్ మరియు కిడ్నీకి సం.
**lientery** passage of undigested food in the stools జీర్ణముకాని ఆహారపదార్థాలు విరేచనంలో బయల్పడుట.
**life-cycle** the sequence of stages in one's life జీవక్రమం. stages in the development of a parasite పరాన్నజీవి పెరుగుదలలో దశలు.
**life-support** life support machine which allows dangerously ill patients to remain alive ప్రమాద జబ్బుల్లో జీవితం నిలిపే మెషీన్.
**ligament** a band of fibrous tissue బంధకము, స్నాయువు. 1. structure which strengthens joints 2. connecting bones అస్థిబంధకము.

కీలు/సంధిని బలపరచే బంధకము. 3. a double layer of peritoneum giving prop to an organ, *e.g.* **broad l., of uterus** గర్భసంచికి ప్రాపునిచ్చు అంత్రవేష్టన ద్విస్తరము. **cruciate l's of knee,** (X)-like మోకాలు కీలులో (X) - రూపంలో స్నాయువులు. **inguinal l.,** గజ్జలోని స్నాయువు. **nuchal l.,** at the back of the neck మెడవెనుక ప్రాంతమునవున్నది. *N.B.* The tenacious/fastidious nature of the strength of a ligament is realised during the following manoeuvre, an experience: Even if the sole of the foot turns 90° inward inadvertently while walking, nothing happens to the joint by virtue of the tremendous elastic property of the lateral ligament of the ankle joint, in spite of expecting disaster to the joint. *గమనిక:* స్నాయువుయొక్క పటుత్వం ఎంత దృఢంగా ఉంటుందంటే – ఈ అనుభవములో విశదీకరింపదగును: నడుస్తున్నప్పుడు పొరపాటున పాదం లోపలికి 90° వంగినా చీలమండకు వెలుపల ఉన్న స్నాయువుయొక్క అతీత స్థితిస్థాపక గుణంవలన కీలుకు ఏమి అపాయము కలుగదు – ఇంత హైరాణకు కీలు ధ్వంసం అయిందా అని భయం కలుగుతుంది కాని ఆ స్నాయువు దయవలన కాపాడబడుతాం.

**ligature** agent for ligating/tying blood vessels, *e.g.* catgut, *see/చూడండి* catgut. ముడిదారము, రక్తనాళములను బంధించు వస్తువు.

**lignocaine** lignocaine hydrochloride is a local anaesthetic drug used in surgery శరీరంలో ప్రాంతీయంగా మత్తు కలిగించే మందు. శస్త్రచికిత్సలో వాడ్తారు.

**limb** 1. upper extremity: arm, forearm, hand ఊర్ధ్వాంగము, పై అంగము: భుజము, మోచేయి, చేయి. lower extremity: thigh, leg, foot అధోంగము, క్రింది అంగము: తొడ, కాలు, పాదము. 2. a structure resembling a limb, *e.g.* posterior limb of the internal capsule in the brain అంగమును పోలిన నిర్మాణము, *ఉదా.* మెదడులో ఒకభాగము. **phantom l.,** a sensation of the existence of an amputated limb; imagining even to the point of detailing pain in it – This is a clinical paradox! మనోరథసృష్టి అంగము: ఆపరేషన్

చేసి అంగము తొలగించిన తర్వాత కూడా ఇంకా అది శరీరములో ఒకభాగముగా నున్నట్లు మనస్సులోని ఊహ, అంతేగాకుండా అందులో నొప్పిని విశదీకరించుట – ఇది విడ్డూరము కదా!

**limbus** fringe అంచు. **l. of cornea,** sclerocorneal junction దృఢస్తరము శుక్లపటలము సంధి.

**lime** 1. calcium oxide సున్నము. 2. citrus fruit, rich source of vitamin C నిమ్మపండు – ఇందులో సి విటమిన్ సమృద్ధిగా ఉంది.

**limp** impediment in walking, *e.g.* tuberculosis of hip joint కుంటుతూ నడక, ఉదా. తుంటికీలులో క్షయవ్యాధి.

**lincomycin** an antibiotic used to treat infections by some bacteria కొన్ని బాక్టీరియాను రూపుమాపే యాంటిబయాటిక్.

**linctus** a sweet syrupy medicine ఔషధపానకము. **l. codeine,** used to allay pain in throat and dry cough గొంతునొప్పిని ఉపశమనము చేయు మరియు పొడిదగ్గును అరికట్టు తీపిద్రవం, అలంకార. తీపి తగిల్తే తీపు తగ్గుతుంది.

**line** a long narrow mark or streak లైను, సన్నగీత. A. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **bismuth l.,** blue black line at the gingival margin in bismuth poisoning చిగుళ్ళమీద నీలినలుపు రంగుగల రేఖ – ఇది బిస్మత్ ఇంజక్షన్లు ఎక్కువగా తీసుకున్నందువలన కలిగిన గుర్తు/విషపరిణామము. **lead l.,** a bluish black line at the gingival margin in lead poisoning, *see*/చూడండి lead. సీసము శరీరములోనికి ఎక్కువ మోతాదులో గుంజుకొనబడిన స్థితి. ఇందులో చిగుళ్లమీద నీలితోకూడిన నలుపురంగు రేఖ అగపడుతుంది. *micro.str.* సూక్ష్మ.చూ. **cement l.,** boundary of an osteon in bone (Haversian system) ఎముకలోని సూక్ష్మభాగము. **dental l's,** in the structure of tooth పన్నులోని సూక్ష్మనిర్మాణపు గీతలు. B. **blood l.,** family pedigree వంశపరంపర, వంశవృక్షం.

**linea** line రేఖ. *anat.* streak on the surface of a structure నిర్మాణతలముమీద చార. **l. alba,** vertical white line above and below the umbilicus on the abdominal wall ఉదరకుడ్యముమీద బొడ్డుకుపైన, క్రింద ఉన్న తెల్లనిలువుగీత. **l. nigra,** Linea alba

becomes black during pregnancy. పై తెల్ల నిలువుగీత నల్లబడుట చూలుగుర్తు.

**lingua** tongue నాలుక, జిహ్వ. *figur.* Tongue is the most powerful instrument on the earth. అలంకార. నాలుక నాణ్యమైన నటనాధురీణి; రసజ్ఞ రసవంతం, రసికత్వం కూడాను – జిహ్వాకు జేజేలు. **l. fissurata,** fissured tongue కరకు/గరుకు నాలుక. **l. nigra,** black tongue నల్లటి నాలుక.

**lingual** relating to the tongue నాలుకకు సం. **l. tonsil** గొంతులో టాన్సిల్.

**lingula** 1. tongue shaped segment/portion of the left lung జిహ్వను పోలిన, ఎడమ ఊపిరితిత్తిలోని తునుక/భాగము. 2. **l. cerebelli,** tongue of the cerebellum చిన్నమెదడులో నాలుకను పోలిన భాగం.

**liniment** a medicinal solution applied over a sore to soothe it or to relieve pain in sprain తైలము, లేపనము: వ్రణమును చల్లబరచి, ఊరడించు లేదా బెణకు నొప్పిని ఉపశమింపజేయు ఔషధద్రవము/మర్దనౌషధము.

**lint** surgical dressing material which is soft on one side గాయములకు కట్టుకట్టడంలో వాడే బట్టముక్క. ఇది ఒకవైపు మెత్తగా, మక్‌మల్ వలె మృదువుగా ఉంటుంది.

**lip** a mass of flesh అధరము, పెదవి, మోవి. 1. a pair of horizontal fleshy masses at the entrance of the mouth అధరముల జంట, నోటిద్వారమందున్న అడ్డపెదవుల జంట – మాంసపు ముద్దలు. 2. a pair of vertical pads of fat at the entrance of the vagina క్రింది నిలువు పెదవులు, యోనిద్వారమందున్న నిలువు పెదవుల జంట – కొవ్వు మెత్తలు/దిండ్లు.

**lipaemia** or **lipemia** lipidaemia, hyperlipidaemia రక్తములో అధికకొవ్వు. **alimentary l.,** The blood is more oily after the ingestion of food. ఆహారము తిన్నతర్వాత రక్తము ఎక్కువ జిడ్డుగా ఉంటుంది.

**lipase** fat-splitting enzyme కొవ్వును విభజించే ఎన్‌జైమ్. **pancreatic l.** క్లోమములోని ఈ ఎన్‌జైమ్.

**lipid** group of fats and fat like substances – bank balance in the body కొవ్వులు, క్రొవ్వుపదార్థములు – శరీరంలోని క్రొవ్వు/శక్తి నిధి.

**lipoatrophy** 1. atrophy of subcutaneous fat బక్కచిక్కిన; చర్మము క్రింద కొవ్వు కరుగుట. బక్కపీచు. 2. lipoatrophy at the site of insulin injection in a diabetic మధుమేహం రోగి చర్మంమీద ఇన్సులిన్ సూది తీసుకున్న ప్రాంతంలో కొవ్వు క్షీణతవలన గుంట.

**lipocyte** fat cell కొవ్వు కణము. *N.B.* Excessive accumulation of microscopic fat cells in the body and organs leads to conversion into a macroscopic stature. *గమనిక:* సూక్ష్మదర్శినిలో చూడబడే కొవ్వు కణముల అత్యధిక జమవలన స్థూలకాయం/విగ్రహం తయారవుతుంది. చూశారా స్థూలానికి మూలం సూక్ష్మం!

**lipodystrophy** disturbance of fat metabolism కొవ్వు కృశించడం: కొవ్వు జీవ(న)క్రియలో కలత.

**lipolysis** lysis of fat, *see/చూడండి* autolysis. కొవ్వు విచ్ఛిన్నము. lipolytic enzymes ఈ విచ్ఛిన్నమునకు తోడ్పడు ఎన్జైములు.

**lipoma** a rubbery, soft encapsulated tumour mass of adipose tissue కొవ్వుకంతి; రబ్బరువలె, మృదువుగా, కొవ్వుకణజాలములతో కూడిన గుళిక/కంతి/బంతి.

**lipoplasty** liposuction, a plastic operation to withdraw the fatty oils from underneath the skin చర్మము క్రింది కొవ్వును వేడిచేసి మూనెగా గుంజివేయుట.

**lipoprotein** a complex of fat and protein molecules, the form in which lipids are in circulation in the blood కొవ్వు మరియు ప్రోటీన్ యొక్క మిశ్రితము – కొవ్వులు ఈ రూపములో రక్తములో ప్రసరణమవుతుంటాయి. **high density l. (HDL)** హెచ్చు సాంద్రత గలవి. **low density l. (LDL),** high serum levels predispose to coronary heart disease తగ్గుసాంద్రత గలవి – కొరొనరి గుండె జబ్బుకు దారితీస్తాయి.

**liposarcoma** malignant tumour arising from/occurring in intermuscular fascia కండరముల నడుమ పట్టుకొనియున్న తంతుకణ జాలము నుండి ఉద్భవించిన అపాయకరమైన కంతి.

**lipotrophic** or **lipotropic** reducing the deposit of fat in the liver by acting on fat metabolism వసాప్రేరక: కొవ్వుజీవ(న)క్రియ ప్రక్రియలో కాలేయములోని కొవ్వునిధిని తగ్గించుట. **l. factor,** one such agent అటువంటి ఒక వస్తువు.

**lipping** beaking of the upper/lower surface of the vertebra, seen in osteoarthritis – a sight to see in X-ray film వెన్నెముక పైన/క్రింద తలమునుండి పక్షిముక్కువలె చొరచుకొని వచ్చిన ఎముక ఉబుకు – ఎక్స్‌రే ఫోటోలో చూడముచ్చట గొలుపుతుంది.

**lipuria** adiposuria. passage of fat in the urine మూత్రంలో కొవ్వు విసర్జింపబడుట/పోవుట.

**liquefaction** conversion of tissues into liquid form ద్రవీకరణము: కణజాలములు ద్రవమగుట. In pulmonary tuberculosis, the lung tissue is coughed out after liquefaction, leaving a space, which is called 'cavity' as seen in X-ray film. ఊపిరితిత్తి క్షయవ్యాధిలో కణజాలములు ద్రవపరిణామము చెంది, దగ్గుద్వారా విసర్జింపబడిన తర్వాత ఆ స్థలములో శూన్యప్రదేశము ఏర్పడుతుంది. దీనిని cavity అంటారు. ఇది ఎక్స్‌రే ఫోటోలో కనపడుతుంది.

**liquor** 1. an intoxicating alcoholic drink, such as whisky, rum, gin సారాయి, కల్లు, మద్యము, గుడంబా – నిషా కలిగించే పానీయములు. 2. a medicinal liquid to produce warmth in the body (a) brandy in small doses చిన్నమోతాదులలో బ్రాంది (b) tonics contain very little alcohol టానిక్‌లో బహుస్వల్ప మద్యము కలిసి ఉంటుంది. 3. some body fluids కొన్ని శరీరద్రవములు. **l. amnii,** amniotic fluid ఉమ్మనీరు. **l. cerebrospinalis** cerebrospinal fluid, *abbr.* CSF. మస్తిష్కమేరుద్రవము.

**liquorice** glycyrrhiza, *see/చూడండి* glycyrrhiza.

**listless** tired అలసిపోయిన. lacking energy and interest శక్తి/ఉత్సాహం లేని. listlessness, an after-effect of illness వ్యాధి పర్యవసానం.

**lithiasis** formation of stone(s) in the body శరీరంలో శిలలు/రాళ్ళు తయారగుట. 1. gall stones in gall bladder పిత్తాశయములో రాళ్ళు. 2. calculi in urinary bladder మూత్రాశయములో శిలలు.

**litholapaxy** lithotripsy in the urinary bladder and washing out the crushed fragments through a catheter కాథెటర్ ద్వారా చితకగొట్ట బడిన శిలలను మూత్రాశయంనుండి బయటకు రప్పించుట.

**lithosis** pneumonoconiosis. *see/చూడండి* pneumoconiosis.

**lithotomy** 1. a position in which the person lies on the back, with thighs wide apart వెల్లికిలా వెన్నుమీద పడుకుని రెండు తొడలు వెలుపలికి/బయటకు పంగలకర్రలా పెట్టటము. (a) adopted when PV (per vaginal), PR (per rectal) examination is contemplated యోనిలోనికి వేళ్ళు దూర్చి తనిఖీ చేయునప్పుడు, అసనములోనికి వేళ్ళుదూర్చి తనిఖీ చేయునప్పుడు. (b) surgical operations in the region of perineum, *e.g.* D & C; piles మూలాధారము ప్రాంతములో శస్త్రచికిత్స, ఉదా. డి & సి; అర్శమూలాలు. (c) during normal/natural delivery ప్రసవసమయములో, కాన్పు అవుతున్నప్పుడు. (d) posture adopted by the lady during coitus సంభోగమందు ఆమె దాల్చు భంగిమ. (e) fondling children by swinging them on one's feet పిల్లలను పాదాలమీద కూర్చోబెట్టుకొని 'ఏనుగమ్మ ఏనుగు' అంటూ బుజ్జగిస్తూ, లాలనచేస్తూ ఆడుకోవడం, వాళ్ళని కాళ్లమీద ఊపడం. (f) in states of indigestion with gaseous distension of the intestines, to expel gas out of the anus అజీర్తి, కడుపుబ్బరము స్థితిలో అపానవాయువు/అసనవాయువులు పోవడానికి; పిత్తులు పిత్తిన తర్వాత పొట్ట సడలుతుంది. 2. incision of a duct/organ to remove calculi, *e.g.* suprapubic lithotomy to remove stones in the urinary bladder నాళము/అవయవములో గాటుపెట్టి శిలలు తొలగించుట, ఉదా. మూత్రాశయములోని రాళ్ళు తీయటానికి. 3. cutting a stone, to study its composition రాయినికోసి దాని మిశ్రమం విశదీకరించుట.

**lithotripsy** crushing of the stones in the gall bladder or urinary bladder పిత్తాశయములోగాని, మూత్రాశయములోగాని శిలలను చితక గొట్టుట. A. **non-surgical methods** శస్త్రగాటులేని పద్ధతులు: (i) a flexible fibreoptic endoscope with provision for crushing the stone by endoscopic retrograde cholangiopancreatography (ERCP) technique – Stones in the common bile duct could be crushed this way and the fragments are immediately washed

out. పైత్యరసనాళములోనికి గొట్టమును పోనిచ్చి అక్కడ అడ్డుకున్న రాయిని చితకగొట్టి, ఆ చితికిన తునకలను వెంటనే బయటకు రప్పించి, పైత్యరసనాళమును మరల యథాస్థితికి (అనగా పైత్యరసం సరఫరాకు) తేవడం. (ii) using laser to crush the stones లేజర్‌ద్వారా శిలలను చితకగొట్టటం. B. **surgical method** శస్త్రవైద్యం. doing an operation and removing the stones ఆపరేషన్, శస్త్రచికిత్సచేసి శిలలను తొలగించుట. Latest technique is key hole surgery avoiding incision on the abdominal wall. ఉదరకుహరములోనికి గొట్టములు పోనిచ్చి వాటిద్వారా శస్త్రవైద్యము చేయుట నూతన/ఆధునిక పరిణామము. దీనివల్ల పొట్టమీద పెద్దగాటు నివారించవచ్చును.

**lithuresis** passage of gravel in the urine చిన్న చిన్న గులకరాళ్ళు/ఇసుకరేణువులు మూత్రంలో విసర్జింపబడుట.

**Little's** Little is the name of an English surgeon. ఇంగ్లీషు/దొర సర్జన్ యొక్క పేరు లిటిల్. 1. **L. area,** region of nosebleed in the nose responsible for epistaxis ముక్కులోనుండి రక్తస్రావం వచ్చు ప్రాంతం. 2. **L. disease,** spastic diplegia with 'scissor leg' deformity రెండుకాళ్ళ పక్షవాతం – కత్తెరకాళ్ళు. *figur.* Though the name is little, disease is big. *అలంకార.* పిట్టకొంచెమయినా కూతఘనం.

**liver** the largest gland in the body; a large dark red gland underneath the right costal margin, crucially concerned with metabolism, blood clotting and protein manufacture, *see చూడండి* hepatotoxin, regeneration. శరీరములో అన్నిటికన్నా పెద్దగ్రంథి; కాలేయము, కార్జము, యకృత్తు, కుడివైపు పక్కయెముకల అంచు అడుగున ముదురు ఎరుపు రంగులోనున్న ఒక పెద్దగ్రంథి. ఇది జీవ(న)క్రియలో అతిప్రధానమైన పాత్ర వహిస్తుంది; రక్తస్కందనము, ప్రోటీన్ తయారీలోను ఈ గ్రంథి విధి గణనీయము.

**livid** bluish discolouration due to bruising దెబ్బ తర్వాత చర్మం కమలిపోవుట, నీల/నీలివర్ణం దాల్చుట.

**lobar** relating to or affecting a lobe, especially of the lungs లోబ్‌కు సం., లేదా సంక్రమించిన, ముఖ్యముగా ఊపిరితిత్తులలో. **l. pneumonia,** pneumonia affecting a lobe లోబార్ నుమోనియా.

**lobe** a portion of an organ/gland demarcated by boundaries ఖండము, లంబిక, తమ్మె, సరిహద్దులతో ఆవరింపబడిన అవయవము/గ్రంథిలోని భాగము. 1. **ear l.**, the fleshy mass in the ear – Ladies wear earrings to adorn it as a beauty spot. చెవితమ్మె, వెలుపలి చెవి దిగువన మాంసపుముద్ద, ఈ చెవితమ్మెలను స్త్రీలు కర్ణాభరణములతో అలంకరించుకుంటారు. 2. **left l. of liver** కాలేయములో ఎడమ లోబ్. 3. **lobes in the lung** ఊపిరితిత్తిలో లంబికలు. 4. **lobes in the brain** మెదడులో లంబికలు. **frontal l.** లలాట లంబిక. **occipital l.**, posterior part of the cerebral hemisphere మస్తిష్కగోళార్ధముయొక్క వెనుకభాగము. **parietal l.** పార్శ్వక ఖండం.

**lobectomy** excision of a lobe, say in the lung, brain or liver ఖండోచ్ఛేదన: ఊపిరితిత్తి, మెదడు లేదా కాలేయములోని ఒక లంబికను శస్త్రచికిత్సచేసి ఛేదించుట.

**lobule** a small lobe or part of a lobe లఘుఖండము: తమ్మె లేదా లంబికలో భాగము. **l's of lung,** bronchopulmonary segments ఊపిరితిత్తిలో లంబికలోని తునకలు. **parietal l.**, part of the parietal lobe of the cerebral hemisphere మస్తిష్కగోళార్ధము యొక్క పెరైటల్ లంబికలోని పెరైటల్ తునక. **respiratory l.**, terminal respiratory unit అంతిమ శ్వాస వృక్ష నిర్మాణము.

**localize** a disease settling at one site in the body after spreading inside జబ్బు నెరవుచెంది అనగా విస్తరించి/వ్యాపనము చెంది, స్థానికముగా ఒకచోట నెలవుచేసుకొనుట [*in contr.* disseminate భిన్న. విస్తరింపబడు].

**lochia** post partum vaginal discharge for a week or two after babybirth/childbirth మైల: శిశువు జన్మించిన తర్వాత పురుడులో ఒకటి లేదా రెండు వారములపాటు యోనినుండి ద్రవము. **l. rubra,** bloody discharge immediately after baby birth శిశువు జన్మించిన వెంటనే కారే నెత్తురు ద్రవము. **l. serosa,** after four or five days after delivery నాలుగు లేదా ఐదురోజుల తర్వాత రసి (serum) కారుట. *figur.* in the life of a woman, menarche comparable to a commencing/virgin tremor of the uterus, menses periodic

tremors of the uterus, abortion an earthquake of the womb and delivery a cyclone in the womb *అలంకార.* స్త్రీ జీవితంలో రజస్వల గర్భకోశముయొక్క తొలివణకు, ముట్లు నియమిత కాలక్రమ వణకులు; గర్భస్రావము గర్భాశయముయొక్క (భూ) కంపము, కానుపు గర్భసంచిలో తుఫాను.

**lochiometra** distension of the uterus with retained lochia బంధింప బడిన మైల పదార్థంతో గర్భాశయము ఉబ్బుట.

**lockjaw** 1. tetanus ధనుర్వాతము. 2. trismus, spasm of the masticatory muscles; leading to tetanus దవుడ బందు, నోటి బిగువు, హనుస్తంభనము, నమలటానికి సం. కండరముల ఈడుపు; క్రమేణ ధనుర్వాతమునకు దారితీస్తుంది.

**locomotor** able to move చలనశక్తిగల. **l. ataxia,** tabes dorsalis చలనములో తూలుడు జబ్బు. *N.B.* Locomotion is a pleasure in life. *గమనిక.* చలనం జీవికి ఉల్లాసం.

**loculus** [loculi *pl.*] 1. small space or cavity చిన్నస్థలము, శూన్యప్రదేశము. space when bounded by a boundary, *e.g.* loculated effusion in pleural cavity, encysted effusion సరిహద్దులతో ఆవరింపబడిన స్థలము, ఉదా. పుపుసావరణ కుహరములో ఇటువంటి స్థలము అనగా తిత్తివలె పొరతో ఆవరింపబడిన ప్రదేశము – ఇందులో ద్రవము గూడుకట్టుకొని ఉంటుంది. 2. loculated abscess: abscess in which pus is imprisoned in multiple spaces చీము నెత్తురుగడ్డ (abscess) లో గూళ్ళుకట్టుకొని యుండుట.

**loin** the portion/area of the back in between the thorax and pelvic girdle నడుము, కటి, కటిప్రదేశము, జఘనము, రొండి; ఛాతీక్రిందను శ్రోణిచక్రము పైనను – ఈ ప్రాంతమును కటి యందురు. *figur.* It is ideal to have a person's loin like the loin of a lion. *అలంకార.* సింహమధ్య(ము), మృగరాజమధ్య(ము) అని కవులు వర్ణిస్తుంటారు.

**longevity** long life దీర్ఘాయుష్యము. దీర్ఘాయుష్మాన్ భవ! అని దీవిస్తారు. *N.B.* Activity prolongs longevity. *గమనిక:* చురుకుదనం చిరాయువునిగా చేస్తుంది.

**long-sighted** 1. able to see distant objects clearly దూరదృష్టి. 2. wise జ్ఞాని.

**long sightedness** hypermetropia. *see/*చూడండి hypermetropia.

**loop** శిక్యము. a coil చుట్ట. *naked eye str.* ప్రత్యక్ష.చూ. intrauterine device in family planning స్త్రీలలో కుటుంబ నియంత్రణ పద్ధతి – లూప్. *micro. str.* సూక్ష్మ.చూ. **capillary l's,** blood capillaries రక్తకేశనాళికలు. **l. of Henle,** in the histology of kidney – part of nephron, *see/*చూడండి nephron. హెన్లి శిక్యము; కిడ్నీకి ప్రమాణమైన నెఫ్రాన్‌లోని అంశము – నెఫ్రాన్‌లోని భాగము.

**lordosis** increased forward curve of the region of the lumbar spine కటికశేరుప్రాంతం ఎక్కువగా ముందుకు వంగి యుండుట. *figur.* A man with lordosis walks like a lord. అలంకార. దొరలాగా నడక.

**lotio** lotion లోషన్, క్రిమికీటకనాశని. antiseptic liquid for external application to the body చర్మముమీద వాడే క్రిమిఘ్నద్రవము.

**loupe** a magnifying lens భూతద్దము. Ophthalmic surgeons use this device during eye examination and operation. కంటి నిపుణులు తనిఖీలోనూ, ఆపరేషన్‌లోనూ ఈ పరికరము వాడుతారు.

**louse** [lice *pl.*] a wingless insect పేను. parasitic insects that infest the human body, pediculosis, *see/*చూడండి pediculosis. ఒడలునంటు పరాన్నజీవి పురుగులు. **body l.,** *Pediculus corporis* తనువు త్వక్కునంటు పేను. **head l.,** *Pediculus capitis* తలపేను. **pubic l.,** *Phthirus pubis,* infestation of genitals గుహ్య అవయవములనంటు పేను. Lice are vectors (transmitters) of typhus from one person to the other. టైఫస్ అను జ్వరమునకు అరోహకాలు (vectors) అనగా ఒకరినుండి మరియొకరికి సూక్ష్మజీవులను సరఫరా చేయు మధ్యవర్తులు, లంకెలు (links).

**lozenge** medicated tablet for sucking, *e.g.* throat lozenze నోట్లో పెట్టుకుని చప్పరించు మందు బిళ్ళ, ఉదా. గొంతునొప్పికి చప్పరించు బిళ్ల.

**LRTI** *abbr.* lower respiratory tract infection అధోశ్వాసమార్గ సంక్రమణం [*in contr.* URTI].

**LSD** *abbr.* lysergic acid diethylamide, a hallucinatory drug విభ్రమము కలుగజేసే మందు.

**lubb-dupp** the first and second heart sounds heard through the stethoscope or through ears applied over the precordium గుండె మొదటి, రెండవ ధ్వనులు – స్టెతొస్కోప్ తోటి వినబడును; ఛాతీమీద, ఎదురురొమ్ము మీద అనగా గుండెమీద చెవులు పెట్టినా వినబడుతాయి. అలంకార. ఈ ధ్వనులతో గుండె నాట్యం చేస్తుంది. ఆరోగ్యంలో గుండె లయబద్ధంగా లబ్బ్–డుప్ప్ అంటుంది. గుండె సోలిపోయినప్పుడు లయవిరుద్ధంగా 'లబోదిబో' అంటుంది.

**lucid** clear తేటగానున్న, తెలివిగానున్న. **l. interval,** state of consciousness in the course/progression of cerebral trauma (Beware! one should not be complacent; the patient may lapse into coma.) పుర్రె/మస్తిష్కముకు గాయములలో స్వల్పకాలపు తెలివిగల వ్యవధి ఉండవచ్చును. (కాని, జాగ్రత్త! రోగి మరల అపస్మారక స్థితిలోనికి దిగజారవచ్చును).

**lues** syphilis, a sexually transmitted disease (STD) కొఱుకు సవాయి రోగము, లైంగిక వ్యభిచారము ద్వారా సంక్రమిస్తుంది.

**lumbago** agony in the lumbar region, backache నడుము నొప్పి, కటివేదన.

**lumbar** concerning the loin(s) కటి కుడివైపుగాని, ఎడమవైపు గాని. **l. sympathectomy,** a surgical procedure ఒక శస్త్రచికిత్స. **l. vertebrae** కటికశేరుకలు, నడ్డిపూసలు.

**lumbar puncture** *see/చూడండి* puncture. వెన్నులో సూది.

**lumbosacral** pertaining to the lumbar region and sacrum నడుముకు త్రికమునకు సం. **l. strain,** ఈ భాగానికి బాధ – ఇలుకు/బెణుకు.

**lumbricus** an intestinal parasitic worm in humans, *Ascaris lumbricoides* ఈ పేరుగల పరాన్నజీవి, మనుష్యుల ప్రేగుల్లో ఉండేది.

**lumen** 1. lumina. space within a tube 1. *e.g.* ureter *ఉదా.* మూత్రనాళములోని మార్గము. 2. lumen of a tubular organ, *e.g.* intestine *ఉదా.* పేగులోని మార్గము.

**lunatic** insane person వెర్రి/పిచ్చి వాడు. **l. asylum,** hospital for mental patients వాడు.భా. పిచ్చి ఆస్పత్రి.

**lung** 1. the organ of respiration, either of the pair **ఊపిరితిత్తి,** శ్వాసకోశము, పుపుసము – శ్వాసవ్యవస్థ/ప్రక్రియ అవయవము. Lungs take in oxygen in the inspired air and leave out carbon dioxide in the expired air. ఊపిరితిత్తులు ఉచ్ఛ్వాసముద్వారా గాలిలోని ప్రాణవాయువును లోనికి తీసుకొని, నిశ్వాసముద్వారా కార్బన్ డైఆక్సైడ్‌ను వదలివేస్తాయి. The lungs are soft, spongy and elastic in normal health. ఆరోగ్యవంతునిలో ఊపిరితిత్తులు మృదువుగాను, స్పంజికవలెను మరియు స్థితిస్థాపక/సాగే గుణము కలిగిఉంటాయి. The periphery/outside of each lung is covered by a closed sac called the pleura, which consists of two layers, just like a pillow is covered by a pillow-cover. ఊపిరితిత్తి వెలుపల ప్లూరా అను రెండు పొరల తొడుగు ఉంటుంది, పోలిక: ఊపిరితిత్తి దిండు అయితే దిండుగలీబు ప్లూరా. *resemblance:* Lungs are the green parks in our body. పోలిక: ఊపిరితిత్తులు జీవిలోని ఉద్యానవనములు/పార్క్‌లు. **black l.,** coal worker's lungs, an occupational disease, black because of the deposition of inhaled coal particles బొగ్గుగనులలోని కార్మికులలో పీల్చబడిన వాయువులోని బొగ్గుకణములు ఊపిరితిత్తిలో జమ అయినందువలన అది నల్లగా అవుతుంది. – ఇది వృత్తికి సంబంధించిన వ్యాధి, వృత్తిరీత్యా వచ్చు వికృతము. 2. Lung, Lung India, medical journals వైద్యవార్తా పత్రికలు.

**lunula** the biconvex pale area seen at the root of the nail గోరు మొదలున కటకము ఆకారము (ఇడ్లీ ఆకృతి) లోనున్న, పాలిపోయినట్లు కనుపించే భాగము.

**lupus** 1. a disease which involves the skin and/or connective tissues/organs వృకము, వృకవికారరోగము, చర్మము మరియు/లేదా బంధనకణజాలము/అవయవములు గురియైన రుగ్మత. **discoid lupus erythematosus (DLE),** cutaneous red macules, scaling with scarring of lesions forming a butterfly pattern over the bridge of the nose and cheeks చక్రాభము ఆకారములో ఎర్రమచ్చలు, పొలుసులుకట్టి పొరలుగా రాలిపోయిన తర్వాత పడిన తంతుయుత మచ్చలు

– ఇవి నాసిక ఇరుప్రక్కల సీతాకోకచిలుక ఆకారంలో ఉంటాయి. **systemic lupus erythematosus (SLE)** marked by skin eruptions, fever, arthritis, leukopenia, lymphadenopathy, multivisceral lesions (lung, liver, heart) చర్మముమీది పొక్కులు, జ్వరము, కీళ్ళనొప్పులు, రక్తములో తెల్లకణములు తగ్గుట, లింఫ్‌గ్రంథుల వాపు, బహుళ అవయవ క్షతములు (ఊపిరితిత్తి, కాలేయము, గుండె). 2. **l. pernio,** a form of sarcoidosis సార్కాయిడోసిస్ అనే వ్యాధిలో ఒక రకం. 3. **l. vulgaris,** tuberculosis of the skin, often affecting the face, characterized by the formation of apple jelly nodules leading to ulceration and scarring తరచుగా ముఖముమీద కనబడు చర్మక్షయరోగము. ఆపిల్ పండ్ల గుజ్జువలె కంతులు, అవి వ్రణములై ముడుచుకొని మచ్చలు పడుట.

**luteum** yellow పసుపుపచ్చ. **corpus l.,** a yellow mass in the ovary at the site of rupture of a Graafian follicle అండాశయములో ఒక గ్రాఫియన్ పుటిక పగిలే ప్రదేశంలో పసుపుపచ్చ ముద్ద.

**luxation** dislocation స్థానభ్రంశము. **l. of shoulder,** head of the humerus slipping out of the glenoid cavity in the scapula బుజము ఎముకయొక్క గ్లినాయిడ్ లోతునుండి భుజము ఎముక ఉపరిబంతివంటి భాగము తొలగుట, వాడు.భా. బుజము కీలు జారింది.

**lying-in** 1. confinement, labour పురుడు. 2. relating to baby birth శిశువు జన్మకు సం. 3. a hospital catering to 1. and 2.

**lymph** an opalescent fluid carried through lymphatic channels in all tissues after its formation శోషరసము: ఉపలకాంతిగల (కొంచెము చిక్కగానున్న) ద్రవము అన్ని కణజాలములలోని లింఫ్‌నాళములద్వారా ప్రవహిస్తుంటుంది. The lymph nodes, say in neck, axilla, chest, abdomen, pelvis, groin act as filters to remove bacteria and other particles. The filtered lymph enters the blood. మెడ, చంక, ఛాతి, ఉదరము, శ్రోణి, గజ్జలో నున్న లింఫ్ గ్రంథులు బాక్టీరియాను, తదితరరేణువులను వడగట్టి, శుభ్రమైన ద్రవమును రక్తములోనికి చేర్చును. Spleen, tonsils and thymus are other organs in the lymphatic system. శోషరస వ్యవస్థలో ప్లీహము, టాన్సిల్సు, థైమస్‌కూడా ఉన్నాయి. Lymphocytes are produced in the lymph nodes

and lymphatic organs లింఫొసైట్లు లింఫ్‌గ్రంథుల్లోను, శోషరసవ్యవస్థ అవయవములలోను తయారవుతాయి.

**lymphadenectomy** excision of lymph nodes లింఫ్ గ్రంథుల విచ్ఛేదన(ము).

**lymphadenitis** inflammation of lymph nodes శోషరసగ్రంథి శోథము, లింఫ్‌గ్రంథుల 'నొప్పి వేడి మంట వాపు'. **acute l.**, usually in infections సూక్ష్మజీవి సంపర్కములో వాపు. **chronic l.**, tuberculosis, leukaemia, *etc.* క్షయవ్యాధి, లుకీమియా, వగైరా.

**lymphadenoma** an enlarged lymph node సైజు పెరిగిన లింఫ్‌గ్రంథి.

**lymphadenopathy** enlargement of lymph nodes, as in tuberculosis, Hodgkin's disease, lymphoma, *etc.* క్షయవ్యాధి, హాడ్జ్‌కిన్ జబ్బు, లింఫోమా, మొ. వ్యాధుల్లో లింఫ్‌గ్రంథుల సుస్తి, గ్రంథులు పెద్దవగుట.

**lymphangiectasia** lymphangiectasis, dilatation of the lymphatic vessels శోషరస నాళములు, నాళికలు విస్తరించుట.

**lymphangiography** radiologic visualisation of lymphatic channels after introduction of a dye/contrast material కిరణాభేద్యమైన పదార్థము శోషరసనాళములోనికి ఎక్కించి, దాని సరఫరా ఎక్స్‌రే ద్వారా పరిశీలించుట.

**lymphangitis** 1. inflammation of lymphatic channels శోషరస నాళముల శోథము/'కందు నొప్పి వేడి మంట వాపు'. The commonest cause in our region is filariasis, *see/చూడండి* elephantiasis. మనప్రాంతములో బహుతరచుగా చూచేది ఫైలేరియా జబ్బులో. The inflammed lymphatic vessel appears like a red streak underneath the skin. వాచిన శోషరసనాళిక చర్మము అడుగున ఎర్రదారమువలె కందిపోయినట్లు కనిపిస్తుంది. 2. **l. carcinomatosa,** spread of cancer cells through lymphatic channels, causing distant metastases కాన్సరు కణములు శోషరసనాళములద్వారా దూరప్రాంతములకు వ్యాపించుట.

**lymphatic** 1. pertaining to lymph or a lymphatic channel శోషరసనాళ సం., లింఫ్ లేదా లింఫ్ నాళమునకు సం. 2. lymph vessel లింఫ్ నాళము.

**lymphatic tissue** *see/చూడండి* tissue. lymph nodes, spleen and thymus లింఫ్‌గ్రంథులు, ప్లీహము మరియు థైమస్.

**lymph nodes** *see/చూడండి* lymph. *colloq.* lymph glands.

**lymphoblast** an immature lymphocyte 15 to 20 $\mu$ in diameter; precursor of lymphocyte ఇంకా పక్వముగాని లింఫ్‌కణము, లింఫ్‌కణము యొక్క అగ్రగామి.

**lymphoblastoma** tumour, a type of malignant lymphoma ఒక రకపు అపాయకరమైన లింఫోమా. *figur.* a tumour that blasts *అలంకార.* బీభత్స క్షతము (lesion) ధ్వంసము చేయు కంతి. *resemblance:* terrorist activity of the malignant cells *పోలిక:* ఉగ్రవాదుల ఉగ్రము ఈ కణముల ఆగ్రహము.

**lymphocyte** nongranular leucocyte; *i.e.* one not having granules in the cytoplasm కణజీవద్రవ్యములో కణికలు లేని తెల్లరక్తకణము. a product of the lymphatic system; takes part in immunity శోష రసవ్యవస్థలో తయారైనది; వ్యాధినెదుర్కొను శక్తి సంపాదించుటలో పాల్గొంటుంది. **B l's,** B cells, bursa-dependent lymphocytes బి కణములు. **T l's,** T cells, thymus-dependent lymphocytes టి కణములు.

**lymphogranuloma** a term for granuloma or granuloma-like lesions సూక్ష్మకణిక గుల్మం లేదా అటువంటి క్షతములు. **l. inguinale LGI, l. venerum LGV.,** a sexually transmitted disease (STD) caused by genus *Chlamydia,* formerly classified as virus, but now included under bacterial origin లైంగిక వ్యభిచారమువలన సంభవించు రోగము. bilateral inguinal buboes, due to enlarged lymph nodes, more common in men గజ్జలలో బిళ్ళలు, బొప్పికట్టుట; పురుషులలో ఎక్కువగా చూస్తాము. haemorrhagic proctocolitis in women and homosexual men స్త్రీలలోను, పురుషుడు మరియొక పురుషునితో ఆసనముద్వారా సంభోగించినప్పుడు ఆసనము, మలాశయముయొక్క 'నొప్పి ఎరుపు వేడి మంట వాపు'.

**lymphoma** neoplastic disease of the lymphoid tissue often denoting malignancy శోషరసకణజాలముల పెరుగుదల, తరచుగా మారణ భయముగలది. **adult T cell l./adult T cell leukaemia,**

*see/*చూడండి leukemia. **malignant l.,** (a) Hodgkin's disease (b) non Hodgkin's lymphoma.

**lymphomyxoma** a benign growth consisting of adenoid tissue, *see/*చూడండి adenoids. ఎడినాయిడ్ కణజాలములుగల సాత్విక/నిర పాయ పెరుగుదల.

**lymphosarcoma** malignant neoplastic disease of lymphoid tissue శోషరసకణజాలముల మారణ శక్తిగల పెరుగుదల.

**lyophilization** a hi-tech cold process of preservation of biological material జీవపదార్థములను ఆధునిక శీతల ప్రక్రియలతో నిల్వచేయుట. lyophilized vaccines అట్లు నిల్వచేసిన టీకామందులు.

**lysin** 1. an antibody that destroys cells and tissues, *e.g.* bacteriolysin, haemolysin కణములను మరియు కణజాలములను నాశనంచేసే ప్రతిరక్షకం. 2. a substance which produces lysis విచ్ఛిన్నకారి, వినాశకారి.

**lysine** an essential amino acid ఆవశ్యకమైన ఎమైనో ఆమ్లము.

**lysis** 1. disintegration of a tissue/substance విచ్ఛిన్నము, నాశము చేయుటము: కణజాలము/పదార్థము విచ్ఛిన్నము అగుట. 2. gradual subsidence of fever, *e.g.* typhoid జ్వరము క్రమేణా తగ్గుట, *ఉదా.* టైఫాయిడ్ [*in contr.* crisis in lobar pneumonia *భిన్న.* న్యూమోనియాలో తటాలున తగ్గుట].

**lysosome** *micro.str.* a cytoplasmic membrane-bound particle capable of dissolving foreign particles and worn-out cells in the body. సూక్ష్మ.చూ. కణజీవద్రవ్యంలో నలుసు. ఇది శరీరంలో చేరిన నలుసులను, కృశించిన కణములను కరిగించివేయునది.

**lysozyme** an enzyme present in body fluids as in saliva, tears and in the white of the egg. It has an antibacterial action. ఉమ్మి, కన్నీరులాంటి జీవద్రవములలోనూ, కోడిగుడ్డు తెలుపులోనుగల ఎన్‌జైమ్. దీనికి సూక్ష్మజీవిని కరిగించే శక్తి ఉన్నది.

**lyssa** rabies, hydrophobia పిచ్చికుక్క కాటువలన కలుగు రోగము, జలభయ రోగం.

**lyssa virus** the rabies virus పిచ్చికుక్క కాటువలన కలుగు రోగమును కలుగజేసే వైరస్.

# M m

**maceration** wetting and breaking into bits of a tissue/substance నానవేయుటము, నూరటము: కణజాలము/పదార్థము నానబెట్టుట, నలుసులు/ముక్కలుగా చేయుట.

**machine** heart-lung machine హృదయ శ్వాసకోశ యంత్రం. a combination of a blood pump and blood oxygenator used in open-heart surgery, *see/చూడండి* oxygenation. యంత్రము, రక్తపంపు మరియు రక్తమునకు ఆక్సిజన్ ఇచ్చు యంత్రము. ఇది గుండె మీద/లో ఆపరేషన్లలో వాడుతారు. The heart is thus made motionless to enable surgery and circulation diverted to the machine to keep tissues alive. శస్త్రము చేయడానికి వీలుకొరకు గుండెను అచలముగా నొనర్చి, కణజాలముల జీవన ప్రక్రియ నిలుపుటకై రక్తప్రసరణ యంత్రముగుండా జరిపిస్తారు. Latest trend is to operate on the beating heart, thereby avoiding the above machine. ఆధునిక విధానములో చలనముతోనున్న గుండెమీద పైయంత్రముయొక్క సాయము లేకుండా శస్త్రము చేస్తున్నారు.

**macrobiotic** 1. long lived దీర్ఘాయువు. 2. tending to prolong life జీవితాన్ని పొడిగించడం.

**macrobiotics** the study of the prolongation of life జీవితాన్ని పొడిగించే శాస్త్రం.

**macroblast** a large erythroblast పెద్దసైజు ఎరిథ్రోబ్లాస్ట్.

**macrocephaly** abnormally large head ఘనశిరస్సు: అసాధారణంగా పెద్దదిగా ఉన్న తల [*in contr.* microcephaly భిన్న. లఘు శిరస్సు].

**macrocyte** large sized red blood cell found in pernicious anaemia ఘనకణం: పెద్ద పరిమాణములో నున్న ఎర్ర రక్తకణము; ఒక రకమైన రక్తహీనత జబ్బులో కనబడుతుంది.

**macrogamete** female gamete స్త్రీ సంయోగ బీజము [*Cf.* microgamete తారత. పురుష సంయోగ బీజము].

**macrogametocyte** female gametocyte స్త్రీ సంయోగ బీజమాతృక.

**macroglossia** unusually big tongue ఘన రసజ్ఞ/జిహ్వా: మామూలు కన్నా పెద్ద పరిమాణములోనున్న నాలుక.

**macromastia** macromazia. abnormally large breasts ఘనస్తనవతి; ఘనకుచవతి. అసాధారణంగా పెద్దవిగానున్న కుచములు, అలంకార. వీళ్ళకు స్తనభారం తప్పదు, మరి. చెట్టుకు కాయ బరువా!

**macrophage** large phagocytic reticuloendothelial cell having the property of devouring bacteria/particles మహాభక్షి: బాక్టీరియాను/రేణువులను కబళించే సామర్థ్యముగల జాలకాంతరస్తర అధికపరిమాణముగల కణము. **alveolar m.,** one that ingests particles in the alveoli of lungs, thus safeguarding the lungs ఊపిరితిత్తి వాయుకోశాలలోని రేణువులను భక్షించేది, తద్వారా ఊపిరితిత్తులను రక్షించేది. *figur.* policeman of the lung *అలంకార.* పుపుస పోలీసు; ఊపిరితిత్తి రక్షణభటుడు.

**macula** or **macule** 1. *anat.* spot మచ్చ. **m. retinae, m. lutea,** yellow spot: sensitive spot in the retina మచ్చ: కన్నుగుడ్డులో (రెటీనాలో) సున్నితమైన మరక. macular burn: occurs if the light of solar intensity strikes it, especially while observing solar eclipse; results in defective vision if seen for too long. (*i.e.* why, the advice is to see through smoked glass for a few seconds only) ఈ మరక మాడిపోవుట: సూర్యతేజస్సు తాకినయెడల ఇది సంభవిస్తుంది, ముఖ్యముగా సూర్యగ్రహణము ఉత్సాహంతో దీర్ఘకాలము పరికించినయెడల పర్యవసానము చూపులో లోపము కలుగుట (అందువలననే అప్పుడు నల్లటి అద్దాల మాటున కొద్దిక్షణములు మాత్రమే చూడండి అని, నిగ్రహము పెట్టుకోమని సలహా ఇస్తుంటారు). 2. a discoloured spot on the skin చర్మముమీద రంగుమారిన మచ్చ. 3. a corneal scar గ్రా. కంట్లోపువ్వు, శుక్లపటలముమీద మచ్చ.

**maculopapular** macule and papule రంగుమారిన మచ్చ మరియు పొక్కు. **m. rash/eruption,** in measles తట్టు, దద్దుర్లు, చిన్నపిల్లలలో వచ్చు పొంగులో పై చెప్పిన మచ్చలు పొక్కులుగా మారుతాయి.

**madura foot** or **Madura foot** *syn.* maduromycetoma, maduromycosis, mycetoma. fungus disease of the foot found

in India, characterised by swelling and development of multiple sinuses మదురా/మజురా పాదం: భారతదేశ ప్రసిద్ధి – పాదంవాచి, బహు కోటరములతో వికారము గొలుపుతుంది; శిలీంధ్ర సంపర్క వ్యాధి.

**Madurella** [Madura, India]. a genus of fungi, may cause maduromycosis [మదుర, ఇండియా]. శిలీంధ్రాల ప్రజాతి. మదురా పాదకారకం అవొచ్చు. *figur.* India doesn't lag (fall behind) in the incidence of diseases. *అలంకార.* జబ్బుల్లో ఇండియా తీసిపోదు.

**maggots** the soft bodied larvae (usually white in colour) of flies especially those infesting putrid tissues in wounds. They are seen crawling out. ఈగ డింభక దశ: క్రుళ్ళిన, మురిగిపోయిన కణజాలము గల గాయములలో ప్రాకు, మెత్తటి శరీరముగల తెల్లటి కీటక డింభకములు.

**magnum** large పెద్ద. **foramen m.**, large/great hole in the occipital bone మహారంధ్రము: అనుకపాల ఎముకలోని రంధ్రము. *figur.* Her Majesty The Spinal Cord passes through this. *అలంకార.* జీవనాడి అయిన వెన్నుపాము ఇందులోనుంచి వ్రేలాడుతుంది గాబట్టి దీనికి 'మహా' అని బిరుదు. బహుపరాక్!

**maidenhead** the hymen, sign of virginity in the female యోని మీది పొర, అక్షతయోని లక్షణము.

**major** big పెద్ద(ది). **pectoralis m.** ఈ పేరుగల పెద్ద/ఘన పేశి [*Cf.* minor *తారత.* లఘు].

**mal** illness, disease జాడ్యము, వ్యాధి **grand m., petit m.,** *see/చూడండి* epilepsy.

**malabsorption** impaired absorption of nutrients from the intestines *e.g.* **m. syndrome** అపశోషణం: ప్రేవులలోనుండి పోషకపదార్థములను ఒడలులోనికి గుంజుకొనుటలో క్షీణత, ఉదా. పేగు మాంద్యము.

**malacia** softening of a part ఒక భాగం మెత్తబడుట e.g. keratomalacia ఉదా. శుక్లపటలం మెత్తబడుట. osteomalacia ఎముకమజ్జ మృదువగుట.

**malady** an illness or disease సుస్తి లేదా వ్యాధి.

**malaise** indisposition, feeling of discomfort, uneasiness అస్వస్థత, అసౌఖ్యము, హాయిగాలేకుండుట.

**malalignment** nonalignment, faulty alignment సమరేఖ/సమతల స్థితి కోల్పోవుట/లేకుండుట. i) of the teeth దంత/పండ్లవరుసలో. ii) of the fractured ends of bone విరిగిన ఎముకల అంచుల్లో.

**malar** pertaining to the cheek or bone of the cheek బుగ్గకుగాని బుగ్గ ఎముకకుగాని సం. **m. flush** బుగ్గలు కందుట. i) in disease వ్యాధిలో. ii) in shyness సిగ్గులో.

**malaria** an infectious disease caused by a protozoan, genus *Plasmodium;* transmitted through the bite of mosquito (vector), female *Anopheles* మలేరియా, ప్లాస్మోడియమ్ అను ప్రోటోజోవా – ఏకకణజీవి వలన కలుగు వ్యాధి; అనాఫిలీస్ ప్రజాతి ఆడదోమ (వాహకజీవి) కాటువలన సంభవించును. characterized by attacks of chills, fever and sweating occurring in intervals of time, the cycle varies with the type of parasite వణుకు, జ్వరము మరియు చమటలు తెరలుగా వస్తాయి; ఈ తెరలమధ్య కాలము ఆ పరాన్నజీవి తెగనుబట్టి మారుతూ ఉంటుంది. **falciparum m.,** severe type affecting vital organs, especially cerebral malaria, often fatal ఆయువుపట్టైన/ప్రాణాధార మైన అవయవములకు, ముఖ్యముగా మెదడుకు సోకు మలేరియా, ఒక తీక్షణమైన సంకటము; మృతికి దారితీయవచ్చు. **quartan m.,** paroxysm of fever occurring once in 72 hours, *i.e.* every fourth day జ్వరము తెర 72 గంటలకొకసారి అనగా ప్రతినాల్గవరోజు. **tertian m., vivax m.,** febrile paroxysms occur once in 48 hours, *i.e.* every third day (alternate day) దినము తప్పి దినము వచ్చు జ్వరము తెర.

**malariologist** an expert in the knowledge of malaria మలేరియా విజ్ఞాని.

**malassimilation** poor or faulty assimilation అపస్వాంగీకరణం: స్వాంగీకరణములో లోపము/దోషము.

**malformation** anatomical aberration acquired during development, *e.g.* **arterio-venous m.,** in the lung వైకల్యము, వికారము: శరీర నిర్మాణ శాస్త్రరీత్యా ఎదుగుదలలో అస్వాభావిక వైపరీత్యము, ఉదా. ఊపిరితిత్తిలో 'ధమనుల సిరల కలయిక'.

**malignant** [malignancy *n.*] threatening/endangering life, said of tumours జీవితానికి ప్రమాదకరమైన/మారణశక్తిగల బీభత్సము కలుగజేయు (సాధారణముగా ఈ మాట కంతికి వాడుతారు) [*in contr.* benign భిన్న. నిరపాయ]. **m. hypertension,** usually above 200/140 mm Hg. The tempo of the disease is rapid and fatal. The walls of blood vessels in the kidneys, eyes, *etc.* are damaged beyond rapair. అపాయకరమైన హైబ్లడ్ ప్రెషర్, రుగ్మత వడిగా ముదిరి, మారణ/అపాయకరమైనరూపం దాలుస్తుంది. ముఖ్యముగా మూత్రపిండముల, నేత్రముల (మరియు మిగతా అవయవముల) యొక్క రక్తనాళికల గోడలు శిథిలమై పోతాయి. **m. pustule,** anthrax దొమ్మరోగము. **m. tumour** అపాయకరమైన కంతి. *figur.* terrorist activity in the body అలంకార. శరీరంలో ఉగ్రవాదుల బీభత్సం.

**malingering** feigning a disease to attract attention and sympathy బూటకపు నటన, బూటకాలమారి ప్రవర్తన: ఆదరణ ఆకాంక్షిస్తూ, లేని జబ్బు ఉన్నట్లు నటించుట.

**malleolus** protuberance at the end of a bone. 1. **m. of tibia,** bulge of the bone (lower end of tibia) at the inner side of the ankle బొడిపె: టిబియా అంచున, చీలమండలోపల ఉన్న ఎముక బొడిపె. 2. **m. of fibula,** bulge of the bone (lower end of fibula) at the outer side of the ankle ఫిబ్యులా అంచున, చీలమండ వెలుపల ఉన్న ఎముక బొడిపి.

**malleus** one of the ossicles in the middle ear, *resemblance:* a hammer అస్థిక, మధ్యచెవిలో సుత్తినిపోలిన పిల్లఎముక.

**malnutrition** inadequacy of proper nutrition to the tissues in the body కుపోషణము, పోషకాహారలోపము: శరీర కణజాలములకు తగిన పోషకపదార్థములు లభింపనందువలన కలుగు లోపము.

**Malpighian body** or **malpighian body** or **Malpighian corpuscle** or **malpighian corpuscle** *naked eye str.* ప్రత్యక్షచూ. in the spleen. amyloid degeneration of Malpighian bodies, resemblance: boiled/cooked sago-grains ప్లీహంలో ఉడికిన సగ్గుబియ్యం గింజలవలె కనపడే ఎమైలాయిడ్ క్షీణత. *micro.str.*

సూక్ష్మ.చూ. part of a nephron in the cortex of the kidney కిడ్నీ నెఫ్రాన్‌లోని (సూక్ష్మ)భాగం.

**Malpighian layer** deepest layer of the epidermis బాహ్య/అధి చర్మము యొక్క లోపలి స్తరము.

**malposition** abnormal position of a structure/organ in the body, *e.g.* ectopia cardis, *see/చూడండి* ectopia. శరీరములోని నిర్మాణము/అవయవము స్వస్థానములో లేక స్థానభ్రంశమగుట/వేరేచోట ఉండుట.

**malpractice** 1. unethical medical practice నీతిలేని వైద్యవిధానములను ఆచరించుట. 2. willful or inadvertent acts by the attending doctor వైద్యునియొక్క ఉద్దేశపూర్వకమైన లేదా ఏమారిన చర్యలు. 3. improper medical care due to carelessness or ignorance on the part of the treating doctor అజాగ్రత్త లేదా అజ్ఞానము వలన వైద్యుడు రోగియందు యుక్త/తగిన శ్రద్ధ చూపలేకపోవుట. 4. faulty treatment తప్పు చికిత్స. *N.B.* Beware! Consumer Protection Act is in force. *గమనిక:* జాగ్రత్త! వినియోగదారుని రక్షణ చట్టము అమలులో ఉన్నది. [*Cf.* misadventure].

**malpresentation** any unusual presentation of the fetus in the birth canal జననకుల్యలో శిశువుయొక్క అస్వభావిక భంగిమ.

**malrotation** improper rotation కుభ్రమణము, క్రమబద్ధముకాని చక్రీకరణము/తిరుగుట. **m. of gut** in the foetus భ్రూణదశలో ఆంత్రవక్ర చక్రీకరణం అనగా ప్రేగులు సరిగా తిరగకపోవుట.

**malt** prepared from barley or wheat grains after soaking them and drying. బార్లీ లేదా గోధుమలను నానబెట్టి తరువాత ఎండబెట్టి తయారుచేసిన పదార్థము. *figur.* 'king of tastes' *అలంకార.* రుచులలో రేడు.

**Malta fever** brucellosis, *see/చూడండి* brucellosis.

**maltase** an enzyme that breaks down maltose into glucose. మాల్టోస్‌ను గ్లూకోస్‌గా మార్చే ఎంజైమ్.

**maltose** malt sugar, a variety of sugar మాల్ట్ చక్కెర, ఒక రకమైన చక్కెర.

**malunion** improper union of the fragments of a fractured bone ఎముక విరిగిన చోట విరిగిన ముక్కల అంచులు సరిగ్గా అతక్కపోవుట.

**mamilla** 1. the nipple of the breast చనుమొన, స్తనముయొక్క చూచుకము, కుచాగ్రము. 2. nipple like structure చూచుకమును పోలిన నిర్మాణము.

**mammae** [mamma *sing.*] the breasts స్తనములు, పాలిండ్లు, కుచములు, పాలు స్రవించే గ్రంథులు, స్తన్యమును స్రవించు స్తనములు.

**mammal** *zool.* vertebrate animal that has hair on the body and yields milk చర్మముమీద రోమములు గలిగి, పాలు ఇచ్చు, వెన్నుపూసగల జంతువు; క్షీరదము, సస్తన/సస్తనజాతి జంతువు, సస్తనప్రాణి. *N.B.* mammal contains 'mamma' (breast, mammary gland) both in its spelling and in its body.

**mammary** relating to the mammary or breast region స్తన ప్రాంతమునకు సం. **m. gland** స్తనగ్రంథి, క్షీరరసగ్రంథి.

**mammilla** the nipple చూచుకము, చనుమొన.

**mammography** radiography of the mammary glands స్తన ఎక్స్‌రే చిత్రణము, స్తనముల ప్రత్యేక ఎక్స్‌రే ఫోటో.

**mammoplasty** plastic repair of the mammary gland tissue, either decreasing or increasing its size కుచవర్చస్సు నెలకొల్పుటకు స్తనపరిమాణము సరిచేయు రూపకల్పన శస్త్రచికిత్స.

**mandible** the lower jaw bone అధోహనువు, చిబుకాస్థి: దిగువ దవడ/దవుడ ఎముక.

**mania** 1. a mental disorder characterized by violent excitement, flight of thoughts and ideas ఉన్మాదము, మనోవైకల్యము, బలాత్కారమైన ఉద్రేకముతో కూడిన ప్రకోపము; ఊహాప్రపంచంలో ఎగిరిపోతూ భావపరంపరలో మునిగిపోతూ ఉన్నస్థితి. 2. states with obsessive compulsive acts, ending in mania, *e.g.* kleptomania, *see/* చూడండి kleptomania. మూర్ఖపట్టుదల చర్య, ఉదా. దొంగిలించాలనే వెర్రి, చోరీచేసే చిలిపిచేష్ట.

**maniac** 1. a mad person పిచ్చివాడు, ఉన్మాదగ్రస్తుడు. 2. extremely enthusiastic about something, *e.g.* cricket maniac క్రికెట్ అమి

తోత్సాహి. sex maniac లైంగికోత్సాహి. 3. mania of a particular type, *e.g.* pyromaniac ఏదైనా తగులబెట్టవలెనను వెఱ్ఱిగల వ్యక్తి.

**manic depressive** mental disorder marked by alternating spells of excitement and depression, *e.g.* **m.d. psychosis** ఉన్మాద, అవసాద మనోవిక్షిప్తి: ఉద్రేకము మరియు క్రుంగిపోవుట – ఈ రెండు దశలు/తెరలు ఒకదాని తర్వాత మరియొకటి సంభవించుట, ఉదా. ఈ రెండింటితోకూడిన మనోతత్త్వవికారము.

**manicure** the care and cosmetic treatment of the hands, especially finger nails చేతుల మరియు వేళ్ళయొక్క రూపము/అందము తీర్చిదిద్దే పద్ధతి. [*Cf.* pedicure].

**manoeuvre** or **maneuver** a skillful physiologic exercise యుక్తి: యుక్తితోకూడిన ఒక శారీరక ప్రక్రియ. **Valsalva m.** 1. forced expiratory effort against/with a closed glottis, *e.g.* ఉదా. (a) during defecation మలవిసర్జన సమయమున (b) in parturition ప్రసవము/కాన్పులో (c) while lifting heavy weights బరువులు ఎత్తేటప్పుడు కంఠబిలము మూసి ముక్కుట. 2. forcible exhalation effort after bloating the mouth and cheeks with air while closing the mouth and nostrils పుక్కిట గాలితో పొంగించి మరియు బుగ్గలు వెలుపలికి ఉబ్బించి, నోరునాసికలు మూసిపట్టి బలవంతమైన నిశ్వాసకృషి జరుపుట.

**Mantoux test** tuberculin intradermal injection, done in the diagnosis and epidemiology of tuberculosis క్షయవ్యాధి నిర్ధారణలో, వ్యాధి అంశములు తెలుసుకొనుటలో జరుపు చర్మసూది పరీక్ష – ట్యుబర్క్యులిన్ టెస్ట్.

**manubrium** handle-like చేతిపిడివలెనున్న. **m. sterni,** upper part of the breast bone. Two collar bones (clavicles) are attached to this. ఎదురు రొమ్ము ఎముక ఊర్ధ్వభాగపు పట్టుగొమ్మ అస్థి; దీని పైఅంచున రెండు కాలర్ ఎముకలు (జత్రుకలు) కదులుతూ ఉంటాయి.

**manus** [manus *pl.*] hand హస్తం, చేయి [*Cf. pes,* foot *తారత.* పాదం].

**marasmus** a type of protein energy malnutrition (PEM) due to pure calorie starvation/deficit occurring in the first year of life,

marked by extreme emaciation శుష్కించటము, ఎండిపోవటము: ప్రోటీన్, కేలరీల (శక్తి) లోపమువలన శుష్కించిన అభ్భాకారి; శైశవములో మొదటి ఏడాది వయస్సులో వాళ్ళు తరచుగా ఈ పోషణలోపమునకు గురి అవుతారు.

**marrow** the spongy cellular structure inside a bone, manufacturing blood cells; there are two types, red and yellow ఎముకల మూలుగ, అస్థిమజ్జ, మేదస్సు: ఎముకలలోపల స్పంజికవలెనున్న బోలు నిర్మాణము – ఇందులో రక్తకణములు తయారు చేయబడతాయి. ఇది అస్థిసారము, ఎముకసాన; ఎరుపు పసుపు రంగుల్లో ఉంటుంది. **m. transfusion,** treatment in malignant conditions of marrow మజ్జయొక్క అపాయ కరమైన వ్యాధుల్లో ఆరోగ్యవంతునిలోనుంచి మజ్జతీసి రోగిలోనికి ఎక్కిస్తారు.

**masculinization** become masculine in appearance, especially induced in women by the use of steroids స్త్రీ మగరాయుడుగా మారుట, ముఖ్యంగా స్టీరాయిడ్ మందుల వాడుక పర్యవసానం ·[*in contr.* feminization భిన్న. ఆడంగిగా మారుట].

**mask** a covering over the face ముఖంమీద కప్పే సాధన. 1. **oxygen m.,** a device to supply oxygen to the patient; applied over the mouth and nostrils ముసుగు: రోగికి ప్రాణవాయువును సరఫరాచేయు సాధన; నోరు, ముక్కుమీద ఉంచుతారు. 2. mask that combats traffic pollution వాహనాల విషవాయువులను అరికట్టే ముక్కు, నోటిమీద ముసుగు తొడుగు.

**masochism** deriving (especially sexual) pleasure by inflicting pain on oneself or humiliating oneself లైంగికవ్యథా ప్రకోపితానందం: ముఖ్యంగా లైంగికసుఖంకోసం తనకుతాను నొప్పి కలిగించుకొనుట లేదా కించపరచుకొనుట [*Cf.* sadism తారత. పరపీడన కాముకత, ఇతరులకు ఇవి కలుగజేయుట].

**massage** 1. an act or a measure to counterstimulate a painful part మర్దన, ఒళ్ళుపట్టడం, మాలిష్ చేయడం, అంగమర్దన. 2. **external cardiac m.,** applying series of thumps over the precordium in states of cardiac asystole/standstill ఛాతీని గుండెప్రాంతముమీద చేతులతో మొత్తుట – ఇది 'గుండె బందు' స్థితిలో ఆచరిస్తారు.

**masseter** muscle of mastication చర్వణి: నములుటలో పాల్గొను కండరము.

**mastalgia** pain in the breast స్తనంలో నొప్పి, కుచవేదన.

**mast cell** a connective tissue cell with large basophilic granules that contain heparin, serotonin, histamine బేసోఫిలిక్ కణికలుగల బంధనకణజాల కణం. Degranulation with release of histamine, a mediator occurs in bronchial asthma. ఉబ్బసం వ్యాధిలో ఈ కణం పగిలి, అందులోనుంచి వచ్చిన హిస్టమిన్ రుగ్మతను కలుగజేస్తుంది.

**mastectomy** excision of the breast స్తనచ్ఛేదన: శస్త్రచికిత్సద్వారా స్తనమును తొలగించుట.

**mastication** the act of chewing food, చర్వణము: పదార్థములను నములుట. *figur.* mouth exercise అలంకార. ఆస్యవ్యాయామం.

**mastitis** inflammation of the breast చన్నుయొక్క శోథము/'నొప్పి వేడిమి ఎరుపు వాపు'.

**mastodynia** pain in the breast స్తనవేదన.

**mastoid** bone behind the ear కర్ణము వెనుక ఎముక.

**mastoidectomy** surgical lysis of the spaces in the mastoid మాస్టాయిడ్‌లోని చిన్నకుహరములను శస్త్ర విచ్ఛిన్నము గావించుట.

**mastoiditis** inflammation of the mastoid process మాస్టాయిడ్ కీలితముయొక్క ఇన్‌ఫ్లమేషన్ (అనగా శోథము/'నొప్పి వేడి మంట వాపు').

**masturbation** A. manipulation for sexual gratification స్వయంకృత రతిప్రేరేపణ: రతిమాపక చర్య. self stimulation of one's own genitals for gratification of sexual pleasure లైంగిక సుఖం/సంతృప్తికొరకు గుహ్య అవయవముల స్వయంప్రేరేపణ. **in the male** పురుషునిలో: (i) playing with the prepuce, forcible stretching of the foreskin to and fro ముష్టి మైథునము: పురుషాంగముమీది చర్మమును ఆడించే చేష్ట – దీనిని ముందుకు వెనుకకు సాగదీయడం – దీనిని హస్తప్రయోగం అంటారు. (ii) piercing his penis into a hollow పురుషాంగమును ఏదైనా లోతులో గుచ్చడం. **in the female** స్త్రీలో: playing with the clitoris and labia; and with breasts and nipples క్లైటోరిస్ మీద

రాపిడి పెట్టటం, క్రింది నిలువు పెదవులకు రాపిడి పెట్టడం; అట్లాగే చన్నులు, చూచుకములతో ఆట. B. meaningful masturbation (i) for semen analysis శుక్రము తనిఖీ కొరకు (ii) donation of semen to a semen bank శుక్రనిధికి శుక్రము దానము చేయుట.

**matching** examining whether it suits జత కలిసిందా అని చూచుట. **cross m.**, determination of the compatibility of blood before transfusion సరిపోల్చు: రోగిలోనికి రక్తము ఎక్కించే ముందు జత కలిసిందా, అనుగుణముగా ఉన్నదా అను తనిఖీ.

**materia medica** pharmacology; science concerning the origin, mode of action and dosage of drugs ఔషధీగుణ ధర్మ విజ్ఞానము, ఔషధనిఘంటువు, ఔషధ శాస్త్రం: ఔషధ తయారీ, అది పనిచేయు విధానము, దాని మోతాదు గురించిన పరిజ్ఞానము.

**maternal** pertaining to mother మాతృ. **m. inheritance,** మాతృ వంశానుగతి. **m. mortality** బాలింతలలో మరణసూచి. **m. morbidity** బాలింత జబ్బులు. MMR maternal mortality rate బాలింత మృతిప్రమాణము.

**maternity** 1. motherhood మాతృత్వము. 2. relating to pregnancy ప్రసూతికి సం. *figur.* Birth gives mirth to the mother. అలంకార. శిశువు జననం తల్లికి సంబరం. **m. hospital** ప్రసూతి వైద్యశాల.

**matrix** the intercellular substance మాత్రిక: కణాలమధ్య ఉండే పదార్థం. 1. the ground substance మూలపదార్థము, ఆధారమూలము. 2. the intercellular base from which a structure develops ఒక నిర్మాణమునకు మూలము/పునాది అయిన అంతరకణ ప్రాపు. 3. dental accessary (accessory) పన్ను/జబ్బుకు సహకారి వైద్యము. **bone m.**, the intercellular substance of bone ఎముక మాత్రిక. **cartilage m.**, the intercellular substance of cartilage మృదులాస్థి మాత్రిక.

**matron** 1. nursing superintendent నర్సులకు సూపరింటెండెంటు. 2. senior nursing officer నర్సింగ్ అధికారి.

**matter** 1. physical substance ద్రవ్యము, పదార్థము. **organic m.,** *e.g.* pus జీవసంబంధ పదార్థము, ఉదా. చీము. 2. **grey m.,** nerve cells in the brain cortex మెదడు కార్టెక్స్‌లో నాడీకణములు. 3. **white m,** nerve fibres నాడీ తంతువులు.

**maturation** 1. attaining menarche వాడు.భా. పిల్ల రజస్వల/పెద్దమనిషి అవటం (అలంకార. చిమ్మిరి పంచడం). 2. *biol.* cell division కణవిభాగము.

**maxilla** [maxillary *adj.*] bone of the upper jaw జంభిక, పై దవడ ఎముక.

**maximum** highest, greatsest గరిష్ఠ(ము) [*opp.* minimum. వ్యతి. కనిష్ఠ(ము)].

**mazzamorra** dermatitis caused by the penetration of the skin by ancylostome larvae, *see/చూడండి* creeping e. in eruption.

**Mc Burney's point** a region in the rightl iliac fossa about $1\frac{1}{2}$ to 2 inches above the anterior superior iliac spine, where pressure with an examiner's (doctor's) finger elicits tenderness, in cases of acute appendicitis ఎపెండిక్స్ యొక్క తీవ్రమైన ఇన్‌ఫ్లమేషన్‌లో కుడి ఇలియక్ గుంట ప్రదేశంలో అక్కడి ఎముకకు $1\frac{1}{2}$ నుండి 2 అంగుళాలకు పైన డాక్టరు వేలుపెట్టి నొక్కితే, రోగి సలుపుతో ముఖం చిట్లిస్తాడు.

**measles** an infectious/contagious viral disease of the respiratory tract marked by fever, pink or red papules which later get confluent పొంగు, తడపర, తట్టు: వైరస్ ఆఘ్రాణము లేదా రోగి స్పర్శ వలన కలుగు జ్వరము; రోజా/ఎరుపు రంగు కందిన పొక్కులు, రొంప, దగ్గు, ముక్కుకారుడు; ఈ పొక్కులు క్రమేణ దట్టమై ఒళ్ళంతా ఎరుపెక్కుతుంది. The virus is infectious through cough droplets and fomites (secretion-wetted handkerchiefs, *etc.*). దగ్గు తుంపురులద్వారా మరియు ముక్కునీరు తుడుచుకునే చేతిగుడ్డలద్వారా ఈ వైరస్ ఒకరినుండి మరియొకరికి వ్యాపిస్తుంది. Children are the usual targets. పిల్లలు ముఖ్యముగా గురి అవుతారు. A dreaded complication is encephalitis. మెదడునకు వ్యాధి సోకితే ప్రమాద పరిణామము.

**meatus** opening రంధ్రము. *e.g.* **urethral m.** *ఉదా.* మూత్రమార్గముయొక్క వెలుపలి రంధ్రము.

**meconium** first **faeces** of the just born, dark green in colour తొలి పురీషము: అప్పుడే పుట్టిన శిశువు విరేచనము, ఇది ముదురు ఆకుపచ్చ రంగులో నుండును.

**medial** near the mid-line (umbilicus) of body/structure మధ్య, శరీరము/నిర్మాణమునకు మధ్యరేఖకు దగ్గరగా; బొడ్డు/నాభికి దగ్గరగా [*in contr.* lateral భిన్న. పార్శ్వ].

**median line** middle plane: an imaginary vertical line bisecting the body, *i.e.* at the level of the umbilicus మధ్యతలము: నాభిద్వారా పోయే ఊహా నిలువు రేఖ.

**mediastinum** 1. space in the thorax between the two lungs పుపుస మధ్యస్థలము/ప్రదేశము. 2. **m. testis,** partial septum in the posterior aspect of the testis వృషణము వెనుకప్రాంతంలో పాక్షిక విభాజకం.

**medical** belonging to or concerned with doctors and medicine డాక్టర్లు మరియు వైద్యానికి సం. **m. certificate** మెడికల్ సర్టిఫికెట్ (ధ్రువపత్రము). (i) stating that the person is unfit అస్వస్థతగా ఉన్నట్లు. (ii) declaring him fit స్వస్థతగా ఉన్నట్లు. **m. counselling,** advice, say before a marriage, on how to choose life's partner పెండ్లికి ముందు జీవిత భాగస్వామిగా ఎవరిని ఎన్నుకోవాలి *e.g.* about consanguineous marriage ఉదా. మేనరికం వివాహం లాంటివి. **m. ethics** వైద్యనీతిశాస్త్రం. **m. jurisprudence,** forensic medicine న్యాయసంబంధ వైద్యశాస్త్రం.

**medicament** 1. medication ఔషధప్రయోగం. 2. a medicinal agent ఔషధవస్తువు.

**medicate** to give medication మందులు ఇవ్వడం. medication = medicine.

**medicine** 1. a drug or an agent that heals/cures ఔషధము: నయముచేసే వస్తువు. 2. the art and science of healing వ్యాధి నయముచేయు ప్రక్రియ – కళ మరియు శాస్త్రము. *figur.* 'I treat, He cures.' అలంకార. మందులు ఇచ్చేది నేను, బాగుచేసేది భగవంతుడు. **emergency m.,** intensive care unit (ICU) in a hospital అత్యవసర శ్రద్ధచూపే విభాగము (ఆసుపత్రిలో). **forensic m.,** medical

# The Skeletal System అస్థిపంజర వ్యవస్థ




1. Cranium కపాలము
2. Mandible హనువు
3. Clavicle జత్రుక
4. Sternum ఉరోస్థి
5. Vertebral Column వెన్నెముక
6. Ulna అరత్ని
7. Radius రత్ని
8. Pelvis శ్రోణి
9. Femur తుంటిఎముక
10. Patella జానుఫలకము
11. Tibia అంతర్జంఘిక
12. Fibula బహిర్జంఘిక

Front View
ముందునుండి దృశ్యం

1. Cervical vertebrae
   గ్రీవా కశేరుకాలు (7)
2. Thoracic vertebrae
   ఉరః కశేరుకాలు (12)
3. Lumbar vertebrae
   కటి కశేరుకాలు (5)
4. Sacrum త్రికము




Back View
వెనుకనుండి దృశ్యం

# The Respiratory System శ్వాస వ్యవస్థ

1. Nasal cavity
   నాసికా కుహరం
2. Nostril
   నాసికా ద్వారము
3. Larynx స్వరపేటిక
4. Lung ఊపిరితిత్తి
5. Alveoli వాయుకోశాలు
6. Bronchi
   శ్వాసనాళములు
7. Diaphragm
   విభాజక పటలము
8. Trachea
   వాయు నాళము




The Respiratory System
శ్వాస వ్యవస్థ




Larynx లేరింక్స్
స్వరపేటిక

1. Hyoid bone కాంఠిక ఎముక
2. Thyroid cartilage థైరాయిడ్ మృదులాస్థి
3. Thyroid gland అవటు గ్రంధి
4. Trachea వాయు నాళము

# The Circulatory System రక్తప్రసరణ వ్యవస్థ




1. Pulmonary artery
   పుపుస ధమని
2. Aorta మహా ధమని
3. Superior vena cava
   ఊర్ధ్వ మహా సిర
4. Left atrium
   ఎడమ ఏట్రియమ్
5. Right atrium
   కుడి ఏట్రియమ్
6. Left ventricle
   ఎడమ జఠరిక
7. Right ventricle
   కుడి జఠరిక
8. Inferior vena cava
   అధో మహా సిర

The Heart ↑
గుండె




1. Superior vena cava
   ఊర్ధ్వ మహాసిర
2. Inferior vena cava
   అధో మహాసిర
3. Aorta
   మహా ధమని
4. Heart
   గుండె
5. Superficial veins
   వెలుపలి సిరలు
6. Tibial artery
   అంతర్జంఘిక ధమని

The Circulatory System
రక్తప్రసరణ వ్యవస్థ

# The Digestive System జీర్ణ వ్యవస్థ




1. Salivary glands లాలాజల గ్రంధులు
2. Oesophagus అన్నవాహిక
3. Liver కాలేయము
4. Stomach జీర్ణాశయము
5. Pancreas క్లోమము
6. Large intestine పెద్ద పేగు
7. Small intestine చిన్న పేగు
8. Rectum పురీషనాళము
9. Appendix అపెండిక్స్
10. Gall bladder పిత్తాశయము

# The Nervous System నాడీ వ్యవస్థ




1. Thalamus థాలమస్ (పర్యంకము)
2. Cerebrum మస్తిష్కము
3. Olfactory lobe ఘ్రాణ లంబిక
4. Pituitary gland పీయూషగ్రంధి
5. Brain stem కీలక మెదడు
6. Cerebellum అనుమస్తిష్కము
7. Hypothalamus అధోపర్యంకము

The Brain మెదడు




1. Cervical spine మెడ వెన్నుపూసలు
2. Thoracic spine వక్షీయ వెన్నుపూసలు
3. Lumbar spine కటి వెన్నుపూసలు
4. Sacral curve త్రిక వంపు

The Spinal Column
కశేరు దండము (వెన్నెముక)

# The Sensory Organs జ్ఞానేంద్రియములు




1. Iris తారక
2. Cornea శుక్ల పటలం
3. Lens కటకము
4. Vitreous humor కాచవత్ తర్వకం
5. Retina నేత్రపటలం
6. Optic nerve దృష్టి నాడి
7. Sclera దృఢ స్తరము

The Eye కన్ను 




1. Semicircular canals అర్ధవర్తులాకార కుల్యాలు
2. Inner ear లోపలి చెవి
3. Cochlea కర్ణావర్తము
4. Nerves నాడులు
5. Eustachian tube శ్రోత: పథము
6. Tympanic membrane కర్ణభేరి త్వచము
7. Ear canal చెవి కుల్య
8. External ear వెలుపలి చెవి

The Ear చెవి 




The Skin చర్మం 




The Nose ముక్కు 

1. Olfactory membrane ఘ్రాణ పొర
2. Olfactory bulb ఘ్రాణ లశునము
3. Nostril నాసికా ద్వారం

1. Sweat pore స్వేద రంధ్రం
2. Capillaries రక్తకేశ నాళికలు
3. Nerve ending నాడి కొన
4. Oil gland తైల గ్రంధి
5. Sweat gland స్వేద గ్రంధి
6. Fat cells కొవ్వు కణములు
7. Blood vessel రక్త నాళము
8. Hair follicle రోమ పుటిక
9. Subcutaneous tissue అధశ్చర్మ కణజాలము
10. Dermis అంతశ్చర్మము
11. Epidermis బాహ్య చర్మము

# Glands గ్రంధులు




1. Pituitary పీయూషగ్రంధి
2. Parathyroids పేరా థైరాయిడ్ గ్రంధులు
3. Thymus థైమస్ (బాలగ్రంధి)
4. Adrenals అధివృక్క గ్రంధులు
5. Pancreas క్లోమము
6. Testis ముష్కము
7. Ovary స్త్రీ బీజకోశము
8. Thyroid అవటు గ్రంధి

# Urogenital System మూత్ర జననేంద్రియ వ్యవస్థ




1. Rectum పురీషనాళము
2. Anus గుదము
3. Vas deferens శుక్రవాహిక
4. Testis ముష్కము
5. Scrotum ముష్కగోణి
6. Penis పురుషాంగము
7. Prostate gland పౌరుషగ్రంథి
8. Symphysis pubis జఘనసంధానము
9. Urinary bladder మూత్రాశయము

Male Reproductive System
పురుష జననేంద్రియ వ్యవస్థ







Female Reproductive System
స్త్రీ జననేంద్రియ వ్యవస్థ

The Urinary System
మూత్ర విసర్జన వ్యవస్థ

1. Kidney మూత్రపిండము
2. Ureter మూత్రనాళము
3. Urinary bladder మూత్రాశయము

1. Sacrum త్రికము
2. Body of uterus గర్భాశయము
3. Rectum పురీషనాళము
4. Vagina యోని
5. Anus గుదము
6. Vaginal orifice యోనిరంధ్రం
7. Urethral orifice మూత్రమార్గం
8. Urinary bladder మూత్రాశయము
9. Ovary అండాశయము

jurisprudence, legal medicine న్యాయశాస్త్ర/చట్టశాస్త్రరీత్యా అన్వేషించు విభాగము. **preventive m.** వ్యాధినిరోధక మార్గములు తెలుపు విభాగము. **rehabilitation m.**, to bring him back to normal or near normal state యథాస్థితి/స్థానము నిల్పుటకు తోడ్పడు సాధనములు. **social m.** సామాజిక వైద్యశాస్త్రం. 3. Medicine, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**medico** medic. 1. medical student వైద్యవిద్యార్థి. 2. *colloq.* doctor డాక్టరు.

**medico-legal** legal aspects of medicine వైద్యన్యాయశాఖ అంశాలు.

**medulla** 1. marrow, *see/చూడండి* marrow. 2. innermost part in a structure, *e.g.* in kidney, lymph node దవ్వ: ఒక నిర్మాణములో అత్యంతరస్థ భాగము/లోపలి భాగం, ఉదా. కిడ్నీ, లింఫ్ గ్రంథిలో. **m. oblongata,** brain stem; vital part in a vital organ; junction between the pons and spinal cord మెదడులోని కీలకస్థానము, ఆయువుపట్టు, మజ్జాముఖము, సుషుమ్నశీర్షకము (ముచ్చెలగుంట ప్రాంతం).

**medulloblastoma** malignant tumour in the cerebellum in children పిల్లలలో సెరిబెల్లమ్‌లో వచ్చు అపాయకరమైన కంతి. *figur.* a tumour that blasts అలంకార. బీభత్స బాంబ్, బాంబ్‌లా పేలే కంతి.

**megacolon** Hirschsprung's disease, hypertrophy and dilatation of the colon విస్తరిత బృహదాంత్రము, స్థూలాంత్రము, స్థూలపేగు: పెద్దపేగు కుడ్యము లావెక్కి, విస్తరించుట. It is seen more in children; X-ray of the abdomen in the erect posture gives the clue. పిల్లలలో ఎక్కువగా చూస్తుంటాము; నిల్చోపెట్టి ఎక్స్‌రే ఫోటో తీస్తే ఒక జాడ/ఇషారా దొరుకుతుంది.

**megakaryocyte** giant cell of the bone marrow అస్థిమజ్జలోని బృహత్కణము.

**megaloblast** primitive red cell precursor ఎర్ర రక్తకణముయొక్క ఆదిమ అగ్రగామి. large immature nucleated abnormal erythrocyte, *e.g.* seen in megaloblastic anaemia స్థూల, పక్వముకాని, కేంద్రకము గల, కురూపమైన ఎర్రరక్తకణము, ఉదా. ఈ కణములుగల రక్తహీనతలో చూడనగును.

**megaloesophagus** large sized oesophagus పెద్ద పరిమాణమునకు పరిణామము చెందిన అన్నవాహిక. could occur in long-standing achalasia cardia అన్నవాహికనుండి అన్నాశయమునకుగల మార్గము దీర్ఘకాలంగా మూసుకుపోయిన స్థితిలో అన్నవాహిక సైజు పెరుగుట.

**megalomania** a delusion of grandeur; maniac thinking that he is a person of great importance, wealth, *etc.* గొప్పకు పోవటం; తను ఒక ముఖ్యమైన వ్యక్తి అని, ధనవంతుడని అపోహ, ఉన్మాద చేష్ట.

**meibomian cyst** also Meibomian cyst. chalazion. sebaceous cyst on the edge of the eyelid కనురెప్ప అంచున సీబమ్ తిత్తి.

**meibomian glands** or **tarsal glands** also Meibomian glands. sebaceous glands on the inner surface of the eyelids కనురెప్పల లోపలి తలములో ఉండే చర్మచమురు గ్రంథులు.

**Meigs' syndrome** fibromyoma of ovary with hydroperitoneum and hydrothorax ద్రవోదరము మరియు పుపుసావరణద్రవంతో కూడిన అండాశయం యొక్క తంతుపేశీయుత కంతి.

**Meissner's corpuscle** tactile corpuscle in the skin పీడనము, స్పర్శను గ్రహించటానికి చర్మంలోని విశిష్ట నిర్మాణము.

**melaena** or **melena** black tarry stools due to altered blood, a sign of internal haemorrhage in stomach or into the intestines నల్లని తారువలెనున్న విరేచనములు; ప్రేగులలోని రక్తము నల్లగా మారి బయటకు వచ్చుట. అన్నాశయములోగాని పేగులలోగాని రక్తస్రావమును సూచిస్తుంది.

**melancholia** a state of extreme depression, brooding. *etc.* విషాద స్థితి: పూర్తిగా దిగజారి, కృంగిపోయిన, దీర్ఘాలోచనాపరుడై దేన్నిగురించో ఆలోచిస్తూ/తలపోయుచూ ఉన్నస్థితి.

**melanin** black pigment in skin, hair *etc.* చర్మము, వెంట్రుకలు, మరికొన్ని కణజాలములలోని నల్లటి వర్ణకము.

**melanoblast** precursor of melanocyte మెలనోసైట్ యొక్క అగ్రగామి.

**melanocyte** pigment cell of the skin చర్మంలోని వర్ణకకణం.

**melanoma** tumour composed of melanin-pigmented cells మెలనిన్ వర్ణకంగల కణములుగల కంతి. **malignant m.,**

malignant tumour arising from a nevus నల్లటి మచ్చనుండి ఉద్భవించు అపాయకరమైన కంతి. Metastases are marked, especially in the liver, though the primary is small. మచ్చ చిన్నదిగా ఉన్నా, ముఖ్యముగా కాలేయములోనికి అపాయకరమైన మెలనోమా కణములు ప్రాకుట వైద్యశాస్త్ర విదితము.

**melanuria** passage of melanin in urine మూత్రంలో మెలనిన్ పోవుట/విసర్జింపబడుట.

**melasma** *see/చూడండి* chloasma. sharply demarcated, blotchy, brownish pigmentation, symmetrical on cheeks, more common in women రెండు బుగ్గలమీద, రెండువైపులా అద్దములో ప్రతిబింబమువలె, సరిహద్దుగల, నల్లటి మచ్చలు; ఇవి స్త్రీలలో తరచుగా కానవస్తాయి.

**membrane** a thin layer of tissue that lines a lumen/cyst/cavity/ space in an organ. It covers a surface. పొర, త్వచము: కుల్యను/తిత్తిని/శూన్యప్రదేశమును/అవయవములో సందును ఆవరించిన లేదా అంటిపెట్టుకుని ఉన్న సన్నటిపొర (కణజాలము). *naked eye str.* ప్రత్యక్ష.చూ. **interosseous m.,** membrane between two bones రెండు ఎముకల మధ్యపొర. **mucous m.,** the membrane lining the canals శ్లేష్మపొర, నాళములను అంటిపెట్టుకుని ఉన్నది. **placental m.** మావిని ఆవరించియున్న పొర. **synovial m.,** layer lining a joint కీలును ఆవరించియుండే లోనిపొర. **tympanic m.,** the ear drum కర్ణభేరి. *micro.str.* సూక్ష్మ.చూ. **alveolo capillary m.,** in the alveoli వాయుకోశాలలో సూక్ష్మపొర. **cell m.,** about 7.5 nm thick జీవకణము పొర. **Descemet's m.,** in the cornea కన్ను శుక్లపటలములోని పొర. **glomerular m.,** in kidney, *see/చూడండి* glomerulus. కిడ్నీలో గ్లొమెరులస్‌పై పొర. **vitreous m.,** hyaloid m. in the eye కన్నులోని కాచవత్ పొర.

**memory** the faculty of the brain to store and recall thoughts. Brain skill is the best. జ్ఞాపకము, స్మృతి, యోచనల ధారణ – అవధానప్రక్రియలో ధారణకు సవాలు, ఉదా. ఏకసంతాగ్రాహి చేసే అష్టావధానం, శతావధానం. మేధయొక్క చతురత అన్నిటికన్నా మిన్న.

**menacme** woman's life of menstrual activity స్త్రీయొక్క జీవితములో ఋతుక్రమకాలము. *figur.* men+acme, corresponds to the acme of man's pleasure అలంకార. పురుషునియొక్క ఉచ్ఛ్రాయ భోగం.

**menarche** onset of menstrual period రజస్వల అగుట, ఋతువు ప్రారంభము, బహిష్టు/ముట్టు ప్రారంభము, ఋతుచక్రము (menstrual cycle) ప్రారంభమగుట. *figur.* blossoming of a flower అలంకార. బొడ్డుమల్లె/పువ్వు విచ్చడం. వాడు.భా. పుష్పవతి యగుట. ఆనవాయితీ: చిమ్మిరి పంచడం.

**Mendelian** *biol.* belonging or relating to the principles of heredity as enunciated by Mendel మెండెల్ సిద్ధాంతం ప్రకారం వంశపారంపర్యమునకు సం.

**Mendel's law** theory of heredity వంశపారంపర్యతను నిరూపించే సిద్ధాంతం.

**Meniere's disease** a disease affecting the inner ear, with attacks of vertigo, presence of tinnitus, leading to deafness తలత్రిప్పుట, చెవిలో హోరు/గుయ్యిమనటం ఉండి, క్రమేణ చెవుడుకు దారితీసే అంతర్గత కర్ణవ్యాధి.

**meningeal** *adj.* relating to meninges మెనింజీస్‌కు సం.

**meninges** three layers (membranes) that cover and protect the brain and spinal cord మస్తిష్క వేష్టనము: మెదడు, వెన్నుపామును కప్పి కాపాడు మూడు పొరలు. dura/dura mater, the outermost and toughest; arachnoid, resembling a spider's web, the middle; pia/pia mater, the innermost which closely invests the brain and spinal cord పరాశిక అతిదృఢమైన బాహ్యపొర; లౌతికళ సాలీడుగూడును పోలిన మధ్యపొర; మృద్వి/పయామేటర్ మృదువుగా నుండి మెదడు మరియు వెన్నుపామును అంటిబెట్టుకుని ఉండే లోపలి పొర. Cerebrospinal fluid circulates in the subarachnoid space. లౌతికళకు మృద్వికి మధ్యనున్న సందు/స్థలములో మస్తిష్క మేరుద్రవము పారుతుంటుంది.

**meningioma** tumour of the meninges మెదడు పైపొర(ల)కు సంక్రమించు కంతి.

**meningism** meningismus; symptoms of meningitis but without infection సూక్ష్మజీవి సంపర్కములేకుండా మెదడుపొరల జబ్బు.

**meningitis** [meningitides *pl.*] inflammation of the meninges మెదడు పొరలవాపు. It is caused by bacteria, virus, *etc.*, characterised by severe/splitting headache, stiffness of the neck, high fever and vomiting. నాడీమండలపు పైపొరల శోథము: బాక్టీరియా, వైరస్ మొ. వానివలన సంభవిస్తుంది. తల పగిలిపోయేటట్లు నొప్పి, మెడకండరముల బిగువు, హెచ్చుజ్వరము, వాంతులు ఈ జబ్బు లక్షణములు. Diagnosis is by lumbar puncture of the cerebrospinal fluid. వ్యాధినిర్ధారణకు వెన్నుపూసలోనుండి సూదిగుచ్చి మస్తిష్కమేరుద్రవము తీసి తనిఖీచేయుట. **meningococcal m.**, due to bacteria, *Neisseria meningitidis* ఈ బాక్టీరియావలన. **tubercular/tuberculous m.**, due to *Mycobacterium tuberculosis* క్షయ మైకోబాక్టీరియా వలన. **viral m.** వైరస్ వలన.

**meningocele** hernial bulge of the meninges through a defect in the cranium or vertebral column కపాలములోగాని వెన్నుపూసలోగాని సందు ఉన్నయెడల మెదడు పొరలు ఆ సందుగుండా బయటకు పొడుచుకొని వచ్చుట (hernia).

**meningoencephalitis** inflammation of the meninges and brain substance, *e.g.* tubercular infection, especially in children మెదడు పొరలు మరియు మెదడు పదార్థమునకు కలుగు శోథము/'నొప్పి ఎరుపు వాపు', ఉదా. క్షయవ్యాధి, ముఖ్యముగా పిల్లలలో.

**meningomyelitis** inflammation of the spinal cord and its meninges వెన్నుపాము మరియు దాని మీదిపొరల శోథము/'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**meniscus** crescent shaped cartilage in the knee joint మోకాలు కీలులోని చంద్రవంక ఆకారములోనున్న మృదులాస్థి.

**menopause** the cessation of menstrual periods, climacteric, *colloq.* 'change of life', and the associated hormonal changes ఋతునివృత్తి, ముట్లు ఆగిపోవుట, ముట్లు ఎండిపోవుట, ఋతుచక్రము ఆగిపోవుట – దీని ముందు ఋతుక్రమము తప్పి, ముట్టుకు ముట్టుకు

మధ్య వ్యవధి పెరిగి, ఋతుస్రావము తగ్గుతుంది. వీటితోపాటు స్త్రీ లైంగిక హార్మోన్ల మార్పులు కలుగుతాయి. In some, menopausal syndrome is marked by warm/hot flushes, dizziness, weakness, nervousness, sleep disturbances; depression occurs. కొందరిలో ఒంట్లో గోరువెచ్చ/వేడి పొంగులు, తల/కండ్లు తిరిగి మైకము వచ్చుట, బలహీనత, నరాలబలహీనం, సొమ్మసిల్లిననిద్ర లేకపోవడం, క్రుంగిపోయి దిగజారుట – ఇత్యాది అస్వస్థతలు గల స్థితి కద్దు. However, menopause should not be equated to cessation of sexual urge. ఏది ఎట్లాఉన్నా, ఇది మాత్రం శృంగారానికి, రతిక్రీడకు అవరోధం కాదు. In tropics, women attain menopause round about the age of forty five. ఉష్ణమండలాల్లో ముట్లు ఆగిపోయేది 45వ సంవత్సరప్రాయంలో, కొన్ని సంవత్సరాలు అటు, ఇటు [*in contr.* menarche భిన్న. రజస్వల].

**menorrhagia** rage of menses, బహిష్టుప్రకోపము, అత్యధిక ఋతు స్రావము. excessive bleeding during the monthly period నాలుగు వారాల కొకసారి వచ్చే ముట్టులో రక్తస్రావము హెచ్చుగా ఉండుట.

**menorrhalgia** pain in menses, ముట్టునొప్పి. *figur.* when letter 'l' is introduced into the previous word, she yells (with pain).

**menorrhoea** or **menorrhea** 1. normal menses మామూలు ముట్టు. 2. normal flow of blood during menstruation బహిష్టు సమయంలో సమమైన రక్తం పోవుట.

**menses** menstruation; period lasts for 3 to 5 days usually ముట్టు, బహిష్టు, ఋతువు *colloq.* 'out of doors', 'in periods' వాడు.భా. 'ఇంట్లోకి రాకూడదు' 'బయట ఉంది/చేరింది'. ఆరోగ్యములో ముట్టు 3 నుండి 5 రోజులు. the monthly (to be exact, once in four-weeks) flow of blood from the genital tract (vagina) coinciding with the shedding of the lining of the uterus నాలుగు వారాలకొకసారి జననమార్గము బహిష్టు మార్గమవుతుంది; గర్భసంచి లోపలితలము రాలిపోయి బహిష్కరింపబడుతుంది. ఈ మైల రక్తాన్ని ముట్టు అంటారు. This occurs periodically in the journey in life from menarche to menopause. రజస్వల ప్రారంభంనుండి ముట్లు ఎండిపోయేవరకు జీవితయాత్రలో ప్రతినెలా ఎదుర్కొనే ఘట్టము. At a point of

time halfway through the menstrual cycle, *i.e.* fourteen days before menses a mature ovum leaves the ovary, travels along the Fallopian tube. If willed by destiny, it meets its counterpart, the spermatozoon; then conception occurs and further menses stops during the period of pregnancy and lactation. If not, the menstrual cycle goes on. బహిష్టుకు రెండు వారాలముందు అండాశయమునుండి అండము బయలుదేరి, ఫెల్లోపియన్ నాళములోనికి వస్తుంది. సృష్టికర్త ఉత్తరువు అయితే తన జోడు అయిన పురుషబీజకణమును కలుస్తుంది. ఆ సాంగత్యము ఫలిస్తే గర్భధారణమవుతుంది; ఇక చూలులోను పుట్టిన పిల్లకు పాలిచ్చే కాలములోను బహిష్టు ఆగిపోతుంది. ఫలించని పక్షమున ఋతుచక్రం మళ్ళీ మామూలుగా నడుస్తుంది.

**menstrual cycle** cycle of menstruation ఋతుచక్రం.

**mental** 1. relating to a mental illness/patient మానసిక: మానసిక జబ్బు/రోగికి సం. 2. relating to mind మనస్సుకు సం. 3. pertaining to the chin గడ్డమునకు సం. **m. age,** age as per one's I.Q. (intelligence quotient) ప్రజ్ఞాలబ్ధితో జతచేయబడిన వయస్సు. **m. deficiency** తెలివితక్కువతనం, మానసికక్షీణత. **m. development** మనో వికాసము. **m. disease** మానసిక రోగము. **m. disorder** మానసిక అపవ్యవస్థ. **m. patient,** one who is mentally ill మానసిక రోగి. **m. retardation** మానసిక క్షయీకరణము/మాంద్యము.

**meralgia** pain in the thigh తొడ/ఊరువులో నొప్పి.

**mercurial** 1. containing or caused by mercury, a **m. ointment** పాదరస మిళిత మలాం. 2. m. temperament, said of a person, often changing suddenly and unpredictably చపలచిత్తుడు.

**mercurialism** toxic effects of mercury on the body శరీరంమీద పాదరసపదార్థాల వాడుక వలన కలుగు విషపరిణామం.

**mesencephalon** the mid brain మధ్యగోర్దము, మధ్య మస్తిష్కము, మధ్యమెదడు.

**mesenchyme** mesenchyma. primordial embryonic tissue ఆదిమ పిండదశ కణజాలం.

**mesenteric** *adj.* relating to mesentery మెసెంటరికి సం.

**mesentery** peritoneal fold attaching the small intestine to the dorsal abdominal body wall ఆంత్రయోజకము, ఆంత్రవేష్టన ముడత: చిన్నపేగును ఉదరకుహర వెనుకగోడకు అంటించే ఆంత్రవేష్టన (peritoneal) ముడత.

**mesmerism** a variety of hypnotism, *see/చూడండి* hypnosis. ఇంద్రజాలం.

**mesoderm** middle of the three primary germ layers in the embryo, between the ectoderm (outer layer) and the endo/ento derm (inner layer) మధ్యజననస్తరము, మధ్యత్వచము: పిండములోని ప్రాథమిక జననస్తరాలలోని మధ్యస్తరము. ఇది బహిస్త్వచము మరియు అంతస్త్వచము మధ్యనున్నది. The following are derived from it: the connective tissue, bone, cartilage, muscle, blood and cardiovascular system, lymphatics, lymphoid organs, notochord, pleura, pericardium, peritoneum, kidneys and gonads (ovary, testis) ఈ క్రింది నిర్మాణములు దీనినుండి ఉద్భవించినవి: బంధనకణజాలము, ఎముక, మృదులాస్థి, కండరము, రక్తము, గుండె మరియు రక్తనాళములు, శోషరసనాళములు, శోషరస అవయవములు, పృష్ఠదండము, ఊపిరితిత్తి మీదిపొర, గుండెమీదిపొర, పొట్టలోని పొర, మూత్రపిండాలు మరియు బీజకోశములు (అండాశయము, పురుషబీజకోశము).

**mesomorph** a person of good muscular body build, associated with an aggressive and extroverted personality బ్రతకనేర్చిన, ధీమాగల స్వభావంతో కండరబలంతో ఒప్పారు ప్రధానవ్యక్తి.

**mesosalpinx** the part of the broad ligament investing the uterine (Fallopian) tube ఫెల్లోపియన్ నాళమును చుట్టుకొనియుండే విశాల స్నాయువుయొక్క భాగం.

**mesothelioma** tumour derived from mesothelial tissue (peritoneum, pleura, pericardium) మధ్యస్తరము యొక్క కణజాలములనుండి ఉద్భవించిన కంతి (అంత్రవేష్టనము, ఊపిరితిత్తిమీది పొర, గుండెమీది పొరనుండి).

**mesothelium** the layer of cells derived from mesoderm (of the embryo). In the adult, it is the squamous epithelium that covers serous membranes (peritoneum, pleura, pericardium)

మధ్యస్తరము: మధ్యత్వచమునుండి (పిండములో) ఉద్భవించిన కణముల పొర; ప్రౌఢజీవిలో దీనిని శల్కల ఉపకళ (squamous epithelium) అంటారు. ఇది అంత్రవేష్టనము, ఊపిరితిత్తిమీది పొర, గుండెమీదిపొరను కప్పి ఉంచుతుంది.

**metabolism** index of the life activity జీవ(న)క్రియ. It is the net effect of building-up processes (anabolism, useful substances produced in the body) and breaking-down processes (catabolism, energy made available to the body from destruction of substances). నిర్మాణాత్మకక్రియ/శక్తిగ్రాహకచర్య (anabolism) వలన కలుగు కణజాలముల నిర్మాణము మరియు విచ్ఛిన్నక్రియ/శక్తిమోచకచర్య (catabolism) వలన కలుగు శక్తి ఉత్పన్నము – ఈ రెండు ప్రక్రియల సమ్మేళనము.

**metabolite** a substance taking part in metabolism, *e.g.* vitamin జీవ(న)క్రియలో పాల్గొనే పదార్థం, ఉదా. విటమిన్.

**metacarpals** bones of the metacarpus కరభాస్థికలు, కరాంగుళ్యాధారాస్థులు, పాణికములు.

**metacarpus** the five bones in the palm of the hand కరభము: అరచేయిలోని అయిదు ఎముకలు.

**metaphysis** the wide end of a long bone adjacent to the epiphysis అధిబాహువు (epiphysis) ను అనుకొని ఉన్న పొడుగు ఎముకయొక్క చివరి వెడల్పు భాగము.

**metaplasia** change in the type of cells in a tissue కణజాలములో కణముల జాతి/రకము మారుట. **myeloid m.**, presence and growth of myeloid tissue in extramedullary (other than bone) organs, the liver and spleen మైలాయిడ్ కణజాలములు మామూలుగా ఉండే చోటు అనగా ఎముకలోకాకుండా లివర్, స్ప్లీన్‌లో ఎదుగుట.

**metastasis** [metastases *pl.*] transmission of cells/organisms from one place in the body (primary) to other places (secondaries) – The term is especially used for malignant cells. రోగసంబంధమైన పిలకలు: కణములు/సూక్ష్మజీవులు శరీరములో ఒకచోటునుండి మరియొకచోటునకు రవాణా అగుట – ఈ పదము ముఖ్యముగా

అపాయకరమైన కంతుల్లో అపాయకరమైన కణములకు వాడుతారు; ఇవి ఇంకొక చోట నాటబడినప్పుడు వాటిని secondaries అంటారు.

**metatarsalgia** pain in the bones of the foot అరికాలి ఎముకల నొప్పి.

**metatarsals** the five bones in the sole of the foot ప్రపాదాస్థికలు, పాదాంగుళ్యాస్థులు, పాదాంగుళ్యాధారాస్థులు: అరికాలులోని అయిదు ఎముకలు.

**metatarsus** foot between the ankle and toes ప్రపాదము, అరికాలు.

**meteorism** tympanites, abnormal distension in the abdomen కడుపు ఉబ్బరము. 1. due to the distension of intestines with gas పేగులలో వాయువు జమ అగుట, వాయుపీడన. 2. due to accumulation of gas in the peritoneal cavity అంత్రవేష్టన కుహరములో వాయువు చేరుట.

**methionine** an essential amino acid found in proteins ప్రోటీన్లలో ఉండే ముఖ్యమైన ఎమైనో అమ్లము.

**method** mode or procedure పద్ధతి. **m. of treatment** చికిత్స పద్ధతి.

**methodology** science or study of methods విధానము, విధాన శాస్త్రము, విధానముల భోగట్టా.

**metra** the uterus గర్భసంచి, గర్భాశయము.

**metritis** inflammation of the uterus గర్భాశయముయొక్క శోథము/ 'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**metrodynia** metralgia, pain in the uterus గర్భాశయములో సలుపు, గర్భాశయ వేదన.

**metroptosis** hysteroptosis. downward displacement or prolapse of the uterus గర్భసంచి యోనిలోనికి జారుట.

**metrorrhagia** uterine bleeding at times other than that during periods బహిష్టుకాని సమయములో రక్తస్రావము.

**microbe** microorganism discernible through a microscope సూక్ష్మదర్శినిలో అగపడు సూక్ష్మజీవి.

**microbiology** the science about microorganisms సూక్ష్మజీవుల యొక్క శాస్త్రము.

**microcephaly** abnormally small head చిరు/లఘు శిరస్సు: అసాధారణంగా చిన్నదిగా ఉన్న తల [*in contr.* macrocephaly భిన్న. ఘనశిరస్సు].

**microcirculation** the flow of blood at the level of capillaries, *i.e.* through arterioles, capillaries and venules రక్తకేశనాళికల ప్రాంతంలో రక్తపారుదల అనగా ధమనికలు, కేశనాళికలు, మరియు సిరికలలో రక్తం పారుట.

**microcyte** erythrocyte 4 to 5 $\mu$ or less in diameter, *e.g.* microcytic hypochromic anemia సూక్ష్మకణం: ఎర్రరక్తకణము చిన్నదిగా ఉంటుంది. 4 నుండి 5 $\mu$ లేదా ఇంకా తక్కువ సైజు, *ఉదా.* ఈ రకమైన రక్తహీనత.

**microfilaria** the prelarval stage of *Filaria bancrofti* present in the peripheral blood of man during nights. The intermediate host is the mosquito, *Culex fatigans*. Man is the definitive host, *see/చూడండి* host, elephantiasis, Filaria. ఫైలేరియా పురుగుయొక్క డింభకపూర్వదశ మనిషిలో రాత్రిపూట రక్తములో కనబడుతుంది. క్యూలెక్స్ అను దోమ మాధ్యమిక అతిథేయి. మనిషి ప్రాథమిక అతిథేయి.

**microgamete** male gamete పురుషసంయోగ బీజము *e.g.* malarial *Plasmodium* *ఉదా.* మలేరియా సూక్ష్మసంయోగ బీజము [*Cf.* macrogamete *తారత.* స్త్రీసంయోగ బీజము].

**microgametocyte** precursor of microgamete మైక్రోగామీట్ యొక్క అగ్రగామి, పురుష సూక్ష్మసంయోగ బీజమాతృక.

**microgram** one millionth ($10^{-6}$) gram, *viz.* milli milligram; symbol $\mu$g or mcg.

**microlithiasis** formation of minute concretions in an organ చాల చిన్నవైన కాంక్రీట్ నలుసులు అవయవములో తయారగుట. **pulmonary alveolar m.**, sand-particle like concretions in the pulmonary alveoli, well discernible in the X-ray film of lungs

ఇసుకరేణువులంత పరిమాణముగల సున్నపు నలుసులు ఊపిరితిత్తి వాయు కోశాలలో చేరుట. ఎక్స్‌రే ఫోటోలో ఇసుక జల్లినట్లు సున్నపురేణువులు అగపడుతాయి.

**micromazia** [Greek *mazos* breast] a state of small, rudimentary, functionless breasts నిష్ఫల, కురుచ కుచములు గల స్థితి, చిరుస్తనవతి.

**micron** one millionth ($10^{-6}$) meter, *viz.* milli millimeter; symbol $\mu$., $\mu$m.

**microneurosurgery** surgery on microscopic vessels and structures of the nervous system సూక్ష్మదర్శినిలో చూడగలిగిన నాడీవ్యవస్థలోని నాళికల మరియు సూక్ష్మనిర్మాణముల మీద శస్త్రచికిత్స.

**microorganism** a microscopic organism, *i.e.* visible through the microscope, సూక్ష్మదర్శినిలో చూడబడు సూక్ష్మజీవి. **of medical interest:** bacteria, rickettsiae, viruses, fungi and protozoa వైద్యశాస్త్రమునకు సం: బాక్టీరియా, రికెట్సియె, వైరస్‌లు, ఫంగస్‌లు మరియు ప్రోటోజోవా .

**microphotograph** greatly reduced image of a naked eye object or structure, *see/చూడండి* naked eye structure [*in contr.* photomicrograph].

**microscope** an instrument (system of lenses) which magnifies microscopic objects to enable the naked eye to discern them. It has the power of resolution. సూక్ష్మదర్శిని, ఆకారవృద్ధిచేయు పనిముట్టు, సూక్ష్మవస్తువులను కన్నుతో వివేకించు భూతద్దముల సముదాయముగల సాధనము/పనిముట్టు. పృథఃకరణ సామర్థ్యము కలది. **binocular m.**, enables an observer to see with both eyes రెండుకళ్లతో చూచుటకు వీలైన పనిముట్టు. **compound m.**, magnification varying from 50 to 1250 times సంయుక్త సూక్ష్మదర్శిని. **dissecting m.**, magnification upto 40 times, used for dissection of small animals, flowers, seeds, insects *etc.* ఇది 40 రెట్లు వర్ధనముచేసే విచ్ఛేదన సూక్ష్మదర్శిని; చిన్నజంతువులు, పూలు, గింజలు, పురుగులు మొ. వాటిని విచ్ఛేదించి పరీక్షజరుపుట. **electron m.**, magnification varying from 10,000 to 1,80,000 times or more

ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్. **fluorescence m.** ప్రతిదీప్త సూక్ష్మదర్శిని. **infrared m.** పరారుణ సూక్ష్మదర్శిని. **light m.**, viewing under broad day light or lamp light పగటికాంతి లేదా దీపకాంతి వెలుగు లో/తో చూసేది. useful in studying tissues, bacteria, fungi, *etc.* కణజాలములు, బాక్టీరియా, ఫంగస్‌లు మొ. శోధించుటకు ఉపయోగిస్తారు. **polarisation/polarising m.** ధృవణ సూక్ష్మదర్శిని. **stereoscopic m.**, that which gives a three dimensional view (length, breadth and depth) పొడవు, వెడల్పు మరియు లోతు పరిశీలించగల యంత్రము. **ultraviolet m.** అతినీలలోహిత సూక్ష్మదర్శిని. **X-ray m.**, by X-ray diffraction method useful in molecular biology ఎక్స్‌రే సూక్ష్మదర్శిని, జీవాణుశాస్త్రంలో ఉపయోగిస్తారు.

**microscopic structure** *abbr. micro.str.* సూక్ష్మ.చూ. that which can only be seen with the aid of a microscope but not with the naked eye, *e.g.* a cell అతిసూక్ష్మమైన నిర్మాణము అనగా సూక్ష్మదర్శినిలో/తోనే చూడబడేది; ఉత్తకంటికి కనబడనిది, ఉదా. కణం, జీవకణం [*in contr.* naked eye structure భిన్న. ప్రత్యక్షముగా చూడబడేది].

**microsurgery** surgery done under the vision of binocular microscope సూక్ష్మదర్శినిలో చూస్తూ చేసే శస్త్రచికిత్స.

**microvasculature** *see/చూడండి* microcirculation.

**micturition** passage of urine మూత్రవిసర్జనము.

**midbrain** mesencephalon మధ్యమస్తిష్కము, మధ్యమెదడు.

**middle ear** *see/చూడండి* ear.

**midwife** a woman trained to assist in babybirth మంత్రసాని, స్థానికముగానున్న పురుడుపోసే మంత్రసాని.

**migraine** headache, usually unilateral and predominantly temporal, occurring periodically and associated with nausea, vomiting, photophobia శిరోపార్శ్వనొప్పి, తరచుగా ఒక పార్శ్వపు తలనొప్పి, నొప్పి, పోటు; ఎక్కువగా కణతప్రాంతమందు, తెరలుతెరలుగా బాధకలిగించి, వికారము/వాంతి వచ్చినట్లుండి, డోకులతోకూడి, వెలుతురు అంటే భయము గొలిపెడు రుగ్మత. Gradually it lapses into ocular

aura. క్రమేణ కంటిచూపు విలక్షణము కలుగవచ్చు. After the paroxysm, normal state is restored. ఈ తెర ముగిసిన తర్వాత వ్యక్తికి స్వస్థత చేకూరుతుంది.

**milestones** stages in development in the growth of an infant, child, *viz.* change of posture from supine to prone position, crawling, walking, *etc.* శైశవము మరియు బాల్యదశలో: బోర్లపడుట, పాకుట, అడుగులు వేసి నడచుట, మొ. – ఇవి ఎదుగుటలో ఘట్టములు.

**miliaria** rash due to retention of sweat ఎండకు పేలుట. **m. rubra,** prickly heat, more on the back, neck, arms; papulovesicles on the skin, turning red in colour, accompanied by severe itching ఒళ్లుపేలటం, చమటకాయలు, చర్మము (ముఖ్యముగా వీపు, మూపు, మెడ, భుజములు – వీటిమీద) ఎర్రపొక్కులతోనిండి, గోకుడుతో మరింత ప్రకోపించి, కందిపోతుంది, అలంకార. చర్మం అట్టకట్టి పోతుంది. Itching (scratching) stimulates further itching. గోకటం మొదలుపెడితే మరీమరీ గోకాలని అనిపిస్తుంది.

**miliary** lesions resembling millet seeds, *see/చూడండి* miliary tuberculosis. **m. dissemination,** scattering of disease foci of the size of millet seeds in different organs సజ్జల పరిమాణములోనున్న వ్యాధి నలుసులు వివిధ అవయవములలో మొలకెత్తుట.

**milieu** environment పరిసరము/చుట్టూరాఉన్న స్థితి. **m. interior,** surrounded by tissues and organs కణజాలములు మరియు అవయవములచే పరివేష్టించబడిన జీవియొక్క అంతర్భాగము.

**milk** white nutritive secretion in females పాలు. **breast m.** తల్లిపాలు, చనుబాలు. *N.B.* Breast milk is the best (milk) for the baby. *గమనిక:* చన్ను (సహజ) పాలు శిశువును చిరాయువుగా చేస్తాయి.

**milli** one thousandth ($10^{-3}$) *abbr.* m. *e.g.* milligram, mg; milliliter, ml.

**Milroy's disease** hereditary lymphoedema వంశపారంపర్యంగా వచ్చే జబ్బు – లింఫ్ వ్యవస్థలో నీరుచేరి (లింఫ్ వాపు) ఆ ప్రాంతం ఉబ్బుట.

**mineral** (in nutrition) an inorganic substance, mainly a metal, *e.g.* sodium, potassium ఖనిజము: (శరీరపోషణలో) అకార్బనిక పదార్థం, ముఖ్యంగా లోహము, ఉదా. సోడియమ్, పొటాసియమ్.

**minimum** lowest, least కనిష్ఠ(ము) [*opp.* maximum వ్యతి. గరిష్ఠ(ము)].

**minor** small చిన్న. **pectoralis m.** ఈ పేరుగల లఘుపేశి [*Cf.* major తారత. ఘన].

**miosis** contraction of the pupil కంటిపాప ముడుచు కొనుట/చిన్నదగుట [*in contr.* mydriasis భిన్న. విస్తరణ/విస్ఫారణ].

**miotic** an agent/drug that contracts the pupil కంటిపాప ముడుచు కొనుటకు కంట్లో వేయుమందు.

**mirror** looking glass దర్పణము, అద్దము. **laryngeal m.** స్వరపేటికను చూసే అద్దం.

**misadventure** 1. bad luck/misfortune దురదృష్టము. 2. an unfortunate happening గ్రహచారం బాగులేనప్పుడు జరిగిన సంఘటన. *Note.* Absence of negligence is implied in this. *గమనిక:* అజాగ్రత్త వలన కాదు సుమా! [*Cf.* malpractice].

**miscarriage** spontaneous loss of a premature foetus before the middle of the second trimester గర్భపాతము: అపక్వభ్రూణము అప్రయత్నంగా $4\frac{1}{2}$ నెలల ముందే జారిపోవుట. [*Cf.* abortion తారత. గర్భస్రావము].

**mite** arthropod (insect) causing skin irritation తవుటి పురుగు: చర్మముమీద దురద కలుగజేయు పురుగు.

**mitosis** complicated method of cell division in four phases నాలుగు దశలలో కణవిభజనము.

**mitral** shaped like a bishop's miter బిషప్ ధరించే తలపాగ ఆకారమును పోలిన. 1. **m. valve,** bicuspid valve between the left atrium and left ventricle in the heart, *resemblance:* miter, the cap worn by bishops ద్విపత్రకవాటము: గుండెలోని ఎడమ ఏట్రియమ్ మరియు ఎడమ జఠరిక మధ్యగల అగ్రద్వయ/ద్విపత్ర కవాటము, పోలిక: బిషప్ ధరించే తలపాగ. 2. **m. stenosis,** decrease in the circumference of the mitral opening due to shrinkage of the valve కవాటము ముడుచుకొనిపోయినందువలన ఆ రంధ్రముయొక్క పరిధి చిన్నదగుట.

**mnemonics** the art of helping memory for the student విద్యార్థికి కొండగుర్తులు. 1. In the heart, right atrioventricular valve contains tri- three cusps; left atrioventricular valve contains bi- two cusps. Right lung has three lobes - right tri; left lung has two lobes - left bi. Hence 'right tri, left bi' is a mnemonic. కుడి ఏట్రియో జఠరిక కవాటములో మూడు దళములు – కుడి త్రి (త్రికము); ఎడమ ఏట్రియో జఠరిక కవాటములో రెండు దళములు – ఎడమ ద్వి (ద్వయము). కుడి ఊపిరితిత్తిలో మూడు లంబికలు, ఎడమ ఊపిరితిత్తిలో రెండు లంబికలు. కాబట్టి కొండగుర్తు: కుడి త్రి, ఎడమ ద్వి. 2. In the English alphabet the letter 'c' follows 'b', - cyte follows (comes from) - blast. The letter 'b' precedes 'c'. -blast is the precursor of -cyte, *see/చూడండి* myeloblast, myelocyte. కొండగుర్తు: -cyte అనే కణం -blast నుండి రూపొందుతుంది. -blast అనే కణం -cyteకు అగ్రగామి.

**mobile** moving సంచలన(ము) కలిగిన, చోటు మారుచుండే. **m. clinic** సంచార వైద్యశాల. **m. latrine** సంచార మరుగుదొడ్డి **m. library** సంచార గ్రంథాలయం. అలంకార. జంగమ.

**modality** relating to mode or manner విధమునకు/రీతికి/ఏర్పాటుకు సం. **treatment m.** చికిత్సావిధానము.

**moderation** a word of caution to keep up health. 1. Moderation in everything must be the motto in life. (a) వంటకాల్లో ఉప్పు తక్కువ వేస్తే అరుచి; ఎక్కువ వేస్తే చేదు. ఎక్కువ తింటే మాంద్యం; తక్కువ తింటే నీరసం. (b) 'అతి సర్వత్ర వర్జయేత్' మితి పోయి, అతి పోని. *figur.* gem of a word in the upkeep of health అలంకార. ఉదా. ఒక లడ్డూ తింటే పోయి, మితి కాబట్టి; ఆరు లడ్డూలు తింటే పోని, అతి కాబట్టి. 2. 'ఔషధవదశన మాచరేత్' – ఆరుణేయ్యుపనిషత్తు. రోగనివారణార్థము పరిమితమగు ఔషధమును ఎటుల గ్రహింతురో అట్లే పరిమితమగు అన్నమును ప్రాణధారణార్థము భుజింపవలయును.

**molar teeth** grinders, three on either side, up and down చర్వణ కాలు: నమలుటకు/చర్వణమునకు ఉపయోగించే దంతాలు, రెండువైపులా, పైన మూడు, కింద మూడు.

**mole** 1. birth mole, taken as a token/mark of identification పుట్టుమచ్చ, ఒక గుర్తింపు గుర్తు. 2. hydatidiform m., *see/చూడండి* hydatidiform mole.

**molecular biology** the study of the structure and function of large molecules associated with living beings అణుజీవశాస్త్రము.

**molecule** group of atoms అణువు: పరమాణువుల సముదాయము.

**molluscum** soft round masses or tumours on the skin చర్మంమీద మెత్తటి ముద్దలు లేదా కంతులు. **m. contagiosum,** caused by a virus, spread by contact వైరస్‌వలన సంభవించే, స్పర్శ/తాకుడు వలన వ్యాపించే సురుగుడుకాయలు.

**mongoloid** mongol or mongoloid: a race characterised by a flat face, high cheek bones, straight black hair, *see/చూడండి* Down's syndrome. ఒక తెగ: చదును నుదురు, ఎత్తైన బుగ్గలు, ఉంగరాలులేని నల్లటి జుట్టుగలవారు.

**mongrel** hybrid, *see/చూడండి* hybrid.

**Monilia** *Candida, see/చూడండి* Candida.

**monocyte** mononuclear leukocyte. It develops into macrophage in the lung and liver. ఏకకేంద్రకముగల తెల్లరక్తకణము; ఊపిరితిత్తిలోను, కాలేయములోను మాక్రోఫేజ్‌గా ఎదుగుతుంది.

**monomania** obsession with a single idea ఒకే ఉద్దేశంమీద మూర్ఖపు పట్టుదల. అలంకార. తనుపట్టిన కుందేలుకు మూడేకాళ్ళు.

**mononucleosis** presence of excessive amounts of monocuclear leucocytes ఈ తెల్లకణములు జాస్తిగా చేరుట. **infectious m.,** glandular fever గ్రంథి వాపు, జ్వరము. virus disease with sore throat and lymphadenopathy, marked by increase in cells resembling monocytes in the blood రక్తములో మోనోసైట్స్ లాంటి కణముల సంఖ్యపెరిగి, గొంతువాపు/గరగర, లింఫ్‌గ్రంథుల వాపుతోకూడిన వైరస్ జ్వరము.

**monoplegia** paralysis of one limb ఏకాంగవాతము: ఒక కాలుకో లేదా ఒక చేతికో వచ్చు పక్షవాతము.

**mons** a prominence ఉబుకు. **m. pubis, m. veneris,** an eminence formed by a pad of fat over the symphysis pubis in the female స్త్రీ శ్రోణిలో జఘన సంధానము (జఘనాస్థుల కలయిక) మీది క్రొవ్వుదిండు. *figur.* attraction to Cupid అలంకార. కామపీఠం; జఘనవేదిక – మన్మథ ఆకర్షణ.

**moonshine** 1. illicitly/illegally - distilled alcoholic spirit – whisky, brandy. మాదక పానీయాల దొంగ/అక్రమమైన/చట్టవిరుద్ధమైన తయారీ/రవాణా – విస్కీ, బ్రాంది. 2. moonshiner, one who smuggles 1. సుంకము చెల్లించకుండా పైవాటిని ఎగుమతి దిగుమతి చేయువాడు.

**morbid** diseased జబ్బుగా/తో ఉన్న.

**morbidity** the extent of sickness వ్యాధి ప్రబలత, వ్యాధిగ్రస్తత.

**morbilliform** measles-like తడపరవలె, తట్టువంటి దద్దుర్లు.

**morbus** disease, *see/చూడండి* disease.

**morgue** mortuary, a place where dead bodies are kept before disposal శవగృహం.

**moribund** in a dying state మృత్యోన్ముఖమైన. terminal stage అవసానదశ.

**morning sickness** nausea and vomiting during the early weeks of pregnancy వేవిళ్ళు, వికారము, వాంతులు గర్భధారణయొక్క తొలి సూచనలు; పులుపుమీద అపేక్ష ఆవకాయ ముక్క నిమ్మకాయ ఊరుగాయ కావాలంటారు/నంజుతుంటారు. వాడు.భా. నెలతప్పింది.

**morphine** alkaloid of opium, used medicinally for relieving pain and inducing sleep నల్లమందులోని ఆల్కలాయిడ్, నొప్పి తగ్గించేది, నిద్ర తెప్పించేది.

**morphology** an account of the form and structure of organisms జీవుల స్వరూపశాస్త్రము/ఆకృతివిజ్ఞానము.

**mortal** liable to die మర్త్యుడైన. *figur.* Patients are not immortal, doctors are not Gods! అలంకార. 'వైద్యో నారాయణో హరిః' అన్నప్పటికీ డాక్టర్లు దేవుళ్ళుకారు! మృత్యువును ఆపలేరు.

**mortality** deaths మరణాలు. **m. rate,** death rate in a disease ఒక జబ్బులో మృతుల సంఖ్య. **infantile m.** శిశుమృత్యు సంఖ్య. **maternal m.** ప్రసూతిలో తల్లుల మరణాలు.

**mortification** death of tissue, *see/చూడండి* gangrene. కణజాల మృతి.

**mortuary** morgue, place where dead bodies are kept శవగృహం.

**mosquitoes** flying insects ఎగిరే కీటకములు, దోమలు. carriers/vectors of diseases వ్యాధుల వాహకాలు/ఆరోహకాలు. mosquito net, a preventive measure against mosquito bites దోమతెర, దోమకాట్ల నివారణోపాయము. *figur.* mosquito bite: 4 A.M. wake-up (telephone) call.

**motile** capable of movement చలనశక్తిగల, చలనం ఉన్న. **m. amoeba,** amoeba with pseudopodia మిథ్యాపాదాలుగల అమీబా.

**motility** movement చలనశీలత.

**motion** 1. faeces విరేచనము. 2. movement కదలిక.

**motion sickness** *see/చూడండి* travel sickness.

**motor function** strength to move చలనశక్తి.

**motor neuron** motoneuron. a neuron having a motor function చాలక (motor) విధిగల నాడీకణము (neuron), *e.g.* an efferent neuron conveying motor impulses ఉదా. చాలకప్రచోదనలు తీసికొనిపోవు అపవాహినాడీకణము. **lower m.n's,** carry impulses from the spinal cord to the muscles; in turn, muscles act. వెన్నుపామునుండి కండరములకు ప్రచోదనలను తీసికొనిపోతాయి; అప్పుడు కండరములలో చలనము కలుగుతుంది. **upper m.n's,** conduct impulses from the cerebrum to spinal cord ఇవి మస్తిష్కమునుండి వెన్నుపాము నకు ప్రచోదనలను అందజేస్తాయి. **m.n. disease,** in which fibrillations/fasciculations are seen, *see/చూడండి* fasciculation, fibrillation, sclerosis.

**mould** or **mold** 1. fungi శిలీంధ్రాలు. 2. loose soft soil that is rich in organic matter కార్బనిక పదార్థంగల బోలు, మెత్తటి మట్టి.

**mountain sickness** also called altitude sickness. nausea, light-headedness, headache, *etc.* caused by breathing low oxygen air ఎత్తుప్రదేశాల అస్వస్థత. వాంతివచ్చినట్లుండటం, ప్రాణం తేలిపోయినట్లుండటం, తలనొప్పి, మొ. – ఇవి తక్కువ ఆక్సిజన్ శాతం గల గాలి పీల్చినందువలన సంభవిస్తాయి.

**mouth 1.** opening through which food is taken నోరు, అస్యకుహరము. 2. a window for speech మాట్లాడుటకు మార్గం. 3. consumer of food, *e.g.* five mouths to feed *ఉదా.* అయిదుగురికి అన్నం పెట్టాలి (పోషించాలి).

**MRI** *abbr.* magnetic resonance imaging, a division in the Radiology department రేడియాలజి విభాగంలో ఒక పరీక్ష a method of visualising the soft tissues of the body శరీరంలోని కండరాలు, నాడులు స్పష్టంగా కనబడతాయి.

**MTP** *abbr.* medical termination of pregnancy వైద్యరీత్యా గర్భిణి స్త్రీలో గర్భమును అంతముచేయుట.

**mucin** main substance in the mucus శ్లేష్మకములోని ముఖ్యపదార్థము.

**mucocutaneous** pertaining to mucous membrane and skin శ్లేష్మపొర మరియు చర్మమునకు *సం.* **m. junction,** *e.g.* edge of the lip పెదిమల అంచు. margin of anal orifice ఆసనము/గుదము అంచు.

**mucoid** mucous; 1. pertaining to mucus శ్లేష్మకమునకు *సం.* 2. resembling mucus శ్లేష్మ(క)మును పోలిన.

**mucolytic** dissolving mucus శ్లేష్మమును కరిగించేది.

**mucopurulent** mucus and pus శ్లేష్మకము మరియు చీము.

**mucosa** mucous membrane శ్లేష్మపొర, శ్లేష్మపటలము, శ్లేష్మస్తరము. lining the wet surfaces like the front of the eye ball, nose, mouth, intestines, anus, vagina తేమగానుండెడు కన్నుగుడ్డు యొక్క ముందుభాగము, ముక్కు, నోరు, పేగులు, ఆసనము, యోని, మొ. వానిలోపల అంటిపెట్టుకుని ఉన్న పొర.

**mucous** *adj.* pertaining to or containing mucus శ్లేష్మమునకు *సం.* లేదా శ్లేష్మసహిత.

**mucus** *n.* discharge from the nose శ్లేష్మ(క)ము, చీమిడి, మొ. **m. secreting cells** శ్లేష్మస్రావక కణాలు.

**multicellular** comprising many cells పెక్కు కణములుగల [*in contr.* unicellular భిన్న. ఏకకణ].

**multigravida** [multi- + Latin *gravida*, pregnant] బహుగర్భ. 1. one version ఒక అభిప్రాయం: from $3^{rd}$ pregnancy and onwards మూడవసారి గర్భిణి మరియు ఆపైన. 2. another version మరియొక అభిప్రాయం: a woman who has had more than one pregnancy ఒకటికంటె ఎక్కువసార్లు గర్భము ధరించిన స్త్రీ. [*Cf.* primigravida *తారత.* తొలిచూలు].

**multiinfection** infection with different pathogens/micro organisms వివిధరకముల వ్యాధికారకాల/సూక్ష్మజీవులతో సంపర్కం/సంసర్గం/సంక్రమణం/సోకుడు.

**multipara** multigravida. *see/చూడండి* multigravida. బహు(శ)గర్భ. (పెక్కుగర్భములు ధరించిన/భరించిన స్త్రీ.) బహుగర్భవతి. **grand m.** who had seven or more deliveries [*in contr.* nullipara *భిన్న.* గొడ్రాలు].

**multiparous** relating to a multipara బహుశ చూలాలుకు సం.

**multiple sclerosis** *abbr.* **(MS)** *syn.* disseminated sclerosis. *see/చూడండి* sclerosis. degeneration of the myelin sheath covering neurones, causing weakness of muscles, speech disturbances, *etc.* నాడీశాఖలమీది మైలిన్ తొడుగు క్షీణించినందున కలిగే కండరాల బలహీనత, మాటదోషము, మొ.

**mummy** 1. *colloq.* mother వాడు.భా. ఈ కాలపుపిల్లలు మాతృమూర్తిని ముద్దుపేరుతో పిలుపు. 2. shrivelled dead body, embalmed and preserved కుళ్లిపోకుండా తైలపక్వము చేయబడిన, ఎండిన పీనుగ. **Egyptian m's,** *legendary curiosity:* Egyptian mummies date back to 5000 B.C. *చారిత్రాత్మక వింత:* ఈజిప్టులో ఈ ఎండిన పీనుగలు క్రీస్తుపూర్వము (క్రీ.పూ.) 5000 సంవత్సరములనుండి కుళ్ళిపోకుండా కాపాడబడి ఉన్నవి.

**mumps** infectious parotitis, viral infection producing inflammation of the salivary glands, particularly the parotid glands in front of the ears గవదబిళ్ళలు: లాలాజలము ఊరుగ్రంథుల, ముఖ్యముగా పెరోటిడ్ గ్రంథుల (చెవులముందున్నవి) 'నొప్పి వేడి మంట వాపు' తో కూడిన జ్వరము. complications: orchitis, oophoritis, pancreatitis and meningismus ఈ జబ్బులో వచ్చు చిక్కులు: వృషణముల వాపు, అండాశయములవాపు, క్లోమము వాపు మరియు మెదడుపొరల జబ్బు.

**murder** unlawful killing of a human being intentionally – a crime నరహత్య; ఖూని: *గమనిక:* హత్యానేరం శిక్షార్హం.

**murmur** *syn.* bruit. In contrast to normal heart sounds which are pleasant to the ear and to hear, these murmurs are noises of cardiac, valvular or vascular origin unpleasant to the ear and to hear. గొణుగు శబ్దము; సహజగుండెధ్వనులు వినుటకు ఇంపుగాను, శ్రావ్యముగాను ఉంటాయి; కాని మర్మర్‌లు వినుటకు కరకుగానుండి, గాడిద అరుపులాంటి చప్పుళ్ళు. మర్మర్‌లు హృద్రోగములలోగాని, గుండె కవాటముల జబ్బులలోగాని, రక్తనాళముల జబ్బులలోగాని విననగును. Murmurs are grating, rumbling, harsh, blowing, rough or machinery in character/quality. మర్మర్‌లు అసహ్యకరమైన, దూరపు ఉరుము – గర్జించు శబ్దము, వినుటకు ఇంపుగాని, కరకైన, ఊదినట్లు లేదా కూసినట్లు, మందుగుండు పేల్చినట్లు, యంత్రము చప్పుడు చేసినట్లు – ఇత్యాది గుణములు కలిగిఉంటాయి. **aortic m.,** due to diseased aortic valve or aorta బృహద్ధమనిలో కవాటము జబ్బు లేదా బృహద్ధమని జబ్బులో. **diastolic m.,** murmur occurring during diastole (హృదయ) విస్ఫారములో చప్పుడు. **friction m.,** pleural or pericardial rub ప్లూరాపొర, పెరికార్డియమ్ పొర రాపిడి శబ్దము. **machinery m.** యంత్రము చప్పుడు పోలిన గొణుగు శబ్దం. **pulmonic m.,** disease of pulmonary artery పుపుస ధమని వ్యాధిలో. **systolic m.,** murmur heard during systole (హృదయ) సంకోచములో చప్పుడు. **to and fro m.,** heard during both systole and diastole (హృదయ) సంకోచము మరియు (హృదయ) విస్ఫారములో వినబడే శబ్దం.

**Murphy's sign** sign of an inflammed gall bladder. Patient will wince (grimace in reaction to pain) if pressure is applied over the abdomen while he inhales. రోగి ఊపిరి పీల్చినప్పుడు పొట్టమీద చేయివేసి నొక్కితే ముఖవైఖరిలో నొప్పి గోచరమవుతుంది. ఈ చిహ్నం పిత్తాశయ శోథంలో గమనిస్తాం.

**muscle** a tissue ఒక కణజాలము: కండరము, మాంసరజ్జు, పేశి, మాంసపుకండ. the tissue that is responsible for movement చలనము కలిగించు కణజాలము. The muscle fibres are bound together in a muscle; the fibres become short and stout when the muscle contracts. కండరతంతువుల సముదాయము కండరము; కండరము ముడుచుకున్నప్పుడు ఇవి పొట్టిగాను మరియు లావుగాను (బలముగాను) అవుతాయి. *N.B.* Each hair shaft (muscle fibre) is brittle but a plait (*colloq.* pigtail) (muscle bundle) is strong – unity is strength. *గమనిక:* వెంట్రుకను తుంచవచ్చుగాని జడను తుంచలేము – సముదాయములో బలము ఉన్నది – కండర తంతువు, కండరముగూడా ఇంతే. **(a) voluntary muscles** నియంత్రిత కండరాలు, ఇచ్ఛాధీన కండరములు over which one can exert control, *e.g.* skeletal muscles, arm and leg muscles మన స్వాధీనములోనున్నవి, ఉదా. ఎముకలకు అంటిన కండరాలు, కాలు, చేయి కండరాలు. **(b) involuntary muscles** అనియంత్రిత కండరాలు. over which one cannot exert control – heart muscle; smooth (plain) muscle in the walls of bronchial tubes, intestine, uterus, *etc.* మన స్వాధీనములోలేని స్వతంత్ర కండరాలు – గుండె కండరములు; శ్వాసనాళికల, పేగుల గోడల, గర్భాశయగోడలలోనున్న నునుపు కండరములు మొ. **(c) striated, striped muscles** skeletal and cardiac m. చారల కండరములు, రేఖిత కండరములు: నియంత్రిత కండరాలు మరియు గుండె కండరాలు. diameter of muscle fibre in the skeletal muscle varies from 10 to 100 $\mu$; cardiac muscle fibre 15 $\mu$; Purkinje muscle fibre 50 to 70 $\mu$. **(d) nonstriated muscles** smooth (plain) muscle చారలులేని కండరములు, నునుపు కండరములు. *histol.* smooth muscle is composed of spindle shaped cells, 30 to 200 $\mu$ in length, 5 to 10 $\mu$ in cross-section. They group to form small

muscle bundles, *e.g.* arrector pili in skin or predominant masses in the wall of the uterus. In smooth muscle cells, bundles of myofilaments criss-cross obliquely through the cell forming a lattice-like pattern/network. The size of myosin filament is of the order of 10 to 16 nm. **m. cramps,** spasmodic contractions of a muscle/group of muscles కండరము/కండర సముదాయముయొక్క ఈడుపులు. **m. spindle,** receptor end-organ responsible for the stretch reflex కండర కండె, కండర వ్యాకోచానికి కండరాలలో సంజ్ఞను ఇచ్చే గ్రాహకము.

**muscular** pertaining to muscle కండరమునకు సం. **m. ache,** myalgia కండరముల తీపు. **m. body,** body with well-built muscles బలమైన కండరములుగల శరీరము. *figur.* of Olympic standards - muscle man, Mr. Hercules అలంకార. ఒలింపిక్స్ ప్రమాణముల ప్రకారం కండరకాయుడు, హెర్క్యులిస్. **m. dystrophy,** progressive weakness and wasting of skeletal muscles, many varieties; some are familial/hereditary క్రమేణ ఎక్కువ అవుతున్న కండరాల బల హీనత, క్షీణత. ఇందులో రకములున్నవి; కొన్ని వంశపారంపర్యంగా సంభవిస్తుంటాయి.

**musculature** muscle bundles కండర పుంజరాలు. *figur.* a museum of muscles అలంకార. పేశీప్రదర్శన.

**mushroom** an edible kind of fungus కుక్కగొడుగు, పుట్టగొడుగు, పుట్టకొక్కు - ఒకరకం భోజన పదార్థమైన ఫంగస్.

**mutagen** an agent that induces or increases the frequency of mutation, *e.g.* radioactive substance, X-rays. ఉత్పరివర్తకము: ఉత్పరివర్తన (mutation) కలుగజేయు వస్తువు, ఉదా. రేడియోధార్మికశక్తిగల పదార్థము, ఎక్స్‌రే కిరణములు.

**mutation** a permanent transmissible change in the genetic substance ఉత్పరివర్తన: జన్యువు పదార్థంలో శాశ్వత సంక్రమణత కలిగిన మార్పు. **gene m.,** a permanent change in the substance of the gene జన్యువు ఉత్పరివర్తనము. **m. theory** ఉత్పరివర్తన సిద్ధాంతము. *N.B.* Isotopes emit radiations which cause mutation. గమనిక: వికిరణ కలిగించు ఐసోటోప్‌లు ఉత్పరివర్తనకు కారకములు.

**mute** 1. one who is physically unable to speak మాటచేతకాని వాడు/మాటరానివాడు. *e.g.* (a) as a result of deafness *ఉదా.* చెవుడు మూలకంగా (b) sequel to brain damage మెదడు వినాశము వలన. 2. psychological: who refuses to speak, *e.g.* hysteria మనోవిజ్ఞానరీత్యా: మాట్లాడుటకు నిరాకరించేవారు, ఉదా. హిస్టీరియా జబ్బులో.

**mutilation** the act to injure, damage or disfigure any part of the body; dismemberment వికలము, వికలీకరణము, అవయవనష్టం; ఛిన్నాభిన్నం చేయుట.

**myalgia** ache in the muscles, a not infrequent malady కండరాల్లో నొప్పి, పేశీవేదన; తరచుగా తటస్థపడే తీపు.

**myasthenia** muscular debility/feebleness కండరముల బలహీనత/దౌర్బల్యము. **m. gravis,** a disorder at myoneural junction. There is a clinical association with exophthalmic goitre. కండర మరియు నాడీతంతుకల యొక్క సంధి దగ్గర అపవ్యవస్థ. దీనికి థైరాయిడ్ విషమ ఉబ్బుకు సన్నిహితం ఉన్నది. The muscular weakness is worse towards the end of the day, with the result that the patient sleeps with his eyes open! పేశీ బలహీనత/దుర్బలత్వం రాత్రికి మరీ ఎక్కువ అవుతుంది, విడ్డూరము ఏమంటే – రెప్పలు మూసే ఓపికలేక కళ్ళు తెరచుకునే నిద్రపోతాడు!

**myatonia** amyotonia, *i.e.* absence of tone in the muscle, extreme flaccidity కండరములో బిగువు లేకుండుట; కండరాలు పితపితలాడుతూ మెత్తగా తగులుట. **m. congenita,** starts in infancy; child not able to bear the weight of his/her own head on shoulders జన్మజాతమైన/పుట్టుకతో వచ్చిన బిగువులేని పితపితలాడు కండర సడలు, పోలిక: చపాతీలు/పూరీలు చేసేముందు పిండి; శిశువుకు తన తలకాయను తన బుజాలమీద నిలిపే శక్తిలేకపోవుట.

**mycetoma** *see/చూడండి* maduromycosis.

**Mycobacterium** *abbr.* AFB. acid fast bacilli. *M. bovis,* cause of cattle tuberculosis పశువులలో క్షయవ్యాధికి కారకము. *M. kansasii,* disease resembling tuberculosis క్షయవ్యాధిని పోలిన జబ్బు.

*M. leprae,* the cause of leprosy కుష్ఠురోగ బాక్టీరియా. *M. tuberculosis,* the cause of tuberculosis, most commonly of lungs, in humans బహుతరచుగా మానవులలో ఊపిరితిత్తులకు సంక్రమించు క్షయవ్యాధి బాక్టీరియా.

**Mycobacterium** a genus of bacteria బాక్టీరియాలో ఒక ప్రజాతి. **anonymous or atypical mycobacteria** *i.e.* other than *Mycobacterium tuberculosis* or *M. bovis* మనిషి/జంతు క్షయ బాక్టీరియా గాకుండా సవివరణలేని/విశిష్టముకాని మైకోబాక్టీరియా.

**mycology** the science and study of fungi ఫంగస్‌లను గురించిన శాస్త్రవిజ్ఞానం.

**Mycoplasma** a genus of microorganism ఒక ప్రజాతి సూక్ష్మజీవి. *M. pneumoniae,* causes primary atypical pneumonia ఒక రకమైన న్యుమోనియా కలుగజేస్తుంది.

**mycosis** any disease caused by fungi ఫంగస్‌లవలన సంభవించు జబ్బు. **m. fungoides,** lymphoreticular neoplasm with ulcers, malignant అపాయకరమైన శోషరసజాలక కంతి, లింఫ్ గ్రంథులు వాచి వ్రణములు పుడ్తాయి.

**mydriasis** dilatation of the pupil కంటిపాప తెరచుకొనుట/పెద్దదగుట [*in contr.* miosis భిన్న. ముడుచుకొనుట].

**mydriatic** an agent/drug that dilates the pupil కంటిపాప తెరచు కొనుటకు కంట్లోవేయు మందు.

**myelin** thin sheath around the axons of nerve cells అక్షతంతువుల వెలుపలి తొడుగు. **m. sheath,** the fatty protective covering of nerve fibres నాడీతంతువుల వెలుపలి భాగమున వాటిని కాపాడు కొవ్వుపొర.

**myelitis** 1. inflammation of the spinal cord వెన్నుపాము శోథము: వెన్నుపాముయొక్క 'ఎరుపు వాపు'. 2. inflammation of the bone marrow (osteomyelitis) అస్థిమజ్జయొక్క వాపు (ఎముకలో నొప్పి, పోటు, వాపు).

**myeloblast** immature cell in bone marrow, most primitive precursor of the granulocyte series అస్థిమజ్జలోనుండు, పక్వముకాని కణము – ఇది కణికాభకణాల (granulocytes) కు అతి ఆదిమ అగ్రగామి.

**myeloblastoma** a fatal malignant tumour composed of myeloblasts మైలోబ్లాస్టులుగల ప్రాణంతీసే అపాయకరమైన కంతి. *figur.* 'a tumour that blasts the body' *అలంకార.* 'తనువును ధ్వంసం చేసే ట్యూమర్'.

**myelocele** an accompaniment of spina bifida; opening of the spinal canal to the outside, discharging cerebrospinal fluid కశేరు కుల్య బయటికి చొరుచుకువచ్చి, అందులోనుంచి మస్తిష్క మేరుద్రవం కారుట.

**myelocyte** cell derived from myeloblast మైలోబ్లాస్ట్ నుండి ఉత్పన్న మగు కణము.

**myeloid** 1. pertaining to bone marrow అస్థిమజ్జకు సం. 2. with reference to the spinal cord వెన్నుపామును సూచించే. **m. leukaemia,** *see/చూడండి* leukaemia.

**myeloma** a tumour ఒక రకమైన కంతి. **multiple m.,** myelomatosis; multiple malignant bone marrow tumour foci, bone pain due to bone destruction అస్థిమజ్జలో బహుళ మొలకలు వేసి, వివిధ కేంద్రములుగా కంతులు కట్టే అపాయకరమైన రుగ్మత. X-ray skull: punched out areas due to bone destruction కపాలపు ఎక్స్‌రేలో ఎముక శిథిలము వలన రంధ్రములు. urine: Bence Jones protein మూత్రములో ఈ ప్రోటీన్.

**myelopathy** noninflammatory spinal cord lesion వెన్నుపాము యొక్క శోథరహితమైన క్షతము; వెన్నుపాముయొక్క వికలము.

**myocardial** relating to the muscular walls of the heart గుండెగోడ కండరములకు సం. **m. infarct,** *see/చూడండి* infarct. the damage or death of a portion of the heart muscle usually due to coronary occlusion or coronary thrombosis, the 'cry of the cor'. హృదయ పేశీచచ్చు. కొరొనరి రక్తనాళములలో అడ్డము పడుటగాని, థ్రాంబోసిస్ వలనగాని ప్రాప్తించిన, గుండెలోని ఒకప్రాంతపు చెరుపు లేదా మృతి, 'హృదయరోదన'. necrosis of heart muscle due to inadequate blood supply రక్తప్రసరణలోపమువలన కలుగు గుండెపేశీకణనాశము. Laymen refer to this as 'heart attack'. అవస్థలు: 'గుండెరోద', 'హృదయ

వేదన'. There may be previous history of angina pectoris. గతంలో గుండెనొప్పి, ఏంజైనా ఉండి ఉండవచ్చు. This disease is heralded by apprehension, severe pain in the chest, pain radiating to the left arm and jaw; accompanied by fall of blood pressure, sweating and collapse. ఛాతీలో (గుండెప్రాంతంలో) క్షోభము, భరింపరాని నొప్పి, నొప్పి ఎడమచేతికి మరియు గడ్డమునకు పాకుతుంది; బ్లడ్ ప్రెషర్ పడిపోయి, చమటలు పోసి, కూలిపోతాడు. Immediate intensive care (acute medical care) is the answer. ఈ గడ్డుప్రశ్నకు జవాబు: తత్క్షణమే వైద్యనిపుణత చికిత్స.

**myocarditis** inflammation of the heart muscle హృదయ కండరముల వాపు, గుండె కండరాల శోథము.

**myocardium** the heart wall, made up of cardiac muscle కండరముగల గుండెగోడ, హృదయకుడ్యము, గుండె కండరము.

**myoclonus** jerky, shock-like contractions of a muscle or a group of muscles షాక్‌వలె తగులు కండర ఈడ్పులు. **epileptic m.**, seen in epileptics అపస్మారములో పై ఈడ్పులు.

**myocyte** a muscle cell పేశీకోశకము, కండరకణము.

**myology** knowledge about muscles పేశీ విజ్ఞానము.

**myoma** a benign tumour of the muscle కండరముయొక్క నిరపాయ కంతి.

**myomectomy** enucleation of uterine fibroid(s) గర్భాశయ ఫైబ్రాయిడ్(ల)ను శస్త్రచికిత్సద్వారా తీసివేయుట.

**myometrium** the muscle of the uterus గర్భసంచి కండరము, గర్భకోశ పేశి.

**myopathy** any muscle disease, కండరము సుస్తి. pain, weakness and wasting of skeletal muscles కండరముల నొప్పి, బలహీనత, చిక్కిపోవడం. **corticosteroid induced m.**, Prednisolone is the sheet anchor of treatment for some diseases now-a-days; prolonged use of prednisolone leads to this myopathy. ఈ రోజుల్లో ప్రెడ్నిసొలోన్ అనే మందు కొన్ని దీర్ఘవ్యాధుల్లో దీర్ఘకాలంపాటు

వాడుట కద్దు – ఈ బేరంలో ఈ సుస్తి తప్పదు మరి! **thyrotoxic m.,** accompanying hyperthyroidism థైరాయిడ్ తీక్షణతతో/లో జబ్బు.

**myopia** near-sightedness, short-sightedness; a state of the eye vision wherein near-vision is good but far-vision is poor హ్రస్వ దృష్టి, నికటదృష్టి, సమీపదృష్టి: వస్తువు దగ్గర పెట్టుకుంటే బాగా కనపడు తుంది. చదివే పేజి/పుట దగ్గరగా పెట్టుకుంటే బాగా కనబడుతుంది – అనగా ఈ పైవి దూరముగా పెట్టుకుంటే దృష్టి/చూపు మాంద్యముగా ఉంటుంది. [*in contr.* hypermetropia భిన్న. దీర్ఘదృష్టి].

**myosarcoma** malignant tumour of a muscle కండరముయొక్క అపాయకరమైన కంతి.

**myosin** a protein in the myofibril కండర సూక్ష్మతంతులలోని ప్రోటీన్.

**myositis** inflammation of a voluntary muscle కండర శోథము: నియంత్రిత కండరము యొక్క 'నొప్పి వాపు'. **m. fibrosa,** connective tissue intrusion into the muscle బంధన కణజాలము కండరములోనికి జొరబడుట. **multiple m.,** polymyositis పెక్కు/పలు కండరముల శోథము/'నొప్పి వాపు'. **m. ossificans,** (i) deposition of active bone cells in a muscle, usually a complication of maltreated fracture, say premature practice of movements and massage, instead of giving rest to the fractured site కండరంలో చురుకైన ఎముక కణములు చేరుట – ఇది ఎట్లా సంభవిస్తుందంటే, గమనించండి: ఎముక విరిగిన తర్వాత కువైద్యము/మోటువైద్యం పర్యవసానం వలన అనగా విశ్రాంతినీయకుండా విరిగిన ప్రాంతాన్ని కదలించడం, ఆ ప్రాంతంలో మర్దన/మాలిష్ చేయడం. (ii) complication of mismanaged fracture of bone; stiff joint due to deposition of calcium around ఎముక విరిగిన సందర్భంలో దానికి కువైద్యము ఫలితంగా, కీలుచుట్టూతా సున్నం చేరినందువలన కీలు గట్టిపడటం.

**myospasm** muscle spasm కండరము ఈడుపు.

**myotonia** difficulty in relaxing the group of muscles after effort, *e.g.* The patient, to start with initiates normally the act of shaking hands, but indulges in the grip unable to relax the same. కండరములు వాటి విధి నిర్వర్తించిన తర్వాత అనగా

ముడుచుకున్న తర్వాత ఆ బిగువును సడలించలేకపోవుట, ఉదా. కరచాలనము ప్రారంభించిన పిమ్మట ఆ చేతిపట్టును వదలలేకపోవుట. **m. atrophica,** dystrophia myotonica, myotonia associated with wasting of muscles మైయొటోనియాతోపాటు కండరముల క్షీణత.

**myringa** ear drum, tympanic membrane కర్ణభేరి, చెవిగూబ.

**myringitis** inflammation of the eardrum కర్ణభేరీయొక్క శోథము/ 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**myringomycosis** fungus infection of the eardrum కర్ణభేరీయొక్క ఫంగస్ సంపర్కము.

**myringotomy** surgical incision into the eardrum కర్ణభేరీకి కత్తిగాటు.

**myxoedema** or **myxedema** hypothyroidism, *see/చూడండి* thyroid. థైరాయిడ్ మాంద్యము. non-pitting oedema in a hypothyroid state marked by mental hebetude (dullness); thick lips, retarded voice and sensitivity to cold, *etc.* వేలుతో నొక్కితే (కాలు బొమికమీద) గుంట పడకపోవటం, స్తబ్దత, బుద్ధిమాంద్యం; ఉబ్బిన పెదవులు, మాట/ఉచ్చారణమాంద్యము, చలి భరించలేకపోవుట, మొ. **congenital m.,** cretinism, a child cretin కురుచ, మూర్ఖ, బాల్య మందకొడి.

**myxoid** resembling mucus శ్లేష్మకము పోలినది.

**myxoma** [myxomatous *adj.*] a benign tumour composed of primitive connective tissue cells and stroma resembling mesenchyme ఆదిమ బంధనకణజాల కణములు మరియు మధ్యభ్రూణ కణజాలము (mesenchyme) ను పోలిన స్ట్రోమము కలిసిన నిరపాయకంతి.

**myxomatous degeneration** mucoid degeneration of tissues, *see/చూడండి* mucoid. మిక్సోమాలాంటి కణజాల క్షీణత.

**myxoviruses** viruses of influenza group ఇన్ఫ్లూయన్జా వర్గం వైరస్‌లు.

# N n

**naevus** or **nevus** indelible birthmark మాసిపోని పుట్టుమచ్చ, చెరిపివేయలేని చర్మచిహ్నము, తుడిపి/చి వేయలేని త్వక్కు గుర్తు.

**nail biting** a habit with psychosomatic background which causes great tension or anxiety and allures the onlookers గోళ్ళు కొరుకుట: మనస్తత్వశారీరక వాసన/అంశ నేపథ్యములో, ఆదుర్దాతో కూడిన అలవాటు. ఈ అలవాటు చూచేవారికి ఆకర్షణ కల్గిస్తుంది.

**naked eye structure** *abbr. naked eye str.* ప్రత్యక్ష.చూ. that which can be seen with the naked eye, *e.g.* an organ ప్రత్యక్షముగా చూడబడేది: ఉత్తకంటికి (సూక్ష్మదర్శిని సహాయము లేకుండా) కనబడేది, ఉదా. అవయవం, అంగం [*in contr.* microscopic structure భిన్న. సూక్ష్మదర్శినిలో చూడబడేది].

**nanometre** one thousand millionth of a metre ($10^{-9}$) *abbr.* nm.

**nape** the nucha; the back of neck మూపు: మెడ వెనుక.

**napkin rash** nappy/diaper rash. irritation to urine, faeces or allergy to contact substances at the area covered by napkin (underwear at baby's bottom) దూదిపెట్టి కుట్టిన డ్రాయరు వేసిన ప్రాంతంలో పసిపిల్లల మలమూత్రముల రాపిడికి లేదా స్పర్శపదార్థములకు ఎల్లర్జివలన, దద్దుర్లు (rash) రావచ్చును. *figur.* see that the nappy doesn't become a nettle!

**narcissism** abnormal and excessive self-love or admiration about oneself స్వరూప కాముకత: తన అందాన్ని తానే ప్రేమించుకొనటం; తన అందాన్ని గూర్చి తానే మురిసిపోవటం; తన్నుగురించి తాను పొగడుకోవటం.

**narcolepsy** periodic irresistible episodes of sleep తరచుగా సంభవించు, అడ్డగింపనశక్యమైన నిద్రావస్థ తెరలు/ఘట్టములు (అలంకార. కుంభకర్ణుని నిద్రకాదు సుమా!).

**narcosis** state of unconsciousness మత్తుదశ, స్పృహతప్పిన స్థితి.

**narcosynthesis** treatment using narcotics నిద్ర లేదా మైకము/మత్తు కలిగించు మందులతో చికిత్స చేయుట.

**narcotic** an agent/drug that produces stupor మత్తుమందు, మాదకద్రవ్యము: మైకము/మత్తు కలిగించు వస్తువు లేదా మందు.

**nares** the nostrils ముక్కు కుహరములు, నాసికారంధ్రములు, ముక్కు రంధ్రాలు.

**nasal** relating to the nose ముక్కుకు సం. **nasals: n. bones** నాసికాస్థులు. **n. polyps** నాసికార్శములు. **n. septum** నాసికా విభాజకం.

**nasogastric tube** a flexible tube passed into the stomach via/through the nose ముక్కు కుహరముద్వారా అన్నాశయములోనికి పోనిచ్చెడు వంపు తిరగగల గొట్టము. uses: i) for feeding ii) for aspiration of contents of stomach ఉపయోగములు: i) ద్రవరూప ఆహారమిచ్చుటకు ii) అన్నాశయములోని ద్రవములు బయటకు లాగుటకు.

**nasolabial** pertaining to the nose and upper lip నాసికౌష్ఠ: ముక్కు, పైపెదవికి సం. **n. fold,** నాసికౌష్ఠ పార్శ్వవక్ర త్వచము: పైపెదవిపైన, ముక్కుప్రక్కన ఉన్న చర్మపు మడత.

**nasolacrimal** relating to the nose and lacrimal duct నాసిక మరియు బాష్ప వాహికకు సం. **n. duct** నాసికాశ్రునాళము.

**nasopharyngeal cavity** naso-pharynx నాసికాగ్రసని గుహ.

**nasopharyngitis** inflammation of the nasopharynx, an accompaniment in common cold రొంపను అనుసరించియుండు నాసికాగ్రసనియొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు'.

**natal** 1. pertaining to birth పుట్టుకకు సం. **ante n.,** antenatal care, prenatal care, care bestowed before delivery ప్రసూతిపూర్వ; ప్రసవమునకు ముందు తీసుకొను శ్రద్ధ/జాగ్రత్తలు. **neo n.,** concerning the newborn, upto 28 days after birth శిశువు జన్మించిన వెంటనే మరియు నాలుగువారాలవరకు శ్రద్ధ. **post n.,** postnatal care, care bestowed after delivery ప్రసవము పిమ్మట తీసుకొను శ్రద్ధ. 2. pertaining to nates (buttocks) పృష్ఠభాగమునను్న పిర్రలకు సం.

**natural immunity** inborn resistance to infection, *see/ చూడండి* immunity. సహజముగా/స్వాభావికమైన పుట్టుకతో వచ్చిన వ్యాధినిరోధకశక్తి (immunity). [*Cf.* acquired immunity *తారత.* ఆర్జిత విరోధకశక్తి].

**Nature** 1. force(s) controlling the physical world ప్రకృతి. 2. a scientific journal శాస్త్రవార్తాపత్రిక.

**naturopathy** the art of mustering Nature's boons on mother Earth to restore and maintain health; playing sane and safe with the disease ప్రకృతివైద్యము: ప్రకృతి మానవాళికిచ్చిన వరములను సద్వినియోగపరచుతూ ఆరోగ్యము సరిదిద్దుట, కాపాడుట; రుగ్మతను యుక్తితో, శక్తితో తొలంగదీయుట. 1. judicious intake of partly cooked/raw vegetables; milk, breathing fresh unpolluted air, access to clean potable water, adequate rest, regulated exercises - such healthful ways of living పృథ్వి మనకందించిన కూరగాయలు కొంతశాతంవరకు ఉడకబెట్టి/కొన్ని పచ్చివి మోతాదుగా తినడం; పాలు త్రాగడం, కలుషితముగాని తాజా గాలి పీల్చడం, శుభ్రమైన నీరుత్రాగడం, తగు విశ్రాంతి, కావలసిన వ్యాయామము – ఇలాంటివి ఆరోగ్య జీవన మార్గాలు. 2. sponge bath, cold compress, wet pack, hot hip bath, hot foot bath, poultice, *etc.* ముతక గుడ్డతో ఒడలు తుడవటం, వేదనకు శీతల వస్త్రం, వేన్నీళ్ళతో కటిస్నానము, తుంటికి మరియు కాళ్ళకు ఉడుకునీళ్ళ కాపడం, పిండికట్టు వగైరా సాధనలు.

**nausea** an unpleasant urge to vomit వికారము, వాంతి అయేటట్లుండటం; వమనము/వాంతి చేసుకొనవలెనను తొందర. **n. gravidarum,** *see*/చూడండి morning sickness. వేవిళ్ళు.

**navel** the umbilicus నాభి, బొడ్డు. 1. *figur.* a symbol of sexism, అలంకార. గుంటకు గుంటడిని ఆకర్షించే శృంగారగుంట. 2. *figur.* a seat in the scaphoid abdomen అలంకార. ఉదరనావ సారథి స్థానము.

**nebula** corneal opacity నీహారము, నీహారిక, శుక్లపటలముమీద అపారదర్శకమైన/కాంతినిరోధక మచ్చ, గ్రా. కంటిపువ్వు.

**nebulizer** an atomizer, a device for transforming a drug into spray, *see*/చూడండి aerosol. మందును జల్లుగా చేసి/మార్చి పీల్చే సాధన. a treatment modality for asthma ఉబ్బసం వ్యాధికి ఒక చికిత్సావిధానం.

**neck** constricted portion below the head తల క్రింద కుంచించబడిన భాగము, మెడ, కంఠము, గ్రీవము. **n. of femur** ఊర్వస్థియొక్క గ్రీవము.

**necrobiosis** natural degeneration and death of a cell కణంయొక్క స్వాభావిక క్షీణత, మృతి.

**necromancy** 1. prophecy through communication with the dead జోస్యము, భూతవైద్యం. 2. black magic మంత్రాలతో వైద్యం.

**necrophilia** 1. obsessive interest, especially of an erotic kind, towards/in dead bodies లైంగిక దృష్టితో మృతదేహాలమీద వ్యామోహం. 2. morbid desire for a man to perform sexual act with a dead woman శవమైథునం.

**necrophobia** [Greek *nekros.* dead, corpse; phobia=fear]. fear of corpses శవాలంటే భయం.

**necropsy** autopsy; postmortem examination, examination of the body and organs after death శవపరీక్ష: చనిపోయిన తర్వాత పీనుగును కోసి పరీక్షచేయుట [*in contr.* biopsy భిన్న. బ్రతికి ఉన్నప్పుడు కణజాల పరీక్ష].

**necrosis** process of cell death in a tissue ధాతువిచ్ఛిన్నత, ధాతు నిర్జీవత, కణనాశము, కణక్షయము, కణజాలములో కణముల మృతి/చచ్చు, ఊతకక్షయము.

**necrospermia** a state of dead or immotile spermatozoa in the semen వీర్యంలో మృత లేదా చలనరాహిత్యమైన శుక్రకణములుండుట.

**necrotizing** producing necrosis కణముల మృతి కలుగజేయు.

**Neisseria** a genus of gram negative bacteria ఒక ప్రజాతి బాక్టీరియా. *N. gonorrhoea* causes gonorrhea గనేరియా తగిలించు సూక్ష్మక్రిమి. *N. meningitidis* produces meningitis మెదడు పొరకు సంభవించు సూక్ష్మజీవి సంపర్కము.

**Nemathelminthes** nematodes, worms of the phyla Nemathelminthes. 1. a roundworm గోళక్రిమి: వానపాము లాంటి గుండ్రటి పరిధిగల పురుగు. 2. a roundworm infesting the intestine of man, *(a) Ankylostoma duodenale,* hook worm

కొక్కెముగల పురుగు. *(b) Ascaris lumbricoides* మనిషి పేగులో ఉండి బాధించు గుండ్రటి పురుగు; ఏలికపాములు, నట్టలు. *3. Enterobius vermicularis* నులిపురుగు. *4. Trichiuris trichiura,* whipworm, infesting the intestine of man మనిషి పేగులో ఉండే కొరడా పురుగు. 5. tissue parasites కణజాలములలోనుండు పరాన్నజీవులు (i) *Dracunculus medinensis,* guinea worm నారికురుపు కలిగించే పురుగు (ii) *Filaria bancrofti or Wuchereria bancrofti* ఫైలేరియా జబ్బు కలుగజేసే పురుగులు.

**neomycin** an antibiotic to treat skin and eye infections చర్మమునకు, కంటికి సోకే సూక్ష్మక్రిమి సంపర్కమునకువాడే మందు.

**neonate** a baby upto 28 days పసికందు: పుట్టినప్పటినుండి నాలుగువారాలలోపు వయస్సుఉన్న శిశువు; నెలనిండని శిశువు.

**neoplasm** any abnormal new growth, tumour కంతి: అస్వస్థత సూచించు నూతన పెరుగుదల అనగా ఎదిగే కంతి. **benign n.,** benignant, not malignant నిరపాయమైన, అపాయకరమైన శక్తిలేనిది. **malignant n.,** fatal,- అపాయకరమైనశక్తిగల, మారణశక్తిగల, ప్రాణాంతకమైన, ప్రాణహానికరమైన.

**nephralgia** pain in the kidney కిడ్నీలో నొప్పి.

**nephrectomy** surgical removal of a kidney అపరేషన్ చేసి కిడ్నీని తీసివేయుట. **in disease:** destroyed kidney జబ్బులో: నశించిన మూత్రపిండం. **in health:** for donation to a needy patient, *i.e.* kidney transplantation ఆరోగ్యములో: అక్కర ఉన్న రోగికి దానము చేయుటకు.

**nephritis** inflammation of kidneys మూత్రపిండాల శోథము/వాపు. diminished quantity of urine, albuminuria; marked by constitutional symptoms like fever, bloating of face first, legs next and gradually entire body మూత్రవిసర్జన నిలిచిపోయి, మూత్రంలో అల్బుమిన్ నిండిఉండి; జ్వరము, అస్వస్థత, ముఖంవాపుతో మొదలిడి, కాళ్ళకు వాపు వచ్చి, క్రమేణ శరీరం అంతా ఉబ్బిపోతుంది. The flow of urine is reduced from the normal jet to drops in the child; the albumin-loaded drops of urine get solidified after passing on

the heated floor, shining like a rupee coin (due to solidified albumin). పిల్లవాడిలో మూత్రము మామూలుగా ధారగా కారకుండా చుక్కలుచుక్కలుగా పడుతుంది. ఈ చుక్కలు నేలమీద పడగానే నేలవేడికి చుక్కలలోనున్న అల్బుమిన్ గడ్డకట్టి రూపాయిబిళ్ళలాగా మెరుస్తుంది.

**nephroblastoma** an embryonal adenomyosarcoma, Wilms' tumour. malignant neoplasm of the kidney in children, occurring before the fifth year in 75% of cases, giving rise to hypertension and haematuria అయిదేళ్ళలోపు పిల్లల్లో పుట్టే అపాయకరమైన కంతి; బి.పి. పెరుగుతుంది, మూత్రంలో రక్తం పోతుంది.

**nephrolithiasis** presence of stones in the kidney కిడ్నీలో రాళ్ళు ఉండటం. This causes pain in urination. దీనివలన మూత్రకృచ్ఛ్రము అనగా విసర్జన చేయునప్పుడు కలిగే నొప్పి/బాధ.

**nephrolithotomy** incision into the substance of the kidney for removal of stones రాళ్ళు తొలగించుటకై కిడ్నీలోనికి గాటుపెట్టి శస్త్రవైద్యము చేయుట.

**nephrology** study of kidney diseases కిడ్నీ జబ్బుల శాస్త్రము.

**nephron** the structural and functional unit of the kidney; about 1.3 million in each, serving the purpose of formation of urine మూత్రపిండంలో నిర్మాణక మరియు విధినిర్వాహక ప్రమాణము. ఒక కిడ్నీలో దాదాపు 1.3 మిలియన్ సంఖ్యకలిగి ఉంటాయి; వీటివిధి మూత్రమును తయారుచేయుట. *micro.str.* సూక్ష్మ.చూ. the parts of the nephron: U shaped – ascending limb of Henle, loop of Henle, descending limb of Henle and glomerulus (tuft of blood capillaries) above, *see/చూడండి* glomerulus, kidney. నెఫ్రాన్‌లోని భాగములు: U ఆకారములో ఉంటుంది. హెన్లి ఎగుడు సూక్ష్మనాళిక, హెన్లి లూపు, హెన్లి దిగుడు సూక్ష్మనాళిక మరియు పైన గ్లామర్యులస్ (రక్తకేశనాళికల గుత్తి). *curiosity:* The total length of the tubules (tiny tubes) is over 40 miles long! *జిజ్ఞాస/వింత:* ఈ కుల్యకల మొత్తం పొడవు 40 మైళ్ళపైన!

**nephropathy** disease of kidneys మూత్రపిండాల సుస్తి.

**nephroptosis** 1. downward displacement of the kidney మూత్ర పిండం కిందకు జారుట. 2. floating kidney, abnormally mobile kidney, *i.e.* not fixed as a normal one అతిగా కదిలే కిడ్నీ, అనగా మామూలు పరిస్థితిలోలాగా స్థిరముగా ఒకచోట స్థాపితమైనది కాదు.

**nephrosclerosis** hardening of the kidney arterioles, renal tubules and glomeruli కిడ్నీ ధమనికలు, కిడ్నీలో సూక్ష్మనాళికలు, గ్లొమెర్యులై గట్టిపడుట.

**nephrosis** degenerative changes in the renal tubules, *e.g.* **amyloid n.**, accumulation of amyloid material ఒక రకమైన మూత్ర పిండాల వ్యాధి, కిడ్నీ సూక్ష్మనాళికలలో క్షీణదశ, శిథిలపరిణామము, ఉదా. ఎమైలాయిడ్ అను పదార్థము చేరుట.

**nephrotic syndrome** characterized by massive albuminuria, hypoalbuminemia, hyperlipidemia and oedema of the body వ్యాధి లక్షణములు: మూత్రములో అల్బుమిన్ నిండియుండుట, రక్తంలో అల్బుమిన్ తక్కువగుట, రక్తంలో క్రొవ్వు పదార్థములు పెరుగుట మరియు శరీరమంతా వాపు.

**nephrotomy** an incision into the substance of the kidney కిడ్నీలో కత్తిగాటు.

**nephrotoxic** toxic to kidney cells, destroying kidney cells కిడ్నీ కణములకు విషపదార్థము – వాటిని చంపునది.

**nephrotoxin** an agent/drug that kills the kidney cells కిడ్నీ కణములను హతమార్చు వస్తువు/మందు. Nephrotoxicity is the adverse side effect of certain drugs, *e.g.* Gentamicin. కిడ్నీ చెరుపును కలుగజేయు కొన్ని మందులు, ఉదా. జెంటామైసిన్ యొక్క వాడుకవలన కలిగిన దుష్పరిణామము, అవాంఛనీయ స్థితి.

**nerve** 1. a rope-like bundle of nerve fibres which acts as a pathway for conducting nerve impulses నాడి, నరము, మజ్జాతంతువు, తంత్రి, తాంత్రికము, నాడీతంతువుల పుంజము: నాడీ ప్రచోదనములను జరిగించు నాడీతంత్రులుగల తాడులాంటి తంత్రులకట్ట. The nervous system is comparable to a telephone network, the nerve is the cable (telephone wire) and brain, the telephone exchange. నాడీవ్యవస్థ

టెలిఫోన్ వ్యవస్థలాంటిది; నరము టెలిఫోన్ వైర్, మెదడు టెలిఫోన్ కేంద్రస్థానము. Basically there are three types of nerves నరములు మూడురకములు: (a) **sensory nerve** afferent nerve which carries impulses like pain, temperature (messages) from skin, organs, tissues and transmits them to the brain జ్ఞానవాడి, అభివాహినాడి – నొప్పి, వేడి, శీతలములాంటి జ్ఞానప్రచోదనములను (వర్తమానములను) చర్మము, అవయవములు మరియు కణజాలములనుండి మెదడునకు పంపు దారిమార్గము. (b) **motor nerve** efferent nerve which transmits impulses (orders) from the brain to the muscles and makes them act చాలకనాడి, అపవాహినాడి – మెదడు ప్రచోదనములను (ఉత్తరువులను) జారీచేసి, వాటిని కండరాలకు పంపే దారిమార్గము; అప్పుడు కండరములు పనిచేస్తాయి. (c) **mixed nerve** contains both sensory and motor nerve fibres మిశ్రమనాడిలో అభివాహి నాడీతంత్రులు అపవాహినాడీతంత్రులు కలిసి ఉంటాయి. We compared the nerve to a cable (telephone wire). In the same manner as a telephone wire conducts both incoming and outgoing calls, the mixed nerve conducts afferent messages and efferent orders. నాడిని టెలిఫోన్ వైర్‌తో పోల్చాము; ఎట్లాగైతే ఇందులోనుంచి మనం అందుకొనే (వినే) కాల్ మరియు మనం మాట్లాడే కాల్ పంపబడుతవో, అట్లాగే ఈ మిశ్రమనాడిలో అభివాహి వర్తమానములు అపవాహి ఉత్తరువులు పంపబడుతాయి. **cranial n's,** 12 pairs of cranial nerves (right and left) some sensory, some motor and some mixed 12 జతల (కుడి, ఎడమ) కపాలనాడులు – ఇందులో కొన్ని అభివాహినాడులు, కొన్ని అపవాహినాడులు మరియు కొన్ని మిశ్రమనాడులు. **peripheral n's,** any nerve outside the central nervous system (brain and spinal cord): some of the pairs of cranial nerves and all 31 pairs of spinal nerves (right and left) పరిధీయ నాడులు: కేంద్రనాడీవ్యవస్థ (మెదడు మరియు వెన్నుపాము)కు వెలుపల ఉన్నవి; కపాలనాడులలో కొన్ని జంటలు మరియు 31 జతల (కుడి, ఎడమ) కశేరునాడులు. **spinal n's,** 31 pairs of spinal nerves (right and left). These are mixed nerves. 31 జతల (కుడి, ఎడమ) కశేరునాడులు. ఇవి మిశ్రమనాడులు. details: cervical 8 pairs,

thoracic 12 pairs, lumbar 5 pairs, sacral 5 pairs and coccygeal 1 pair వివరాలు: గ్రీవ 8 జతలు, వక్షస్థల 12 జతలు, కటి 5 జతలు, త్రిక 5 జతలు మరియు అనుత్రిక 1 జత. **sympathetic n's,** any nerve of the sympathetic nervous system, *see/చూడండి* nervous system. స్వతంత్రనాడీవ్యవస్థలోని నాడి. **vasomotor n.,** nerve controlling the lumen/size of the blood vessel, whether as a vasoconstrictor or vasodilator రక్తనాళముయొక్క పరిమాణమును అదుపులో పెట్టు నరము అనగా నాళమును సంకోచించు లేదా విస్తరించు గుణము కలది. 2. **n. cells** నాడీకణాలు.. **n. deafness** నాడీ బధిరత, నాడి చెవుడు. **n. fibres** నాడీ తంత్రులు. **n. ganglia** నాడి ముడులు. **n. grafting** నాడి అంటుగట్టటం. **n. impulse** నాడీ ప్రచోదనము. **n. plexus** నాడీప్లక్షము. **n. root** మజ్జాతంతు మూలము. **n. supply** నాడీ ప్రసారము, నాడీ ప్రసరణ.

**nervous** 1. neural, pertaining to a nerve నాడికి సం. 2. excited behaviour ఆందోళన వ్యక్తపరచు ప్రవర్తన. **n. breakdown,** *colloq.* mental disorder or depression మానసిక రుగ్మత ఏదైనా, లేక దిగజారుట, వాడు.భా. అలజడి. **n. debility** నరముల బలహీనత.

**nervous system** system of nerves మజ్జాతంతు సంఘాతము, నాడీవ్యూహము, నాడీవ్యవస్థ. Basically there are three types: ముఖ్యముగా మూడు రకములు: **I. the central nervous system** the brain and spinal cord కేంద్ర నాడీవ్యవస్థ అనగా మెదడు మరియు వెన్నుపాము. **II. the peripheral nervous system** some cranial nerves and the nerves to and from the spinal cord పరిధీయ నాడీవ్యవస్థ: కొన్ని కపాలనాడులు మరియు వెన్నుపామునకు వెళ్ళే, వెన్నుపాము నుండి వచ్చే నాడులు. **III. autonomic nervous system** స్వయంచోదిత నాడీ వ్యవస్థ. autonomous=self governing స్వపరిపాలన దక్షతగల. a system not under control of the will but controls the vital activity of internal organs. Thus with its influence, the heart beats, respiration goes on, food is digested, urine and motion formed in the body without our conscious effort. మన సంకల్పముతో నిమిత్తము లేకుండానే ప్రాణాధారమైన అవయవములు

పనిచేస్తుంటాయి. గుండెకొట్టుకుంటూ ఉంటుంది, ఊపిరి ఆడుతూ ఉంటుంది, తిన్నతిండి జీర్ణమవుతూ ఉంటుంది, మలమూత్రములు తయారవుతూనే ఉంటాయి – వీటికి మన కృషి అవసరం లేదు, ఇదియే స్వపరిపాలనా వ్యవస్థయొక్క ఆధిపత్యము. This is divided into two divisions ఇది రెండు భాగములుగా విభజింపబడినది. **(a) sympathetic nervous system** సహానుభూత లేదా స్వతంత్ర నాడీవ్యవస్థ. the nerve chains/trunks one on each side of the vertebral column from the base of the skull to the coccyx వెన్నుపూస (vertebral column) కు ఇరువైపుల పుర్రె అడుగునుండి దిగువవరకు (అనుత్రికము వరకు) ఉన్న నాడీకాండములు. Sympathetic nerves lead to salivary glands, liver, heart, stomach, intestines, urinary bladder, *etc.* స్వతంత్రనాడులు లాలాజలగ్రంథులు, కాలేయము, గుండె, అన్నాశయము, పేగులు, మూత్రాశయము, మొ. చోట్లకు వెళ్తాయి. **(b) parasympathetic nervous system** సహస్వతంత్ర నాడీ వ్యవస్థ, పరానుభూత నాడీవ్యవస్థ. (i) the vagus nerve (vagus=wandering సంచరించు). either of a pair of cranial nerves leading to the larynx, lungs, heart, liver, pancreas and most of the abdominal organs వేగస్‌నాడి, జతలోని ఒక నాడి: శబ్దపేటిక, ఊపిరితిత్తులు, గుండె, లివర్, క్లోమము మరియు పెక్కు ఉదరకుహర అవయవములకు సంచరిస్తుంది (ii) the pelvic nerve sends branches to the organs in the pelvis శ్రోణిలోని అవయవములకు శాఖలు పంపే శ్రోణి నాడి. These two divisions, *viz.* sympathetic and parasympathetic systems have opposite effects on the same body organ, *i.e.* the two sets normally create a balance. Both are influenced by emotions. ఈ రెండు వర్గములు అనగా స్వతంత్రనాడీ వ్యవస్థ మరియు సహస్వతంత్రనాడీ వ్యవస్థ ఒకే అవయవము మీద భిన్నఫలములనిస్తాయి, ఆ అవయవము తన విధి నిర్వహించుటలో సరితూగునట్లు చేస్తాయి. ఈ రెండూ ఉద్రేకమునకు లోనవుతాయి. In fear or rage, the sympathetic nerve reddens the eye, dilates the pupil whereas the parasympathetic nerve constricts the pupil భయము లేదా కోపములో స్వతంత్రనాడీ ప్రభావమువలన కళ్ళు ఎర్రబడి, కనుపాప విస్తరిస్తుంది;

సహానుభూతిక నాడీ ప్రభావమువలన కనుపాప ముడుచుకుంటుంది. Fear causes the sympathetic system to speed up the heart, while parasympathetic system slows the heart. భీతివలన గుండె దడ, గుండె ఎక్కువగా కొట్టుకొనడం కద్దు – ఇది స్వతంత్రనాడీ వ్యవస్థ ప్రభావము. కాని, సహాస్వతంత్ర నాడీ వ్యవస్థ ప్రభావమువలన గుండె వేగము తగ్గుతుంది. Fear produces dry mouth due to sympathetic activity. When one is hungry and smells food or sees food, one's mouth waters due to parasympathetic stimulation of salivary glands. భయంలో స్వతంత్రనాడి చురుకుదనమువలన నోరు ఎండుకుపోతుంది. మరి, ఆకలిగొన్నప్పుడు వంటశాలనుండి వచ్చు వాసనలతో, పక్కవాడు తింటుంటే ప్లేటు చూస్తున్నప్పుడు, నోరూరుతుంది – ఇది సహాస్వతంత్రనాడి చురుకుదనమువలన లాలాజల గ్రంథులు నోట్లోకి లాలాజలమును కార్చినందువలన జరిగిన ప్రక్రియ.

**nettle-rash** Nettle is a wild plant. When its leaves are touched, it produces itching దురదగుంట ఆకు, దురదగొండి యను చెట్టు ఆకు తగిలితే దురద పుట్టుంది. దీనిని 'కుక్కముండ్లు' రోగం అనికూడా అంటారు.

**neuralgia** nerve pain మజ్జాతంతువేదన. paroxysmal painful disorder of one or more nerves ఒకటి లేదా పెక్కు నాడుల వేదన – ఇది తెరలుతెరలుగా తటస్థించునది. **postherpetic n.**, pain after herpes సర్పి తదుపరి వచ్చే నాడీవేదన. **trigeminal n.**, tic douloureux త్రిధారానాడీవేదన.

**neurapraxia** temporary loss of function in peripheral nerve fibres నాడీతంతువులలో తాత్కాలిక విధిరాహిత్యం.

**neurasthenia** nervous exhaustion నాడీస్థితి అలుపు, నరాల బలహీనత.

**neurectomy** excision of portion of a nerve నాడిలో కొంతభాగం కత్తిరించుట.

**neurilemma** thin membrane covering the myelin sheath of some nerves, axons తంత్రికాచ్ఛాద(న)ము: కొన్ని నాడులను, తంత్రికాక్షములను ఆవరించియుండు మైయలిన్ తొడుగుమీది సూక్ష్మపొర.

**neuritis** inflammation of a nerve/nerves మజ్జాతంతుశోథం, నాడీ శోథము: నరాల వాపు, తీపు. This may lead to tingling and numbness in the territory supplied by the nerve. ఆ నరముయొక్క అధిపత్యములో నున్న ప్రాంతంలో తిమ్మిర్లు, బండబారిపోవుట (అనగా స్పర్శజ్ఞానము సన్నగిల్లుట) ఇత్యాది లక్షణములు ఎదుర్కొనగలరు. **generalised n.,** of many nerves, also called multiple neuritis, polyneuritis, peripheral neuritis: in vitamin B deficiency, alcoholism, diabetes mellitus, prolonged illness, leprosy, heavy metal poisoning (by use of lead, arsenic products, *etc.*) బహుళనాడివాపు, పరిధీయ నాడివాపు; కారణములు: విటమిన్ బి లోపము, కల్లు మరియు సారాయి త్రాగుడు, మధుమేహంవ్యాధి, దీర్ఘరుగ్మతలు, కుష్ఠురోగము; సీసము, పాషాణములాంటి లోహపదార్థముల వాడుక, మొ. **localised n.,** of a single nerve, *e.g.* (a) sciatica, inflammation of sciatic nerve, which runs on the back of the lower extremity ఏకనాడివాపు, *ఉదా.* తొడవెనకాల పయనించే ఆసన (sciatic) నాడి వాపు. (b) optic neuritis దృష్టినాడియొక్క దోషము. **traumatic n.,** causalgia నాడికి గాయము తగిలినప్పుడు నొప్పి.

**neuroanatomy** anatomy of the nervous system నాడీవ్యవస్థ నిర్మాణశాస్త్రం.

**neuroblastoma** a malignant tumour usually occurring in infants and young children and usually involving sympathetic system (sympatheticoblastoma) ఎక్కువగా చంటి/చిన్నపిల్లలలో సంభవించు, ముఖ్యముగా స్వతంత్రనాడీవ్యవస్థనుండి బయులువెడలు అపాయకరమైన కంతి. *figur.* 'a tumuor which blasts (the body)' *అలంకార.* (తనువును) ధ్వంసంచేసే కంతి; (తనువును) తొలిచివేసే కంతి.

**neurodermatitis** irritation of nerve endings and skin, pruritus on a background of psychogenic diathesis మానసిక వికృతి యొక్క నేపథ్యములో/తో నాడికొనల మరియు చర్మముయొక్క రేగుట/రేపుట, దురదలు.

**neurofibril** a microscopic delicate thread in a nerve cell నాడీ కణములోని సూక్ష్మతంతువు, తాంత్రికా తంతుక(ము).

**neurofibroma** a tumour of peripheral nerves with fibrous texture పరిధీయనాడుల తంతుయుత కంతి. multiple neurofibromatosis (all over the body) చర్మంమీద పైరకమైన పెక్కు కంతులు; గోళీకాయల్లాగా త్వక్కును అంటిపెట్టుకుని ఉంటాయి.

**neurogenic** arising from within the nervous system నాడీ వ్యవస్థలోనుండి బయలుదేరు. **n. bladder,** retention, incontinence or dribbling of urine due to interference in the nerve control of the bladder మూత్రాశయముయొక్క నాడి అదుపులో లోపమువలన మూత్రం నిల్వజేయబడుట, మూత్ర విసర్జన ఆపుచేయలేకపోవుట లేదా మూత్రం బొట్లుబొట్లుగా పడుట. We see this in injuries of the spinal cord at a lower level. వెన్నుపాము దిగువ ప్రాంతంలో క్షతము/అపవ్యవస్థ మూలకంగా ఈ దుర్ఘటన వాటిల్లుతుంది.

**neuroglioma** a tumour ఒక కంతి.

**neurologist** specialist in neurology నాడీవ్యవస్థ శాస్త్రనిపుణుడు.

**neurology** 1. knowledge about the nervous system నాడీవ్యవస్థ శాస్త్రము/విజ్ఞానము. 2. Neurology, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**neuroma** a tumour ఒక కంతి. **acoustic n.** tumour on the eigth cranial (auditory) nerve 8వ కపాల (శ్రవణ) నాడిమీద కంతి.

**neuromuscular** pertaining to nerves and muscles నాడులకు, కండరములకు సం. **n. junction,** myoneural junction. నాడీ-పేశి లేదా పేశీ-నాడి సూక్ష్మతంతుక సంధి.

**neuron(e)** nerve cell నాడీకణం. *micro. str.* సూక్ష్మ.చూ. nerve cell, basic building blocks of the nervous system/structural and functional unit నాడీకణము; నాడీవ్యవస్థ అను కట్టడములోని నిర్మాణాత్మక క్రియాత్మక ప్రమాణము. It consists of a cell body, nucleus, cytoplasm and a long fibrous axon with 5 to 7 short processes called dendrites. ఇందులో కణము హద్దు, కేంద్రకము, కణజీవద్రవ్యము, ఒక పొడుగాటి తంత్రికాక్షము (axon) 5 లేక 7 పొట్టిగానుండు తంత్రికాక్షికములు (dendrites) కలవు. **motor n.,** *see/చూడండి* motor neuron. **sensory n.** జ్ఞాన నాడీకణం.

**neuroparalysis** paralysis due to disease of the nerve supplying an area నాడి జబ్బువలన ఆ ప్రాంతంలో పక్షవాతం.

**neuropathy** functional disturbance, usually non-inflammatory in nature నాడీఅపవ్యవస్థ, నాడీవిధినిర్వాహకలోపము, తరచుగా శోథరహిత అనగా వాపుచూపనివి. **alcoholic n.** మద్యపానంవల్ల వచ్చే నాడితెగులు. **diabetic n.**, any type (sensory, motor, autonomic and mixed) associated with diabetes mellitus మధుమేహంవ్యాధిలో ఏదోరకమైన నాడితెగులు (జ్ఞాననాడి, చాలకనాడి, స్వపరిపాలనానాడి మరియు వీటిలో మిశ్రమము). **peripheral n.**, polyneuropathy బహుళనాడీజబ్బు, పలు పరిధీయ నాడీవ్యాధి. **toxic n.**, that due to a toxin విషపదార్థమువలన కలుగు నాడీజాడ్యము.

**neuroplasm** the protoplasm in a nerve cell నాడీకణములోని జీవపదార్థము/జీవద్రవ్యము.

**neurosis** [neuroses *pl.*] minor mental disorder మనోదౌర్బల్యము; స్వల్పతరమైన, తేలికస్థాయిలోనున్న మానసిక తెగులు. **anxiety n.** చింత, ఆతురత/అదుర్దా, వ్యాకులత, మనస్తాపము. **cardiac n.**, anxiety about heart disease గుండెజబ్బు ఉన్నదేమో అనే చింత/బెంగ. **compulsion n.**, obsessive compulsive personality disorder అనియంత్రిత నిర్బంధక మూర్తిమత్వ అపవ్యవస్థ. obsession = to be besieged/overwhelmed with an idea, desire, emotion, *etc.* అనియంత్రిత భావము = ఒక ఉద్దేశ్యము, వాంఛ, ఉద్రేకము, మొ. ఆలోచన పరంపరలో పడి, వాటిలో చిక్కుకొని, వాటికి లొంగిపోవుట. **depressive n.**, *see/చూడండి* depression. దిగజారి, డీలా అయిపోవుట. **hysterical n.**, *see/చూడండి* hysteria. **obsessive-compulsive n.**, urge to verify again and again, *e.g.* after proper locking of a door, to examine the lock again and again to see whether it is locked *ఉదా.* తాళము వేసిన తర్వాత వెంటనే తాళం కప్పను పలుమార్లు (తాళం వేశామాలేదా అని) లాగిచూచుట. **stress n.** మానసిక ఒత్తిడి వలన కలుగు అస్వస్థత.

**neurosurgeon** specialist in the surgery of the nervous system నాడీవ్యవస్థ శస్త్రచికిత్స నిపుణుడు.

**neurosurgery** 1. surgical operations on the brain, spinal cord and nerves నాడీవ్యవస్థ వ్యాధుల శస్త్రవైద్యము; మెదడు, వెన్నుపాము, నాడులు – వీటిమీద ఆపరేషన్లు చేయుట. 2. Neurosurgery, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**neurosyphilis** syphilis of the central nervous system కేంద్రనాడీ వ్యవస్థకు సంక్రమించు కొఱుకు సవాయి రోగము.

**neurotic** 1. relating to or suffering from neurosis మనోదౌర్బల్యము నకు సం. 2. one who suffers from neurosis or functional nervous disorder మనోదౌర్బల్యంగల వ్యక్తి.

**neutropenia** a state of shortage of neutrophils less than 500 per $\mu$l blood ఈ తెల్లరక్తకణములు రక్తంలో తక్కువగుట.

**neutrophil** polymorphonuclear leucocyte, one type of white blood cell, *colloq.* polymorph. ఒకరకమైన తెల్లరక్తకణము.

**nevus** *see/చూడండి* naevus.

**newborn** just born baby, *figur.* new arrival అప్పుడే జన్మించిన శిశువు, *అలంకార.* నూతనవ్యక్తి రాక.

**niche** nick or notch, indentation, recess in a hollow organ, *e.g.* intestine, discernible to the naked eye and in radiograph బోలు అవయవము, ఉదా. పేగు లోపలితలములో గంటు, నరుకు – ఇది కంటికి, ఎక్స్‌రే ఫోటోలోను అగపడుతుంది.

**nicotine** alkaloid in tobacco పొగాకులోని విషపదార్థము. *figur.* The lure for Lady Nicotine is an affair for alarm. *అలంకార.* నికొటీన్ అను వేశ్య ఎరచూపు(తో) పొగపీల్చువానిని తన ఒడిలో వేసుకుంటుంది. పొగపీల్చుట ఎంత ప్రమాదకరమో చూశారా!

**nicotinic acid** niacin. one in vitamin B complex బి కాంప్లెక్సులో ఒక విటమిన్. Its deficiency causes pellagra. ఇది లోపించినయెడల పెల్లాగ్రా అను వ్యాధి కలుగుతుంది.

**nidus** 1. focus of infection సూక్ష్మజీవి సంపర్క స్థలము. 2. focus of a morbid process వ్యాధిగ్రస్తమైన ప్రదేశము. 3. nucleus కేంద్రకము.

**night blindness** due to vitamin A deficiency విటమిన్ ఎ లోపమువలన రేచీకటి.

**nightshade** *bot. see/చూడండి* belladonna.

**night soil** human excrement, used as a soil fertilizer మలం. *అలంకార.* తెల్లవారుజామున తొలిమలం ధరిత్రికి బలం.

**night sweats** occur in active tuberculosis ఉద్ధృతమైన క్షయవ్యాధిలో రాత్రిపూట చమటలు.

**nigra** black నలుపు. **substantia n.,** a part in the brain మెదడులో ఒకభాగము.

**nipple** blunted edge of the breast, *resemblance:* stalk of a fruit, *e.g.* the stalk of the fruit, *Achras sapota* (Hindi: chiku) చనుమొన, చూచుకము, కుచాగ్రము, స్తనాగ్రము, *పోలిక:* పండుయొక్క తొడిమ, *ఉదా.* సపోటా పండు తొడిమ. *అలంకార.* చీకేది (హిందీ: చికు).

**nirodh** popular condom worn on the penis by males for the prevention of conception and safe sex, *see/చూడండి* safe sex. నిరోధ్: పురుషాంగము మీద ధరించే తొడుగు. గర్భధారణము లేదా లైంగిక వ్యాధులను నిరోధించేది కాబట్టి 'నిరోధ్' అన్నారు *(నామసార్థకత).*

**nit** egg of a louse పేనుగుడ్లు, ఈపి, ఈదుదు. *నిత్యానుభవము:* ముసలిది మనుమరాలికి తలదువ్వుతూ తన రెండు బొటనవ్రేళ్ళ గోళ్ళమధ్య వీటిని చితుపుతూ ఉంటుంది.

**nitrous oxide** popularly known as 'laughing gas'. used as an anaesthetic, to induce general anaesthesia మత్తును కలిగించేది, మత్తుదశ ప్రేరేపణకు వాడ్తారు.

**nocturnal** relating to the night రాత్రికి సం. 1. **n. emission,** spontaneous, involuntary ejaculation of semen during sleep నిద్రలో అయత్నకృతమైన, అనియంత్రిత శుక్రస్ఖలనము. **n. enuresis,** bed-wetting during sleep నిద్రలో పక్కలో ఉచ్చపోయుటం. *N.B.* so embarrassing for the poor fellow! he can't rectify it. *గమనిక:* గేలిచేస్తారుకాని పాపం, వాళ్ల దురదృష్టం! 2. happening in the night రాత్రియందు సంభవించు. [*in contr.* diurnal *భిన్న.* పగటి/వెలుతురుయందు జరిగేది].

**node** a tissue in the form of a knot, knob, swelling ముడి, గుబ్బ, కంతి రూపములోనున్న కణజాలము. *naked eye str.* ప్రత్యక్షచూ. **atrioventricular n.,** 2×5 mm A.V.node in the heart గుండెలో ఏట్రియోజఠరిక ముడి. **Heberden's n's,** knobs by the side of interphalangeal joints వ్రేళ్ల కణుపుల ప్రక్కన పెరుగు గుబ్బలు. **lymph n's,** *see*/చూడండి lymph. లింఫ్ గ్రంథులు. **Osler's n's,** small tender raised bluish or pink elevations on the pads of fingers and toes seen in subacute bacterial endocarditis చేతి మరియు కాళ్ళ వేళ్ళ మృదువు భాగంలో నీలముగాగాని రోజారంగులోగాని ఉన్న, తీపుపుట్టే చిన్న ఉబ్బులు. ఇవి ఈ గుండె జబ్బులో కనబడుతాయి. **singer's n.,** a small white nodule on the vocal cord seen in singers who use their voice for long hours అతిగా గంటలతరబడి రాగాలు ఆలాపించే గాయకుల స్వరతంత్రులలోనుండు కణితి. **sinoatrial n.,** sinus n., 5×20 mm in size, cardiac pacemaker in which the cardiac rhythm originates లయబద్ధమైన గుండె ప్రచోదనములు అంకురించు ముడి. **Virchow's n.,** signal n., enlarged hard supraclavicular lymph node in abdominal malignancies, *e.g.* gastric cancer ఉదరకుహరములోని అపాయకరమైన కంతుల్లో, ఉదా. అన్నాశయము కాన్సర్‌లో జత్రుకపైన కనబడు పెద్ద గట్టి లింఫ్‌గ్రంథి. *micro.str.* సూక్ష్మ.చూ. **n's of Ranvier,** constrictions on the axon, *resemblance:* nodes on the sugarcane తంత్రికాక్షముమీద నొక్కులు, పోలిక: చెఱుకు/చెరుకుగడ మీది నొక్కులు.

**nodular** consisting of nodules of varying sizes వివిధ పరిమాణముగల కంతులతోగూడిన. **n. tuberculosis,** in tuberculosis of the lung, small nodules measure around one centimetre or less in diameter; large nodules measure some centimetres in diameter ఊపిరితిత్తుల క్షయవ్యాధిలో: చిన్న కంతులు ఒక సెంటిమీటర్ లేదా తక్కువ సైజు; పెద్ద కంతులు కొన్ని సెంటిమీటర్ల సైజులో ఉంటాయి.

**nodule** similar to a node but differs in size ముద్ద, కణుపు, బుడిపె. *naked eye str.* ప్రత్యక్షచూ. **apple jelly n's,** light yellowish brown nodules seen on pressing over skin and the lesion with a glass slide (diascopy) in lupus vulgaris ఏపిల్ పండు (సేప్) గుజ్జువలె,

ముంజెవలె లేత పసుపు-గోధుమ కలిపిన రంగువలెనుండు ముద్దలు. ఇవి చర్మము క్షయవ్యాధిలో చూడగలరు. వ్యాధి ప్రబలిన ప్రాంతముమీద గాజుబిళ్ల పెట్టి నొక్కితే ఆ ముద్ద విప్పారి కనపడుతుంది. **lymphatic n's,** lymph nodes, of varying sizes – pin head to a bean వివిధ సైజుల్లో లింఫ్ గ్రంథులు – గుండుసూది తలనుండి చిక్కుడు గింజ అంత. Malpighian bodies in amyloid degeneration of spleen, *resemblance:* boiled/cooked sago-grains మాల్పీజియన్ పదార్థ రేణువులు. ప్లీహంలో ఎమైలాయిడ్ క్షీణత. పోలిక: ఉడికిన సగ్గుబియ్యం గింజలవలె కనపడే. **rheumatic n's,** subcutaneous pea-like discrete lumps found in the scalp, along the back of forearm, *etc.* They come and go, *i.e.* they appear and disappear in course of time. They are seen in rheumatic fever. బటానిసైజులో చర్మము అడుగున (నెత్తి, మోచేయి, మొ. చోట్ల) ముద్దలు. ఇవి వస్తుంటాయి, పోతుంటాయి. ఇవి రుమాటిక్ జ్వరములో అగపడుతాయి. **rheumatoid n's,** subcutaneous nodules in rheumatoid arthritis రుమటాయిడ్ కీళ్ళ వాతంలో చర్మము అడుగున ముద్దలు. *micro.str.* సూక్ష్మ.చూ. **Aschoff bodies/n's,** collection of cells in the interstitial tissues in the heart muscle characteristic of rheumatic myocarditis గుండె కండరముల మధ్యాంతర కణజాలములలో రుమాటిక్ గుండె జబ్బులో చూడనగు కణముల సముదాయము. **lymphatic n's, lymphoid n's, lymph n's,** lymph follicles లింఫ్ పుటికలు. aggregates of lymph cells in tonsils, thymus టాన్సిల్స్, థైమస్‌లో లింఫ్‌కణముల సముదాయములు. Malpighian body or malpighian corpuscle or renal corpuscle కిడ్నీలో మాల్పీజియన్ పదార్థం.

**noise** annoying sound చప్పుడు, సద్దు, అల్లరి, కర్కశ శబ్దం. **n. pollution** శబ్ద/చప్పుడు కాలుష్యం. *observation:* (a) a school teacher with a touch of rebuke alerts the students 'less noise' *నిత్యానుభవం:* స్కూలు మేష్టరు మందలింపు 'అల్లరి చేయవద్దు'. (b) వాడు.భా. సద్దుమణిగినాక చూద్దాం. *N.B. గమనిక:* (i) differentiate from voice, *see/చూడండి* voice. 'voice pollution', 'less voice' అనరుగదా! (ii) Of course, voice box may become a noise box,

chatter box, at times. ఒకప్పుడు గానపేటిక ఘోషపేటిక కావచ్చు. [*Cf.* voice].

**noma** gangrene of the mouth or genitalia, *see/చూడండి* gangrene. నోరు లేదా గుహ్య అవయవముల కుళ్ళు.

**nomenclature** పరిభాషాప్రకరణము. a classified system of technical names, especially in science; terminology పారిభాషిక పదకోశము; పేర్లపట్టిక.

**nonspecific** 1. not attributable to a cause అనిర్దిష్ట, కారణ భూతముకాని. 2. not acting against a particular agent ఒక పంథాకు అనుగుణముగాలేని. 3. having a general effect (not a specific effect) విశేషగుణములేని.

**nonunion** of a fracture; the ends of fracture have not united విరిగిన ఎముకల కొనలు అతుకుకొనలేకపోవుట.

**normal** 1. ordinary, usual సాధారణమైన, సహజమైన, సామాన్యమైన, స్వాభావికమైన, మామూలుగా ఉండెడు. 2. according to expectation, tradition, rule సాంప్రదాయ ప్రకారముగా. 3. regular క్రమమైన, సక్రమంగా ఉన్న. 4. natural సహజమైన, సృష్టిని అనుసరించిన, నిజమైన.

**normoblast** nucleated precursor of erythrocyte ఎర్రరక్తకణము యొక్క అగ్రగామి.

**normocyte** normal erythrocyte అన్నీ చక్కగా ఉన్న ఎర్రరక్తకణము.

**normoglycaemia** normal level of sugar in the blood రక్తంలో షుగర్ నార్మల్‌గా ఉండుట.

**normotensive** a person with normal blood pressure బ్లడ్‌ప్రెషర్ నార్మల్‌గా ఉన్న వ్యక్తి.

**nose** 1. organ of air entry into the lungs ముక్కు, నాసిక, వాయుసేకరణ అవయవము. 2. organ of smell ఘ్రాణేంద్రియము; ముక్కుయొక్క విధి: వాడు.భా. వాసన చూచుట; అఘ్రాణించు. 3. *figur.* Nose is the rudder of the face. *అలంకార.* ముక్కు ముఖమునకు చుక్కాని.

**nose-bleed** epistaxis నాసిక రక్తసిక్తం: ముక్కునుంచి రక్తం కారటం.

**nosocomial** originating in a hospital ఆసుపత్రి కారకమైన/కారణమైన. **n. infection,** acquired in a hospital ఆసుపత్రిలో అవతరించిన సూక్ష్మజీవి అంటు. *N.B.* Beware! Consumer Protection Act is in force. *గమనిక.* జాగ్రత్త! వినియోగదారుని రక్షణచట్టము అమలులో ఉన్నది.

**nosology** the classification of diseases వ్యాధుల వర్గీకరణము.

**nostrils** nares, nasal openings ముక్కు రంధ్రములు, నాసికాద్వారములు.

**notch** an indentation on a part, *e.g.* **n. on a bone** గంటు, నరుకు: ఒక భాగముమీది గంటు, ఉదా. ఎముకమీద గంటు.

**notifiable** being reported to health authorities **n. disease,** any infectious disease to be reported to the health authorities like tuberculosis, typhoid, cholera, *etc.* ఆరోగ్య శాఖాధికారులకు తెలియజేయవలసిన అంటుజాడ్యము – టి.బి., టైఫాయిడ్,కలరా, మొ.

**notochord** the rod-shaped cord, the first supportive structure of an embryo పృష్ఠదండము: కాడవలె నుండునది, పిండములో ప్రథమ ప్రాపు/ఆసరాగా ఉండే నిర్మాణము.

**nourishment** supply of food needed for growth or survival పోషణ.

**noxious** hurtful, injurious ఉపద్రవకరమైన, హానికరమైన, దుష్టమైన.

**nucha** [nuchal *adj.*] the nape of the neck మూపు, మెడవెనుక ప్రాంతం.

**nuclei** [nucleus. *sing.*] కేంద్రకాలు.

**nucleolus** a refractile body in the nucleus కేంద్రకాంశము, కేంద్రక బిందుకము, కేంద్రికము.

**nucleus** [nuclei *pl.*] 1. the central portion in a cell కేంద్రకము 2. the central core of any structure ఏ నిర్మాణమునకైనా కీలక కేంద్రస్థానము. 3. a group of nerve cells in the central nervous system కేంద్రనాడీవ్యవస్థలో ఒక నాడీకణముల సముదాయము.

**nullipara** a woman who has not given birth to a child గొడ్రాలు: శిశువును కనని మగువ [*in contr.* multipara భిన్న. బహుళ సంతానవతి/సంతానురాలు].

**numbness** anaesthesia మొద్దుబారినట్లుండుట, తిమ్మిరి.

**nurse** 1. one who is trained to care for the sick; one who should develop a zeal to do so; for example: Mother Teresa నర్సు, దాది: రోగశుశ్రూషకవ్యక్తి, రోగికి సేవచేయు దయాళువు, సుస్తీ చేసినవారికి స్వస్థత చేకూర్చడంలో నిపుణులు; నేర్పరితనం, ఔత్సుక్యము ఉన్న మదర్ తెరీసా కోవలో చేరినవారు. *N.B.* 21st Century news: Robot nurse started duty in a London hospital. She doesn't take off, she doesn't strike work, she works 24 hours a day తాజావార్త: 21వ శతాబ్దంలోనికి అడుగుపెడుతున్న మనకు వెలుగునిచ్చువార్త – రోబాట్ నర్స్‌ను లండన్ హాస్పిటల్‌లో ప్రవేశపెట్టారు. ఆమె నిర్విరామంగా, సెలవు తీసుకోకుండా, సమ్మె చేయకుండా, రోజుకు 24 గంటలు పనిచేస్తుంది; పురోగమనానికి నూతన సోపానం. 2. wet nurse, one who breast-feeds an infant చనుబాలు దానం చేసే చెలువ/స్త్రీ. పాలదాత ప్రాణదాత. పసిబిడ్డకు పాలివ్వడం స్త్రీకి పరమానందం.

**nursing** 1. a noble profession, కులీనతగల వృత్తి. 2. nursing a baby, e.g. milk donor క్షీరదానం చేయు కోమలి, శిశువుకు స్తన్యమిచ్చు సుదతి. **n. home** రోగిపరిచర్య స్థలం, ఆసుపత్రి. 3. Nursing Journal నర్సుల పాఠ్య వార్తాపత్రిక.

**nutmeg** *bot.* dried kernel of the seeds of a tree, a spice జాజికాయ, ఒక సుగంధద్రవ్యము. 1. useful for digestive disorders జీర్ణ అపవ్యవస్థలకు ఉపయోగిస్తారు. 2. sex stimulant లైంగికోద్దీపకము. 3. nutmeg liver: chronic passive congestion of the liver దీర్ఘకాలపు కాలేయ రక్తాధిక్యత.

**nutrient** nutriment, pertaining to nutrition పోషణకు సం., పోషక ఆహారము/పదార్థము.

**nutrition** process of intake, assimilation and utilization of nutrients పోషణము, పోషణ విజ్ఞానం: పుష్టికరమైన, పోషకమైన ఆహారము తినుట,

ఆహారము స్వీకరించుట, తిన్నది ఒంటపట్టించుకొనుట మరియు శరీరమునకు ఉపయోగించుకొనుట అను ప్రక్రియ. Food is required for the growth of tissues upto certain age, thereafter for upkeep/maintenance. కొంతవయస్సు వరకు కణజాలముల పెరుగుదల కొరకు, తదుపరి జీవితయాత్ర సాగించుటకు ఆహారము అవసరము. Food consists of proteins, carbohydrates, fats, vitamins, minerals and fluids like milk, water. ఆహారము అరు విధములు: ప్రోటీన్‌లు, కార్బోహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థములు, విటమిన్‌లు, ఖనిజములు మరియు ద్రవములు (పాలు, నీరు). Growing children, active adults, pregnant women and the sick require more food. ఎదిగే పిల్లలకు, ప్రౌఢకష్టజీవులకు, చూలాలుకు మరియు రుగ్మతగ్రస్తులకు ఆహారం ఘనంగా ఉండాలి. Balanced diet is a well-chosen variety of nutritious foods. సమతుల్యాహారము అనగా పోషకపదార్థములు తగు పాళ్ళలోనున్న మృష్టాన్నము. A man is what he eats. తనువుకు తిండితోడు. తిండిమీదనే తనువు ఆధారపడి ఉంది.

**nutritionist** an expert in advising the nutritional values of foodstuffs, *see/చూడండి* dietitian. తినుబండారాల పోషకవిలువల సలహాదారుడు/సలహాదారిణి.

**nutritious** nourishing పౌష్టిక, బలవర్ధకమైన.

**nux vomica** *bot.* the poisonous seed containing strychnine ముష్టిణి, విషముష్టి.

**nyctalopia** night blindness రేచీకటి.

**nycturia** nocturia. increased secretion of urine in the night రాత్రియందు అధికమూత్రం.

**nymphae** the labia minora స్త్రీలలో క్రింది చిన్న నిలువు పెదవులు.

**nymphectomy** excision of nymphae, the small vertical lower lips guarding the vagina, *i.e.* labia minora, *see/చూడండి* circumcision. స్త్రీయోని ఇరుప్రక్కల ఉన్న నిలువుపాటి చిన్న క్రింది పెదిమలు కత్తిరించుట.

**nymphomania** excessive sexual desire in a female స్త్రీలలో అధిక కాముకత్వము: వనితలో అతిరతి (స్థితి). *figur.* craving for Cupid's arrow అలంకార. మన్మథ బాణాభిలాషి. [*Cf.* satyriasis.]

**nystagmus** involuntary and jerky rhythmical oscillations of the eyes, horizontal, vertical rotatory or mixed కన్నుగుడ్లయొక్క అనియంత్రిత మరియు ఈడ్పుతో కూడిన లయబద్ధమైన అల్లల్లాడుట – ఈ ఆట వెడల్పుగాను, నిలువుగాను, గుండ్రముగాను లేదా వీటి మిశ్రమ రూపులోను ఉండవచ్చును. causes కారణములు: 1. congenital పుట్టుకతో వచ్చినది. 2. labyrinthine and vestibular (parts of the inner ear) involvement పద్మవ్యూహము మరియు అళిందము (లోపలి చెవి భాగములు) వ్యవస్థకు సం. జబ్బులో. 3. induced by certain drugs, *e.g.* barbiturate poisoning *ఉదా.* బార్బిట్యురేట్ గల ఔషధముల విషపరిణామము. 4. diseases in brain మెదడులో వ్యాధులు.

# O o

**oath** solemn declaration ప్రమాణం, ఒట్టు. *see/చూడండి* Hippocratic Oath.

**obesity** A. corpulence, fatty body అతిస్థూలత: కొవ్వుకాయం, ఊబక, కొవ్వెక్కిన శరీరము. tyranny of the fat cells in the body తనువులోని కొవ్వు కణముల క్రూరప్రభుత్వము. One is said to be obese when one's weight is 20% or more over one's normal weight. తను ఉండవలసిన బరువుకన్నా 20 శాతము ఎక్కువ ఉన్నట్లయితే కొవ్వు శరీరం అంటారు. When calorie intake exceeds expenditure, the excess calories are stored as fat in the body tissues. భోజనసేకరణ శక్తివ్యయమును మించితే, ఆ మిగులుభోజన పదార్థములు కొవ్వురూపంలో శరీరకణజాలములలో (ముఖ్యముగా చర్మముక్రింద) జమ అవుతాయి. In short, to avoid obesity, achieve a balance between food intake and energy expenditure/exercise. క్లుప్తంగా చెప్పాలంటే, కొవ్వు చేరకుండా ఉండాలంటే, ఆహారదిగుబడి - వ్యాయామ ఎగుబడి సరితూగాలి. **hazards of obesity:** diabetes mellitus, coronary artery disease (*colloq.* heart attack), hypertension, strokes (apoplexy or paralysis), osteoarthritis (mostly of the knees), *etc.* ఊబకయొక్క విపత్తులు: మధుమేహం వ్యాధి, గుండెరొద, రక్తపోటు, పక్షవాతం/అంగవికృతిరోగము, కీళ్ళదగ్గర ఎముకలు బరువు మోయలేక కీళ్ళవేదన (ముఖ్యముగా మోకాలుకీళ్ళలో), మొ. Treatment of obesity is physical work. Reduce width/girth; girth control by pruning the diet కొవ్వు శరీరానికి కాయకష్టమే తరణోపాయం. శరీరం/నడుము చుట్టుకొలత తగ్గించాలి. కటి కైవారం అదుపులో ఉంచితే పొట్ట పరిధి/బరువు తగ్గుతుంది. జిహ్వాచాపల్యం అణచాలి. *N.B.* Observing in retrospect, pencil-thin girl in her teens becoming pillar-stout housewife in middle years *గమనిక:* గతావలోకనం చేస్తే లేతకొమ్మ/రెమ్మ కన్య లావుబోదె అగుట. B. Notwithstanding the above note, obesity is inherited through a gene, called obesity gene. పైన వివరించినప్పటికి, ఏది ఎట్లా ఉన్నా, కొవ్వుకాయం ఒక జీన్ద్వారా కలిగే అనువంశికత లక్షణము.

**objective** 1. as observed by others ఇతరులచే గమనింపబడిన. **o. signs,** noted by an observer (doctor) డాక్టరు (రోగిలో) గమనించు రోగచిహ్నములు [*Cf.* subjective symptoms *తారత.* తనకున్న బాధలు]. 2. **o. lens,** in the microscope సూక్ష్మదర్శినిలో పరీక్షవస్తువు (object) దగ్గర ఉండే కటకము [*Cf.* eye piece *తారత.* కన్ను దగ్గరి కటకము].

**obliteration** రూపుమాపుట, మచ్చ/ఉరువు/శార్తీలేకుండా చేయుట defacement of tissue by disease process, degeneration, surgical attempt or irradiation వ్యాధిప్రబలతవలనగాని, క్షీణతవలనగాని, శస్త్ర ప్రయోగం వలనగాని, కిరణప్రసరణ ద్వారాగాని కణజాలమును రూపుమాపుట.

**oblongata** rather (somewhat) long కొంచెముగా పొడుగుగానున్న. **medulla o.,** vital part of the brain మజ్జాముఖము, మెదడులో ప్రాణాధారమైన/కీలకమైన ప్రాంతము; ముచ్చెలగుంట ప్రాంతం.

**obsession** idea/impulse that cannot be erased from one's mind *see/చూడండి* neurosis. అనియంత్రిత భావము, మనస్సునుండి చెరిపి/తుడిచి వేయలేని అభిప్రాయము/ప్రేరణ.

**obsessive compulsive personality** అనియంత్రిత నిర్బంధక మూర్తిమత్వము. *see/చూడండి* neurosis.

**obstetrician** specialist in obstetrics ప్రసూతి వైద్యుడు: పురుడు/కాన్పుకు సం. శాస్త్రములో నిపుణులు.

**obstetrics** *colloq.* midwifery. branch of medicine dealing with deliveries, prenatal, natal and postnatal care పురుడు; ప్రసవపూర్వ, ప్రసవ సమయ, ప్రసవానంతర శ్రద్ధ – ఈ ప్రక్రియలకు సం. శాస్త్రము.

**obstruction** blockage of a channel in the body, be it a blood/lymphatic vessel or a tube, hollow viscus శరీరములోని ఏదైనా మార్గములో అటంకము/అవరోధం. రక్త/శోషరసనాళము/నాళికలు లేదా గొట్టము, లేదా బోలు అవయవములో ఏదైనా అడ్డుపడి, అటంకము సంభవించుట. **o. by calculi,** *e.g.* gall stones, urinary calculi పైత్యరస (పిత్తకోశ) శిలలు, మూత్రవ్యవస్థ రాళ్ళు. **o. by clots,** *e.g.* bleeding into blood vessels, clots రక్తనాళము/నాళికలలో రక్తస్రావము, స్కందము (రక్తం గడ్డకట్టుట). **o. by emboli,** blood

clot emboli, fat emboli, tumor cells emboli, air embolism రక్తం గడ్డలు, కొవ్వు పిసర్లు, కంతి కణములు, గాలి బుడగలు – ఇవి ఎంబొలై; ఇవి అడ్డు చేరవచ్చును. **o. by foreign bodies,** *e.g.* foreign bodies in mouth, safety pins, rings entering the wrong way, *viz.* into the windpipe (trachea); child may get suffocated పిన్నులు, (వాడు.భా. పిన్నీసులు) ఉంగరములు నోట్లోనుండి వాయునాళము, శ్వాసనాళము, శ్వాసనాళికలోకి జారుట; పిల్లల్లో శ్వాస అడనీయక ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. **intestinal o.** పేగులలో అడ్డుపడుట. **lymphatic o.,** *e.g.* adult filaria worms blocking lymphatics and causing elephantiasis, *see/చూడండి* elephantiasis. శోషరసనాళముల/నాళికలలో అడ్డు సంభవించుట, ఉదా. ఫైలేరియా పురుగులు అడ్డుపడినందున. **tumor o.,** block by tumor or its cells forming emboli కంతివలనగాని లేదా కంతి కణములయొక్క ఎంబొలై వలనగాని అడ్డు. **vascular o.,** due to vascular causes, *e.g.* thrombosis; formation of thrombus in the wall of the vessel producing obstruction of the lumen నాళము/నాళిక కుడ్యములో థ్రాంబస్ చేరి అడ్డము కలిగించుట.

**occipital** pertaining to the back of the head; **o. bone** అనుకపాల ఎముక. **o. lobe,** the most posterior area of the cerebral hemisphere. Visual pathways end in the occipital cortex. అనుకపాల లంబిక. మెదడులో వెనుకభాగము; దృష్టికి సం. జ్ఞానేంద్రియ ప్రదేశాలు ఇక్కడ ఉంటాయి.

**occiput** the back of the head తల వెనుకప్రాంతము, అనుకపాలము.

**occlusion** a closing off/block, *e.g.* **coronary o.,** block of a coronary vessel దారిమూయబడటం: కొరొనరి నాళికలో అడ్డు; అది పూడుకుపోవటం. one cause of sudden death అకస్మిక మృతికి ఒక కారణము.

**occult** hidden గుప్తమైన, నిగూఢమైన, గూఢ. **o. bleeding,** esoteric haemorrhage గుప్త రక్తస్రావము, *అలంకార.* ఇంట్లో దొంగను ఈశ్వరుడైనా పట్టుకొనలేడు, అంటే ఈ రక్తస్రావకారకం కనుక్కొనడం కష్టం. [*in contr.* overt].

**occupational** disease-producing factors in one's work వృత్తికి సం. అంశములు. **o. disease,** *e.g.* silicosis, *see*/చూడండి silicosis. వృత్తి సం. వ్యాధి, వృత్తిరీత్యా సంక్రమించిన వ్యాధి.

**ocular** 1. relating to the eye కన్నుకు సం. 2. eye piece in the microscope సూక్ష్మదర్శినిలో చూచుటకు కన్ను ఉంచు ప్రాంతమున ఉన్న భూతద్దము.

**oculist** an optician or ophthalmologist, *see*/చూడండి both words.

**oculomotor nerve** third cranial nerve 3 వ కపాలనాడి, అక్షిచాలక నాడి, అక్షిప్రేరక తంత్రిక.

**odontoid** 1. tooth shaped నోట్లోని పన్ను ఆకారములోనున్న. 2. **o. process of axis** అక్షముయొక్క ఓడంటాయిడ్ కీలితము.

**odontology** dentistry పండ్ల/పళ్ళవ్యాధుల విజ్ఞానము/దంతశాస్త్రము.

**odontopathy** any disease of the teeth పండ్ల/పళ్ళజబ్బు.

**odour** or **odor** (pleasant or unpleasant) smell సువాసన లేదా దుర్వాసన. malodorous, bad smell, *e.g.* indole and skatole దుర్గంధ, ఉదా. పురీష హేయములు.

**oedema** or **edema** dropsy, swelling in the body; accumulation of fluid in the interstitial spaces ఒళ్ళు వాపు: మధ్యాంతర స్థలములలో ద్రవము చేరుట, వాడు.భా. నంజుచేరింది అంటుంటారు. **cardiac o.** గుండె జబ్బుల్లో ఒడలు పొంగు. **famine o.,** due to lack of food కరవుకాటకాలలో దుర్భిక్షము వలన ప్రాప్తించు నంజు. **hepatic o.,** in diseases of the liver, *e.g.* cirrhosis of the liver కాలేయము గట్టిపడి పొట్ట, ఒళ్లు వాపు వచ్చుట. **hypoproteinemic o.,** due to deficiency of proteins in the diet ఆహారములో ప్రోటీన్లు లోపించినందువలన మనిషి ఉబ్బిపోతాడు. **lymph o.,** lymphatic o., due to blockage of lymphatics లింఫ్‌నాళములలో అడ్డువలన ఆ ప్రాంతపు ఉబ్బు. **o. in anemia,** with pallor నంజు, పాండురోగము, రక్తక్షయరోగము, రక్తహీనతలో పాలిపోవుట. **pitting o.,** pressure over the shin with a finger leaves a depression కాలుఎముక మీద వేలుతో నొక్కితే గుంటపడుట. **pulmonary o.,** water-logging of lungs ఊపిరితిత్తులలో

అధికద్రవము చేరుట. **renal o.**, in diseases of the kidneys, *e.g.* nephritis కిడ్నీ జబ్బుల్లో, ఉదా. కిడ్నీవాపులో ఒడలు ఉబ్బుట.

**oesophagectasia** or **esophagectasia** dilatation of the oesophagus అన్నవాహిక యొక్క విస్ఫారణ(ము).

**oesophagitis** or **esophagitis** inflammation of the oesophagus అన్నవాహికయొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**oesophagoscopy** or **esophagoscopy** endoscopic examination of the oesophagus అన్నవాహికాంతర్దర్శిని: అన్న వాహికలో గొట్టమువేసి పరీక్షచేయుట.

**oesophagus** or **esophagus** musculomembranous tube from the pharynx to the stomach అన్ననాళిక, అన్నపథము, అన్న వాహిక, గొంతు(క) నుండి అన్నాశయము వరకుగల కండరత్వచముల వాహిక/గొట్టము; గ్రసిక (గ్రాసము తీసుకునేది).

**oestradiol** or **estradiol** female sex hormone produced by the ovary అండాశయము తయారుచేసే స్త్రీలైంగిక హోర్మోన్.

**oestrogen** or **estrogen** the female sex hormones, which give feminine features to the female ఎస్ట్రోజన్: స్త్రీలింగ సం. హోర్మోనులు, స్త్రీకి ఆడ రూపము, ఆకృతి, లక్షణములనిచ్చు హోర్మోనులు.

**offspring** a person's child or children పిల్ల/పిల్లవాడు లేదా సంతానం.

**ointment** a soft semi-solid medicinal preparation for external use అంజనము, విలేప(న)ము, విలేపనౌషధము, లేపనము, కాటుక, వాడు.భా. మలాము/ములాము. **eye o.** అంబకమునకు అంజనము, కండ్ల కాటుక, అలంకార. అంబిక అంబకమునకు అంజనము అందమైన అలంకార ఆకర్షణీయ అనవాలు. **piles o.** ఆసనంలో అర్శమూలలకు, మలాము. **skin o.** చర్మజబ్బులకు, తీట, గజ్జి, దురద, మొ. వాటికి ములాం.

**olecranon process** the large process of the upper end of ulna అరత్నియొక్క కీలితము. It forms the tip of the elbow when the joint is flexed మోచేయి ముడిచినప్పుడు అక్కడ తగుల్తుంది.

**olfactory** pertaining to the sensation of smell వాసనకు సం., ఘ్రాణేంద్రియమునకు సం. **o. nerves**, nerves of smell ఘ్రాణజ్ఞాన నాడులు, ఘ్రాణనాడులు.

**oligomenorrhoea** or **oligomenorrhea** scanty menses ఋతువులో స్వల్పస్రావము, ముట్టు కొరత, వాడు.భా. ఎర్రమరకతో ముట్టు ఆఖరు/ఆగిపోవటం.

**oligospermia** scarcity of sperms in semen అల్ప శుక్రత: శుక్రములో అరుదైన/అపురూపమైన పురుషబీజకణాలు.

**oliguria** scanty urine output అల్ప మూత్రత: స్వల్పమూత్ర విసర్జనము.

**omentum** a fold of peritoneum which covers the bowels పేగులను కప్పిఉంచే ఆంత్రవేష్టనస్తరముయొక్క మడత. It is the policeman in the abdomen, *i.e.* goes to the rescue of the diseased organ. ఉదరకుహరములోని రక్షకభటుడు అనగా పోలీసులాగా అవసరం వచ్చినప్పుడు అదుకునేవాడు.

**omphalitis** inflammation of the umbilicus నాభియొక్క శోథము/ 'నొప్పి వేడి మంట ఎరుపు వాపు'.

**omphalocele** hernia around the navel, umbilical hernia, *see/చూడండి* hernia. నాభిదగ్గర హెర్నియా.

**omphalos** [Greek *navel*] umbilicus నాభి, బొడ్డు.

**onanism** coitus interruptus, *see/చూడండి* coitus interruptus.

**oncogene** a gene that causes a normal cell to transform into a cancerous cell మామూలు కణమును కేన్సరుకణముగా మార్చే జన్యువు.

**oncology** the study of tumors కంతుల గురించిన శాస్త్రము.

**onion** *bot.* leaves and bulb. ఉల్లి ఆకులు మరియు ఉల్లిపాయ.

1. has bactericidal properties బాక్టీరియాను హతమార్చు గుణంకలది.
2. prevents many diseases బహురోగనివారిణి, అలంకార. తల్లిచేయలేని మేలు ఉల్లిచేస్తుంది.

**onychia** inflammation of the nail bed గోరు మొదట్లో 'తీపు వేడి ఎరుపు మంట వాపు'. 1. *see/చూడండి* koilonychia. 2. *see/చూడండి* paronychia. గోరుచుట్టు.

**onychomycosis** tinea unguium, fungus infection of the nail bed గోరుమొదట ప్రాంతానికి ఫంగస్ జబ్బు.

**onychopathy** any disease affecting the nails గోళ్ళ/నఖముల జబ్బు.

**onychophagia** biting of nails, *see/చూడండి* nail biting. గోళ్ల కొరుక్కోవడం.

**onychotillomania** *figur.* onycho till o mania – mania to till into the nail *అలంకార.* గోరులోనికి దున్నడం అనే ఉన్మాదము. neurotic pricking and picking of the tissues at the nail margin. Some do it with a pair of forceps and derive pleasure in ploughing the nails. గోరు అంచున మరియు ప్రక్కన లేత కణజాలములను పీకుట. మానసిక చాదస్తంయొక్క నేపథ్యంలో ఇట్లా చేస్తారు. ఒక్కొక్కప్పుడు చిన్న ఫోర్సెప్స్‌తో పీకుతూ ఆహ్లాదం పొందుతూ ఉంటారు.

**oocyte** an immature precursor of ovum స్త్రీబీజ మాతృకణము, అండముయొక్క అగ్రగామి. mature oocyte measures 100$\mu$ to 120$\mu$.

**oophoralgia** pain in the ovary అండాశయం నొప్పి.

**oophorectomy** ovariectomy; excision of one or both ovaries అండాశయచ్ఛేద(న)ము: అండాశయము(ల)ను తీసివేయుట.

**oophoritis** inflammation of the ovary అండాశయ శోథము: అండాశయముయొక్క 'నొప్పి వేడి తీపు వాపు'.

**oophoron** ovary అండాశయం.

**opaque** not having the property of transmitting light అపారదర్శక, కాంతినిరోధక, వెలుగు చొరనియ్యని, ఒకప్రక్కనుండి రెండవప్రక్కకు వెలుతురును పోనివ్వని (కిరణాభేద్యమైన) గుణముకల [*in contr.* transparent భిన్న. పారదర్శక.] opacity అపారదర్శకత.

**open heart surgery** *see/చూడండి* machine.

**operation** 1. surgical manoeuvre శస్త్రయుక్తి, శస్త్రచికిత్స, శస్త్రక్రియ. 2. a treatment modality చికిత్సోపాయము, *అలంకార.* ఔషధమునకు అలవికాని దానిని కత్తిగాటుకు గురిచేయుట. *ఉదా.* వాడు.భా. స్త్రీలు చెప్పేది: పెద్ద ఆపరేషన్ అనగా గర్భసంచి తీసివేయడం; చిన్న ఆపరేషన్ అనగా ట్యూబెక్టమి (పిల్లలు పుట్టకుండా ఉండేటట్లు ఫాలోపియన్ నాళములు తుంచివేయుట).

**ophthalmia** *syn.* opthalmitis. severe inflammation of the eye ప్రగాఢ కండ్లకలక, కన్నుయొక్క గాఢమైన 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు';

శ్వేతనయనములు అరుణనయనములుగా మారుట. **epidemic o.,** epidemic conjunctivitis, due to microorganism, spreading through fomites, house-hold articles, *viz.* handkerchiefs, pen, pencil, vessel, switch, telephone receiver, newspaper, *etc.* One should wash hands with soap and water after shaking hands with the patient. కండ్లకలక మారి: వైరస్‌వలన సంభవించును. ఒకరినుండి మరియొకరికి వాడుకునే వస్తువుల (fomites) ద్వారా అనగా దస్తీ (జేబురుమాలు), పెన్, పెన్సిల్, పాత్ర, స్విచ్, టెలిఫోన్ రిసీవర్, వార్తాపత్రిక వగైరా దినచర్యలో ఉపయోగించే సాధనల ద్వారా అంటు తగులుతుంది. రోగితో కరచాలనము చేసిన తర్వాత శుభ్రముగా సబ్బు పెట్టి చేతులు కడుగుకొనవలెను. **gonorrhoeal o.** గనేరియా రోగంలో కండ్ల వాపు. **o. neonatorum,** conjunctivitis in the newborn during the first 10 days after birth శిశువు జన్మించిన 10 రోజులలోపు కండ్లకలక. **phlyctenular o.,** tubercular infection, *see/చూడండి* phlycten. క్షయవ్యాధి తాలూకు కండ్లకలక. **sympathetic o.,** plastic iridocyclitis in the second/sound/sympathising eye, secondary to a lesion (injury or disease) of an eye which is suffering ఒక కన్ను క్షతమునకు (గాయము/జబ్బునకు) గురిఅయి బాధపడుతుండగా మరో కన్ను సానుభూతితో బాధపడుట మరియు ఐరిడోసైక్లైటిస్‌కు గురియగుట.

**ophthalmic** relating/pertaining to the eye కన్నుకు సం.

**ophthalmologist** specialist in ophthalmology కంటివైద్య నిపుణుడు.

**ophthalmology** science of the eye diseases నేత్రరోగ శాస్త్రము. Eye is the prime organ in the body. సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్.

**ophthalmoplegia** paralysis of the eye muscles నేత్రపేశీ పక్షవాతము.

**ophthalmoscope** funduscope. an instrument to examine the interior of the eye నేత్రాంతర్దర్శిని, కన్నుగుడ్డు లోపలిభాగము పరిశీలించు పనిముట్టు.

**opiate** 1. any of the group of drugs derived from opium, *e.g.* morphine, heroin, codeine నల్లమందు నుండి ఉత్పన్నమైన, ఉదా. మార్ఫిన్, హిరాయిన్, కోడీన్. 2. soporific, sleep-inducing నిద్రాకారకం.

**opisthotonos** or **opisthotonus** shape wherein the body is is bowed forward, *i.e.* bent with convexity forward విల్లువలె శరీరం ముందుకు వంగియుండుట. encountered in meningitis, tetanus మెదడుపొరవాపుజబ్బులో, ధనుర్వాతములో చూడనగును.

**opium** a narcotic substance నల్లమందు. **o. addict** నల్లమందు (మత్తుమందు) వ్యసనలోలుడు, అలంకార. నల్లమందుభాయి.

**opsonin** an antibody ప్రతిరక్షకము.

**optic** pertaining to the eye కన్నుకు సం. **o. disc,** the most picturesque sight as seen through the ophthalmoscope నేత్ర చక్రిక: ఈ పనిముట్టుద్వారా పరిశీలించితే అతి సుందరమైన దృశ్యము. It is 1.5 mm in diameter. దీని నడిమికొలత 1.5 మి.మీ. **o. nerve** దృష్టినాడి.

**optician** one who fits and sells glasses and contact lenses, but is not qualified to prescribe them కళ్ళ అద్దాలు కళ్ళజోడులో బిగించి అమ్మేవాడు, కాని కళ్ళు పరీక్షచేసి పవర్ నిర్ణయించేది డాక్టరుగాని ఈయనకాదు. అట్లాగే స్పర్శకటకములు (contact lenses) కన్నుకు అంటించేవాడు.

**optometrist** specialist ophthalmic optician who is qualified to examine the eyes and prescribe glasses or contact lenses కంటిచూపు తనికీచేసి దోషమునకు అద్దాలుగాని, స్పర్శకటకాలుగాని నిర్ణయించి, చీటీవ్రాసి (prescription) ఇచ్చే కంటి/కళ్ళవైద్యనిపుణుడు.

**OPV** *abbr.* oral polio vaccine అస్య పోలియో వాక్సీను. వాడు.భా. పోలియో చుక్కలు.

**ora** [orae *pl.*] an edge or a margin అంచు. **o. serrata,** part in the eye కన్నులోని భాగము.

**oral** 1. through mouth అస్య. 2. relating to mouth నోరుకు సం. **o. medication** నోటిద్వారా సేవించే మందు. **o.sex,** use of mouth

and tongue to stimulate the genitals of one's partner నోటితో (పెదిమలతో), నాలుకతో రతికేళి భాగస్థుని లైంగిక దృష్ట్యా ప్రేరేపించుట.

**orbicularis** rounded గుండ్రని. **o. oculi,** circular muscle around the eye నయనము చుట్టూ వలయాకారములోనున్న పేశి. **o. oris,** circular muscle around the mouth నోటిచుట్టూ ఉన్న గుండ్రని కండరము.

**orbit** socket for the eyeball నేత్రకోటరము, కంటిగుంట, కన్నుగుడ్డు నిలిచియుండు ప్రదేశం.

**orchidectomy** orchiectomy. excision of one testis or both testes వృషణచ్ఛేదన: శస్త్రవైద్యముచేసి వృషణము(ల)ను తీసివేయుట.

**orchiodynia** orchialgia. pain in the testis/testes వృషణము(ల) వేదన. most sickening అమిత దుర్భరము.

**orchiopathy** any disease of the testis వృషణముయొక్క సుస్తి/ అస్వస్థత.

**orchitis** inflammation of the testis వృషణముయొక్క శోథము/ 'నొప్పి వేడి మంట తీపు వాపు', వృషణవేదనతో కూడిన వృషణవాపు.

**orderly** a helper in a hospital attending to patients పరిచర్య ఆర్డర్లీ, ఆసుపత్రిలో రోగులకు సాయం చేసే సహాయకారి. **nursing o.,** nurse cum helper నర్సు మరియు సహాయకారి.

**orf** contagious ecthyma. *see/చూడండి* ecthyma.

**organ** group of tissues with a specific function అవయవము: ఒక నియమిత విధి ననుసరించు కణజాలముల సముదాయము. *e.g.* Skin is the largest organ in the body. ఉదా. త్వచము తనువులో అన్నిటికన్నా పెద్ద అవయవము. organs: అవయవములు: *e.g.* lung ఊపిరితిత్తి, stomach అన్నాశయం, wing పక్షిరెక్క, leaf చెట్టు ఆకు. **genital o.,** especially in the male; elicit history of ulcer on the glans penis after visit to a prostitute in suspects of syphilis ఆడదాని దగ్గరకెళ్ళిన తర్వాత అంగంమీద కురుపు లేచిందా (కొఱుకు సవాయి రోగం అనుమానం ఉంటే) అని అడుగుతారు డాక్టర్లు రోగిని. **vital organs,** brain, heart and lungs ప్రాణాధారమైన అవయవములు: మెదడు, గుండె, ఊపిరితిత్తులు.

**organic** 1. relating to an organ అంగము/అవయవమునకు సం. 2. coming from an organism ఒక జీవినుండి ఉత్పన్నమగు. 3. pertaining to products of living organisms జీవసహిత, సజీవ ప్రాణులయొక్క ఉత్పాదకములకు సం. 4. meaning substances containing carbon కార్బనిక, కర్బన సం. **o. chemistry** కర్బన రసాయన శాస్త్రము. **o. disease,** one in which there is a structural change in the organ [in *contr.* functional] అవయవములో నిర్మాణాత్మక పరిణామం ఉన్న జబ్బు. **o. matter** సేంద్రియ పదార్థము.

**organic heart disease** heart disease caused by some structural abnormality (congenital or acquired) నిర్మాణాత్మకమైన వైపరీత్యమువలన కలిగిన (పుట్టుకతో వచ్చినదిగాని లేదా తదుపరి సంభవించినదిగాని) గుండె రుగ్మత [*in contr.* functional heart disease భిన్న. గుండెయొక్క విధి అపవ్యవస్థవలన కలుగు జబ్బు.]

**organism** 1. an individual living entity/being జీవి. 2. organic structure అంగక్రమముగల/స్వరూప నిర్మాణము.

**orgasm** the climax/zenith in sexual excitement immediately before the actual ejaculation, comparable to the count-down at the time of the launch of a rocket లైంగిక సుఖానుభూతికి ముమ్మరము/ఉచ్ఛ్రాయదశ; పోలిక: రాకెట్ ప్రయోగమునకు (అగ్నిజ్వాలకు) ముందు ఉద్రేకంతో కూడిన క్షణములు.

**orgy** 1. a party/celebration involving indiscriminate sexual activity and excessive drinking అసభ్యలైంగిక ప్రవర్తన (వ్యభిచారం) మరియు త్రాగుబోతుతనం కలిగిన వినోదం. 2. any act of excessive or frenzied indulgence ఏదైనా అమితమైన లేదా ఉద్రేకపూరితమైన పని.

**orifice** os, opening, meatus ద్వారము, రంధ్రము. entrance or exit ప్రవేశ లేదా నిష్క్రమణద్వారము: 1. in any body cavity, *e.g.* mouth, anus తనువులోని కుహరములో, ఉదా. నోరు, ఆసనము. 2. in a hollow organ, *e.g.* stomach బోలు అవయవములో, ఉదా. అన్నాశయము. 3. in a tube, *e.g.* oesophagus గొట్టములో, ఉదా. అన్నవాహిక. 4. in a channel, *e.g.* urethral meatus మార్గములో, ఉదా. మూత్రమార్గపు రంధ్రము.

**origin** beginning of anything పునాది; ఉత్పత్తి, ఉద్భవము; ఏదైనా ఆరంభము, ప్రారంభము, మూలము. 1. **o. of a muscle** కండరము వెలయుచోటు (ఎముకమీద) [*in contr.* insertion]. 2. **o. of a nerve** (a) emergence of a cranial nerve from the brain కపాలనాడి మెదడులో ఉత్పత్తి స్థానము (b) emergence of a spinal nerve from the spinal cord వెన్నుపామునుండి కశేరునాడి బయలుదేరుట, తరువాత బయలువెడలుట. 3. **o. of a blood/lymph vessel** from the parent trunk ధమనినుండి ధమనిక ఉద్భవించుట; లింఫ్ కాండమునుండి పుట్టే పిల్లకాండములు.

**oropharynx** region of the pharynx between the soft palate and epiglottis కొండనాలుకనుండి అధికంఠబిలమువరకుగల గ్రసనిప్రాంతము.

**ORS** *abbr.* oral rehydration salt/solution, vital supportive agent in diarrhoea, to combat dehydration అతిసారములో అత్యవసరమైన ఆస్యజలీకరణ మిశ్రమము.

**ORT** *abbr.* oral rehydration therapy, *see/చూడండి* ORS.

**orthodontics** a branch in dentistry దంతశాస్త్రములోని విభాగము.

**orthopaedics** or **orthopedics** branch in medicine dealing with the surgery of bones and joints శల్యవైద్యము: ఎముకలు మరియు కీళ్ల శస్త్ర వైద్య విభాగము. **hot o.**, dealing with acute conditions, *e.g.* trauma, వాడియైన వ్యాధులు, ఉదా. గాయములకు చికిత్స. **cold o.**, chronic, long standing diseases, *e.g.* tuberculosis of vertebrae దీర్ఘకాలపు జాడ్యములు, ఉదా. వెన్నుపూస ఎముకలకు సోకిన క్షయవ్యాధి.

**orthopnoea** or **orthopnea** to become breathless on lying in bed, relieved by sitting బోర్ల/వెల్లకిల పడుకున్నప్పుడు ఆయాసము, కూర్చొనగానే తగ్గుతుంది. This occurs in heart failure. గుండె సోలిపోయిన స్థితిలో సంభవిస్తుంది.

**orthoptics** the study and treatment of muscle imbalance of the eye (squint) కన్నుగుడ్డు కండరాల శాస్త్రం (మెల్లకన్ను ఎట్లా సరిదిద్దాలో తెలియపరచే విద్య).

**orthostatic** caused by standing erect నిల్చున్నప్పుడు సంభవించే. **o.hypotension**, postural hypotension, *i.e.* lowered blood pressure

produced by standing erect (as compared to the reading while lying down) నిల్చున్నప్పుడు (పడకలో పడుకున్నప్పటికి పోల్చిచూస్తే) బ్లడ్ ప్రెషర్ తగ్గుట.

**os** 1. opening, *see/చూడండి* orifice, ostium. ద్వారము, రంధ్రము. 2. bone ఎముక, *e.g.* os coccygis, (coccyx) అనుత్రికము. 3. external os, opening of the cervix into the vagina గర్భద్వారం యోనిలోనికి తెరచుకొనే అంచు. 4. internal os, opening of the cervix into the uterus గర్భద్వారం గర్భసంచిలోనికి తెరచుకొనే అంచు.

**osmosis** a phenomenon in which there is spontaneous movement of a solvent, *e.g.* water, across a semipermeable membrane, from a more dilute solution to a more concentrated one ద్రవాభిసరణ: ఇది ఒక దృగ్విషయము. విభిన్నగాఢతలుగల రెండు ద్రావణములు (solutions) విచక్షణాస్తరము (semipermeable membrane) ద్వారా వేరుచేయబడినప్పుడు, తక్కువ గాఢతగల ద్రావణములో ద్రావణి (solvent, *e.g.* water) ఎక్కువ గాఢతగల ద్రావణములోనికి ప్రవేశించుట.

**osmotic pressure** ద్రవాభిసరణపీడనము: external pressure that must be applied to prevent the spontaneous movement of a solvent (*e.g.* water, body fluid) across a semipermeable membrane (*e.g.* biological cell membrane), from a more dilute solution to a more concentrated one తక్కువ గాఢతగల ద్రావణములోని ద్రావణి (ఉదా. నీరు, శరీరంలో ద్రవం) ఎక్కువ గాఢతగల ద్రావణములోనికి విచక్షణాస్తరము (ఉదా. జీవకణత్వచము) ద్వారా ప్రవేశమును అరికట్టే బాహ్యపీడనము.

**osseous** 1. bony ఎముకవలె. 2. pertaining to bone ఎముకకు సం. **o.labyrinth,** hard part of the temporal bone around the inner ear పద్మవ్యూహం ఎముక.

**ossicles** the small bones in the middle ear: the malleus, incus and stapes, *see/చూడండి* ear. మధ్యచెవి (శ్రుతి కుహరము)లో అస్థికలు/అస్థిఫలకములు.

**ossification** the transformation into bone అస్థీకరణం, ఎముక నిర్మాణం: ఎముకగా పరిణామము చెందుట.

**ost-** or **osteo-** prefix referring to bone అస్థి/ఎముకకు సం. పదంలోని ఉపసర్గము.

**osteitis** or **ostitis** inflammation of bone అస్థిశోథ, ఎముకలో శోథము/'పోటు మంట వేడి వాపు'.

**osteoarthritis** commonly occurring degenerative joint disease especially in both knees (weight bearing joints); causes pain and stiffness ఎముకలు మరియు కీళ్ళశోథము, క్షీణదశ కీళ్లజబ్బు; ముఖ్యముగా శరీరబరువు మోయు మోకాళ్ళు గురిఅవుతాయి; నొప్పి, బిగువు కలిగి ఉంటాయి. In some women this may coincide with menopause. కొంతమంది స్త్రీలలో ఇది మరియు ముట్లు ఎండిపోయిన దశ తోడు బాధలు. Aging, wear and tear of joints are predisposing factors. వయసు ముదరటం, కీళ్లు అరిగిపోవుట మరియు క్షయించుట దీనికి దారితీస్తాయి. Chronic irritation and trauma are contributory factors. దీర్ఘకాలపు రాపిడి, మోకాలుకు దెబ్బలు బాధను మరింత ఎక్కువ చేస్తాయి. ఈ జానువు జాడ్యము వృద్ధజనులలో చాలామందిలో పరిపాటి.

**osteoarthropathy** any disease of the joints and bones కీళ్ళ మరియు ఎముకల యొక్క ఏదైనా జబ్బు. **hyper trophic pulmonary o.**, *e.g.* in lung cancer ఊపిరితిత్తి కాన్సరులో మణికట్టు, చీలమండ ప్రాంతాల్లో ఎముక అంచుల ఉబ్బు, కీళ్ళకాయిలా.

**osteoarthrosis** chronic non-inflammatory disease of the bone ends and joints, leading to deformity దీర్ఘకాలపు శోథరహిత జబ్బు. ఎముకల అంచున, కీళ్ళల్లో వాతం. Hip, knee and thumb affected usually తరచుగా తుంటి, మోకాలు మరియు బొటనవేలు ఈ జబ్బుకు గురిఅవుతాయి.

**osteoblast** primitive bone cell ఆదిమ ఎముక కణము. precursor of osteocyte ఆస్టియోసైట్ యొక్క అగ్రగామి.

**osteoclast** *syn.* osteophage. a large multinucleated cell which absorbs or removes unwanted bone అనవసరమైన ఎముకను శోష

ణము చేయు లేదా తీసివేయు బహుళ కేంద్రకములు గల పెద్దకణము. *figur.* bone destroyer *అలంకార.* శల్యహారిణి, శల్యనాశిని, శల్యధ్వంసిని.

**osteoclastoma** tumour arising from osteoclasts; may be benign, locally recurrent or even malignant ఆస్టియోక్లాస్ట్ కణములనుండి ఉద్భవించు కంతి – నిరపాయకరమైనది కావచ్చు, మరల మరల సంభవించు గుణము కలది కావచ్చు లేదా అపాయకరమైనది గూడా అవచ్చు.

**osteocyte** adult/mature bone cell పక్వమైన ఎముక కణము, అస్థికణము.

**osteogenic** bone producing ఎముకను ఉత్పత్తి చేయు. **o. sarcoma,** malignant tumour అపాయకరమైన కంతి.

**osteology** [osteo+Greek *logos*, study]. a branch in anatomy; study of bones అస్థిశాస్త్రము, శల్యశాస్త్రము, అస్థివిజ్ఞానము, శరీర నిర్మాణశాస్త్రములోని విభాగము; ఎముకలను ఎరుకపట్టడం.

**osteolytic** lysis/dissolution of bone ఎముక విచ్ఛిన్నము. osteolytic malignant secondary deposits in the bone from a primary else where శరీరంలో వేరేచోట ఉన్న అసలు కంతి (primary) తాలూకు అపాయకంతి కణపిలకల (secondary deposits or secondaries) యొక్క విచ్ఛిన్నరూపములు ఎముకలో చోటు చేసుకొనుట [*in contr.* osteosclerotic భిన్న. దృఢరూపములు].

**osteoma** benign tumor of the bone ఎముకయొక్క నిరపాయ కంతి.

**osteomalacia** a disease of softening of bone అస్థి మృదుత్వం.

**osteomyelitis** inflammation of bone due to pyogenic infection; pus exudes through sinuses, *see/చూడండి* sequestrum. అస్థిమజ్జ శోథము: ఎముకయొక్క 'నొప్పి వేడి మంట వాపు'తో ఎముకలో చీముచేరుట. ఆ చీము ఎముకలో సందులు చేసుకుని బయటకు వస్తుంది.

**osteopathy** 1. any disease of the bone ఎముకకు ఏదైనా జబ్బు. 2. manual manipulation of bones and joints and massage of muscles around, to relieve pain ఒళ్ళుపట్టడం; కీళ్ళు, చుట్టూఉన్న కండరాలను మాలీష్ చేయడం.

**osteopetrosis** marble bones disease పాలరాళ్ళవలె ఉన్న ఎముకలు. congenital disease of dense but brittle bones; also notorious by common occurrence of fractures of affected bones దట్టమైనవి కాని పెళుసుగా ఉండే ఎముకల వ్యాధి, పుట్టుకతో వచ్చినది, ఇవి తరచుగా విరుగుతాయి.

**osteophyte** outgrowth of bone, X-ray finding, *e.g.* lipping/ beaking of vertebral border మీదనుంచి పెరిగిన ఎముక, ఎక్స్‌రే ఫోటోలో కనపడుతుంది, ఉదా. వెన్నుపూసతలము అంచున పెరిగిన గుబ్బ.

**osteoplasty** plastic surgery on the bones, *see/చూడండి* plastic surgery.

**osteoporosis** increased porosity/rarefaction of bone, making it weak బోలు ఎముకలవ్యాధి: ఎముకలోని బోలుతనము/సూక్ష్మరంధ్రములు కలిగియుండు స్థితి ఎక్కువగుట అనగా ఎముక క్షీణించుట. **cortico-steroid induced o.**, prolonged administration of corticosteroid drugs, say in bronchial asthma leads to this ఉబ్బసములో దీర్ఘకాలంపాటు ఈ మందులు వాడితే ఎముకలు క్షీణించవచ్చును. **senile o.**, in aging వృద్ధాప్యములో వచ్చు ఎముకల క్షీణత. The bones are weak, painful and liable for fractures. ఎముకలు క్షయమునొంది, వేదనకల్గించి, సులువుగా విరుగుటకు సిద్ధముగా నుండును. Spine and hips are commonly affected in old age. వృద్ధాప్యంలో వెన్నెముక, తుంటిఎముకలు ఎక్కువగా ఈ జబ్బుకు గురి అవుతాయి.

**osteosarcoma** osteogenic sarcoma, a malignant tumour of the bone, *see/చూడండి* sarcoma. ఎముకయొక్క అపాయకరమైన కంతి.

**osteosclerosis** the hardening of bone అస్థికాఠిన్యత, ఎముక గట్టిపడుట [*in contr.* osteolysis భిన్న. ఎముక విచ్ఛిన్నము].

**osteotome** an instrument for cutting bone అస్థి విచ్ఛేదన పనిముట్టు.

**osteotomy** division of bone అస్థివిచ్ఛేదన.

**ostitis** *see/చూడండి* osteitis

**ostium** a mouth or orifice, opening రంధ్రం, ద్వారం. *e.g.* **o. vaginae** ఉదా. యోనిరంధ్రము.

**ostomate** a person who has undergone an ostomy operation ఈ అపరేషన్ చేయించుకున్న వ్యక్తి.

**ostomy** stoma=opening. surgical opening in the abdominal wall for the purpose of removal of wastes – faeces and urine ఉదరకుడ్యము మీద రంధ్రంచేసి తద్వారా మలంగాని లేదా మూత్రంగాని వెడలించే శస్త్రచికిత్స, *see/చూడండి* also colostomy.

**otalgia** earache చెవినొప్పి.

**otic** pertaining to ear కర్ణ, చెవికి సం.

**otitis** inflammation of the ear కర్ణశోథము: చెవిలో 'పోటు నొప్పి వేడి మంట వాపు'. **o. externa** వెలుపలి చెవివాపు. **o. interna** లోపలి చెవితీపు. **o. media** మధ్యచెవిపోటు.

**otolaryngology** *see/చూడండి* otorhinolaryngology.

**otolith** calcareous granules in the inner ear, the movement of which helps maintain equilibrium లోపలిచెవిలో నూకలుగా ఏర్పడిన నలుసులు. ఇవి శరీర సమతాస్థితి (equilibrium) ని నిలుపుటకు తోడ్పడుతాయి.

**otology** the science of ear diseases చెవిజబ్బుల శాస్త్రం.

**otomycosis** fungus infection of the ear canal చెవిలో ఫంగస్ జబ్బు.

**otorhinolaryngology** *abbr.* ENT department, ear, nose and throat section చెవి, ముక్కు, గొంతు శాఖ/విభాగము.

**otorrhoea** or **otorrhea** discharge from the ear కర్ణస్రావం: చెవినుండి ద్రవంకారుట.

**otosclerosis** new bone formation around the labyrinth of the inner ear, one cause for hearing loss లోపలి చెవిలోని పద్మవ్యూహం (labyrinth) చుట్టూతా క్రొత్తఎముక చేరుట – ఇది చెవుడుకు ఒక కారణము.

**otoscope** a device for examining the external ear కర్ణాంతరదర్శిని: బాహ్యచెవి కుహరమును పరీక్షించే సాధన(ము).

**ototoxic** producing deafness and reeling, **o. drug,** *e.g.* after some injections of streptomycin స్ట్రెప్టోమైసిన్ సూదులు కొన్ని తీసుకున్న తర్వాత కలుగు చెవుడు, ఒళ్ళు తిరుగుట.

**outbreak** sudden appearance అకస్మాత్తుగా ప్రత్యక్షమగుట. **o. of cholera** కలరా తటాలున వ్యాపించుట.

**outlet** a passage out బయటికిపోవు మార్గము. **pelvic o.** శ్రోణి నిష్క్రమణద్వారం.

**outpatient** outdoor patient in a hospital, one who takes treatment staying outside ఆస్పత్రిలో చేరకుండా బయటనే ఉండి మందులు తీసుకునే రోగి [*in contr.* inpatient *భిన్న.* ఆసుపత్రిలో చేరిన రోగి].

**output** quantity ejected or thrown out నెట్టబడిన మొత్తం. **cardiac o.,** 5 litres of blood per minute ejected by either ventricle in health in an average adult ఆరోగ్యములో, ప్రౌఢజీవిలో నిముషమునకు 5 లీటర్ల రక్తము (రెండింటిలో) ఒక్కొక జఠరికలోనుండి చిమ్మబడుతుంది. **urinary o.,** amount of urine passed, say in a day (24 hours) గత 24 గంటల్లో పోసిన మూత్రము.

**ova** [ovum *sing.*] *micro.str.* *సూక్ష్మ.చూ.* 1. female reproductive cells స్త్రీప్రత్యుత్పత్తి కణములు. 2. **parasitic o.,** motion examination for ova పరాన్నజీవి గుడ్లు విరేచనములో పరిశీలించుట.

**oval window** entry to the cochlea in the internal ear; sound waves from the ossicles in the middle ear transmitted to the cochlear canal అండాకార గవాక్షము: లోపలిచెవిలోని కర్ణావర్తానికి ప్రవేశము; ఈ గవాక్షము/కిటికీద్వారా ధ్వని కంపనాలు మధ్యచెవిలోని అస్థికలనుండి కర్ణావర్తకుల్యలోకి పయనిస్తాయి.

**ovarian** relating to ovary అండాశయమునకు సం. **o. cyst** అండాశయ తిత్తి. may be benign or malignant నిరపాయ లేదా అపాయకరమైన.

**ovariectomy** *see/చూడండి* oophorectomy. అండాశయచ్ఛేదన(ము).

**ovariotomy** incision into an ovary అండాశయంలో కత్తిగాటు.

**ovaritis** oophoritis. *see/చూడండి* oophoritis.

**ovary** the female gonad (gonad = బీజకోశము) అండాశయము, అండకోశము, స్త్రీబీజకోశము.

**overt** visible openly బయటకు కనపడు. **o. sign** of a disease, a sign as an eye-opener కనువిప్పు కలిగించే వ్యాధి గుర్తు/లక్షణము [*in contr.* occult *భిన్న.* గుప్త].

**overweight** One is said to be overweight when one's weight is 10% or more over one's normal weight. తను ఉండవలసిన బరువుకన్నా 10 శాతము ఎక్కువ ఉన్నట్లయితే హెచ్చు బరువు అంటారు. If not controlled, this leads to obesity, *see*/*చూడండి* obesity. శ్రద్ధవహించకపోతే ఈ హెచ్చు బరువు కొవ్వుశరీరంలోకి దింపుతుంది. *proverb:* A stitch in time saves nine. *లోకోక్తి:* మొక్కై వంగనిది మ్రానై వంగదు.

**oviduct** Fallopian tube. duct connecting ovary to the uterus అండవాహిక: ఫెల్లోపియన్ నాళము. గర్భాశయమును అండాశయంతో కలిపే నాళము.

**oviparous** egg-laying. living beings whose young ones develop in eggs laid outside the maternal body గ్రుడ్లు పెట్టెడు [*in contr.* viviparous].

**ovulation** discharge of ovum from the mature ovarian (Graafian) follicle, *see*/*చూడండి* menses. అండోత్సర్గము: పక్వమైన గ్రాఫియన్ పుటికనుండి అండము వెడలుట.

**ovum** the female reproductive cell 0.14mm (140 $\mu$) in diameter అండము: స్త్రీ ప్రత్యుత్పత్తి కణము. the female germ cell స్త్రీ బీజకణము, *అలంకార.* జీవాంకురము.

**oxidase** an enzyme that catalyses oxidation in plant and animal cells ఆక్సిడేజ్: వృక్షకణములలో మరియు జంతు కణములలో ఆక్సీకరణమును ఉత్ప్రేరింపజేసే ఎంజైము.

**oxygen** Atmospheric air which we breathe contains about 20% oxygen. ఆక్సిజన్, ఆమ్లజని, ప్రాణవాయువు: మనం ఊపిరిపీల్చే గాలిలో దాదాపు 20 శాతం ప్రాణవాయువు ఉన్నది. life supporting agent in respiration ప్రాణాన్ని నిలబెట్టేదిగాబట్టి ప్రాణవాయువు అన్నారు. **o. cylinder** ఆమ్లజని సిలిండర్. **o. toxicity,** *see*/*చూడండి* toxicity.

**oxygenation** the process of adding oxygen to blood, *see*/*చూడండి* machine. రక్తమునకు ఆక్సిజన్ ఇచ్చుట. **extracorporeal membrane o.** *abbr.* (ECMO), respiratory life support for premature newborn babies నెలలు నిండకుండా భూమి మీదకు వచ్చిన శిశువులకు శ్వాసక్రియ/జీవనప్రాపు కలుగజేయు ప్రక్రియ.

**oxygen mask** mask=covering over the face or mouth. ముసుగు లాంటి పరికరం. a device to supply oxygen ఆక్సిజన్ అందించడానికి/ పీల్చడానికి వాడే సాధన(ము).

**oxygen tent** a tent-like apparatus covered over the body for the supply of oxygen, *resemblance:* mosquito umbrella over an infant ఆక్సిజన్ పీల్చేందుకు వీలుగా తయారు చేసిన గుడారంలాంటి సాధన(ము), పోలిక: పసిపిల్లల మీద ఉంచే దోమతెర గొడుగు. దీన్ని శరీరంపైన పెడ్తారు.

**oxyhaemoglobin** also called oxygenated haemoglobin. haemoglobin in combination with oxygen, the form present in arterial blood. It is bright red in colour. ఆక్సిజన్‌తో కూడిన రక్తరంజకద్రవ్యము. ఇది ధమనుల రక్తంలో ఉంటుంది. శుద్ధ ఎర్రవర్ణం కలిగి ఉంటుంది.

**oxyntic** 1. secreting acid ఆమ్లము స్రవించేది. 2. parietal (oxyntic) cells in the wall of stomach which secrete hydrochloric acid అన్నాశయము గోడలో నున్న కణములు – హైడ్రోక్లోరిక్ ఆమ్లమును స్రవించేవి.

**oxytocic** 1. concerning oxytocia, *i.e.* rapid labour సత్వర కాన్పుకు సం. 2. an agent that promotes rapid delivery సత్వర కాన్పు జరుపు సాధనము, ఉదా. గర్భాశయ ప్రేరక ఔషధం.

**oxytocin** also called pitocin. pituitary hormone; actions: పిట్యూటరీ హార్మోన్ విధులు: (1) contracts the uterus during labour ప్రసవసమయంలో గర్భసంచిని ముడుచుకొనేటట్లు చేస్తుంది. (2) stimulates flow of milk while suckling the breasts చీకుతుంటే పాలిండ్లలో పాలు వృద్ధి పొందేటట్లు చేస్తుంది.

**oxyuriasis** infestation with *Oxyuris (Enterobius)* vermicularis, also called threadworms, pinworms, seat worms నులిపురుగుల సంపర్కం.

**ozaena** atrophic rhinitis క్షీణతలోనున్న నాసికశోథ.

**ozone** 1. $O_3$, an antiseptic and disinfectant పూతిరోధి/కుళ్ళుప్రతిబంధకము మరియు సంక్రమణహారి/క్రిమిసంహారిణి/క్రిమినాశిని. 2. irritant and toxic to lungs ఊపిరితిత్తులకు హాని కల్గించేది. 3. carcinogenic కేన్సరు కారకము.

# P p

**pacemaker** natural pacemaker is the sinoatrial node (SA node) in the wall of the right atrium which generates microelectrical impulses that initiate cardiac contractions గతిప్రేరకము: కుడి ఏట్రియమ్ కుడ్యములోనున్న ఎస్.ఎ.నోడ్ సూక్ష్మవిద్యుచ్ఛక్తి ప్రచోదనములను ఉత్పత్తి చేసి, గుండె సంకోచములు కలుగజేస్తుంది. **artificial internal p., cardiac p.,** surgically implanted inside the chest to do the above job కృత్రిమ హృదయగతి ప్రేరకం: ఈ పై కార్యనిర్వహణకు కృత్రిమ యంత్రము ఛాతీలో శస్త్రనైపుణ్యం ద్వారా ప్రవేశపెడతారు.

**pachydermia** pachyderma. abormally thick skin అసాధారణమైన మొద్దుచర్మం.

**pachymeningitis** inflammation of the duramater పరాశిక యొక్క శోథము/'నొప్పి వేడి వాపు'.

**paediatrician** or **pediatrician** specialist in paediatrics బాల్యదశ వ్యాధుల నిపుణుడు/స్పెషలిస్టు.

**paediatrics** or **pediatrics** study of the diseases of children బాల్యదశ వ్యాధుల శాస్త్రము [Cf. geriatrics తారత. వృద్ధాప్యవ్యాధుల శాస్త్రము].

**paedology** or **pedology** study of physiological and psychological aspects of childhood పిల్లలలో శారీరకధర్మం మరియు మనోవిజ్ఞానం వివరించే శాస్త్రం/జ్ఞానం.

**paedomorphism** or **pedomorphism** *biol.* retention of juvenile characteristics in the mature stage of development ఎదుగుదలలో పరిపక్వతనొందిన దశలో ఇంకా బాల్యచేష్టలుండట.

**paedophile** or **pedophile** one who indulges in child abuse, *see/చూడండి* paedophilia.

**paedophilia** or **pedophilia** *sl.* child abuse. child-sex offender, sexual activity of a male adult with a prepubertal female child ప్రౌఢదశ పురుషుడు రజస్వలకాని బాలికతో లైంగిక సంబంధం పెట్టుకొనుట. గ్రా. ఇట్టి మూర్ఖుని ముసలం పట్టాలి; వీడిని ముసలముతో చితకగొట్టాలి.

**Paget's disease** 1. of bone, *syn.* osteitis deformans. deformities of bones, bowed tibias (sabre shins), collapse of vertebrae ఎముకల వికృతాకృతి, అంతర్జంఘికల వంపు (దీనివలన ఖడ్గములనుపోలిన కాళ్ళు), వెన్నుపూస ఎముకలు అణగిపోవుట. increased size of head, necessitating too frequent change of hats తలసైజు పెరుగుటవలన హేట్‌లను బహుతరచుగా మార్చుట. The above changes are due to destruction and thinning of bones పైన వివరించిన మార్పులు ఎముకలు నశించి సన్నబడ్డందువలన కలగుతాయి. 2. of nipple, erosion of nipple due to invasion of cancer of breast స్తనగ్రంథికేన్సరు చూచుకమునకు ప్రాకి అక్కడ మొరికె పడుట.

**pain** an annoyance mediated through nerves: pain, tenderness, affliction, distress, suffering, stabbing, ache, anguish, agony తొందరపెట్టు నాడీ హింస: నొప్పి, సలుపు, వేదన, వ్యథ, బాధ, పోటు, తీపు, కృచ్ఛ్రము, క్లేశము *figur.* Pain tests one's patience. అలంకార. తీపు తితిక్షకు/ఓర్పుకు పరీక్ష

**painkiller** analgesic బాధానివారిణి. drug/agent that relieves pain నొప్పిని నిర్మూలించే లేదా తగ్గించే ఔషధం/వస్తువు.

**palate** the roof in the mouth అంగిలి, తాలువు, నోటికప్పు. **cleft p.,** a fissure in the bone నోటికప్పులో సందు. **hard p.,** bony front part ముందున్న ఎముక భాగము. **soft p.,** back fleshy portion from the undersurface of which uvula hangs వెనుక మాంసపు మెత్తని భాగము – దీని అడుగున కొండనాలుక (చిన్నాలుక) వేలాడుతుంటుంది.

**palatine bone** bone of the palate తాల్వస్థి.

**palliative** an agent that alleviates but cannot cure a disease నయముచేయలేదుగాని ఉపశాంతి కలుగజేయు సాధనము.

**pallor** paleness of mucous membranes, skin, *e.g.* in anaemia శ్లేష్మపొరలు, చర్మము పాలిపోవుట, ఉదా. రక్తహీనత.

**palm** 1. the inner surface of the hand అరచేయి, పాణితలము, హస్తము యొక్క ఎదురు/ముందు భాగం. 2. **p. oil,** obtained from fruits of palm oil trees. పామ్‌ఆయిల్ చెట్లపండ్ల నుంచి తీసిన నూనె.

**palmar** concerning the palm, the inner surface of the hand అరచేతికి సం. [*Cf.* plantar తారత. అరికాలుకు సం.].

**palpation** touching, feeling or applying pressure over a region, a method in clinical examination of the patient తాకుతూ పరీక్షించటము: రోగిని పరీక్షచేయు విధానము; స్పర్శ, పట్టుకొనిచూడటం లేదా ఒక ప్రాంతమును ఒత్తిడితో తనికీ చేయటం.

**palpebrum** eye lid కన్నురెప్ప. *figur.* eye guard అలంకార. కన్నుకు కాపు/రక్ష

**palpitation** subjective feeling of one's own rapid heart beat in one's chest గుండె అదురు, గుండెదడ: తన గుండె తనలో వేగముగా కొట్టుకొంటున్నట్లు తోచుట.

**palsy** paralysis పక్షవాతం. **Bell's p.**, unilateral paralysis of facial muscles due to involvement of the $7^{th}$ cranial nerve producing deformity of mouth and inability to close the eye. 7 వ కపాలనాడి రుగ్మతవలన ఆ వైపు ముఖపేశీలు పనిచేయక నోరు కురూపము పొందటం, నేత్రం మూసుకొనలేకపోవటం. **shaking p.**, involuntary tremor in Parkinsonism ఈ జబ్బులో అనియంత్రిత కండరవణకు.

**panacea** a universal remedy సర్వస్వ ఔషధము. a cure-all for any illness సర్వరోగనివారిణి.

**panarthritis** 1. inflammation of many joints పెక్కు కీళ్ళ శోథము/ 'నొప్పి వేడి తీపు వాపు'. 2. inflammation of all the parts of a joint కీలులోని అన్ని భాగముల ఇన్‌ఫ్లమేషన్.

**pancarditis** inflammation of the entire heart, *viz.* pericarditis, myocarditis, endocarditis, *e.g.* rheumatic process which licks the joints but bites the heart పూర్ణహృదయశోథము: గుండె యావత్తునకు 'వేడి వాపు' కలుగజేస్తుంది, ఉదా. రుమాటిక్ రుగ్మత – ఇది కీళ్ళకుపాకి, వాటిని నాకి గుండెను కొరుకుతుంది.

**pancreas** racemose gland, *i.e.* one resembling a cluster of grapes; elongated, lying tranversely behind the stomach క్లోమము: ద్రాక్షపండ్లగుత్తివంటి ఆకారములోనున్న, నిడుపుగానున్న గ్రంథి – ఇది అన్నాశయము వెనుక అడ్డముగా అమర్చబడి ఉన్నది. Its external

secretion contains enzymes helping digestion. దీని బహిర్స్రావములో జీర్ణమునకు తోడ్పడు ఎన్జైములున్నవి. Insulin which regulates the metabolism of glucose in the body is its internal secretion, *see/చూడండి* insulin, diabetes. ఇన్సులిన్ అను అంతర్స్రావము శరీరంలో గ్లూకోజ్ జీవ(న)క్రియను క్రమబద్ధము గావించును.

**pancreatectomy** excision of the pancreas క్లోమవిచ్ఛేదనం.

**pancreatic juice** mixture of digestive enzymes secreted from the pancreas క్లోమరసం: క్లోమంలోని జీర్ణమునకు సం. ఎన్జైముల మిశ్రమం.

**pancreatin** a mixture of enzymes from the pancreas of ox or hog, a product marketed ఎద్దు లేదా పంది యొక్క క్లోమము నుండి తీసి తయారుచేసిన ఎంజైమ్ మిశ్రమము. దీన్ని మందుల దుకాణంలో అమ్ముతారు.

**pancreatitis** inflammation of the pancreas క్లోమముయొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'. **acute haemorrhagic p.,** bleeding into and autolysis of the pancreas క్లోమ రక్తసిక్త శోథం: క్లోమములోనికి రక్తస్రావం మరియు దాని స్వయం విచ్ఛిన్నము.

**pancreatolithiasis** presence of calculi in the pancreas క్లోమములో రాళ్ళు/శిలలు. occurs in chronic pacreatitis దీర్ఘ కాలపు క్లోమము వాపు వ్యాధిలో చూడనగును.

**pancytopenia** decrease of all blood cells అన్నిరకముల రక్త కణములు తరుగుట/తక్కువగుట.

**pandemic** all + people; epidemic over a large region, *e.g.* influenza pandemic విశ్వమారి: విస్తృతముగా ప్రబలే వ్యాధి, ఉదా. బహుళజనబాధక మారి, ఇన్ఫ్లూయన్జా.

**panhysterectomy** removal of the entire uterus సంపూర్ణ గర్భాశయ చ్ఛేదన.

**pannus** corneal vascularisation secondary to irritation రాపిడి వలన శుక్లపటలములో రక్తనాళములు, రక్తనాళికలు వ్యాప్తి చెందుట.

**panophthalmitis** panophthalmia. inflammation of the entire eye సంపూర్ణ నేత్రశోథము: కన్నుమొత్తమునకు 'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**pansinusitis** inflammation of all sinuses, maxillary, frontal, ethmoid, *etc.* ఈ కుహరముల శోథము/'నొప్పి పోటు వాపు'. *N.B.* one common cause for headache *గమనిక:* తలనొప్పికి ఒక తరచు కారణము.

**Papanicolaou smear** and **Papanicolaou test** often shortened to **Pap smear** and **Pap test,** for detecting cancerous or precancerous cells, especially cancer of cervix after scraping the wall of the cervical canal, staining and observing under the microscope. కేన్సరు ప్రప్రథమ దశలో కనుక్కొనడానికి చేసే పరీక్ష ముఖ్యముగా గర్భాశయద్వారం (cervix uteri)ను గీకి, ఆ పదార్థమును కేన్సరు కణములకొరకు సూక్ష్మదర్శినిలో చూస్తారు.

**papilla** [papillae *pl.*] nipple shaped చన్నుమొన/చనుగుబ్బ/ కుచాగ్రమునుపోలిన. *naked eye str.* ప్రత్యక్షచూ. **circumvallate p.,** vallate p., 8 to 12 papillae arranged in V shape at the base of the tongue నాలుక మొదట్లో 8 నుంచి 12 గుబ్బలు. **lacrimal p.** కంటి కొలికి. **mammary p.,** the nipple of the breast చూచుకము. **urethral p.,** a boss in the vestibule of vagina above the urethral orifice యోని నడవ/కుహరికలో మూత్ర రంధ్రముపైన గుబ్బ. *micro.str.* సూక్ష్మ.చూ. **dental p.,** dentinal p., mesenchyme in the enamel of the tooth పంటిగుబ్బలో మధ్యభ్రూణకణజాలము. **dermal p.,** structures containing blood capillaries and nerve fibrils in the skin సూక్ష్మాంకురము: చర్మములోని రక్తకేశనాళికలు మరియు సూక్ష్మనాడీతంత్రులుగల సూక్ష్మాంకురము. **hair p.,** the fibrovascular mesodermal papilla in the hair bulb రోమ లశునములోని తంతుయుత రక్తనాళికామయ మధ్యత్వచ సూక్ష్మాంకురము. **lingual papillae,** on the tongue: నాలుకమీద సూక్ష్మాంకురాలు. filiform (threadlike) with sharp point తంతురూపములో నుండి వాడిమొన కలిగిన. fungiform (mouldlike) బూజుతంతుల గుచ్ఛమువలె.

**papillary muscle** bundles of muscles (chordae tendineae) in the ventricles of the heart గుండె జఠరికలలోని స్నాయురజ్జువులు.

**papillitis** inflammation of the optic papilla (disk) నేత్రబింబ శోథము: నేత్రచక్రికయొక్క 'ఎరుపు వాపు'.

**papilloedema** or **papilledema** choked disc క్రిక్కిరిసిన నేత్ర చక్రిక. oedema of the optic disc as seen through an opthalmo scope నేత్రాంతర్దర్శినిలో చూసినప్పుడు కనబడే నేత్రచక్రికయొక్క ఉబ్బు/వాపు. indicative of increased intracranial tension, *e.g.* in intracranial tumour కపాలములో ఒత్తిడి ఎక్కువైనట్లు సూచన, ఉదా. కపాలములో కంతి ఉన్న స్థితిలో.

**papilloma** benign tumour derived from the epithelium పులిపిరి కాయ: ఉపకళనుండి ఉత్పన్నమైన నిరపాయ కంతి.

**papilloretinitis** inflammation of the optic disk and retina నేత్ర చక్రిక మరియు నేత్రపటలముయొక్క శోథము/'ఎరుపు వాపు'.

**Pap smear** also **pap smear.** *see/చూడండి* Papanicolaou smear.

**papule** a small pimple పొక్కు, మొటిమ, బుడిపె. presence of pimples: a sign commonly seen in teenagers (the peroid from one's $13^{th}$ to $19^{th}$ year) 13 నుండి 19 ఏళ్ల వయస్సులోనున్నవారిలో ఎక్కువగా చూస్తుంటాము.

**para** a woman who has given birth to one or more offspring ఒకటి లేదా ఆపైని కాన్పులు కన్న తల్లి. **para 0:** none – nullipara గొడ్రాలు. **para I:** primipara తొలిచూలు, వాడు.భా. తొల్చూరు. **para II:** secundipara మలిచూలు, రెండవకాన్పు. **multipara** బహుగర్భ, బహుళగర్భవతి.

**paracentesis** removal of fluid from a body cavity శరీర కుహరం నుండి ద్రవం తీయుట. **peritoneal p.**, surgical puncture of the peritoneal cavity to withdraw fluid ద్రవము కార్చుటకై ఆంత్రవేష్టన కుహరములోనికి సూదిగుచ్చుట.

**paracetamol** an oral drug. actions: (1) analgesic, *viz.* to relieve pain. (2) antipyretic, *viz.* to reduce fever నోట్లో వేసుకునేమందు. విధులు: (1) నొప్పి తగ్గించడానికి. (2) జ్వరం తగ్గించడానికి.

**paraesthesia** or **paresthesia** abnormal sensation such as burning, pricking, tickling, tingling అసాధారణ ఇంద్రియజ్ఞానం: కాలినట్లు, గుచ్చినట్లు, చక్కిలిగిలి పెట్టినట్లు, సూదులతో పొడిచినట్లు ఉండుట.

**paralysis** 1. loss of motor function due to disease of the nerve supplying the muscles or diseases of the muscles themselves పక్షవాతము: కండరములను చలించు నాడుల జబ్బువలనగాని, లేదా పేశీల జబ్బువలనగాని చలన/చైతన్యశక్తి నశించడం. 2. loss of sensory function due to nerve involvement, *e.g.* compression on a nerve నాడి జబ్బుగాని, నాడి చిక్కుకున్నప్పుడుగాని, నాడిమీద ఒత్తిడిపడినప్పుడుగాని జ్ఞానవిచక్షణశక్తి నశించుట, ఉదా. నాడిమీద ఒత్తిడి సంభవించినప్పుడు.

**paralytic** 1. pertaining to paralysis పక్షవాతమునకు సం. 2. **p.ileus,** stoppage of intestinal movement అంత్రావరోధం, అంత్ర స్తంభన(ము). 3. a person suffering from paralysis పక్షవాతరోగి.

**paramedian** right paramedian incision on the anterior abdominal wall for conducting operations on/of abdominal viscera శరీరము మధ్యగీతకు దగ్గరగా కుడివైపు (నాభికి కుడివైపు) పూర్వాంత ఉదరకుడ్యము మీద శస్త్రచికిత్స చేయునప్పుడు సర్జన్ ఇచ్చే కత్తిగాటు.

**paramedical** adjunctive to the medical profession వైద్యవృత్తిలో సహాయకారి. **p. personnel** చికిత్స సహాయసిబ్బంది. nurses, nursing orderlies (male and female) pharmacists, operation theatre boys, laboratory technicians, *etc.* నర్సులు, వార్డుబాయ్‌లు, ఆయాలు, మందులిచ్చు సిబ్బంది, ఆపరేషన్ థియేటర్‌లో సాయము చేయువారు, మూత్రము నెత్తురు వగైరా పరీక్షచేయు కేంద్రంలో పనిచేయువారు, మొ. ఉద్యోగులు.

**parametrium** connective tissue around the uterus గర్భాశయం చుట్టూరా బంధనకణజాలం.

**paranoia** mental disorder characterized by delusions of grandeur, persecution, false impressions/belief మానసిక అపవ్యవస్థ, మానసిక తారుమారు: తనకులేని హోదా ఊహించుకొనడం, తనను ఎవరో హింసించుచున్నారని భ్రాంతి; తప్పు భావనలు/అపనమ్మకము.

**paranoid reaction** behavioural disorder; doubting others very much; *e.g.* misconception that others are betraying him పేరనాయిడ్ ప్రతిచర్య, సంభ్రాంత మనోవిక్షిప్తి ప్రతిచర్య. ఇది ఒక ప్రవర్తన

అపవ్యవస్థ; ఇతరులమీద మిక్కుటమైన అనుమానము, ఉదా. వాళ్ళు తనమీద కుట్రపన్నుతున్నట్లు అపోహ.

**paraphimosis** a complication of phimosis. When a phimosed prepuce is retracted, it gets caught/taut behind the glans; swelling and pain is felt in the glans. మేఢ్రమణిపై చర్మము బిగువుయొక్క పర్యవసానము. ఈ చర్మము వెనుకకులాగినప్పుడు బిగువువలన అది మేఢ్రమణి వెనుక గాడిలో ఇరుక్కుపోయి ఇక ముందుకురాదు. అప్పుడు మేఢ్రమణి వాచి లావెక్కి, దానికి 'పోటు మంట తీపు నొప్పి' సంభవిస్తాయి.

**paraplegia** paralysis of the lower limbs with loss of control over the urinary bladder and rectum రెండుకాళ్ళకు పక్షవాతం మరియు మూత్రమలముల విసర్జన తన స్వాధీనములో లేకుండుట.

**parasite** an organism living within/upon the body of another organism and deriving nourishment పరాన్నజీవి, పరాన్నభోజి: ఇతరులపై జీవించునది; ఒక జీవి మరియొక జీవిలోనగాని/శరీరము మీదగాని నెలవు చేసుకొని పోషణ/ఫలితము పొందుట.

**parasiticide** an agent that kills parasites పరాన్నజీవులను హత మార్చే వస్తువు.

**parasitology** study of parasites పరాన్నజీవులను గురించిన శాస్త్రము.

**parasympathetic system** *see/చూడండి* nervous system. సహ స్వతంత్రనాడీ వ్యవస్థ, పరానుభూత నాడీవ్యవస్థ.

**parathormone** parathyroid hormone పారాథైరాయిడ్ హోర్మోన్. అలంకార. శరీరానికి అవసరం గాబట్టి 'ప్యారా' థార్మోన్/హోర్మోన్.

**parathyroidectomy** excision of one or more parathyroid glands ఒకటి లేదా ఇంకెక్కువ పారాథైరాయిడ్ గ్రంథుల ఛేదన/విచ్ఛేదనం.

**parathyroid gland** four in number situated behind the thyroid gland. They regulate calcium and phosphorus metabolism through their hormone, parathormone. ఉపఅవటుగ్రంథి: థైరాయిడ్ గ్రంథి వెనుక అమర్చబడిన నాలుగు వినాళిక గ్రంథులు. వీటి స్రావము కాల్షియమ్, భాస్వరము యొక్క జీవ(న)క్రియలో పాల్గొంటుంది.

**paratyphoid** resembling in some respects typhoid కొన్ని విషయాల్లో టైఫాయిడ్‌ను పోలిన. **p. fever,** resembling typhoid; caused by bacteria *Salmonella paratyphi A,B,C;* course and severity less టైఫాయిడ్/సన్నిపాత జ్వరమును పోలిన పారాటైఫాయిడ్ (అలంకార. ప్యారా కాదు సుమా!) తేలికపాటుగా ఉండి తక్కువరోజుల్లో నయమవుతుంది.

**parenchyma** the productive portion in an organ comprising its cellular elements మృదుకణసంహతి: అవయవములోని కణజాలమూల వస్తువులతో కూడిన ఫలకరమైన భాగము [*in contr.* stroma భిన్న. స్ట్రోమము]. parenchymatous tissue మృదుకణజాలము.

**parent** 1. a father or mother తండ్రిగాని, తల్లిగాని. 2. something from which anythig is derived, i.e. origin, source ఉద్భవము, మూలము. **p.cyst (hydatid)** మూలతిత్తి [*in contr.* daughter cyst (hydatid) భిన్న. పిల్లతిత్తి]. **p. organisation,** *e.g.* Indian Medical Association, New Delhi. మూలసంస్థ, ఉదా. భారతీయ వైద్య సంస్థ, కొత్తఢిల్లీ.

**parental** *adj.* relating to a parent or parents మాత, పిత లేదా మాతాపిత. **p.care** మాతృ(సం)రక్షణ, పితృ(సం)రక్షణ లేదా మాతా పిత(సం)రక్షణ. **p.love** మాతృప్రేమ, పితృప్రేమ లేదా మాతాపితప్రేమ. **p.support** తల్లిప్రాపు, తండ్రిప్రాపు లేదా తల్లితండ్రుల ప్రాపు.

**parenteral** a route other than oral, not intestinal ఆస్యేతర, ఆంత్రేతర, నోరుకాక వేరే మార్గము. **p. administration** of a drug/agent by intramuscular or intravenous route ఔషధము/ పదార్థమును కండరములోనికిగాని, సిరలోనికిగాని ఎక్కించి తద్వారా తనువులోనికి చేర్చుట. [*in contr.* enteral.]

**paresis** 1. partial or slight paralysis పాక్షిక/అసంపూర్ణమైన లేదా కొంచెము పక్షవాతము. 2. general paresis, a syphilitic brain disease మెదడుయొక్క కొఱుకు సవాయిరోగము.

**parietal** relating to the wall of a body cavity శరీర కుహర కుడ్యమునకు సం. **p. bone,** bone in the skull near the temple కపాలములో కణతదగ్గర ఉన్న ఎముక. **p. lobe,** in the brain మెదడులో

పార్శ్వలంబిక. **p. pleura,** layer over the lung lining the chest wall ఊపిరితిత్తిపై ఛాతిగోడలోపలనుండు పొర [*in contr.* visceral pleura which closely invests the lung భిన్న. విసరల్ ప్ల్యూరా అనగా ఊపిరితిత్తిని అంటిపెట్టుకొని ఉండే పొర].

**parity** status of a woman with reference to the number of children she has borne పిల్లలను కన్న తల్లియొక్క గర్భసంఖ్యా వివరణ.

**Parkinsonism** or **parkinsonism** Parkinson's disease, paralysis agitans, shaking palsy. features: mask-like expressionless face, tremor, pill-rolling or beedi-making movements in the hands and muscular rigidity జబ్బు లక్షణములు: భావము కోల్పోయిన ముఖము/ముఖవర్చస్సు, వణుకు, మాత్రలు చేస్తున్నట్లు లేదా బీడీలు చుట్టుతున్నట్లు పాణి పేశీల కదలికలు, కండరముల బిగువు.

**paronychia** perionychia, a whitlow గోరుచుట్టు. inflammation of the tissue around the nail, a highly painful condition గోరు చుట్టూరా ఉన్న కణజాలముయొక్క, 'నొప్పి వేడి ఎరుపు తీపు మంట వాపు', నిండువేదనతో కూడిన క్లేశము. అతిశయోక్తి: గోరుచుట్టుపోటు రోకలిపోటు. Capping it with a lemon is a household remedy. గోరుపైన టోపీవలె నిమ్మకాయ తొడుగుట ఇంట్లో నాయనమ్మ వైద్యము. If allowed to progress, sloughing occurs and the nail falls off. వాపు ముదిరినట్లయితే, మెత్తబడి క్రమేణ గోరు ఊడిపోతుంది.

**parosmia** perverted sense of smell ఘ్రాణవికృతి: వక్రమైన శ్రవణేంద్రియ జ్ఞానం.

**parotid** near the ear చెవిదగ్గర. **p. gland,** salivary gland in front of the ear, the seat of mumps. ఉమ్మిగ్రంథి, లాలాజలము స్రవించు గ్రంథి, కర్ణమునకు ఎదురుగా ఉండునది. గవదబిళ్లలకు స్థానము.

**parotiditis** *see/చూడండి* parotitis.

**parotitis** parotiditis, inflammation of the parotid gland ఈ గ్రంథి శోథము/'నొప్పి వేడి మంట వాపు'. **infectious p.,** *see/చూడండి* mumps.

**parous** *adj.* having borne a child or children ఏక గర్భవతి లేదా బహు గర్భవతి.

**paroxysm** attack జబ్బుతెర. sudden appearance/recurrence of a disease, *e.g.* paroxysmal tacchycardia అకస్మాత్తుగా జబ్బు అవతరించుట/తిరగబెట్టుట, ఉదా. తెరలు తెరలుగావచ్చు గుండె వేగము.

**particle** A. a very small piece of matter పదార్థం యొక్క చాలా చిన్నభాగము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. a tiny mass of material, *e.g.* grain of sand రేణువు, లేశము, నలుసు, పిసరు, ఉదా. ఇసుకరేణువు. 1. miliary tuberculosis, *see/చూడండి* miliary, miliary tuberculosis. 2. *see/చూడండి* pulmonary alveolar microlithiasis. B. *micro.str.* సూక్ష్మ.చూ. molecule అణువు. atom పరమాణువు. elementary p's of mitochondria మైటోకాండ్రియా అను మూలరేణువులు. **viral/virus p.**, virion, (appreciated by electron microscope) వైరియాన్ (ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌లో చూడనగును).

**parturient** *adj.* pertaining to parturition, i.e baby birth ప్రసవానికి సం. **p. mother** తల్లి కాబోయే స్త్రీ.

**parturition** *see/చూడండి* labour. *figur.* When a pregnant woman is thrown into the throes of childbirth, the event is called labour/delivery. ప్రసవం, అలంకార. ప్రసవవేదన పాపరోదన.

**passive-aggressive personality** unlimited/excessive tyrannical feelings expressed in a passive way నిష్క్రియా(త్మక)-దౌర్జన్య మూర్తిమత్వము: మితిమీరిన దౌర్జన్యంతోకూడిన భావాలు పరోక్షంగా ప్రదర్శించుట.

**pasteurization** a process of heating milk to kill the pathogenic microorganisms in it without altering its flavour పాలలోని హాని కరమైన సూక్ష్మజీవులను హతమార్చడానికి కాగబెట్టు ప్రక్రియ; ఇందులో పాల రుచిలో ఏమీ మార్పురాదు. In HTST (high temperature short time) technique milk is heated to 71.7°*c* to 74.4°*c* for 15 seconds or less and cooled quickly to 7.2°*c* (అధిక ఉష్ణత లఘుసమయం పద్ధతి).

**patch** 1. macule on skin 3 or 4 cm in diameter మచ్చ: చర్మముమీద రంగుమారిన మచ్చ. 2. patch test on skin for hypersensitivity reaction ఎలర్జి కనుక్కొనడానికి చర్మ పరీక్ష. **Peyer's p's**, lymph

follicles in the mucosa of the small intestine; they get ulcerated in typhoid fever. చిన్నపేగుల్లో లింఫ్ పుటికలుగల మచ్చలు; ఇవి టైఫాయిడ్ జ్వరంలో వ్రణములు అవుతాయి.

**patella** a disk of bone in front of the knee, knee-cap జాన్వస్థి, మోకాలిచిప్ప ఎముక: జానువు సంధి ఎదుటనున్న బిళ్ల ఎముక, జానుఫలకము.

**patellectomy** excision of the patella పెటల్లాను శస్త్ర చికిత్స ద్వారా తొలగించుట.

**patent** licence from the government granting a person or company the right to make and sell a product తాను కనిపెట్టిన దానిని తయారుచేసి అమ్ముటకు ప్రభుత్వము వారి అనుమతి – ఇది ఆయనకు హక్కు పత్రము.

**paternity** fatherhood పితృత్వము *[Cf. maternity తారత.* మాతృత్వము].

**pathogen** disease producing entity; usually a microorganism వ్యాధికారకం, రోగజనకము, వ్యాధి కలుగజేయువస్తువు; తరచుగా సూక్ష్మజీవి.

**pathogenesis** the chain of events in the evolution of a disease process రోగజననము, రోగవికాసం: వ్యాధి అనే ప్రక్రియయొక్క పురోగమనములో ఘట్టములు.

**pathogenic** causing disease వ్యాధిజనక, వ్యాధికారకము.

**pathognomonic** a feature pre-eminently characteristic of a disease on which a diagnosis can be confidently made; *prima facie* evidence of the disease వ్యాధినిర్ణయము ఖచ్చితముగా చేయుటకు తోడ్పడు సర్వోత్కృష్టమైన, అగ్రగణ్యతనొందిన వ్యాధిసూచన; నిర్వివాద ఋజువు. 1. *e.g.* The demonstration of tubercle bacilli in the sputum of a patient suffering from lung tuberculosis is a sure evidence of the disease. ఉదా. ఊపిరితిత్తుల క్షయరోగి కఫములో క్షయ బాక్టీరియా ఉంటే వ్యాధి నిస్సందేహము/నిశ్చయము/రూఢి అంటారు. 2. *e.g.* Reed-Sternberg giant cells are pathognomonic of Hodgkin's disease. ఈ జబ్బులో ఈ బృహత్కణములు కనబడుట వ్యాధి నిర్ధారణ. 3. Koplik's spots on the buccal mucosa

are indicative of measles తట్టు/అమ్మవారు/దద్దులో నోట్లో కాప్లిక్ పొక్కులు కనబడటం వ్యాధి సూచన.

**pathology** study of disease processes and consequent changes produced in tissue/organs రోగ/వ్యాధి విజ్ఞానశాస్త్రము, రోగవికృతి విజ్ఞానము, వ్యాధినిర్ణయ శాస్త్రము, కణజాలము/అవయవములలో కలుగు పరిణామములను గురించిన శాస్త్రము. **clinical p.**, section dealing with the examination of blood, urine, motion and body fluids రక్తము, మూత్రము, మలము, శరీరములోని ఇతర ద్రవములు పరీక్ష చేయు విభాగము. **surgical p.**, pathology, surgerywise ప్రత్యేకించి శస్త్రవైద్యరీత్యా తెలుసుకొనవలసిన వ్యాధివిజ్ఞాన శాస్త్రము.

**patience** 1. Patience pays in the long run, especially in a chronic disease దీర్ఘకాలం వ్యాధుల్లో ఓపికపట్టండి. 2. Mother Earth is a personification of patience. ధరణి/భూమాత ఓర్పుకు ప్రతిరూపము.

**patient** 1. one afflicted by disease రోగి, వ్యాధిగ్రస్తుడు. 2. enduring, forbearing ఓర్పుగల, తాలిమిగల, సహించెడు గుణముకల. *figur.* 'Be patient with your patient' *అలంకార.* 'రోగిపైన తాలిమి చూపండి.'

**peau d'orange** appearance of the skin over the breast in advanced carcinoma, *resemblance:* the skin of an orange with pits ముదిరిపోయిన స్తనము కేన్సర్‌లో చర్మము రూపము, పోలిక: నారింజ/మోసంబి తొక్క.

**pectoral** pertaining to the chest వక్షస్థ, ఉరో, ఛాతీకి సం. pectoralis major, minor – muscles in the chest wall అంసపేశీలు: ఇవి ఛాతీకుడ్యములోని కండరములు.

**pectus** chest, thorax ఛాతీ, వక్షస్థలము. **p. carinatum,** pigeon breast పావురము ఛాతీ వలెనున్న వక్షము. **p. excavatum,** funnel chest గరాటావలెనున్న ఛాతీ అనగా ఎదురురొమ్ము లోపలికి తొలుచుకొని పోయిన ఛాతీ.

**pedal** concerning the foot/feet పాదమునకు సం. **p. oedema,** swelling of foot/feet పాదము(ల)మీద ఉబ్బు/నంజు.

**pediatrician** *see/చూడండి* paediatrician. వాడు.భా. పిల్లల డాక్టరు.

**pediatrics** 1.*see/చూడండి* paediatrics. 2.Pediatrics, a medical journal వైద్య వార్తాపత్రిక.

**pediculosis** infestation with lice, *see/చూడండి* louse. పేలు పట్టుటము, పేలతో సంపర్కము. Lice cause itching and hatch their eggs (nits) on the hair. పేలు దురదలకు హేతువు మరియు వాటి గ్రుడ్లను వెంట్రుకలమీద పొదుగుతూ కాలక్షేపం చేస్తుంటాయి. నిత్యానుభవము: నాయనమ్మ మనుమరాలికి తలదువ్వుతూ జడవేస్తున్నప్పుడు తన బొటనవ్రేళ్ల గోళ్ళమధ్య ఈ పేలగ్రుడ్లను 'చిటుకు చిటుకు' మంటూ చంపడం.

**pedicure** the care and cosmetic treatment of the feet and toe nails పాదముల మరియు గోళ్ళ యొక్క భద్రత మరియు రూపము/అందము తీర్చిదిద్దే పద్ధతి [Cf. manicure].

**pedigree** catalogue of ancestors, family tree పూర్వీకుల జాబితా, వంశవృక్షము, వంశచరిత్ర.

**pedology** *see/చూడండి* paedology.

**pedomorphism** *see/చూడండి* paedomorphism.

**pedophile** *see/చూడండి* paedophile.

**pedophilia** *see/చూడండి* paedophilia.

**peduncle** 1. pedicle, pedunculus వృంతము. 2. stalk or stem కాడ. **cerebral p.**, a stem-like connecting part between the two cerebral hemispheres రెండు మస్తిష్క గోళార్ధాల నడుమ ఉన్న కాడ.

**pellagra** disease due to deficiency of niacin (nicotinic acid, a member of vitamin B complex) marked by skin pigmentation, dermatitis, diarrhoea and dementia ఈ విటమిన్ లోపము వలన కలుగు మచ్చలు, చర్మము ఇన్‌ఫ్లమేషన్, అతిసారము మరియు బుద్ధిమాంద్యము.

**pellet** 1. a pellet of fat కొవ్వు కణిక. 2. medicine implanted underneath the skin, depot action for slow release, especially a hormone చర్మంక్రింద ఔషధనిధి, ముఖ్యంగా హార్మోన్.

**pellicle** 1. a thin skin మృదుచర్మం. 2. cell boundary of a protozoan (single-cell organism) ఏక కణజీవి యొక్క కణప్రహరి. 3. a film or scum on the surface of a liquid నిల్వ ఉన్న ద్రవం మీద మురికి పొచి.

**pelotherapy** therapeutic treatment using mud, *e.g.* application of mud packs over the body, *figur* healing touch of Mother Earth. మట్టితో వైద్యం, ఉదా. మట్టి పట్టీ శరీరం మీద ఉంచటం, అలంకార. ధరిత్రీమాత ధన్యమా అంటూ.

**pelvic** pertaining to pelvis కటి సం., శ్రోణికి సం. **p. bones,** bones of the pelvis శ్రోణ్యస్థులు. **p. girdle,** girdle of the pelvis శ్రోణి మేఖల [*q.v.* shoulder girdle అంస మేఖల].

**pelvic inflammatory disease** *abbr.* PID. pelvic infection in women affecting the uterus, Fallopian tubes and ovaries కటి కుహరము (pelvic cavity) లో నున్న గర్భసంచి, ఫెల్లోపియన్ నాళములు మరియు అండాశయములకు సోకు సూక్ష్మక్రిమి సంపర్కం.

**pelvimetry** measurement of the diameter of the pelvis done before delivery to ascertain whether the fetus can pass through గర్భస్థశిశువు దూరిరాగలదా అని నిర్ధారణ చేసికొనుటకు శ్రోణి నడిమికొలత కాన్పుముందు కొలుచుట.

**pelvis** 1. the lower region of the trunk bounded by the two hip bones శ్రోణి, కూపకము, వస్తికము, కటిగుహ, కటివలయము: పొత్తికడుపు చుట్టునుండు ఎముకలగూడు; రెండు తుంటి ఎముకల మధ్యనున్న మొండెము క్రిందిప్రాంతము. **contracted p.,** diminution in its diameter నడిమికొలత కొరతగానున్న శ్రోణి. 2. **renal p.,** funnel shaped structure at the pelvis of the kidney where ureter starts వృక్కద్రోణి: గరాటా గొట్టము ఆకారములోనున్నది - మూత్రనాళముయొక్క మొదలు.

**pemphigus** disease characterized by crops of blisters (bullae) over the skin and mucous membrane of the mouth చర్మము మరియు శ్లేష్మపొరల్లో బొబ్బలు, తెరలుతెరలుగా పుట్టుతుంటాయి. Nikolsky's sign: the top layer of the skin can be peeled off with such an ease that one can peel the skin off the boiled potato ఉడికిన బంగాళదుంప/ఉర్లగడ్డ/ఆలుగడ్డమీది పొట్టును ఎంత తేలికగా ఒలుచగలరో అదేరీతిగా త్వక్కుమీది పైతోలు స్వల్ప ఒత్తిడికే ఒలుచుకుపోతుంది.

**pendulous** hanging వ్రేలాడుతున్న. **p. breasts,** *figur.* fatty breasts hanging like a pendulum due to the weight; sagging breasts క్రొవ్వుతో, బరువెక్కిన క్రిందకువాలిన కుచములు.

**penicillin** an antibiotic derived from a mould or produced synthetically, used to treat bacterial infections. పెన్సిలియం అనే శిలీంధ్రము నుండి లేదా సంయోగికంగా తయారు చేయబడిన యాంటి బయాటిక్ మందు. ఇది సూక్ష్మక్రిమినాశిని.

**penile** *adj.* pertaining to the penis శిశ్న సం.

**penis** male sex organ and urine-emitting organ, *figur.* Cupid's 'pen is' - penis మేహనము, మేఢ్రము, లింగము, శిశ్నము, పురుషాంగము–పురుషలైంగిక అవయవము మరియు మూత్రవిసర్జన అవయవము.

**pepper** *bot.* (black pepper) known as "king of spices" మిరియాలు: సంబారరత్నం. used in 1. digestive disorders జీర్ణ అపవ్యవస్థల్లో వాడేది. 2. common cold జలుబు, పడిశంలో వాడేది. 3. pyorrhoea చిగుళ్ళ దుర్వాసనలో వాడ్తారు [*q.v.* cardamom, the 'queen of spices'].

**pepsin** an enzyme in gastric juice, which is proteolytic, *i.e.* breaks down protein జఠరరసములోనున్న ఎన్‌జైమ్ – దీనికి ప్రోటీన్‌ను విచ్ఛిన్నము చేయు శక్తి ఉన్నది.

**peptic** 1. concerning digestion జీర్ణమునకు సం. 2. pertaining to pepsin or gastric juice పెప్సిన్ లేదా జఠరరసమునకు సం. **p. ulcer.** (a) gastric ulcer అన్నాశయములో వ్రణము (b) duodenal ulcer ఆంత్రమూలము (ప్రథమాంత్రము) లో వ్రణము.

**peptide** a molecule that consists of amino acids ఎమైనో ఆమ్లములు గల అణువు (molecule).

**peptone** substance formed during protein digestion ప్రోటీన్ జీర్ణ ప్రక్రియలో తయారయే పదార్థం.

**peptonuria** presence of peptones in urine మూత్రంలో పెప్టోన్లు ఉండుట.

**percussion** the art of determining the texture of the underlying organ by striking with finger తట్టుట: అవయవముయొక్క సాంద్రత

తెలిసికొనుటకై (అనగా బోలుగా ఉన్నది, గట్టిగా ఉన్నది, లేదా గాలితో పొంగిఉన్నది) వేలుతో కొట్టుట గ్రా. ఓటు చూచుట. **direct p.,** striking with finger తనవేలుతో కొట్టుట. *resemblance:* percussion instrument *పోలిక:* డోలు, ఘటవాయిద్యము. **indirect p.,** putting middle finger of one hand on patient's body and striking with the tip of the middle finger of the other hand ఒకచేయి మధ్యవేలు రోగిశరీరంపైనుంచి రెండవ చేయి మధ్యవేలు కొనతో కొట్టుట.

**percutaneous** through unbroken skin, *e.g.* absorption of ointment పగులు లేని చర్మము ద్వారా, ఉదా. మలాము రుద్దటము, అది చర్మం లోపలికి పీల్చుకొనబడటం.

**perforation** an opening made in a tube or hollow organ, due to trauma or disease ఛిద్ర(ణ)ము, శరీరనాళము/నాళికలోగాని, బోలు అవయవములోగాని రంధ్రము పడుట – ఇది దెబ్బ/గాయమువలన కావచ్చు లేదా వ్యాధి పరిణామము కావచ్చును. **gastric p.** అన్నాశయంలో రంధ్రం పడటం – ఇది అన్నాశయ వ్రణ పరిణామం కావచ్చును. **intestinal p.** పేగులలో చిల్లిపడటం. **oesophageal p.** అన్నవాహిక చిల్లిపడటం. **p. of tympanic membrane** in the ear కర్ణభేరిలో రంధ్రం.

**perfusion** a fluid poured over/through an organ/tissue చిలకరింప బడుట: ఒక ద్రవము అవయవము/కణజాలము మీద/గుండా విదజల్లబడుట/కారుట.

**perianal** around/near the anus, ఆసనము చుట్టూరా/అంచున. **p.abscess** ఆసనము అంచు దగ్గర చీమునెత్తురు గడ్డ.

**periarteritis nodosa** *abbr.* PAN, connective tissue disorder with inflammation of the external coat of arteries producing nodose swellings of many arteries; also called polyarteritis nodosa బంధన కణజాలపు కణజాల అపవ్యవస్థ. ఇందులో రక్తనాళముల శోథము, రక్తనాళములయొక్క వెలుపల బుడిపెలు చూస్తాము.

**periarthritis** pain around a joint కీలుచుట్టూరా శోథము/నొప్పి. **p. of shoulder,** a frequent complication of diabetes mellitus తరచుగా మధుమేహం వ్యాధిలో బుజముకీలు చుట్టూరా బాధ.

**pericarditis** inflammation of the pericardium గుండెమీది పొర యొక్క శోథము/'నొప్పి వేడి వాపు'.

**pericardium** double layered membrane which envelops the heart హృదయావరణము: గుండెమీది రెండు పొరల తొడుగు. **visceral p.,** which is in contact with the heart లోపలి పొర: గుండెను అంటిపెట్టుకుని ఉన్నపొర. **parietal p.,** outer reflection of visceral pericardium వెలుపలి పొర: ఇది లోపలిపొరయొక్క బహిఃపరావర్తనము. Pericardial effusion is the accumulation of fluid between the two layers which is a potential sac. ఈ రెండు పొరలమధ్య సంభవనీయమైన తిత్తిలో ద్రవము చేరుట.

**perichondritis** inflammation of the perichondrium పెరి ఖాంద్రియమ్ యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**perichondrium** the dense connective tissue membrane around cartilage మృదులాస్థి చుట్టూరా కప్పిఉన్న దట్టమైన బంధనకణజాలము యొక్క పొర.

**pericranium** periosteum of the skulll, i.e. the membrane surrounding the cranium. పుర్రె/కపాలము ఎముకలపైనున్న పొర.

**pericystitis** inflammation of tissues around the urinary bladder మూత్రాశయం చుట్టూరా ఉన్న కణజాలముల శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**perimetrium** the peritoneal covering of the uteerus గర్భాశయం చుట్టూ ఆవరించియున్న పెరిటోనియమ్ పొర.

**perimysium** [Greek *mys* muscle]. the connective tissue which surrounds and binds together muscle fibres కండరతంతువులను ఆవరించియుండి మరియు వాటిని అదిమిపట్టి ఉంచే బంధనకణజాలము.

**perinatal** period around the event of birth పురిటికి ముందు, తర్వాత. **p. period,** period extending from the 28th week of pregnancy to one month after childbirth/babybirth 28 వారాల గర్భిణిదశ నుండి శిశువు జన్మించిన తర్వాత ఒక నెలవరకు గల కాలము.

**perineal** relating to perineum మూలాధారమునకు సం.

**perinephritis** inflammation of perinephrium పెరినెఫ్రియమ్ యొక్క శోథము.

**perinephrium** the connective tissue and fat around the kidney కిడ్నీ చుట్టూరా ఉన్న బంధన కణజాలము మరియు కొవ్వుపొర.

**perineum** pelvic floor and outlet మూలాధారము. region between the genital opening and anus ఉపస్థేంద్రియమునకు గుదద్వారమునకు మధ్యనగల ప్రదేశము; పాయూపస్థప్రాంతము. 1. in the male: the region between the scrotum and anus పురుషులలో: వృషణములసంచి మరియు అసనము మధ్యఉన్న ప్రాంతము. 2. in the female: the region of the vulva and anus స్త్రీలలో: యోని పరిసరప్రాంతము (భగము) మరియు అసనము. perineal tear during delivery/babybirth కాన్పు సమయంలో ఈ ప్రాంతంలో చిరుగు.

**period** 1. measure of time సమయము, కాలము, వ్యవధి. 2. **menstrual/monthly p.**, peroid of menses ముట్టు, బహిష్టు. 3. **p. of gestation,** the time from conception to the birth of the baby గర్భము అంకురించినప్పటినుండి శిశువు జన్మించు వరకుగల కాలము.

**periodical** 1. periodicity, occurring at regular intervals, *e.g.* menstruation, which occurs once in 28 days నియమిత కాలములో సంభవించెడు, ఉదా. 28 రోజులకొకసారి వచ్చే ఋతుధర్మం/క్రమం. 2. publication, journal, *e.g.* Journal of Indian Medical Association, British Medical Journal వైద్యవార్తాపత్రిక.

**periodontal** around a tooth పన్ను చుట్టూరా. **p. disease,** inflammation of gums, gingivitis చిగుళ్ల 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'. disease of periodontal ligament ఇక్కడ స్నాయువు తీపు.

**periodontitis** Rigg's disease. stomatitis ulcerosa chronica. inflammation of gingivae, resorption of alveolar bone చిగుళ్ళ వాపు, తీపు, ఇన్‌ఫ్లమేషన్, దంతబిలం యొక్క శిథిలత.

**periosteum** connective tissue layer surrounding bone through which it derives nutrition ఎముకపైపొర, అస్థికవచము: ఎముకను ఆవరించుకొనియుండు తెల్లని నారపొర – దీనిద్వారా ఎముకకు పోషణ లభిస్తుంది.

**periostitis** inflammation of the periosteum అస్థికవచముయొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**peripheral** relating to outside పరిధీయ. 1. **p. nerve,** any nerve outside the brain and spinal cord పరిధీయ నాడి. 2. **p. nervous system** పరిధీయ నాడీవ్యవస్థ. [*in contr.* central nervous system భిన్న. కేంద్ర నాడీవ్యవస్థ].

**periphery** outside region in a structure పరిధీయము: ఒక నిర్మాణము వెలుపలి ప్రాంతము.

**peristalsis** the normal movements of the intestines which aid in moving the intestinal contents (food mixed with juices) ఆంత్ర చలనము: ప్రేగులలోని పదార్థములను (తిన్న ఆహారము, ద్రవములు, స్రావములు) పేగులద్వారా పయనింపజేసే పేగు కదలికలు. Normal peristatic sounds are heard over the abdomen on listening through the stethoscope. మామూలుగా ఆంత్రచలన ధ్వనులు స్టెతాస్కోప్ పొట్టమీద పెట్టినప్పుడు వినబడుతాయి.

**peritoneum** a serous membrane that lines the abdominal cavity ఉదర కుహరమును అంటి పెట్టుకొని ఉన్న సీరస్ పొర. **parietal p.,** the serous smooth membrane lining the abdominal and pelvic cavities ఆంత్రవేష్టనము: ఉదరకుహరము మరియు శ్రోణికుహర మును అంటిపెట్టుకుని ఉన్న మెత్తటిపొర. **visceral p.,** the serous smooth membrane investing the viscera in the above cavities పై కుహరములలోనున్న అవయవములను అంటిపెట్టుకునిఉన్న మెత్తటి పొర. These layers facilitate smooth gliding of the parts, say intestines, without friction. ఈ పొరలు పేగులు లాంటి భాగాల్లో వాటి కదలికలో రాపిడిలేకుండా జరుగుతూ/కదులుతూ ఉండటానికి తోడ్పడతాయి. The space between the two is a potential one; fluid accumulates in diseases. ఈ రెండింటి మధ్యనున్నది సంభవనీయమైన ఖాళీస్థలము; వ్యాధులలో ఈ ఖాళీస్థలములో ద్రవము చేరుతుంది.

**peritonitis** inflammation of peritoneum ఆంత్రవేష్టనముయొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'. causes: perforation of viscera, say stomach, intestine; invasion of microorganisms;

chemical irritation by bile, *etc.* కారణములు: అవయవములలో చిల్లిపడటం, ఉదా. అన్నాశయము లేదా పేగులో రంధ్రము; సూక్ష్మక్రిమి దాడి; రసాయనిక పదార్థముల సంపర్కము, పైత్యరసం తగులుట వలన సంభవించినది, మొ.

**peritonsillar** around the tonsils in the throat గొంతులో టాన్సిల్స్ చుట్టూతా/రా. **p. abscess,** quinsy టాన్సిల్ పరిధిలో పుండు/ చీముగడ్డ.

**periumbilical** around the navel నాభిచుట్టూ.

**permeability** *physiol.* ability of cell membranes to allow substances like salt, glucose, urea to pass into and out of the cells పారగమ్యత, ప్రవేశ్యశీలత: ఉప్పు, చక్కెర, యూరియాలాంటి పదార్థములు కణత్వచముగుండా లోనికి ప్రవేశింపబడుట, బయటకు నిష్క్రమింపబడుట.

**pernicious** dangerous, fatal ప్రాణహానికరమైన, మృత్యువు దగ్గరకు దారితీసే.

**pernicious anaemia** also called **Addisonian a.,** fatal bloodlessness, if not treated మందులివ్వకపోతే ప్రమాదకరమైన రక్తహీనత జబ్బు. due to lack of "intrinsic factor" in the stomach అన్నాశయంలో లోపము. administration of vitamin $B_{12}$ and liver improves the condition విటమిన్ $B_{12}$ మరియు లివర్ ఔషధాలతో బాగుపరచవచ్చును.

**peroneal** peroneus. 1. relating to the region of fibula ఫిబ్యులా ఎముక ప్రాంతమునకు సం. 2. relating to the lateral/outer side of the leg కాలు యొక్క వెలుపలి ప్రాంతమునకు సం. **p. muscles** ఈ ప్రాంతంలో కండరాలు.

**peroral** per oral. through the mouth నోటి ద్వారా. **p. medication** ఆస్య ఔషధం.

**per rectum** *colloq.* PR. examining the rectum by putting fingers into it and exploring the interior మలాశయములోనికి వేళ్ళుదూర్చి లోన తనిఖీచేయుట.

**personality** adjustment with the environment and behaviour pattern మూర్తిమత్వము: ఒక వ్యక్తి పరిసరంతో సర్దుబాటు చేసుకునే రీతులు, అతని ప్రవర్తనా తీరులు. **p.disorder** మూర్తిమత్వ అపవ్యవస్థ.

**perspiration** sweating, *figur.* fruit of labour చమట, స్వేదము, *అలంకార.* కాయకష్టముయొక్క ఫలము.

**pertussis** whooping cough; an infectious disease marked by paroxysms of cough with crowing noisy breathing and exhaustion, *see/చూడండి* whoop. కోరింతదగ్గు, కక్కాయి దగ్గు; తెరలుతెరలుగా, పక్షికూతవలె బెదురుగొలుపుతూ శ్వాసను ఉక్కిరిబిక్కిరి చేసి, రోగిని సోలునట్లు/అలసిపోయేటట్లు చేసే అంటువ్యాధి.

**per vaginam** *colloq.* PV. examining the vagina by putting fingers into it and searching the interior యోనిలోనికి వేళ్లుదూర్చి, లోన తనిఖీ చేయుట. If both 'per rectum' and 'per vaginam' tests are contemplated to be performed at one sitting, respect the vagina before the rectum, on aesthetic/humane grounds. ఆసన/యోని పరీక్ష ఒకే సమయంలో తలపెడితే, రసచైతన్య రీత్యా లేదా మానవత్వ కారణాలవలన, యోనికి ప్రథమస్థానం ఇచ్చి దానిని ముందు పరీక్షచేయండి.

**perversion** change from right to wrong మంచి నుండి చెడుకు మార్పు. **sexual p.**, in psychiatry, obstinate in the wrong, unnatural sexual practice, *e.g.* homosexuality వక్రబుద్ధి, విపరీత తత్వము, కుటిల స్వభావము: మానసికరోగరీత్యా వక్రబుద్ధిగలిగి, అస్వాభావికంగా, తప్పుగా నెంచబడిన తారుమారు ప్రక్రియ, ఉదా. లైంగిక అసహజప్రవృత్తి, స్వలింగ సంభోగం.

**pessary** 1. an instrument ఒక పనిముట్టు. 2. **ring p.** to support a prolapse of the uterus గర్భసంచి క్రిందకు జారకుండా చేతికంకణం (bangle) లాంటి వలయాకార సాధన తొడగటం. 3. a contraceptive గర్భనిరోధక సాధన.

**pestilence** a highly virulent contagious epidemic, *e.g.* plague caused by *Pasteurella pestis,* black death మహామారి, మిక్కిలి క్రూరమైన అంటువ్యాధి, ఉదా. ప్లేగు.

**petechiae** [petechia *sing.*] minute red dots in the skin due to escape of blood చర్మముమీద ఎర్రరక్తపు దద్దుర్లు.

**petit mal** *see/చూడండి* epilepsy. మూర్ఛ సంబంధమైన వ్యాధి.

**petrosa** the petrous portion of the temporal bone కణత ఎముక యొక్క భాగం.

**Peyer's glands** or **patches** *folliculi lymphatici aggregati.* lymphatic gland accumulations in the small intestine, intestinal tonsil. చిన్నపేగుల్లో లింఫ్‌గ్రంథి సమూహములు. get inflammed and ulcerated in typhoid fever టైఫాయిడ్/సన్నిపాత జ్వరంలో ఇన్‌ఫ్లేమ్ అయి వ్రణములు తేలుతాయి. *caution* beware! Perforation can occur – it is an emergency. జాగ్రత్తగా గమనిస్తుండవలెను రోగిని! ఆంత్ర ఛిద్రం జరుగవచ్చును – దీనికి అత్యవసర చికిత్స అవసరం.

**pH** pH value పి.హెచ్ మానము. symbol relating to the hydrogen ion concentration హైడ్రోజన్ అయాన్ గాఢత విషయములు సూచించు గుర్తు. 1. **in blood** the normal pH of arterial blood is 7.4 while that of venous blood is 7.35. When pH is below 7.4 it is called acidosis; when pH is above 7.4 it is called alkalosis. 2. **in chemistry** pH 7 neutral తటస్థము. above 7 alkaline క్షారగుణము. below 7 acidic ఆమ్లగుణము.

**phacoemulsification** [*phacos,* lens; emulsify = liquefy]. a technique of cataract extraction in the eye with a probe that uses ultrasound energy. కంట్లోని శుక్లముతీయు ప్రక్రియ.

**phagocyte** a cell that ingests microorganisms and foreign particles భక్షకకణము: సూక్ష్మజీవులను మరియు రేణువులను మ్రింగే కణము.

**phagocytosis** the process of engulfing microorganisms and foreign particles by phagocytes భక్షకకణ చర్య: ఫాగొసైట్లు సూక్ష్మజీవులను మరియు రేణువులను మ్రింగే ప్రక్రియ.

**phalangeal** pertaining to phalanx/phalanges వేలిఎముక(ల)కు సం.

**phalanges** bones in the fingers and toes కర, పాద అంగుళ్యాస్థులు.

**phalanx** [phalanges *pl.*] any bone in the finger or toe అంగుళ్యాస్థి: వాడు.భా. చేతివేలి ఎముక, కాలివేలి ఎముక; చేయి లేదా పాదము వేళ్లలోని ఎముక.

**phallus** an image of the penis as a symbol of generative power లింగము; ప్రత్యుత్పత్తి శక్తినిసూచించే మేఢ్రముయొక్క గుర్తు.

**phantom** unreal or imagined thing మనోరథ సృష్టి. **p.breast,** imaginary breast after mastectomy, *figur.* even to the extent of wearing a phantom bra స్తనచ్ఛేదన తర్వాత, ఇంకా స్తనము ఉన్నట్లే ఊహా భ్రమ, అలంకార. అంతేగాదు, ఆ కుచంమీద బాడీ ఉన్నట్లు కూడా అపోహ. **p. limb,** *see/చూడండి* limb.

**phantom pregnancy** *see/చూడండి* pseudocyesis

**pharmaceutical** concerning drugs ఔషధములకు సం.

**pharmacist** druggist, one who sells medicines ఔషధములను అమ్మువాడు, మందుల అంగడి పెట్టుకున్నవాడు.

**pharmacogenetics** study of genetic aspects in pharmacology ఔషధశాస్త్రంలో జన్యువుకు సం. విషయముల వివరణ.

**pharmacognosy** *medical bot.* A branch of pharmacology that deals with the physical characteristics and botanical sources of crude drugs ఔషధ వృక్షశాస్త్రము.

**pharmacology** the science dealing with the study of drugs ఔషధ పరిజ్ఞాన శాస్త్రము.

**pharmacophobia** morbid fear of taking drugs ఔషధ భీతి.

**pharmacopoeia** or **pharmacopeia** a treatise on drugs ఔషధ ప్రబంధము. **British p.** బ్రిటిష్ భేషజ కల్పసూత్ర సంహిత, బ్రిటిష్ ఔషధ కోశము/సంగ్రహము. **Indian p.** భారత ఔషధకోశం/గ్రంథం.

**pharmacy** a place where drugs are dispensed, say in a hospital/shop ఔషధశాల: ఆస్పత్రిలో ఔషధములను అందజేయు విభాగము, లేదా వాటిని అమ్ము అంగడి, ఔషధ విక్రయశాల.

**pharyngeal** concerning the region of the pharynx or throat గొంతు ప్రాంతమునకు సం.

**pharyngitis** inflammation of the pharynx సప్తపథి శోథం. గొంతు ఇన్ఫ్లమేషన్: గొంతు/గ్రసనిలో 'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు'.

**pharynx** the throat గొంతు, గ్రసని, కుతిక, కుతుక, సప్తపథ(ము) (రెండు బాష్పగ్రంథి నాళములు, రెండు యూస్టేషియన్ ట్యూబ్లు, రెండు నాసికలు, ఒక నోరు కలిసే మార్గము).

**phenobarbitone** or **phenobarbital** 1. hypnotic and sedative drug నిద్ర తెప్పించే మందు. 2. used also in epilepsy మూర్ఛల రోగంలో కూడా వాడ్తారు.

**phenol** also called carbolic acid. antiseptic; disinfectant ఫినాల్: చీము మాలిన్య నిరోధి/నివారకం, పూతినిరోధి; రోగ్రక్రిమి నాశని.

**phenomenon** an occurrence దృగ్విషయం. **booster p.,** on a tuberculin test (Mantoux test) ఈ టెస్ట్లోని దృగ్విషయం. **L.E.p.,** lupus phenomenon in disseminated lupus erythematosus ఈ జబ్బులో ఎల్.ఇ. దృగ్విషయం. **Somogyi p.,** a rebound phenomenon in diabetes డయాబిటిస్లో దృగ్విషయము.

**phenotype** the structure and morphology of an organism expressed by the genotype అనుజనిక దృశ్యరూపకము: ఒక జీవి జన్యునిర్మాణ విశదప్రభావక దృశ్యమాన లక్షణాలు [*Cf.* genotype తారత. ప్రాజనిక రూపకము].

**phenylalanine** or **phenylalanin** an essential amino acid, present in proteins ప్రోటీన్లలో గల ముఖ్యమైన ఎమైనో అమ్లము.

**phial** vial. a glass container with a metal covered rubber seal, *e.g.* **injection p.** లోహపు తొడుగు ఉన్న రబ్బరు మూత గల గాజు సీసా, ఉదా. ఇంజక్షన్ బుడ్డి.

**phimosis** tight foreskin on the glans penis ముందోలు వెనక్కి పోలేకపోవటం. *see/చూడండి* paraphimosis. పురుషాంగముయొక్క మేఢ్రమణి పైచర్మముయొక్క బిగువు. The surgical remedy to cut this is called circumcision, *see/చూడండి* circumcision. దీనిని శస్త్రగాటు ద్వారా ఛేదించుట సుంతి అంటారు.

**phlebitis** inflammation of a vein, later it becomes tender, cordlike సిరలశోథము: సిరయొక్క 'నొప్పి వేడి మంట వాపు', తరువాత తీపుపెట్టి

ముట్టుకోనివ్వదు, తాడువలె తగుల్తుంది. The blood clot in the vein may be carried in circulation to the heart or brain (embolus), *see/చూడండి* embolus. వాచిన సిరలోని గడ్డకట్టిన రక్తం రక్తప్రసరణ ద్వారా గుండెలోనికిగాని మెదడులోనికిగాని చేరవచ్చును (ఎంబొలస్).

**phlebothrombosis** formation of venous thrombi without inflammation, *see/చూడండి* thrombus. శోథము/'నొప్పి వేడి వాపు' లేకుండా సిరలో థ్రాంబస్ రూపొందుట. [*Cf.* thrombophlebitis].

**phlebotomy** 1. opening into a vein for blood letting, *e.g.* during blood donation రక్తదానంలో రక్తసేకరణ కొరకు సిరలో రంధ్రముచేయుట. 2. incision before intravenous procedures సిరలోనికి ఏదైనా ఎక్కించాలంటే గాటుపెట్టుట.

**phlegm** secretion from the respiratory tract కఫము, కళ్ళె, దగ్గిన తర్వాత వచ్చెడి శ్లేష్మద్రవము [*Cf.* saliva *లాలాజలం*. లాలాజలం].

**phlegmasia** inflammation, especially when acute and severe ఇన్‌ఫ్లమేషన్/శోథం, ముఖ్యంగా తీక్షణంగా మరియు ఉగ్రముగా నున్న ప్పుడు. **p. alba dolens,** white leg, milk leg. puerperal phlebitis: swelling and pain of leg following babybirth, due to the thrombosis of veins draining that part ప్రసవించిన తర్వాత సిరలలో థ్రాంబోసిస్ వలన కాలు లావెక్కి నొప్పి పుట్టుట.

**phlegmatic** 1. producing or having phlegm కఫకరమైన లేదా కఫము గల. 2. said of a person: calm, not easily excited వ్యక్తి: శాంతం గలవాడు, ఉద్వేగము చెందకుండా ఉండేవాడు.

**phlyctaena** or **phlyctena** a small raised blister/vesicle on the conjunctiva కంటిమీదపొరలో చిన్నబొబ్బ/పొక్కు. phlyctenular keratoconjunctivitis, manifestation of hypersensitivity to tuberculosis క్షయరోగములో కన్ను ఎరుపెక్కి, కన్నుమీదిపొర వాచి, నొప్పి పెట్టి, నీరుగారు స్థితి – క్షయవ్యాధి అతిసంవేదనశీలత (hypersensitivity) సూచిస్తుంది.

**phlyctenule** a tiny phlyctena ఒక చిఱుబొబ్బ.

**phobia** extreme fear అమిత భయము, తీవ్ర అకారణభీతి.

**phonation** the act of uttering a voiced sound ఉచ్చారణ.

**phosphaturia** presence of excess of phosphates in the urine మూత్రంలో ఎక్కువ ఫాస్ఫేట్లు ఉండుట.

**photalgia** photodynia. pain caused by light; photophobia to the extent of causing even pain కాంతివేదన: నొప్పిగూడ కలిగించే స్థాయిగల కాంతి భీతి.

**photodermatitis** photosensitization; patches on skin due to exposure to light, say sunlight ప్రకాశ సుగ్రాహీకరణము; సూర్య రశ్మిసోకిన ప్రాంతంలో చర్మము మచ్చలు.

**photomicrograph** photograph of a microscopic object or structure, *see/చూడండి* microscopic structure [*in contr.* micro photograph].

**photophobia** extreme fear/intolerance to light కాంతిభీతి: వెలుతురు అంటే అమితభయము/సహించలేకపోవుట; కావున కళ్ళు తెరవటమంటే భయం. This is a feature of tuberculous meningitis. మెదడు పొరల టి.బి. వ్యాధి లక్షణము.

**photoscan** *see/చూడండి* scintiscan.

**photosensitivity** exaggerated sensitivity to sunlight కాంతి/ప్రకాశ సుగ్రాహిత స్థితి, కాంతి/ప్రకాశ సంవేదిత స్థితి.

**photosynthesis** *bot.* process by which light or radiant energy is converted to chemical energy, *see/చూడండి* autotrophism. కిరణజన్య సంయోగక్రియ: సూర్యశక్తిని రసాయనిక శక్తిగా మార్చే జీవనచర్య.

**phrenic** relating to the diaphragm ఉదర వితానానికి సం., విభాజక పటలమునకు సం.

**phrynoderma** toad skin (rough skin) due to deficiency of vitamin A విటమిన్ A లోపమువలన కప్పచర్మంవలె ఉన్న చర్మము: గోదురుకప్ప చర్మమువలె కరకుగానుండి, వాడిలేని ముళ్ళవలె చేతికి తగిలే చర్మతలము.

**phthisis** wasting of the body in tuberculosis క్షయవ్యాధి: క్షయ వ్యాధిలోని శరీరక్షయము; క్షయము కలిగించేది కాబట్టి ఆ రుగ్మతకు క్షయ అనిపేరు. **galloping p.**, meaning that the tempo of the disease is so rapid on the analogy to a horse galloping to its

doom వ్యాధి ముమ్మరంగా, అతివేగంగా ముదురుట – పోలిక: అశ్వము అవసానదశకు దౌడుతీస్తున్నట్లు.

**physician** licenced/licensed medical doctor భిషక్కు, చికిత్సకుడు, వైద్యుడు; వైద్యశాస్త్ర యోగ్యతా పత్రమును పొందిన వైద్యుడు, అలంకార. భిషగ్రత్న. [*Cf.* surgeon *తారత.* సర్జన్].

**physiology** science which deals with the functions of living organism, say the human body ఇంద్రియ విజ్ఞానశాస్త్రం, శరీర శాస్త్రం: జీవిలోనున్న వివిధ వ్యవస్థలను, వాటివిధులను గురించి తెలియజేయు శాస్త్రము, ఉదా. మానవశరీర ధర్మశాస్త్రము.

**physiotherapy** branch dealing with physical therapy భౌతిక చికిత్స. 1. attempts of relieving pain such as diathermy, fomentation, poultice నొప్పి తగ్గించుటకు కరెంటు, ఉడుకునీళ్ళ కాపుడు, పిండికట్టు. 2. graded exercises to improve muscle tone in paralysis పక్షవాత పేశీలకు క్రమక్రమముగా కసరత్తు. 3. breathing exercises ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రక్రియలు.

**physique** body musculature శరీర కండర/పేశీ పుంజము. ideal one ఆదర్శవంతమైన దేహనిర్మాణం. (i) that of an Olympic sportsperson ఒలింపిక్ క్రీడాకారుడు (ii) muscleman వస్తాదు.

**pia arachnoid** leptomeninges, *see/చూడండి* meninges.

**pia mater** innermost of the three meningeal layers, *see/చూడండి* meninges. మృద్వి, మూడుపొరలలో లోపలి పొర.

**pica** unnatural craving to eat odd things, *e.g.* hair, clay, chalk చోద్యమైన తిండి అలవాట్లు, ఉదా. శిరోజములు, బురద, సుద్ద తినాలని అసహజమైన కుతి.

**pigeon chest** pigeon breast. *syn.* pectus carinatum. a narrow chest bulging anteriorly in the region of the breast bone కపోత వక్షం, పావురపు ఉరం/ఛాతి.

**pigment** coloured substances in the body వర్ణకము: తనువులోని వర్ణకములు. **bile p's,** red bilirubin, green biliverdin పైత్యరసములోనివి: ఎర్రగానుండు బైలిరూబిన్, ఆకుపచ్చగానుండు బైలివర్డిన్. **blood p.,** heamoglobin, pigment in red blood cells ఎర్రరక్తకణములలోనుండు

రక్తరంజక ద్రవ్యము. **skin p.**, melanin, pigment in the skin చర్మములోనుండు వర్ణకము.

**pigmentation** discolouration of the skin, seen in some diseases, *e.g.* pellagra, *see/చూడండి* pellagra. వర్ణక పరిణామము; పెల్లాగ్రా అను జబ్బులో చర్మము రంగుమారుట.

**pilar** pilary, pertaining to the hair రోమములకు సం. Hairs stand erect due to the contractions of smooth muscle, arrector pili, a sympathetic activity. స్వతంత్రనాడీవ్యవస్థ ప్రభావమువలన భీతి/వెరపు/ఆందోళన సమయాల్లో రోమములు నిక్కబొడుచుకొనుట, వాడు.భా. గగుర్పాటు.

**piles** heamorrhoids; dilatation of veins in the wall of the rectum or anus సిరలు ఉబ్బి, విస్తరించిన స్థితి; మూలశంక, అర్శము, మొలలు, మూలశంకవ్యాధి. **external p's,** in the wall of the anus ఆసనముచుట్టూ ఉన్న అర్శమూలలు. **internal p's,** in the walls of the rectum మలాశయముగోడలోనున్న అర్శమూలలు. piles అర్శమూలలు, (అర్శము = polyp) *figur. resemblance:* brittle sweet rice cakes *అలంకార. పోలిక:* అరిశెల్లాగా మృదువుగా ఉంటాయి, తుంచితే చితుకుతాయి.

**pill** globular or oval mass of medicine to be swallowed మాత్ర, గుళిక: మింగటానికి మాత్ర – గుండ్రంగా లేదా కోడిగుడ్డు ఆకారంలో ఉంటుంది.

**piloerection** erection of hairs, *see/చూడండి* pilar. గగురుపాటు, రోమములు నిక్కబొడుచుకొనుట.

**pilomotor** relating to the arrector muscles, the contraction of which raises the hair erect (*colloq.* goose flesh, goose pimples or goose skin), *see/చూడండి* pilar. ఈ కండరముల సంకోచమువలన రోమములు నిక్కబొడుచుకొనుట, శరీరముయొక్క గగురుపాటు (ఒడలు గగురుపు).

**pilonidal** having a nidus of hair follicles వెంట్రుక మొదళ్ళు/కుదుళ్ళు మూలముగాగల. **p. sinus,** sinus arising from hair follicles, which has to be searched for in the bush of hair వెంట్రుక పుటికనుండి బయలుదేరిన కోటరము – దీనిని వెంట్రుకల పొదలో వెతకాలి.

**pilose** hairy అంతా రోమమయం, కేశసంపద, వెంట్రుకల విరివి.

**pilule** a small pill చిన్న/చిరుమాత్ర, గుళిక; పిల్లగుళిక, అలంకార. పిల్ల పిల్.

**pilus** [pili *pl.*] 1. a hair వెంట్రుక, రోమము 2. pilial. *micro.str.* సూక్ష్మ.చూ. filament in a bacterium బాక్టీరియమ్‌లోని సూక్ష్మతంతువు.

**pimple** a papule or pustule మొటిమ, బుడిపె, పొక్కు.

**pineal** a small conical body (structure) attached by a stalk to the back of the third ventricle in the brain మెదడులోని మూడవ కోష్ఠకము వెనుక ఒక కాడవలె వ్రేలాడి ఉన్న చిన్న శంకువు ఆకారపు నిర్మాణము. Descartes praised it as 'the seat of the soul'. డెకార్టె అను పేరుగల వేదాంతశాస్త్రవేత్త దీనిని 'ఆత్మకు నెలవు' అని పొగడియున్నారు.

**pinguecula** a yellowish elevated thickening of the bulbar conjunctiva, associated with an aging eye కన్నుగుడ్డు పైపొరయొక్క లేత పసుపుపచ్చని దళసరి గుబ్బ/బుడిపె – ఇది వృద్ధాప్యనేత్ర సూచన/పరిణామము.

**pink disease** *see/చూడండి* acrodynia.

**pink eye** popular name for acute contagious conjunctivitis which spreads in schools, *etc. see/చూడండి.* conjunctivitis. తీవ్రమైన, ఒకరినుండి మరి యొకరికి అంటే/సోకే కండ్లకలక. స్కూల్, మొ. ఆవరణల్లో వ్యాపిస్తుంది.

**pinna** of the ear, auricle of the ear, *see/చూడండి* ear. cartilaginous display కర్ణముయొక్క కర్ణిక, చెవిదొప్ప, కర్ణపల్లవము, అలంకార. మృదులాస్థి ముకుళము.

**pinworm** threadworm, seatworm, intestinal nematode parasite, *Enterobius vermicularis* found in the intestine and around the anus of human beings, *see/చూడండి* Enterobius. నులిపురుగు, ఆసనపురుగు: పేగులు మరియు ఆసనప్రాంతము దీని ఆవాసము.

**pitch** of a sound; degree/intensity of a sound, *e.g.* of respiratory sounds, heart sounds, murmurs స్వరస్థాయి: ఉదా. ఊపిరితిత్తి,

గుండెధ్వనులు, హృదయ మర్‌మర్‌లు – వీటియొక్క ధ్వని తీవ్రత/శబ్దస్థాయి.

**pituitary** the prime endocrine gland, of the size of a small pea, situated in the centre of the brain, the band master of the endocrine orchestra, *see/చూడండి* suprasellar. పీయూషగ్రంథి, చిన్న బఠాని గింజ సైజులో ఉంటుంది. మెదడు మధ్యలోనున్న ప్రధానవినాళికాగ్రంథి; వినాళిక గ్రంథులకూటమికి ప్రభువు/దొర/నాథుడు.

**pityriasis** skin disease with scaly skin, *figur.* seeing this raises 'pity' on the poor fellow – patient పొలుసులుగట్టి, అవి పొరలు పొరలుగా పొట్టుగా రాలిపోయే చర్మజబ్బు. **p. versicolor,** tinea versicolor, variegated appearance నానారంగుల పొలుసులుగల.

**placebo** a dummy sort of thing; harmless nonmedicinal inactive substance given to patients in controlled clinical trials కూటౌషధము: ఇది ఔషధశక్తి నిరూపణ ప్రయోగాల్లో వాడే హానిలేని/హానిచేయని, చురుకులేని, ఔషధముకాని, ఉత్తపిప్పివలెనుండు పదార్థము. Half the patients are given the test drug and half are given a placebo. A double blind trial is one in which neither the physician nor the patient knows who is receiving what. ఔషధసారము/శక్తి నిర్ణయించు పరిశోధనలలో సగము రోగులకు నిజంమందు (test drug) సగము రోగులకు ఉత్తపిప్పిమందు (placebo) ఇస్తారు. ఎవరు ఏ మందు తీసుకుంటున్నారో ఎవరికీ (అనగా వైద్యునికిగాని రోగికిగాని) తెలియదు. Impartial judgement ensues in such a setup. ఈ పద్ధతి నిష్పక్షపాతమైన నిర్ణయమునకు దారితీస్తుంది.

**placenta** the afterbirth, a biological link between the mother and baby in the womb of a pregnant woman జరాయువు, మావి, మాయ: గర్భకోశంలో తల్లికి పిల్లకి బంధం/లంకె (link); గర్భస్థ శిశువును చిరాయువుగా చేసే జరాయువు. The umbilical cord, the channel for nutrition from mother to baby is attached to the placenta at the mother end and the navel at the baby end. నాభిరజ్జువు తల్లివైపు జరాయువుతోను, బిడ్డవైపు నాభితోను కలిసి ఉంటుంది – ఇది భ్రూణమునకు పోషణాధారము.

**plague** fatal disease transmitted to man from rats/rodents caused by a microorganism, *Pasteurella pestis or Yersinia pestis* ప్లేగువ్యాధి, మహామారి: ఎలుకలు/చర్వకములనుండి సంక్రమించు మారణ వ్యాధి; పాస్టురెల్లా లేదా యెర్సీనియా అను ప్రజాతికి చెందిన సూక్ష్మజీవివలన కలుగును. **bubonic p.,** with buboes, *i.e.* lymphnode enlargement in axillary, cervical, inguinal regions బొబ్బల రోగము; చంకలో, మెడమీద, గజ్జల్లో లింఫ్‌గ్రంథులువాచి, పగులుతాయి. **heamorrhagic p.,** black death, bleeding spots all over the skin, some turning black చర్మమంతటా రక్తస్రావంవలన, క్రమేణ నల్లగా మారే మచ్చలు. **pulmonic p.,** involving lungs ఊపిరితిత్తులు వ్యాధికి గురి అవుతాయి.

**plan** to devise ఏర్పాటు చేయు. **treatment p.** చికిత్సా ప్రణాళిక. chemotherapy in tuberculosis, cancer, *etc.* క్షయవ్యాధి, కాన్సరు, మొ. జాడ్యములలో రసాయనచికిత్స.

**planning** to draw a plan ప్రణాళిక ఏర్పాటు చేయు. **family p.** కుటుంబ నియంత్రణ.

**plant** 1. మొక్క. 2. **pharmaceutical p.,** an industry మందులు తయారుచేసే యంత్రసముదాయం, కర్మాగారం.

**plantar reflex** *see/చూడండి* reflex. relating to the sole of the foot అరికాలుకు సం.

**plaque** deposit గార. **dental p.,** thin film of decay on the teeth; food debris, nidus for caries tooth పండ్లమీద గార; ఆహారనలుసు పంట్లో ఇరుక్కొని, తర్వాత సూక్ష్మజీవి ధ్వంసముద్వారా పన్ను పుచ్చిపోవుట అనగా పుప్పిపన్నుగా మారుట.

**plasma** the fluid portion of blood/lymph devoid of cells ప్లాస్మా: జీవద్రవ్యము; రక్తం/లింఫ్‌లో కణములు లేనట్టి ద్రవభాగము. **p. proteins,** ప్లాస్మాలో ప్రోటీన్లు/మాంసకృత్తులు.

**plasmablast** the immature precursor of a plasma cell ప్లాస్మా కణముయొక్క అపక్వ అగ్రగామి.

**plasmacyte** plasma cell ప్లాస్మా కణము.

**plasmapheresis** the removal of plasma from withdrawn blood, the cellular elements in the blood reconstituted and reinfused

to the donor దాత (donor) రక్తంలోని ప్లాస్మా తీసి, రక్తకణములను తగురీతి పోషణచేసి, తిరిగి దాతకు ఎక్కించుట.

**plasmin** fibrinolysin, one which lyses fibrin ఫైబ్రిన్‌ను విఛ్చిన్నము చేయునది.

**plasminogen** substance in blood plasma from which plasmin is formed, i.e. plasminogen is a precursor of plasmin. ప్లాస్మిన్ యొక్క అగ్రగామి.

**Plasmodium** a protozoan, causative agent of malaria, *see/* చూడండి malaria, protozoa. మలేరియాకు కారణమైన ఏకకణ సూక్ష్మజీవి.

**plaster** a cover పట్టి, పలాస్త్రి/పాలస్త్రి **adhesive p.** అంటుకొనే పట్టి **p. of Paris,** gauze soaked in a wet chemical compound which gets dried on exposure to air రసాయనిక పదార్థంలో నానిన తడి గాజుగుడ్డ, ఎండగానే గట్టిపడుతుంది This is used to immobilize parts, *e.g.* fracture site, tuberculosis of bone/joint. విరిగిన ఎముకలు కదలకుండా ఉండటానికి ఆ ప్రాంతంమీద ఈ ప్లాస్టరు పిండికట్టుకడ్తారు మరియు టి.బి. ఎముకలు/కీళ్ళ పైనకూడ ఈ కట్టు కడ్తారు.

**plastic surgery** 1. a type of correctional surgery శరీరరూపమును సరిదిద్దే శస్త్రవైద్య నిపుణత. 2. bringing back the appearance to near normal రూపకల్పన సహజస్థితికి చేరువగా రూపొందించుట **cosmetic p.s.,** to restore/enhance beauty, say on face ముఖము మీది సొగసు నిలబెట్టుటకు/వన్నెతెచ్చుటకు తరణోపాయములు. **keloid (scar) p.s.,** excising the scar or concealing part of it in a natural fold – this applies to post-burn scars, too మచ్చలోని తంతుకణజాలము కత్తిరించుట లేదా శరీర ముడతల్లో కనపడకుండ మరుగు పరచుట – ఇది కాలుడు తర్వాత చర్మవికారములకుగూడ వర్తిస్తుంది. **reconstructive p.s.,** *e.g.* surgery on a clawhand, after leprosy కుష్ఠరోగ పర్యవసానమునకు గురియైన కురూపి అరచేతికి తిరిగి నిజరూపం తెప్పించడం.

**platelets** *syn.* thrombocytes. *micro.str.* సూక్ష్మ.చూ. granulated bodies 2 to 4 $\mu$ in diameter, responsible for coagulation of blood

రక్తపట్టికలు, సూక్ష్మఫలకికలు: రక్తముయొక్క స్పందన ప్రక్రియ వీటి బాధ్యత.

**Platyhelminthes** flat worms బల్లపరుపు పురుగులు. it includes i) **Cestoidea / Cestoda:** tapeworms నవారు పురుగులు, బద్దె పురుగులు – *Taenia saginata, T. solium, Echinococcus granulosus, Diphyllobothrium latum, Hymenolepis diminuta* ii) **Trematoda/Trematodes:** flukes ఫ్లూక్స్ (a) Schistosomes or blood flukes causing the disease known as schistosomiasis or bilharziasis; the flukes are *Schistosoma japonicum, S. mansoni, S. haematobium* (b) liver flukes, *Fasciola hepatica, Clonorchis sinensis* (c) lung fluke, *Paragonimus westermani.*

**platyrrhine** (Greek *platys* broad *rhinos* nose) 1. said of a human: broad-nosed వెడల్పు నాసిక/ముక్కు గల. 2. New World monkey, *N.B.* monkey is the progenitor of man in evolution *గమనిక:* పరిణామం (evolution)లో కోతి మనిషి యొక్క పూర్వీకుడు/అగ్రగామి.

**play therapy** a diversion for paediatric personality problems క్రీడా చికిత్స: పిల్లలలో మూర్తిమత్వ సమస్యల ఉపచారం/పరిష్కారంకోసం వాళ్ళ ధ్యాసను క్రీడవైపు మరలించుట.

**pleomorphism** varying shapes and sizes, say in a cell బహురూపత: కణములో పలురూపములు, పెక్కు సైజులు.

**plethora** excess, e.g. plenty of blood in a region అధికము, ఉదా. అధిక ప్రాంతీయ రుధిర నిల్వ; రక్తాధిక్యత.

**pleura** the double layered membrane which envelops the lung ప్లూరా, పుపుసావరణము, పుపుస వేష్టనము, ఊపిరితిత్తిపై రెండుపొరల తొడుగు. *N.B.* pleura is as sensitive as the cornea! *గమనిక:* ప్లూరా శుక్లపటలమంత సున్నితము! **parietal p.**, the serous smooth membrane lining the thoracic cavity ఛాతీ కుహరమును అంటిపెట్టుకుని ఉన్న మెత్తటిపొర. **visceral p.**, the serous smooth membrane investing closely the lung పై కుహరములోనున్న ఊపిరితిత్తిని అంటిపెట్టుకుని ఉన్న మెత్తటి పొర. There are two pleural cavities, one on each side, right and left. రెండువైపుల రెండు (కుడి, ఎడమ) పుపుసావరణ కుహరములున్నవి. The layers facilitate smooth gliding

of lung without friction during respiration. శ్వాసక్రియలో రాపిడి కలుగకుండా ఊపిరితిత్తిని కాపాడుతుంటాయి. The space between the two layers is a potential one; fluid accumulates in diseases, then it is called pleural effusion. ఈ రెండింటి మధ్యనున్నది సంభవనీయమైన ఖాళీస్థలము; వ్యాధులలో ఈ ఖాళీస్థలములో ద్రవము చేరుతుంది.

**pleurisy** inflammation of the pleura పుపుసావరణ శోథము: ప్లూరా యొక్క 'నొప్పి వేడి వాపు'. **dry p.,** with fibrinous exudate; pain on deep inspiration with a catch in the chest పొరమీద ఫైబ్రిన్‌తోకూడిన రసిక చేరుట; దీర్ఘ ఉచ్ఛ్వాసములో నొప్పి, ఛాతీ పట్టుకున్నట్లు కుట్టు. **purulent p.,** thoracic empyema ప్లూరా పొరలో చీముచేరుట. **p. with effusion,** accumulation of fluid in between the two layers, *see/చూడండి* pleura. రెండుపొరల మధ్య ద్రవము చేరుట. *figur.* weeping of the pleura. *అలంకార.* ప్లూరాయొక్క అశ్రుతర్పణం: శోథములో శోకగ్రస్తమైన ప్లూరాయొక్క విషాదం.

**pleurodynia** 1. intercostal myalgia ఛాతీ ప్రక్క ఎముకల (ribs) మధ్యనుండే కండరముల వాపు, నొప్పి. 2. muscular rheumatism (fibrositis) కండరముల రుమాటిక్ నొప్పులు (తంతిశోథ). 3. It is a feature of Bornholm disease (*syn.* epidemic myalgia.)

**pleuropulmonary amoebiasis** amoebiasis involving the pleura and pulmonary tissue ప్లూరా (పొర) మరియు పుపుస కణజాలములకు సంక్రమించు అమీబియాసిస్ జబ్బు.

**plexus** network of nerves, blood vessels or lymphatic vessels ప్లక్షము: వల, అల్లిక, నాడీకూటమి, రక్తనాళికల లేదా శోషరసనాళికల సముదాయము. **brachial p.,** group of nerves descending from the neck, via shoulder to the superior extremity బాహుప్లక్షము: మెడనుంచి బుజముమీదుగా చెయ్యికి పారునాడులు. **celiac p.,** solar p., (a) group of nerves నరముల సముదాయము (b) network of lymphatics in front of the aorta, behind the stomach లింఫ్‌నాళికల కూటమి; బృహద్ధమని ఎదురుగా, అన్నాశయము వెనుక ఉన్నది. **choroid p.,** of blood vessels in the brain which secrete cerebrospinal fluid రక్తప్లక్షము: మస్తిష్కమేరుద్రవము స్రవించే ఖోరాయిడ్ రక్తనాళికల ప్లక్షము.

**plication** 1. putting together in folds ముడవటం, కుచ్చువేయుటం, పోలిక: లంగాకు నాడా దూర్చినట్లు. 2. a surgical operation ఒక భాగమును ముడిచే శస్త్రచికిత్స.

**plug** any mass filling a hole, or closing an orifice or obstructing a tube (i) mucous p., plug blocking cervical os (opening) గర్భాశయ ద్వారం మూసివేసే శ్లేష్మముద్ద. (ii) mucous p's, in bronchial tubes in asthma ఉబ్బసంలో శ్వాసనాళముల/నాళికలలో శ్లేష్మం ముద్దలు అడ్డుపడటం.

**plumbism** chronic lead poisoning, *see/చూడండి* lead.

**pneumococcus** [pneumococci *pl.*] microorganism species *Streptococcus pneumoniae*, usually attacks the lungs ఈ సూక్ష్మ జీవి ఎక్కువగా ఊపిరితిత్తుల జబ్బు కలుగజేస్తుంది. It causes pneumonia. నుమోనియాకు కారణము.

**pneumoconiosis** or **pneumonoconiosis** *colloq.* dust disease. industrial/occupational disease due to longstanding inhalation of dust/particles during their work, e.g. **coal workers' p., silicosis, asbestosis** వృత్తిరీత్యా సంభవించు జాడ్యము. తన పనిలో రేణువులతో కలుషితమైన/మిళితమైన దుమ్ము దీర్ఘకాలం పీల్చిన పర్యవసానంగా కలుగు వ్యాధి, ఉదా. బొగ్గు గనుల కార్మికులలో రుగ్మత, సిలికోసిస్, రాతినార కార్మికులలో జబ్బు.

**pneumology** or **pneumonology** study of the lung and its diseases ఊపిరితిత్తి మరియు దానికి సం. వ్యాధుల శాస్త్రం.

**pneumonectomy** surgical removal of lung tissue, total or a lobe (lobectomy) పుపుసోచ్ఛేదన: ఊపిరితిత్తినిగాని, అందులోని కొంత భాగమునుగాని శస్త్రచికిత్సతో తీసివేయుట.

**pneumonia** inflammation of lungs with exudation and consolidation, *viz.* spongy tissue getting firm, *figur.* lung transforming into liver, in texture నిమోనియా, ఊపిరితిత్తి శోథము: ఊపిరితిత్తిలో రసిక ఊరి, స్పంజికవలె నున్నది దృఢమై, 'నొప్పి వేడి జ్వరము'తో కూడిన స్థితి, అలంకార. స్పర్శకు ఊపిరితిత్తి కాలేయముగా మారుట. **aspiration p.**, aspiration of foreign material, chemical substances,

*etc.* బాహ్యపదార్థములు, రసాయనిక పదార్థములు శ్వాసకోశములలోనికి గుంజుకొనబడుట వలన నిమోనియా. **bacterial p.** బ్యాక్టీరియా వలన నిమోనియా. **lobar p.,** infection by pneumococcus, one or more lobes being affected ఈ సూక్ష్మజీవివలన ఒకటిగాని ఇంకా ఎక్కువగాని లంబికల రుగ్మత. **lobular p.,** bronchopneumonia బ్రాంకోనిమోనియా. **viral p.,** due to virus వైరస్‌వలన నిమోనియా.

**pneumonitis** inflammation of lung tissue ఊపిరితిత్తి కణజాలముల శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**pneumonoconiosis** *see/చూడండి* pneumoconiosis.

**pneumonology** *see/చూడండి* pneumology.

**pneumopyothorax** presence of gas and pus in the pleural cavity పుపుసావరణ కుహరములో వాయువు మరియు చీము చేరుట.

**pneumothorax** presence of gas in the pleural cavity పుపుసావరణ కుహరంలో వాయువు చేరుట.

**pock** lesion on the skin containing pus, especiallly in smallpox పొక్కు: ముఖ్యముగా మసూచి వ్యాధిలో చర్మం మీద క్షతము: చీము పొక్కు. pock marks స్ఫోటకం మచ్చలు.

**pocket** 1. a bag of pus చీము గూడుకట్టుకొని యుండుట. 2. enclosure in a shirt జేబు, గ్రా. కీచ.

**podagra** gout of the feet, *see/చూడండి* gout.

**podalgia** tarsalgia, pododynia. pain in the foot కాలునొప్పి.

**podarthritis** inflammation of the joints in the foot పాదములోని కీళ్ళలో శోథము.

**podiatry** chiropody. *see/చూడండి* chiropody.

**podopompholyx** pompholyx on the feet, *see/ చూడండి* pompholyx. [*Cf.* cheiropompholyx].

**poikilocytosis** presence of erythrocytes with distorted shape కురూపముగల ఎర్రరక్తకణములు ఉన్నస్థితి [*Cf.* anisocytosis తారత. వివిధ పరిమాణముగల ఎర్రరక్తకణములున్న స్థితి].

**poison** substance which is lethal విషం. **p. ivy** ఒక విధమైన విష లత/తీగ. **p. oak** ఒక విధమైన విషపూరిత పొద.

**poisoning** exposure to a poison విషప్రయోగము, విషసంబంధ పదార్థ సంపర్కము. **blood p.,** septicaemia, circulation of microorganisms and their toxins in blood రక్తములో సూక్ష్మజీవులు మరియు వాటి విషసంబంధ పదార్థములు ప్రసరించుట. **food p.,** due to ingestion of toxins in food, *see/చూడండి* botulism. విషసంబంధ పదార్థములు అభోజ్య భోజనంద్వారా ఒంట్లోకి చేరడం. **heavy metal p.,** by contact with arsenic, lead, mercury, *etc., see/చూడండి* lead, plumbism. పాషాణము, సీసము, పాదరసము, మొ. లోహముల సంపర్కము.

**polioencephalitis** inflammation of the gray matter in the brain due to poliomyelitis పోలియో మూలకంగా మెదడులోని బూడిదరంగు పదార్థముయొక్క వాపు/శోథము.

**poliomyelitis** polio పోలియో, శిశుపక్షవాతము. inflammation of the gray matter in the spinal cord caused by poliovirus, an enterovirus. Conspicuous feature is its preference for the young (infantile paralysis). వెన్నుపాములోని బూడిదరంగు పదార్థము యొక్క వాపు, వైరస్ వలన సంభవిస్తుంది. ఏడాది వయస్సు దాటిన తర్వాత పిల్లలు ఎక్కువగా ఈ జబ్బుకు గురి అవుతారు. It is spread by faecal oral contamination; hence a disease in insanitary environment. మలవిసర్జనచే కలుషితమైన ఆహారము ద్వారా వ్యాధి అంకురిస్తుంది; అనారోగ్య అశుభ్ర వాతావరణం దీనికి నెలవు/చెలిమి. Paralysis of groups of muscles of legs or arms with consequent atrophy makes the patients handicapped. కాళ్ళలోగాని బాహువుల్లోగాని కండరము గుంపుల పక్షవాతం సంభవించి, క్రమేణ అవి కృశించి, వికలాంగులను చేస్తాయి. Oral polio drops emerged as a boon now-a-days for the prevention of polio. పోలియో రాకుండా అరికట్టుటకు మరియు దానిని రూపుమాపుటకు పోలియో చుక్కలు నోట్లో వేయడం ఒక వరంగా భావించాలి. **bulbar p.,** affecting the medulla oblongata. It is invariably fatal. మజ్జాముఖమునకు ఆవరించిన పోలియో జబ్బు నిక్కముగా ప్రాణాంతకము. **cerebral p.,** polio extending into the brain మెదడుకు వ్యాపించు పోలియో.

**pollution** 1. making impure, *e.g.* **air, water p.** ఉదా. గాలి/జల కాలుష్యము. 2. rendering the atmosphere unpleasant, *e.g.* **noise p.** శబ్దకాలుష్యము, *e.g.* lorry horn లారీకూత శ్రవణఘోష. 3. **mind p.**, corrupt the mind మనస్సును దుర్విషయములపై మరలించుట.

**polyarteritis** inflammation of many arteries బహుళధమని శోథము. **p. nodosa** (also called periarteritis nodosa) swelling and thrombosis of vessels నాళములు ఉబ్బి థ్రాంబస్ ఏర్పడుట.

**polyarthralgia** pain in several joints పెక్కు కీళ్ళ నొప్పి/వేదన.

**polyarthritis** inflammation of many joints పలుకీళ్లవాపు, పెక్కుకీళ్ళ శోథము/'నొప్పి వేడి తీపు వాపు'. **p. rheumatica acuta,** rheumatic fever రుమాటిక్ జ్వరము, కీళ్ళవాతము.

**polychondritis** inflammation of many cartilages in the body శరీరంలో పెక్కు మృదులాస్థుల శోథము/'నొప్పి వేడి తీపు వాపు'.

**polycythaemia** or **polycythemia** a condition of excess of total cell mass in the blood, especially erythrocytes ఎర్రకణవృద్ధివ్యాధి, రక్తములోని కణజాలము వృద్ధి అగుట, ముఖ్యముగా ఎర్రరక్తకణములు. **p. rubra vera,** erythraemia, the red cell count is very high in this disease ఈ జబ్బులో ఎర్రరక్తకణ సంఖ్య చాలా ఎక్కువగా ఉంటుంది.

**polydactylism** or **polydactyly** having the number of digits, *viz.*, fingers or toes more than five, a congenital disorder చేయి/పాదముయొక్క బహుఅంగుళికత; అయిదువేళ్ళకన్నా ఎక్కువ ఉన్నస్థితి. పుట్టుకతో వచ్చినది.

**polydipsia** abnormal thirst for water, *e.g.* in diabetes mellitus అమితదాహము, అతిజలపానపిపాస, ఉదా. మధుమేహం వ్యాధిలో.

**polyinfection** infection with more than one microorganism ఒక ప్రజాతి సూక్ష్మజీవి కన్నా ఎక్కువ ప్రజాతుల సూక్ష్మజీవుల సంసర్గము.

**polymastia** multi-mammae. a condition in the human, in which more than two breasts are present బహుళ స్తన్యవతి, పలు కుచవతి. also called pleomazia, polymazia, *figur.* amazing, is it not! అలంకార. వింత కదూ! తీగెకు/చెట్టుకు కాయ బరువా!

**polymicrobial** polymicrobic. **p. infection** బహుళ సూక్ష్మజీవి సంపర్కం/సంక్రమణము.

**polymorph** *colloq.* for polymorphonuclear leukocyte బహురూపక: తెల్లరక్తకణములలో ఒక వర్గమునకు చెందిన కణము.

**polymyositis** inflammation of many muscles పెక్కు పేశీల శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**polyneuritis** inflammation of many peripheral nerves బహు తాంత్రిక శోథము *see/చూడండి* neuritis. బహుళనాడీవేదన; పలు పరిధీయ నాడుల 'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**polyneuropathy** generally noninflammatory condition of nerve involvement, *e.g.* diabetes బహుతాంత్రిక వికృతి: పెక్కు నాడుల శోథరహిత తెగులు, ఉదా. మధుమేహం వ్యాధి.

**polyp** polypus, outgrowth from a mucous membrane అర్బుము: శ్లేష్మపొరనుండి పిలక. **intestinal p.**, polyp hanging into the lumen పేగులోనికి వేళ్ళాడే పిలక. **nasal p's**, which frequently bleed ముక్కులో కొయ్యగండలు, నాసార్శములు తరచుగా నెత్తురు కారుతుంటాయి. నాసిక రక్తసిక్తం: **rectal p's**, one cause of bleeding per rectum మలాశయమునుండి రక్తము రావడానికి ఒక కారణము. **uterine p's**, గర్భాశయార్శములు.

**polypathy** polytherapy; now-a-days people are fond of using allopathic, homeopathic, and ayurvedic medicines,either two or all of them simultaneously బహువైద్యవిధాన ప్రయోగం, బహుళ భేషజ ప్రయోగము: ఈ రోజుల్లో ప్రజలు ఇంగ్లీషు, హోమియో, ఆయుర్వేద ఔషధములు (వీటిలో రెండుగాని, అన్నీగాని) ఏకకాలమందు వాడుతున్నారు, అనగా కలిపి వాడుతున్నారు.

**polyphagia** excessive appetite, *e.g.* in diabetes mellitus ఎక్కువ/ అధిక ఆకలి, ఉదా. మధుమేహం వ్యాధిలో. *N.B.* the characteristic triad of diabetes: polyphagia, polydipsia, polyuria *గమనిక:* మధుమేహం వ్యాధిలో లక్షణత్రయం – అధిక ఆకలి, అమితదాహం, అతిమూత్రం.

**polyposis** presence of multiple polyps, *see/చూడండి* polyp. బహుపిలకలుగల రూపము. **p. coli,** a hereditary disorder in

which polypi occur throughout the inner surface of the large bowel, *resemblance:* pavement-dwelling huts on a plain road పెద్దపేగులోపలి అంచున పొడుగునా పిలకలు – ఇది ఒక అనువంశిక అపవ్యవస్థ, *పోలిక:* రహదారి బాటప్రక్కన గుడిసెలు.

**polyserositis** simultaneous accumulation of fluid in two or three cavities, *viz.* peritoneum, pleura and pericardium ఆంత్రవేష్టన కుహరము, పుపుసావరణ కుహరము మరియు హృదయావరణ కుహరము – ఈ మూడింట్లో ఏ రెండింటిలోనైనా లేదా అన్నింట్లోనైనా ఏకకాలమందు ద్రవము చేరుట.

**polytherapy** *see/ చూడండి* polypathy.

**polyunsaturated fats** *abbr.* PUFA - poly unsaturated fatty acids బహుళ అసంతృప్త కొవ్వు పదార్థములు. liquid oils of vegetable origin such as corn oil, safflower oil వృక్షమూలమైన క్రొవ్వు ద్రవములు, *ఉదా.* మొక్కజొన్న నూనె, కుసుమ నూనె [*in contr.* Dalda which is solid fat *భిన్న.* డాల్డా – గడ్డకొవ్వు].

**polyuria** excessive urination, *e.g.* diabetes mellitus అతి మూత్ర విసర్జన, *ఉదా.* మధుమేహం వ్యాధిలో.

**pompholyx** a vesicular skin eruption on the skin causing itching or burning చర్మం మీద బొబ్బల్లాంటి పొక్కులు లేదా దద్దుర్లు- వీటివలన దురద లేదా మంట కలగటం కద్దు.

**pons** a bridge వంతెన. part of the central nervous system between the midbrain and medulla oblongata, anterior to cerebellum కేంద్రనాడీవ్యవస్థలో మధ్యమెదడుకు మజ్జాముఖమునకు మధ్యను, అను మస్తిష్కమునకు ముంగిటను ఉన్న వంతెనలాంటి భాగము.

**pontine** concerning the pons పాన్స్‌కు సం.

**popliteal** relating to the area behind the knee జానువు వెనుక ప్రాంతము. **p. fossa** జానువు వెనుక ఖాతము.

**poppy seeds** *bot.* Indian Name: *Khas - khas* గసగసాలు. used in dysentery విరేచనాలలో వాడ్తారు. Opium is obtained by evaporation of the milky ooze from poppy plant. నల్లమందు ఈ మొక్కలో ఊరినపాలు ఆవిరిచేసిన తరువాత మిగిలే పదార్థం.

**population** the number of people జనసంఖ్య. **p. explosion** జనాభా విస్ఫోటనం: ప్రజలు విరివిగా ఉద్భవించుట, జనాభా సంఖ్యారోహణ. *N.B.* Heren in 1993 expressed anguish that population is a cancerous growth on earth. *గమనిక:* హెరన్ అనే శాస్త్రవేత్త 1993లో జనాభా విస్ఫోటనం వర్ణిస్తూ మనిషి "భూమికి దాపురించిన కేన్సర్" అని వాపోయారు.

**pore** porus, an opening రంధ్రము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **porus acusticus externus,** opening of the external ear బాహ్య కర్ణరంధ్రము. **porus opticus,** opening in the sclera for the optic nerve దృఢస్తరములో దృష్టినాడీ రంధ్రము. *micor.str.* సూక్ష్మ.చూ. **Kohn's p's, alveolar p's, interalveolar p's,** *i.e.* between adjacent alveoli, size $2\mu$, ఒక వాయుకోశము దానిప్రక్కనున్న వాయుకోశము మధ్య సూక్ష్మ బెజ్జములు. **pores** in the endothelium of Bowman's capsule in the nephron నెఫ్రాన్‌లో బెజ్జములు. **sweat p's,** Sweat glands situated deep in the dermis excrete perspiration which drains out on the skin through the pores. చర్మముమీది స్వేద రంధ్రములు.

**porous** [*adj.* of pore] full of pores. *micro.str.* సూక్ష్మ.చూ. penetrated by pores సచ్ఛిద్రము, సరంధ్రము, సూక్ష్మబెజ్జములు గల.

**porta** an entrance or portal ప్రవేశము. **p. hepatis,** the place of passage of blood vessels and exit of duct in the liver రక్తనాళములు కాలేయము/లివర్‌గుండా పోవు మరియు వాహిక బయటకు వచ్చు ప్రదేశము.

**portal** pertaining to a porta (gate) ప్రవేశ ద్వారమునకు సం. **p.system** నిర్వాహక వ్యవస్థ/ఉపతంత్రము. **p. vein** నిర్వాహక సిర.

**portosystemic** pertaining to portal and systemic పోర్టల్ మరియు దైహిక వ్యవస్థకు సం. **p. venous anastomoses,** an event in portal (liver) cirrhosis, causing haemetemesis పోర్టల్/నిర్వాహక వ్యవస్థకును దైహికవ్యవస్థకును సంబంధించిన సిరల అనుమేళకము/కలయిక – ఇది కాలేయము గట్టిపడిన జబ్బులో చూడనగును, ఈ జబ్బులో నోటివెంబడి వాంతిలో రక్తము పడుట చూస్తుంటాము.

**porus** an opening or pore, *see/చూడండి* pore.

**position** posture భంగిమ. **anatomical p.,** a term in anatomy; in relation to a person standing erect with palms facing forward స్థితి, స్థానము: అరచేతులు ఎదురుగా ఉంచి నిలబడ్డ మనిషి. శరీరనిర్మాణ శాస్త్రములో ఏ భాగమునైనా ఈ భంగిమకు అనుకూలించి/సంబంధించి వర్ణిస్తారు. అనగా అట్టి వర్ణనకు ఈ భంగిమ ప్రమాణము. **Fowler's p.,** resemblance to sitting in easy chair adopted in bed in infection of the pelvic organs, so that the secretions, *viz.* pus *etc.*, drain down పడకకుర్చీలో కూర్చున్నట్లు: ఈ భంగిమలో శ్రోణి అవయవములలోనున్న ద్రవములు (చీము వగైరా) క్రిందకు జారుటకు/కారుటకు వీలుగా/తేలికగా ఉంటుంది. **knee elbow p.,** lying prone on knees and elbows, useful in clinical examination మోకాళ్ళు మోచేతుల మీద బోర్లగా అధారపడి ఉండు అకృతి, బస్కీలు తీసేముందు భంగిమ – ఇది రోగి పరీక్షలో ఉపయోగపడుతుంది. **Trendelenburg's p.,** patient reclining on a table tilted 45°, useful in special radiological techniques 45 డిగ్రీలు క్రిందకు వంచిన బల్లమీద రోగి పరుండియుండుట – ఈ భంగిమ కొన్ని ఎక్స్‌రే పరీక్షల్లో ఉపయోగపడుతుంది.

**posology** a branch of materia medica, dealing with the science of dosage of drugs ఔషధ మోతాదు నిర్ణయశాస్త్రం.

**postauricular** behind the auricle of the ear కర్ణముయొక్క కర్ణిక వెనుక.

**postcibal** [Latin *cibum* food]. after a meal or after taking food/feed తిన్న తర్వాత లేదా ఏమైనా తాగిన తర్వాత.

**postencephalitic** following encephalitis మెదడు వాపు వ్యాధి యొక్క పర్యవసానం. **p. sequelae** మెదడువాపుజబ్బు తదుపరి చూచే అనగా ఉత్తరఘట్టములు. mental deficiency, fits, paralysis, loss of vision, loss of hearing, *etc.* తెలివిలోపము, మూర్ఛలు, పక్షవాతము, అంధత్వము, చెవుడు, మొ.

**posterior** *anat.* back పర, పరాంత, పశ్చిమ, వెనుక, వెనుకటి [*opp.* interior వ్యతి. పూర్వ, పూర్వాంత, ముందు, ముందటి].

**posthitis** inflammation of the prepuce (foreskin over the penis) ముందోలు శోథం/'వాపు తీపు ఎరుపు మంట పోటు'.

**postictal** following a seizure మూర్ఛ తర్వాత.

**postmature labour** delivery occurring after the expected date usually beyond 40 weeks 40 వారాల గడువు దాటిన తర్వాత వచ్చే పురుడు [*in contr.* premature labour] [*q.v.* hypermature cataract].

**postmortem** after death మరణానంతర, మృతి తర్వాత. **p. examination** in medical jurisprudence, examination and cutting of dead body, especially to determine the cause of death ముఖ్యంగా మృతికారణం తెలుసుకొనుటకై, వైద్యన్యాయశాస్త్రములో మృతదేహాన్ని తనికీ చేయుట, కోయుట.

**postnatal** after delivery ప్రసూతి తరువాత. **p. care** ప్రసవానంతర శ్రద్ధ: కాన్పుకు తర్వాత తీసుకొను శ్రద్ధ [*in contr.* prenatal వ్యతి. ప్రసూతి పూర్వ, కాన్పుకు ముందు].

**postnatal depression** mood of depression soon after delivery, having aversion to further family life; but soon it fades away; however, it may last long in some mothers. ప్రసూతి వైరాగ్యం, 'ఇక సంసారం వద్దు' అని – కాని క్రమేణ యథాస్థితికి వస్తారు! కొద్ది మందిలో దీర్ఘకాలంపాటు ఉండటం కద్దు ఈ వైరాగ్యం.

**postoperative** after a surgical operation శస్త్రచికిత్స అనంతరం. **p. care** శస్త్ర చికిత్సానంతర శ్రద్ధ/జాగ్రత్త.

**postpartum** after parturition/delivery ప్రసవము/కాన్పు తర్వాత.

**postprandial** postcibal, after a meal భోజనం తర్వాత.

**postpuberal** postpubertal, after puberty యౌవనం మొదలైన తర్వాత.

**post-traumatic stress disorder** or **post-traumatic stress syndrome** a psychological disorder in the wake of an extreme physical and/or mental trauma, say after life- threatening accident, rape, *etc.*, characterised by stress, anxiety, nightmares, *etc.* ప్రాణ హాని కలిగించే ప్రమాదము, రేప్ (rape), మొ. దుర్ఘటనల పర్యవసానంగా మానసిక అపవ్యవస్థ – ఇందులో మనస్సు ఒత్తిడి, ఆదుర్దా, నిద్రలో సంకటము, పీడకలలు, మొ. ఉండటం కద్దు.

**postvaccinal** after vaccination టీకా వేసిన తర్వాత.

**potable** fit to be drunk త్రాగుటకు అర్హమైన. **p. water,** fit for drinking త్రాగదగిన నీరు, గ్రా. చలివేంద్రంలో జలము.

**potassium** kalium. symbol K. an alkaline metallic element పొటాసియమ్. K సంకేతాక్షరము. క్షారలోహ మూలపదార్థం.

**potency** 1. strength of the male to perform sexual intercourse సంభోగమందు శక్తి. 2. the effectiveness of a drug in relation to its dose పాటవము, శక్తత, తైక్ష్ణ్యము, మోతాదు రీత్యా శక్తి, ఔషధముయొక్క ఫలప్రమాణము. అలంకార. ఔషధ సత్తా.

**Pott's disease** of spine; tuberculosis of the vertebrae వెన్నుపూస ఎముకలకు సంభవించు క్షయవ్యాధి.

**Pott's fracture** a fracture-dislocation at the ankle చీలమండ దగ్గర ఎముకలు విరుగుట, కీలు తొలగుట.

**pouch** a pocket or recess సంచి, తిత్తి, జోలి, కోశము. **Douglas p.,** the pouch of peritoneum between the upper part of the vaginal wall and the sigmoid colon యోనికుడ్యము పైభాగము మరియు సిగ్మాయిడ్ పేగుకు మధ్యనున్న ఆంత్రవేష్టనస్తర జోలి.

**poultice** a modality of physiotherapy; applying a mass of cooked cereal as a hot compress over a region of pain, as a method of counter-irritation పిండి ఉడకబెట్టి కట్టుట – దీని ప్రతిరేపెడు గుణమువలన అసలునొప్పి ఉపశమనముగా తోస్తుంది.

**pox** infectious viral diseases with pocks,*see/ చూడండి* pock, *e.g.* chickenpox, smallpox చర్మంమీద పొక్కులతో గూడిన అంటు వైరస్ జబ్బులు, ఉదా. చిన్నమ్మవారు (ఆటలమ్మ), పెద్దమ్మవారు (స్ఫోటకం.)

**poxviruses** measuring 200 to 300 m$\mu$. chickenpox, smallpox, cowpox, monkeypox, rabbitpox, goatpox, *etc.* ఆటలమ్మ, స్ఫోటకం, మొ. molluscum contagiosum of men.

**practice** 1. professional work or business వృత్తిధర్మం లేదా వ్యాపారం. 2. successful medical practice సఫల హస్తవాసిగల వైద్యము, రోగికి తనమీద గురిగల వైద్యుడు చేసే ప్రాక్టీసు.

**practitioner** a person practising a profession వృత్తిధర్మం నెర వేర్చువాడు. 1. medical practitioner ప్రాక్టీస్ చేసే డాక్టరు. 2. Practitioner, a medical journal వైద్య వార్తాపత్రిక.

**preanaesthetic** before anaesthesia మత్తుకు పూర్వం. **p. medication** మత్తుమందు ఇచ్చేముందు మందు.

**preauricular** in front of the auricle of the ear కర్ణముయొక్క కర్ణిక ముందు. **p. region** ఈ ప్రాంతము.

**precancerous** premalignant stage of early suspicion of cancer కాన్సరు యొక్క అపాయము/శంక దృష్ట్యా, సత్వర నిర్ధారణ చేయవలసిన రుగ్మత దశ.

**precaution** pre = ముందు caution = జాగ్రత్త. action taken in advance to avoid risk ఆపదోద్ధారక పూర్వచర్య. *N.B.* Precaution is better than cure. *గమనిక:* ముందు జాగ్రత్త చికిత్స కన్నా మిన్న/మేలు.

**preclinical** 1. said of a disease, before frank symptoms appear వ్యాధిలక్షణాలు బాహాటంగా వ్యక్తమయే ముందు ఆ రుగ్మతకు సం. 2. said of a medical course; subjects of anatomy, physioligy, biochemistry, *etc.* (also called basic sciences) మెడికల్ కోర్సులో ప్రాథమిక చదువు, శరీరనిర్మాణశాస్త్రం, శరీర ధర్మశాస్త్రం, జీవ(న)రసాయన శాస్త్రం, మొ.

**precordium** region over the heart and lower thorax గుండె ఎదురుప్రాంతము మరియు ఛాతీలో క్రింది భాగము.

**preeclampsia** toxaemia in late pregnancy marked by hypertension, proteinuria and oedema గర్భవాతమునకు నాంది; గర్భిణీ స్త్రీలో నెలలునిండేముందు అధిక రక్తపోటు, మూత్రములో అల్బుమిన్ మరియు ఒడలువాపు కలిగిన స్థితి.

**prefrontal lobotomy** 1. a surgical operation in the prefrontal area in the brain ప్రాక్ లలాట లంబిక ప్రాంతంలో శస్త్రక్రియ. 2. psychosurgery, a modality of treatment to relieve mental and psychic symptoms మానసికరోగ శస్త్రచికిత్స.

**pregnancy** A. changes in the body after the union of an ovum with spermatozoon; state of being with/bearing a baby గర్భము,

చూలు: అండము మరియు పురుషబీజకణముయొక్క కలయిక తర్వాత శరీరంలో పరిణామములు; గర్భస్థశిశువును కాపాడుకొంటున్న/మోస్తున్నస్థితి. **abdominal p.,** pregnancy in the peritoneal cavity అంత్రవేష్టనకుహరములో గర్భము సంభవించుట. **ectopic p., extrauterine p.,** pregnancy outside the uterine cavity గర్భసంచిలో గాకుండా దానికి బయట గర్భము అంకురించుట. **full term p.,** 37 to 40 completed weeks from conception/fertilization ఫలదీకరణ లగాయతు 37 నుండి 40 వారములు. **multiple p.,** presence of more than one fetus growing simultaneously, *e.g.* twin p. ఏకకాలములో ఒకటికన్నా ఎక్కువ భ్రూణములు పెరుగుతుండుట, ఉదా. కవల భ్రూణములు. **tubal p.,** pregnancy in the Fallopian tube ఫెలోపియన్ నాళములో గర్భము ప్రారంభించుట. **uterine p.,** normal p. సహజ గర్భాశయ గర్భిణి. B. *idiom:* She is in the family way. వాడు.భా. కడుపుతో ఉన్నది.

**pregnant** 1. in the family way చూలాలు, గర్భవతి. 2. pregnant with meaning, joy అర్థభూయిష్ఠము, ఉల్లాసభరితము.

**premarital** before marrige వివాహానికి ముందు. **p. sex,** indulgence in sexual intercourse proir to marriage వివాహపూర్వ మైథునము.

**premature** prior to the proper time యుక్తకాలమునకు ముందు. **p. delivery,** delivery before full term నెలలు నిండకుండా కాన్పు కలగడం/అవటం. **p.ejaculation,** ejaculation of semen prior to the introduction of penis into the vagina, by which the woman gets dissatisfied లింగము యోనిలోనికి దూర్చకముందే శుక్రము స్ఖలనమగుట – దీని పర్యవసానం స్త్రీకి అసంతృప్తి.

**premature labour** labour that occurs earlier than normal time in pregnancy నెలలు తక్కువ కాన్పు. 1. (a) fetus weight below 2 kgs or 2.5 kgs బిడ్డ బరువు 2 కిలోలు లేదా 2.5కిలోల కంటే తక్కువ. (b) before the 37th or 38th week of gestation 37 లేదా 38 వారాల గర్భధారణకాలం ముందు (American standards అమెరికా వారి ప్రమాణము). 2. In English law, the birth of a baby after 28 weeks but before term బ్రిటిషువారి చట్టం ప్రకారం 28 వారాల తర్వాత నుండి నెలలు నిండేవరకు.

**premedication** preliminary medication prior to a surgical operation శస్త్రపూర్వ ఔషధ ప్రయోగము: శస్త్రచికిత్స అనగా ఆపరేషన్ ముందు ఇచ్చే ఉపక్రమ ఔషధము.

**premenstrual tension** anxiety before menses which is not uncommon స్త్రీలలో ఋతువుకు ముందు కలుగు ఆందోళన – ఇది సాధారణ అనుభవము.

**premolar** 1. anterior to a molar దంతమునకు ముందు. 2. a bicuspid tooth రెండు బుడిపెలుగల పన్ను.

**prenatal** prior to birth ప్రసూతి పూర్వం, జననపూర్వ, పుట్టుకముందు [*in contr.* post natal భిన్న. పుట్టుక తర్వాత].

**preoperative** 1. before an operation శస్త్ర చికిత్సకు ముందు. **p. evaluation,** of patient's health to know whether he can with stand the operation ఆపరేషన్ తట్టుకొనగలడా అని స్వస్థత పరీక్ష 2. **p. medication,** medicine given to tranquilize, or for a specific action, *e.g.* atropine *inj.* ఆపరేషన్ చేసే ముందు ఇచ్చేమందు.

**prepuce** foreskin, a fold of skin gliding on itself over the glans penis శిశ్నాగ్రచర్మము: పురుషాంగముయొక్క మేఢ్రమణిమీది చర్మము. ఈ చర్మము మడత ముందుకు వెనుకకు మేఢ్రమణిమీద ఆడుతుంది. **p. of clitoris,** a small fold of labia minora capping the clitoris చిన్న క్రిందిపెదవియొక్క చిన్న ముడత క్లైటోరిస్‌కు చంటిపిల్ల టోపీవలె అమర్చబడి ఉంటుంది.

**presbyopia** *colloq.* long-sightedness. people of age around 45 and above keep the book at a longer distance to read దృష్టిస్థితి ధోరణి – నిత్యానుభవము: 45 సంవత్సరములు దగ్గరవాళ్ళు లేదా అంతకంటె వయస్సు పైబడిన వ్యక్తులు పుస్తకాన్ని దూరంగా పెట్టి చదువుతూ ఉండటం చూస్తుంటాం.

**prescription** doctor's written instruction: డాక్టరు వ్రాసిన ఉత్తరువు. 1. medicine and how to use it ఔషధముపేరు, ఎట్లా వాడాలి. 2. power of glasses కళ్ళద్దాల పవర్/నంబర్.

**presenile** approaching senility వృద్ధాప్యదశకి తొలిమెట్టు. **p.dementia** పూర్వవృద్ధాప్యమతిభ్రంశం.

**presentation** appearance అగుపడుట. **breech p.**, *see/చూడండి* breech presentation. **cephalic p.**, head presentation at the vulval opening before delivery భ్రూణ కపాలదర్శనం; కానుపుకు ముందు శిశువు కపాలము యోనిరంధ్రమందు కనబడుట.

**preservation** keeping free from decay కుళ్ళిపోకుండా కాపాడుట. 1. of food items, *e.g.* pickle సంరక్షణ, పరిరక్షణ, ఉదా. ఊరగాయ. *N.B.* Salt is the preservative in this. *గమనిక:* దీనిలో లవణము పరిరక్షకము. 2. of medicines, to prolong their potency/life, *N.B.* expiry date is printed on the pack of medicine *గమనిక:* మందుల పరిరక్షణ; ఔషధ పటుత్వము నశించే/వాడుక ముగింపు తేది మందుల డబ్బామీద ముద్రిస్తారు. 3. of health ఆరోగ్యపరిరక్షణ. *N.B.* Self preservation is an inborn instinct. *గమనిక:* స్వయం సంరక్షణ ఉగ్గుపాలతో పుట్టిన సహజాతము/ఉత్సుకము. 4. of dead body, in a mortuary మృతదేహ పరిరక్షణ. temporary measure: keeping on ice blocks తాత్కాలిక మార్గం: ఐస్‌గడ్డలమీద పెట్టడం. permanent measures: దీర్ఘకాల పరిరక్షణ, *see/చూడండి* (a) embalming (b) Egyptian mummies in mummy.

**pressure** force ఒత్తిడి, పీడనం. 1. **blood p.**, *see/చూడండి* blood pressure. రక్తపీడనం. 2. **venous p.**, pressure of blood in the veins సిరలలో రక్తపు ఒత్తిడి. 3. **p. sore**, bed sore, decubitus ulcer due to friction, irritation; notorious for non-healing శయన వ్రణము, రాపిడి/ఒరపిడి వలన కలుగు వ్రణము; త్వరగా/ఒకపట్టాన మానదు.

**preventive** that which stops from happening జరగకుండా చేసే. prophylactic measures వ్యాధినివారణ ప్రక్రియలు. **p. medicine** వ్యాధినిరోధక విజ్ఞానము. *N.B.* Prevention is better than cure. *గమనిక:* వ్యాధిచికిత్సకన్నా దాని నివారణము మిన్న.

**priapism** persistent erection of the penis with pain and tenderness, unrelated to sexual excitement. It could occur in leukaemia or injury to the spinal cord. శిశ్నము బహుకాలం నిగిడి ఉండటము; లైంగిక హుషారుకు సంబంధము లేకుండా పురుషాంగము నిఠారుగా అయి ఉబ్బి, నొప్పి తీపు కలుగజేయుట. లుకీమియా (బ్లడ్ కాన్సర్)లోగాని వెన్నుపాము గాయములలోగాని సంభవించవచ్చును.

**prickly heat** *see/చూడండి* miliaria.

**primary sexual characteristics** sexual organs present right from birth, viz. testes in males, and ovaries in females స్వాభావికంగా పుట్టుకతో ఉన్న లైంగిక అవయవములు: పురుషుల్లో వృషణములు, స్త్రీలలో అండాశయములు [*in contr.* secondary sexual characteristics భిన్న. గౌణలైంగిక లక్షణములు].

**primigravida** *colloq.* primi. primipara, para I, first pregnancy వాడు.భా. తొలిచూరు అనగా తొలిచూలు, ప్రథమగర్భము.

**primordial** primitive ఆదికాలపు, ఆదిమ, ఆది.

**private practitioner** a doctor who does private practice ప్రాక్టీస్ చేసే డాక్టరు.

**process** 1. projection, say from a bone కీలితము, ఎముకమీది ఉబుకు/గుబ్బ. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **spinous p. of vertebra,** a projection from the back of the vertebral arch వెన్నుపూసయొక్క కమాను వెనుక గుబ్బ. **styloid p.** of temporal bone కణత ఎముక కీలితము. **xiphoid p.,** p. beneath the sternum అగ్రకీలితము: ఉరఃఫలకము (sternum) క్రింద గుబ్బ. *micro.str.* సూక్ష్మ.చూ. **ciliary p's** in the eye కన్నులోని కీలితములు. 2. procedure ప్రక్రియ.

**procidentia** complete prolapse, especially of the uterus ముఖ్యముగా గర్భాశయము పూర్తిగా క్రిందకు జారుట, వాడు.భా., గ్రా. పేగు జారింది అంటారు.

**proctalgia** pain in the rectum మలాశయములో తీపు.

**proctitis** inflammation of the rectum, a complication of homo sexual abuse గుదశోథము: మలాశయము 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'; ఆసన సంభోగ/స్వలింగ సంభోగ దుష్ప్రవర్తనమువలన కలుగు దుస్థితి. *figur.* Nature's wrath for unnatural behaviour అలంకార. ప్రకృతిని ధిక్కరిస్తే పాట్లు తప్పవు, మరి.

**proctoscope** an instrument to examine the interior of the rectum మలాశయాంతర్దర్శిని: పురీషనాళములోపల తనికీచేయు పనిముట్టు/సాధన.

**proctoscopic examination** examination of the interior of the rectum/anus by a device called proctoscope పురీషనాళాంతర దర్శినిచే/తో పరీక్ష , గుద దర్శన పరీక్ష , ఆసన తనిఖీ.

**prodrome** early signal of a disease, *e.g.* a pea-size lump in the breast felt either by routine self examination or by a doctor; may be commencing cancer రుగ్మతయొక్క తొలిసూచన, ఉదా. బఠాని అంత ముద్ద స్తనములో తగులుట (స్వయంతనిఖీ వల్లగాని డాక్టరు పరీక్ష వలనగాని) – ఇది అపాయకరమైన కాన్సరుకు ప్రారంభము కావచ్చును.

**productive** producing more అధికోత్పాదక: ఎక్కువ ఉత్పత్తి చేయు. **p. cough,** cough accompanied by/associated with lot of sputum, *e.g.* bronchiectasis అధిక కఫముతోకూడిన దగ్గు, ఉదా. శ్వాసనాళికలు ఉబ్బుట/విస్తరించుట అనే జబ్బులో.

**progeny** 1. offspring సంతానము. 2. descendants సంతతి, వంశస్థులు. *figur.* prop in old age అలంకార. వృద్ధాప్యంలో ప్రాపు.

**progeria** a child getting prematurely old బాలుడు/బాలిక వయస్సు ముదరకుండానే వృద్ధాప్యరూపంలోనికి వచ్చుట.

**progesterone** steroid sex hormone secreted in the female commencing with pregnancy and increasing in amount as the pregnancy progresses స్త్రీలలో గర్భిణి కాగానే కనపడే లైంగిక హార్మోన్. ఇది గర్భము వృద్ధిపొందిన కొద్దీ ఎక్కువగా స్రవిస్తుంది.

**progestogen** and **progestin** hormones of the progesterone type ప్రొజెస్టిరోన్ రకమైన హార్మోన్లు.

**prognosis** forecasting the evolution and ultimate outcome in a disease process, the hallmark of a clever physician రోగగతి సూచన, రుగ్మత/రోగియొక్క పరిణామము మరియు తుదకు తేలేస్థితిని గురించి జాతకము చెప్పే వైద్యుడు – ఇది అయన ఘనతకు గీటురాయి.

**prolapse** 1. descent; the gliding down of a tubular organ or part స్థానభ్రంశము, చ్యుతి, నాళాకార అవయవము లేదా ఒకభాగము క్రిందకు జారుట. **rectal p.,** prolapse of rectum మలాశయ భ్రంశము, పురీషనాళము ఆసనములోనుంచి జారి బయటకు వచ్చుట. **p. of uterus,** womb sliding down the vagina గర్భాశయ భ్రంశము,

యోనిలోనికి గర్భసంచి జారుట, వాడు.భా. పేగు జారింది అని సుదతి సిగ్గునభినయిస్తూ విన్నవించుకుంటుంది. 2. **p. of intervertebral disc** protrusion of the disc causing pressure over nerve roots అంతర్కశేరుక చక్రిక ముందుకు పొడుచుకువచ్చినందున కశేరునాడీ మొదళ్ళమీద ఒత్తిడి కలుగుతుంది.

**proliferation** increase rapidly in number సంఖ్యలో వేగంగా పెరుగుట. **p. of cells,** reproduction/multiplication కణముల ప్రత్యుత్పత్తి/సంఖ్య పెరుగుదల.

**pronate** to put in to a prone position వెనుకకు తిప్పుట.

**pronation** act of turning prone, *e.g.* turning palm backwards అవతానము, *ఉదా.* అరచేయి వెనుకకు త్రిప్పుట. *N.B.* Display of vermiform veins is a sight to see. *గమనిక:* సిరల ఆకృతి శోభాయమానంగా ఉంటుంది, పరిశీలించండి [*in contr.* supination భిన్న. ఉత్తానము: అరచేయి ముందుకు త్రిప్పుట].

**pronator** muscle which pronates అవతానం చేసే పేశి [*opp.*supinator].

**prone** 1. to lie on one's face and navel అవతానము, అధోముఖము, బోర్ల, బోరగిల అనగా ముఖము/ముక్కు మరియు బొడ్డుమీద పరుండుట [*opp.* supine వ్యతి. వెల్లకిల]. 2. body prone to infection, *i.e.* liable for infection *అలంకార.* శరీరం సోకుడుకు స్వాగతం పలుకుతుంది. 3. children are accident prone *అలంకార.* పిల్లచేష్టలు/చిలిపిచేష్టలు గాయాలకు ఆలవాలం.

**propagation** 1. increase in species ప్రవర్ధనము. 2. reproduction ప్రత్యుత్పత్తి. *N.B.* to achieve 1 and 2 a struggle/wish for existence *గమనిక:* పైవాటిని పొందుటకు మనుగడకోసం పోరాటం/వాంఛ.

**prophylaxis** measures to prevent disease, *e.g.* vaccination, oral polio drops రోగనిరోధనము, రోగనిరోధకత: వ్యాధి నివారణోపాయములు, *ఉదా.* టీకాలు వేయించటం, నోట్లో పోలియో చుక్కలువేయడం.

**proprietary name** brand name of medicine/drug with trademark by the manufacturing company, *e.g.* Gelusil మందు/ఔషధమునకు

తయారుచేసిన మందులకంపెనీవారు పెట్టినపేరు, ఉదా. జెల్యూసిల్ [*in contr.* generic, *i.e.* chemical structure భిన్న. రసాయనిక నిర్మాణము].

**proptosis** protrusion or displacement ఉబ్బులేదా స్థలం తప్పుట. p. of the eye, forward bulge కన్నుగుడ్డు రెప్పలలోనుంచి ఉబ్బు.

**prostate** a chestnut-shaped gland encircling the neck of the urinary bladder and urethra in males, the secretion of which mixes with semen, hypertrophy of which gives rise to retention of urine పౌరుష (అష్ఠీల) గ్రంథి, (అలంకార. పౌరుషం పురుషలక్షణం కాబట్టి దీని నామధేయ సార్థకత). పురుషులలో మూత్రాశయగ్రీవము మరియు మూత్రమార్గమును చుట్టుముట్టియుండు గ్రంథి, బాదంకాయ ఆకృతి/ఆకారంలో ఉంటుంది; దీనిస్రావము శుక్రముతో కలియును. దీని అతివృద్ధివలన మూత్రవిసర్జనకు ఆటంకము ఏర్పడును.

**prostatectomy** surgical removal of all or part of the prostate పౌరుషగ్రంథి అంతాగాని లేదా దానిలో కొంత భాగంగాని శస్త్రవైద్యం ద్వారా తొలగించడం.

**prostatitis** inflammation of the prostate పౌరుషగ్రంథియొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**prostatorrhoea** or **prostatorrhea** an abnormal discharge of prostatic flluid ప్రాస్టేట్ ద్రవం/స్రావం ఎక్కువగా పోవటం.

**prosthesis** 1. replacement of a part, say arm, leg, eye, *etc.* with an artificial substitute, *e.g.* calipers for limbs, glass eye in the orbit వికలాంగములకు కృత్రిమ ఉపాయము, ఉదా. కాలు, చేతికి కృత్రిమ తొడుగులు, కన్నుగుడ్డు గుంటలో గాజుకన్ను, మొ. నాజూకు నకిలీవస్తువులు. 2. **dental p.,** titanium for dental prosthesis is a recent trendsetter ఇటీవల పన్నుమీద తొడుగు (artificial crown) కు టైటానియమ్ వాడుతున్నారు.

**prostitute** a person who offers herself/himself for sexual inter course for the sake of money వ్యభిచారము చేయు వ్యక్తి. **female p.** వెలయాలు, వేశ్య. ఒకప్పుడు రాజుల ఆదరణ పొందిన ఈ వృత్తి

ప్రస్తుతరోజుల్లో లైంగిక వ్యాధులు (STD, HIV) ప్రబలి ఉన్న ప్రపంచంలో ప్రమాదకరం. **male p.** నగరవీధుల్లో మగవేశ్యలు ఈ వృత్తి సాగిస్తున్నారు.

**prostrate** lying prone stretched out on ground సాష్టాంగపడటం.

**prostration** extreme depletion of energy అమిత శక్తిపాతము.

**protease** an enzyme which digests protein ప్రోటీన్‌ను జీర్ణం చేసే ఎన్‌జైమ్. a proteolytic enzyme ప్రోటీన్‌ను విచ్ఛిన్నం చేసే ఎన్‌జైమ్.

**protein** the basic substance in the protoplasm of all living cells in the body ప్రోటీన్, మాంసకృత్తు: శరీరంలోని జీవకణములలోని జీవపదార్థమునకు కావలసిన మూలపదార్థము. essential for the growth and repair of the body ఎదుగుదలకు, శరీరపోషణకు, స్వస్థత చేకూర్చుటకు మరియు బాగుచేయుటకు అవసరం. **Bence Jones p.,** urinary protein మూత్రములో విసర్జింపబడు ప్రోటీన్. **serum p's** సీరమ్‌లోని ప్రోటీన్‌లు.

**proteinuria** presence of proteins (one is albumin) in urine which is not normal మూత్రంలో ప్రోటీన్‌లు ఉండుట (వీటిలో ఒకటి అల్బుమిన్). ఇది జబ్బులక్షణము.

**proteolysis** process of the breakdown of protein ప్రోటీన్లు విచ్ఛిన్నమయ్యే ప్రక్రియ. Smaller polypeptides are formed.

**Proteus** a genus of bacteria ఒక బాక్టీరియా ప్రజాతి. microorganisms found in wounds, *eg.* **p. vulgaris** గాయములలో ఉండే సూక్ష్మజీవులు.

**prothrombin** a precursor of thrombin, formed in the liver థ్రాంబిన్ యొక్క అగ్రగామి, లివర్‌లో తయారవుతుంది. a protein in blood necessary for its coagulation స్కందనప్రక్రియకు కావలసిన ప్రోటీన్ – ఇది రక్తంలో ఉంటుంది.

**proton** a positively charged particle in the atom ప్రోటాన్, ధనావేశిత పరమాణుఅంశము [*in contr.* electron *భిన్న.* ఋణావేశిత పరమాణుఅంశము].

**protoplasm** the prime constituent in the living cell జీవద్రవ్యం, జీవపదార్థము, జీవకణములోని ప్రధాన పదార్థము (అలంకార. జీవాధారము).

**protozoa** [protozoan, protozoon *sing.*] *micro.str.* సూక్ష్మ.చూ. unicellular microorganisms ఏకకణ సూక్ష్మజీవులు. *Entamoeba histolytica* causes amoebiasis, *see/చూడండి* amoebiasis. genus *Plasmodium* produces malaria, *see/చూడండి* malaria. *Giardia lamblia* is responsible for giardiasis, *see/చూడండి* giardiasis. *Trichomonas vaginalis* irritates the vagina. యోనిని రేపెడు సూక్ష్మజీవి.

**proximal** nearer to a point of reference సమీప, నిర్ణీత స్థానమునకు దగ్గరగా/సమీపముగా [*in contr.* distal భిన్న. దూరపు].

**prurigo** chronic itching skin disease దీర్ఘకాలపు దురదపెట్టె చర్మవ్యాధి. **Besnier's p.,** one type ఒకరకం.

**pruritus** itching కండూతి, తీట, దురద. అలంకార. దురద బెడద దుర్భరం సుమా! **p.ani,** itching around the anus ఆసనముచుట్టూ గోకుడు. **senile p.** వృద్ధాప్యంలో చర్మముమీద గోకుడు. **p. vulvae** భగప్రాంతంలో చుట్టూ దురద.

**pseudoangina** angina pectoris-like nervousness, *see/చూడండి* angina pectoris. రొమ్ముశూలవంటి జబ్బుయొక్క భ్రాంతి, ధైర్యహీనత.

**pseudoarthrosis** or **pseudarthrosis** formation of a false joint at the site of a fracture due to non-healing నయముగాని స్థితిలో ఎముక విరిగినచోట నకిలీకీలు తయారగుట.

**pseudocyesis** phantom pregnancy; imaginary pregnancy గర్భిణితో ఉన్నట్లు భ్రమ/భ్రాంతి.

**preudohermaphrodite** a person or animal in whom the gonads of one sex are present, whilst the external genitalia appear those of the opposite sex మిథ్యా ఉభయలింగజీవి. [*Cf.* hermaphroditism].

**pseudohypertrophic** increase in the size without an increase in size or number of the constituent cells of an organ, due to fatty or fibrous overgrowth ఒక అవయవములో కణముల సైజుగాని, సంఖ్యగాని పెరుగకుండా, ఆ అవయవము పెద్దదగుట, కొవ్వు లేదా తంతుయుత వృద్ధివలన. pseudo = false, not genuine నిజంగా కాదు, కపటమైన hypertrophic = bulky లావుగా. **p. muscular dystrophy,** usually starts in childhood, calves are bulky with generalised weakness of

muscles మిథ్య అతివృద్ధి; పిక్కలు ఉబ్బుగా ఉంటాయిగాని బలముండదు. మొత్తము కండరముల బలహీనత, చిన్నతనంలో ప్రారంభమయ్యే జబ్బు.

**Pseudomonas** a genus of bacteria బాక్టీరియా ప్రజాతి. colours the pus blue చీముని నీలిరంగుగా చేస్తుంది.

**pseudoplegia** 1. false paralysis. మిథ్యా పక్షవాతం. mimicking organic nervous disorder నిజమైన నాడీ అపవ్యవస్థను అనుకరించేది. usually hysterical in nature రూఢి కాదు కాని నటన, తరచుగా హిస్టీరియాలో ఈ వాలకం చూస్తుంటాం. 2. feigning paralysis కపటపు/బూటకపు పక్షవాత నటన.

**pseudotumor** phantom tumor, *see/చూడండి* phantom limb in limb. మాయకంతి; వాస్తవముగాని కంతి; కంతివలెనుండు, నయమగు ఉబ్బు. అలంకార. మిథ్యా భావన.

**pseudovertigo** lightheadedness and blankness but no reeling కపట కపాల భ్రమణము; తలతిరుగుట (vertigo) కాదుగాని, తల తేలిపోతున్నట్లు అనుభూతి.

**psittacosis** a form of pneumonia in human beings due to an organism resembling a virus contracted from parrots, pigeons while rearing them. శుక సంపర్క దోషరోగం: చిలుకలు, పావురాలను పెంచేవారిలో ఒక వైరస్‌లాంటి సూక్ష్మజీవివలన సోకు నిమోనియాలాంటి వ్యాధి.

**psoas** muscle inside the lumbar region and pelvis కటిలోపల మరియు శ్రోణిలోపల ఉన్నకండరము. **p. abscess** అక్కడ చీముగడ్డ.

**psoriasis** a chronic dermatoses with remissions and intermissions characterized by development of red papules turning black gradually with time, followed by grayish white scales resembling the dried flowers of *Mimusops elengi,* the Spanish cherry విచర్చిక చర్మరోగము: వస్తూ పోతూ ఉండే దీర్ఘకాలపు చర్మవ్యాధి. ఇందులో ఎర్రటిమచ్చలు పుట్టి, క్రమేణ అవి నల్లగామారి, వాటి మీదనుంచి ఎండిన పొగడపువ్వులలాంటి తెలుపు/బూడిద రంగుగల పొలుసులు (scales) రాలుతుంటాయి. **psoriatic arthritis** joint pains may occur in this disease ఈ జబ్బులో కీళ్ళనొప్పులుండవచ్చును.

**psyche** the mind మనస్సు, మతి.

**psychedelic** hallucinatory విభ్రమము కలుగజేయు. said of a drug, especially LSD, *see*/చూడండి LSD.

**psychiatric** relating to psychiatry మనోవ్యాధి విజ్ఞాన.

**psychiatry** study and treatment of mental illnesses మనోరోగచికిత్స; మానసికరుగ్మతల శాస్త్రము, వాటి చికిత్స.

**psychoanalysis** 1. method of obtaining history and evolution in the mental illness, which helps in diagnosis మనోవిశ్లేషణము: మానసికరుగ్మత గురించి చరిత్రాత్మక సంఘటనల పరిశీలన, విమర్శ – ఇది వ్యాధి నిర్ధారణలో తోడ్పడుతుంది. 2. helps in treatment also చికిత్సలోగూడ అదనపు చేయూతనిస్తుంది.

**psychogenic** having an emotional bearing/outlay మనోవ్యాధిజనిత: మనోజన్య; మనస్తాపము ఆదిగాగల/మూలముగాగల. **p. asthma,** attack of bronchial asthma triggered by an emotional upset ఆందోళన/చిత్తక్షోభము వలన ఉబ్బసముయొక్క తెర/ప్రకోపము ప్రారంభమగుట.

**psychology** science dealing with mind, behaviour మనోతత్త్వశాస్త్రము, మనోవిజ్ఞానశాస్త్రము: తన నడవడి, మెలకువ ఇత్యాది మానసికలక్షణములు తెలుపు శాస్త్రము. **child p.,** study of the mind of a child పిల్లల మనస్తత్వము గ్రహించు శాస్త్రము. **mob p.,** behaviour of a group of people జనసమూహ ప్రవర్తన. *resemblance:* (a) sheep obeying/following the shepherd *పోలిక:* గొర్రెల మంద పోకడ. (b) swarm of bees following the queen bee రాణి ఈగను అనుసరించే తేనెటీగల బృందం. Mind is a monkey, at times: మనస్సు అప్పుడప్పుడు కోతిచేష్టలు చేస్తుంది, *అలంకార.* మర్కటపోకడ పోతుంది.

**psychoneurosis** a mental or behavioural disorder of mild or moderate severity మనో వికృతి.

**psychopath** a person suffering from chronic mental disorder, especially one with an antisocial personality ముఖ్యముగా మానసిక అపవ్యవస్థతో బాధపడుతున్న వికృతమనస్కుడు: సంఘవిరుద్ధమైన/సంఘవ్యతిరేకమైన మూర్తిమత్త్వముగల వ్యక్తి.

**psychopathy** any disorder of the psyche మానసిక తెగులు.

**psychoprophylaxis** 1. prophylactic measures to prevent . emotional disorder ఆవేశం, మనోద్వేగంతో కూడిన అపవ్యవస్థకు రోగనిరోధక చర్యలు. 2. maintenance of mental health మానసిక స్వస్థత సంరక్షణము.

**psychosexual** concerning the psychic/sexual emotions. rape is one such మానసిక/లైంగిక ఆవేశమునకు సంబంధించిన; లైంగిక అత్యాచారము; రేప్ ఒక ఉదాహరణ.

**psychosis** [psychoses *pl.*] organic or emotional mental disorder characterized by personality changes, loss of touch with reality, delusions, hallucinations or illusions మనోవిక్షిప్తి: మానసిక అవయవ నిర్మాణాత్మకమైన లేదా మనస్తాపమువలన కలుగు రుగ్మత – ఇందులో లక్షణములు: మూర్తిమత్వ పరిణామములు, వాస్తవగ్రాహ్యము లేకుండుట, భ్రాంతి, భ్రమ, మతివిభ్రమము, బూటకపు దృశ్యములను నిజమను కొనుట. **alcoholic psychoses** in alcoholic excess/intoxication త్రాగుడు నిషావలన. **organic p.,** organic mental disorder మానసిక అవయవనిర్మాణాత్మకమైన తారుమారు. **senile p.,** occurring in old age వృద్ధాప్యములో సంభవించునది.

**psychosomatic** body-mind interaction మనోదైహిక, మనోకాయిక: శరీరంమీద మనస్సుయొక్క ప్రభావము, మనోవికృతివల్ల కలిగే శారీరక జాడ్యము. **p. diseases,** bodily ailments due to emotional causes, *e.g.* peptic ulcer, hypertension ఆందోళనాత్మకమైన శారీర సంకటములు, ఉదా. అన్నాశయము, అంత్రమూలములో వ్రణములు; రక్తపోటు వ్యాధి. [*Cf.* somato-psychic].

**psychotherapy** treatment of mental/emotional disorders మానసిక చికిత్స: ఆందోళనాత్మకమైన/భావోద్వేగ అపవ్యవస్థలకు చికిత్స.

**psychotic** relating to psychosis సైకోసిస్‌కు సం. **p. person,** person exhibiting psychosis సైకోసిస్ ప్రదర్శించే వ్యక్తి. **p. reaction** మనోవిక్షిప్తి ప్రతిచర్య.

**psychotropic** acting on the mind మనస్సు మీద ప్రభావంగల. psychoactive మానసిక చురుకుదనం గల. **p. drug,** an agent acting on the mind మనసును కుదుటబరచు వస్తువు/మందు.

**pterygium** a triangular fleshy growth with its base at the cornea and apex towards the canthus, usually the inner canthus కన్ను గుడ్డుమీద శుక్లపటలమునుండి కన్ను కొలికి [తరచుగా లోపలి కొలికి (inner canthus)] వరకు పెరుగుతున్న మాంసపుముద్ద.

**pterygoid** wing-shaped పక్షి రెక్కనుపోలిన ఆకారంగల. **p. plexus** టెరిగాయిడ్ ప్లక్షము. **p. process,** one of the processes of the sphenoid bone which resembles a wing పక్షిరెక్కను పోలిన స్ఫీనాయిడ్ ఎముకయొక్క కీలితములలో ఒకటి.

**ptosis** 1. partially closed upper eyelid అర్ధనిమీలిత నేత్రము/అర మోడ్పు: పైకనురెప్ప సగము వాలియుండుట. 2. paralytic drooping of the upper eyelid పక్షవాతంవలన పైరెప్ప క్రిందికి వ్రాలిపోవుట.

**ptyalin** a ferment in saliva that converts starch into sugar లాలా(జల) శర్కరికము: పిండిని చక్కెరలోకి మార్చు పొంగు; ఇది లాలాజలంలో ఉంటుంది. a *common experience:* when cooked cereals are chewed, one gets a sweet taste in the mouth నిత్యానుభవము: వండిన ధాన్యపుగింజలు, చపాతీలు నములుతుంటే తీపిదనం వస్తుంది.

**ptyalism** excessive secretion of saliva లాలాజల సమృద్ధి.

**puberty** 1. stage/age at which secondary sexual characteristics appear, *viz.* early moustache, pubic hair, penile ejaculation of semen, *etc.* in boys. Breasts begin to appear, menarche commences in girls. యౌవనారంభత: పిల్లలు ఎదుగుతూ ఉండగా స్త్రీపురుషలక్షణాలు మొలకెత్తుట – అనగా బాలురలో నూనూగు మీసాలు, జఘనరోమాలు, శుక్రస్ఖలనము, మొ. బాలికలలో చనుగుబ్బలు బికి రావడం, రజస్వల అనగా ఋతువు ప్రారంభం. 2. They become capable of sexual reproduction. వీరు ప్రత్యుత్పత్తికి అర్హులు కావడం. age in years: at about 14 in boys and 12 in girls ఈ యౌవనదశ మగపిల్లలలో దాదాపు 14 ఏళ్ళకి, ఆడపిల్లలలో దాదాపు 12 ఏళ్ళకి ప్రారంభమౌతుంది.

**pubes** 1. the pubic region పొత్తికడుపు క్రింద భగాస్థి ప్రాంతం, జఘనాస్థి (pubis) వెలుపలి ప్రాంతం. 2. the pubic hair అక్కడ మొలకెత్తు వెంట్రుకలు.

**pubic symphysis** the site of union of the bodies of the two pubic bones in front జఘన సంధానము. *figur.* Cupid's throne అలంకార. మన్మధవేదిక, మన్మధాకర్షణ.

**pubis** pubic bone జఘనాస్థి, భగాస్థి.

**public health** department of public health, also called community health ప్రజారోగ్యశాఖ.

**pudendum** vulva భగము, భగప్రాంతం. the external sex organ, especially in a female బాహ్య/గుహ్య లైంగిక అవయవము, ముఖ్యముగా స్త్రీలలో.

**puerile** 1. harsh కరుకైన. **p. breath sounds,** harsh breath sounds heard on auscultation కరుకైన శ్వాసధ్వనులు. 2. childish, silly బాల్యపు, చిలిపి.

**puerperal** relating to delivery ప్రసూతికి సం. **p. fever** ప్రసూతి/బాలెంత/సూతికా జ్వరము. **p. sepsis,** sepsis in the mother following delivery కాన్పు కాగానే తల్లి శరీరంలో సూక్ష్మజీవి కూటమి; బాలింతరోగము/జ్వరము.

**puerperium** period following delivery కాన్పు తర్వాత పురుడు రోజులు; బాలింత దశ. అలంకార. మోడీకారం రుచి అనుభూతి.

**pulmonary** pertaining to lung పుపుస, ఊపిరితిత్తికి సం., శ్వాసకోశ సం. **p. artery,** carrying deoxygenated blood from the heart to the lungs పుపుస ధమని: గుండెనుండి ఊపిరితిత్తులకు ఆక్సిజన్‌రహిత రక్తమును తీసుకవెళ్ళే నాళము. **p. vein,** carrying oxygenated blood from the lungs to the heart పుపుస సిర: ఊపిరితిత్తులనుండి గుండెకు ఆక్సిజన్‌సహిత అనగా ఆక్సిజన్‌తోకూడిన రక్తమును తీసుకవెళ్ళే నాళము.

**pulmonary emphysema** *see/చూడండి* emphysema.

**pulmonary tuberculosis** *see/చూడండి* tuberculosis.

**pulp** soft tissue గుజ్జు, పిప్పి, మెత్తటి కణజాలము. **digital p.,** pad of soft tissue on the palmar aspect of the finger tips and on the plantar aspect of toe tips చేతివేళ్ళ చివర అరచేతి తలముమీదనున్న కణజాలముయొక్క ముద్ద; పాదము వేళ్ళచివర అరికాలు తలముపైన ఉన్న కణజాలముయొక్క ముద్ద. **splenic p.** ప్లీహములోని పిప్పి.

**pulsation** throb of an artery or an organ, say the heart; rhythmic in health, arhythmic in disease స్పందనము; హృదయ స్పందనము, గుండె కొట్టుకొనుట/అడుట; గుండె నాట్యం: ఆరోగ్యంలో లయబద్ధముగాను, జబ్బులో లయవిరుద్ధముగాను ఉంటుంది.

**pulse** 1. the impact on/expansion of the artery consequent on the blood coming in spurts corresponding to the heartbeat, *see/చూడండి* heart. This impact is felt by the fingers. నాడి: గుండె స్పందనముతో రక్తం ధమనులలోనికి చిందబడుతుంది. దీనివలన ధమని కుడ్యముమీద అభిఘాతము (impact) ఏర్పడి అది ఉబ్బుతుంది. ఈ అభిఘాతమును వేళ్లతోతాకి తనిఖీ చేయడం నాడీపరిశీలన. **irregular p.,** in heart arrhythmias గుండె లయవిరుద్ధముగా ఆడే జబ్బులలో నాడికూడా క్రమము తప్పుతుంది. **regular p.,** as in health ఆరోగ్యములో క్రమము పాటిస్తుంది. **thready p.,** pulse that is feeble and scarcely felt, as in states of shock అఘాతస్థితులలో ధమని దారములాగా తగులుట అనగా అందులోని అభిఘాతము క్షీణించి నాడి బలహీనముగా తగులుట/దొరుకుట. **water hammer p.,** felt in a disease, *see/చూడండి* aortic regurgitation. 2. pulses కాయ/పప్పుధాన్యములు. a good source of protein ప్రోటీన్ మూలము.

**pulsus** pulse నాడి. **p. alternans,** alternation of weak and strong heart beats and corresponding pulse beats, indicating serious heart disease క్షీణ మరియు బలమైన హృదయస్పందనము ఒకదాని తరువాత మరియొకటి వెడలుట; దానితోపాటు ఇదేరీతిలో నాడి – ఈ వాలకము ముమ్మరమైన గుండెజబ్బు సూచన.

**pultaceous** like a poultice, *see/చూడండి* poultice పిండికట్టు.

**pump** 1. a device for drawing fluid పంప్. **breast p.,** a device for drawing milk from the breasts in the puerperal stage, lest it might cause fullness, discomfort and fever పురిటి తొలిరోజుల్లో చనుబాలతో ఉబ్బి, అసౌఖ్యము మరియు జ్వరము కలిగించకుండా ఉండేందుకు పాలిండ్లలోనుండి పాలు పితుకే ఉపాయము. 2. **intra-aortic balloon p. (IABP),** pump employed in intra-aortic balloon counterpulsation అంతర బృహద్ధమని బెలూన్ ప్రతిస్పందనము.

**punctate** marked with points or dots, *e.g.* **p. calcification,** calcific dots in X-ray, usually in a density బిందుచిహ్నిత, ఉదా. కాల్షియమ్ అనగా సున్నపు చుక్కలతోనున్న ఎక్స్‌రే దృశ్యము, తరచుగా కంతిలో కనబడుతుంది.

**punctiform** like a point చుక్కవలె, బిందురూపము.

**punctum** 1. speck లేశము, రంధ్రకము. spot మచ్చ. 2. punctum of a sebaceous cyst, a slightly black spot/opening on the cyst ఈ తిత్తిమీద అగపడు నల్లని మచ్చ/రంధ్రము.

**puncture** ఛిద్రము, చిల్లు. 1. pierce పొడుచు. **lumbar p., spinal p.,** puncture made into the spinal canal, usually between the $3^{rd}$ and $4^{th}$ lumbar vertebrae రంధ్రముచేయు; 3వ 4వ వెన్నుపూసలమధ్యలో కశేరుకుల్యలోనికి సూదిగుచ్చుట (a) to remove cerebrospinal fluid (CSF) మస్తిష్కమేరుద్రవము తీయుటకు. (b) to inject drug/dye into the subarachnoid space ఔషధము/రంజనము ఎక్కించుటకు. 2. **sternal p.,** withdrawal of bone marrow from the breast bone (sternum) for examination ఉరఃఫలకమునుండి ఎముకలమూలుగ సూదిద్వారా తీసి పరీక్షచేయుట. 3. **p. injury, p. wound** ఏదైనా గుచ్చుకున్న తర్వాత ఏర్పడిన గాయము, చిల్లుపడిన గాయం.

**pupil** 1. opening in the centre of the iris, the curtain muscle in the eye, *see/చూడండి* iris. కనుపాప, తారక, కంటిపాప: కన్నుగుడ్డులో తెరలాంటి కండరముయొక్క కేంద్రములోనున్న రంధ్రము. 2. student, one who solicits knowledge from the teacher విద్యార్థి, విద్యను అర్థించువాడు.

**pupillary** relating to the pupil కంటిపాపకు సం.

**purgative** cathartic విరేచనకారి, బేదిమందు.

**purge** 1. to cleanse ప్రక్షాళనము గావించు. 2. to evacuate bowels మలము విసర్జించు. 3. to excommunicate బహిష్కరించు.

**purpura** small purple haemorrhagic spots on the skin and mucous membranes పర్పురః చర్మంమీద మరియు శ్లేష్మపొరమీద చిన్న ధూమ్రవర్ణపు రక్తంగూడుకట్టిన మచ్చలు. **allergic p.** ఎలర్జిలో ఈ మచ్చలు. **malignant p.,** in meningococcal meningitis ఈ

క్రిములవలన మెదడుపొరలకు 'నొప్పి వేడి మంట వాపు' కలిగి, ఆపైన ఈ మచ్చలు కనబడుట. **thrombocytopenic p.**, in which the platelet count is decreased ప్లేట్లెట్‌ల సంఖ్య తగ్గినందువలన పర్పుర.

**purulent** 1. forming pus చీము చేరుతున్న. 2. containing pus చీము చేరియున్న. **p. matter** చీముపదార్థము.

**pus** a collection of dead bacteria, cells and serum as a reaction to infection చీము: సూక్ష్మజీవుల కాటుకు ప్రతిక్రియగా చనిపోయిన బాక్టీరియా, కణములు మరియు సీరమ్‌గల చిక్కటి ద్రవము. *figur.* post-war devastation అలంకార. యుద్ధానంతర ధ్వంసము.

**pustule** pus containing pocket in the skin బొబ్బ, పొక్కు: చర్మముమీద చీము చేరిన గూడు. **malignant p.**, caused by anthrax bacilli దొమ్మరోగపు సూక్ష్మదండికల వలన సంభవించు, ఔషధమునకు అలవికాని గుల్ల.

**putrefaction** formation of decomposed, decayed, rotten tissues with fetid smell due to production of hydrogen sulphide, *etc.*, producing stench క్రుళ్ళిపోవుట, మురుగుట, చీకుట, డోకువచ్చే దుర్వాసనగల స్థితి – ఈ గ్యాస్ (వాయువు) వలన భరింపరాని దుర్గంధము.

**putrid** fetid, stinking కుళ్ళిన, మురిగిన, పూతి, కంపుకొట్టెడు; ఈ కంపువలన కడుపులో తిప్పుతుంది.

**pyaemia** or **pyemia** a form of blood poisoning, septicaemia in which multiple abscesses form in multiple organs రక్తములో సూక్ష్మజీవులు మరియు వాటి విషపదార్థముల ప్రసరణ వలన వివిధ అవయవములలో పెక్కు చీముగడ్డలు బయలుదేరుట.

**pyarthrosis** pus in a joint cavity కీలులో చీము చేరుట.

**pyelitis** inflammation of the pelvis of the kidney కిడ్నీలోని వృక్కద్రోణియొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**pyelography** urography. *see/చూడండి* IVP.

**pyelonephritis** inflammation of the kidney and its pelvis due to bacterial invasion as a result of which the kidney gets converted into a bag of pus బాక్టీరియా దాడివలన కిడ్నీ మరియు దాని

వృక్కద్రోణియొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు వాపు' – కిడ్నీ ఒక చీము సంచిగా మారుతుంది.

**pyemia** *see/ చూడండి* pyaemia.

**pylephlebitis** inflammation of the portal vein or its branches నిర్వాహక సిర లేదా దానిశాఖల ఇన్‌ఫ్లమేషన్.

**pylethrombophlebitis** inflammation of the portal vein with the formation of a thrombus నిర్వాహక సిర యొక్క థ్రాంబస్‌తో కూడిన ఇన్‌ఫ్లమేషన్.

**pylethrombosis** thrombosis of the portal vein or its branches నిర్వాహక సిర లేదా దాని శాఖల థ్రాంబోసిస్.

**pyloric** pertaining to the pylorus పైలోరస్‌కు సం.

**pylorospasm** spasm of the pylorus పైలోరస్ యొక్క ఈడ్పు.

**pylorus** the junction of the stomach with duodenum ఆంత్రముఖము, జఠరనిర్గమము: అన్నాశయము ప్రథమాంత్రముతో కలియు ప్రాంతము. pyloric antrum, canal, opening, sphincter పైలోరిక్ విస్తృమ్, కుల్య, ద్వారము/రంధ్రము, సంవరణి. **pyloric stenosis,** narrowing at the region of the pylorus, a complication of peptic ulcer పెప్టిక్ వ్రణముయొక్క పర్యవసానము: పైలోరస్ ముడుచుకుపోయి, సన్నగిల్లి, ఆటంకము (obstruction) కలుగుట.

**pyocolpos** accumulation of pus in the vagina యోనిలో చీము చేరుట/ జమ అగుట.

**pyoderma** any purulent skin disease చీముకు నెలవైన చర్మము జబ్బు.

**pyogenic** producing pus చీము చేరునట్లు చేసేది. **p. infection,** infection by pus producing microorganisms చీము చేర్చు సూక్ష్మ జీవుల సంపర్కము. **p. material** చీము పదార్థము.

**pyometra** formation of pus in the uterine cavity గర్భసంచిలో చీము చేరుట.

**pyometritis** purulent inflammation of the uterus గర్భాశయములో శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'తో కూడి చీముచేరుట; గర్భసంచి చీముసంచి అగుట.

**pyonephrolithiasis** formation of pus and stones in the kidney కిడ్నీలో చీము మరియు శిలలు తయారగుట/చేరుట.

**pyopericarditis** formation of pus in the perricardium due to suppurative inflammation ఇన్ఫ్లమేషన్ వలన గుండె మీది పొరలో చీముచేరుట.

**pyoperitoneum** formation/accumulation of pus in the peritoneal cavity ఆంత్రవేష్టన కుహరములో చీముచేరుట.

**pyopneumothorax** formation/accumulation of pus and gas in the pleural cavity పుపుసావరణ కుహరములో చీము మరియు వాయువు చేరుట.

**pyoptysis** coughing out purulent matter/material, *e.g.* in bronchiectasis, *see/చూడండి* bronchiectasis. చీముతో కూడిన పదార్థము కఫములో/తో దగ్గబడుట, ఉదా. శ్వాసనాళికల విస్తరణవ్యాధి [*Cf.* haemoptysis *తారత.* కఫములో రక్తం].

**pyorrhoea** or **pyorrhea** a fllow of pus చీము కారుట. **p. alveolaris,** infection of the gums with a foul smelling mouth. Whenever the subject talks, it is embarrassing for the onlookers to bear the bad smell. చిగుళ్ళకు సూక్ష్మజీవి సంపర్కమువలన కంపుకొట్టునోరు. ఆ వ్యక్తి నోరు తెరచిమాట్లాడితే కలవరపడి, మొగమాటం అభినయిస్తూ ప్రక్కన ప్రేక్షకులు మెలుగుతుంటారు.

**pyosalpingitis** formation/accumulation of pus in the Fallopian tubes with inflammation ఫెలోపియన్ నాళములలో శోథము/'నొప్పి వేడి మంట వాపు'తోకూడి చీముచేరుట.

**pyosis** suppuration చీము పోయుట.

**pyothorax** pocketing of pus in the pleural cavity, empyema పుపుసావరణ కుహరములో చీము గూడుకట్టుకొనియున్నస్థితి.

**pyretic** 1. relating to fever జ్వరమునకు సం. 2. accompanied by fever జ్వరముతో కూడిన. 3. producing fever జ్వరము కలుగజేసే. [*in contr.* antipyretic *భిన్న.* జ్వర నిరోధి].

**pyrexia** fever జ్వరము. **PUO,** *abbr.* pyrexia of unknown/undetermined origin కారణము విశదముకాని జ్వరము.

**pyridoxine** vitamin $B_6$, a member of the vitamin B complex group విటమిన్ $B_6$, విటమిన్ బి కాంప్లెక్సులో ఒక విటమిన్.

**pyrogen** a substance which produces heat or fever ఉష్ణకారకం, జ్వరకారకం. pyrogens are produced by bacteria, moulds, viruses and yeasts and commonly thrive in distilled water. పైరోజన్లు బాక్టీరియా, శిలీంధ్రాలు వైరస్‌లు, మరియు యీస్టుల వలన తయారు చేయబడే పదార్థములు; ఇవి స్వేదనజలంలో వృద్ధిపొందుతాయి. Hence pyrogen-free distilled water, say in intravenous medications, is safe for usage. కాబట్టి పైరోజన్ రహిత స్వేదన జలం సురక్షితం, సిరల లోనికి ఎక్కించే ఇంజక్షన్లలో కలపటానికి. *N.B.* common experience: sometimes, rigors after administration of I.V. fluids, e.g. glucose, intravenous sailne *గమనిక: నిత్యానుభవం:* అప్పుడప్పుడు సిరలలోనికి సూది – గ్లూకోస్, సెలైన్ ఎక్కించగానే చలి, వణుకు చూస్తుంటాము.

**pyrogen test** done on rabbits in pharmaceutical laboratories, to detect the presence of pyrogens in a fluid prepared and marketed for parenteral use ఔషధాలు తయారు చేసే కంపెనీలు ఈ ద్రవంలో పైరోజన్లు లేకుండా చూడడానికి, మందు అమ్మకానికి ముందు, సిరల సూదులను కుందేళ్ళ మీద ప్రయోగం చేస్తారు; సురక్షితంగా ఉంటేనే లైసెన్సు పొందగలరు.

**pyromania** an obsessive urge to set fire to things ఆతతాయుల ఉన్మాదం: వస్తువులను తగులబెట్టవలెనని మూర్ఖపు పట్టుదల, అలంకార. అనలాభిలాషి.

**pyrosis** heartburn; substernal burning, *see/చూడండి* indigestion. ఎదగాలుడు: ఛాతీమధ్యలో అన్నవాహిక వెంబడి మంట.

**pyruvic acid** an organic acid resulting from the breakdown of carbohydrates కార్బోహైడ్రేట్స్ విచ్ఛిన్నం వలన రూపొందే సేంద్రియ ఆమ్లం.

**pyuria** presence of pus in the urine మూత్రములో చీము.

# Q q

**Q fever** fever due to rickettsial infection రికెట్సియా అను సూక్ష్మ జీవుల సంపర్కముపలన కలిగే జ్వరము.

**q.i.d.** *abbr.* [Latin *quater in die.*]. four times a day ప్రతి 6 గంటల కొకసారి.

**QRS** complex in ECG ఇ.సి.జి., హృద్రోగపరీక్షగ్రాఫ్‌లో అంశము.

**quack** unqualified medical practioner బూటకపువైద్యుడు, కువైద్యుడు, వైద్యశాస్త్రరీత్యా అర్హతలేని వైద్యుడు.

**quadrant** When two intersecting lines are drawn, one across the umbilicus, the other vertical over the umbilicus, four quadrants are produced: right upper, right lower, left upper and left lower quadrant చతుర్థభాగము: నాభిమీద అడ్డముగాను మరియు నిలువుగాను రెండుగీతలు ఉదరతలము మీద గీస్తే నాలుగు ప్రాంతములు ఏర్పడుతాయి: కుడి ఉపరి, కుడి క్రింది, ఎడమ ఉపరి మరియు ఎడమ క్రింది ప్రాంతము.

**quadriceps** extensor muscle of the thigh, having four heads. It extends the leg upon the thigh. చతుశ్శిరల తొడ కండరము; కాలును తొడపైకి ఎత్తుతుంది. **q. drill,** exercising this muscle ఈ కండరమును సాధనలో పెట్టుట.

**quadriplegia** paralysis of all four limbs, *viz.* the two superior extremities and the two inferior extremities. This occurs due to a lesion in the cervical part of the spinal cord. కాళ్ళు చేతుల పక్షవాతం: నాలుగు అంగాల పక్షవాతం అనగా రెండు ఊర్ధ్వాంగాల రెండు అధోంగాల పక్షవాతం – ఇది వెన్నుపాములోని మెడప్రాంతమునకు వాటిల్లిన క్షతము అనగా దెబ్బ, జబ్బు, ఒత్తిడి, మొ. వాటి వలన సంభవిస్తుంది.

**quadruped** four-footed animal తిర్యక్కు, చతుష్పాది, తిర్యగ్యోని [*Cf.* biped ద్విపాది, అధోయోని].

**quarantine** enforced isolation/segregation of people suffering from an infectious, communicable, contagious disease for a period equivalent to the maximum incubation period of that particular

disease, see/చూడండి incubation. బహిష్కరణ, సంసర్గనిషేధము, సంసర్గప్రతిబంధము: అంటురోగములు, స్పర్శ/తాకుడువలన సంభవించు వ్యాధులలో రోగబీజములు నాటుకొని రోగలక్షణములు కలిగేవరకుగల వ్యవధి (incubation period) లో ఆ వ్యక్తులను ఏకాంతవాసమునకు గురిచేయుట లేదా బహిష్కరించుట. This is a pubic health measure adopted to prevent the spread of the disease. వ్యాధి వ్యాప్తి చెందకుండా జాగ్రత్త పడుటకు ఇది ఒక ప్రజారోగ్య శాఖవారి ముందు జాగ్రత్త (precaution).

**quartan** intermittent fever with paroxysms occurring every 72 hours (fourth day), *see/చూడండి* malaria. ప్రతి నాలుగవ రోజున వచ్చే జ్వరం.

**quickening** the commencing movement of the fetus in utero, felt by the mother usually at 16 to 18 weeks' gestation భ్రూణ తొలి కదలిక: ప్రప్రథమ భ్రూణచలనము తన గర్భసంచిలో మాతృమూర్తికి తగులుట – ఇది నాలుగవ నెల గర్భిణిలో పరిపాటి.

**quicksilver** mercury, the metal that flows పాదరసము: వెండిలా మెరుస్తూ పారే లోహం.

**quiescent** becoming quiet అదుపులోనికి వచ్చిన. *e.g.* 1. tuberculous lesion ఉదా. క్షయవ్యాధి క్షతము. 2. skin lesion చర్మవ్యాధి క్షతము.

**quinidine** alkaloid of cinchona, used in the treatment of some heart problems గుండె జబ్బులలో వాడేది.

**quinine** alkaloid from cinchona, used specifically in the treatment of malaria ప్రత్యేకంగా మలేరియాకు వాడేది, వాడు.భా. క్వైనా.

**quininism** cinchonism, *see/చూడండి*. cinchonism.

**quinsy** peritonsillar abscess గొంతులో టాన్సిల్ అంచున చేరిన , చీముగడ్డ.

**quotidian** recurring everyday, *e.g.* **q. malaria** ఉదా. ప్రతిరోజు వచ్చు మలేరియా జ్వరము.

**quotient** number obtained when one number is divided by another భాగ ఫలము. **intelligence q.** (IQ) $\frac{\text{mental age}}{\text{chronological age}} \times 100$

మనిషి బుద్ధి వికాసమును నిర్ణయించు ఫార్ములా: $\frac{\text{మానసికవయస్సు}}{\text{కాలక్రమవయస్సు}} \times 100.$

# R r

**$R_x$** *abbr.* recipe, prescription by a doctor భేషజ/ఔషధయోగము/ నిర్ణయము: ఔషధపత్రం; డాక్టరు రాసిన మందుచీటి. డాక్టరు వ్రాసే మందుకు గుర్తు. meaning 'take' or 'take it' 'సేవించు' అని సూచిస్తూ. *figur.* $R_x$, write/right prescription.

**rabid** 1. mad పిచ్చి పట్టిన. **r.dog,** a dog affected with rabies రేబీస్ (పిచ్చికుక్క కాటు వ్యాధి) కలిగియున్న కుక్క. 2. pertaining to rabies రేబీస్‌కు సం.

**rabies** hydrophobia, a fatal/deadly viral disease caused by the bite of a rabid dog or jackal జలభయరోగం: మారణ జబ్బు, అపాయకరమైన జబ్బు; రేబీస్ జబ్బుతో ఉన్న కుక్క లేదా నక్క కాటువలన కలుగును. వైరస్ దీనికి కారణము. **rabies in the dog:** The disease starts with irritation, fury, the dog runs amok, bites whatever object it encounters, its bark is altered, its jaw droops, paralysis of swallowing ensues and it dies in 2 to 5 days; the virus is present in its saliva. కుక్క వెర్రెక్కి, ఇటూ అటూ పరుగెడ్తూ, చూసిన వాటినల్లా కొరుకుతూ, పిచ్చిగా ప్రవర్తిస్తుంది. దాని మొరుగుడు ధ్వనిలో మార్పు వస్తుంది, క్రమేణ దవడజారి మ్రింగడం కష్టమవుతుంది, పక్షవాతంతో 2 నుండి 5 రోజులలో చస్తుంది. ఈ జబ్బుకు కారణమైన వైరస్‌లు దాని లాలాజలంలో ఉంటాయి. **rabies in the human being:** paralysis of the muscles of deglutition (swallowing), phobia at the sight/sound of liquids including water (hydrophobia), maniacal behaviour, convulsions, spasms, tetany and ultimate death. No patient of rabies ever got cured and lived. మ్రింగుడు అనే ప్రక్రియలో పాల్గొను కండరముల పక్షవాతం వలన ఏమీ మింగలేకపోవడం, ద్రవముల (ఉదా. నీరు) యొక్క చూపు, శబ్దం భరింపలేకపోవటం, పిచ్చిగా ప్రవర్తించడం, కండరములలో కంపము, ఈడ్పులు (spasms), కండరముల బిగువు (tetany), తుదకు తప్పనిసరి మరణం. రేబీస్‌రోగి జబ్బు నయమయి బ్రతకటం అంటూలేదు. చావు తథ్యము.

**rachis** the spine, the vertebral column వెన్నెముక, కశేరుదండము.

**rachitis** rickets, *see/చూడండి* rickets. [rachitic *adj.*] రికెట్సు సం.

**radial** 1. concerning the radius రత్నికి సం. 2. **r. aspect,** *e.g.* lateral/outer aspect of the forearm ముంజేయి వెలుపలి వైపున. 3. **r. pulse,** pulse felt over the radial artery at the wrist మణికట్టు దగ్గర రేడియల్ ధమనిపైన వేళ్ళు పెట్టి నాడిని తనిఖీ చేయుట.

**radiant** 1. giving out rays వికిరణ. **r. energy** వికిరణ ఉష్ణము, వికిరణ శక్తి. 2.**r. heat,** bright heat కిరణ ప్రసరణము వలన కలిగే ఉష్ణము.

**radiation** 1. *anat.* nerve fibre tracts in the brain, *e.g.* **r. of corpus callosum, and thalamic r's,** in the brain మెదడులో నాడీతంతుల సముదాయము. 2. rays used to treat certain diseases, *e.g.* **ionising r's.** ఉదా. అయనీకరణ వికిరణము; కిరణ ప్రసరణముతో కొన్ని వ్యాధుల చికిత్స. **r. sickness,** as a result of overexposure to ionising radiations అధిక అయనీకరణ వికిరణ సుస్తి. **r. therapy** వికిరణ చికిత్స.

**radical** in toto సమూలంగా. **r. mastectomy,** removing every trace of diseased tissue inclluding axillary lymph nodes, *e.g.* in carcinoma; the aim is to make recurrence impossiblle స్తనమును సమూలంగా శస్త్ర చికిత్సతో తీసివేయుట, చంకలో లింఫ్ గ్రంథులతో సహా, ఉదా. కాన్సరులో; జబ్బు తిరగబెట్టకుండా ఉండటానికి తగు చర్య.

**radiculitis** inflammation of spinal nerve roots కశేరునాడీమూలముల యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**radiculopathy** any disease of the spinal nerve roots కశేరునాడీ మూలములయొక్క సుస్తి/రుగ్మత.

**radioactivity** is a nuclear phenomenon/an activity, spontaneous and self-disruptive, exhibited by certain elements. The activity consists in emitting a complex and penetrating radiation consisting of alpha, beta particles and gamma rays. రేడియోధార్మిక శక్తి, రేడియో ధార్మికత; రేడియో ధార్మికత అను దృగ్విషయము (phenomenon) ను కొన్ని మూలకములు చూపుతాయి. కేంద్రకవిచ్ఛిత్తి వలన పరమాణువుయొక్క కేంద్రకమునుండి సంక్లిష్టమైన (complex) కిరణపుంజము వెలువడును. ఈ కిరణపుంజము ఆల్ఫా, బీటా రేణువులు మరియు గామా కిరణాల సముదాయము. ఈ కిరణములు పదార్థ

ములద్వారా చొచ్చుకొని పోగలవు మరియు పదార్థములను అయనీకరణ చేయగలవు.

**radiobiology** biological study of the effects of ionising radiation on living beings ప్రాణులమీద అయొనైసింగ్ వికిరణం యొక్క ప్రభావమును జీవశాస్త్రరీత్యా తెలుసుకొను శాస్త్రం/వివరము.

**radiodermatitis** dermatitis secondary to ionising radiation అయనీకరణ వికిరణముయొక్క ప్రభావమువలన ఏర్పడు చర్మశోథము.

**radiograph** *syn.* radiogram, roentgenogram, skiagram. an X-ray photo/photograph X-కిరణము వలన ఏర్పడే చిత్రం, ఎక్స్‌రే ఫోటో.

**radiography** the procedure of making radiographs ఎక్స్‌రే ఫోటోలు తయారుచేయు ప్రక్రియ. **mass miniature r.**, making films of 70 mm or 100 mm in size, in rolls సామూహిక లఘు ఎక్స్‌రే చిత్రణ: ఎక్స్‌రే ఫోటోల చుట్టలో చిన్నసైజులో ఫోటోలు తీయుట.

**radioimmunoassay** method of quantifying antigens or antibodies in the serum using radiolabelled substances. assay = నిర్ధారణ మాపనం. సీరమ్‌లోని ఏంటిజన్స్ లేదా ప్రతిరక్షకాలను పరిమాణ సహితముగా నిశ్చయించుట.

**radioisotope** radioactive isotope రేడియో ధార్మిక శక్తిగల ఐసోటోప్.

**radiologist** specialist in radiology ఎక్స్‌రే మరియు కిరణధార్మిక శక్తి విభాగపు నిపుణుడు.

**radiology** 1. department of use of radiation/radiant energy for the diagnosis, say ionising, *e.g.* X-rays; non-ionising, *e.g.* ultra sound radiation and treatment of diseases. Thus it consists of radiodiagnosis and radiotherapy ఎక్స్‌రే, అల్ట్రా సౌండ్ వ్యాధి నిర్ధారణ పరీక్షలు మరియు చికిత్సచేయు విభాగం. 2. Radiology, a medical journal వైద్యవార్తా పత్రిక.

**radiolucent** radio transparent, shadows not visible in a radio graph, *e.g.* non metallic foreign bodies, some calculi/stones ఎక్స్‌కిరణ పారదర్శకమగు, ఉదా. ఎక్స్‌రే ఫోటోలో అగపడనివి: లోహములుకాని వస్తువులు, కొన్ని శిలలు/రాళ్ళు [*in contr.* radioopaque భిన్న. ఎక్స్‌కిరణ అపారదర్శక].

**radioopaque** shadows visible in a radiograph, appearing white, *e.g.* **r. calculi/stones** ఎక్స్‌కిరణ అపారదర్శకమగు, ఎక్స్‌కిరణాభేద్యమైన (ఎక్స్‌కిరణ+అభేద్యమైన), ఎక్స్ కిరణ నిరోధక, ఉదా. ఎక్స్‌రే ఫోటోలో తెల్లగా అగపడు శిలలు/రాళ్ళు [*in contr.* radiolucent *భిన్న.* ఎక్స్‌కిరణ పారదర్శక].

**radioscopy** examination of the structures of the body by X-ray, fluoroscopy (screening), roentgenoscopy శరీర నిర్మాణములను ఎక్స్‌రే ద్వారా పరీక్ష చేయుట, స్క్రీనింగ్.

**radiosensitivity** susceptibility of the skin, tumor, tissue, *etc.* to radiation/radiant energy such as deep X-rays, other radiation; that means the tumor disappears after irradiation కిరణప్రభావమునకు లోనగుట/లొంగుట; కిరణములచే ప్రభావితమగుట. చర్మము, కంతి మరియు కణజాలము, మొ. కిరణశక్తికి లొంగుట, ఉదా. హెచ్చు భేద్యతగల రాంజనకిరణములు (deep X-rays), ఇతర వికిరణములు (radiations); అనగా ఇట్టి కిరణ తాకిడి (irradiation)తో ఆ కంతి కరుగుతుంది.

**radiotherapy** radiation medicine వికిరణ చికిత్స. treatment of diseases by use of ionising radiation అయనీకరణ వికిరణముయొక్క సాయముతో జబ్బులను నయముచేయుట అనగా ఇది ఒక చికిత్సోపాయము. 1. diseased tissues exposed to the beam of radiation కిరణ ప్రసరణ/ప్రసార పరిధిలో వ్యాధిగ్రస్తమైన కణజాలములనుంచుట. 2. radioactive element/material inserted into the diseased tissue, e.g. radium needle రేడియో ధార్మిక శక్తిగల మూలకము/పదార్థము, ఉదా. రేడియమ్ సూదివి వ్యాధిగ్రస్తమైన కణజాలములలో గ్రుచ్చుట.

**radiothyroidectomy** *jargon:* destruction of thyroid tissue by the administration of radioactive iodine *జార్గన్:* రేడియో ధార్మిక శక్తిగల అయొడిన్ సేకరణతో థైరాయిడ్ కణజాలములను ధ్వంసం చేయుట.

**radium** radioactive element రేడియమ్ అనే రేడియోధార్మికశక్తిగల మూలకము.

**radius** outer of the two bones in the forearm రత్ని, బహిః ప్రకోష్ఠాస్థి, బహిఃప్రకోష్ఠిక, మణిబంధాధారాస్థి: ముంజేయి రెండు ఎముకల్లో వెలుపలిది.

**radix** [radices *pl.*] root మూలము.

**rales** adventitious sounds heard over the lungs during the auscultation of the chest ఛాతీమీద స్టెతాస్కోప్‌తో/లో వింటున్నప్పుడు ఊపిరితిత్తులమీద వినబడు అదనపు ధ్వనులు.

**ramification** distribution in branches శాఖలుగా విభజింపబడిన.

**ramus** [rami *pl.*] 1. a branch, say of an artery, vein or nerve ధమని, సిర లేదా నాడియొక్క శాఖ. **r. communicans,** branch connecting two nerves or two vessels రెండు నాడులనుగాని రెండు నాళములనుగాని కలుపు శాఖ. **rami cutanei,** branches of a mixed peripheral nerve in the skin చర్మములోని పరిధీయ నాడీ శాఖలు. 2. process of a bone, *e.g.* **r. of mandible** హనువుయొక్క కీలితము.

**random** by chance ర్డా. **r.sampling,** choiceless picking up (as. in a lottery) యాదృచ్ఛిక ప్రతిచయన గ్రహణము, (లాటరీలోలాగా) చేతికొచ్చినది తీయుట.

**ranula** 1. cystic tumor beneath the tongue నాలుక క్రింద తిత్తి. 2. retention cyst of the pancreatic duct క్లోమనాళములో తిత్తి.

**rape** sexual assault upon a person మానభంగము: ఒక వ్యక్తిమీద లైంగిక అత్యాచారము, బలత్కారంగా సంభోగం. This word is especially used for the crime involved in forcible sexual intercourse with a woman without her consent or with a girl who does not know about the act. This act is antisocial, uncivilized and illegal. ఈ రేప్ అనే పదము ఎక్కువగా స్త్రీలపై లైంగిక అత్యాచారమునకు వాడ్తారు. స్త్రీ అనుమతి లేకుండా ఆమెతో బలాత్కారంగా సంభోగము; జరగబోయే చర్యగురించి ఏమీ తెలియని బాలికతో సంభోగము. ఈ రేప్ అనేది సంఘవ్యతిరేకము, అనాగరికత, చట్టవిరుద్ధము. *N.B.* reprimand for the rapist — 'better masturbate than rape.' *గమనిక:* అత్యాచారికి అదమాయింపు — 'హస్తప్రయోగం చేసి కుతి తీర్చుకో.'

**rape** a plant of the mustard family, giving rape oil; rapeseed oil used for counter-irritation ఆవాలు తరగతికి చెందిన మొక్క. దీనినూనె మర్దనకు వాడుతారు.

**raphe** ridge, crease ముడుత, కుట్టు/కుట్టె. **median r.,** the line of union of the halves of symmetrical parts, *e.g.* raphe at the penoscrotal junction underneath the penis ఒక భాగముయొక్క రెండు సగములు కలియు మధ్యగీత, ఉదా. పురుషాంగము అడుగున మధ్య దారములాంటి చర్మగీత.

**rarefaction of bone** bone's texture becoming less dense ఎముక విరళీకరణము/విరళత: దళసరిగా లేకుండా పలుచనగుట.

**rash** an evanescent eruption on the skin or mucous membrane, *e.g.* in measles, *see/చూడండి* measles. దద్దురు: చర్మము మీదగాని శ్లేష్మపొరమీదగాని అదృశ్యమై పోయెడు తడపర, దద్దుర్లు, ఉదా. తట్టు, పొంగు అను జబ్బులో కనపడుతుంది. **butterfly r.,** distribution on both sides of the nose like the wings of a butterfly, *e.g.* in lupus erythematosus, seborrheic dermatitis సీతాకోకచిలుక రెక్కలవలె ముక్కుకు రెండువైపులా మిసమిసలాడే మచ్చలు, ఉదా. పైనవ్రాసిన జబ్బులు. **drug r.,** manifestation of antagonism to a drug చికిత్సరీత్యా ఇచ్చిన ఔషధమునకు వైరము తెలుపు పరిణామము. **heat r.,** miliaria rubra, prickly heat త్వచము అట్టకట్టినట్లు పేలుట. **napkin (nappy) r.,** rash at the region of the baby's bottom due to irritation with urine and excreta, if the napkin is not changed in time, observing with an eagle's eye ఏమరపాటులేకుండా పరికించి గమనిస్తూ ఉంటే తప్ప, అనగా మూత్ర మలములతో కలుషితమైన చడ్డి (నాప్‌కిన్) వెంటనే మార్చకపోయినట్లయితే, పాప పృష్ఠభాగమున మూత్ర పురీషముల తాకుడువలన లేతచర్మం కందిపోవటంగాని, దద్దుర్లు లేవటంగాని సంభవించుట.

**rat-bite fever** caused by a *Spirillum or Streptobacillus* ఎలుక కొరుకుడువల్ల జ్వరము.

**rate** occurrence of an event per a unit of time, say per minute, per year, *etc.* చొప్పున, ప్రమాణము, మానము, రేటు: నిముషమునకు గాని, సంవత్సరమునకుగాని జరుగు ఘట్టము/లు. **basal metabolic r.**

BMR: measure of metabolism under basal (resting) condition విశ్రాంతిదశలో జీవ(న)క్రియ యొక్క ప్రమాణము. **birth r., death r.** జనాభాలెక్కలలో జనన మరణ మానములు. **erythrocyte sedimentation r.**, ESR has a role in certain diseases, *e.g.* tuberculosis, malignant diseases ఈ పరీక్ష క్షయవ్యాధిలోను, కొన్ని అపాయకరమైన రుగ్మతల్లోను చేస్తారు. **heart r.** గుండెవేగము. **pulse r.** రక్తనాడి పరుగు. **respiratory r.** శ్వాసక్రియ ప్రమాణము.

**ratio** albumin globulin AG ratio in blood, serum, plasma or urine which alters in some diseases నిష్పత్తి: కొన్ని జబ్బులలో రక్తము, సీరమ్, ప్లాస్మా లేదా మూత్రములో అల్బుమిన్ గ్లాబ్యులిన్ నిష్పత్తిమారుట.

**rattle** clatter గలగల ధ్వని. gurgling noise. **death r.,** *see/చూడండి* death rattle. terminal death warrant, *figur.* Icy Hand of Death మనిషి చనిపోయేముందు చేసే గురగుర శబ్దం; గొంతులో గురక అంతిమ ప్రాణాపాయస్థితి, అవసానదశ, అలంకార. మృత్యువు పిలుపు.

**Rauwolfia serpentina** contains reserpine. hypotensive (reduces blood pressure) and sedative సర్పగంధి: బ్లడ్ ప్రెషరు తగ్గించే ఔషధం మరియు శమనకారి.

**ravenous** extremey hungry, voracious అమిత ఆకలి. **r. appetite** *figur.* ahead for a gastronomic delight. అలంకార. కడుపులో రెళ్ళు పరిగెడుతున్నాయి, అంటే విపరీతమైన ఆకలివేస్తున్నది, అన్నం మీదికి దండెత్తాలని ఉబలాటం, ఆరాటం.

**Raynaud's disease** *colloq.* 'dead man's fingers'. idiopathic paroxysmal bilateral cyanosis (bluish tinge) of fingers, toes, nose and ears brought about by exposure to cold or emotional stress, due to arterial and arterioar contraction. ధమని మరియు ధమనికల సంకోచం వలన కలిగే చేతి కాలి వేళ్ళు, ముక్కు చెవుల నీలివర్ణం. ఇది శీతల ప్రదేశంలో సంభవించవచ్చును లేదా. ఆవేశం/మనోద్వేగం వలన కలుగవచ్చును.

**Raynaud's phenomenon** spasm of the digital arteries with blanching and numbness of the fingers, occurring secondary to

another disease రెయినాడ్ దృగ్విషయం: వేళ్ళ ధమనుల ఈడ్పువలన పాలిపోయి తిమ్మిరెక్కిన వేళ్ళు.

**rays** 1. beam of light or other radiation కిరణములు. 2. radiant energy (light or heat) వికిరణ శక్తి (కాంతిలోగాని ఉష్ణములోగాని). **alpha r's,** high speed helium nuclei from radioactive material రేడియో ధార్మిక పదార్థములనుండి వెడలు అతివేగ హీలియమ్ కేంద్రకములు. **beta r's,** electrons ejected from radioactive material రేడియో ధార్మిక పదార్థములనుండి వెడలు ఎలక్ట్రాన్‌లు. **gamma r's,** electromagnetic radiation of short wavelengths with high energy photons travelling with the speed of light (1,86,000 miles per second) and possessing high penetrating power అల్పతరంగదైర్ఘ్యములుగల, అతిశక్తివంతమైన, విద్యుదయస్కాంత శక్తిగల ఫోటాన్లు – ఈ కిరణములు కాంతియొక్క వేగము (అనగా సెకండుకు 1,86,000 మైళ్ల వేగము)తో ప్రసరిస్తూ వస్తువులోనికి హెచ్చు మోతాదులో చొచ్చుకుపోవు శక్తి గలవి. **Roentgen r's, X-r's,** electromagnetic radiations with very high penetrability, *see/చూడండి* X-rays. హెచ్చుగా చొచ్చుకుపోవు విద్యుదయస్కాంత కిరణప్రసరణ ఎక్స్‌రేలు.

**RBC** *abbr.* red blood cell or corpuscle ఎర్రరక్తకణము.

**reaction** 1. opposite action ప్రతీకరణము, ప్రతిక్రియ, ప్రతిచర్య, 2. counteraction ప్రతికూలక్రియ; నిరర్థకము చేయుట 3. response to stimuli ప్రేరణకు ప్రతిస్పందన. 4. process ప్రక్రియ. **allergic r.,** *see/చూడండి* allergy. **chemical r.** రసాయనిక చర్య. **leukaemic r.,** లుకీమియాలో. **leukaemoid r.,** change in the blood picture resembling leukaemia, *e.g.* one such occurring in disseminated (haematogenous) tuberculosis లుకీమియా వలె అగపడు రక్తములోని మార్పు, ఉదా. క్షయవ్యాధియందు ఒక దశలో చూడనగును. **stress r.,** psychosomatic stress మనోవికృతివల్లకలిగే శారీరక జాడ్యంలో ఉండే ఒడుదుడుకు/ఆందోళన/అలజడి.

**reagin** immunoglobulin E IgE, an antibody, a protein present in blood రక్తములోనుండు ప్రతిరక్షక ప్రోటీన్ (మాంసకృత్తు).

**recall** revive in memory, recollect పునఃస్మరణ; ధారణశక్తి (retention) నిరూపణ. అలంకార. అవధానియొక్క మేధ అవధి/మేర/ఎల్ల అతని ధారణశక్తిని కొలిచె బట్ట.

**receptor** an agent which receives గ్రాహకము. 1. a sensory nerve ending that is sensitive to stimuli, ప్రేరణలు/ప్రేరేపకములు పసికట్టే జ్ఞాననాడి కొన. **adrenergic r's,** fibres of the sympathetic nervous system stimulated by epinephrine (adrenaline) ఎడ్రినాలిన్‌తో ప్రేరేపకము పొందు స్వతంత్రనాడీ వ్యవస్థతంతువులు. **cutaneous r's,** found in skin చర్మములోనుండు గ్రాహకములు. **nociceptor r's,** which recognise pain sense నొప్పిని గుర్తించునవి. **thermal r's,** thermoreceptors, those which realise temperature sense (hot or cold) ఉష్ణము లేదా శీతలము తెలుపునవి. 2. **cholinergic r's,** concerned with the neurotrasmitter, acetylcholine ఎసిటైల్ కోలీన్ అను నాడీప్రసార ద్రవమును గుర్తించు గ్రాహకము. 3. **complement r's,** concerned with the reaction in complement fixation 'కాంప్లిమెంట్ నాటుట' మూలముగాగల ప్రక్రియలోని గ్రాహకము.

**recessive gene** a gene whose expression is masked in the presence of a dominant gene; the gene not contributing to the inheritance of a character అప్రభావక జన్యువు, అనువంశిక లక్షణాలకు తోడ్పడని జన్యువు.

**recipe** *see/చూడండి* Rx.

**recipient** one who receives గ్రహీత. 1. blood transfusion రక్తము పొందేవాడు. 2. organ/tissue transplant అవయవము/కణజాలము ఇంకొకరి శరీరములోనుండి తన శరీరంలో పెట్టించుకొనువాడు. **universal blood r.,** AB group, one who can receive blood of any group without incompatibility సర్వజనీన రక్తగ్రహీత. AB గ్రూప్, అసంగతము కలుగకుండా ఏదైనా గ్రూప్‌కు చెందిన రక్తమును గ్రహించువాడు.

**recombinant** recombining chemically రసాయనిక రీత్యా తిరిగి కలపటం. **r. technology,** in vitro rearrangement of DNA sequences at will; later to transfer the genes from one cell to the other. This is called genetic engineering, *see/చూడండి* genetic. పునఃసంయో

జనా విధానము/పద్ధతి: ప్రయోగశాలలో DNA స్థానములు మార్చుట; తరువాత జన్యువులను ఒక కణమునుండి ఇంకొక కణములోనికి మార్చుట – ఈ ప్రక్రియను జెనెటిక్ ఇంజనీరింగ్ అంటారు.

**reconstructive surgery** plastic surgery, *see/* చూడండి plastic surgery. పునర్నిర్మాణ శస్త్ర చికిత్స.

**recovery** recuperation పునరారోగ్యప్రాప్తి. **r. from illness** జబ్బు నుంచి కోలుకొనటం, స్వస్థత చేకూరటం.

**recrudescence** reappearance/return of symptoms in a disease after a temporary period of lull in the recovery phase వ్యాధి ఉపశమనము పిమ్మట ఆ వ్యాధి లక్షణములు తిరిగి అగపడుట అనగా వ్యాధి తిరగబడుట.

**rectal** pertaining to rectum మలాశయమునకు సం.

**rectocele** proctocele. prolapse or herniation of rectum మలాశయం ఆసనంలోనికి జారుట. ఆసనంలో ఎర్రగా కనబడుతుంది.

**rectopexy** fixing up a rectocele జారిన మలాశయము/పురీష నాళమును తిరిగి స్వస్థానములో అమర్చే శస్త్రచర్య.

**rectoscope** endoscope for examining the inside of rectum. మలాశయాంతర్దర్శిని.

**rectosigmoid** concerning the rectum and sigmoid మలాశయము మరియు సిగ్మాయిడ్‌కు సం. **r.junction,** the junction at the end of the sigmoid colon and beginning of the rectum సిగ్మాయిడ్ పేగుచివరకు, మలాశయము మొదలునకుగల సంధి.

**rectovesical** concerning the rectum and urinary bladder పురీషనాళం మరియు మూత్రాశయమునకు సం. **r.fistula,** communication between the rectum and urinary bladder మలాశయము మూత్రాశయము మధ్య మార్గము ఏర్పడుట.

**rectum** the distal portion of the large intestine మలాశయము, పురీషనాళము, గుదనాళిక: పెద్దపేగు ఆఖరి ప్రాంతము, అలంకార. శరీరంలోని పాకీదొడ్డి.

**rectus** straight నిలువైన. **r.abdominis,** straight voluntary muscle in the abdominal wall ఉదరకుడ్యములోని నిలువైన, నియంత్రిత కండరము.

**recumbent** lying on the back వెల్లకిలా పరుండుట [opp. prone వ్యతి. బోర్లా].

**recurrence** the repetition/return of symptoms after a remission వ్యాధి విమోచనము తదుపరి వ్యాధి లక్షణములు తిరిగి అంకురించుట.

**recurrent** occurring again and again మళ్ళీ మళ్ళీ వచ్చే. reappearing పునరాగమనం. **r. abortion** మళ్ళీమళ్ళీ సంభవించే గర్భస్రావం. **r. colds** మళ్ళీ మళ్ళీ వచ్చే జలుబు/పడిశం. **r. infection** మళ్ళీ మళ్ళీ సంక్రమణం.

**red** the colour of blood ఎఱ్ఱ/ఎర్ర. 1. **r. area,** region in a city where prostitutes flourish నగరములో వ్యభిచారము/వేశ్యావృత్తి వృద్ధిచెందుప్రాంతము. 2. **r. blood cell** ఎర్రరక్తకణము. 3. **r. man syndrome,** purpura, fatal poisoning with rifampicin, a drug used in the treatment of tuberculosis wherein the patient becomes red క్షయ జబ్బులోవాడే రిఫాంపైసిన్ అను మందుయొక్క విషపరిణామము – రక్తపుగూళ్ళుకట్టి శరీరమంతా కందిపోయి ఎరుపెక్కిన దృశ్యము. 4. **r. nucleus,** a component of the extrapyramidal nervous system మెదడులోని ఒక ప్రాంతము.

**reducing** decreasing, lessening తగ్గించే. **fat r. diet,** especially in obese states కొవ్వెక్కిన శరీరానికి కొవ్వు తగ్గించి తినే ఆహారము.

**reduction** 1. the correction of a fracture, dislocation ఎముక విరగటం, కీలు తొలగడం – వీటిని సరిదిద్దటం. 2. **r. of a hernia,** *see/చూడండి* hernia. 3. **r. of tension,** allaying/abatement of tension ఆందోళనను ఉపశమనము చేయు/తగ్గించు.

**referred pain** pain felt in another part of the body other than its source, *e.g.* pain of cholecystitis referred to the right shoulder నొప్పి అంకురించిన అవయవములోగాక వేరు ప్రాంతములో తెలియుట, ఉదా. పిత్తాశయము వాపువలన నొప్పి కుడిబుజము ప్రాంతంలో తెలియుట.

**reflex** 1. sudden involuntary action అకస్మాత్తైన అనియంత్రిత చర్య, ప్రతిక్రియ, ప్రతిఫల చర్య. 2. sneezing in response to a stimulus – the stimulus may be a scratch in the nose, irritation due to dust, cold (coryza), *etc.* నాసిక దగ్గర దురద, దుమ్మువలన కోరు,

ముక్కుపడిశం/రొంప, మొ. పరిస్థితులలో ఆకస్మిక, అనియంత్రిత చర్య, ఉదా. తుమ్ము. ఇల్లు ఊడుస్తున్నప్పుడు, సామాను సర్దుతున్నప్పుడు ఆ దుమ్ముపలన వెంటనే తుమ్ములు వస్తాయి. 3. Scratching is a reflex act to irritation on the skin. గోకటం, చర్మంమీద రేపుడు (irritation) కు ప్రతిక్రియ.

**reflex** reflected or thrown back ప్రతిఫలించటం లేదా ప్రతిగా/బదులుగా నెట్టబడుట. **r. action,** a sudden involuntary action or movement of a part in response to a stimulus (tap or scratch): tap on a tendon or scratch on the skin ప్రతీకార చర్య: స్నాయువుమీద తట్టునపుడు గాని చర్మముమీద దొడ్డుమొనతో గీకునప్పుడుగాని వీటి ప్రేరేపణవలన ఆ ప్రాంతంలో ఆకస్మిక, అనియంత్రిత చలనము కలుగుట. **abdominal r.,** scratching on the abdominal wall evokes contractions of the abdominal muscles ఉదరకుడ్యముమీద దొడ్డుమొనతో గీస్తే ఉదరకుడ్య కండరముల సంకోచము చూడనగును. **anal r.,** scratching by the side of anus produces shrinkage of the anus ఆసనముపరిధిలో గీస్తే ఆసనము ముడుచుకుంటుంది. **Babinski's r.,** extensor plantar: raising of the great toe on scratching the sole of the foot అరికాలుమీద గీస్తే పాదం బొటనవేలు పైకి లేస్తుంది. **corneal r.,** closure of the lids on touching the cornea with cotton. This is lost in deep coma. శుక్లపటలమును దూదితో తాకితే కనురెప్పలు ముడుచుకుంటాయి. గాఢమైన స్పృహాలోపములో ఈ చలనము ఉండదు. **knee jerk r.,** a tap on the patellar tendon with a knee hammer elicits sharp jerk of the leg, *see/చూడండి* jerk. వాడిగల ఈడ్పు; మోకాలిచిప్ప స్నాయువును జానువుసుత్తితో తట్టితే, ఆ మోకాలు చివుక్కున పైకిలేస్తుంది. **light pupil r.,** contraction of the pupil when light is thrown on the eye, say a torch light beam. This is lost in deep coma. టార్చి కాంతి/వెలుతురు కన్నుమీద పడగానే కనుపాప/తారక ముడుచుకుంటుంది. తీవ్రమైన స్పృహాలోపములో ఈ సంచలనము ఉండదు. **pharyngeal r.,** irritation of the throat with finger tips to cause to retch, a ritual performed early morning while cleansing the mouth ప్రొద్దున లేవగానే ముఖము కడుగుకునేటప్పుడు గొంతులో వేళ్ళుపెట్టుకుని రాపిడి కల్గిస్తూ, శబ్దంచేస్తూ, గొంతుక

మూస్తూ తెరుస్తూ పాటించు అలవాటు/దినచర్య – దీనివలన గొంతు సాఫీ అవుతుందని అపోహ. **plantar r.,** scratching on the sole of the foot causes contraction of all toes అరికాలు మీదగీస్తే పాదం వేళ్ళన్నీ ముడుచుకుంటాయి.

**reflux** flowing back మళ్ళిపోవునట్టి, మార్గములో తిరిగి వెనుకకు గుంజుకొనబడినట్టి. **gastroesophageal r.,** flowing back of the stomach contents into the esophagus and throat, *colloq.* water brash జఠరరసము వగైరా ద్రవములు అన్నవాహిక, గొంతులోనికి గుంజుకొనబడుట, వాడు.భా. గొంతులో పుల్లగా నీళ్ళు ఊరినాయి అంటారు. **hepatojugular r.** *see/చూడండి* hepatojugular reflux.

**refraction** finding out the error in the refraction in the eye and its correction by lenses/glasses వక్రీకరణము, వక్రీభవనము: కన్నులో కిరణ వక్రీభవనములో లోపమువలన చూపు స్పష్టముగా లేకపోతే దానిని సరిదిద్దుటకు కళ్లజోడు/అద్దాలు వాడమంటారు.

**refractory** stubborn; not amenable to treatment హఠముగల; చికిత్సకు లొంగని/లోబడని. not yielding to medicines ఔషధములకు గుణము కనబడని. **r. disease** మొండి వ్యాధి. **r. heart failure,** *see/చూడండి* failure. చికిత్సకు లొంగకుండా గుండె సోలిపోవుట.

**refrigerator** *colloq.* fridge. cold storage facility. cabinet maintained at low temperature వాడు.భా. ఫ్రిజ్, రిఫ్రిజిరేటర్, హిమీకరణ యంత్రం, శీతలీకరణ పేటిక: (i) to slow down the rate of decay of food, vegetables, fruits and other perishables ఆహారం, కూరగాయలు, పండ్లు, మరియు అటువంటి చెడిపోయే పదార్థములు క్రుళ్ళిపోకుండా దాచడానికి. (ii) to store vaccines to see that they do not lose potency టీకా మందుల పాటవము/శక్తత పోకుండా ఉండేందుకు. (iii) to preserve biopsy specimens బయాప్సీ/జీవాణు పరీక్షకు తీసిన కణజాలములను పరిరక్షించుటకు. (iv) for tissue cullture కణజాల సంవర్ధనము కొరకు. (v) to keep cultures and bacteria alive సంవర్ధనములు మరియు బాక్టీరియాను సజీవంగా ఉంచుటకు. (vi) for storage of blood and blood products for future transfusion రక్తము మరియు రక్త సం. పదార్థములను నిల్వజేసి, తదుపరి అవసరం

వచ్చినప్పుడు శరీరంలో ఎక్కించటానికి. (vii) organs like cornea for future grafiting శుక్ల/స్వచ్ఛ పటలం లాంటి అవయవములు నిల్వజేసి తదుపరి అంటు కట్టుటకు వినియోగించడానికి. (viii) to preserve bone chips for bone graft ఎముక అంటు కట్టుటకు నిల్వచేసే మార్గం – broad term: tissue bank విస్తృతార్థక పదము: కణజాల నిధి.

**regeneration** the natural rebirth of destroyed/lost tissue, *e.g.* liver has got remarkable power of regeneration. పునరుత్పత్తి: ఉదా. కాలేయమునకు ఈ గుణము కలదు.

**regimen** a well planned schedule of treatment, diet, rest, exercise, *etc.* in patients నియమావళి: వ్యాధిగ్రస్తులలో ప్లాన్ ప్రకారం, ముసాయిదా/పట్టి ననుసరించి చికిత్స, ఆహారం, విశ్రాంతి, వ్యాయామం వగైరా అంశములు నిర్ణయించుట. **drug r.** ఔషధనియమము: ఔషధముల పట్టి/జాబితా.

**region** a portion in the body/organ ప్రాంతము, శరీర/అవయవములోని ప్రాంతము. 1. **pectoral r.,** region of the chest ఛాతీప్రాంతము. 2. **perineal r.,** anal and urogenital region మూలాధారము: ఆసనము మరియు మూత్ర జననేంద్రియ ప్రాంతము. 3. regional anatomy ప్రాంతీయ శరీరనిర్మాణశాస్త్రము. 4. regional anesthesia ఒక ప్రాంతములో మొద్దుబారినట్లుచేయుట; మొద్దుబారుటకు ఎనస్థీషియా ఇచ్చుట.

**regression** 1. subsidence of a disease తగ్గటము: వ్యాధి నయమగుట. 2. back to the pavilion ప్రతిగమనము. coming to former state యథాస్థితికి వచ్చుట. 3. in psychiatry, reversion to an infantile level మానసికవ్యాధులలో చంటిబిడ్డదశకు దిగజారుట.

**regurgitation** bringing back again ప్రత్యావహనము: 1. backflow of blood: రక్తము వెనుకకు గుంజుకొనబడుట. **aortic r.,** *see/చూడండి* aortic regurgitation. **mitral r.,** backflow of blood from the left ventricle into the left atrium due to incompetent valve సామర్థ్యము కోల్పోయిన కవాటమువలన ఎడమ ఏట్రియమ్‌లోనికి ఎడమ జఠరిక నుండి రక్తం వెనుకకు గుంజుకొనబడుట. 2. backflow of food: **gastroesophageal r.,** *see/చూడండి* reflux.

**rehabilitation** 1. restoration to former state పునర్వ్యవస్థీకరణము, యథాస్థితికి చేర్చుట. 2. **r. of the handicapped,** returning the injured limb to an optimal, reasonable degree of function వికలాంగులకు అంగవైకల్యము కొంత ఉన్నా గూడా, శక్తికి తగినంత చలనము చేకూర్చడం ఒక నేర్పు. 3. **pulmonary r.,** making/helping patients of advanced lung diseases to live with their pulmonary insufficiency ఊపిరితిత్తుల దీర్ఘవ్యాధిగ్రస్తులు ఆయాసంతో బాధపడుతున్నప్పటికీ, వారి నిత్యజీవితంలో జీవనవిధులను నిర్వర్తించుటలో తోడ్పడటం ఒక యుక్తి.

**rehydration** absorbing water again after dehydration; means to avert danger in states of dehydration నిర్జలీకరణ స్థితిలో తిరిగి నీరు శరీరంలోనికి గ్రహించుట. పునర్జలీకరణము: నిర్జలీకరణములో అపాయము కలుగకుండా ఉండే ఉపాయములు. 1. Put a pinch of salt and a spoon of sugar in a glass of 'boiled and cooled' drinking water – give sips very frequently. కాచి చల్లారబెట్టిన త్రాగేనీళ్ళలో చిటికెడు ఉప్పు మరియు చెమ్చా చక్కెర కలిపి తరచుగా, మళ్ళీమళ్ళీ త్రాగించుట. 2. ORS oral rehydration salt/solution; packets available in the market ఆస్యజలీకరణ లవణము/ద్రవము; నోటిద్వారా ఇచ్చేద్రవము దుకాణములలో దొరుకుతుంది.

**Reichian therapy** or **reichian therapy** also called bio energetics. therapy involving the use of massage, controlled breathings, *etc.* to release inhibited energies in the body అంతర్గత జీవశక్తి ఉత్తేజ చికిత్సా విధానము: మర్దన/మాలిష్ చేయడం, ప్రాణాయామం, మొ. చికిత్సోపాయముల వలన శరీరంలో దాగిఉన్న శక్తులను విడుదలచేసి, అస్వస్థతను నయంచేయుట.

**reimplantation** to plant again or at another place యథాస్థానంలో గాని ఇంకొక/వేరే చోటగాని నాటటం. **r. of the ureter,** 1. replanting the ureter at its place మూత్రనాళమును యథాస్థానంలో చేర్చుట. 2. planting of the ureter at some other place, *e.g.* in the colon, so as to facilitate discharge of urine into the colon మరియొక చోట అమర్చుట, ఉదా. మూత్రనాళమును పెద్దప్రేగులో అమర్చుట – ఇట్లా చేసినట్లయితే మూత్రం పెద్దప్రేగులోనికి కారేటట్లు ఉపాయము తలపెట్టుట.

**reinfection** repeat infection పునఃసంక్రమణం. 1. **genuine r.,** second primary infection in tuberculosis in old age టి.బి. బాక్టీరియా ప్రథమకాటు వృద్ధాప్యంలో మరల సంభవించుట. 2. infection by a different agent వేరే సూక్ష్మజీవుల సంపర్కము.

**rejuvenation** restoration of youth and strength పునర్యవ్వనము, నవయౌవనీకరణము.

**relapse** repetition of the disease జబ్బు తిరుగ బెట్టుట. **r. in tuberculosis,** reappearance of TB bacilli in sputum after bacteriological quiescence రోగము తిరుగబెట్టుట; కఫములో క్షయబాసిల్లై హరించిన తదుపరి మళ్ళీ కొలదికాలానికి కనబడుట.

**relationship** a connection or an association సాంగత్యం, సంబంధం. **doctor-patient r.,** rapport between the patient and the treating doctor రోగికి డాక్టరుకి మధ్యగల సౌహార్ద్రత. **host-parasite r.,** which determines the outcome of a disease అతిథేయి-పరాన్నజీవి సంబంధం; జబ్బు ఎట్లా పరిణమించేది తెలియచెప్తుంది.

**relative** 1. comparative సాపేక్ష **r. density** సాపేక్ష సాంద్రత. **r. contraindication** సాపేక్ష నిషేధం, సాపేక్ష తారతమ్యత. **r. humidity** సాపేక్షార్ద్రత (సాపేక్ష+అర్ద్రత). **r. motion** సాపేక్ష చలనం. **r. value** సాపేక్ష మూల్యము. 2. relation బంధువు, చుట్టము.

**relaxant** an agent or drug that makes a person relax (his muscles) and feel less tense శరీర కండరాల్ని సడలించేది మరియు పట్టు/బిర్రు/బిగువు తగ్గించేది, ఆదుర్దా తగ్గించేది.

**relaxation therapy** a treatment modality that enables the body (muscles) to relax, e.g. Yoga–savasanam శరీర (కండర) బిగువు సడలించే చికిత్సా మార్గం, ఉదా. యోగ–శవాసనము.

**relaxin** 1. a hormone produced during pregnancy which exerts a relaxing effect on the pelvic muscles గర్భిణీ సమయంలో శ్రోణి కండరములను సడలించే హోర్మోన్. 2. a preparation of this hormone used to facilitate child birth కాన్పు సులభంగా అవటానికి ఔషధరూపంలో వాడ్తారు.

**remedy** treatment, medicine, *etc.* చికిత్స, ఔషధము, మొ.

**remission** period of waning in the course of a disease ఉపశమనం, తగ్గటము: చంద్రుని కళాక్షీణమువలె జబ్బుయొక్క ఉద్రిక్తము తగ్గేదశ.

**remittent** increasing and decreasing హెచ్చుతూ తగ్గుతూ. **r. fever,** when the daily fluctuations exceed 2° C. జ్వర ఉష్ణోగ్రత: పైకి, క్రిందికి మధ్య భేదం 2° C. ఉంటే.

**renal** relating to the kidney వృక్క, కిడ్నీకి/మూత్రపిండమునకు సం. **r. colic** వృక్కశూాల. **r.stone** వృక్కశిల.

**renin** an enzyme produced in the kidney; regulates blood pressure కిడ్నీలో తయారగు ఎన్‌జైమ్; రక్తపోటు సరిదిద్దేది.

**rennin** an enzyme in human infants which curdles milk పాలను పెరుగు తరకలుగా మార్చు ఎన్‌జైమ్, గమనిక: శిశువు పాలుత్రాగి కక్కినప్పుడు ఆ వాంతిలో పెరుగు తరకలులాగా కనబడటం నిత్యానుభవం.

**renopathy** nephropathy; any disease of kidneys కిడ్నీ సుస్తీ/వ్యాధి.

**renovascular** concerning the blood vessels of the kidney కిడ్నీ రక్తనాళములకు సం. *e.g.* renal artery stenosis, a cause of secondary hypertension ఉదా. వృక్కధమనియొక్క కుంచనము/నొక్కు – దీనివల్ల రక్తపీడనం (బి.పి.) పెరుగుతుంది. రక్తపీడనం పెరిగితే రక్తపోటు అంటారు.

**repair** set right మరమ్మత్తు. **r. of tissue** కణజాలమును బాగుచేయు, కణజాలమునకు స్వస్థత చేకూర్చు.

**repellent** a substance that drives back తిరగగొట్టెడు. **insect r.** కీటకాలను మళ్ళగొట్టే. **mosquito r.** దోమలను వెళ్ళగొట్టేది.

**replacement** removal and place instead; renewal or substitution బదులుగా నుంచు, స్థానపూర్తి. **r. of bone,** bone transplant, removal of dead bone and replace bone chips చెడిపోయిన ఎముకను తొలగించి నూతన ఎముకల ముక్కలు భర్తీచేయడం. **r. of cornea,** corneal graft శుక్లపటల మార్పు. **r. of organ,** organ transplantation, removal of diseased organ and replacing a healthy one అవయవ బదిలీకరణ(ము), ప్రతిరోపణ. వ్యాధిగ్రస్తమైన అవయవమును తీసి నూతన అవయవమును అమర్చుట.

**report** give information of/about something సమాచార పట్టిక. **medico-legal r.** న్యాయ సం.వైద్య రిపోర్టు.

**reproduction** production of offspring ప్రత్యుత్పత్తి, సంతానోత్పత్తి. వాడు.భా. ముఖ్యముగా జంతువులలో పిల్లలు పెట్టుట, ఉదా. పిల్లి పిల్లలు పెట్టింది.

**reproductive system** organs of reproduction ప్రత్యుత్పత్తి అవయవాలు, ప్రత్యుత్పత్తి వ్యవస్థ.

**resection** surgical excision విచ్ఛేదము: శస్త్రచికిత్సచేసి కోయుట. **transurethral prostatic r.** transurethral resection of prostate, *abbr.* (TURP), to scrape the prostate with a toothed instrument passed into the urethra like scraping the kernel in a coconut టెంకాయలో కొబ్బరి తురుమునట్లు మూత్ర మార్గములోనికి తురుముచాకును పోనిచ్చి పౌరుషగ్రంథిని తురిమివేయుట. **wedge r.**, removal of a triangular mass of tissue in an organ అవయవములో త్రిభుజాకారమైన కణజాల ముద్దను తీసివేయుట.

**reservoir** a store ఆశయము, నిల్వ. **r. of infection,** pool of infection ఆశయము: సూక్ష్మజీవుల సంపర్కకూటమి.

**residual** remaining శేష, మిగిలిన. **r. infection** శేష సంక్రమణం. **r. lesion** శేష క్షతము.

**resin** *bot.* obtained from the sap of plants (sap = vital juice circulating in a plant). వృక్షములోని రసము, సారము. Some of them have antiseptic properties. కొన్ని పూతినాశక గుణం కలిగి ఉంటాయి. 1. asafoetida ఇంగువ. 2. **podophyllum r.** (a) used as a laxative మలబద్ధ(క)నివారిణి. (b) chemical cautery with 20% podophyllum in compound tincture of benzoin applied to genital warts, locally. Also used to soften corns. పులిపిరికాయలకు, ఆనెలకు వాడ్తారు.

**resistance** ability to resist ఎదుర్కొను/నిరోధక శక్తి, ప్రతిరోధ(క)ము. 1. ability to protect oneself from disease వ్యాధినిరోధకశక్తి, *see/చూడండి* immunity. 2. **vascular r.,** Increased vascular resistance leads to high blood pressure since the heart has to

pump against resistance రక్తనాళములు ఎదుర్కొను ఒత్తిడి. ఈ ఒత్తిడి ఎక్కువైతే రక్తపోటు పెరుగుతుంది; ఎందుకంటే – ఒత్తిడి ఎక్కువైన రక్తనాళములలోకి రక్తం చిమ్మాలంటే గుండె ఎక్కువ కష్టపడాలిగాబట్టి. 3. **drug r.**, the drug which was once effective becomes useless in action after the development of resistance మునుపు ఫలితమిచ్చిన ఔషధము ఇప్పుడు మొండికేసి పనికిరాదు. *eg.* In tuberculosis single drug resistance and multi-drug resistance (MDR) are reported. ఉదా. క్షయవ్యాధిలో ఒక ఔషధముగాని అనేక ఔషధములుగాని పనిచేయకపోవుట. 4. **r. to stress** జీవన ఒత్తిడికి ప్రతిరోధము.

**resolution** subsidence of a pathologic lesion జబ్బువలన కలిగిన క్షతము/పరిణామము రూపుమాపబడి, స్వస్థత చేకూరుట.

**resonance** A. (i) felt in percussion ప్రతిధ్వని, అనునాదము. **percussion r.**, *see/చూడండి* percussion. (ii) heard in auscultation స్టెతొస్కోప్‌తో వినే అనునాదము. **amphoric r.**, heard by stethoscope over a bronchopleural fistula or a cavity in the lung, resembling the whistling noise when air is blown across the mouth of an empty bottle పై జబ్బులలో ఈలవేసిన శబ్దంవలె వినపడు ధ్వని. **vocal r.**, heard over chest ఛాతీ పరీక్షలో స్టెతొస్కోప్‌తో వింటాము. B. **nuclear magnetic r.**, this technique is used in magnetic resonance imaging (MRI).

**resorption of bone** the lysis and assimilation of bone ఎముకయొక్క విచ్ఛిన్నము మరియు స్వాంగీకరణము.

**respiration** consists of inspiration and expiration శ్వాసక్రియ; ఉచ్ఛ్వాసము మరియు నిశ్వాసము. normal rate 18 per minute ఆరోగ్యవంతులు నిముషమునకు 18 సార్లు శ్వాసపీల్చి వదుల్తారు. Oxygen enters the lungs and alveoli through inspiration. Respiration entails diffusion of oxygen from alveoli to the blood, and its transport to body cells; transport of carbondioxide from body cells and its diffusion from the blood to the alveoli. The carbondioxide is eliminated by expiration ఆక్సిజన్ ఉచ్ఛ్వాసముతో ఊపిరితిత్తియొక్క వాయుకోశాలలో ప్రవేశిస్తుంది. ఆక్సిజన్ వాయుకోశాలనుండి రక్తంలోనికి

వ్యాపనముఅగుట, శరీరకణములకు రక్తంద్వారా సరఫరా చేయబడుట; కార్బన్ డైఆక్సైడ్ శరీరకణములనుండి రక్తంద్వారా ఊపిరితిత్తులకు చేరి, రక్తంనుండి వాయుకోశాలలోనికి వ్యాపనము అగుట. ఈ కార్బన్ డైఆక్సైడ్ నిశ్వాసముతో బహిష్కరింపబడుతుంది.

**respirator** mechanical device to assist breathing శ్వాసక్రియకు తోడ్పడు సాధనము.

**respiratory** relating to respiration శ్వాసక్రియకు సం. **r. failure** శ్వాస అవయవములు సోలిపోవుట.

**response** say, to a stimulus; reply action ప్రతిస్పందన.

**responsibillity** బాధ్యత. **clinical r.** చికిత్సా బాధ్యత. **doctor's moral r.** డాక్టరు వృత్తినీతికి సం. విధి.

**resuscitation** restoring life in the apparently dead, as in drowning, electric shock, respiratory arrest, *etc.* పునరుజ్జీవనం: కొన ఊపిరిని, కొనప్రాణాన్ని నిలబెట్టుట అనగా మరల బ్రతికించుట. *గమనిక.* జీవితం విలువ అమూల్యం. **cardiopulmonary r.**, *abbr.* (CPR) simultaneous mouth to mouth breathing (artificial ventilation) and external/closed chest cardiac massage, *see/చూడండి* artificial respiration. ఒకే కాలంలో రెండు సాధనలు – నోటిమీద నోరుపెట్టి శ్వాస ఆడించటం మరియు గుండెమీద చేతులుపెట్టి తట్టుట.

**retardation** process of slowing మాంద్యం. **mental r.**, having low IQ మాంద్యము, బుద్ధిమాంద్యత, లఘు/తక్కువ ప్రజ్ఞానశీలత.

**retching** inclination to vomit ఓకరించు, వాంతిచేయబోవు.

**rete** a network or mesh-work, especially of blood vessels అల్లిక, జాలీ, ముఖ్యంగా రక్తనాళముల యొక్క. **r. arteriosum**, anastomotic network of minute arteries, just before they become arterioles or capillaries చిరు ధమనుల, అనగా ధమనికలు లేదా రక్తకేశనాళికలుగా రూపొందేముందుగల సైజులో ఉండే వాటి యొక్క అనుసమ్మేళన అల్లిక. **r. testis,** network of seminiferous tubules formed in the mediastinum testis వృషణము యొక్క వెనుక పాక్షిక విభాజక ప్రాంతంలో శుక్రోత్పత్తి నాళికల అల్లిక.

**retention** 1. act of retaining నిలిపి పెట్టుట. 2. failure to evacuate విసర్జించబడకపోవుట. **r. of urine,** holding back of flow of urine, *e.g.* in enlarged prostate మూత్రము నిలిచిపోవుట/రాకుండుట, ఉదా. పౌరుషగ్రంథి వాపువలన మూత్రావరోధ(న)ము. **r. cyst,** cyst due to retention of secretion, *e.g.* sebaceous cyst due to retention of sebum స్రావము నిలవచేయబడిన తిత్తి, ఉదా. సీబమ్ నిలవ చేయబడిన తిత్తి. **r. enema,** retaining medicated solution in the colon for some hours for local action, *e.g.* in intestinal amoebiasis ప్రాంతీయ చికిత్సకొరకు, ఉదా. ఎమీబియాసిస్ జబ్బులో ఔషధద్రావక ఎనిమా పెద్దపేగులోనికి ఎక్కించి, కొన్నిగంటలపాటు దాన్ని బిగపట్టుకుని ఉండుట/ఉంచుట.

**retention** ability to store in memory ధారణ: జ్ఞాపకం పెట్టుకొనుట.

**reticular activating system** in the brain మెదడులోని రెటిక్యులార్ ఉత్తేజన వ్యవస్థ.

**reticular tissue** net like tissue జాలక కణజాలము.

**reticulocyte** a young erythrocyte పక్వముగాకుండా ఉన్న ఎర్రరక్త కణము.

**reticuloendothelial** a defence system in the body శరీరంలోని రక్షణ వ్యవస్థ. **r. system,** the tissue macrophage system found mainly in the bone marrow, spleen, lymph nodes ఊతక మహాభక్షక వ్యవస్థ; జాలక అంతరస్తర వ్యవస్థ – అస్థిమజ్జ, స్ప్లీన్, లింఫ్‌గ్రంథుల్లో ఉండేది. The macrophages help to engulf bacteria and foreign particles in circulation. మహాభక్షక కణములు రక్తప్రవాహములోని బాక్టీరియా, ఇతర రేణువులను భక్షించి శరీరాన్ని కాపాడుతాయి.

**reticulosis** an increase in reticuloendothelial elements, *see/చూడండి* reticuloendothelial. **malignant r.,** *syn.* mycosis fungoides అపాయకరమైన రెటిక్యులోసిస్.

**reticulum** 1. protoplasmic network in a cell కణములోని జీవ పదార్థములోని జాలకనిర్మాణము. 2. reticular tissue జాలక కణజాలము. *resemblance:* honey-comb పోలిక: తేనెతుట్టె, తేనెపట్టు.

**retina** the innermost tunic in the eyeball నేత్రపటలము, నాడీపటలం, అంతఃపటలము, నేత్రాంతః పటలము, దృష్టిపటలము, కన్నుగుడ్డులోపలి కంచుకము. **detachment of r,** retinal layer gets detached from the eyeball, producing blindness రెటినా పొర కన్నుగుడ్డు నుండి విడిపోవుట. దీనివలన అంధత్వం సంభవిస్తుంది/కలుగుతుంది.

**retinaculum** *anat.* band of ligamentous tissue స్నాయువు/లిగ మెంట్ కణజాల నాడా. **flexor r.** of the hand (wrist) or foot (ankle) చేయి (మణికట్టు) లేదా పాదం (కాలి చీలమండ) దగ్గర నాడా.

**retinal** pertaining to retina రెటినాకు సం.

**retinitis** inflammation of retina నేత్రాంతఃపటల శోథం.

**retinitis pigmentosa** retinal degeneration నేత్రపటలముయొక్క క్షీణత.

**retinoblastoma** malignant tumour of the retina, occurs exclusively in children నేత్రపటలముయొక్క అపాయకరమైన కంతి, ప్రత్యేకముగా పిల్లలలో చూడనగును. a tumour that blasts the retina and eye నేత్రపటలమును, కన్నును ధ్వంసంచేసే బీభత్సకంతి.

**retinol** vitamin $A_1$ విటమిన్ $A_1$.

**retinopathy** any noninflammatory disease of the retina నేత్రాంతః పటల శోథరహిత వికృతి: శోథము/'నొప్పి వేడి వాపు' లేని నేత్రపటలము జబ్బు. **diabetic r.**, associated with diabetes mellitus మధుమేహంతో కూడినది. **hypertensive r.**, associated with primary/essential or malignant hypertension ప్రాథమిక రక్తపోటు వ్యాధి లేదా అపాయ కరమైన రక్తపోటు వ్యాధితో కూడినది.

**retinoscope** an optical instrument to examine the eye కన్ను పరీక్షకు పనిముట్టు. retinoscopy: shadow test, observing the shadow on the retina నేత్రాంతఃపటలం (రెటీనా) మీద నీడను పరిశీలించుట.

**retinosis** noninflammatory degenerative condition of the retina నేత్రపటలముయొక్క శోథరహిత క్షీణదశ పరిణామము.

**retraction** the act of drawing something in, back or up దేనినైనా లోపలికి, వెనుకకు లేదా మీదికి లాగటం. **r. of eylid** కనురెప్ప వెనుకకు

త్రిప్పటం. **r. of prepuce** శిశ్నాగ్రంపై ముందోలు వెనుకకు లాగడం, నివర్తనం.

**retractor** an instrument in surgery used to retract something during an operation. శస్త్రచికిత్సలో వాడే పనిముట్టు.

**retrobulbar** A. retro = behind వెనుక bullbar = bulb - shaped structure బల్బు ఆకారంలో ఉన్న గుండ్రపు నిర్మాణము. B. behind the eyeball కన్నుగుడ్డు వెనుక. **r. neuritis,** neuritis behind the eye ball కన్నుగుడ్డు వెనుక నాడియొక్క వాపు. C. behind the medulla oblongata మజ్జాముఖము వెనుక.

**retrocolic** behind the colon పెద్దపేగు వెనుక.

**retrocollic** nuchal; relating to the back of the neck మెడవెనుక; గ్రీవముయొక్క వెనుకభాగమునకు సం.

**retroflexion** of the uterus; displacement. Flexion refers to the direction of the body of the uterus; bent backwards. గర్భాశయము యొక్క మొండెము వెనుకకు వంగుట [*opp.* anteflexion which is the normal position].

**retrolental fibroplasia** fibrosis behind the lens in the eye, causing blindness, a not infrequent complication of continuous oxygen therapy in premature babies కన్ను గుడ్డులోని కటకమువెనుక అంధత్వము కలుగజేసే తంతుయుత కణజాలపరిణామము – ఇది నెలలు నిండకుండా పుట్టిన శిశువుకు ఆక్సిజన్ నిర్విరామంగా ఇచ్చినందువలన కలుగు దుష్పరిణామము. *N.B.* oxygen is a drug, *see/చూడండి* oxygen toxicity. *గమనిక:* ఆక్సిజన్ ఔషధముకూడా అని గ్రహించాలి.

**retroperitoneal** external or posterior to the peritoneum ఆంత్ర వేష్టనమునకు వెలుపుల లేదా వెనుక భాగమున.

**retropulsion** *e.g.* gait in Parkinsonism, involuntary backward pace in walking ఈ వ్యాధిలో వీరు వెనుకకు అడుగులు వేస్తారు.

**retrosternal** behind the sternum ఉరఃఫలకము/ఉరోస్థి వెనుక. **r. goitre** ఈ ప్రాంతంలో థైరాయిడ్ కణితి.

**retroversion** of the uterus; displacement. Version refers to the direction of the cervical canal; it is bent backwards. గర్భాశయము

యొక్క గ్రీవము/ద్వారము వెనుకకు వంగుట [*opp.* anteversion which is the normal position].

**reunion** the act of reuniting something పునఃసంయోగం. **r. of structures** నిర్మాణముల పునఃసంయోగం.

**revascularization** 1. blood supply restored after healing in a wound గాయము నయమైన తర్వాత యథాస్థితికి రక్తసరఫరా నెలకొల్పబడుట. 2. blood supply compensated after a graft, *see/చూడండి* graft. *e.g.* after aortocoronary bypass, *ఉదా.* బృహద్ధమనికి కొరొనరి ధమనికి మధ్య మార్గము ఏర్పరచుట; అప్పుడు రక్తసరఫరా సర్దుకుంటుంది.

**rhabdomyoma** benign tumour derived from striated muscle, *see/చూడండి* muscle. చారల కండరములయొక్క నిరపాయ కంతి.

**rhabdomyosarcoma** a highly malignant tumour of the striated muscle చారల కండరములయొక్క అతిఘోర అపాయ కరమైన కంతి.

**rhagades** fissures, cracks on skin, especially at the angle of the mouth in congenital syphilis పగుళ్ళు, బీటలు: ముఖ్యముగా పుట్టుకతోవచ్చిన సవాయిరోగములో నోటి అంచులదగ్గర బీటలు.

**rhesus factor** or **Rh factor** an antigen found on the red blood cells of most humans which was first discovered in the rhesus monkey పెక్కు మానవుల ఎర్రరక్తకణములలో ఉండే ఏంటిజన్ – ఇది ప్రప్రథమంగా రీసస్ (Rhesus) జాతి కోతిలో కనుగొనబడినది.

**rheumatalgia** rheumatic pains కీళ్ళ వాతరోగములో నొప్పులు.

**rheumatic fever** an inflammatory disease occurring as a sequel to infection of the throat and tonsils with group A beta haemolytic streptococci రుమాటిక్ జ్వరము: ఈ సూక్ష్మజీవులు గొంతు మరియు టాన్సిల్స్‌ను దాడిచేసిన తరుపరి పర్యవసానము. It involves principally the heart, joints, central nervous system (manifestation as chorea). It licks the joints but bites the heart, *see/చూడండి* chorea, nodule. ముఖ్యముగా గుండె, కీళ్ళు గురిఅయి, ఇది విక్రృత నృత్యవాతము (chorea) ను అభినయించును. ఈ జబ్బు కీళ్ళను నాకుతుంది, గుండెను కొరుకుతుంది.

**rheumatic heart disease** రుమాటిక్ హృద్రోగం.

**rheumatism** a group of disorders of the connective tissue structures, especially affecting the joints/muscles marked by pain, stiffness or limitation of movement కీళ్ళవాతము, ఆమవాతము: బంధనకణజాలముయొక్క జబ్బు; ముఖ్యముగా కీళ్ళలో/కండరములలో నొప్పి, బిగువు లేదా చలనమాంద్యము/కదలికలో కష్టము. **rheumatic, articular, acute, inflammatory r.,** rheumatic fever, *see/చూడండి* rheumatic fever. రుమాటిక్ జ్వరం. **muscular r.,** fibrositis కండరముల శోథము/'నొప్పి తీపు'.

**rheumatoid** 1. resembling rheumatism కీళ్ళవాతమును పోలిన. 2. associated with rheumatoid arthritis రుమటాయిడ్ కీళ్ళ నొప్పులతో కూడిన. 3. **r. factor,** *i.e.* antibodies ప్రతిరక్షకాలు.

**rheumatologist** specialist in rheumatology కీళ్ళవాతశాస్త్ర నిపుణుడు; కీళ్ళ మరియు వాటి కండరవ్యాధుల నిపుణుడు.

**rheumatology** the science or study of the diseases of joints and attached muscles కీళ్ళవాతశాస్త్రము; కీళ్ళ మరియు వాటి కండర వ్యాధుల శాస్త్రము.

**rhinitis** inflammation of the mucous membrane of the nose నాసికాశోథము: ముక్కులోని శ్లేష్మపొరయొక్క శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు తీపు వాపు'. **allergic r.,** *see/చూడండి* allergy. **atrophic r.,** atrophy of the nasal mucous membrane and the glands in it నాసిక శ్లేష్మపొర, దానిలోని గ్రంథుల క్షయము. **purulent r.,** associated with formation of pus చీముతో కూడుకొనియున్న వాపు.

**rhinomycosis** fungal infection of the nasal mucosa నాసిక శ్లేష్మపొరయొక్క ఫంగస్ సంపర్కము.

**rhinopathy** any disease of the nose నాసిక సుస్థి/రుగ్మత.

**rhinopharyngitis** inflammation of the nasopharynx, *resemblance* of the pain: incision with a blade; difficulty in swallowing నాసికా గ్రసనీ శ్లేష్మపొర శోథము/'నొప్పి మంట తీపు వేడి ఎరుపు వాపు'. పోలిక: అంగిలి బ్లేడ్‌తో కోసినట్లు మంట, మ్రింగడం కష్టము.

**rhinophyma** a form of rosacea (rose coloured lesion), sebaceous hyperplasia, nodular red swelling with congestion on the skin at the tip of the nose; *resemblance:* the make-up of the nose in the face of the clown/baffoon in a circus, as if a cherry or a ripe tomato is fixed over there నాసికాగ్రమున చర్మముమీద గులాబి/ఎరుపు రంగుగల క్షతము, కంతిలాంటి పెరుగుదల; అది కందిపోయి ఈ పోలికలో ఉంటుంది: సర్కస్‌లో బఫూన్ ముక్కుకు ఎర్రని దొండపండుగాని రామ్ములక్కాయ/టమాటోగాని అంటించినట్లు.

**rhinoplasty** plastic surgery of the nasal structure. నాసికనిర్మాణ మును ప్లాస్టిక్ శస్త్ర చికిత్స ద్వారా సరిదిద్దుట.

**rhinorrhagia** epistaxis, nose bleed ముక్కులోనుండి రక్తం.

**rhinorrhoea** or **rhinorrhea** 1. discharge per nose నాసికవెంబడి రసి(క). 2. **cerebrospinal fluid r.** నాసికగుండా మస్తిష్క మేరుద్రవము స్రవించుట.

**rhinosalpingitis** inflammation of the mucosa of the nose and Eustachian tube; pain in the ear aggravated by blowing the nose or sneezing నాసిక మరియు శ్రోతఃపథముయొక్క శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు తీపు వాపు'. చెవి గూబలోకి నొప్పి ప్రాకుతుంది; చీదినా, తుమ్మినా గూబ తీపు తీవ్రమవుతుంది.

**rhinoscopy** examination of the interior of the nose నాసికాంత ర్దర్శనం.

**rhinosporidiosis** a disease caused by a fungus, *Rhinosporidium* with polyps in the nose ఒక ఫంగస్ జబ్బు; నాసిక శ్లేష్మపొరలో అర్శముల/పిలకలతో కూడిన జబ్బు.

**rhinovirus** virus belonging to the genus *Rhinovirus,* causing common cold; over 100 varieties present రైనోవైరస్ అను ప్రజాతికి చెందిన జలుబు/రొంప వైరస్; 100 కు పైన రకములున్నవి.

**rhodopsin** light sensitive substance in the rods in the retina శుక్లపటలములోని శలాకలలో ఉండే కాంతి సంవేదక పదార్థము. visual purple దృష్టి ధూమ్రము/దృష్టిధూమ్రవర్ణం.

**rhonchi** [rhonchus *sing.*] sounds produced by narrowing or partial obstruction in bronchial tubes; continuous cat-mewing, rattling, gur-gur, sczaii-sczaii sounds heard, *see/చూడండి* asthma, wheeze. శ్వాసనాళికలు సన్నగిల్లినందువలన లేదా వాటిలో కొంతభాగం అడ్డుపడినందువలన కలుగు శబ్దములు: పిల్లికూతలు, గలగలధ్వని (పిల్లలు ఆడుకొను గిలకవలె), గుర్ గుర్, స్జై స్జై శబ్దములు. *resemblance:* (i) flute in the throat, (ii) hissing of a cobra in the throat పోలిక: (i) గొంతులో పిల్లనగ్రోవి, (ii) సరములో నాగుబాము బుస్సు అన్నట్లు.

**Rh system** system among the human blood groups, derived from Rhesus monkey origin మానవ రక్త గణముల వ్యవస్థలో ఒక గణము. రీసస్ (Rhesus) జాతి కోతిలో కనుగొనబడినది. About 15% Indians do not have Rh antigens in their blood and hence called Rh negative; 85% Rh positive. భారతీయులలో నూటికి 15 మందిలో Rh ప్రతిజనకాలు ఉండవు; కావున వారిని Rh నెగెటివ్ వ్యక్తులంటారు; 85% Rh పాసిటివ్. Rh negative females should be given Rh negative blood only in transfusion; if Rh positive blood is transfused, subsequent pregnancy with an Rh positive baby will result in haemolytic disease of the new born, *see/చూడండి* erythroblastosis. Rh నెగెటివ్ స్త్రీలకు Rh నెగెటివ్ రక్తమే ఎక్కించాలి; Rh పాజిటివ్ రక్తం ఎక్కిస్తే రాబోవు గర్భంలో శిశువు Rh పాజిటివ్ అయితే ఆ శిశువులో పుట్టగానే రక్తక్షీణత, కామెర్ల జబ్బు కనపడుతుంది.

**rhythm** regularity of function/action, *e.g.* a clock ticking every second లయ, తాళం, లయబద్ధమైన నాట్యము, విధి/చర్య యొక్క క్రమము, ఉదా. గడియారం ప్రతి సెకండు టిక్ అనుట. **coupled r.**, heart beats occurring in pairs, *resemblance:* train running on rails making tuk tuk... tuk tuk... tuk tuk... sounds గుండె ధ్వనులు జతలు జతలుగా, ఒక జత తరువాత మరియొక జత క్రమము, పోలిక: రైలు పోతున్నప్పుడు పట్టాల మీద/దగ్గర టకటక... టకటక... టకటక... ధ్వనులు. **gallop r.**, triple r., heart beats occurring in sequence of three's, *resemblance:* three ladies pounding rice, dhan dhan dhan..... dhan dhan dhan..... dhan dhan dhan.... sounds; gallop

of a horse క్రమరీతిలో ఒకటి తర్వాత ఒకటి వచ్చు మూడు ధ్వనులు, పోలిక: ముగ్గురు స్త్రీలు సుర్వీ సుర్వీ సుర్వీ.... సుర్వీ సుర్వీ సుర్వీ.... సుర్వీ సుర్వీ సుర్వీ.... అంటూ రోకళ్ళతో వడ్లు దంచుతున్నప్పుడు ధన్ ధన్ ధన్.... ధన్ ధన్ ధన్.... ధన్ ధన్ ధన్... ధ్వనులు; గుర్రపు దౌడులాంటి లయ.

**rib cage** chest cage, thoracic cage. వక్షీయ గూడు. cage formed by the ribs పర్శుకపంజరం: పక్క టెముకల పంజరము, అలంకార. ప్రాణాధారమైన అవయవములకు (vital organs) అనగా గుండె, ఊపిరితిత్తులకు అంతఃపురము.

**riboflavin** vitamin $B_2$ of the B complex group బి కాంప్లెక్స్‌లో విటమిన్ $B_2$.

**ribonucleic acid** RNA; present in all living cells అన్ని జీవకణాల్లో ఉన్నది. plays a role in the flow of genetic information అనువంశిక సమాచారము సంక్రమించుటలో పాల్గొంటుంది. contains information necessary for the synthesis of protein in a cell కణములోని ప్రోటీన్ సంశ్లేషణమునకు కావలసిన సమాచారము కలిగియున్నది.

**ribs** 12 pairs forming the thoracic rib cage protecting the vital organs inside పర్శుకలు, పక్కటెముకలు, ప్రక్క ఎముకలు: లోపల ప్రాణాధారమైన అవయవములను కాపాడుతూ 12 జతల ప్రక్క ఎముకలు ఛాతీ అస్థి పంజరమునకు ఆధారము, అలంకార. వక్షప్రహరి.

**rickets** 1. disease caused by deficiency of vitamin D. Exposure to sunlight helps the body in the formation of this vitamin (sun-ray vitamin). బాలాస్థిరోగము, అస్థి మార్దవరోగము: ఈ జబ్బు విటమిన్ D లోపమువలన కలుగును. సూర్యరశ్మి తాకిడి వలన ఈ విటమిన్ శరీరంలో తయారు అవుతుంది. Usually a disease of infancy and early childhood (age 2 to 5 years) characterized by distorsion of bones due to their softness, nodular enlargements at the ends of the bones, *e.g.* rickety rosary, -like a chain of beads on side of the chest ఇది 2–5 సంవత్సరముల వయస్సులో ఉన్న పిల్లలలో చూస్తుంటాము. ఎముకల మెత్తదనము మూలకంగా వంకరతిరిగి శరీరానికి వక్రత తెచ్చిపెడతాయి; ఎముకల చివర ఉబ్బుతేలి, ఉదా.

ఛాతీ ప్రక్కన జపమాలవలె అగపడుతాయి. 2. **renal r.,** caused by chronic nephritis మూత్రపిండ దీర్ఘశోథములో ఈ వ్యాధి చూస్తాము.

**Rickettsia** a genus of microorganisms ఒక ప్రజాతికి చెందిన సూక్ష్మజీవులు. 0.5$\mu$ sized bodies transmitted by lice, fleas, ticks and mites to man పేలు, తుళ్ళుపురుగులు, కొణుజులు మరియు తవుటి పురుగుల ద్వారా మనిషికి సంక్రమించును. *R. prowazekii* causes epidemic typhus టైఫస్ వ్యాధికి కారణము. *R.tsutsugamushi* causes scrub typhus.

**ridge** linear projection గట్టువలె. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **bony r.,** outward projection on the bone ఎముకమీది సన్నని గట్టు, వెలుపలికి కనపడేది. **dental r.,** elevation on the crown of a tooth పన్నుపైని బుడిపె. **healing r.,** a keloid-like linear ridge, say on a surgical incision scar ఆపరేషన్‌గాటు వెంబడి మచ్చ; మీది ఉబ్బు/ఉబుకు. *micro. str.* సూక్ష్మ.చూ. inward projection లోనికి చొచ్చుకొనుట. **rete r's,** inward projections of the epidermis into dermis seen in the vertical section of skin నిలువుకోత దృశ్యములో బాహ్య చర్మము అంతఃచర్మములోనికి చొచ్చుకొనిపోవుట.

**right anterior oblique** *abbr.* RAO position of X-ray [*opp.* left anterior oblique LAO].

**right lateral** view of X-ray కుడి ప్రక్కనుంచి ఎక్స్‌రే ఫొటో. [*opp.* left lateral].

**right side** దక్షిణ పక్ష కుడివైపు [*opp.* left side వ్యతి. వామపక్ష ఎడమవైపు].

**rigidity** 1. stiffness బిరుసు, వంగనిస్థితి. **clasp-knife r.,** in an attempt to move a joint, the limb suddenly gives way at about 90° while flexing (*resemblance:* closing the knife) or while extending (*resemblance:* opening the knife) కీలు సగం ముడిచిన తర్వాత (చాకు ముడిచినప్పుడులాగా) లేదా చాచుటకు ముందు (చాకు తెరచినప్పుడులాగా) హఠాత్తుగా సడలు తటస్థించుతుంది. **cog wheel r., lead pipe r.,** tension in a muscle which gives way in short relays while stretching, *resemblance:* while bending a lead pipe. కండరము చాపినపుడు దాని బిగ్రు/బిరుసులో చిన్న అంచెలంచెలుగా

సడలు తటస్థించుతుంది, పోలిక: సీసపుగొట్టం వంచునపుడు కలిగే అనుభూతి. 2. toughness, *e.g.* sclerotic outer layer of the eyeball దృఢత, ఉదా. దృఢస్తరము, కన్నుగుడ్డు వెలుపలి కంచుకము.

**rigor** 1. chill చలి, వణుకు. 2. rigidity బిగువు. *e.g.* **r. mortis** మరణ సంకోచము: చనిపోయిన తర్వాత శరీరం కట్టెబారిపోతుంది.

**rima** cleft/crack సందు/బీట. **r. glottidis,** cleft in the glottis కంఠబిలములో బీట. **r. oris,** the os (opening) of the mouth, ఆస్యకుహరద్వారము. **r. pudendi,** cleft between the two labia majora క్రింది పెద్దనిలువు పెదిమల మధ్యసందు.

**ring** 1. *anat.* anulus, వలయాకారంలో ఉన్న నిర్మాణం. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **Kayser - Fleischer r.,** greenish yellow pigmented ring around the cornea seen in Wilson's syndrome, hepatolenticular degeneration లివర్ క్షీణత జబ్బులో కనపడే పసుపు–ఆకుపచ్చ వర్ణకం కల వలయం శుక్లపటలం చుట్టూతా చూడ బడేది/ కనబడేది. *micro str.* సూక్ష్మ. చూ. **signet r.** ring form of the malarial parasite seen inside RBCs మలేరియా పరాన్నజీవి వలయాకారంతో ఉంగరమువలె ఎర్రరక్తకణంలో అగపడుతుంది. 2. arcus, *see/చూడండి* arcus.

**Ringer's solutions** 1. (NF) used topically for burns and wounds కాలిన క్షతములకు, గాయములకు పూతపూసేది. 2. lactated Ringer's injection and Ringer's injection for intravenous drip, as a fluid and electrolyte replenisher శరీరంలోని ద్రవము మరియు విద్యుద్వాహక లవణములశాతం సరిదిద్దుటకై సిరలోనికి సూదిమక్కలు.

**ringworm** tinea తామర, చిడుము. fungus infection of skin, circular patches with scaly crusting వృత్తములవలె గుండ్రముగా చర్మముమీద వ్యాపించి పక్కులుగట్టి పొలుసువలె అగపడును. ఇది ఫంగస్ సంపర్కమువలన సంభవించును.

**risus** laughter, grin on face నవ్వు, పండ్లికిలించు ముఖకురూపము. **r. sardonicus,** trismus sardonicus, a grinning expression on the face due to spasms of the facial muscles in tetanus, *see/చూడండి* tetanus. ధనుర్వాతము అను జబ్బులో ముఖకండరముల ఈడ్పుల వలన ముఖముయొక్క ఆకృతిలో వికృతి.

**RMO** *abbr.* resident medical officer in a hospital ఆసుపత్రిలో స్థానిక వైద్యాధికారి.

**RMP** *abbr.* registered medical practitioner వైద్య చిట్టాలో తమ పేరు నమోదై ఉన్న చికిత్సకుడు/చికిత్సకురాలు.

**Rocky Mountain spotted fever** tick-borne infection caused by *Rickettsia ricketsii*, characterised by chills, fever, confusion, rash పినుజు ద్వారా సంభవించేది, రికెట్సియా సూక్ష్మజీవుల సంక్రమణం వలన వణుకు, జ్వరం, కలవరము, దద్దుర్లు.

**rod** A. a straight structure కడ్డీ, ఒక నిలువుపాటి నిర్మాణము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **vitallum r.**, rod in between fractured segments in bone, as a permanent support దండము, బెత్తము; విరిగిన ఎముకల అంచులలో బిగించబడి శాశ్వతప్రాపుగా నిలచే కఱ్ర. B. *micro.str.* సూక్ష్మ.చూ. **olfactory r.**, modified dendrite of the olfactory neuron ఘ్రాణ న్యూరాన్‌లో తంత్రికాక్షికము. **retinal r.**, light-sensitive receptor/element of the retina శలాక: నేత్రపటలం లోని కాంతిసంవేదక గ్రాహకము, నేత్రపటలములోని సున్నితమైన మూలకము [*Cf.* cone తారత. శంకువు]. **r. shaped bacterium,** called bacillus సూక్ష్మ కఱ్రరూపంలో ఉన్న బాక్టీరియమ్ – దీనిని బాసిల్లస్ అంటారు. **r's, of Corti,** in the internal ear లోపలి చెవిలోని సూక్ష్మభాగములు.

**rods and cones** structures in the eye కన్నులోని నిర్మాణములు. *micro.str.* సూక్ష్మ.చూ. in the retina నేత్రపటలంలో శలాకలు మరియు శంకువులు.

**roentgenogram** X-ray film ఎక్స్‌రే ఫోటో.

**Roentgen rays** X-rays రాంట్జెన్ కిరణములు, X-కిరణములు.

**Roentgen** or **roentgen unit** the international unit of X- or $\gamma$-radiation ఎక్స్, లేదా గామా కిరణ విసర్జనమునకు (మోతాదుకు) అంతర్జాతీయ మానము.

**Rolando's fissure** *see/చూడండి* sulcus centralis.

**Rombergism** or **rombergism** Romberg's sign, a sign of ataxia; the patient, while standing, becomes unsteady and begins

to sway about with his eyes closed whereas he is normal with his eyes open; an information-giving question: ask him whether he can take bath without swaying రోగి నిల్చున్నప్పుడు, కళ్ళు తెరచినప్పుడు బాగానే ఉంటాడు. కాని, కళ్ళు మూసుకుంటే తూలిపోతాడు. ఈ విషయం కనుక్కొనటానికి ఒక ప్రశ్న వేయండి: అతను నిల్చొని తలస్నానం చేస్తున్నప్పుడు తూలకుండా ఉంటాడా? This is a test for the coordination of the muscles of the lower limbs. అధోంగముల కండరముల సమానాధికారమును నిరూపించు తనిఖీ. Ataxia means loss of muscular coordination. ఈ తూలుడు కండర సమానాధికారము కోల్పోయినందువలన కలుగుతుంది.

**Romberg's sign** *see/ చూడండి* Rombergism.

**root** 1. the base of an organ, say tooth, hair or nail మూలము: పన్ను, వెంట్రుక లేదా గోరుయొక్క బు/పునాది. 2. the structure from which it arises ఉద్భవించు నిర్మాణము. *eg. ఉదా.* **aortic r.**, root of the aorta which is the left ventricle బృహద్ధమని మూలము: ఎడమ జఠరిక. **anterior r.**, ventral r., anterior division of the spinal nerve కశేరునాడియొక్క ముందు/పూర్వాంత/పూర్వవిభాగము. **posterior r.**, dorsal r., posterior division of the spinal nerve కశేరునాడియొక్క వెనుక/పరాంత/పశ్చిమ విభాగము.

**rosacea** acne rosacea, acne erythematosa. a chronic disease of the skin of the nose, checks and forehead ముక్కు, బుగ్గలు మరియు నుదురు (మీద) చర్మం యొక్క దీర్ఘకాలపు వ్యాధి. lesions of erythema and hyperplasia of sebaceous glands in the region of nose, cheeks and forehead నాసిక, బుగ్గలు మరియు నుదురు మీద ఎరుపువర్ణంతో ఉన్న, తైలయుతమైన క్షతములు. **hypertrophic r.**, rhinophyma.

**rose red** *e.g.* eosin, a stain గులాబి ఎరుపు, *ఉదా.* ఇయోసిన్ అనబడు వర్ణకము.

**rosette** formation resembling a rose in LE cell phenomenon, a test in disseminated lupus erythematosus. LE కణదృగ్విషయము: ఈ జబ్బులో ఒక పరీక్ష

**roughage** in diet, say fibres, cellulose ఆహారములోని తంతువులు, సెల్యులోస్. *N.B.* It solves constipation. *గమనిక.* మలబద్ధకానికి చిటకా వైద్యము.

**rouleaux** a row of erythrocytes అరుణరక్త కణావళి: resembling a row of coins. నాణెముల వరుసవలె అమర్చబడి ఉన్న ఎర్రరక్తకణములు. **r. formation,** a pile of red blood cells arranged one over the other like figs in a string ఎర్రరక్తకణముల దొంతి, పోలిక: అత్తిపండ్ల దండ: అత్తిపండ్లు దారముతో దండ/మాలగా మధ్యలో గుచ్చబడినప్పుడున్న దృశ్యము.

**roundworm** a nematode, *see/చూడండి* ascariasis. Parasitic roundworms look like earthworms; these live in the intestine of human beings. ఎలికపాములు/నట్టలు చూడటానికి వానపాముల్లా ఉంటాయి; ఇవి మనిషి పేగులలో పరాన్నజీవులు.

**Rovsing's sign** pain at Mc Burney's point induced by applying pressure over the descending colon, in cases of appendicitis. అపెండిసైటిస్‌లో ఎడమ దిగువ కోలన్ ప్రాంతంలో అదిమిపెడితే ఎపెండిక్స్‌చోట నొప్పికలుగుట.

**rub** friction rub heard on auscultation స్టెతొస్కోప్‌తో వినే రాపిడి శబ్దం. 1. **pleural r.,** over the lungs ఛాతీమీద. 2. **pericardial r.,** over the heart గుండెమీద.

**rubefacient** an agent that reddens the skin and makes it swell చర్మాన్ని కందేటట్లు చేసే వస్తువు.

**rubella** German measles రుబెల్లా *see/చూడండి* measles.

**rubor** redness ఎరుపుదనము, కందటము. one of the cardinal signs of inflammation శోథము లేదా వాపు/కందుటలో ఎరుపుదనము ఒక ముఖ్యమైన చిహ్నము.

**rudimentary** 1. incompletely/imperfectly developed కొరతతో కూడిన నిర్మాణము. **r. cervical rib** అల్పవర్ధిత గ్రీవ పర్శుక. 2. vestigial అవశేషము.

**rugae** [ruga *sing.*] ridges or folds ముడతలు లేదా మడతలు, *e.g.* **gastric r.** అన్నాశయములోని ము/మడతలు.

**rupia** 1. ulcers of late secondary stage syphilis covered with yellowish brown crusts, *resemblance:* oyster shells కొలుకు సవాయి రెండవదశలో పచ్చనీరుకావి వర్ణంలో పక్కులు గట్టిన వ్రణములు, *పోలిక:* ఆలిచిప్పలు. 2. yaws యాస్ అనే జబ్బు. 3. **r. escharotica,** dermatitis gangrenosa infantum శిశువులలో చర్మకుళ్ళు.

**rupial** relating to rupia రుపయాకు సం.

**rupture** state of breaking or bursting పగలటం. **r. of aneurysm** ధమని ఉబ్బు పగలటం. **tubal r.** వాహిక విదారం/చీలిక. **uterine r.** గర్భాశయ చీలిక.

**rural** pertaining to countryside/villages పల్లె/గ్రామ ప్రాంతాలు. **r. dispensary** గ్రామీణ ఔషధశాల [*Cf.* urban *తారత.* నగర].

**Ryle's tube** a flexible tube inserted into the stomach through the nostril మృదువైన, వంగెడు నాళము నాసికగుండా అన్నాశయము లోనికి దోపుట/దూర్చుట. *purpose: ఉపయోగము:* 1. to withdraw fluid from the stomach ద్రవము అన్నాశయమునుండి తీయుటకు. 2. to feed the patient రోగికి పోషక పదార్థములను ఇచ్చుటకు.

# S s

**Sabin vaccine** orally administered vaccine containing live attenuated strains of poliovirus. బ్రతికి ఉన్న, లఘుతీవ్రత కలిగిన పోలియో వైరస్ గుంపులు గల ఆస్య వాక్సీన్.

**sac** saccus తిత్తి. a grape-like or pouch-like space గోణి: ద్రాక్ష పండ్లవలె లేదా సంచివలెనున్న స్థలము. *naked eye str.* ప్రత్యక్ష.చూ **amniotic s.,** *see/చూడండి* amnion. **hernial s.,** *see/ చూడండి* hernia. *micro. str.* సూక్ష్మ.చూ. **alveolar s's,** in the lung వాయుకోశగోణులు.

**saccade** any short jerky movement, especially of the eyeball కన్నుగుడ్డులో చివుక్కున ఈడ్పు. [*Cf.* nystagmus].

**saccharide** water-soluble carbohydrates, *e.g.* glucose, sucrose నీటిలో కరుగే చక్కెర పదార్థములు, ఉదా. గ్లూకోస్, సుక్రోస్.

**saccharimeter** a device for testing the concentration of sugar solutions చక్కెర ద్రావణాల్లోని గాఢత కనిపెట్టే పరికరము.

**saccharin** highly concentrated artificial sweetener with no energy/calorific value, used in diabetes. కృత్రిమ తీపివస్తువు, డయాబిటీస్‌లో వాడ్తారు.

**saccular** resembling or relating to a sac తిత్తినిబోలిన లేదా తిత్తికి సం.

**sacculated** containing saccules గోణికలు గల.

**saccule** sacculus, a little sac గోణిక.

**sacral** concerning the sacrum త్రిక, త్రికమునకు సం. **s. region** త్రికాస్థిప్రదేశము.

**sacroiliac** relating to the sacrum and ilium త్రికము మరియు శ్రోణ్యస్థికి సం. **s. strain,** one cause of low backache ఈ ప్రయాసవలన నడుము క్రింది ప్రాంతములో నొప్పి.

**sacrum** wedge shaped bone in the region of the low back forming the posterior wall of the pelvic girdle త్రికము, త్రికాస్థి,

ముడ్డి ఎముక: శ్రోణిమేఖల వెనుక కుడ్యమునందుగల త్రికోణాకారపు ఎముక.

**sadism** a perversion wherein one derives pleasure by making others sad, *e.g.* sexual gratification by inflicting pain to the partner పరపీడన కాముకత: ఇతరులను ఖిన్నపరచడంలో తను ఆనందం పొందు వక్రబుద్ధి, ఉదా. తన లైంగిక తృప్తికొరకు రతికేళిలో సహాభోగికి సంకటము కలిగించుట [*Cf.* masochism *తారత.* లైంగిక వ్యథా ప్రకోపితానందం].

**safe period** the period in the duration of menstrual cycle when conception is less likely to occur after coitus, *i.e.* about 10 days before or after menstruation సురక్షితకాలం: ఋతుక్రమంలో బహిష్టుకు 10 రోజులు ముందైనా గాని లేదా తర్వాత గాని. అప్పుడు సంభోగంచేస్తే గర్భిణి వచ్చే అవకాశం తక్కువ. *N.B.* Safe period is not reliably safe. *గమనిక:* ఈ సురక్షితకాలం నమ్మికగల/నమ్మదగిన రక్షణకాదు.

**safe sex** sexual intercourse with the male partner wearing a condom, as a prevention especially of HIV infection; also against sexually transmitted diseases (STD) లైంగిక రక్షణ: ముఖ్యముగా హెచ్.ఐ.వి. సంపర్కం గలవారితోను, లైంగిక వ్యాధిగ్రస్తులతోను (సుఖ రోగాలతో బాధపడే వారితోను) సంభోగం చేసే ముందు పురుషుడు తన అంగంమీద తొడుగు (condom) ధరించాలి.

**sagittal** median మధ్య. **s. plane,** anteroposterior or the median plane of the body సమమితార్ధ: శరీరము మధ్యన, ముక్కుకు నాభికి వెనుకగా, నిలువుగా ఉన్న సమతలము. **s. suture,** on the skull bones/cranium పుర్రె/కపాలము ఎముకల కలయిక చోటునగల సమమితార్ధ సీమంతము/కలిసేచోటు. [*in contr.* coronal *ఖిన్న.* కిరీట].

**salicylic acid** 1. It is used in the preparation of skin ointments to shave off areas of lichenification (thickening and hardening of skin); *figur.* it is called a 'chemical razor/eraser'. చర్మము మీద వాడే మలాములలో వాడ్తారు, *అలంకార.* 'రసాయనిక రేజర్'. 2. It is

also used in the manufacture of dyes, perfumes, *etc.* అద్దకాలు మరియు పరిమళ ద్రవ్యముల తయారీలోనూ వాడ్తారు. 3. Its salts are used as analgesics. దీని లవణాలు బాధానివారిణిగా వాడ్తారు.

**salicylism** toxic effects of overdosage with salicylic acid or aspirin: tinnitus, nausea, and vomiting ఏస్ప్రిన్ యొక్క విషపరిణామము: చెవులో రింగుమని మ్రోత, డోకు వచ్చినట్లుండుట, మరియు వాంతులు.

**saline** a solution of sodium chloride (common salt) and water ఉప్పగలనీరు. **normal s.,** aqueous solution of NaCl, 0.9% solution ఉప్పనీరు.

**saliva** secretion of the salivary glands లాలాజలము: లాలాజలగ్రంథులు స్రవించు ద్రవము; వాడు.భా. ఉమ్మి.

**salivary** pertaining to saliva లాలాజలమునకు సం. **s. glands,** glands which secrete saliva, *viz,* parotid, submaxillary, sublingual లాలాజలం స్రవించేగ్రంథులు, అనగా పెరోటిడ్ (చెవు ముంగిట), అధోజంభిక గ్రంథి, అధోజిహ్వాగ్రంథి.

**salivation** increased secretion of saliva లాలాజల అధిక స్రావం.

**Salk vaccine** injection of killed poliomyelitis virus మృత పోలియో వైరస్ ఇంజక్షన్.

**Salmonella** a genus of bacteria ఒక బాక్టీరియా ప్రజాతి. **S. typhi,** causative organism of typhoid fever, *see/చూడండి* enteric. టైఫాయిడ్ జ్వరమునకు కారణమైన సూక్ష్మజీవి.

**salpingectomy** surgical excision of a Fallopian tube (uterine tube) గర్భాశయనాళమును తీసివేయుట.

**salpingitis** 1. inflammation of the uterine tube అండవాహిక శోథము/'నొప్పి వేడి మంట వాపు'. 2. inflammation of the auditory tube శ్రోతఃపథముయొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**salpingo-oophorectomy** surgical excision of a uterine tube and ovary ఫాలోపియన్ నాళము మరియు అండాశయమును శస్త్రచికిత్స చేసి తొలగించుట.

**salpingo-oophoritis** inflammation of the Fallopian tube/uterine tube and ovary ఫాలోపియన్ నాళము మరియు అండాశయము యొక్క శోథము/'నొప్పి వేడి తీపు మంట వాపు'.

**salpingopharyngeal** concerning the auditory tube and pharynx శ్రోతఃపథము మరియు గొంతుకు సం.

**salpinx** a tube; specifically the uterine tube or auditory tube నాళము: విశేషించి ఫాలోపియన్ నాళము లేదా శ్రోతఃపథము.

**salt** 1. common salt ఉప్పు, లవణము. table salt NaCl వంటకాలలో వాడే ఉప్పు – షడ్రుచులలో ఒకటి. 2. iodised salt, preventive measure in regions where goitre, thyroid disease is endemic థైరాయిడ్ జబ్బు ఉన్న ప్రజలు ఎక్కువమంది గల ప్రాంతములలో అయోడిన్ కలిపిన ఉప్పు విక్రయిస్తారు. 3. *N.B.* Salt is the best, cheapest, easily available preservative, *e.g.* condiment (pickle), fish *గమనిక:* ఉప్పు అన్నిటిలోకల్లా చౌక, చెడిపోకుండ కాపాడు, సులభముగా లభించే సంరక్షకము, రక్షకసాధన, ఉదా. ఊరుగాయ, ఉప్పుచేప. *figur.* Salt is the essence of life. అలంకార. ఉప్పుకు కలదు ఉర్విలో మహిమ. 4. bile s's పైత్యరసములోని పదార్థములు.

**salve** an ointment for external application మలాం.

**sample** మచ్చు, నమూనా. 1. **urine s., blood s.** for examination మూత్రం, రక్తం పరీక్ష కిచ్చుట. 2. **random s.** *see/చూడండి* random. 3. samples given by medical representatives to doctors, printed on the pack 'physician's sample – not for sale' మెడికల్ రిప్రెసెంటేటివ్‌లు (మందుల కంపెనీలవారు) డాక్టర్లకు మందులు ఉచితంగా ఇచ్చి, ప్రయోగానుభవం తిరిగి వాళ్ళకు చెప్పమని అంటారు. మందు అట్టపెట్టె మీద 'వైద్యుని సాంపిల్ – అమ్మకానికి కాదు' అని ముద్రించి ఉంటుంది. 4. In a hospital sample of food, milk, *etc.* to be given to the patients has to be tasted and tested by the RMO (resident medical officer) and superintendent ఆసుపత్రిలో రోగులకిచ్చే ఆహారం, పాలు, మొ. ఆర్.ఎమ్.ఓ. మరియు సూపరింటెండెంటు రుచిచూసి, టెస్ట్‌చేసి, O.K. అనాలి.

**sanatorium** or **sanitarium** or **sanitorium** 1. an establishment for chronically sick people and those who are getting better

but still need rest and a lot of care దీర్ఘరోగస్తులకు మరియు బాగవుతున్నప్పటికి, ఇంకా విశ్రాంతి, పర్యవేక్షణ అవసరమైన రోగులకు నెలవు. *e.g.* TB sanatorium ఉదా. క్షయరోగులకు నెలవు. 2. a health farm, *i.e.* a place for the promotion of health ఆరోగ్యనివాసము, ఆరోగ్య కేంద్రము.

**sand** particles of rock ఇసుక, రాతి రేణువులు. **hydatid s.**, substance at the bottom of hydatid cyst, *see/చూడండి* Echinococcus. హైడాటిడ్ ఇసుక రేణువులు/మడ్డి – హైడాటిడ్ తిత్తి అడుగున చేరిన పదార్థము.

**sandalwood** *bot.* an Indian tropical tree of aromatic wood గంధపు చెక్క, చందన వృక్షము. Its paste is soothing for the skin, hence used in prickly heat. ఒళ్ళు పేలుడులో చర్మాన్ని ఉపశమింప జేస్తుంది. also, ingredient of body soaps పెయ్యి/ఒంటి సబ్బుల్లో ఉండేది.

**sanguineous** containing blood, *e.g.* as in serosanguineous discharge రక్తంతోకూడిన, ఉదా. సీరమ్ మరియు రక్తం కలసిన రసి(క).

**sanguinopurulent** presence of blood and pus, *e.g.* in an abscess ఉదా. రక్తం మరియు చీము కలిసి గూడు కట్టుకొనియున్న పుండు/చీముగడ్డ.

**sanies** a thin, blood-stained purulent discharge రసి/రసిక.

**sanitary** promoting or pertaning to the preservation of health of the people శానిటరీ: శౌచ; ప్రజారోగ్యం కాపాడుటకు తగుచర్యలు తీసుకొనే. *e.g.* **s. inspector** ఉదా. ఆరోగ్య రక్షణ అధికారి.

**sanitation** protection of public health by removing and treating waste matter (garbage), dirty water, *etc.* పరిసరాల పారిశుధ్యం, పరిశుభ్రత. **environmental s.**, a measure to avoid pollution కాలుష్య నివారణోపాయము.

**sanity** soundness of mind మానసిక స్వస్థత/ఆరోగ్యము [*opp.* insanity వ్యతి. మానసిక అస్వస్థత/అనారోగ్యము].

**Sapphism** or **sapphism** lesbianism, *see/చూడండి.* lesbianism.

**saprophyte** any organism thriving on dead or decaying matter పూతికాహారి: మృతి చెందిన లేదా కుళ్ళిపోతున్న పదార్థములను తిని బ్రతుకుతున్న జీవి.

**sarcoidosis** a disease characterized by the presence of granulomatous noncaseating tubercles in many organs సూక్ష్మ కణికగుల్మం కలిగిన, జున్నులాంటి పదార్థములేని గుళికలు/యుక్ష్మికలు పెక్కు అవయవములలో కానవచ్చుట [*in contr.* caseating tubercles occur in tuberculosis భిన్న. జున్నులాంటి పదార్థములు గల యుక్ష్మికలు క్షయవ్యాధిలో అగపడును].

**sarcolemma** the membrane over a muscle fibre కండ(ర) తంతువు పై పొర. *micro.str.* సూక్ష్మ.చూ. membrane encircling a striated muscle fibre పేశీచేలము: చారపు కండరతంతువు పై పొర.

**sarcoma** malignant tumour arising from connective tissue or epithelium బంధన కణజాలము లేదా ఉపకళనుండి ఉద్భవించే అపాయ కరమైన కంతి. **Ewing's s.**, arising from the ends of long bones, ribs, *etc.* పొడుగు ఎముక చివర్ల, ఛాతి ప్రక్క ఎముకలు, మొ. ప్రాంతాల్లో ఉద్భవించేది. **Kaposi's s.**, bluish red nodules on the skin; some viscera may be affected చర్మముమీద నీలం, ఎరుపు మిళితమైన వర్ణముగల కంతులు; కొన్ని అంతర అవయవములుకూడ ఈ జబ్బుకు గురి అవుతాయి. **soft tissue s.**, arising from muscle, fibrous tissue, fat, *etc.* కండరములు, తంతు కణజాలము, క్రొవ్వు, మొ. వానినుండి ఉద్భవించేది.

**sarcomere** part of a muscle fibre కండర తంతువులోని భాగము. *micro.str.* సూక్ష్మ.చూ. the basic contractile unit of a myofibril సూక్ష్మ కండరతంతువుయొక్క సంకోచ ప్రమాణము.

**Sarcoptes** *S. scabiei*, the mite causing scabies by burrowing into the skin చర్మము మీద గజ్జి కలిగించు తవుటి పురుగు. చర్మములో బొరియచేసుకుని దూరుతుంది. The female mite measures 0.4mm. Diagnosis is by skin scrapings and examination under microscope for adults, larvae and eggs. ఆడపురుగు 0.4mm సైజులో ఉంటుంది. పురుగులను, డింభకములను మరియు గుడ్లను సూక్ష్మదర్శినిలో చూడనగును.

**sartorius** 'tailor's muscle', flexes thigh and leg తొడ మరియు కాలును ముడిచే కండరము కాబట్టి, దీనిని దర్జీపేశి అనవచ్చును. [*q.v.* bunion].

**satellite** companion - like thing. **s. lesions,** daughter lesions around a parent lesion, *e.g.* infiltrations around a tuberculous nodule or cavity; these are visible in X-ray photograph పెద్దక్షతము చుట్టూరా పిల్లక్షతములు. ఉదా. టీ.బీ. బుడిపె లేదా శూన్యప్రదేశం (cavity) చుట్టూతా పిల్ల/పిన్న నలుసులు; ఇవి ఎక్స్‌రే ఫోటోలో కనబడుతాయి.

**saturated** unable to hold in solution any more of a substance సంతృప్త. **s. solution** సంతృప్త ద్రావణము.

**saturation** the state of having been saturated సంతృప్త స్థితి. **oxygen s.,** the amount of oxygen bound to haemoglobin in the blood ఆక్సిజన్: ఆక్సిజన్ సంతృప్తస్థితి అనగా రక్తములోని రక్తరంజక ద్రవ్యముతో మిళితమైన ఆక్సిజన్ పరిమాణము.

**satyriasis** overpowering sexual desire/urge in men పురుషులలో నిగ్రహింపనలవికాని లైంగిక వాంఛ [*Cf.* nymphomania తారత. సుదతిలో అతిరతి].

**scab** crust over a sore గాయము మీద పక్కు/చెక్కు.

**scabicide** cide=killing. an agent that kills the itch mites తవిటి పురుగులను చంపేమందు.

**scabies** *colloq.* "seven-year itch" గజ్జి, చిడుము. a contagious skin disease with intense itching caused by a mite. Often a secondary infection, say by *Staphylococci* supervenes, *see/చూడండి* Sarcoptes. *resemblance:* adding fuel to fire స్పర్శమువలన ఒకరినుండి మరియొకరికి సంక్రమించే అంటురోగము; తవిటి పురుగు ద్వారా సంక్రమించునది. తరచుగా చీము పుట్టించు సూక్ష్మజీవులు ప్రథమ జబ్బు అయిన గజ్జి మీద ఉపరిదాడి సలిపి మరింత ఘాతుకము చేస్తాయి. విపరీతమైన దురద/గోకుడు మీద 'తీపు మంట వాపు' సంకటము జాస్తి అవుతుంది, పోలిక: మూలిగే

నక్క మీద తాటికాయ పడ్డట్లు; నిప్పులో నేయివేసినట్లు; అగ్నిలో ఆజ్యము పోసినట్లు; అగ్నికి వాయువు తోడైనట్లు.

**scald** burn caused by steaming liquid బొబ్బ: సలసలకాగే ద్రవము చర్మముమీద పడినందువలన కాల్చుడు; కందుట లేదా బొబ్బ అగుట.

**scale** 1. a small flat detachable flake or cuticle, *e.g.* on a fish చిన్న, చదునైన, ఊడివచ్చే పెచ్చు లేదా పొర, ఉదా. చేపమీది పొలుసు. 2. tartar on the teeth పండ్లమీద పండ్లమధ్య/సందున గార. scaling, to remove this in layers, done by the dentist పండ్లడాక్టరు దీన్ని గీకుతారు. 3. measure పరిమాణపు గీత, కొలమానము, కొలబద్ద. 4. unit ప్రమాణము, మానము, పరిమాణము. 5. crust పక్కు, కురుపుపైన ఎండిన పక్కు/చెక్కు. 6. balance త్రాసు.

**scalp** skin over the cranium కపాలము మీది త్వచము. **s. hair** తల వెంట్రుకలు. **s. infection** తలమీది చర్మానికి క్రిమి సంక్రమణం/సంపర్కం.

**scalpel** surgeon's knife శస్త్రవైద్యుని కత్తి. used 1. in dissection of the human body in anatomy శరీరనిర్మాణ శాస్త్ర అధ్యయనములో శరీరభాగముల విచ్ఛేదన కొరకు వాడే కత్తి. 2. by surgeon during an operation శస్త్రచికిత్సలో గాటుపెట్టుటకు సర్జన్ వాడే వాడికత్తి.

**scan** an image obtained by scanning which is a procedure to examine internal organs by the technique of ultrasound అల్ట్రా సౌండ్ పద్ధతి ద్వారా లోపలి అవయవములను తనిఖీ చేసి ఫోటో తీయుట. **CAT s.**, computed axial tomography. **CT s.**, computed tomography; cross sectional cuts (displays), *resemblance:* slices of bread స్కానింగు, ప్రాంతమును అడ్డముగా విభజించు తునక ఫోటోలు, పోలిక: రొట్టెను అడ్డముగా కోసిన తునుకలు. **ventilation-perfusion s.**, **V/Q s.**, in lungs ఊపిరి తిత్తుల ప్రత్యేక పరీక్ష/శోధనము.

**scaphoid** boat shaped నావ ఆకృతిగల. **s. abdomen**, abdomen appears scaphoid in a person lying supine, when observed from a side మనిషి పరుండినపుడు పొట్టను ఒక పక్కనుంచి చూస్తే పడవ ఆకారంలో కనబడుతుంది. **s. bone**, in the wrist మణిబంధములో ఒక అస్థి.

**scapula** shoulder blade at the back of the shoulder అంస ఫలకము: బుజఫలకము, బుజాస్థి, బుజము వెనుకనుండు రెక్క ఎముక. అలంకార. పేదలకు రెక్కాడితే డొక్కాడుతుంది.

**scapulohumeral** relating to the scapula and humerus బుజాస్థికి మరియు భుజాస్థికి సం., *గమనిక:* రాజులకు భుజకీర్తులు భుజానికి హంగు, రాజుల దర్జా/ఘనత.

**scar** cicatrix మచ్చ. fibrous tissue, sign of previous injury, vaccination, *etc.* పూర్వము తగిలిన గాయము, టీకా, మొ. వాని చిహ్నమైన తంతు కణజాలము. **BCG scar,** resulting from vaccination against TB బి.సి.జి. టీకా మచ్చ.

**scarification** *e.g.* tuberculin test in TB – multipuncture test of Heaf; a drop of PPD (purified protein derivative) placed over the skin and punctures given with the instrument *ఉదా.* ట్యుబర్క్యులిన్ పరీక్ష – ఈ పనిముట్టుతో చేస్తారు.

**scarlatina** scarlet fever, a contagious disease due to Group A beta-hemolytic streptococci causing chills, high fever, sore throat, skin rash, beefy red tongue స్ట్రెప్టొకాకై అను పేరుగల సూక్ష్మ జీవులవలన కలుగు అంటు జాడ్యము: వణుకులు, చలి, తీవ్రజ్వరము, గొంతునొప్పి, శరీరంపైన సిందూరవర్ణపు దద్దుర్లు, ఎద్దు/గొడ్డు మాంసమును పోలిన నాలుక – ఇవి ఈ రోగలక్షణములు.

**scarlet fever** *see/చూడండి* scarlatina.

**scavenger cell** a phagocytic cell that removes tissue debris and pathogens కణజాల చెత్తను భక్షించి, మరియు వ్యాధి కారకులను రూపుమాపే భక్షక కణం.

**Schistosoma** blood fluke which produces schistosomiasis (bilharziasis) రక్తఫ్లూక్: ఈ పురుగుల సంపర్కము వలన ఈ వ్యాధి కలుగుతుంది.

**schizoid personality** *see/చూడండి* schizophrenia. మనో విదళిత మూర్తిమత్వము/మూర్తిమత్వ అపవ్యవస్థ.

**schizont** a stage in the development of malaria parasite మలేరియా పరాన్నజీవియొక్క జీవక్రమం(life-cycle)లో ఒక దశ.

**schizophrenia** psychiatric disorder; cleavage of the mind: Patient becomes apathetic, withdraws from outside interests, misinterprets reality, develops delusional ideas, has bizarre behaviour. మనో విదళనము: విఖండిత మానసిక వ్యాధి, మానసిక తారుమారు; ఉదాసీనత గలిగి, బాహ్యప్రపంచ అభిరుచులలో ధ్యాసతగ్గి, వాస్తవమును విమర్శిస్తూ (పోలిక: తానుపట్టిన కుందేలుకు మూడేకాళ్ళని వాదిస్తూ) ఊహా ప్రపంచంలో విహరిస్తూ, భ్రాంతిలో చిక్కుకొని, చిత్రమైన నడవడిగలిగి, వక్రబుద్ధితో వ్యవహరిస్తుంటాడు. He exhibits split personality. రోగి విదళన మూర్తిమత్వము ప్రదర్శిస్తుంటాడు.

**sciatica** neuralgic pain along the course of the sciatic nerve on buttock, the back of the thigh calf and foot, most common cause: herniation of the intervertebral lumbar disc నితంబవేదన, తుంటి నొప్పి: ఆసననరము ప్రసరణ ప్రాంతంలో అనగా పిరుదు, తుంటి/తొడ వెనుకభాగం, పిక్క, పాదంలో నాడినొప్పి; తరచు కారణము: కటి అంతర్కశేరుక చక్రిక పొడుచుకు వచ్చి నాడీమూలములను నొక్కుటవలన సంభవించేది.

**science** 1. organised knowledge శాస్త్రం. **biological s.** జీవ శాస్త్రము/విజ్ఞానము. 2. Science, a journal శాస్త్రవార్తాపత్రిక.

**scientific** connected with science or using its methods శాస్త్రీయ. **s. temperament,** scientific bent of mind శాస్త్రీయ దృక్పథం.

**scintiscan** photoscan. photographic display of the distribution in the body of an internally administered radiopharmaceutical drug రేడియో ధార్మిక ఔషధాన్ని శరీరంలో చేర్చి, దాని ప్రసరణ ఫొటోలో చూచుట.

**scintiscanner** an instrument for scintiscan సింటి స్కానుచూసే యంత్రం.

**scirrhous** hard or indurated, characteristic of malignancy రాయి వలె గట్టిపడిన, అపాయకర లక్షణము అనగా అపాయమును సూచిస్తుంది.

**scirrhus** hard గట్టిగా రాయిలా తగిలే. **s. carcinoma,** of breast స్తనముయొక్క గట్టిగా తగిలే కాన్సర్ కంతి.

**sclera** tough outermost coat of the eye ball అక్షిబాహ్యపటలము, కంటిదృఢస్తరము, కంటియొక్క శ్వేతపటలము: కన్నుగుడ్డుయొక్క వెలుపలి దృఢ కంచుకము. వాడు.భా. తెల్లగుడ్డు. **sclerocorneal junction, limbus** స్క్లీరా మరియు శుక్లపటలము కలిసేచోటు, తెల్లగుడ్డు నల్లగుడ్డు కలిసే ప్రాంతము.

**scleritis** inflammation of sclera కంటిలోని శ్వేత పటలం యొక్క ఇన్ఫ్లమేషన్.

**scleroderma** disorder of connective tissue, progressive systemic sclerosis (PSS), fibrosis and hardening of skin, oesophagus, lungs, heart, kidney. Taut skin over the face and fingers gives expressionless face and stiff fingers. బంధన కణజాలము జబ్బు: చర్మము తంతు కణజాలముతో గట్టిపడి, మ్రింగుటకు కష్టమై; ఊపిరితిత్తులు, గుండె, కిడ్నీ ఈ జబ్బుకు గురి అవుతాయి. బొమ్మవలె బిర్రు మొగము, వంగనివేళ్ళు కురూపిని చేస్తాయి. ఇక్కడ చర్మము ఎముకకు అంటిపట్టుకుని ఉంటుంది.

**scleroma** hardening of tissue, especially nodules on the nose కణజాలము గట్టిపడుట, ముఖ్యముగా నాసిక/ముక్కుమీద కంతులు.

**scleroprotein** protein forming the skeletal parts of tissues కణజాలములలోని ఎముక భాగమును తయారుచేసే ప్రోటీను.

**sclerosis** hardening of the nervous system or blood vessels గట్టిపడుట: నాడీవ్యవస్థ లేదా రక్తనాళములు గట్టిపడుట. **amyotrophic lateral s.**, motor neuron disease; upper motor neuron type of paralysis of the lower limbs (spastic paraplegia) and lower motor neuron type of paralysis in the upper limbs (wasted hands) కాళ్ళకు పక్షవాతం, చేతులు క్షీణించడం. **arterial s.**, *see/చూడండి* arteriosclerosis. ధమనుల కుడ్యము గట్టిబడుట. **arteriolar s.**, arteriolosclerosis ధమనికల కుడ్యము గట్టిబడుట. **disseminated s.**, *see/చూడండి* disseminated.

**sclerotherapy** injection of sclerosing agents into piles or varicose veins (especially oesophageal varices to stop bleeding from them) to harden/obliterate them గట్టిబరచే/మూడ్చివేసే పదార్థ

ములను అర్శమూలాలలోనికి/ఉబ్బు సిరలలోనికి ఎక్కించుట (ముఖ్యముగా అన్నవాహికలోని ఉబ్బుసిరలనుంచి వచ్చే రక్తస్రావము అరికట్టడానికి).

**sclerotic** 1. the white fibrous outer layer of the eyeball, also called sclera శ్వేతపటలం. 2. hard or firm గట్టి లేదా దృఢమైన.

**sclerous** 1. hardened or indurated గట్టిపడిన లేదా కాఠిన్యంగల. 2. *anat.* ossified or bony అస్థీకరణచెందిన లేదా ఎముకవలె.

**scolex** the head of a tapeworm బద్దెపురుగు తల.

**scoliosis** curvature of the spine/vertebral column to one side, *viz.* lateral curvature పార్శ్వగూని: వెన్ను/కశేరు దండము యొక్క వంపు – ఇది వ్యక్తికి కురూపమును కల్గిస్తుంది. *see/చూడండి* kyphoscoliosis. కశేరుదండము మరింత కురూపిగా అగపడే దృశ్యము.

**scorbutic** pertaining to scorbutus, the old name for scurvy, *see/చూడండి* scurvy. స్కర్వీకు సం.

**score** an evalution గణనం. **Apgar s.**, (in paediatrics) evaluation of a newborn infant's physical status (శిశువైద్యశాస్త్రంలో) పసికందు యొక్క శారీరక సత్తా నిర్ణయించుట.

**scotoma** blind spot due to disease of the retina చీకటిమచ్చ: నేత్రపటలము జబ్బులో కొంత ప్రాంతములో కనబడకపోవుట.

**scratch** irritation of skin గోకు, రక్కు. **severe s.** బరుకు.

**screening** fluoroscopy, more informative than routine X-ray film in certain situations, *see/చూడండి* fluoroscopy. స్క్రీనింగ్: ఒక విధమైన ఎక్స్‌రే పరీక్ష.

**scrofula** "king's evil" (1500-1700 A.D.) tuberculosis of the cervical lymph nodes; cheesy necrosis occurs in these nodes and sinuses form on the side of neck, a disgusting sight; seen more in children and young adults క్షయ/రాజయక్ష్మ వలన మెడపైనున్న లింఫ్ గ్రంథులు పెరుగుట. వీటిని కంఠమాల అంటారు. ఇవి పెరిగి పెద్దవై, వాటిలోని మాంసము జున్నులాంటి పదార్థముగా మారి, మెడమీద కోటరములు (sinuses) పడుతాయి. చూడటానికి రోత కల్గిస్తుంది. ఈ దృశ్యం ముఖ్యముగా పిల్లలు, యువతలో/వయోజనుల్లో కానవస్తుంటుంది.

**scrofuloderma** tuberculosis of the skin చర్మమునకు టి.బి. 1. the process of scrofula invading into the skin క్షయ లింఫ్ గ్రంథి మాంసము చర్మమును తొలిచివేసి బయటకు విసర్జింపబడినప్పుడు చర్మము ఈ వ్యాధికి గురి అవుతుంది. 2. the skin may be affected through haematogenous route also చర్మము రక్తముద్వారా కూడ బాసిల్లై సరఫరాకు గురికావచ్చును.

**scrotum** the skin bag containing the testes వృషణకోశము, వృషణముల తిత్తి/సంచి. *N.B.* Scrotum is the annexe of the abdomen; the disease in one is reflected in the other. *గమనిక:* వృషణముల తిత్తి ఉదరమునకు అనుబంధము వంటిది; ఒక దానిలో జబ్బు మరియొక దానిలో ప్రతిబింబితమగును. Hence the examination of abdomen is not complete without the examination of scrotum. కావున రెండు ప్రాంతాలు ఒకేకాలంలో తప్పక పరీక్షచేయవలెను.

**scrub** తోము, రుద్దు. surgeon scrubs his hands with soap and water before an operation శస్త్రచికిత్స చేసేముందు సర్జను అపరేషన్ థియేటర్‌లోని శౌచాలయం/పరిశుభ్రత గదిలో తన చేతులు సబ్బు మరియు నీటితో ప్రక్షాళనము చేసుకుంటాడు. అలంకార. తరువాత autoclave చేసిన గుడ్డలు ధరించి, మడి కట్టుకుని అపరేషన్‌కు సిద్ధమవుతాడు.

**scumbag** a condom, *see/చూడండి.* nirodh. తొడుగు, ముఖ్యంగా పురుషాంగం మీద.

**scurf** dandruff, *see/చూడండి* dandruff.

**scurvy** a disease caused by deficiency of vitamin C marked by anaemia, spongy bleeding gums, mucocutaneous bruising/haemorrhages. Rich source of vitamin C is lemon, *Phyllanthus, etc.* విటమిన్ సి లోపమువలన కలుగు జబ్బు. ఇందులో లక్షణములు: రక్తహీనత, చిగుళ్ళనుండి తేలికగా రక్తముకారుట, శ్లేష్మపొరల్లోను మరియు చర్మములోను రక్తదద్దుర్లు. నిమ్మకాయ/పండు, ఉసిరికాయ, మొ. పుల్లని పదార్థాల్లో విటమిన్ సి పుష్కలంగా ఉంది.

**scybala** [scybalum *sing.*] hard faecal masses in constipation మలబద్ధకములో గట్టి రాళ్ళలాగా విరేచనం ఉండలు. మలవిసర్జనంలో

ముక్కితేగాని ఇవి పురీషనాళంనుండి బయటపడవు. అలంకార. ప్రతి మలవిసర్జన ప్రసవవేదనే.

**seal** a decorative adhesive label or stamp. 1. tuberculosis seal – TB seal sale campaign క్షయవ్యాధి గుర్తు/చిహ్నము/స్టాంప్ – విక్రయ ప్రచారము. 2. leprosy seal కుష్ఠువ్యాధి సీల్.

**sebaceous** refers to sebum, *see/చూడండి* sebum. **s. glands** చర్మవసాగ్రంథులు, చర్మచమురు గ్రంథులు, తైలగ్రంథులు, రోమ కూపములు, త్వక్ స్నేహోత్పాదక గ్రంథులు. 1. pertaining to sebum సీబమ్‌కు సం. 2. secreting sebum సీబమ్ స్రవించు. **s. cyst,** cyst containing sebaceous material సీబమ్ పదార్థముగల తిత్తి. It has a punctum through which the material can be squeezed out. తిత్తిలోని పదార్థము తిత్తి కుడ్యములోనున్న రంధ్రకము/బెజ్జము ద్వారా పిండవచ్చును.

**seborrhoea** or **seborrhea** 1. increased secretion of sebum హెచ్చు/అమిత సీబమ్ స్రావము. greasy face జిడ్డు ముఖము, *గమనిక:* అలంకార. ఈ చమురుతో ముక్కు మెరుస్తూ ఉంటుంది. 2. seborrheic scaly dermatitis దీనివలన చర్మము యొక్క 'బంక దురద గోకుడు పొలుసులు' ఉంటాయి.

**sebum** composed of fat and products of epithelial decay సీబమ్: కొవ్వు మరియు ఉపకళ క్షయము కలిసిన మిశ్రమము.

**secondary** రెండో, ఉపరి. **s. deposits,** secondaries. the implantation of malignant cells (cancer cells) in regions other than the primary అపాయపు కణములు (కాన్సరు కణములు) వేరే ప్రాంతాల్లో నాటబడుట. **s. hypertension,** elevated blood pressure in renal, endocrine diseases హై బి.పి. జబ్బు మూత్రపిండ సం. వ్యాధుల్లోను, వినాళగ్రంథి వ్యాధుల్లోను చూస్తుంటాము. **s. infection,** in infection by another microorganism (secondary invader) in an already existing infection సంక్రమణ వ్యాధిలో ఉపరిసంక్రమణం. **s. teeth** or **s. dentition,** permanent teeth చిన్నపిల్లలలో పాలపళ్ళు ఊడిన తర్వాత శాశ్వతంగా వచ్చే పళ్ళు.

**secondary sexual characteristics** features that distinguish males from females, like the development of beard in males and breasts in females గౌణలైంగిక లక్షణములు: మగవారికి ఆడవాళ్ళకు ఉన్న భేదం తెలియపరచే లక్షణాలు అనగా పురుషులలో గడ్డాలు మీసాలు రావడం, స్త్రీలలో స్తనములు పెరగటం [*in contr.* primary sexual characteristics *భిన్న.* స్వాభావిక (పుట్టుకతో ఉన్న) లైంగిక అవయవములు].

**secreta** products of secretion స్రావములు, స్రావిత పదార్థములు [*Cf.* excreta *తారత.* విసర్జితపదార్థములు].

**secretin** a hormone produced in the duodenum and jejunum; it stimulates the pancreas and liver ఆంత్రమూలము మరియు మధ్యాంత్రములో స్రవించిన హార్మోన్. క్లోమమును మరియు కాలేయమును ఉద్దీపింపజేస్తుంది.

**secretion** secreted fluid గ్రంథిజనిత స్రావము, ఊట. *N.B.* secretion, *e.g.* saliva useful for the body; excretion, *e.g.* urine useless for the body *గమనిక:* స్రావము, *ఉదా.* లాలాజలము శరీరమునకు ఉపయోగము; విసర్జనపదార్థం, *ఉదా.* మూత్రము శరీరమునకు నిరుపయోగము [*Cf.* excretion *తారత.* విసర్జనము].

**section** కోత, విభాగం. 1. procedure of cutting, **Caesarean s.,** operation to deliver the baby శస్త్రచికిత్స; సిజరు శస్త్రచికిత్స – శిశువును వెలుపలికి తీయుటకు తల్లి గర్భములో శస్త్రచికిత్స జరుపుట. 2. to cut a slice of a biopsy bit బయాప్సీచేసిన ఒకతునకను కోయుట. **frozen s.,** making sections of frozen tissue by microtome ఫ్రిజ్ లోపలి చలిలో గడ్డగా చేసిన కణజాలమును సూక్ష్మబద్దలుగా కోయుట. 3. to understand the internal structure of any part and make a diagram: ఏదైనా భాగంయొక్క అంతర్ నిర్మాణ పరిశీలనలో: transverse section అడ్డకోత vertical section నిలువు కోత.

**sedation** achievement of calmness *e.g.* by a drug, *Calmpose,* that means calm + pose – tranquil attitude/state శమనము కలుగజేయు.

**sedative** a drug that has a calming effect శమనకారి, ఉపశమనం కొరకు ఔషధం.

**sedentary** 1. of inactive habits మాంద్యముతో కూడిన అలవాట్లు. 2. working for a long time in a sitting posture, *e.g.* clerk స్థానబద్ధ: ఎక్కువకాలము కూర్చుని పనిచేసేవారు, ఉదా. గుమాస్తా.

**sediment** matter which settles to the bottom in a liquid మడ్డి: అడుగునకు పేరుకొను పదార్థం.

**sedimentation** matter settling to the bottom అడుగున చేరుట. **erythrocyte sedimentation rate** *abbr.* ESR ఒకరకమైన రక్తపరీక్ష.

**seed** 1. source, origin బీజము, విత్తనము. 2. semen శుక్రము. 3. to inoculate a culture medium with microorganisms సంవర్ధన ఆహారము (culture medium) లో సూక్ష్మజీవులను నాటుట. 4. 's-lot'/seed-lot system, say in the production of BCG vaccine బి.సి.జి. టీకా తయారుచేయుటలో నిపుణత.

**segment** part తునక, ఖండము. **bronchopulmonary s.**, sub divisions of the lobe, say of a lung ఊపిరితిత్తిలోని లంబికలోని తునకలు. **spinal s's, s's of spinal cord**, region in the spinal cord of 31 pairs of nerve attachment వెన్నుపాములో 31 నాడీజతలకు 31 తునక ప్రాంతములు. **ST s.**, in ECG, electrocardiogram విద్యుత్ హృదయరేఖా పటములోని వివరణ.

**segmentation** 1. clevage pattern ఖండీభవనము; విడబడు విధము/నమూనా. 2. **s. contractions**, ring like contractions in small bowel motility చిన్నపేగు చలనములో పేగుచుట్టూ వర్తుల సంకోచములు.

**segregation** separation వేరుచేయుటం, *see/చూడండి* quarantine.

**seizure** fit మూర్ఛ. sudden attack/recurrence of a disease, *e.g.* epilepsy హఠాత్తుగా సంక్రమించు/మరల మరల వచ్చు మూర్ఛలు, ఉదా. అపస్మారము. **generalised tonic-clonic s.**, *see/చూడండి* epilepsy.

**self-limited** relieved automatically దానంతట అదే తగ్గేది. **s. disease,** *e.g.* common cold; A treated cold lasts for one week, an untreated cold lasts for seven days – thus it has a self-limited course. జలుబుకు మందిస్తే వారంరోజుల్లోను, ఇవ్వకపోతే

ఏడురోజుల్లోను తగ్గుతుంది – మొత్తంమీద దానంతట అదే తగ్గే జబ్బు.

**sella** a saddle-shaped depression పల్యాయనము, గుర్రపుజీను పల్లము. **s. turcica,** such a depression in the centre of skull which lodges the pituitary gland, *see/చూడండి* suprasellar. కపాలము మధ్యలోపల నున్న పల్లము – పిట్యూటరి గ్రంథికి నెలవు. *resemblance: [Latin sella=seat turcicus* Turkish]. Turkish saddle *పోలిక:* టర్కీ దేశంలో వాడే పల్యాణము/గుర్రపుజీను.

**semen** sperm, seminal fluid ejaculated in the male; it contains spermatozoa, *see/చూడండి* seminal. శుక్రము, వీర్యం, ధాతువు, రేతస్సు, ఇంద్రియము, తెలుపు, శుక్లం: పురుషాంగమునుండి స్ఖలనమగు శుక్రద్రవము; ఇందులో పురుషబీజకణములుంటాయి.

**semicircular canals** three in each internal ear, each 0.8 mm in diameter, *see/ చూడండి* ear. లోపలి చెవిలో మూడు అర్ధవర్తులాకార కుల్యలు.

**semicoma** semiconscious state from which he may be aroused మైకము: అసంపూర్ణ స్మృతి రాహిత్యం, పాక్షికముగా స్మృహతప్పుట – ఈ స్థితినుండి అతనిని మేలుకొలుపవచ్చును.

**semilunar** shaped like a half moon అర్ధచంద్రాకృతిగల/అర్ధచంద్రాకార. **s.cartilages,** in knee మోకాలులో మృదులాస్థులు. **s.valves,** valves with two cusps, aortic and pulmonary ద్విపత్రకవాటము, అర్ధచంద్రాకృతి గలిగి రెండు మొనలతో కూడిన కవాటములు – ఒకటి బృహద్ధమనిలోను ఇంకొకటి పుపుస ధమనిలోను ఉంటాయి.

**seminal** pertaining to semen శుక్రమునకు సం. **s. vesicle,** two pouches situated behind the urinary bladder in the male, which secrete fluid and fructose. The semen contains sperms and the secretions of the seminal vesicles, prostate, *see/చూడండి* semen. శుక్రాశయము: పురుషులలో మూత్రాశయము వెనుకనున్న రెండు సంచులు. శుక్రములో వీటి స్రావము, వీర్యకణములు, పౌరుషగ్రంథి స్రావము మిళితమై ఉంటాయి.

**seminiferous tubules,** *micro. str.* సూక్ష్మ.చూ. the spermatozoa are formed along the walls of the loops of convoluted seminiferous tubules in the testes, 150 to 250$\mu$ in diameter and 30 to 70 cms long and travel through them వృషణములలో మెలికలు తిరిగిన శుక్రోత్పాదక నాళికల కుడ్యములలో పురుష బీజకణాలు ఉత్పత్తి అవుతాయి.

**seminoma** a malignant neoplasm of the testis which is radio-sensitive, *see/చూడండి* radiosensitivity. వృషణములలో అపాయకరమైన కంతి – కిరణప్రభావమునకు లొంగుతుంది.

**seminuria** discharge of seminal fluid in urine. People attribute it to losing vitality; coming for consultation on a background of self pity. ధాతువు/తెలుపు/వీర్యము పోతున్నదని డాక్టరు దగ్గరకు వచ్చి తమమీద తమకు కనికరము కలిగించుకొనే సంఘటనములు కద్దు; వీర్యముపోయినందున వారి శక్తి క్షీణిస్తున్నదని అపోహ.

**semipermeable membrane** membrane which is permeable to some substances in solutions, but not to others విచక్షణాస్తరము: అర్ధప్రవేశ్య(శీల)పొర, అర్ధపారగమ్య త్వచము, పాక్షిక ప్రవేశ్యపొర, పాక్షిక పారగమ్య త్వచము.

**senescence** aging processes coming into play; the process of growing old వార్ధక్యదశ, వయస్సు ముదరడం, వృద్ధాప్యంలోకి రావడం; జీర్ణావస్థ, ముసలితనం, ముదుసలికావడం. *figur.* becoming grand, *viz.* grand parent, grand mother or grand father అలంకార. కాలంతో ఊరగాయకు రుచివచ్చినట్లు, తాతయ్య, నాయనమ్మ, అమ్మమ్మ అయినప్పుడు వయస్సుతో/వృద్ధాప్యంతో పాటు వ్యామోహం/లంపటం పెరగడం/జాస్తి అవటం కద్దు.

**senile** relating to old age వృద్ధాప్యమునకు సం. **s. psychosis,** non acclimatization to aging problems జరాజన్యమనోవిక్షిప్తి: వృద్ధాప్య సమస్యలకు అలవాటు పడటంలో ఘర్షణము వెలిబుచ్చుట, వాడు.భా. ముసలి/వృద్ధాప్య చాదస్తం.

**senility** the physical and mental changes / deterioration / degeneracy consequent on aging వయసు ముదిరేటప్పుడు కలిగే

పరిణామములు/దిగజారుట/క్షీణత. **physical:** hair becoming grey, bags beneath the lower eyelids, wrinkling of the face and neck muscles, sagging skin, unwanted obesity, waddling gait, osteoarthritic joints (especially knees), retarded reflexes, slowness of action, teeth becoming loose, diminishing vision and/or hearing which makes life less enjoyable, loss of memory of recent events, introversion into the attitude – 'one foot in the grave', no delight in eating, since edentulous (with a toothless mouth)! శారీరక: జుట్టు నెరసి పోవుట (ముసలితనం సూచన, అలంకార. ముసలితనంలో ముగ్గుబుట్ట), కన్నుల దిగువ రెప్పలక్రింద వాపు, ముఖము మరియు మెడ కండరములు ముడుచుకొని చర్మము ముడతలు పడటం, త్వచము సడలటం, పనికిరాని ఒళ్ళు/కొవ్వు, బాతునడక, కీళ్ళ శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు' (ముఖ్యముగా మోకాళ్ళ కీళ్ళు మనిషికి లొంగకపోవటం), ప్రతీకారచర్య మాంద్యము, చురుకుదనము తగ్గిన చలనము, పళ్ళు సడలటం, నేత్ర మరియు/లేదా శ్రోత్ర ఆనందానుభూతి క్షీణించుట, ఇటీవలి ఘట్టముల జ్ఞాపకము తప్పుట (ఉదయం నాష్టాలో ఏ వంటకము తిన్నది జ్ఞాపకముండదుగాని చిన్నప్పుడు బట్టీ/కంఠతా పెట్టిన వేమనపద్యాలు జ్ఞాపకముంటాయి), 'కాటికి కాళ్ళు జాచుకు కూర్చున్నా' నని వైరాగ్య విలక్షణము అస్తమానం ప్రకటించుట, పళ్ళుండవు పాపం, పొట్టకు తినాలంటే! **mental:** anxiety, frustration, developing an attitude of 'social unwantedness', senile psychosis, helplessness; rejuvenating advice to them: Enjoy mirth in this birth. మానసిక: ఆదుర్దా/ఆందోళన, కుంఠనము (frustration) అనగా కార్యములో భంగము/నిష్ఫలీకరణము పొందుట, 'నావలన ఇంకొకరికి ఏమి ఉపయోగము – నన్ను ఎవరూ పట్టించుకోరు' అను అపోహ, వృద్ధాప్యములో సంభవించు మనస్తాపము, చేతకానితనము; వారి ఆశలు చిగురించే బోధన: ఉల్లాసంకోసం ఉబలాటపడు.

**senna** dried leaves of *Cassia* used as a cathartic సునాముఖి: దీని కషాయము విరేచనకారి.

**sensation** feeling ఇంద్రియజ్ఞానము, సంవేదన. **subjective s.,** one perceptible to the subject himself వ్యక్తికి తనకే అనుభవగోచరమైన.

**sense** ability to perceive గ్రహించే శక్తి. **s. organs** జ్ఞానేంద్రియాలు, జ్ఞానేంద్రియ పంచకము sound, touch, sight, taste and smell శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు. **clinical s.**, knowledge about diagnosis, treatment, *etc.* వ్యాధి నిర్ణయం, చికిత్స, మొ. అంశముల జ్ఞానం. **muscle s.**, movement, stretch of muscles కండరముల చలనము, సాగుట. **pain s.**, ability to perceive pain వేదన గ్రహించు శక్తి. **temperature s.**, ability to assess the degree of temperature శీతోష్ణ పరిమితి తెలుసుకొనే జ్ఞానము.

**sensibility** ability to feel ఇంద్రియ గోచరత.

**sensitiveness** tender feeling సున్నితము.

**sensitivity** 1. the state of being sensitive సంవేదన శీలత, శీఘ్రగ్రాహియైన స్థితి, సూక్ష్మగ్రాహ్యత, సూక్ష్మగ్రహీతము, సుగ్రహీతము. 2. **drug s.**, (susceptibility is a better word) amenable to that drug ఆ ఔషధమునకు లొంగెడు [*in contr.* resistant భిన్న. లొంగని].

**sensitization** of tissues: exposure to allergen produces development of hypersensitivity, *see/చూడండి* allergy. సంవేద్యీకరణము. The allergen may be food (*e.g.* shell fish, prawns), bacteria, plants (*e.g. Stizolobium pruriens*), chemical substances, drugs (*e.g.* sulphonamides), sera, vaccines, *etc.* ఎలర్జెన్: ఆహారపదార్థము (ఉదా. గుల్లలోనుండు జలచరము, రొయ్యలు); బాక్టీరియా, మొక్కలు (ఉదా. దురదగొండి, వాడు.భా. దురదగుంట); రసాయనిక పదార్థములు, ఔషధములు (ఉదా. సల్ఫొనమైడ్‌లు); రసి(క)గల పదార్థములు, టీకామందులు, మొ.

**sensorium** level of consciousness or mental activity – this is crucial in the assessment of the prognosis in head injury స్మృతి/స్పృహ, మెలకువ లేదా మానసిక చురుకుదనము – ఇది తరచుగా కపాలగాయములో రోగి పరిస్థితి అంచనా వేయడంలో కీలక సూచననిస్తుంది.

**sensory** pertaining to the senses సంవేదన, జ్ఞాన. **s. area**, in the cerebral hemisphere మస్తిష్క వల్కలంలో జ్ఞానేంద్రియ స్థానము. **s. nerve**, *see/చూడండి* nerve. జ్ఞాననాడి.

**sentinel** కావలివాడు. **s. pile,** thickened mucous membrane in a chronic fissure of the anus. దీర్ఘకాలపు గుదవిదారంలో లావుపాటి శ్లేష్మపొర. అలంకార. ఇది ఆసన ద్వారమునకు కాపలా.

**sepsis** presence of pathogenic microorganisms or their toxins in tissues/blood పూతిదోషము, క్రిమిజన్య విషదోషము: కణజాలముల/రక్తంలో వ్యాధిజనక సూక్ష్మజీవులుగాని, వాటి విషపదార్థములుగాని ఉండుట.

**septic** 1. denoting sepsis పూతిక, సెప్సిస్ సూచించు. కణజాల/రక్తగత విషదోష. 2. **s. tank** కలుషజల తటాకము. 3. **s. wound** పూతిగాయం.

**septicaemia** or **septicemia** blood poisoning రక్తంలో విషపదార్థములుండుట. presence of pathogenic microorganisms or their toxins in the blood రక్తంలో పూతిదోషము: రక్తంలో వ్యాధిజనక సూక్ష్మజీవులుగాని, వాటి విషపదార్థములుగాని ఉండుట.

**septum** [septa *pl.*] partition విభాజకము. **interatrial s.,** between the two atria of the heart గుండెలో రెండు ఏట్రియమ్‌ల మధ్యన గల విభజనము. **interventricular s.,** between the two ventricles of the heart గుండెలో రెండు జఠరికల మధ్యనున్న విభాజకము. **nasal s.,** the partition between the two nasal cavities రెండు ముక్కు కుహరముల మధ్యనున్న గోడ.

**sequela** [sequelae *pl.*] 1. sequel, morbid after-event in a disease వ్యాధి తుదకు/కడకు మిగులు సంభవము. 2. pathological consequence of a disease, *e.g.* brain damage secondary to encephalitis called post-encephalitic sequelae వ్యాధిగ్రస్త పరిణామము, ఉదా. మెదడువాపు వ్యాధిలో మెదడుకు హాని/నష్టం.

**sequestration** 1. the formation of a sequestrum (dead bone) మృతఎముక కణజాలము యొక్క గూడు. 2. **lung s.,** portion of lung supplied by an aberrant artery/arteries arising from the aorta బృహద్ధమని నుండి ధమని శాఖ/శాఖలు ఊపిరితిత్తిలో కొంతభాగమునకు వక్రతీరులో/వక్రగతిగా (అసాధారణముగా) రక్తము సరఫరాచేయుట.

**sequestrum** a piece of necrosed, dead bone separating off from the healthy bone, especially seen in osteomyelitis, *see/చూడండి*

osteomyelitis. This sequestrum is removed surgically. చచ్చిన/కుళ్ళిన ఎముక, ఎముక నాశము; మృతిచెంది తతిమ్మా సజీవ ఎముకనుండి విడిపోవుట. ఈ విడిపోయిన ముక్కను శస్త్రచికిత్సద్వారా తొలగిస్తారు.

**serofibrinous exudate,** contains serum and fibrin సీరమ్ మరియు ఫైబ్రిన్ మిశితమైన రసికస్రావము.

**serology** the knowledge about antigen-antibody reactions in *vitro* రసి(క)విజ్ఞానము: శరీరమునకు బహిర్గతంగా జరుగు ప్రతిజనక - ప్రతిరక్షక ప్రక్రియలకు సం. శాస్త్రము/జ్ఞానము.

**seronegative** deficiency of antibodies ప్రతిరక్షకాల కొరత.

**seropositive** high level of antibodies ప్రతిరక్షకాల సమృద్ధి.

**seropurulent** containing serum and pus సీరమ్ మరియు చీము మిశ్రితమైన.

**serosa** 1. any serous membrane, *e.g.* tunica vaginalis testis covering the testis and epididymis సీరస్ పొర, ఉదా. వృషణము మరియు ఎపిడిడైమిస్ చుట్టూ ఉన్న పొర. 2. peritoneal covering of the abdominal viscera ఉదరాంత్ర వేష్టనము. 3. the chorion పరాయువు.

**serosanguineous** containing serum and blood సీరమ్ మరియు రక్తం మిశితమైన.

**serositis** inflammation of a serous membrane, *see/చూడండి* polyserositis. సీరస్ పొరయొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు వాపు'.

**serotonin** hormone, neurotransmitter, 5 hydroxy tryptamine (5-HT) – stimulates smooth muscle and produces vasoconstriction నాడీప్రసార హోర్మోన్; అనియంత్రిత నునుపు కండరాలను ఉద్దీపింపజేసి, రక్తనాళికల కుంచనము కలిగించును.

**serous** 1. pertaining to serum సీరమ్‌కు సం. 2. containing serum సీరమ్‌తో కూడిన. **s. membrane,** *see/చూడండి* serosa.

**serpiginous** denoting an ulcer or a cutaneous lesion with a wavy border తరంగములవలె అంచుగల వ్రణం లేదా చర్మపు క్షతము.

**serrate** or **serrated** toothed, dentate, *resemblance:* teeth of a saw పోలిక: అంపము మీద గాట్లను పోలిన. **s. margin** అటువంటి బార్డరుగల.

**serum** 1. the clear portion in a liquid separated from solid elements సీరమ్, రక్తరసి: ద్రవములో ఘనపదార్థములనుండి వేరుచేయ బడిన నిర్మల తేటభాగము. 2. **blood s.,** blood minus clot; the clear liquid in blood when it is allowed to clot రక్తము స్కందము/గడ్డకట్టుట కొరకై నిలువచేయగా పైనతేలే నిర్మలభాగము. **antitoxic s.** విషనిరోధక రసి. **s. sickness,** rash, pyrexia, joint pains after the administration of serum రసి ఇంజెక్షన్ల తర్వాత వచ్చే దద్దుర్లు, జ్వరం, కీళ్లనొప్పులు.

**serum hepatits** also called hepatitis B, *see/చూడండి* hepatitis B.

**service** helping or doing work for an individual or community సేవ. *గమనిక:* బాధితుల సేవ భగవంతుని సేవ. **domiciliary treatment s.,** *abbr.* DTS. These centres are especially popular in the field of TB. గృహసేవ: టి.బి. డామిసిలియరి సెంటర్, ముఖ్యముగా క్షయరోగ చికిత్స కృషిలో. **social s.** సంఘసేవ.

**sesamoid** resembling sesame seeds నువ్వుల ఆకారంలోనున్న. **s. bones,** small, flat, round bones between phalanges or between digits and metacarpals or metatarsals, *resemblance:* seeds తిలాకార అస్థులు; చిన్న, పలుచని, గుండ్రపు ఎముకలు – ఇవి అంగుళ్యాస్థులమధ్యను, అంగుళ్యాస్థి కరభాస్థికల మధ్యను లేదా అంగుళ్యాస్థి ప్రపాదాస్థికల మధ్యను అమర్చబడి ఉంటాయి, పోలిక: విత్తనములు/గింజలు.

**sessile** non-pedunculated, held by a broad base, *e.g.* **s. tumor** వృంతరహితము: వెడల్పాటి ఆధారముగల, ఉదా. వెడల్పు పీఠమునుంచి ఉద్భవించిన [*opp.* pedunculated or stalked వ్యతి. వృంత సహితము].

**sex** 1. male or female లింగము. 2. a biological urge, instinct జీవప్రేరణ, జీవ ఉత్సుకము. **chromosomal s.,** XX female genotype

XX స్త్రీ జన్యురూపము; XY male genotype XY పురుష జన్యురూపము. **gonadal s.,** ovary in female, testis in male స్త్రీలలో అండాశయము, పురుషులలో వృషణము.

**sex bomb** *colloq:* a person, especially a female, with much sex appeal కొక్కోక కౌముది.

**sex change** 1. male developing into female and vice versa; may occur in certain tumours, hormone diseases, *see/చూడండి* hirsutism, virilism. పురుషుడు స్త్రీగా మారటం, స్త్రీ పురుషుడుగా మారటం – ఈ విడ్డూరం కొన్ని అవయవముల కంతులలోను, హార్మోన్లకు సం. జబ్బుల్లోను చూస్తూ ఉంటాము. 2. seen in surgical operation or re-forming of sex organs లైంగిక అవయవముల మీద అపరేషన్లలోగాని లేదా లైంగిక అవయవముల మార్పిడిలోగాని జరగవచ్చును. 3. complication of hormone treatment హార్మోన్లతో చికిత్స యొక్క అవలక్షణం.

**sex-linked** transmitted by a gene located on the X chromosome X క్రోమోసోమ్ మీద ఉన్న జన్యువు ద్వారా ప్రసారమయ్యే. **s. characteristic** లింగ సంబంధ విశిష్ట లక్షణము.

**sexual abuse** *see/చూడండి* rape.

**shaft** a long bar పొడవైనకర్ర, కాండము. **s. of a bone,** the rod like stalk in a bone, *e.g.* shaft of the femur ఎముకలో పొడుగాటి కాడలాంటి భాగము, ఉదా. తుంటి/తొడ ఎముకలో బోదెలాంటి భాగము.

**shaken baby syndrome** shaking a baby too violently can cause death due to bleeding, say in the brain శిశువులో అతిమొరటుగా కుదుపు కల్గిస్తే, ఉదా. చక్కిలిగింతలు పెట్టడం, పైకి కిందికి విసరటం, మెదడులో రక్తనాళములు పగిలి మరణం సంభవించుట [*q.v.* battered baby syndrome and battered child syndrome].

**sheath** tubular encasing membrane తొడుగు, ఆచ్ఛాదనము, వర్మము: గొట్టము/కంచుకము వలె అంటిపెట్టుకునియుండు పొర. *naked eye str.* ప్రత్యక్షచూ. **carotid s.,** sheath around the carotid artery, the internal jugular vein and the vagus కారోట ధమని, అంతరగళసిర

మరియు వేగసనాడి చుట్టూ ఉన్న తొడుగు. **femoral s.,** the fascia around the femoral vessels ఊరువునాళముల చుట్టూపొర. **tendon s.,** sheath over a tendon స్నాయు బంధనము మీదిపొర. *micro.str.* సూక్ష్మ.చూ. **myelin s.,** the sheath surrounding the axon of myelinated nerve cells మయలిన్ అచ్ఛాదనము: మయలిన్‌గల నాడీకణములయొక్క తంత్రికాక్షము చుట్టూ ఉన్న తొడుగు.

**Shigella** genus of microorganisms causing dysentery చీము రక్తం విరేచనాలు కలుగజేసే సూక్ష్మజీవుల ప్రజాతి.

**shigellosis** infection with *Shigella;* bacillary dysentery షిగెల్లా వలన కలుగు చీమురక్తం బేదులు [*in contr.* amoebic dysentery భిన్న. అమీబా వలన కలుగు జిగట విరేచనములు].

**shin** anterior border of the tibia or the leg అంతర్జంఘిక/కాలు యొక్క ముందు అంచు. **saber s.,** (tibia) seen in congenital syphilis పుట్టుకతో వచ్చిన కొఱుకు సవాయి వ్యాధిలో ఖడ్గమును పోలిన అంతర్జంఘాస్థి.

**shingles** herpes zoster; *see/చూడండి* herpes. హెర్పిస్ జాస్టర్ అను వైరస్ జబ్బు.

**shock** 1. sudden disturbance of mental equanimity హఠాత్తుగా మనస్సు నిబ్బరము తప్పుట, అదరు. 2. failure of the circulatory system to maintain adequate perfusion of blood to vital organs (అ)ఘాతము: ప్రాణాధారమైన, జీవితానికి అవశ్యకమైన అవయవము లకు చాలినంత రక్త సరఫరా చేయుటకు రక్తప్రసరణవ్యవస్థయొక్క చర్యలోపము వలన కలుగు ఘాతము. 3. shock therapy ఘాతచికిత్స, షాక్‌లు ఇవ్వడం. **anaphylactic s.,** *see/చూడండి* anaphylaxis. **cardiogenic s.,** *colloq.* heart attack గుండె ఘాతము. **electric s.** విద్యుద్ఘాతము. **hypovolemic s.,** due to excessive fluid loss from the body శరీరంలోని ద్రవము పాళ్ళు/శాతం విపరీతంగా తగ్గుట (అందుకొరకే అఘాతములో ఆసుపత్రిలో వెంటనే సెలైన్, గ్లూకోస్ సిరలోనికి ఎక్కిస్తారు). **septic s.,** especially in gram-negative septicaemia, a form of blood poisoning రక్తంలో పూతిదోషము.

**short-sighted** *see/చూడండి* myopia హ్రస్వదృష్టిగల.

**shoulder** the joint connecting the superior extremity to the body బుజము, మూపు, స్కంధము. **s. blade,** scapula అంసఫలకము/బుజఫలకము. **s. dislocation,** *see/చూడండి* dislocation. బుజము తొలగుట. **s. girdle,** formed by the clavicles and scapulae on either side స్కంధమేఖల.

**show** blood signal before labour or menstruation, *figur.* (i) red signal. (ii) chorus. కాన్పుకు ముందు ప్రసవసూచక స్రావం, లేదా ఋతువుకు ముందు ఎర్రమరక: రాబోవు ఘట్టమునకు సంజ్ఞ, అలంకార. (i) ఎర్రజెండా. (ii) నాంది.

**shunt** 1. establishing communication between two cavities పార్శ్వ పథము: రెండు కుహరముల మధ్య సందు కలుపుట. **ventriculoatrial s.,** communication by means of a plastic tube between cerebral ventricle and atrium of the heart to facilitate drainage of cerebrospinal fluid in the relief of hydrocephalus ప్లాస్టిక్ నాళము ద్వారా మెదడులో కోష్ఠకమును గుండెలో ఏట్రియమ్‌ను కలుపుట; మెదడు కోష్ఠకములు పెరిగిన స్థితి (hydrocephalus) లో మస్తిష్క మేరుద్రవము పారుదల కొరకు ఇది ఒక సాధన/ఉపాయము. **ventriculoperitoneal s.,** same principle as above but the drainage is into the peritoneal cavity పై పద్ధతే, కాని ప్లాస్టిక్ నాళమును అంత్రవేష్టన కుహరములోనికి కలుపుతారు. 2. establishing communication between two blood vessels, bypass, *see/చూడండి* bypass. రెండు రక్తనాళములను కలుపుట. 3. to move to a side track పక్కత్రోవకు తప్పించు.

**sialogenous** producing saliva లాలాజలము ఊరుట.

**sialogogue** an agent which increases flow of saliva లాలాజలాన్ని స్రవింపజేసే కారకం.

**sialolithiasis** formation of salivary calculi లాలాజల గ్రంథులలో/నాళములలో రాళ్ళు తయారగుట.

**sialorrhoea** or **sialorrhea** hypersalivation, increased flow of saliva; ptyalism, *see/చూడండి* ptyalism. లాలాజలం ఎక్కువగా స్రవించుట. *figur.* shower of saliva in the mouth అలంకార. నోట్లో లాలాజల జల్లు.

**Siamese twins** twins who are physically, i.e. bodily joined to each other from birth (congenital) పుట్టుకలోనే రెండు శరీరాలు కలసి ఉన్న కవలలు.

**sibilant** to have a squeaky quality; hissing or whistling in character, high-pitched హెచ్చుస్వర స్థాయిగల 'హిస్' అను శబ్దం లేదా ఈలమ్రోత లేదా పిల్లికూత. **s. rhonchi,** heard on auscultation over the chest with stethoscope, in bronchial asthma ఉబ్బసం వ్యాధిలో స్టెతోస్కోప్‌లో/తో వింటారు. [*in contr.* sonorous].

**sibling** brother or sister తోబుట్టువు: సహోదరుడు; సహోదరి. అన్న/తమ్ముడు లేదా అక్క/చెల్లెలు.

**sick** 1. ill అస్వస్థ: సుస్తీగా నుండుట. 2. nauseating హేయముగా. 3. nursing the sick రోగి పరిచర్య.

**sick bay** a room in the work spot (place of work) where ill or injured people are treated పనిచేసేచోట జబ్బుతో ఉన్నవారినిగాని లేదా గాయపడినవారినిగాని పర్యవేక్షించే గది.

**sick building syndrome** a disorder in office workers characterised by headache, fatigue and sore throat, caused by inadequate ventilation గాలివీచుట సరిగా లేని బిల్డింగ్‌లో ఆఫీస్‌లో పనిచేసేవారిలో కలుగు అపవ్యవస్థ/అవస్థ – తలనొప్పి, అలసట మరియు గొంతునొప్పి.

**sickle cell anaemia** a state of bloodlessness wherein the red blood cells assume sickle shape; they are fragile; hence rupture easily, producing anaemia. This is often hereditary. ఒకరకమైన రక్తహీనత జబ్బులో ఎర్రరక్తకణములు కొడవలి ఆకారం పోలిఉండి, పెళుసుగా ఉంటాయి; కావున సులభముగా పగుల్తాయి. ఈ జబ్బు తరచుగా వంశపారంపర్యంగా వస్తుంది.

**sickness** illness అస్వస్థత, సుస్తి, రోగం. **decompression s.,** *see/* చూడండి caisson disease. **high altitude s.,** mountain s. పర్వతారోహణ చేసేవారు గురిఅయే జబ్బు. **morning s.,** signal of pregnancy వేవిళ్ళు. **motion s.,** air s., car s., travel s., *i.e.* while in movement ప్రయాణములో చలనమువలన కలుగు సుస్తి. **radiation s.,** side effect of ionising radiation in therapy చికిత్సలో అయనీకరణ

వికిరణము యొక్క దుష్పరిణామములు. **sleeping s.** (a) African trypanosomiasis *అలంకార.* కుంభకర్ణుని నిద్రజబ్బు (b) encephalitis lethargica మెదడు శోథము, మాంద్యము.

**Siddha system** of medicine సిద్ధ వైద్యము: భావాతీత ధ్యానాన్ని ప్రేరేపించి (transcendental motivation) దైహిక అమరత్వాన్ని సాధించడం ఇందులో ఒకభాగం.

**side effect** an effect that a drug has, especially an adverse one అనుసంగ ప్రభావం: ముఖ్యంగా ఔషధము యొక్క దుష్ప్రభావము/ అవాంఛనీయ పరిణామము.

**sideroblast** nucleated erythrocyte containing iron granules ఇనుము కణికలు గలిగి, కేంద్రకముతోకూడిన ఎర్రరక్తకణము. **ringed s.** ఇనుము కణికలు ఉంగరము ఆకారంలో ఉన్నవి. sideroblastic anaemia సిడెరోబ్లాస్టలుగల రక్తహీనత.

**siderosis** 1. pneumoconiosis due to inhalation of iron dust particles, an occupational lung disorder వృత్తిరీత్యా సంభవించు ఊపిరితిత్తులజబ్బు – ఇనుపరజను దీర్ఘకాలము పీలుస్తున్నందువలన సంక్రమించు వ్యాధి. 2. an excess of iron in blood రక్తంలో ఇనుము జాస్తిగా ఉండుట. 3. deposit of iron in tissues కణజాలములలో ఇనుము జమ అగుట.

**sight** the power or faculty of seeing. దృష్టి. **defect in s.** దృష్టిదోషం. వాడు.భా. సైట్ వచ్చింది, కళ్ళు పరీక్ష చేయించుకోవాలి. [*q.v.* వాడు.భా. కండ్లకలక వస్తే కండ్లొచ్చయి అంటారు.]

**sigmoid** S shaped. S ఆకారములోనున్న. **s. colon,** part of the large intestine పెద్దపేగులోని భాగము.

**sigmoidoscopy** an instrument to visualise the interior of the rectum and sigmoid flexure of the colon సిగ్మాయిడ్ అంతర్దర్శిని: మలాశయమును మరియు పెద్దపేగులోని సిగ్మాయిడ్ వంపును పరిశీలించు సాధనము.

**sign** 1. a thing indicating or suggesting something దేనినైనా సూచించే అంశము. 2. sign of a disease రుగ్మత చిహ్నము, గుర్తు, సూచన. **vital s's,** pulse, respiration, temperature and B.P.

(blood pressure) నాడి, శ్వాస, ఉష్ణోగ్రత మరియు బి.పి. (బ్లడ్ ప్రెషరు) ప్రాణావశ్యకమైన చిహ్నములు, అలంకార. జీవితరథం వీటిమీద ఆధారపడి ఉంది. గమనిక: ప్రాణం విలువ అమూల్యం.

**silicosis** an occupational lung disorder due to prolonged inhalation of microscopic particles of silica dust, say in stone grinding/crushing operations రాళ్ళు పగులగొట్టి కంకర తయారుచేయు ప్రదేశములలో సంభవించు జబ్బు; సూక్ష్మదర్శినిలో చూడనగు రాతి నలుసులు దీర్ఘకాలంపాటు పీల్చినందువలన ఆ రాతిరజను ఊపిరితిత్తులలో పేరుకుంటుంది.

**silicotuberculosis** a combination of silicosis and tuberculosis సిలికోసిస్ జబ్బుతోపాటు క్షయవ్యాధి, అలంకార. మూలిగే నక్కమీద తాటికాయ పడినట్లు.

**simple** natural సామాన్య. **s. classification** సరళ వర్గీకరణము. **s. epithelium** ఏక/ఒక పొర ఉపకళ. **s. tissue** సరళ ఊతకము/కణజాలము. simplification సరళీకరణము.

**sinciput** the upper half of the cranium కనుబొమల పైని, పుర్రెలో సగభాగం. ఊర్ధ్వ అర్ధకపాలం.

**sinew** a tendon of muscle కండరముయొక్క స్నాయు బంధనము. **weeping s.**, an encysted ganglion, say on the back of the wrist of the size of a pea, arising from tendon sheath, *see/చూడండి* ganglion. స్నాయు బంధనముయొక్క పొరలో జనించు నిరపాయ తిత్తి – ఒక బటాణీ సైజ్‌లో మణికట్టుపైన అగపడుతుంది.

**singultus** hiccup, *see/చూడండి* hiccough. ఎక్కిళ్లు.

**sinister** 1. left ఎడమ. 2. disastrous *e.g.* malignancy అపత్కారమైన, ఉదా. అపాయకరమైన, మారణమైన.

**sinistrality** left-handed or left-footed action; predilection for the use of the left one of the paired organs, *e.g.* eye, ear; seeing in the microscope with the left eye, preference to chewing on left side, *etc.* వామఅంగ/అవయవ/భాగ వాడుక పక్షపాతి: ఎడమ చేతితోవ్రాయు, పనిచేయు; ఎడమకాలుతో ఎక్కువ పనిచేయు; రెండు

అవయవములలో ఎడమదానిని ఎక్కువ వాడుట, ఉదా. సూక్ష్మదర్శినిలో ఎడమకన్నుతో చూచుట, వామచర్వణము, వగైరా.

**sinistraural** liking to hear with the left ear ఎడమచెవి చురుకుజాస్తి, వామశ్రోత్రాభిలాషి.

**sinistrocular** tendency to prefer left eye, though the acuity of vision is the same in both eyes రెండు కళ్లలో దృష్టి వాడిమి/తీక్షణత సమానముగా ఉన్నప్పటికి, వామనేత్ర వాడుక అభిమాని.

**sinistromanual** left handed వామకర: ఎడమచేతి వాటం.

**sinistropedal** left footed వామపాద: ఎడమకాలు వాటం.

**sinobronchitis** sinusitis and bronchitis ముఖకుహరములు మరియు శ్వాసనాళము/నాళికయొక్క శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు వాపు', అలంకార. తోడుబాధలు, సహచరశోథములు.

**sinuous** curving/bending in and out వంకరటింకరైన. **s. pathway** వంకరటింకర మార్గము.

**sinus** a recess, cavity సైనస్, కోటరము, సిరాసిరిత్తు, సిరాపరిఖ, సరణి, గూడు, కుహరము; containing air, blood or any fluid గాలి, రక్తము లేదా ఏదైనా ద్రవము గల కోటరము. *naked eye str.* ప్రత్యక్షచూ. 1. (a) air containing: **paranasal s's,** ethmoidal, frontal, maxillary and sphenoid ఇవి గాలితో నిండిన సహనాసికా కుహరములు. (b) dilated channel for venous blood: **cavernous s.,** by the side of the sphenoid bone in the centre of the skull; *N.B.* Cavernous s. thrombosis is a dangerous condition. కపాలము కేంద్ర ప్రాంతంలోనున్న కుహరము; *గమనిక:* ఈ ప్రాంతంలో థ్రాంబోసిస్ అపాయకరము. **sigmoid s., superior sagittal s,** in the dura mater పరాశికలోని సిరరక్త కాలువలు. (c) **lacteal s's,** lactiferous s's, enlargement of the lactiferous ducts just before they open on the nipple చూచుకములోనుంచి వెలువడే ముందు క్షీరనాళికల అంచుల/కొసలలో ఉబ్బు, *N.B.* Lactiferous ducts, 2 to 4.5 cm long, open into the mammary papilla, the size of the opening is about 0.5mm in diameter. 2. **pilonidal s.,** sinus draining pus, covered by hair, most commonly in the coccygeal

region అనుత్రికప్రాంతంలో కేశముల పొదలో వెతుక్కొనే చీముకాలువ – బహు తరచుగా ఈ ప్రాంతంలో తటస్థించడం కద్దు. 3. **sinus in empyema thoracis,** sinus draining the pus in the pleural cavity పుపుసావరణ కుహరములోని చీము వెలువడు కాలువ. 4. **tubercular s's, /tuberculous s's,** sinuses from TB lymph nodes/glands, bones, *etc.* క్షయవ్యాధిగ్రస్తమైన లింఫ్‌గ్రంథులు, ఎముకలు, మొ. వాటినుండి చీము రంధ్రములు. *micro.str.* సూక్ష్మ.చూ. **lymphatic s's,** spaces in lymph node లింఫ్ గ్రంథిలో సూక్ష్మ స్థలములు. **marginal s.,** subcapsular lymph corridor in the structure of the lymph node లింఫ్ గ్రంథి కాప్స్యూల్ దిగువ నడవ.

**sinusitis** inflammation of a sinus; this term is used exclusively for inflammation of paranasal sinuses సైనస్‌లో శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'. ఈ పదం ప్రత్యేకించి ముఖములో నాసికచుట్టూ ఉన్న సైనస్‌ల వాపుకే వాడ్తారు. *N.B.* one common cause of head ache *గమనిక:* తలనొప్పికి తరచు కారణం.

**sinusoids** dilated channels విస్తరించిన కుల్యకలు. *micro.str.* సూక్ష్మ.చూ. microscopic spaces lined by reticuloendothelium, present in the liver, heart, spleen, pancreas and the adrenal, parathyroid కాలేయము, గుండె, ప్లీహము, క్లోమము మరియు ఎడ్రినల్, పేరాథైరాయిడ్‌లో జాలక అంతరస్తరము గల సూక్ష్మస్థలములు. splenic sinusoids 35 to 40$\mu$ in diameter.

**situs** site, position స్థానము. **s. inversus viscerum,** transposition of the viscera in the thorax and abdomen, *viz,* dextrocardia, liver to the left and spleen to the right ఛాతీలో, ఉదరములోని అవయవముల స్థానముల తారుమారు, అనగా గుండె కుడివైపున, కాలేయము ఎడమప్రక్కన మరియు ప్లీహము కుడివైపున ఉండుట.

**skatole** this substance gives the offensive odour to the faeces మలము/విరేచనములోని దుర్గంధమునకు కారణము. *N.B.* Indole and skatole are twin malodours. *గమనిక:* ఈ రెండూ జంట హేయములు.

**skeletal** pertaining to bone ఎముకకు సం. **s. fluorosis,** *see/చూడండి* fluorosis. **s. muscle,** voluntary muscle attached to bone నియంత్రిత కంకాళపేశి. **s. system** కంకాళవ్యవస్థ.

**skeleton** 1. the bony framework of the body అస్థిపంజరము, కంకాళము/కంకాలము, శరీరముయొక్క ఎముకలగూడు/సముదాయము. skeletal fluorosis, *see/చూడండి* fluorosis. 2. *N.B.* a grossly emaciated person: reduced to a skeleton; skin and bones *గమనిక:* ఉద్ధృతంగా క్షీణించిన వ్యక్తి: ఎముకలు లెక్కపెట్టేటట్లు ఉన్నాడు; తోలు/త్వచము మరియు ఎముకలే కనపడుతున్నాయి, పోలిక: కొంగకాళ్ళు; కోతి చేతులు, వేళ్ళు.

**Skene's glands** glands at the opening of the urethra in the female స్త్రీ మూత్రమార్గం యొక్క ద్వారం దగ్గర ఉండే గ్రంథులు.

**skiagram** X-ray photograph; related to shadows of body structures/organs produced by Roentgen rays ఎక్స్‌రే ఫోటో: రాంట్‌జన్/ఎక్స్‌రే కిరణములు శరీరనిర్మాణములను/అవయవములను చొరుచుకుపోయినందువలన (penetration) ఏర్పడే నీడలకు సం. పటము.

**skin** one of the five sense organs చర్మము, త్వచము, త్వక్కు, తోలు; జ్ఞానేంద్రియము, జ్ఞానేంద్రియ పంచకములో ఒకటి. consists of the inner corium (dermis) and outer epidermis లోపలి అంతశ్చర్మము మరియు వెలుపలి బాహ్యచర్మము. *N.B.* Skin is the largest organ in the body. *గమనిక:* చర్మము శరీరములోని అన్ని అవయవములలో కల్లా పెద్దది/విశాలమైనది.

**skincare** 1. care, protection of the skin చర్మం తాలూకు శ్రద్ధ, రక్షణ. 2. using cosmetic products, part of beautycare, especially in a female రూపం, వర్చస్సు ఆకర్షణీయంగా ఉండటానికి తాపత్రయం, అందం చిందించటం, ముఖ్యంగా వనితల్లో. అలంకార. అందాల భరిణె ముస్తాబు. 3. skin soap వాడు.భా. పెయ్యసబ్బు.

**skin-deep** 1. superficial, involving only skin, *e.g.* ulcer చర్మాన్ని మాత్రమే తొలిచివేసే వ్రణం. 2. *figur.* Beauty is skin-deep, after all అలంకార. అందం త్వచం యొక్క తళుకేగదా!

**skinflick** *sl.* a pornographic film (for 'Adults only') చిలిపి సినిమా (పెద్దలకు మాత్రమే).

**skin graft** *see/చూడండి* graft.

**skin test** *see/చూడండి* Mantoux test, tuberculin test.

**skull** cranium కపాలము, పుర్రె. box for the brain మెదడుకు భద్రత నొసగు పేటిక. *figur. resemblance:* hook in the skeleton *అలంకార. పోలిక:* కంకాళ వ్యవస్థలోని కొక్కెము. *N.B.* Bursting/breaking of skull is a landmark when the corpse is on the pyre during funeral. *గమనిక:* శవము దహనమయ్యేటప్పుడు కపాలము బ్రద్దలగుట ఒక కీలకఘట్టము.

**sleeping sickness** African trypanosomiasis is one variety. *see/చూడండి* trypanosomiasis.

**sleeplessness** insomnia నిద్రలేమి, నిద్రపట్టని స్థితి.

**sleep-walking** somnambulism, walking while asleep నిద్రలో నడచుట.

**sling** support by way of a cloth or bandage, say for the hand and forearm in a case of dislocation of the shoulder ఆధారపు కట్టు: ఉదా. బుజము కీలు తొలగినప్పుడు మోచేయిని గుడ్డతోగాని బాండేజ్‌తోగాని మెడకు ఊత/ఒడిసెల వేసి, నొప్పి పుట్టకుండా కాపాడు ప్రాపు (prop).

**slipped disc** prolapse of intervertebral disc కశేరుకాల మధ్య ఉండే మృదులాస్థిబిళ్ళ స్థానభ్రష్టమగుట.

**slit-lamp** a device used in eye examination నేత్రపరీక్షలలో వాడే ఒక పరికరం.

**slough** necrotic tissue/debris seen at the base of the wound కుళ్ళిన పుండుపదార్థము: మృతిచెందిన కణజాలముల క్షీణపదార్థము గాయము అడుగున అగపడుతుంది.

**small intestine** *see/చూడండి* intestine.

**smallpox** variola మసూచి, స్ఫోటకము, పెద్ద అమ్మవారు. eradicated worldwide ప్రపంచమంతటా నిర్మూలనము చేయబడినది. *అలంకార:* మరచిన మసూచి.

**smear** both a *naked eye str.* ప్రత్యక్ష.చూ. as well as మరియు *micro.str.* సూక్ష్మ.చూ. smearing material obtained from the body on a glass slide for microscopic examination శరీరంలోనుండి పదార్థమును గాజుస్లైడ్ మీద అలికి, సూక్ష్మదర్శినిలో పరిశీలించుట. **blood s.**, smearing and staining రక్తము అలికి, వర్ణకముతో రంగుచేయుట. **Pap s., Papanicolaou s.**, smear from the cervix of the uterus and staining to detect early/pre malignancy in the genital tract స్త్రీజననేంద్రియ మార్గముయొక్క అపాయకరమైన కంతులు ప్రథమ దశలో కనుగొనడానికి తగు జాగ్రతపడుట; గర్భాశయద్వారమునుండి పదార్థము అలికి, వర్ణకముతో రంగుచేయుట. **sputum s.**, smearing of sputum, staining and examining under the microscope, *e.g.* tubercle bacilli కళ్లె అలికి, వర్ణకముతో రంగుచేసి సూక్ష్మదర్శినిలో పరిశీలించుట, ఉదా. క్షయ బాసిల్లై కొరకు.

**smegma** 1. concretions; sebaceous secretions specially underneath the prepuce found in young boys since they do not retract it and clean the glans penis శిశ్నమలము: బాలురు పురుషాంగము మేఢ్రమణి పైచర్మము వెనుకకు లాగి శుభ్రపరచుకొనుట తెలియక, అక్కడ మినపపప్పుబద్దలులాగా పేరుకొనిపోయి గట్టిపడిన స్రావములు. 2. such concretions beneath the clitoris క్లైటోరిస్ పైన చర్మంయొక్క అడుగునగూడా ఇవి ఉండవచ్చును. **s. bacilli** ఇందులో సూక్ష్మక్రిములు.

**snare** a surgical instrument with a wire loop at the end ఉచ్చు. The structure to be removed is caught in the snare and strangled. తొలగించవలసిన నిర్మాణమును ఈ ఉచ్చులోనికి పోనిచ్చి, దానికి ఉరివేసినట్లు ఉచ్చువైర్ లాగుతారు. **polyp s.** పాలిప్ తొలగించే ఉచ్చు. **tonsil s.** టాన్సిల్ తొలగించే ఉచ్చు.

**sneeze** a reflex, a cousin of cough తుమ్ము, ప్రతీకారచర్య దగ్గుకు సన్నిహితము. involuntary, sudden, violent, forceful, audible expulsion of air through the mouth and nose నోరు మరియు ముక్కునుండి అనియంత్రిత, ఆకస్మిక, వడిగల, బలీయమైన, శబ్దోద్భూతమైన గాలి బహిష్కారము. *N.B.* By tradition, it is a bad omen for the onlookers, but bright for the patient/prognosis in stupor,

since reflexes are returning. *గమనిక:* ఆనవాయితీ దృష్ట్యా తుమ్ము చూసేవాళ్ళకు/ప్రక్కవాళ్ళకి చెడుశకునము; కాని వైద్యములో మునిగి ఉన్నరోగి తుమ్మితే 'అమ్మయ్య! తేరుకుంటున్నట్లు, స్పృహలోనికి వస్తున్నట్లు' సూచన.

**Snellen's test types** the illuminated letters/marks display/chart for testing vision కంటిచూపు తనిఖీకొరకు ఉపయోగించే, కాంతితో ప్రకాశించు అక్షరముల/గుర్తుల దర్శనపటము.

**snip** to cut with scissors or shears కత్తిరించు. snip the edges of a wound గాయం యొక్క అంచులను కత్తిరించు.

**snore** rough, jerky, noisy breathing due to the vibrations of the soft palate and uvula గురక, గుర్రు; కఱుకు, చిప్పుకున్న ఈడ్పు, శబ్దప్రేరితమైన శ్వాస – ఇది చిన్న అంగిలి మరియు కొండనాలుక యొక్క కంపము/వణకు వలన సంభవిస్తుంది. 1. habit అలవాటు. 2. physiologically, indication of sound sleep శరీరధర్మశాస్త్ర దృష్ట్యా సుఖనిద్ర సూచకము. 3. pathological: రోగలక్షణ దృష్ట్యా: (a) sign of obstruction in the throat, *e.g.* obesity కొవ్వు శరీరంలో గొంతు మార్గము సన్నగిల్లుటవలన అడ్డు సూచించే సంజ్ఞ. (b) grave prognosis in deep coma గాఢమైన, స్పృహలేమి/లేని స్థితిలో గొంతులో గురక అపాయకరము, అవసానదశ; మృత్యు/మరణ భయమును సూచించు సంజ్ఞ. 4. loud snoring = sonorous ఖంగుమను.

**snot** mucus of the nose చీమిడి. *అలంకార.* నాసిక నేస్తం (ముక్కును శుభ్రపరుస్తుంది కాబట్టి).

**the snuffles** *colloq.* obstructed nose due to cold/coryza జలుబు/పడిశంలో ముక్కుదిబ్బడా వేయుట. This is due to swelling of the mucous membrane. శ్లేష్మపొర వాపు వలన. ముక్కులోనుండి జలుబు నీరు కారడం. *అలంకార.* పడిశం పదిరోగాల పెట్టు.

**soap and water enema** soap dissolved in lukewarm water. This water is sent into the anus through a tube. Nice evacuation of bowels occurs. సబ్బు గోరువెచ్చని నీళ్ళలో కలిపి, ఆ నీరును ఆసనంలోనికి గొట్టంద్వారా పంపుతారు. సుఖవిరేచనం అవుతుంది.

**social** relating to society సాంఘిక లేదా సమాజమునకు సం. man, a social being మానవుడు సామాజిక లేక సంఘజీవి/ప్రాణి. *N.B.* Social and Preventive Medicine (dept. of SPM in a medical college) *గమనిక:* మెడికల్ కాలేజీలో సామాజిక వ్యవస్థ మరియు వ్యాధినివారణ విభాగము.

**sociopathy** personality disorder characterized by antisocial behaviour అసభ్య ప్రవర్తనతో కూడిన మూర్తిమత్వ అపవ్యవస్థ.

**socket** a hollow ఏదైనా నిలిచియుండు గుంట. **eye s.**, orbit కన్నుగుంట. **tooth s.,** foundation of the tooth in the bone above and below the mouth నోటిపైన, క్రింద ఉన్న ఎముకలో పన్నుయొక్క బు/పునాది.

**sodium** metallic element లోహము. **s. bicarbonate,** antacid అన్నాశయములో అమ్లమును తగ్గించు ఔషధము. used for cleaning/cleansing, *e.g.* vaginal douche యోనిని కడిగి శుభ్రము చేయు ఎనిమా. **s. chloride,** multi-potent multi-purpose basic ingredient, *e.g.* salt in diet, for gargle, I.V. transfusion, irrigation of wounds, *etc.* *figur.* worth its salt; sustaining on salt బహుళాధారమైన సంజీవిని, ఉదా. ఆహారములో, నోటిపుక్కిలింతలో, సిరలోనికి ఎక్కించుటకు, గాయములకు చెమ్మ చేకూర్చుటకు, మొ. చర్యలలో వాడ్తారు. అలంకార. 'ఫలానా వారి ఇంట్లో వారి ఉప్పు తిని బ్రతుకుతున్నాను' అను కృతజ్ఞత.

**sodomy** anal sexual intercourse, man to man, man to woman ఇద్దరి పురుషులమధ్య, పురుషుడు స్త్రీకిమధ్య ఆసన సంభోగము, గుదమైథునం. The behavioural paradox is that man, in addition to being homosexual to his own sex, indulges in vaginal sex as well as anal sex in the woman. విడ్డూరమేమంటే – మానవుడు స్వలింగ సంభోగమేగాక పరలింగ యోని/ఆసన సంభోగం చేస్తాడు. [*Cf.* bestiality *తారత.* జంతువులతో లైంగిక సంబంధం *Cf.* fellatio *తారత.* అస్యసంభోగం, అస్యమైథునం].

**softening of the brain** 1. softening of the brain tissue especially in old age వృద్ధాప్యంలో మెదడు కణజాలము మెత్తబడుట. This is a

process of degeneration. ఇది క్షీణతను సూచిస్తుంది. 2. *colloq.* marked deterioration of mental faculties మేధాశక్తి మరుగుపడటం.

**solar plexus** plexus celiacus. coeliac plexus inside the abdomen. dense network of nerve fibres and ganglia at the level of the first lumbar vertebra, situated between the two adrenal glands. It supplies the abdominal organs. ఉదర కుహరాంతర నాడీ ప్లక్షము. మొదటి కటికశేరుక దగ్గర,రెండు ఎడ్రినల్ గ్రంథుల మధ్య నున్నది.

**sole** the bottom of the foot అరికాలు, అడుగు.

**soleus** calf muscle, broad fleshy muscle at the back of the upper portion of the leg below the knee పిక్క కండరము, పిక్క పేశి; *అలంకార.* పిక్కబలము పేశీబలమును సూచిస్తుంది.

**solubility** the property of being soluble ద్రావణీయత.

**solute** subrtance dissolved in a solution, the substance may be a solid or gas ద్రావితము.

**solution** ద్రావణం 1. solute+solvent. fluid which contains dissolved substance(s) *e.g.* sugar+water. ద్రావణం=ద్రావితం+ ద్రావణి. పదార్థము(లు) కరిగిన ద్రవం. *ఉదా.* చెక్కెర+నీరు. 2. answer to a problem సమస్యకు పరిష్కారం.

**solvent** liquid capable of dissolving substance(s)/solute(s) ద్రావణి, ద్రావకం, కరగించు ద్రవము.

**soma** body దేహం [*Cf.* mind *తారత.* మనస్సు].

**somatic** pertaining to the soma/body, *see/చూడండి* psycho somatic disorder. శారీరక, శరీరమునకు సం. *N.B.* Somatic exercise keeps tissues fit. *గమనిక:* కాయకష్టం కణాలకి/శరీరానికి మంచిది.

**somato-psychic** the effect of the disease of the body on the mind శారీరక రోగంవల్ల కలిగే మనోవైకల్యం [*Cf.* psychosomatic].

**somatotrophin** or **somatotropin** growth hormone ఎదుగుదలకు కావలసిన హార్మోన్.

**somnambulism** sleep-walking నిద్రలో నడచుట.

**somnolent** drowsy or sleepy state నిద్దురమత్తు లేదా నిద్రావస్థ. *అలంకార.* నల్లమందు భాయి.

**Sonne dysentery** bacillary dysentery caused by infection with *Shigella sonnei* (Sonne bacillus) సొన్ని బాసిల్లై వలన కలిగెడు రక్త విరేచనాలు.

**sonogram** a visual image produced by ultrasonography, *see/చూడండి* ultrasonography.

**sonorous** snoring in character, low-pitched తచ్చుస్వరస్థాయి గల గురకలాంటి. **s. rhonchi,** sounds heard on auscultation over the chest with stethoscope శబ్దములు స్టెతొస్కోప్‌లో/తో వింటారు [*in contr.* sibilant].

**soporific** an agent which produces deep sleep గాఢనిద్రాకారి: గాఢ/సుఖనిద్ర పోవునట్లు చేయు సాధనము/వస్తువు. *N.B.* What sweet is to the taste, so sleep is to the brain. *గమనిక:* రుచికి తీపి ఎట్లాగో, మేధకు నిద్ర అట్లాంటిది. అలంకార. మేధకు నిద్ర మధురం.

**sorbefacient** an agent that facilitates absorption శోషణశక్తి/గుణం కల వస్తువు.

**sordes** debris on the teeth and lips, say in a prolonged fever దీర్ఘకాలపు జ్వరములో పళ్ళమీద మరియు పెదిమలమీద పాకుడు, పాచి.

**sore** *colloq.* any lesion of the skin or mucous membrane పుండు: చర్మము మీదగాని శ్లేష్మపొరమీదగాని ఏదైనా క్షతము. a boil, ulcer or wound సెగగడ్డ, వ్రణము, కురుపు, పుండు. **bed s.,** decubitus ulcer శయన వ్రణము, పడకపుండు, ఒత్తుడు వ్రణము, రాపిడి క్షతము. **eye s.** కంటిలో పుండు. **penile s.** శిశ్నవ్రణం. **soft s.** ఒకరకమైన సుఖవ్యాధి. **Oriental s.,** Baghdad Button, Delhi Boil due to *Leishmania tropica.* **s. throat** గొంతు 'నొప్పి వేడి మంట ఎరుపు తీపు వాపు'.

**souffle** a puffing or blowing sound, heard by stethoscope గాలి వీచుతున్నప్పుడు వినబడే శబ్దాన్ని పోలినశబ్దం, స్టెతొస్కోప్‌లో వింటారు. **funic s. fetal s.** murmur synchronous with fetal heartbeat heard on auscultation over pregnant uterus భ్రూణహృదయస్పందనతో సమకాలీయమైన మర్‌మర్. **uterine s.** murmur synchronous with maternal heartbeat heard on auscultation over pregnant uterus గర్భిణిదాల్చిన యూటెరస్‌పై స్టెతొస్కోప్‌తో విన్నప్పుడు మాతృహృదయ స్పందనతో సమకాలీయమైన మర్‌మర్.

**sound** 1. heard in the body, *e.g.* heart sounds శరీరములో ధ్వనులు, ఉదా. గుండె ధ్వనులు. 2. other noises, *e.g.* murmurs in the heart గుండెలోని మర్మర్లు, చప్పుళ్ళు. *see/చూడండి* fetoscope, heart sounds, murmurs. **Korotkow s's, Korotkoff s's,** sounds heard during recording blood pressure (BP) బి.పి. చూస్తున్నప్పుడు డాక్టరు స్టెతాస్కోప్‌లో/తో వినే ధ్వనులు. **peristaltic s's,** heard over the abdomen due to peristalsis in the intestines అంత్రచలనమువలన సంభవించు ధ్వనులు. **respiratory s's,** heard over the chest ఛాతీమీద వినేధ్వనులు. 3. an instrument introduced into a cavitary organ to strike a foreign body, *e.g.* stone కుహరయుత అవయవములోనికి పోనిచ్చి ఏదైనా వస్తువు, ఉదా. రాయి/శిల తగులుతుందా అని స్పర్శించే పనిముట్టు. 4. instrument to dilate a stricture సన్నగిల్లిన నాళమును విస్తరించు సాధన(ము).

**space** area స్థలము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **Burns's.,** suprasternal notch ఉరఃఫలకముపై గుంట. **dead s.,** anatomic dead s., from the nose and mouth to the respiratory bronchioles, about 150ml. ముక్కు, నోరునుండి సూక్ష్మశ్వాసనాళికల వరకుగల స్థలము. **intercostal s.,** space between two adjacent ribs రెండు ప్రక్క ఎముకల మధ్యప్రదేశము. **intrapleural (intrathoracic) s.,** pleural cavity పుప్పుసావరణ కుహరము. **palmar s.,** in the hand అరచేతిలో స్థలము. **subarachnoid s.,** *see/చూడండి* cerebrospinal fluid. లౌతికళ అడుగున స్థలం. *micro.str.* సూక్ష్మ.చూ. **Bowman's s., capsular s.,** in glomerular capsule of the kidney కిడ్నీలో గ్లామెరులస్‌లో భాగము. **Haversian s.,** in histology of compact bone ఎముక జీవధాతువు అంశము.

**space medicine** diseases of astronauts రోదసీ వైద్యశాస్త్రం, అంతరిక్ష నౌకలో పయనించేవారు గురి అయే జబ్బుల శాస్త్రం.

**space sickness** travel sickness of astronauts, especially due to weightlessness రోదసీయానుల సుస్తీ, ముఖ్యంగా అంతరిక్షనౌకలో తేలిపోవటం వలన.

**spasm** involuntary contraction of a muscle or a group of muscles బిగువు, ఈడ్పు, ఈడుపు. 1. **structural:** నిర్మాణ వ్యవస్థ సం.

**carpopedal s.,** spasm of the hand and/or foot, seen in tetany టెటానిలో చేయి మరియు/లేదా కాలు ఈడుపు. **clonic s's,** in epilepsy, *see/*చూడండి clonic movements. మూర్ఛల వ్యాధిలో ఈడ్పులు. **habit s's,** tics, involuntary unnatural muscular contractions అనియంత్రిత విడ్డూర కండర సంకోచములు. **tetanic s's,** spasms in tetanus ధనుర్వాతములో ఈడుపులు. 2. **tubular:** నాళ సం. **bronchial s.,** bronchospasm, contraction of the smooth muscles in the walls of the bronchial tubes, as in asthma శ్వాసనాళికలు సన్నగిల్లుట వలన ఉబ్బసము వ్యాధిలో పిల్లికూతలు.

**spasmodic** *adj.* of the nature of spasms; associated with spasms ఈడుపుతో కూడిన, ఈడ్పు సహిత.

**spasmolytic** antispasmodic drug ఈడ్పునివారిణి, ముకుళ నిరోధక ఔషధము.

**spastic** hypertonic; muscles are stiff కండరములలో అధిక బిర్రు/బిరుసు. **s. paraplegia,** paralysis of the two lower limbs రెండు అధోంగాల పక్షవాతం [*in contr.* flaccid].

**spatula** flat flexible device made of wood or plastic కొయ్య లేదా ప్లాస్టిక్‌తో చేసిన, చమ్చా హేండిల్ వంటి పలుచని, వంగే పరికరం. **tongue s.** tongue depressor నాలుకను కిందకు నొక్కిపట్టేది.

**specialist** one skilled in a particular branch ఒక విభాగములో నిపుణుడు/స్పెషలిస్టు.

**speciality** the field of the specialist, *e.g.* cardiology, neurology ఉదా. హృద్రోగశాస్త్రము, నాడీవ్యవస్థ శాస్త్రము.

**species** *n. sing. & pl.* 1. a taxonomic group next to or within, a genus. In *Entamoeba coli* and *E. histolytica* Entamoeba is the genus, coli and histolytica are the species. **జాతి:** ప్రజాతి తరువాత వచ్చే వర్గీకరణ స్థాయి [*Cf.* genus *తారత.* ప్రజాతి]. 2. a class of pharmaceutical preparations ఔషధమిళిత పానీయాలు aromatic tea, diuretic tea, laxative tea, *etc.*

**specific** 1. relating to a species ఒక **జాతికి** సం. 2. peculiar to a structure/function, *etc.* ఒక నిర్మాణము/విధి యొక్క విశేషత్వము.

3. a specific remedy విశిష్ట చికిత్స/వైద్యము. 4. produced by a single kind of microorganism, *e.g.* In pulmonary TB: No doubt X-ray of the chest is highly sensitive, but demonstration of TB bacilli in the sputum is specific for the diagnosis. బాసిల్లై వలన కలుగు, ఉదా. ఊపిరితిత్తుల క్షయవ్యాధి నిర్ణయములో ఎక్స్‌రే కన్నా కఫము పరీక్ష మిన్న.

**specimen** a small bit of tissue for microscopic examination, *figur.* part for a whole సూక్ష్మదర్శినిలో చూడటానికి చిన్నతునక; *అలంకార.* అన్నం ఉడికిందేమో చూడాలంటే ఒక మెతుకు పట్టుకుంటే చాలు.

**spectacles** a pair of lenses/glasses to aid vision కళ్ళజోడు, కంటి అద్దాలు, సులోచనాలు, కళ్ళద్దాలు, దృష్టికి సహాయకారి.

**speculum** a device to open an orifice for examination అవయవాన్ని తెరవడానికి ఉపయోగించే సాధనం. **vaginal s.**, an instrument for inspecting the vagina, a body cavity యోని రంధ్రం పరిశీలించు పనిముట్టు/సాధనము.

**speech** thoughts expressed in words భావములను ఉచ్చారణద్వారా తెలియపరచుట. **s. defect** ఉచ్చారణలోపము. **staccato s.**, stamping each syllable ప్రతి అక్షరము తీవ్రతతో గుద్దినట్లు పలుకుట; వత్తివత్తి పలుకుట.

**speech therapy** practising the utterance of words పదాలు మాట్లాడటం ప్రాక్టీస్/సాధనచేయడం. 1. in deaf or brain-damaged children చెవిటి పిల్లల్లోగాని లేదా మెదడు చెఱుపు/దెబ్బ యొక్క పర్యవసానం వలనగాని. 2. in adults after a stroke, *see/చూడండి* stroke. పెద్దలలో అఘాత క్షతంలోగాని.

**sperm** 1. semen శుక్రము, ఇంద్రియము, తెలుపు, వీర్యము. 2. spermatozoon శుక్రకణము, మగవాని బీజకణము.

**spermatic cord** carries sperms from the testis శుక్రరజ్జువు. comprises arteries, veins, lymphatics, nerves and vas deferens ఇందులో ధమనులు, సిరలు, లింఫ్ నాళములు, నాడులు మరియు శుక్రవాహిక ఉంటాయి. **torsion of s.c.** results in acute sickening

pain in the testis. ఈ రజ్జువు నులుపుట, వృషణములో తీక్షణమైన నొప్పి, పోలిక: తడిబట్టను పిండేటప్పుడు ఒక కొసను కదలకుండా పట్టుకొని మరియొక కొసను పురిపెట్టి త్రిప్పుట.

**spermatocele** a cystic swelling either of the epididymis or rete testis ఎపిడిడైమిస్ లేదా వృషణములో శుక్రోత్పాదకనాళికల యొక్క తిత్తిరూపమైన ఉబుకు [*distinguish from* hydrocele].

**spermatogenesis** the formation and development of sperm in the testes, *see/చూడండి* sperm. శుక్రము, శుక్రకణములు వృషణములలో తయారై వృద్ధిపొందుట.

**spermatorrhoea** or **spermatorrhea** spontaneous involuntary escape of semen without stimulation of the penis అప్రేరిత శుక్ర పాతము/వీర్యస్రావము, వాడు.భా. శుక్లనష్టం. పురుషాంగము ప్రేరేపకము లేకుండానే అయత్నకృత/అనియంత్రిత/అప్రయత్న వీర్య నిష్క్రమణమగుట. *sl.* losing money, i.e. he feels as much distressed as losing money from his pocket, by this emission గ్రా. 'మనీ పోతున్నది' అంటాడు. తన శరీరంలో నుండి ఈ స్ఖలనము వలన, తన జేబులో నుండి డబ్బు పారేసుకున్నట్లు ఖిన్నుడవుతాడు/బాధపడుతాడు.

**spermatozoon** [spermatozoa *pl.*] male reproductive cell పురుషబీజకణము, శుక్రకణము.

**spermicide** spermatocide. any agent, *e.g.* **s. jelly** that kills sperms శుక్రకణనాశిని, వీర్యకణనాశిని.

**sphenoid** wedge-shaped. a bone at the base of the skull కపాలము అడుగున ఉన్న ఎముక.

**spherocytosis** the presence/finding of spherocytes in the blood రక్తంలో గోళాకారమైన ఎర్రరక్తకణములుండుట.

**sphincter** muscle that encircles/surrounds an opening or passage సంవరణి కండరం: ఒక రంధ్రమునుగాని లేదా ఒక మార్గమునుగాని పరివేష్టించు కండరము. **anal s.** ఆసన సంవరణీ పేశి. **cardioesophageal s.**, sphincter muscle at the junction of the oesophagus with stomach అన్నవాహిక అన్నాశయమును కలియుచోట సంవరణి కండరము. **pyloric s.**, *see/చూడండి* pylorus. **s. of Oddi**, site where the common bile duct and pancreatic duct together

open into the duodenum పైత్యరసనాళము మరియు క్లోమనాళము కలిసి అంత్రమూలములో ప్రవేశించుచోట సంవరణి కండరం.

**sphygmomanometer** an instrument for recording blood pressure బ్లడ్ ప్రెషర్ నమోదుచేయుటకు ఉపకరణము.

**spica** one type of bandage ఒకరకమైన బ్యాండేజ్ కట్టు. 8-shaped cross bandage 8-ఆకృతిలో బాండేజ్.

**spicule** a sharp needle-like structure కంటకము, వాడిగల సూదిలాంటి నిర్మాణము. **s. of bone** ఎముక కంటకము.

**spider** 1. spider - web like nevus సాలెపురుగు అల్లికవలెనున్న మచ్చ. 2. spider angiomata on face, neck and back in liver cirrhosis, appearing as red/purple patches on skin కాలేయము గట్టిపడిన జబ్బులో ముఖము, మెడ మరియు వీపు చర్మముమీద సాలీడు గూడువలె అగపడు ఎరుపు/ధూమ్రవర్ణపు రక్తనాళికల నేత.

**spina** concerning the back bone (spine) వెన్నెముకకు సం. **s. bifida,** congenital anomaly: defective closure of the bone (vertebra) around the spinal cord పుట్టుకతో కలిగిన విపరీతము; వెన్నుపాము చుట్టూఉన్న ఎముక (వెన్నుపూస)లో వెలితి. **s. b. occulta,** the cord or meninges may not protrude out of the defect; usually a tuft of hair is present over the skin at the area వెన్నుపాముగాని, వెన్నుపాముమీద పొరగాని ఈ వెలితిలోనుండి వెలుపలికి పొడుచుకురావు; వెంట్రుకపిలక ఆ ప్రాంతంలో ఉండటం కద్దు.

**spinal** pertaining to the spine వెన్నెముకకు సం. 1. **s. canal** కశేరుకుల్య. 2. **s. column,** vertebral column మేరు/కశేరుదండము, వెన్నెముక. 3. **s. cord** కశేరునాడీదండము, వెన్నుపాము, మజ్జారజ్జువు. Vertebral column consists of a series of bones, in the middle of the back, one arranged over the other. The ring-like bony arches of each vertebra form a canal; this encloses and protects the spinal cord. శరీరము వెనుక వెన్నుప్రాంతంలో వెన్నెముకలో ఎముకలు పూసలపేరువలె ఒకదానిని అనుకొని ఇంకొకటి అమర్చబడి ఉంటాయి; ప్రతి వెన్నుపూసకు ఒక ఉంగరములాంటి ఎముక కమాను ఉంటుంది. ఈ కమాన్లు కలసి కశేరుకుల్య అవుతుంది. దీనిలో

తాడువలెనున్న వెన్నుపాము అను జీవనాడుల జడ వ్రేలాడుతూ ఉంటుంది. 4. **s. ganglion** మేరుగుచ్ఛిక, కశేరు నాడిముడి.

**spinal anaesthesia** *see/చూడండి* anaesthesia.

**spine** 1. a thorn-like process of bone, **anterior nasal s.,** sharp projection of the nasal crest of the maxilla కంటకము/ముల్లువలె నున్న ఎముక ఉబుకు, జంభికముల్లు. 2. backbone, the vertebral column వెన్ను, వెన్నెముక. 3. *anat.* vertebral spinous process, *see/చూడండి* process. వెన్నుపూస వెనుక కీలితము. **bamboo s.,** the description in ankylosing spondylitis ఈ జబ్బులో వెదురుబొంగులా ఉండే వెన్ను. **cleft s.,** spina bifida, *see/చూడండి* spina. **s. chilling** వెన్ను ఝల్లుమను. **s. of scapula,** traingular bony ridge at the back of the scapula అంసఫలకము వెనుక త్రికోణాకారమైన ఎముకబొడిపె.

**spiral** 1. coursing/winding like a corkscrew (nail or nut) మరచుట్టు ఆకృతి: మరచుట్టు/మరమేకుచుట్టువలె తిరుగుడుగానున్న. 2. *micro.str.* సూక్ష్మ.చూ. **Curschmann's s's,** mucinous fibrils seen in the sputum of bronchial asthma ఉబ్బసమురోగి శ్లేష్మములో చూడనగు సూక్ష్మ శ్లేష్మతంతువులు ఈ రూపంలో ఉంటాయి.

**Spirillum** *S. minus,* gram-negative bacteria which cause rat bite fever in man ఎలుకకొరుకుడు వలన కలుగు జ్వరమునకు కారణమైన భాక్టీరియా.

**spirochaete** or **spirochete** an organism of the genus *Spirochaeta* ఈ ప్రజాతికి సం. *S. pallidum* otherwise called *Treponema pallidum* is the cause of syphilis. కొఱుకు సవాయి వ్యాధికి కారణమైన సూక్ష్మజీవి.

**spirogram** a graph of respiratory movements శ్వాసక్రియను చిత్రించు గ్రాఫ్.

**spirometer** an instrument for recording lung capacity, *etc.* ఊపిరితిత్తి సామర్థ్యత, మొ. అంశములను నమోదుచేయు సాధనము.

**spit** spittle, saliva ఉమ్మి, లాలాజలము; నోట్లో ఉన్నంతసేపు రుచి, కమ్మదనము, అదే ఉమ్మి బయటవేయగానే హేయము! గమనించారా

విడ్డూరము. [*Cf.* sputum తారత. కఫము] [*q.v.* People abhor urine, but a drop is precious in anuria. ఒంటేలు హేయం, కాని మూత్ర బంధనంలో ఉచ్చబొట్టు అమూల్యం].

**splanchnic** concerning the viscera అంతర అవయవాలకు సం. usually refers to the abdominal viscera, *viz.* liver, stomach, spleen, pancreas, small intestine, colon తరచుగా ఉదరములోని అవయవములకు వర్తిస్తుంది అనగా కాలేయము, అన్నాశయము, ప్లీహము, క్లోమము, చిన్నపేగు, పెద్దపేగు.

**splanchnology** the study of the structure and functions of the viscera అంతర అవయవాల నిర్మాణము మరియు వాటి విధుల శాస్త్రజ్ఞానం.

**splanchnopathy** any disease of the viscera అంతర అవయవాల ఖాయిలా/సుస్తీ.

**splash** *see/చూడండి* succussion splash.

**spleen** an organ situated underneath the left costal margin, a reservoir of blood; disintegrates erythrocytes, (*figur.* graveyard of RBCs) and forms lymphocytes and plasma cells ప్లీహము: ఎడమ కోస్టల్ అంచు క్రిందనున్న అవయవము – రుధిరాశయము, రక్తాశయము; ఎర్రరక్తకణములను విచ్ఛిత్తిచేయును (అలంకార. ఎర్రరక్తకణముల శ్మశానవాటిక), లింఫ్‌కణములను మరియు ప్లాస్మాకణములను ఉత్పత్తిచేయును. **accessary s.**, accessory s. అదనపు ప్లీహము. **enlarged s.** ప్లీహము పెరుగుట, కడుపులో బల్ల. **rupture of s.** ప్లీహచీలిక. **sago s.**, amyloid degeneration ఎమైలాయిడ్ క్షీణత. the Malpighian corpuscles appearing as grains of boiled/cooked sago ఉడికిన సగ్గుబియ్యం గింజలవలె మాల్‌ఫీజియన్ పదార్థరేణువులు అగపడుట. **wandering s.**, floating spleen తేలుతున్న ప్లీహము.

**splendid** magnificent. **s. achievement** ఘనకార్యము. This dictionary is a splendid piece of writing – magnum opus. ఈ నిఘంటు(వు) దివ్యమైన/శ్రేష్ఠ రచన. **s. research in medicine** వైద్యవిద్యాశాస్త్రంలో ఘనమైన పరిశోధన.

**splenectomy** surgical excision of the spleen ప్లీహోచ్ఛేదనము: ప్లీహమును శస్త్రవైద్యముచేసి వైదొలగించుట.

**splenic** concerning the spleen ప్లీహమునకు సం.

**splenitis** itis = inflammation. inflammation of the spleen ప్లీహము యొక్క ఇన్‌ఫ్లమేషన్/శోథం.

**splenohepatomegaly** enlargement of spleen and liver ప్లీహము మరియు కాలేయము పెరుగుట, వాడు.భా. కడుపులో బల్లలు. అలంకార. తోడుదొంగలు. ప్లీహకాలేయ విషనేస్తం.

**splenomegaly** enlargement of the spleen ప్లీహము పెరుగుదల, వాడు.భా. కడుపులో బల్ల.

**splint** a rigid or flexible contrivance/device to directly support displaced parts, often a first aid modality బద్దీ: స్థానభ్రష్టమైన భాగములు కదలకుండా చేయుటకు ఒక వంగని లేదా వంగునట్టి సాధన(ము), ఆధారము/ప్రాపు; తరచుగా ప్రథమ చికిత్సలో వాడేది. **Thomas s.**, a splint for the lower extremity, also useful for traction of the limb, *e.g.* in fracture of the neck of femur అధోంగమునకు ఆధారము, ఉదా. తుంటి అస్థియొక్క గ్రీవభాగము విరిగినప్పుడు ఆ అంగము/కాలును సాగదీయుటకు తోడ్పడు సాధనము.

**splitting** *e.g.* second heart sound splitting into its two components, aortic valve closure and pulmonary valve closure (normally they coalesce and only one sound is heard) విపాటితము, ఉదా. గుండె రెండవ ధ్వని రెండుగా విభజింపబడుట అనగా బృహద్ధమని కవాటపు మూతధ్వని మరియు పుపుసధమని కవాటపు మూతధ్వని ఒకటి తర్వాత ఒకటి వినపడుట (ఆరోగ్యవంతునిలో రెండూ కలసి ఒకే ధ్వనిగా వినపడుతుంది).

**spondylitis** (spondyle = vertebra) inflammation of the vertebrae వెన్నుపూసల వాపు/శోథము. **ankylosing s.**, *see*/చూడండి ankylosing spondylitis. **s. tuberculosa,** TB spine కశేరుకాల క్షయ, వెన్నుపూసలకు టి.బి.

**spondylolisthesis** forward displacement of a vertebra over its fellow beneath, say displacement of $4^{th}$ over $5^{th}$ or $5^{th}$ over

sacrum ఒక వెన్నుపూస ముందుకు జరుగుట, ఉదా. 4వ పూస 5వ పూస ముందుకు గాని లేదా 5వ పూస త్రికముయొక్క ముందుకుగాని జరుగుట.

**spondylosis** 1. ankylosis of a vertebral joint, *viz.* rigidity and stiffness వంగని మరియు బిర్రుగానున్న వెన్నుపూస కీలు. 2. degenerative change due to osteoarthritis వయస్సు ముదిరే టప్పుడు క్షీణత వలన కలుగు కీళ్ళ బిర్రు/బిగువు. **cervical s.**, a much talked-about condition/disorder; degenerative lesion of cervical vertebrae, *colloq.* any pain in neck too eagerly over-diagnosed as this condition, *figur.* patient fond of wearing a collar round the neck బహుజన చర్చిత అపవ్యవస్థ; గ్రీవాకశేరుకల క్షయమువలన కలిగే క్షతము, *వాడు.భా.* ఏ విధమైన మెడనొప్పి ఉన్నాసరే ఈ జబ్బునే నిందిస్తారు, *అలంకార.* మెడచుట్టూ మెత్తటి కాలర్ ధరించటానికి ఉబలాటపడతారు.

**sponge** *zool.* the skeleton of a plant-like sea animal స్పంజిక: ఒక దినుసు/రకమైన సముద్రపు పాచి. spongy parenchyma స్పంజి మృదుకణజాలము.

**sponging** 1. cleansing the body of a patient with soap and water, duty of a nurse చర్మం శుభ్రంచేసి తడిగుడ్డతో తుడవటం. 2. **cold s.** sponging with cold water the entire body, to bring down the temperature in high fever ఎక్కువ జ్వరంతో బాధపడుతున్నప్పుడు జ్వరం తగ్గించడానికి చల్లని తడిగుడ్డ స్పర్శసేవ.

**spongioblast** embryonic epithelial cell; precursor of spongiocyte పిండదశ ఉపకళ కణము: స్పాంజియోసైట్ యొక్క అగ్రగామి.

**spongiocyte** 1. neuroglia cell formed from a spongioblast స్పాంజియోసైట్: స్పాంజియోబ్లాస్ట్ నుండి ఉద్భవించినది. 2. a cell in the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్‌లో కణము.

**spongiosa** spongy స్పంజికవలె. spongy substance of bone ఎముకలోని స్పంజికవలె నుండు మజ్జ.

**spontaneous pneumothorax** spontaneous accumulation of air/gas in the pleural cavity దానంతట అదే వచ్చే న్యూమొ థొరాక్స్, *see/చూడండి* pneumothorax.

**sporadic** occurring singly, say a disease చెదురుమదురుగా, ఒక టొక్కటిగా సంభవించెడు, *ఉదా.* వ్యాధి [*in contr.* epidemic *భిన్న.* మహామారి/సర్వత్ర వ్యాపించెడు వ్యాధి] [*in contr.* endemic *భిన్న.* స్థానిక వ్యాధి].

**spore** a phase in the life-cycle జీవితక్రమంలోని ఒక దశ. *micro.str.* సూక్ష్మ.చూ. usually single celled, resting/reproductive stage in the life history of bacteria, fungi, protozoa, algae, *etc.* which develop inside the cell బీజాంశం, సిద్ధబీజం: బాక్టీరియా, శిలీంధ్రాలు, ప్రొటొజోవా, శైవలాలు, మొ. జీవులలో వృద్ధి పొంది, విరామ సం./ప్రత్యుత్పత్తికి సం. ఏకకణ దశ *e.g.* spores of *Clostridium tetani* which are ubiquitous *ఉదా.* సర్వవ్యాప్తమైన ధనుర్వాత సిద్ధబీజాలు.

**sporogenic** sporulation, forming spores సిద్ధబీజాలు ఉత్పత్తి చేయు.

**sports medicine** diseases affecting sports persons, *viz,* sportsmen, sportswomen క్రీడాకారుల వ్యాధుల వైద్యశాస్త్రం.

**spot** a blot మచ్చ, చుక్క, చోటు. **Bitot's s's,** foamy gray/grey spots in the conjunctiva, by the side of the limbus (sclerocorneal junction) seen in vitamin A deficiency కన్నులో దృఢస్తరము మరియు శుక్లపటలము సంధి అనగా నల్లగుడ్డు అంచు ప్రక్కన అగపడే నురుగులాంటి గచ్చకాయరంగు మచ్చలు – ఇవి విటమిన్ ఎ లోపము సూచిస్తాయి. **blind s.,** in retina నేత్రపటలములో అంధబిందువు. **Koplik's s's,** red spots with blue centre in the buccal mucosa, seen in the prodromal stage of measles (usually an infection of children) తట్టు/పొంగు అంటు జాడ్యము 'రాబోవుముందు సూచన': బుగ్గలోపలి శ్లేష్మపొరలో ఎర్రమరకలలో నీలంచుక్కలు – ఈ జాడ్యము తరచుగా పిల్లలలో చూస్తుంటాము; తట్టు/పొంగుకు నాంది.

**sprain** a violent, straining, twisting, stretching or rupture of the ligaments around a joint, or of the skeletal muscle fibres anywhere బెణకు, వాడు.భా. బెణుకు: కీలుచుట్టూ ఉన్న స్నాయువు లేదా ఎక్కడైనాఉన్న నియంత్రిత కండర తంతువులయొక్క వడిగల/తీవ్రమైన, ప్రయాసపెట్టు, పిండినట్లుండు, సాగదీయు లేదా చించే ప్రక్రియలో కలుగు వేదన, *ఉదా.* వాడు.భా. మెడనరం పట్టింది; నడుము పట్టింది.

**spray** fountain of tiny droplets, *e.g.* 1. aerosol in asthma తుషారయంత్రం, ఉదా. ఉబ్బసంలో వాడేది. 2. **nasal s.** నాసికా తుషారకౌషధం. 3. spray for room as a disinfectant వాతావరణ/వాయు క్రిమి కాలుష్యహారిణి, శుచికరి, శుద్ధకారిణి. 4. **perfume s.** పరిమళ తుషారం.

**sprue** malabsorption syndrome causing diarrhoea పేగులందు శోషణలోపము: విరేచనాలు కలిగించే ఒకరకమైన అంత్రవ్యాధి. marked by steatorrhoea (fatty stools), glossitis, anaemia వ్యాధి లక్షణములు: విరేచనములో అధికముగా క్రొవ్వుపదార్థములు విసర్జింపబడుట, నాలుక 'నొప్పి వేడి మంట తీపు వాపు', రక్తహీనత. **celiac s.**, celiac disease precipitated by eating gluten-containing foods (gluten = sticky substance found in wheat, bread, other grain) గోధుమ, రొట్టె, ఇతరధాన్యములోనున్న గ్లూటెన్ అను బంకపదార్థము కలిగిన ఆహారములు తినుటవలన సంక్రమించెడు స్ప్రూ (sprue) అనే వ్యాధి. **tropical s.**, the above symptoms with diarrhoea and characteristic bulky, pale, acid (hence burning in anus), frothy stools called mushy stools (mushy = thick and soft) ఉష్ణమండలప్రాంతాల్లో సంభవించు స్ప్రూ: పై లక్షణములు మరియు ప్రత్యేకించి అతిసారములోని విరేచనము యొక్క వర్ణన – చిక్కగా, మృదువుగా, మరింత/విస్తారముగా ఉండి; పాలిపోయిన తెల్లని వర్ణంకలిగిన (అధిక క్రొవ్వు పదార్థములవలన), అమ్లముతోకూడిన (అందుచేతనే ఆసనములో మంట), నురుగుగానుండు పురీషము/మలము.

**spur** a spike ముల్లు. **calcaneal s.**, a sharp bony projection beneath the heel bone which causes pain on walking and on pressing the inner side of the heel పాదకంటకము, ముల్లు: కాలి మడమ ఎముకక్రింద వాడియైన ఎముకముల్లు; నడుస్తున్నప్పుడు, మడమ ప్రక్కన నొక్కితే ఈ వేదన ఎక్కువ అవుతుంది. well seen on X-ray heel మడమ ఎక్స్‌రే ఫోటోలో బాగా కనబడుతుంది.

**sputum** material coming into the throat after coughing దగ్గితే వచ్చిన కఫము, కళ్ళె, వాడు.భా. గల్ల, కళ్ళె, బలగమ్ [*Cf.* spit which is saliva తారత. ఉమ్మి ఉత్తలాలాజలము]. **blood stained s.**,

pulmonary TB, commonest cause in our country. మనదేశంలో కఫములో రక్తం లేదా రక్తజీర తరచుగా ఊపిరితిత్తి క్షయవ్యాధి లక్షణము.

**squamous** scaly, *i.e.* covered with scales పొలుసులతో కప్పబడిన. **1. s. epithelium** శల్కల ఉపకళ. squamous = scaly or plate-like పొలుసు(ల)వంటి. 2. **s. cell carcinoma**, cancer arising in squamous epithelium శల్కల ఉపకళనుండి ఉద్భవించే కేన్సరు.

**squatting** a position with hips and knees bent, the buttocks resting on heels and feet kept flat గొంతుకు కూర్చొనుట: నిత్య జీవితంలో సాధారణముగా ప్రజలు విరేచనము/మలవిసర్జనము చేయునప్పుడు, స్త్రీలు స్నానము చేయునపుడు, తలంటి పోసుకున్నప్పుడు తాల్చు భంగిమ. In disease, this is adopted by children with some cardiac defects. కొన్ని గుండె దోషములున్న పిల్లలు ఇట్లా ఎక్కువసేపు కూర్చుంటారు. At times, parturient at the time of delivery may adopt this position. కాన్పు సమయములో కాబోయే మాతృమూర్తి ఈ భంగిమ దాల్చవచ్చును, అప్పుడప్పుడు.

**squint** strabismus మెల్ల (కన్ను) అలంకార. చిరుమెల్ల, సిరిమెల్ల ప్రౌఢయువతి ముఖమునకు ఒక చిరుఅందము.

**stab injury** wound with a sharp pointed weapon (knife or lance) caused by piercing కత్తితోగాని బల్లెంతోగాని మరిఏదైనా పదును పనిముట్టుతో పొడిచినగాయం. of medicolegal nature న్యాయవైద్యశాస్త్రసం.

**stain** 1. blood stain రక్తమరక. 2. a colouring substance employed to impart colour to cells, bacteria, *etc.* to identify them under the microscope వర్ణకము: సూక్ష్మదర్శినిలో పోల్చుటకు కణములు, సూక్ష్మజీవులు వగైరా జీవులను వర్ణకము చేయుట. **acid-fast s.,** (AFB acid fast bacilli) also called Ziehl-Neelsen stain for identification of TB and leprosy bacilli క్షయవ్యాధి మరియు కుష్ఠ రోగము కనుగొనుటకు కృషి. **Gram's s.,** *see/చూడండి* Gram's stain. **hematoxylin-eosin s.,** for routine tissue examination పరిపాటిగా కణజాల పరిశీలనలో ఉపయోగించు అభిరంజనము. **Leishman's s.,** for staining blood film, some cocci (microorganisms) రక్తకణముల తనిఖీ, కొన్ని కొక్కై (సూక్ష్మజీవులు)ను చూడటానికి.

**staining** the procedure to stain వర్ణీకరణము, అభిరంజనము, వర్ణకము అనే ప్రక్రియ, రంగువేయు.

**stammering** involuntary pauses in speech నత్తి: నత్తిగా మాట్లాడుట, మాటల్లో అనియంత్రిత నిలుపు/విరతి.

**standardization** 1. to bring into accepted standards ప్రామాణీకరణం. 2. making an agent/drug conform to standards వస్తువు/ఔషధాన్ని ప్రమాణం ప్రకారం తయారుచేయుట.

**standstill** stoppage, say **cardiac s.**, cardiac arrest *see/చూడండి* arrest. గుండె బందు. **respiratory s.**, respiratory arrest శ్వాసనిలుపుదల.

**stapedectomy** surgical excision of stapes and implantation of a prosthesis in its place, an operation done in otosclerosis for restoration of hearing బధిర చికిత్స: కర్ణఅస్థి గట్టిపడిన జబ్బులో స్టేపీస్‌ను శస్త్రనైపుణ్యం ద్వారా తీసివేసి/తొలగించి ఆస్థానంలో కృత్రిమ, నకిలీ/నకలు ఎముక అమర్చుట.

**stapes** ossicle in the middle ear, *see/చూడండి* ear. *resemblance:* stirrup అస్థిక; మధ్యచెవిలో సున్నిత అస్థి, *పోలిక:* రికాబు, అంకవన్నె.

**staphylectomy** cutting the uvula కొండ/చిరు నాలుకను కత్తిరించుట. In smokers the uvula hangs inflammed (*resemblance:* burning wick) like the burning end of his cigarette. పొగపీల్చువారిలో ఇది 'ఎరుపు వాపు'తో ప్రకాశించి (*పోలిక:* వెలిగే వత్తివలె) తానుత్రాగు సిగరెట్టు మండేకొనలాగున అగపడుతుంది. కొండనాలుక వాలింది – దగ్గుకు కారణం అని చాలామందికి అపోహ; కాబట్టి కొండనాలుకను కొండెక్కిస్తే వారికి ఆరోగ్యం కుదుటబడుతుందని ఆశ.

**Staphylococcus** a genus of gram-positive bacteria ఒక ప్రజాతి బాక్టీరియా. *S. aureus,* (aureus = బంగారం రంగు) produces yellow pus in boils, wounds, *etc.* కురుపులు, గాయములు, మొ. వాటిల్లో బంగారు వర్ణము/పసుపు పచ్చ చీము.

**staphyloma** bulging of the cornea or sclera due to inflammatory softening కంటిలోని శుక్లపటలంగాని శ్వేతపటలంగాని శోథంతో మెత్తపడి ముందుకు ఉబ్బుట. **anterior s., posterior s.**

**starch** the carbohydrates present in potatoes, rice, wheat, maize, *etc.* అలుగడ్డ, వరి, గోధుమ, మొక్కజొన్న, మొ. వాటిలోనున్న పిండి పదార్థములు, గంజి, జిగురు (కార్బొహైడ్రేట్లు).

**starvation** deprivation of food for the body శరీరానికి ఆహార రాహిత్యము. 1. in disease states like cancer of oesophagus where he/she cannot swallow అన్నవాహిక కేన్సరులో మ్రింగుటకు కష్టంగాబట్టి ఆహారం లోపలికిపోదు. 2. during famine due to non-availability of food క్షామము, దుర్భిక్షము; కరవు కాటకాల్లో ఆహారం దొరకనందువలన. 3. fast in vows and challenges to achieve an objective నిరాహారదీక్ష. *N.B.* starvation deaths are not uncommon *గమనిక:* ఆహారలేమి వలన మరణాలు కద్దు. ఆంధ్రరాష్ట్ర అవతరణ కొరకై అమరజీవి పొట్టి శ్రీరాములు గారి ప్రాణత్యాగం.

**stasis** stagnation: accumulation of secretions/excretions due to diminution of flow నిలవ: స్రావములు/విసర్జనములు నిలిచిపోయి నిలవ అవటం. **intestinal s.,** When intestinal peristalsis is sluggish, stasis in the intestine is inevitable. కదలిక జీవితానికి ముఖ్యం. ఎప్పుడైతే అంత్రచలనము మందగిస్తుందో, లోన నిలవ తప్పదు. **urinary s.,** *resemblance:* Obstruction/block to the sewerage/drainage results in stasis, foul smell, *etc.* పోలిక: మురికినీళ్ల కాలువలలో అడ్డు సంభవిస్తే మురికి నిలవ అయి దుర్వాసన కొడుతుంది. Similarly obstruction in the urinary tract interferes with urine flow. అట్లాగే మూత్ర ప్రవాహంలో అడ్డు సంభవిస్తే మూత్ర సరఫరాకు ఆటంకం కలుగుతుంది. *N.B.* Stagnation anywhere in the body is the starting point/nidus for any trouble in the science of medicine; hence drainage is essential. In a block of such drainage, doctors' intervention is inevitable/unavoidable. *గమనిక:* వైద్యశాస్త్రంలో దేహంలో ఎక్కడైనా నిల్వ సంభవిస్తే అక్కడ ఆపదకు ఆలవాలం. అప్పుడు డాక్టర్ల సాయం తప్పదు మరి.

**statistics** information shown in numbers నిరూపక సంఖ్యాశాస్త్రము. **medical s.** వైద్య గణాంకశాస్త్రం. **vital s.** జీవావశ్యకమైన గణాంకం.

**status** 1. continuous suffering సతత అవస్థ. **s. asthmaticus,** continuous bronchial spasm విరామము లేకుండా బాధించు/పీడించు

ఉబ్బసము. **s. epilepticus,** continuous epileptic convulsions తెరపి లేకుండా తాండవమాడు మూర్ఛలు, నిర్విరామ అపస్మారము. 2. **nutritional s.** పోషణ స్థాయి, పోషణావస్థ.

**STD** *abbr.* sexually transmitted disease. also called **venereal disease.** acquired by sexual intercourse or genital contact లైంగిక సంపర్కం ద్వారా సంక్రమించు వ్యాధి. *గమనిక:* స్వయంకృతాపరాధ పర్యవసానం. historically five diseases 1. syphilis కొరుకు సవాయి రోగము. 2. gonorrhoea గనేరియా, సెగ. 3. chancroid. 4. granuloma inguinale/venereum గజ్జల్లో సూక్ష్మకణిక గుల్మం. 5. lymphogranuloma inguinale/venereum గజ్జల్లో బిళ్ళలు. To these have been added: herpes genitalis, trichomoniasis, genital candidiasis, AIDS, hepatitis B. వీటిలో ఇంకా చేర్చబడినవి: బాహ్యలైంగిక అవయముల సర్పి, ... ఎయిడ్స్‌వ్యాధి, హెపటైటిస్ B.

**steapsin** an enzyme, a lipase. fat-splitting, lipolytic enzyme కొవ్వును విచ్ఛిన్నం చేసే ఎన్‌జైమ్.

**steatoma** 1. a lipoma, tumour consisting of fat కొవ్వుకంతి. 2. [Greek. a sebaceous tumour] చర్మతైల గ్రంథి కణితి.

**steatopygia** or **steatopyga** excessive accumulation of fat in buttocks కొవ్వుతో కూడిన కటి ప్రదేశం, పెద్దవైన పిరుదులు, నితంబ ఉబుకు/ఉబ్బు; అలంకార. మొత్త జాస్తి.

**steatorrhoea** or **steatorrhea** a state of excess fat in stools విరేచనములో అధికకొవ్వు ఉన్న స్థితి.

**steatosis** 1. adiposis కొవ్వుతో కూడిన స్థితి. 2. fatty degeneration కొవ్వు చేరినందువలన క్షీణత. 3. stearoderma, any disease of the sebaceous glands చర్మతైల గ్రంథుల జాడ్యం.

**stellate** star like తార/నక్షత్రము ఆకృతిగల. **s. ganglion** నక్షత్ర నాడిముడి.

**stenocardia** angina pectoris, *see/చూడండి* angina pectoris.

**stenosis** narrowing or constriction of a vessel/duct నాళము లేదా నాళిక/వాహిక సన్నగిల్లుట/కుంచనము. **aortic s..** *see/చూడండి*

aortic stenosis. **mitral s.,** *see/చూడండి* mitral valve. **pyloric s.,** *see/చూడండి* pylorus.

**stent** mold of suitable tube-like material inserted into a tubular structure వాహికలోనికి దూర్చే గొట్టపు అచ్చు/పోత. **s. in a bile duct** పైత్యరసనాళములో అమర్చేది. **s. in a coronary vessel** కొరొనరి రక్తనాళంలో అమర్చేది.

**stercobilin** brown orange red bile pigment derivative; colour of faeces is due to this నీరుకావి నారింజ ఎరుపు వర్ణముగల పైత్యవర్ణకము – ఇది పైత్యరసములో ఉంటుంది; మలములోని వర్ణము దీనివలన కలుగును.

**stercobilinogen** precursor of stercobilin స్టెర్కొబైలిన్ యొక్క అగ్రగామి.

**stercolith** faecalith, *see/చూడండి* scybala. పేగుల్లో మలము రాయివలె గట్టిపడుట.

**stercoraceous** pertaining to or resembling faeces మలమునకు సం. లేదా మలమును పోలిన. 1. containing or consisting of faeces మలముతో కూడిన. 2. referring or relating to faeces మలమునకు సం. అలంకార. మలమూలం ఇదం పదమ్.

**stereotactic** precise positioning in a three dimensional view, *viz*, width, length, depth, *e.g.* **s. brain surgery** మూడు పరిమాణములు, వెడల్పు, పొడవు, లోతు తెలిపే సాధనముతో మెదడుకు శస్త్రచికిత్స విన్యాసము/నెరవేర్చుట.

**sterile** 1. aseptic, free from living microorganisms అపూతిక: సూక్ష్మజీవులు లేనట్టి స్థితి. 2. not fertile, not able to reproduce offspring వంధ్యమైన: ప్రత్యుత్పత్తి/సంతానోత్పత్తికి అసమర్థ.

**sterility** infertility వంధ్యత్వము/వంధ్యాత్వము, ఫలసామర్థ్యము లేనిస్థితి.

**sterilization** 1. procedure of destroying microorganisms in an instrument called sterilizer క్రిమిరాహితీకరణము: సూక్ష్మజీవులను హతమార్చు మెషిన్ – స్టెరిలైసర్. 2. an operation to make a person sterile, *i.e.* incapable of reproduction, *e.g.* tubectomy in the female, vasectomy in the male వంధ్యీకరణము: సంతానోత్పత్తికి

అర్హులుగాకుండా చేయు శస్త్రవైద్యము; స్త్రీలలో పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ (చిన్న ఆపరేషన్) – ఫాలోపియన్ నాళములు కత్తిరించుట; పురుషులలో శుక్రవాహికలు ఛేదించుట/కత్తిరించుట.

**sterilizer** instrument used for sterilization క్రిమిరాహిత్యకారి.

**sternal** pertaining/relating to the sternum ఉరోస్థికి సం.

**sternoclavicular** relating to the sternum and clavicle ఉరోస్థికి మరియు జత్రుకకు సం. **s.junction,** s.joint ఉరోస్థి, జత్రుక కలిసే కీలు.

**sternocleidomastoid** relating to the sternum, clavicle and mastoid process behind the ear ఉరోస్థి, జత్రుక మరియు చెవివెనుక మాస్టాయిడ్ కీలితమునకు సం. **s. muscle,** a muscle by this name on the side of the neck స్టెర్నోక్లీడో మాస్టాయిడ్ అను పేరుగల కండరము: మెడప్రక్కకు తిప్పితే ఒక కాడవలె కనబడుతుంది.

**sternotomy** sternum-splitting manoeuver/operation to approach the heart గుండెమీద ఆపరేషన్‌లో ఉరోస్థిని చీల్చి, ఛాతీలోపలకు చోటు చేసుకుని, ఆపరేషన్ చేస్తారు.

**sternum** elongated flat bone in the front of the chest which comprises 3 segments, manubrium, body and xiphoid process ఉరఃఫలకము, ఉరోస్థి: ఎదురురొమ్ములో పలచటి పొడుగాటి ఎముక. It forms a shield to the heart behind. హృదయరక్షకఫలకము: వెనుకనున్న గుండెకు కాపు/రక్షకము. sternal puncture, to obtain bone-marrow for study ఉరోస్థినుండి సూదితో మజ్జతీసి పరిశీలన చేస్తారు. sternum-splitting incision for operations on the heart గుండె ఆపరేషన్లలో ఉరోస్థిని చీల్చి, ఛాతీ లోపలికి మార్గం ఏర్పరుచుకుంటారు.

**steroid** a drug belonging to any of a large group of fat-soluble organic compounds క్రొవ్వులో కరిగే కార్బనిక పదార్థముల పెద్దగ్రూప్‌కు చెందిన ఔషధం. *e.g.* corticosteroid, *see*/చూడండి corticosteroids. There are natural and synthetic derivatives of steroids. Steroids are used in many diseases. స్వాభావికంగా మరియు సంయోగికంగా ఉత్పన్నమైన స్టీరాయిడ్‌లు అమలులో ఉన్నాయి. వీటిని పెక్కు రుగ్మతల్లో వాడ్తారు.

**sterol** a solid alcohol, కొవ్వుమద్యం. *e.g.* ఉదా. 1. cholesterol కొలెస్టిరాల్. 2. hormones secreted by the adrenal cortex and gonads ఎడ్రినల్ కార్టెక్స్ మరియు జననగ్రంథి బీజకోశాల హోర్మోన్లు. 3. ergosterol ఎర్గోస్టిరాల్.

**stertor** [stertorous *adj.*] the act of snoring, *see/చూడండి* snore. stertorous breathing/respiration గురకశ్వాస.

**stethoscope** 1. instrument used in the auscultation of heart, chest; hearing sounds over artery while recording blood pressure; auscultation of abdomen, fetal heart sounds, *etc.* స్టెతొస్కోప్: గుండె ధ్వనులు, ఛాతీమీద ధ్వనులు, బ్లడ్ ప్రెషర్ నమోదు చేస్తున్నప్పుడు; ఉదరముమీద అంత్రచలనధ్వనులు, గర్భస్థ శిశువుయొక్క గుండె ధ్వనులు, మొ. వినుటకు డాక్టర్లు ఉపయోగించు పరికరము. 2. *figur.* the renowned doctor's garland అలంకార. డాక్టరు మెడలో పేరుమోసిన దండ.

**sthenic** active; strong చురుకైన; బలమైన; శరీరసౌష్టవము, దేహ దారుఢ్యముగల [*opp.* asthenic, weak; debilitated వ్యతి. నీరసమైన; బలహీనమైన].

**stigma** a blemish, disgrace కళంకము. Even today a social stigma is attached to diseases like TB, leprosy. ఈ రోజుల్లో కూడా టి.బి., కుష్ఠువ్యాధి లాంటి జబ్బులను కొందరు సాంఘిక కళంకముగా ఎద్దేవా చేస్తున్నారు/భావిస్తున్నారు.

**stillbirth** delivery of a dead baby మృతశిశు జననం, మృతశిశువును ప్రసవించుట.

**stimulant** an agent or drug that increases the activity of an organ or function ఉద్దీపకం, ఉత్తేజకౌషధం; ఒక అవయవమునుగాని లేదా ఒక జీవిత విధిని కాని ఉద్దీపనం (stimulation) చేయు వస్తువు/మందు. **cardiac s.** హృదయోద్దీపకం.

**stimulate** to excite a function ఉద్దీపింపజేయు. *e.g.* Steroids stimulate the function of muscles and thus enhance the performance levels of sportsmen. ఉదా. స్టిరాయిడ్ మందులు క్రీడాకారుల కండరాల కదలికలను ఉద్దీపింపజేస్తాయి, తద్వారా పందెం గెలవటానికి తోడ్పడతాయి.

**stimulation** the process of stimulating ఉద్దీపనము, రేపుట, ప్రేరేపించుట. **coital s.** సంభోగ ఉద్దీపనము.

**stimulus** the trigger for an action ఉద్దీపన, ఉద్దీపకం, ప్రేరేపకము.

**sting** smarting pain మంట. **scorpion s.** తేలుకొండి, వృశ్చికము యొక్క వాడియైన కొండి మరియు ఆ కొండి కాటు.

**stippling** dotted appearance చుక్కలు పడినట్లు. **basophilic s.**, blue-dotted appearance of red blood cells in lead poisoning శరీరంలో సీసము ప్రవేశించిన విషపరిణామములో ఎర్రరక్తకణములు ఈ నీలి చుక్కలతో కనబడతాయి.

**stitch** 1. a suture by a surgeon కుట్టు: శస్త్రవైద్యుడు దారముతో కుట్టివేయు ముడి. 2. pain of a stitching type గుచ్చినట్లున్న నొప్పి. **s. removal,** sutures removed on $7^{th}$ or $8^{th}$ day after operation అపరేషన్ తర్వాత కుట్లు విప్పేది 7 వ లేదా 8 వ రోజు. 3. an adage for prompt action in any context – A stitch in time saves nine.

**stoma** mouth; opening ద్వారము; రంధ్రము. *e.g.* in a wound or boil ఉదా. గాయములోగాని సెగగడ్డలోగాని చీరినచోట గాడి. stomal ulcer: When an opening is made into a hollow organ, *e.g.* intestine, an ulcer develops sooner or later. రంధ్రము చేసినచోట వ్రణము, ఉదా. పేగులో రంధ్రముయొక్క పర్యవసానము.

**stomach** an elastic receptacle for food అన్నాశయము, జీర్ణాశయము, ఆమాశయము, అన్నకోశము, జీర్ణకోశం, జఠరము; స్థితిస్థాపకగుణము (elasticity) కలిగినటువంటి కుడ్యముగల ఆశయము (reservoir); అలంకార. అన్ని అగ్నులకన్నా జఠరాగ్ని మిన్న. **leather bottle s.,** linitis plastica, fibromatosis/cirrhosis of the stomach అన్నాశయము తోలుసంచివలె మారుట. అన్నాశయము ముడుచుకుపోయిన జబ్బు.

**stomachic** 1. *figur.* an agent which gives kick to the stomach, *viz.* stimulates the stomach, *e.g.* a gastric tonic. అన్నాశయమును ఉద్దీపింపజేయు వస్తువు, ఉదా. జఠరమునకు టానిక్. 2. aids digestion జీర్ణకారి.

**stomatitis** inflammation of the oral mucosa నోటిపూత, ఆస్య కుహరపు అస్వస్థత; ఆస్యశ్లేష్మపొరయొక్క శోథము/'నొప్పి మంట తీపు ఎరుపు వాపు'. **herpetic s.**, due to infection by herpes virus సర్పి వలన కలుగు 'అగ్నిమంట ఎరుపు వాపు'. **mycotic s.**, thrush; fungus infection నాలుక, నోటి, ఇతరశ్లేష్మపొరలు ఫంగస్ సంపర్కమునకు గురియగుట. **ulcerative s.**, వాడు.భా. నోట్లో నంజు బొబ్బలు. Some are due to vitamin B complex deficiency. కొన్ని విటమిన్ బి కాంప్లెక్సు లోపమువలన ఏర్పడును. Stomatitis and glossitis usually occur together. నోటి 'ఎరుపు వాపు' మరియు నాలుక 'తీపు ఎరుపు వాపు' సహబాధలు/తోడుబాధలు.

**stomatology** the study of the structure, functions and diseases of the mouth ఆస్యశాస్త్రం: నోరుయొక్క నిర్మాణము, విధులు, వ్యాధులు గురించిన శాస్త్రము.

**stone** 1. a calculus రాయి, శిల. 2. a unit of weight equivalent to 14 lbs. 14 పౌన్ల బరువు. 3. *figur.* leave no stone unturned in the diagnosis of a disease *అలంకార.* జబ్బు నిర్ధారణలో సాయశక్తులా కృషిచేయండి.

**stool** faecal discharge; bowel movement విరేచనము, విసర్జించిన మలము; వాడు.భా. బేది, పాయిఖానా, దొడ్డికి. **rice water s.**, characteristic of cholera *పోలిక:* కలరా జాడ్యంలో ప్రత్యేకత – బేదులు బియ్యంకడిగిన నీళ్లలాగా ఉంటాయి. **silver s.**, pale white abundant stools in tropical sprue పాలిపోయిన తెల్లని, పుష్కల పురీషము – దీన్ని ఉష్ణమండల స్ప్రూ వ్యాధిలో చూస్తుంటాము.

**storm** a strong exacerbation సంక్షోభము. **thyroid s.**, thyrotoxic s., sudden, violent dangerous aggravation of symptoms of thyrotoxicosis, especially after thyroidectomy, *resemblance:* onset of storm ఆకస్మిక, ఉగ్రమైన ప్రమాదస్థాయి సూచించు లక్షణములు, థైరాయిడ్ తుపాను; ముఖ్యంగా థైరాయిడ్ తీసివేసిన తర్వాత, *పోలిక:* తుపాను బీభత్సము.

**strabismus** squint మెల్లకన్ను. *అలంకార.* చిరుమెల్ల సిరిమెల్ల.

**strain** 1. overexertion to the point of fatigue అలుపు/అయాసము వచ్చేవరకు ప్రయాసము, క్లేశముతో కూడిన కసరత్తు, పాటు కల్గించు సాము. 2. to filter, *resemblance:* coffee filter వడియగట్టు, వడబోయు, *పోలిక:* కాఫీ ఫిల్టరు. 3. subject to colander, *resemblance:* separate stones from rice జల్లెడలో జల్లించు, పోలిక: బియ్యంలో రాళ్ళు జల్లించు. 4. subject to colation, *i.e.* to pass through a muslin cloth, to separate fine powder from coarse powder, *resemblance:* straining turmeric powder వస్త్రకాళితము పట్టు, పోలిక: పసుపుపొడిని సన్నని బట్టలో రాచి వస్త్రకాళితం పడితే మెత్తటి పసుపు క్రిందకు దిగుతుంది. 5. straining tea decoction from the boiled leaves in a tea strainer with a fine muslin తేయాకు నీళ్ళలో ఉడకబెట్టి దానిసారము రవసెల్లా (సన్నబట్ట) గల ప్లాస్టిక్ పరికరము (పెద్ద చెమ్చాలాగుంటుంది)లో వడబోయుట. 6. change in the size or shape of an agent after an application of force on it, *resemblance:* wheat flour after kneading, is made into chapati *పోలిక:* గోధుమపిండి మర్దించిన తర్వాత చపాతీలు చేయుట. 7. strains రకాలు. rough or smooth strains of bacteria సూక్ష్మజీవులలో గరుకు/కరకు లేదా మృదువు రకాలు. 8. muscular strain, overstretching of muscle fibres, giving rise to sprain కండరక్లేశము; బెణుకు: కండరతంతువులు సాగదీయబడి నొప్పిపుట్టుట. 9. mental strain/stress మానసిక బడలిక/తాకిడి.

**strait** passage/way, passage way మార్గము. **s's of pelvis,** pelvic inlet శ్రోణిమేఖల ప్రవేశము. pelvic outlet శ్రోణిమేఖల నిష్క్రమము. *figurative resemblance:* strait of Gibralter *ఉపమానముగా/అలంకారముగా పోలిక:* జిబ్రాల్టర్ జలసంధి.

**strangulated** to get squeezed పిసికిన, పిసికేసిన *resemblance:* constricted with a noose *పోలిక:* ఉరిత్రాడు చేత కుంచనము చేయబడిన/నొక్కబడిన. **s. hernia,** *see/చూడండి* hernia.

**strangulation** 1. throttle, throttling (from outside windpipe) గొంతుక పిసుకు, ఊపిరి అడకుండజేయు. 2. choking (from inside windpipe): occlusion of air passages, *e.g.* foreign body like pins,seeds, *etc.* శ్వాసనాళము/నాళికలలో ఏదైనా పదార్థము

కూరుకొనిపోవుట, ఉదా. పిన్నీసులు, గింజలు, మొ. 3. drowning నీటిలో మునిగిపోతున్నప్పుడు ఉక్కిరిబిక్కిరి అయి ఊపిరి ఆడకపోవుట. 4. congestion (may be, even gangrene) due to constriction of blood vessels, *see/చూడండి* gangrene, hernia. రక్తనాళముల/నాళికల కుంచనమువలన దేహములో ఒకచోట రక్తము అధికముగా కూడుట (అంతేగాక కుళ్ళుపుండు కావచ్చును).

**strangury** slow and painful micturition మూత్రకృచ్ఛ్రము: మూత్రంలో మంట; మందముగా, మంటతోకూడిన మూత్రవిసర్జనము, అలంకార. మూత్రంలో మంట గొప్పతంట సుమా!

**strap** adhesive plaster పుండుమీద దూదిపెట్టి అతికించే ప్లాస్టరు.

**stratified** arranged in layers, *see/చూడండి* epithelium. పొరలు ఒకదాని మీద/క్రింద మరియొకటి. *resemblance:* present day flats *పోలిక:* ఈరోజుల్లో అంతస్తులుగా కట్టే ఇండ్లు/ఫ్లాట్స్.

**stratum** layer of tissue కణజాలపు పొర.

**straw coloured pleural effusion** fluid resembling the colour of the dry cut-stalk of grain, in the pleural cavity పుపుసావరణ కుహరములో ఎండుగడ్డి రంగులోనున్న ద్రవము.

**Streptococcus** a genus of gram positive cocci arranged in chains గొలుసు రూపములో అమర్చబడి కనబడు కాక్కై (సూక్ష్మజీవుల) ప్రజాతి. *resemblance:* fruits of the tree *Acacia arabica,* Babul *పోలిక:* నల్లతుమ్మ కాయలు.

**streptococcus** an organism of the genus *Streptococcus* ఈ ప్రజాతికి చెందిన సూక్ష్మజీవి.

**streptomycin** an antibiotic produced by the microorganism, *Streptomyces griseus* సూక్ష్మజీవి తయారుచేసిన సూక్ష్మజీవినాశకము.

**stress** tension, strain ఒత్తు, ఒత్తడి (వాడు.భా. తాకిడి, ఒత్తిడి). a hidden killer, a villain in the etiology of many diseases మరుగైయున్న మారకము (మరణము కలిగించేది), పోలిక: వ్యాధి అంకురార్పణమునకు తోడ్పడు ఖలుడు. **s. induced diabetes** తాకిడికి తట్టుకోలేక వచ్చినది; ఒత్తిడియొక్క నేపథ్యములో అంకురించిన మధుమేహం వ్యాధి.

**stretcher** a contrivance for carrying the sick/injured వ్యాధి గ్రస్తులను/గాయపడినవారిని తరలించటానికి/తీసుకవెళ్ళు ఉపాయము/సాధనము.

**striae** scar like linear streaks మచ్చవలెనుండు నిడుపాటి చారలు. **s. atrophicae,** lineae albicans, linear pale white shrivelled streaks over knees, thighs, abdomen, breasts, buttocks గీతలు, రేఖలు – ఇవి సన్నగా ఉలిపిరి కాగితంవలె ముడతలు పడి తెల్లగా (పాలిపోయినట్లు) మోకాళ్ళు, తొడలు, పొట్ట, స్తనములు, పిరుదులమీద అగుపడతాయి. **s. gravidarum,** the streaks of the above description resulting from pregnancy గర్భధారణ యొక్క పర్యవసానంగా ఏర్పడే, పై వర్ణనగల రేఖలు.

**striated** striped, *see/చూడండి* muscle. చారలుగల.

**striatum** corpus striatum మెదడులో ఒక భాగము.

**stricture** abnormal narrowing of a tubed structure, *e.g.* **s. of urethra,** secondary to gonorrhoea సంకోచము, ఆకుంచనము, నికోచం: నాళము/వాహికలోపల సన్నగిల్లుట, ఉదా. గనేరియా రోగంలో మూత్రమార్గ సంకోచము.

**stridor** [stridulous *adj.*] harsh high-pitched shrill sound వినుటకు/చెవులకు కఠోర, హెచ్చు కీచుగల శబ్దము; కీచుమనెడు చప్పుడు. **laryngeal s.,** *see/చూడండి* laryngismus.

**stroke** *colloq.* much used/abused term అఘాతక్షతము; వాడు.భా. తరచుగా/సరియైన అర్థం తెలియకుండా వాడే పదము. apoplexy రక్తస్రావము. seizure/fit మూర్ఛ. pulsation throb గుండె, నాడి, మొ. వాని స్పర్శ. 1. a sudden and severe attack అకస్మిక మరియు ఉగ్రమైన ఘటన(ము). 2. **s. syndrome,** vascular disorder in the brain మెదడులో రక్తనాళముల అపవ్యవస్థ/జబ్బు. lesion in brain (haemorrhage, embolism, thrombosis, rupturing aneurysm) మెదడులో క్షతము (రక్తస్రావము, ఎంబొలస్, థ్రాంబస్, రక్తనాళము ఉబ్బి పగలడం). As a result of this, convulsions, haemiplegia, aphasia may occur. దీనివలన మూర్ఛలు, పక్షవాతము, మాటపడిపోవుట సంభవించవచ్చును. 3. **heat s.,** *see/చూడండి* heat.

**stroma** the supporting ground substance or matrix in an organ స్ట్రోమము: అవయువములో ఆధారభూతమైన పదార్థము లేదా మాత్రిక [*in contr.* parenchyma భిన్న. మృదుకణజాలము].

**struma** goiter, *see/చూడండి* goiter.

**strychnine** an extremely poisonous alkaloid derived from *Strychnos nux-vomica;* poison acting on neural impulses విష ముష్టి (చెట్టుపేరు) నుండి ఆల్కలాయిడ్: నాడీ ప్రచోదనములమీద ప్రభావమువలన మారణశక్తిగల ఆల్కలాయిడ్.

**stump** the distal end of a limb remaining after amputation అంగచ్ఛేదనము తర్వాత మిగిలిన అంగముయొక్క మొండిభాగము/అంచు.

**stupe** a medical/medicinal fomentation ఔషధంతో కాపడం. **turpentine s.,** hot, wet cloth soaked in turpentine for external application to counter-irritate an inflammed part వేడి, తడిగుడ్డ కర్పూరతైలంలో ముంచి 'మంట వాపు' ఉన్న ప్రాంతంలో కప్పితే ప్రతి రేపెడు గుణం కలుగుతుంది.

**stupor** [stuporous *adj.*] reduced level of consciousness మైకము, మత్తు. *e.g.* in brain damage ఉదా. మెదడు చెరుపులో.

**stye** hordeolum, an abscess at the edge of the eyelid రెప్పకురుపు: కంటిరెప్ప అంచున సెగగడ్డ.

**styloid** peg-shaped, styliform గూటమును పోలిన. **s. process** of temporal bone కణత ఎముక కీలితము *resemblance:* stylus పోలిక: గంటము.

**stylomastoid** relating to the styloid and mastoid processes of the temporal bone కణత ఎముకలోని కీలితములకు సం. **s. foramen,** an opening which transmits the facial nerve 7వ కపాలనాడి వెడలే రంధ్రం.

**styptic** an astringent to stop bleeding రక్తస్రావ నిరోధకారి, రక్తస్తంభకి: రక్తస్రావం అరికట్టుటకు వగరు ఔషధం.

**subacute** a stage between acute and chronic తీక్షణదశకు దీర్ఘదశకు మధ్యలోనున్న దశ. *e.g.* **s. bacterial endocarditis** ఒకగుండె రుగ్మత. **s. combined degeneration of the spinal cord,** a complication

of pernicious anemia ఒకరకమైన రక్తహీనత జబ్బులో వెన్నుపాము క్షీణత.

**subarachnoid** sub = under. between the arachnoid and pia mater, *see/చూడండి* cerebrospinal fluid, meninges. లూతికళకు `పయామేటర్‌కు మధ్య.

**subclavian** beneath the clavicle జత్రుకక్రింద. **s. artery** అధోజత్రుకాధమని. **s. vein** అధోజత్రుకాసిర.

**subclinical** disease with no manifest clinical findings మరుగున ఉన్న జాడ్యము, గుప్తజాడ్యము.

**subconjunctival** beneath the conjunctiva కంటిపొర క్రింద. **s. hemorrhage** కంటిపొర క్రింద రక్తస్రావము. **s. injection**, of some drugs కొన్ని మందులు కంటిపొరక్రింద సూదితో ఎక్కిస్తారు.

**subcutaneous** beneath the skin చర్మముక్రింద. **s. injection**, especially injection of insulin చర్మముక్రింద సూది, ప్రత్యేకించి ఇన్సులిన్ సూది.

**subdiaphragmatic** below the diaphragm విభాజక పటలము క్రింద.

**subdural** beneath the duramater పరాశిక అడుగున. **s. haematoma** పరాశిక అడుగున రక్తం గూడు కట్టుకొనుట.

**subinvolution** an arrest in the normal involution of the uterus after babybirth కాన్పు తర్వాత గర్భసంచి యథాస్థితికి ముడుచుకొన లేకపోవుట.

**subjective** relating to the subject, in this context patient రోగికి సం. లేదా అనుభవమైన. **s. symptoms**, personal feelings, not perceptible to others తనకున్న బాధలు, ఇతరులకు గోచరముకానివి [*Cf.* objective signs *తారత.* ఇతరులకు కనబడే చిహ్నములు].

**sublingual** underneath the tongue అధోజిహ్వ, నాలుకక్రింద.

**subluxation** partial dislocation (of a joint), *e.g.* the shoulder joint కీలులో కొంత భాగం తొలగుట, ఉదా. బుజముకీలులోని భాగములు పాక్షికముగా స్థానభ్రంశమగుట.

**submandibular** *syn.* submaxillary. *see/చూడండి* submaxillary.

**submaxilla** bone beneath the maxilla (older nomenclature for mandible is inferior maxilla). the mandible హనువు.

**submaxillary** below the maxilla అధోజంభిక *syn.* submandibular అధోహనువు. **s. salivary gland** హనువు క్రింద ఉండే లాలాజల గ్రంథి.

**submental** beneath the chin చుబుకము క్రింద.

**submucous** underneath the mucous membrane శ్లేష్మపొర క్రింద.

**subperiosteal** underneath the periosteum అస్థికవచము క్రింద.

**subpharyngeal** below the pharynx సప్తపథ అనగా గొంతు క్రింద.

**subphrenic** beneath the diaphragm విభాజక పటలము క్రింద. *e.g.* **s. abscess** ఉదా. అక్కడ చీముగడ్డ.

**subpleural** underneath the pleura ప్లూరా క్రింద.

**subpreputial** underneath the prepuce, foreskin on the glans penis, *e.g.* a typical site for chancre మేఢ్రమణి మీద వెనుదిరుగు చర్మము క్రింద, ఉదా. ప్రత్యేకించి (సవాయి) కొఱుకుడు పొక్కు/పుండు అంకురించే చోటు.

**subscapular** below the scapula అంసఫలకము క్రింద.

**substance** 1. primordial constituent of an organ/part బీజ భూత పదార్థము; అవయవమునకు ప్రాథమిక/ప్రధానమైన అల్లిక. **ground s.**, matrix, the framework of connective tissue cells and fibres మాత్రిక: బంధనకణజాలము మరియు తంతువులతో అల్లబడిన అధార పదార్థము, మూలబీజ పునాది. 2. **slow-reacting s. of anaphylaxis (SRS-A)** which induces contraction of some smooth muscles, primary mediator in asthma, *see/చూడండి* anaphylaxis, asthma. ఉబ్బసములో జరుగు ప్రక్రియలు.

**substantia** substance పదార్థము. **s. nigra,** in brain మెదడులోని ఒక భాగము.

**substernal** beneath the breast bone ఉరఃఫలకము దిగువ/క్రింద. **s. goitre,** an enlargement of the thyroid gland, with a portion beneath the sternum ఉరోస్థి దిగువన థైరాయిడ్ ఉబ్బు [*q.v.* retrosternal goitre; it may extend substernally].

**subsultus** muscular tremor కండరకంపం. **s. tendinum,** twitching, particularly in the muscles around the wrist, in severe fever like typhoid విశేషంగా, టైఫాయిడ్ జ్వరంలాంటి తీవ్ర జ్వరాల్లో మణికట్టు పేశీల వణకు.

**subtentorial** beneath the tentorium of the cerebellum అనుమస్తిష్కము/ చిన్నమెదడుయొక్క టెంటోరియమ్ అడుగున.

**subthalamus** subthalamic tegmental region పృష్ఠాసనము/పర్యంకము దగ్గర – మెదడులో ఒక భాగము. subthalamic nucleus పర్యంకము దగ్గర నాడీప్రాంతం.

**subtotal** less than total, partial అసంపూర్ణ. **s. hysterectomy,** removing part of the uterus గర్భసంచిలో కొంతభాగం తీసివేయుట [*in contr.* total hysterectomy *భిన్న.* గర్భసంచి మొత్తం తీసివేయుట].

**subtrochanteric** below the trochanters of the femur, *N.B.* a common site for fracture తుంటి ఎముకయొక్క రెండు బొడిపల దిగువన, *గమనిక:* తరచుగా ఎముక విరిగే స్థలము.

**subungual** underneath a nail గోరు అడుగున.

**succinic acid** dibasic acid that occurs in plants and animal tissues where it plays an important role in metabolism సక్సినికామ్లము: జంతువుల మరియు వృక్షకణజాలముల జీవనక్రియలో ముఖ్యమైన పాత్ర వహించే ఆమ్లములలో ఒకటి.

**succussion splash** when gas and fluid are present in a body cavity, *e.g.* pleural cavity, a splashing sound heard on auscultation by stethoscope, when the body is shaken. *ఉదా.* పుపుసావరణ కుహరములో వాయువు మరియు ద్రవము చేరినప్పుడు శరీరాన్ని కుదిపినప్పుడు 'కుళుక్' శబ్దం స్టెతొస్కోప్‌లో వినబడుట.

**sucrose** a complex carbohydrate (sugar): cane, beet or maple sugar సంశ్లిష్ట శర్కర: చెరకు, బీట్‌రూట్‌లో చక్కెర, లేదా గంగరేను వంటి చెట్టుసొన నుండి చక్కెర.

**suction** 1. the act of sucking పీల్చే ప్రక్రియ. 2. withdrawal of fluid/gas from a body cavity, *e.g.* pleural cavity *ఉదా.* పుపుసావరణ కుహరములోనుండి ద్రవము/వాయువు తీయుట. **Ryle's tube s.,**

withdrawal of fluid from the stomach by this tube నాళమువేసి అన్నాశయములోనుండి ద్రవము తీయుట.

**sudamen** [sudamina *pl.*] a small vesicle due to retention of fluid in a sweat follicle, or in the epidermis స్వేదపుటికలో గాని, అధి చర్మంలోగాని ద్రవపూరితమైన చిన్న పొక్కు.

**sudomotor** stimulating the sweat glands స్వేదగ్రంథులను ఉద్దీపింప జేయు.

**sudorific** diaphoretic, sudoriferous. 1. promoting sweating, *e.g.* exercise, summer season, exposure to a source of heat చమట పట్టించు, ఉదా. వ్యాయామము, ఎండాకాలము, ఉష్ణోత్పత్తిస్థానము వద్ద నుండుట. 2. an agent that produces sweating, *e.g.* pilocarpine. ఉదా. చమటపట్టించే మందు.

**sudorrhoea** or **sudorrhea** hyperhidrosis అధిక స్వేదము. అలంకార. సదార్ద్రత, స్వేదవర్షం, స్వేదసిక్తం.

**suffocate** obstruct the breath passage of someone నోట్లో గుడ్డలు కుక్కి ముక్కు మూయడం, పీక నొక్కటం, వగైరా. అలంకార. సినిమాలో, TVలో హింసాత్మక దృశ్యాలు.

**suffocation** 1. asphyxiation ఊపిరి ఆడకుండుట; శ్వాస అవ రోధము/నిరోధము. 2. hindrance to respiration ఉక్కిరి బిక్కిరి అగుట.

**suffusion** 1. the process of spreading or diffusion వ్యాపనము, వ్యాప్తిపరచు లేదా విసరణ ప్రక్రియ. 2. the condition of tissues being permeated through, say by blood, *e.g.* **s. of face** in superior vena caval obstruction రక్తము కణజాలములలోనికి దూరుకొనిపోవు, సూక్ష్మరంధ్రములద్వారా చొచ్చుకొనిపోవు, అనగా పారగమ్యతగల స్థితి, ఉదా. ఊర్ధ్వ బృహత్సిర మీద ఒత్తిడి పడినప్పుడు పైన 1. లో వివరించిన విసరణ ప్రక్రియవలన ముఖము నీలిరంగుగా తేలియుండుట.

**sugar** carbohydrate చక్కెర. అలంకార. తీపుతోఉన్న పాపకు తీపి ఇస్తే కాస్సేపు తాపీగా/తృప్తిగా ఉంటుంది.

**suggestion** 1. introduce an idea/thought సూచించుట. 2. **posthypnotic s.**, following of a suggestion induced during hypnosis, *see*/చూడండి hypnosis.

**suicide** ending one's own life ఆత్మహత్య, దేహత్యాగం: తననుతాను హతమార్చుకొనుట. [*Cf.* homicide తారత. ఖూని].

**sulcus** [sulci *pl.*] 1. a groove గాడి. 2. furrow గీత, నాగటిచాలు. 3. *anat.* one on the surface of the brain, separating the gyri, *see/ చూడండి* gyrus. ఖనితము: మస్తిష్క తలముమీద సంవలితాలమధ్య గాడి.

**sulcus centralis** central sulcus. fissure of Rolando, on the lateral surface of each cerebral hemisphere మస్తిష్క గోళార్ధం మీద ఉండే రొలాండో గాడి.

**sulpha** or **sulfa** denoting the sulpha drugs.

**sulphonamides** sulpha drugs; group of drugs having a bacterio-static action, *e.g.* sulphadiazine, sulphanilamide derivatives. జీవాణుక్రిమిస్తంభక (bacteriostatic) మందులు.

**sulphur** a yellow non metallic element గంధకము. **s. ointment**, for skin disorder particularly scabies గంధకం మలాము – చర్మ అపవ్యవస్థలకు, ముఖ్యముగా గజ్జికి వాడ్తారు.

**sunburn** erythema of skin caused by ultraviolet rays after excessive exposure to hot sunlight తీక్ష్ణమైన ఎండతాకిడికి అతినీల లోహిత కిరణధాటి వలన చర్మము కములుట (వాడు.భా. కమిలిపోవుట), కందిపోవుట; అలంకార. విడమిన్ డి కారకుని అనుగ్రహము; సూర్యుడు అనుగ్రహిస్తాడు, ఆగ్రహిస్తాడు కూడాను!

**sunstroke** heat stroke ఎండదెబ్బ *see/చూడండి* heat.

**superciliary** pertaining to the eyebrow కనుబొమకు సం.

**superego** in psycho analytic Freudian theory. long term 'conscience'. part of the mind concerned with morality and self-criticism, internalized especially to parents or teachers, as a measure of standard మనోవిశ్లేషణ చేసే ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం: దీర్ఘకాల 'మనస్సాక్షి', ధర్మాధర్మ విచక్షణ శక్తి, అంతఃకరణము, అంతరాత్మ, సదసద్వివేకము, నైతిక విలువలకు ప్రాముఖ్యత నిచ్చుట, తన్ను తాను విమర్శించుకొనుట – వీటికి ఆదర్శముగా తల్లితండ్రుల్ని, గురువులని పెట్టుకొనుట.

**superfecundation** the fertilization of two or more ova released during one mestrual cycle by sperms from the same or different

males during separate acts of coitus ఉపరి పిండోత్పత్తి: ఒకే ఋతుక్రమంలో వచ్చిన రెండుగాని ఇంకా ఎక్కువగాని అండములు ఒకేగాని లేక వివిధ పురుషుల వివిధ సంభోగచర్యల వలన ఫలదీకరణం చెంది, బహుళ పిండములు ఏర్పడే/ఉత్పన్నమయే స్థితి. [*q.v.* twin pregnancy].

**superfemale** a sterile woman having three X chromosomes and two sets of autosomes మూడు X క్రోమోసోములు రెండు వరుసలు ఆటోసోములు గల స్త్రీ [*Cf.* supermale].

**superfetation** hypercyesia. The presence of two fetuses of different ages, not twins, in the uterus గర్భసంచిలో వివిధ వయస్సులు గల రెండు భ్రూణములుండుట; ఇవి కవలలు కాదు సుమా!

**superficial** 1. on, near or relating to the surface పైన, మీద, మీది తలము. **s. fascia** చర్మంకింద కండర ఉపరితలమున ఉన్న ఫేషియా/పొర. 2. **s. knowledge** మిడిమిడిజ్ఞానం.

**superinfection** a new super-added infection over an existing one, by bacteria resistant to the drug(s) in use సూక్ష్మజీవుల దాడికి మందు(లు) ఇస్తున్నప్పుడు ఆ మందు(ల)కు లొంగని నూతన బాక్టీరియా దాడి. అలంకార. ఉన్నదానిమీద ఉపరి.

**superior** *anat.* situated above మీద, పైని, ఊర్ధ్వ, అధి, [*in contr.* inferior, situated below భిన్న. క్రింద, అధో].

**supermale** a sterile man having one X chromosome and three or more sets of autosomes ఒక X క్రొమొసోమ్, మూడు వరుసలు లేదా ఇంకా ఎక్కువ ఆటోసోములు గల పురుషుడు. [*Cf.* super-female].

**superman** man with extraordinary physical prowess, say the one shown in TV అంతులేని శారీరకబలం/పుష్టి కల పురుషుడు, టి.వి.లో చూపిస్తారు, అతి/మహా బలశాలి.

**supernatant** floating on the surface పైని తేలెడు.

**supernumerary** in excess of the normal number నియమిత సంఖ్యను మించిన, ఉండవలసిన దానికన్నా ఎక్కువ. *e.g.* **s. digit(s)** ఉదా. చేతికి గాని పాదమునకు గాని అయిదుకన్నా ఎక్కువ వేళ్ళు. **s. nipple(s)** రెండుకన్నా ఎక్కువ చూచుకములు.

**superwoman** strong-willed, strong-minded, efficient, forceful woman కట్టుదిట్టమైన మనస్సుతో, సమర్థత కలిగి ఉన్న చలాకీ స్త్రీ. ప్రయోజకురాలు. బలిష్టమైన ప్రకృతి/స్వభావము కలది.

**supination** *e.g.* turning palm facing front ఉత్తానము, ఉదా. అరచేయి ముందుకు త్రిప్పుట [*opp.* pronation, turning palm facing back వ్యతి. అవతానము, అరచేయి వెనుకకు త్రిప్పుట].

**supinator** muscle which supinates ఉత్తానం చేసే పేశి [*opp.* pronator].

**supine** lying on the back ఉత్తానము: వెల్లికలా అనగా వెన్నుమీద పడుకొనుట [*opp.* prone, lying on the navel వ్యతి. అవతానము, బోర్ల అనగా బొడ్డు మీద పడుకొనుట].

**suppository** Motion/faeces is supposed to give an urge; when it has not done so, a one-inch missile-shaped medicated mass is introduced into the rectum through the anus. మలవిసర్జనకు వెళ్ళాలి అను ప్రేరణ సహజము; మలము బద్దకించినప్పుడు అసనములోనికి దూర్చు ఒక అంగుళము పొడవుగల మందు మిస్సైల్. *N.B.* After evacuation of faeces, the facies becomes bright. *గమనిక:* మలవిసర్జన కాగానే ముఖవైఖరి మెరుగు పడుతుంది.

**suppressant** an agent/drug that suppresses a body function, *e.g.* a drug that suppresses appetite ఒక జీవిత విధిని అణచివేయు వస్తువు/ఔషధం, ఉదా. ఆకలిని అణచివేయు ఔషధం.

**suppression** sudden stoppage of a secretion, excretion or normal discharge, *e.g.* **s. of menses** తగ్గించుట, అణచివేయుట: స్రావము, విసర్జనక్రియ లేదా సహజ విసర్జనము, ఉదా. ఋతువు ఆగిపోవుట. **s. of urine** మూత్రోత్పత్తి నిలచిపోవుట.

**suppuration** formation of pus due to infection by microorganisms చీముపోయుట: సూక్ష్మజీవుల దాడి ప్రభావమువలన చీముచేరుట, వాడు.భా. చీము పట్టింది.

**supraclavicular** above the clavicle అధిజత్రుక, జత్రుకపైన. **s. fossa** అధి జత్రుక గుంట.

**supracondylar** above condyle(s) *e.g.* fracture of the humerus, occurs in direct injuries or fall on elbow కందముపైన, ఉదా. భుజాస్థి అడుగు (మోచేతి) ప్రాంతంలో కందములపైని ప్రదేశంలో ఎముక విరుగుట; దానిమీద తిన్నగా/నేరుగా దెబ్బ తగులుటవలనగాని, మోచేతిమీద పడినందువలనగాని సంభవిస్తుంది.

**supradiaphragmatic** above the diaphragm విభాజకపటలము మీద.

**supraorbital** above the orbit (of the eye) నేత్రకోటరముమీద; కంటిగుంట పైన.

**suprapubic** above the pubes/pubic symphysis జఘన సంధానము మీది ప్రాంతము; పొత్తికడుపు. *e.g.* **s. cystotomy**, creating an opening into the urinary bladder and putting a tube for the drainage of urine ఈ ప్రాంతంలోనున్న మూత్రాశయములోనికి గొట్టము దూర్చి, మూత్రవిసర్జనకు తోడ్పడుట.

**suprarenal** 1. above a kidney అధివృక్క, కిడ్నీమీద. 2. pertaining to the adrenal gland, *see/చూడండి* adrenal gland. ఎడ్రినల్ గ్రంథికి సం.

**suprasellar** above the sella turcica, a saddle-shaped bony chair in which Pituitary, the Emperor of the endocrine kingdom sits. The tiny pituitary gland is no larger than the end joint of the little finger! *see/చూడండి* pituitary. గుర్రపు జీనులాంటి ఎముకకుర్చీలో పిట్యూటరి అనే వినాళికా గ్రంథుల సామ్రాజ్య సార్వభౌముడు కొలువుతీర్చి ఉన్నాడు అనగా కూర్చున్నాడు. ఈ చిరుగ్రంథి సైజు చిటికినవేలుకొన కీలు అంత!

**suprasellar cyst** craniopharyngioma. a congenital solid or cystic lesion, pituitary tumour ఘనపదార్థమైన లేదా తిత్తిగామన్న క్షతము, పిట్యూటరి కంతి.

**suprasternal** above the sternum ఉరోస్థి/ఎదుటి రొమ్ముఎముకపైన **s. notch**, Burns' space, above the sternum ఉరఃఫలకము/ఎదుటి రొమ్ముఎముక పైన గుంట/గంటు.

**supratentorial** above the tentorium cerebelli; a tent of duramater between the posterior part of the cerebrum and the cerebellum

అనుమస్తిష్క గుడారం: మస్తిష్కము వెనుకభాగమునకు మరియు సెరిబెల్లమ్‌కు మధ్యనున్న పరాశిక గుడారం/డేరా.

**sura** calf of the leg కాలుపిక్క. *N.B.* target of attraction in a beauty queen, to judge the grace in walking in a beauty contest/pageant *గమనిక:* అందాలపోటీలో అందాలరాణి నడుస్తున్నప్పుడు ఆ భామపిక్క ఆమె నాజూకు నడకకు సొగసునిస్తుంది.

**sural** pertaining to sura, say **s. strength** of a player పిక్కకు సం., ఉదా. క్రీడాకారుని యొక్క పిక్కబలము.

**surfactant** an agent which reduces the surface tension తలతన్యతను తగ్గించే గుణం గల వస్తువు. **pulmonary s.,** reduces the surface tension of pulmonary fluids thereby contributing to the elastic property of lung tissue ఊపిరితిత్తులలో ద్రవములయొక్క తలతన్యతను తగ్గించి, తద్వారా ఊపిరితిత్తి కణజాలముల స్థితిస్థాపక గుణమును నెలకొల్పుటకు సహాయపడుతుంది.

**surgeon** 1. a physician who specialises in surgery శస్త్రవైద్యుడు: శస్త్రవైద్యముచేయు నిపుణుడు. 2. one who is licensed to cut tissues శరీర కణజాలములమీద శస్త్రచికిత్స యోగ్యతాపత్రము గలవాడు. [*Cf.* physician *తారత.* భిషక్కు].

**surgery** 1. plan of treatment by operation శస్త్రవైద్యము. 2. operation theatre ఆపరేషన్ థియేటర్. 3. doctor's office వైద్యుని సలహా కేంద్రము. 4. Surgery, a surgical journal శస్త్రవైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**surrogate** renting an organ for a specified period, *e.g.* **s. womb,** *i.e.* A surrogate mother lets out her uterus till the birth of the baby. భ్రూణము/గర్భస్థశిశువును పెంచుట కొరకు, ఉదా. గర్భకోశము చూలుయొక్క పరిమితికాలమునకు అద్దెకు ఇచ్చుట; గర్భాశయమును గర్భనిలయముగా బాడుగకిచ్చుట.

**surrogate mother** *see/చూడండి* surrogate.

**susceptible** prone to disease వ్యాధికి లొంగుట. 1. readily affected, say to infection, because he lacks immunity or resistance వ్యాధినెదుర్కొను శక్తిలేక సూక్ష్మజీవుల సంపర్కమునకు తేలికగా వశమగువాడు. 2. susceptibility pattern of drugs to which the

microorganisms are susceptible (this word is a better substitute to 'sensitivity') సూక్ష్మజీవులు హతమార్చబడే ఔషధముల పట్టిక [*in contr.* resistant, *i.e.* not susceptible, nonresponsive భిన్న. లొంగని అనగా సూక్ష్మజీవులు మొండికేసి హతమార్చబడని ఔషధములు – కాబట్టి ఇవి వాడితే ఫలితము ఉండదు].

**suspension** finely minced drug particles, say in an oily base; emulsion ఔషధనలుసులుగల, తైలమూలముగల పాలలాంటి రసము/రసాయనము.

**suspensory** 1. serving to hold up a part, *e.g.* scrotal support శరీరములో ఒకభాగమును అదిమిపెట్టుట/బిగువుగా నుంచుట, ఉదా. లంగోటి కట్టుకొనుట. 2. **s. ligament** ఆధారభూతమైన స్నాయువు.

**suture** 1. *anat.* joints between the bones of skull సీమంతము: కపాలము ఎముకల కలయికచోటు. 2. series of knots tied with thread, nylon, wire, *etc.* to bring into apposition the margins of surgical incision in skin, bone, *etc.* సూదనము, సీవనము; సీమంతిక, సీవని, సంధి, కుట్టు: దారము, నైలాన్‌తో చర్మములోగాని, వైర్ (తీగె) తో ఎముకలోగాని, కత్తిగాటు అంచులను దగ్గరగా తీసుకవచ్చి ముడివేయుట. 3. in tissues, mucous membranes, blood vessels, *etc.* knots tied with catgut (absorbable), *see*/చూడండి catgut. కణజాలములు, శ్లేష్మపొరలు, రక్తనాళములు – వీటిని ముడివేయటానికి శోషణశక్తిగల గొర్రెపేగు తంతువు (catgut) ఉపయోగిస్తారు. *figur.* suture by surgeon, healing by God అలంకార. శస్త్రవైద్యుడు గాటును ముడివేసేవరకే, నయముచేసేది సర్వేశ్వరుడే.

**swab** a wad of cotton attached to a wooden stick serving as a handle to apply medication, to withdraw a sample of secretion/excretion/discharge for examination under the microscope స్రావము/విసర్జకము/సహజ విసర్జనము – వీటిని చీపురుపుల్ల కొనమీద దూది చుట్టిన పరికరముతో బయటకు తీసి సూక్ష్మదర్శినిలో పరిశీలనచేయుట. ఈ దూదిపుల్లతో మందు రాయవచ్చునుగూడా.

**swallowing** deglutition మ్రింగుట.

**sweat** 1. secretion of sweat/sudoriferous glands స్వేదగ్రంథుల స్రావము. 2. perspiration, the fruit of exercise which is good for health చమట, స్వేదము: అలంకార. కష్టపడి పాటుపడినందుకు ఫలితము ఆరోగ్యం. స్వేదసిక్త శరీరం ఆరోగ్యానికి సోపానం.

**sweet** తీపి 'king of tastes' రుచులకు రేడు. **s. disease,** *colloq.* diabetes mellitus మధుమేహం. **sweetheart** honey! మృదుల హృదయ, మధుమతి, అమృత వర్షిణి, *figur.* Husband is the salt, wife the sweet; both are present in the body. అలంకార. పరిణేతకు పరిణీత తీపి హృదయం. **Sweety** పాపకు ముద్దుపేరు.

**swelling** 1. to swell పెఱుగుట అనగా ఉబ్బుట. transient enlargement not due to cell proliferation, but say due to accumulation of fluid తాత్కాలిక పెరుగుదల, ఉదా. ద్రవము చేరినందువలన – ఇది కణముల పెరుగుదల వలన కాదుసుమా! [*Cf.* to grow, due to cell proliferation తారత. పెరుఁగు అనగా ఎదుగుట – ఇందులో కణముల పెరుఁగుడు/పెరుగుఁదల ఉంటుంది]. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **cloudy s.,** Tissues appear swollen, parboiled and opaque in infectous diseases, but revert to normal after the disease is controlled. సూక్ష్మజీవుల సంపర్కవ్యాధుల్లో కణజాలములు ఉబ్బి అర్ధపక్వముగా, అస్వచ్ఛముగా కనబడుతాయి, కాని వ్యాధి నయమైన తర్వాత యథాస్థితికి వస్తాయి. *micro.str.* సూక్ష్మ.చూ. **cloudy s.,** cloudy swelling of cells with granular appearance, especially those of the kidney and liver ముఖ్యముగా కిడ్నీ మరియు కాలేయము కణములు అస్వచ్ఛముగా ఉబ్బి, కణికామయ దృశ్యం కలిగి ఉంటాయి. 2. a projection of any part ఏ భాగములోనైనా పైకి ఉబుకు.

**swine** *sing.&pl.* hog, pig పంది, సూకరము. the fat oil of this animal used as a base for ointments పందికొవ్వు నూనె మలాం తయారీలో వాడ్తారు.

**sycosis** papulopustular inflammation of hair follicles జుట్టు కుదుళ్ళ యొక్క ఇన్‌ఫ్లమేషన్ పొక్కులు. **s. barbae,** inflammation of hair follicles especially over the beard, infection transmitted through the barber's razor క్షురకర్మ వలన కలిగిన కర్మ – మంగలికత్తి/క్షురిక

ద్వారా సంక్రమించు సూక్ష్మజీవుల సంపర్కము: గడ్డమంతా పొక్కులు పొక్కి, రోతగా అగపడి, చీము చిలికిస్తూ ఉండే దృశ్యం.

**symbiosis** living together of two dissimilar organisms, especially when this association is mutually beneficial సహజీవనము: భేదమైన రెండు జీవులు కలిసికట్టుగా జీవించుట, ముఖ్యముగా ఈ జతవలన పరస్పరము లాభదాయకంగా ఉంటుంది.

**sympathetic** 1. pitiable కనికరింపదగిన. 2. **s. nervous system**, which operates the adrenaline reaction, the 'fight or flight' syndrome, *see/చూడండి* nervous system. సహానుభూత లేదా స్వతంత్రనాడీ వ్యవస్థ – 'పోరాడు లేదా పారిపో' ప్రతి చర్య దీని ప్రభావం. *figur.* 'do or die' tie/tug, in sports *అలంకార.*: క్రీడల్లో 'నెగ్గు లేదా తల ఒగ్గు' పట్టుదల.

**sympathectomy** or **sympathetectomy** or **sympathicectomy** surgical excision of part of the sympathetic nervous system సహానుభూత నాడీవ్యవస్థలోని కొంత భాగం శస్త్ర విచ్ఛేదనం గావించుట.

**sympatholytic** an agent/drug which opposes/antagonizes the effects of the sympathetic nervous system సహానుభూత నాడీవ్యవస్థ ప్రభావాన్ని అడ్డగించు వస్తువు/ఔషధం.

**sympathomimetic** mimicking the effects of the sympathetic nervous system సహానుభూత నాడీవ్యవస్థ ప్రభావాన్ని అనుకరించే.

**symphysis** firm union సంధానము. **s. pubis,** the place of union of the two pubic bones in front జఘనసంధానము: రెండు జఘనాస్థులు పొత్తికడుపు దిగువున కలిసే చోటు. *figur.* Cupid's throne *అలంకార.* మదనవేదిక.

**symptom** 1. subjective complaint of a patient, the one narrated by the patient బాధవివరణ లక్షణము: రోగి తను బాధపడే బాధను చెప్పుకుంటాడు [*in contr.* sign, an objective evidence of disease observed by the doctor *భిన్న*. వైద్యుడు రోగిలో వెదకు వ్యాధి చిహ్నము/గుర్తు]. 2. **withdrawal s's,** effects/symptoms reported by the individual after sudden withdrawal of the agent of addiction, *e.g.* cigarette withdrawal దురలవాటు మాన్పించినప్పుడు ఆ వ్యక్తిలో

కలుగు గుణములు చెప్పుకుంటాడు, ఉదా. సిగరెట్టు మానిన తర్వాత జీవితం దుర్భరం అంటాడు.

**symptomatology** symptom complex in a disease; all the symptoms వ్యాధి లక్షణ సంపుటి; అన్ని లక్షణములు.

**synapse** the point (junction) of communication between two adjacent neurones రెండు సామీప్య/ప్రక్క-ప్రక్కన ఉన్న నాడీకణముల సంధి. *micro.str.* సూక్ష్మ.చూ. site where nervous impulses are transmitted from one nerve cell to another. This synapse (junction) is seen on a motor neuron. మధ్యంతరము, నాడీ సంధి: ఒక నాడీకణము నుండి మరియొక నాడీకణమునకు నాడీప్రచోదనములు పంపబడే చోటు/స్థలము. ఈ మధ్యంతరము (సంధి) మోటార్ న్యూరాన్ మీద చూస్తాము/ఉంటుంది.

**syncope** faint, swoon మూర్ఛిల్లుట, సొమ్మసిల్లుట. transient loss of consciousness due to cerebral ischemia మెదడు రక్తసరఫరాలో లోపమువలన కొంచెముసేపు ఉండెడు స్పృహాశూన్యత. **cardiac s.,** due to heart trouble హృద్రోగము వలన. **tussive s., cough s.,** after a severe bout of coughing ఉపద్రవమైన దగ్గు తెర తర్వాత 'గుమ్' అనిపించి స్పృహ తప్పుట. **vasovagal s.,** vasovagal attack, *e.g.* while witnessing a horror; due to rapid sudden fall in blood pressure ఉదా. భయానక/ఘోర దృశ్యం వీక్షించుచున్నప్పుడు బ్లడ్ ప్రెషర్ తగ్గిపోయి, ధఢాలున క్రిందపడి స్పృహకోల్పోతారు.

**syndactyly** webbed hand/foot digits, *resemblance:* swan foot చేతి/పాదము వ్రేళ్ళకు నడుమ చర్మముగల దృశ్యం, *పోలిక:* హంసయొక్క పాదము.

**syndrome** a set of symptoms characterizing a disease, occurring together; a symptom complex లక్షణ సంపుటి, సంలక్షణం: ఒక రుగ్మతకు సంబంధించిన, ఒకేకాలంలో బాధిస్తున్న బాధల సముదాయం; క్లేశముల కోశము, కష్టముల కూటమి, అలంకార. బాధల మూట. **acquired immunodeficiency s. (AIDS),** *see/చూడండి* AIDS. **Cushing's s.,** adrenocortical hyperactivity, more in females ఎడ్రినోకార్టికల్ యొక్క అధికచురుకుదనం, ఎక్కువగా స్త్రీలలో.

**malabsorption s.** ఆహార శోషణదోషము. **nephrotic s.,** kidney disorder కిడ్నీవ్యాధి. **sudden infant death s. (SIDS),** cot deaths in infants, unexplained ఊయల/పక్కలో పడుకున్న పిల్ల అమాంతంగా కన్నుమూయుటం, కారణం తెలియదు.

**synechia** [synechiae *pl.*] abnormal joining of parts భాగముల అసాధారణ కలయిక. 1. **anterior s., posterior s.,** adhesion, iris to the cornea or lens కనుపాపకు శుక్లపటలమునకు లేదా కనుపాపకు కటకమునకు మధ్య ఆశ్లేషము/అంటుకొనుట. 2. **s. vulvae,** condition in which labia minora embrace each other and are joined together యోని ఇరుప్రక్కలనున్న రెండు చిన్న నిలువు పెదిమలు కలిసియుండుట.

**synergy** or **synergism** the harmonious working together of two agents, such as drugs, muscles, microorganisms సహోత్తేజనం: మందులుగాని, కండరాలుగాని, సూక్ష్మక్రిములుగాని చేసే ఉభయానుకూల కృషి. The co-ordinated effort or combined action is greater than the sum of individual effort or action ఈ ఉభయ కృషి ఏకకృషికన్నా మిన్న. *N.B.* Unity is strength. *గమనిక:* ఐకమత్యం బలం.

**synovia** fluid secreted by the synovial membrane and present in joint cavities, bursae, tendon sheaths కీళ్ళ సందుల్లోను, బర్సా, స్నాయువు తొడుగులోనుండు ద్రవము – ఇది సైనోవియమ్ అను పొరయొక్క స్రావము. భాగములు సులభముగా జారుటలో తోడ్పడును. అలంకార. ద్రవమూలం ఇదం చలనమ్.

**synovitis** inflammation of the synovial membrane సైనోవియమ్ పొర శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు వాపు'. later fluid accumulates క్రమేణ ద్రవము జమ అగును. *e.g.* **s. of knee** మోకాలు కీలు వాపు, కీలులో ద్రవము.

**syphilide** or **syphilid** cutaneous lesions in syphilis కొఱుకు సవాయి రోగములో చర్మపు క్షతములు. [*q.v.* tuberculide].

**syphilis** also lues venera. a sexually transmitted disease (STD), caused by *Treponema pallidum*. లైంగిక వ్యభిచారరోగము, కొఱుకు సవాయిరోగము; ఫిరంగి రోగము (పీనిస్ ఫిరంగిని పోలి

ఉంటుంది కాబట్టి), గ్రా. సుఖవ్యాధి, ముండజబ్బు. **congenital s.**, syphilis acquired *in utero* from mother గర్భస్థశిశువుకు తల్లినుండి సంక్రమించునది. **primary s.**, chancre సవాయి పొక్కు, కొఱుకు సవాయి పుండు. **secondary s.**, skin lesions (syphilids), meningitis, iritis, *etc.* చర్మముమీద దద్దుర్లు, మెదడుపొరవాపు, కనుపాప వాపు, మొ. **tertiary s.**, involvement of cardiovascular, central nervous system and gumma in any organ గుండె రక్తనాళవ్యవస్థ జబ్బులు, కేంద్రనాడీవ్యవస్థ జబ్బులు, మరియు ఏదైనా అవయవములో గమ్మా అను కంతి. *N.B.* This disease is a self-made misery. *గమనిక:* ఈ తెగులు స్వయంకృతాపరాధ పర్యవసానం.

**syringe** 1. a contrivance to inject a drug intramuscularly, intravenously, subcutaneously, intrathecally, *etc.* ఔషధమును ఇంజక్షన్ ద్వారా కండరములోనికి, సిరలోనికి, చర్మము అడుగున, తౌతికళ అడుగున, మొ. చోట్లకు చేర్చు పరికరము. 2. a device to inject any liquid to clean, especially the external ear పిచికారి, చిమ్మ నగ్రోవి, సిరెంజ్: ముఖ్యముగా బాహ్యకర్ణము (వెలుపలిచెవి) ను పిచికారీచేయుట. 3. withdraw any fluid, say from a body cavity. శరీరకుహరములోనుండి ద్రవమును తీయు పరికరము.

**syringitis** inflammation of the Eustachian tube యూస్టేషియన్ నాళము యొక్క శోథము/'నొప్పి మంట తీపు వాపు'.

**syringobulbia** presence of cavities in the medulla oblangata మజ్జాముఖములో శూన్యప్రదేశములు/కుహరములు ఉండుట.

**syringomyelia** cavitation in the spinal cord వెన్నుపాములో శూన్యప్రదేశము/కుహరము.

**syrinx** 1. a tube, *e.g.* eustachian tube or auditory tube నాళము, ఉదా. శ్రోతఃపథము. 2. a fistula నాళవ్రణము.

**syrup** flavoured base, a vehicle for oral drugs షర్బత్: అస్య ఔషధమునకు అనుపానము, తరచుగా కమ్మదనము కలిగించేది (పానకము). *N.B.* However, not all liquid medicines are sweet. *గమనిక:* కాని, అన్ని ఔషధద్రావకములు తియ్యగా ఉండవు. పిల్లలు మందు అనేటప్పటికి మారాం చేస్తారు కాబట్టి వాళ్ళకు మందు తియ్యగానే ఉండాలి.

**system** a group of organs having a co-ordinated action వ్యవస్థ: ఒక సమన్వయ విధిని నిర్వర్తించే అవయవముల సముదాయము. **alimentary s.**, digestive s., gastrointestinal s. జీర్ణవ్యవస్థ. **cardiovascular s.** గుండె రక్తనాళ వ్యవస్థ. **central nervous s.** కేంద్రనాడీ వ్యవస్థ. **endocrine s.** వినాళికా గ్రంథి వ్యవస్థ. **lymphatic s.** శోషరసవ్యవస్థ. **urogenital s.** మూత్ర మరియు జననేంద్రియ వ్యవస్థ.

**systemic** concerning the body as a whole దైహిక: పూర్తి శరీరమునకు సం. [*Cf.* portal *తారత.* నిర్వాహక].

**systole** contraction of the heart, especially of the ventricle గుండెకాయ ముకుళించుట, ముఖ్యముగా జఠరికయొక్క సంకోచము, వాడు.భా. గుండె అడుట, గుండె కొట్టుకొనుట. **extra s.**, a contraction other than expected, *i.e.* out of the normal rhythm గుండెయొక్క లయ/తాళ విరుద్ధమైన అదనపు సంకోచము [*in contr.* diastole *భిన్న.* గుండె వ్యాకోచము].

**systremma** 'cramp ball' in the calf of the leg, due to contracted muscles పిక్క పేశీలలో కండర బిగువు/ముడి వలన అక్కడ ఉండలా తగులుట. a handicap in sportsmen క్రీడాకారుల ప్రతిబంధం.

# T t

**TAB** *abbr.* injectable vaccine containing killed *Salmonella typhi, Paratyphi A* and *Paratyphi B* ఈ మృత సూక్ష్మక్రిములు గల టీకామందు – ఇంజెక్షన్ (సూది). *N.B.* Now-a-days an oral typhoid vaccine is also available. *గమనిక:* ప్రస్తుతం అస్య/ఓరల్ వాక్సీన్ గూడా వాడుతున్నారు.

**tabes** wasting, atrophy **క్షీణత,** క్షయము. **t. dorsalis,** due to degeneration in spinal cord by longstanding syphilis, muscular incoordination, locomotor ataxia, trophic joints (Charcot's joints) పృష్ఠమేరువ్యాధి: దీర్ఘకాలంగా శరీరంలో జీర్ణించిన సవాయిరోగము వలన వెన్నుపాము **క్షీణతచెంది,** కండరముల సమన్వయము కోల్పోయి, చలనం/నడకలో నిలకడ తప్పి, కీళ్ళ ఖాయిలా కలుగుట (కీళ్ళు ఉబ్బి, మృదులాస్థి క్షీణిస్తుంది). **t. mesenterica,** tuberculosis of mesenteric lymph nodes ఆంత్రయోజక లింఫ్ గ్రంథుల క్షయవ్యాధి.

**tablet** medicinal mass **మాత్ర,** మందుబిళ్ళ. **enteric-coated t.,** a coating on the tablet which delays its release until it passes out of the stomach, *i.e.* It gets released in the small intestine and gets absorbed there. అన్నాశయము దాటేవరకు మందుబిళ్ల విడుదల కాకుండా బిళ్ళ తలము మీద పొర/పూత ఉంటుంది, అనగా చిన్నపేగులో ఈ బిళ్ల విడుదల అయి, అక్కడ శోషణము అవుతుంది.

**tachycardia** abnormally rapid heart rate, usually above 150 per minute గుండె పరుగు: గుండె అతివేగముగా, తరచుగా నిముషమునకు 150 సార్లకి పైగా కొట్టుకొనుట [*in contr.* bradycardia భిన్న. బ్రాడికార్డియా, గుండెనడక మాంద్యము].

**tachypnoea** or **tachypnea** rapid respiratory rate శ్వాసపరుగు, ఊపిరి ఎక్కువసార్లు పీల్చుట [*in contr.* bradypnea భిన్న. శ్వాసమాంద్యము].

**tactile** concerning sense of touch, *e.g.* **t. fremitus,** sound palpated over the chest స్పర్శకు సం., ఉదా. ఛాతీమీద చేత్తో శబ్దమును తాకుట/గ్రహించుట.

**Taenia** tape worm నవారుపురుగు, బద్దెపురుగు. *T. echinococcus, see/చూడండి* Echinococcus. *T. saginata,* 15-25 feet long, adult in the human intestine, larval stage in the muscles of cattle. Infection occurs by eating inadequately cooked beef; hence the name beef tape worm. 15–25 అడుగుల పొడవు, ఇది మనిషి పేగుల్లో ఉంటుంది, డింభకదశ పశువులలో ఉంటుంది. పూర్తిగా పక్వముకాని గొడ్డుమాంసము తినుటద్వారా ఈ వ్యాధి సంక్రమిస్తుంది; కాబట్టి గొడ్డు నవారుపురుగు సార్థకనామము. *T. solium,* 3-6 feet long, adult in the human intestine, larval stage in the muscles of pig. Infection occurs by eating undercooked 'measly' pork; hence the name pork tape worm. 3–6 అడుగుల పొడవు, ఇది మనిషి పేగుల్లో ఉంటుంది, డింభకదశ పందులలో ఉంటుంది. పూర్తిగా ఉడకని పందిమాంసము తినుటద్వారా వ్యాధి సంక్రమిస్తుంది; కాబట్టి పంది నవారుపురుగు నామసార్థకత. In the cysticercus stage cysticercus cellulosae (larval stage), subcutaneous nodules $\frac{1}{2}$ to 1.5 cm occur not only under the skin but in all tissues, especially muscles and brain; convulsions result by involvement of the latter. డింభకదశలో $\frac{1}{2}$ నుండి 1.5 సెం.మీ. కంతులు/తిత్తులు చర్మముక్రింద మరియు అన్ని కణజాలములలోను, ముఖ్యముగా కండరములు, మెదడులో తయారవుతాయి; మెదడులో కంతి/కంతులు మూర్ఛలను కలుగజేస్తాయి.

**taeniacide** cide=to kill. an agent that kills tapeworms బద్దె పురుగులను చంపే వస్తువు/మందు.

**taeniae** flat bands చదునైన బంధములు. **t. coli,** three longitudinal bands over the large intestine పెద్దపేగు పైన మూడు నిలువుపాటి బంధములు.

**tail** 1. the hinder end of an organ అవయవము చివరి భాగం. **t. of pancreas** క్లోమము యొక్క చివరిభాగము. 2. **t. of spermatozoon** పుచ్ఛము, శుక్రకణము తోక.

**talc** 1. magnesium silicate, dusting powder పుండ్లమీద చల్లు పౌడర్. 2. **cosmetic t.,** ముఖమునకు వన్నె/శోభనిచ్చు పరిమళద్రవ్యమిళితపౌడర్. 3. talcum powder, powdered and perfumed talc. సుగంధిత

అభ్రకచూర్ణము. 4. **t. pneumoconiosis,** talcosis, accumulation of talc in the lung ఈ పొడర్ ఊపిరితిత్తిలో జమ అగుట.

**talipes** congenital deformity involving the foot and ankle పుట్టుకతో వచ్చిన సొట్ట/వంకరపాదము, వికలాంగము.

**talus** astragalus. ankle bone కాలి చీలమండ ఎముక. a bone in the foot పాదంలో ఒక ఎముక.

**tamarind** *bot.* Its pulp contains pectin చింతపండు. an ingredient of Indian diet అలంకార. మనం రోజూ తినే పండు చింతపండే.

**tampon** a pad of cotton to plug the nose, vagina, etc. for control of bleeding or for medication ముక్కు, యోని, మొ. కుహరములలో దూర్చే దూది – ఇది రక్తమును ఆపటానికి, ఔషధము చేర్చడానికి ఉపాయము.

**tamponade** compression అదుముట. **cardiac t.,** accumulation of fluid/blood in the potential pericardial space, embarrassing the heart's action సంభవనీయమైన హృదయావరణ కుహరములో ద్రవము/రక్తము చేరి, గుండెవిధిని చిక్కున పెట్టుట. This is a medical emergency. ఇది ప్రమాదమును సూచిస్తుంది. దీనికి తక్షణ చికిత్స అవసరం.

**tantrum** outburst of anger ప్రకోపము. **temper t.,** a fit of bad temper ప్రకోపతెర/పొంగు.

**tap** to drain off కార్చు. **spinal t.,** to do lumbar puncture and allow cerebrospinal fluid to trickle వెన్నుపూసలమధ్య సూదిగుచ్చి మస్తిష్కమేరు ద్రవమును బొట్లుబొట్లుగా కారనిచ్చుట.

**tapeworm** taenia, an intestinal parasitic worm అంత్ర పరాన్నజీవి పురుగు. Cestode infection బద్దెపురుగు, నవారుపురుగు సంపర్కము. 1. beef t., *Taenia saginata* గొడ్డు నవారు పురుగు. 2. dog t., *Echinococcus granulosus* కుక్క నవారుపురుగు. 3. dwarf t., *Hymenolepis diminuta* మరుగుజ్జు బద్దెపురుగు. 4. fish t., *Diphyllobothrium latum* చేప నవారు పురుగు లేదా బద్దెపురుగు. 5. pork t., *Taenia solium* పంది నవారుపురుగు.

**target** 1. a site in the body on which something is directed, say an X-ray beam లక్ష్యము, ఉదా. శరీరములో ఎక్స్‌రే కిరణములు తాకు స్థలము. 2. *e.g.* **t. organ** ధ్యేయముగా పెట్టుకున్న అవయవము.

**tarsal** 1. relating to the tarsus ప్రపాదాస్థికి సం., చీలమండ ఎముకలకు *సం.* 2. relating to the edge of eyelid కన్నురెప్ప అంచుకు సం.

**tarsalgia** podalgia, pain in the foot పాదములో నొప్పి/వేదన.

**tarsitis** blepharitis; inflammation of the tarsus of the eyelid కనురెప్ప శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**tarsus** 1. bones of the foot ప్రపాదాస్థి, చీలమండ ఎముకలు. 2. structure of the eyelid కనురెప్పయొక్క నిర్మాణము.

**tartar** incrustation on the teeth పండ్ల పాచి/గార: పన్నును పట్టుకుని గీకితేగాని ఊడిపోదు.

**taste** 1. perception of taste రుచి, చవి, రసము. *micro.str.* సూక్ష్మ.చూ. **t. bud,** size $70\mu \times 50\mu$, sense organ for taste; స్వాదముకుళము, రసాంకురము, స్వాదాంకురము. 2. inclination to anything, especially food ఇచ్ఛ, ముఖ్యముగా ఆహారమునకు.

**tattoo** etching on the skin (injecting by a syringe) with a permanent indelible coloured pigment, usually green శరీరంమీద రంగు/(ఆకు) పచ్చబొట్టు: శాశ్వతంగా చెదిరిపోని వర్ణకముతో చర్మముమీద సూదితో చిత్రించుట.

**t.d.s.** or **TDS** *abbr.* (Latin *ter die sumendum*) three times a day, say a tablet, *see/చూడండి* t.i.d. ఒక మాత్ర రోజుకు మూడుపూటలు.

**tears** 1. salty secretion of the lacrimal glands ఉప్పటి స్రావం: కన్నీరు, బాష్పములు, అశ్రువులు. 2. tear gas, used by police to disperse crowd/mob మందిని చెదరగొట్టేందుకు రక్షణశాఖవారు ఉపయోగించు బాష్పవాయువు. 3. *figur.* obituary obsequies అలంకార. పరమపదించినవారికి అశ్రుతర్పణం.

**teat** 1. teat of the feeding bottle పాలబుడ్డి పీక. 2. nipple of the mammary glands పాలిండ్ల చూచుకము.

**technology** science of technical knowledge సాంకేతిక విజ్ఞానం. సాంకేతిక విజ్ఞాన శాస్త్రం. **medical t.** వైద్య సాంకేతిక విజ్ఞానము.

**tectum** a rooflike structure పైకప్పులాంటి నిర్మాణము. **t. of mesencephalon,** the dorsal portion of the midbrain మధ్య గోర్ధముకప్పు; మధ్యమెదడుయొక్క వెనుకభాగము.

**teeth** hard, bony enamel-coated structures in the jaw దవడలోని గట్టి, కంకాళ కాఠిన్య, ఎనామెల్ పూత కలిగిన నిర్మాణములు. A. **temporary t.,** milk t., deciduous t. తాత్కాలిక, పాలపండ్లు, చిన్నతనం దాటగానే రాలిపోయేవి. two incisors రెండు కొరుకుడు పండ్లు, one canine ఒక కోరపన్ను, two premolars రెండు అగ్రచర్వణకాలు, on each side in the upper and lower jaw, total 20 రెండువైపులా పైన మరియు క్రింద మొత్తము 20. B. **permanent t.** శాశ్వత, స్థిరమైన పండ్లు two incisors రెండు కొఱుకుడు పండ్లు, one canine ఒక కోఱపన్ను, two premolars రెండు అగ్రచర్వణకాలు అనగా దంతముల ముందున్నవి, three molars మూడు చర్వణకాలు/దంతములు, on each side in the upper and lower jaw, total 32 రెండువైపులా పైన మరియు క్రింద, మొత్తము 32. the last molar in each set (wisdom tooth) variable in the time of its eruption ప్రతివరుసలో ఆఖరి దంతము (జ్ఞానదంతము) మొలకెత్తు వయస్సు మనిషికీ మనిషికీ మారుతుంది. *figur.* In some individuals wisdom seldom/rarely dawns with the eruption of the wisdom tooth. *అలంకార.* జ్ఞానదంతము వచ్చినా కొందరికి జ్ఞానం రాకపోవచ్చు. C. **decayed t.** పుచ్చినపళ్ళు. D. **artificial t.,** denture, a removable dental prosthesis కృత్రిమ పళ్ళవరుస.

**teething** eruption of teeth, *see/చూడండి* dentition. పండ్లు రావడం/మొలకెత్తడం. **t. troubles,** minor problems encountered in the initial stages of an enterprise/project బాలారిష్టాలు, తొలి ఒడుదుడుకులు, తొలి విఘ్నములు. *గమనిక:* అందుకే కార్యారంభంలో/పనిప్రారంభంలో 'అవిఘ్నమస్తు' అని ప్రార్థిస్తారు.

**tegmentum** a covering కప్పు. **t. of mesencephalon,** the dorsal part of the mesencephalon మధ్యగోర్ధముయొక్క వెనుకభాగము.

**telangiectasia** . telangiectasis; dilatation of a group of capillaries రక్తకేశనాళికల సమూహము విస్తరించుట. **hereditary haemorrhagic t.,** dystrophy of the capillaries, sometimes present from birth, 1 to 2 mm red macules or papules రక్తకేశనాళికల లోపము, కొందరిలో పుట్టుకనుండి వస్తున్న వ్యాధి. **spider t.,** vascular spider: punctate red or purple spots/blebs seen in liver cirrhosis సాలెపురుగు గూడువలె ఎరుపు లేదా ధూమ్రవర్ణము కలిగి, చుక్క/బొబ్బవలె అగపడును. ఇవి కాలేయము గట్టిపడిన జబ్బులో చూడనగును. Epistaxis, recurrent episodes of bleeding from the skin and mucous membranes; and melena occur. ముక్కునుండి రక్తం, చర్మము మరియు శ్లేష్మపొరలనుండి ఉండి ఉండి/తిరిగి తిరిగి ఎర్రజీర కనపడటం; పేగులలో రక్తం జీర్ణక్రియలో మారినస్థితిలో విరేచనము నల్లగా అవటం (melena) కద్దు.

**telangioma** angioma caused by dilatation of the capillaries or terminal arterioles రక్తకేశనాళికల లేదా అంతిమ ధమనికల విస్ఫారణం వలన కలిగే రక్తనాళికల కంతి.

**temperature** 1. an expression of heat or cold శీతోష్ణస్థితి. 2. **normal body t.,** 37° C or 98.4° F to 98.6° F by mouth శరీర ఉష్ణోగ్రత: నోట్లో థర్మామీటర్ పెడితే పైన తెలిపిన ఉష్ణత చూపుతుంది. **rectal t.** పురీషనాళ ఉష్ణోగ్రత, మలాశయములో ఉష్ణోగ్రత.

**temple** 1. region behind the orbit కణత (ప్రాంతము). 2. *N.B.* frightening a person by pointing the revolver edge at this key spot *గమనిక:* కీలకప్రాంతం గాబట్టి ఇక్కడ రివాల్వర్ అంచు పెట్టి జడిపిస్తారు.

**temporal** 1. relating to the region of the temple. కణతకు సం. 2. pertaining to time కాలమునకు సం.

**temporomandibular joint** joint between the temporal bone and mandible. *N.B.* It can be felt in front of the ear while chewing/eating. కణతఎముకకు మరియు హనువుకు మధ్యనున్న కీలు. *గమనిక:* నములుతున్నప్పుడు చెవిముందు వేలుపెడితే తగులుతుంది.

**tenderness** discomfort elicited on clinical examination by a doctor, *e.g.* t. over the abdomen on palpation తీపు: తాకినప్పుడు,

ఉదా. ఉదరముమీద చేయివేసి, తాకి కొద్దిగా నొక్కినపుడు తీవ్ర రోగియొక్క ముఖవైఖరి ద్వారా విశదమవుతుంది.

**tendinitis** tendonitis; inflammation of a tendon or an area of tendon muscle attachment/insertion స్నాయువు లేదా స్నాయు బంధనముయొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**tendon** fibrous cord-like continuation of a muscle at its insertion into a bone కండరబంధనము, స్నాయుబంధనము, కండరాగ్రము; స్నాయువు ఎముకమీద అతుక్కుపోయినప్పుడు తాడువలెనుండు తంతు కణజాలరజ్జువు. **Achilles t., calceneal t.**, tendo Achillis, powerful tendon at the back of the heel కాలిమడమ వెనుక బలిష్ఠమైన స్నాయురజ్జువు.

**tendovaginal** pertaining to a tendon and its sheath స్నాయువు మరియు దాని తొడుగు/కవచమునకు సం. (*N.B.* don't interpret vaginal as *adj.* of vagina).

**tenesmus** painful straining in urination or while passing motion, with nil result తీవ్రమైన బాధ: మూత్రవిసర్జనలోగాని మలవిసర్జనలోగాని బలవంతముగా ముక్కినా నిష్ప్రయోజనమై, నొప్పిపుట్టుట.

**tennis elbow** pain around the elbow, especially in tennis players due to excessive strain (not necessarily due to tennis) on muscles మోచేతి కండరములు, ఉదా. టెన్నిస్ ఆటవలన, అమితముగా ప్రయాసపడి, సాగి, మోచేతి వేదన కలిగించుట [*q.v.* housemaid's knee].

**tenodynia** tenalgia, pain in tendon స్నాయువు వేదన.

**tenosynovitis** tenovaginitis; inflammation of a tendon sheath స్నాయువు తొడుగు యొక్క శోథము/'నొప్పి వేడి మంట వాపు'.

**tension** 1. undue stretching బిగువు, బిర్రు, ఎక్కువగా సాగదీయుట. 2. **mental t.** మానసిక ఒత్తిడి, పట్టు. 3. **t. headache** due to fast life in a busy city జిగి; నగరాల్లో పరుగు జీవనము, ఆందోళనవలన తలనొప్పి. 4. normal pressure, e.g. **arterial t.**, blood pressure within an artery సహజ ఒత్తిడి, ఉదా. ధమనిలో రక్తపు ఒత్తిడి. 5. **intraocular t.** కన్నుగుడ్డులోని సహజ ఒత్తిడి. 6. partial pressure

of a gas, *e.g.* **arterial oxygen t.,** *abbr.* *Pa*, $O_2$ వాయువుయొక్క పాక్షిక పీడనము, ఉదా. ధమని రక్తంలో ఆక్సిజన్ పాక్షికపీడనము.

**tent** a protective canopy used in inhalation ఊపిరి పీల్చడంలో వాడే గుడారం. **oxygen t.,** transparent device covered over the upper part of the patient to facilitate him breathe oxygen ఆమ్లజని గుడారం [*in contr.* mask].

**tentorium** *anat.* resembling a tent గుడారమువలెనున్న. **t. of cerebellum,** dura covering the cerebellum అనుమస్తిష్కము మీది పరాశిక.

**tepid** warm గోరువెచ్చని. **t. sponging,** for sprains (భరింపగలిగే) ఉడుకునీళ్ళ కాపడం – వాపులకు, బెణుకులకు ఉపశమనం.

**teratoblastoma** blast = explode; teratoma, a highly malignant tumour, *figur.* a tumour that explodes ఒకవిధమైన అతిఅపాయ కరమైన కంతి; అలంకార. ప్రేలెడు స్వభావముగలది (అంటే ఇంత బీభత్సం).

**teratogen** an agent that causes physical defects in the developing embryo ఎదిగే పిండములో శారీరక వికలములు కలుగజేయు కారకము.

**teratogenesis** 1. defects in the developing embryo ఎదిగే పిండములోని లోపములు/దోషములు. 2. developing monster in the embryo stage పిండము ఎదిగే దశలో విపరీతాకారముగల/రాక్షసి రూపము.

**teratogenous** developed from foetal remnants భ్రూణశేషముల నుండి ఉత్పన్నమగు.

**teratoid** resembling a monster రాక్షసి రూపమునుపోలిన.

**teratoma** a true neoplasm నిజమైన కంతి. **malignant t.,** ovarian tumour resembling a dermoid cyst, and composed of immature embryonal cells from all three germ layers, *see/చూడండి* dermoid. జననస్తరాలనుండి పుట్టిన అపరిణత పిండకణములు/అపరిపక్వ పిండకణములు గల అండాశయ అపాయకరమైన కంతి.

**term** the end of a particular time నిర్ణీత కాలం. 1. **full t.,** 37 to 40 weeks pregnancy నిండుచూలాలు, నవమాసాలు మోసి బాలింతకావడానికి సిద్ధమైన చూలింత. 2. semester in a college కాలేజిలో టెరమ్.

**terminal** 1. ending in death మరణాంతకం. *e.g.* **t. stage** in an illness అంతిమ, ఉదా. వ్యాధిలో అవసాన దశ. 2. **t. bronchiole,** 0.5 mm in diameter, the distal part of the respiratory tree శ్వాసవృక్షముయొక్క చివరినాళిక/అంతిమనాళిక.

**tertiary** third stage మూడవ దశ. **t. syphilis**, third stage in syphilis కొఱుకు సవాయి రోగంలో మూడవదశ.

**test** examination శోధనము, పరీక్ష, వాడు. భా. పరిక్ష, **agglutination t.,** indicates the presence of antibodies ప్రతిరక్షకాలు ఉన్నట్లు నిర్ధారణ. **early pregnancy t.,** based on an increase in urinary levels of human chorionic gonadotropin after fertilization ఫలదీకరణము కాగానే నర/మానవ/మనుష్య పరాయువు గొనేడోట్రోఫిన్‌లు మూత్రములో హెచ్చుశాతం ఉంటాయి – వాటి పరీక్ష. **finger-nose t.,** test for coordinated movements of the upper limb muscles; asking the patient to touch the tip of his nose with the tip of his index finger with his eyes closed. If the movements are clumsy/odd, it is abnormal, *see/చూడండి* coordination. ఊర్ధ్వాంగ కండరములయొక్క సమన్వయము నిరూపించు పరీక్ష : రోగిని తన చూపుడువేలుకొనతో తన ముక్కుకొనను కండ్లుమూసుకొని తాకమనాలి. కండరచలనము వికారము/చోద్యముగా అగపడితే ఇది జబ్బు. **Mantoux t., tuberculin t.,** a test done in tuberculosis రాజయక్ష్మము/క్షయ వ్యాధిలో జరుపు పరీక్ష. **VDRL** *abbr. Venereal Disease Research Laboratory t.,* test in syphilis సవాయి కొఱుకు రోగంలో శోధన. **Widal's t.,** test in typhoid టైఫాయిడ్ జ్వరంలో పరీక్ష.

**testalgia** testicular pain ముష్కము/వృషణములో సలుపు.

**testicle** testis వృషణము, ముష్కము. వాడు.భా. బీజము(లు), పిచ్చ(లు), వట్టకాయ(లు), విత్తి, విత్తులు.

**testis** [testes *pl.*] either of the two egg-shaped male reproductive glands normally present in the scrotum, in which the spermatozoa develop వృషణములసంచిలోనున్న రెండింటిలోనొక కోడిగుడ్డువంటి, ప్రత్యుత్పత్తికి సంబంధమైన వృషణము/ముష్కము. దీనినుండి పురుష బీజకణాలు ఉత్పత్తి అవుతాయి. **undescended t.**, retained t., failed to descend into the scrotum, retained in the abdomen or inguinal canal వృషణముల సంచిలోనికి దిగకుండా పొట్టలోనో, గజ్జకుల్యలోనో ఉండిపోయిన ముష్కము.

**testitis** orchitis, inflammation of testicles వృషణముల వాపు/శోథము.

**testosterone** androgenic hormone secreted by the testes వృషణ ముల స్రావము – పురుషత్వము నిలబెట్టు హార్మోన్. 1. responsible for male characteristics పురుష లక్షణాల (గడ్డము, మీసము, మొ.) కు కారణమైనది. 2. causes spermatogenesis శుక్రజననము కలిగించును. 3. has protein anabolic properties ప్రోటీన్ నిర్మాణాత్మక గుణము కలది. 4. used in male hypogonadism పురుషబీజకోశముల లోపము వలన కలిగిన వ్యాధులలో ఉపయోగకరము. 5. in the treatment of male climacteric పురుషులలో వయస్సు ముదురుతూ ఉంటే అనగా వృద్ధాప్యంలోనికి అడుగుపెడుతూ ఉంటే శరీరతత్వములో కలిగే మార్పు (సహ ఉదాహరణ: స్త్రీలలో ముట్లుడుగుటపోవుట) నకు దీనితో చికిత్స కొంత లాభదాయకము. 6. palliative therapy in breast cancer in the female స్త్రీలలో స్తనము కేన్సరులో ఉపశమనము/ఉపశాంతి నొందించునది.

**test tube baby** *see/చూడండి* insemination.

**tetanus** a fatal infectious disease caused by an exotoxin which is a neurotoxin (tetanospasmin) produced by a bacillus (4 to 5$\mu$ in length), *Clostridium tetani*, the spores of which enter through wounds. It is marked by painful spasms of voluntary muscles, trismus (lockjaw), glottic spasm, paralysis of respiratory muscles. ధనుర్వాతము: టెటనస్ బాసిల్లస్ తయారుచేయు నాడీవిషపదార్థము వలన ఈ మారణజాడ్యము కలుగుతుంది. దీని సిద్ధబీజాలు (spores) గాయముల ద్వారా శరీరంలోకి ప్రవేశిస్తాయి. ఈ జబ్బులో నియంత్రిత

కండరాల యీాడుపులవలన దవడ బిగ్రుగాఅయి, కంఠబిలముయొక్క ఈడుపు సంభవించి, క్రమేణ ఛాతీకండరముల ఈడ్పులతో శ్వాసప్రక్రియకు ఆటంకము కలుగును – ఇది ఇక ప్రాణాపాయస్థితి. **neonatal t.,** tetanus in infants due to infection through the umbilicus పసికందులలో బొడ్డుద్వారా ప్రవేశించు టెటనస్ బాసిల్లస్ సంసర్గము. *N.B.* Tetanus toxin is one of the most lethal poisons known, the fatal dose for a mouse is 0.0005 mg. *గమనిక:* ఈ విషపదార్థము అతి ఉగ్ర మారణకరమైన గరళము; చుంచెలుకను 0.0005 mg హతమార్చును.

**tetany** disease due to decrease in the extracellular ionized calcium characterized by sharp flexion of the wrist and ankle (carpopedal spasm), stridor కొంకర్లు: మణికట్టు మరియు చీలమండ దగ్గర వాడిసంకోచముల వలన చెయ్యి, పాదము కొంకర్లుపోయి వికృతాకారముగా వంగిపోవుట; కఠోర కీచుగొంతు – ఇది రక్తములో కాల్షియమ్ అయాన్ల లోపమువలన కలుగు జబ్బు. causes: hypoparathyriod state, vitamin D deficiency, alkalosis కారణములు: పేరాథైరాయిడ్ గ్రంథుల లోపము, విటమిన్ డి కొరత, రక్తములో క్షారాధిక్యత. **hyperventilation t.,** after forced inspiration and expiration for a long time ఉచ్ఛ్వాస నిశ్వాసములు చాలాసేపు జోరుగా జరుపుటవలన కలుగును.

**tetracycline** 1. antibiotic obtained from bacteria బాక్టీరియా నుండి వెలువడిన యాంటిబయాటిక్/సూక్ష్మజీవి నాశకి. 2. synthesized సంయోగికం చేయబడినది. It is used to treat wide range of bacterial infections, *e.g.* skin infections, respiratory infections, *etc.* బాక్టీరియా సంపర్క వ్యాధుల్లో, ఉదా. చర్మ సూక్ష్మజీవి సంపర్కం, శ్వాసకోశ సూక్ష్మజీవి సంపర్కంలో వాడ్తారు.

**tetralogy** a group or series of four నాలుగు అంశముల గ్రూపు లేదా వరుస. **t. of Fallot,** a complex of four congenital defects in the heart ఫాలట్ చతుష్టయం: పుట్టుకతో వచ్చిన నాలుగు లోపములుగల గుండెజబ్బు, అలంకార. దుష్టచతుష్టయం.

**tetraplegia** quadriplegia, paralysis of all four extremities రెండు ఊర్ధ్వాంగాల, రెండు అధోంగాల పక్షవాతము. occurs in lesion of the cervical part of the spinal cord, *e.g.* injury to cervical vertebrae వెన్నుపాము గ్రీవభాగమున క్షతమువలన సంభవించును, ఉదా. గ్రీవకశేరుకాలకు/వెన్నుపూసలకు దెబ్బ.

**thalamus** a part in the brain serving as a relay station in the transmission of sensory impulses from afferent nerve → the spinal cord → thalamus → cerebral cortex పృష్ఠాసనము, పాత్ర దళము, పర్యంకము: మెదడులోని భాగము, ఒక అంచె. జ్ఞానప్రచోదనములు అంచెలు అంచెలుగా పాకుతుంటాయి:– అభివాహినాడి → వెన్నుపాము→ థాలమస్ → మస్తిష్క వల్కలము. Thalamus is called the seat of emotions. థాలమస్ రాగము, భావము, ఉద్వేగము మున్నగు మనోవృత్తులకు నెలవు.

**thalassaemia** or **thalassemia** a group of hereditary haemolytic anaemias వంశపరంపరగా వస్తున్న రక్తదోషము(లు).

**theatre** a place or room స్థలము లేదా గది. **operation t.** ఆపరేషన్ గది/థియేటర్, శస్త్రశాల.

**theca** a case or sheath కవచము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **t. vertebralis,** the membranes over the spinal cord వెన్నుపాము మీదిపొరలు. *micro.str.* సూక్ష్మ.చూ. **t. folliculi,** connective tissue around an ovarian (graafian) follicle అండకోశ (గ్రాఫియన్) పుటిక చుట్టూరా ఉన్న బంధనకణజాలము. It consists of two layers, tunica interna, tunica externa. ఇందులో రెండుపొరలు ఉన్నవి, అంతరకంచుకము, బాహ్యకంచుకము.

**thenar** the flesty part at the base of the thumb అంగుష్ఠము యొక్క మొదలునగల మాంసపుముద్ద. **t. eminence,** region in the palm at the base of the thumb బొటనవ్రేలు యొక్క మొదలు ప్రాంతము.

**theory** hypothesis సిద్ధాంతము. **cell t.,** All organic matter consists of cells and cell activity is the essential process of life. మొత్తం సేంద్రియ/జీవసంబంధ పదార్థము కణములతో కూడుకొని యున్నది; కణచైతన్యము జీవనమునకు/మనుగడకు ఆవశ్యకప్రక్రియ.

**therapeutic** concerning therapeutics చికిత్సశాస్త్ర సం.

**therapeutics** scientific treatment of diseases రోగచికిత్స శాస్త్రము, వ్యాధిపరిహారక శాస్త్రము, ఔషధోపచార శాస్త్రము, భేషజ ప్రకరణము.

**therapist** one who treats చికిత్సకుడు. **physical t.**, *see*/చూడండి physiotherapy. దైహిక ఉపశమనము, వ్యాయామము, మొ. సులువు/సుళువు పద్ధతులతో చికిత్స జరుపు నిపుణుడు. **speech t.** శబ్ద ఉచ్చారణ నేర్పడంలో కౌశలుడు/కౌశలము గలవాడు.

**therapy** 1. treatment of a disease చికిత్స, రుగ్ణతను నయం చేయడం. **electroconvulsive t. (ECT), electroshock t.**, a treatment modality for depression (mental disorder) మానసిక దిగజారుడులో షాక్‌లు ఇప్పించటం/పెట్టడం. **hormonal t.**, endocrine t., hormone t. హోర్మోన్‌లను ఔషధములుగా ఇచ్చుట. **occupational t.**, engagement in work and play వ్యాధిమీద ధ్యాస/యావ మరలించుటకు ఉపాయములు; కొంతపని, కొంత ఆట, మొ. **physical t.**, *see*/చూడండి physiotherapy, therapist. 2. psychotherapy మానసిక చికిత్స.

**thermolysis** the dissipation of body heat by evaporation, radiation, *etc.* శరీరతాప ఉపశమనం.

**thermometer** a device to record temperature ఉష్ణమాని, ఉష్ణోగ్రత నమోదుచేయు సాధనము. **clinical t.**, device to measure the extent of fever జ్వరమాని: జ్వరతీవ్రత చూపు గాజు మాపని, వాడు.భా. థర్మామీటర్.

**thermostat** an instrument for controlling heat/temperature తాప క్రమ అదుపుయంత్రం: ఉష్ణతను ఒక నిర్ణీత డిగ్రీలలో క్రమబద్ధంగా నిలుపు పరికరము.

**thermotherapy** heat treatment. hyperthermia, very high body temperature, adjuvant in the treatment of cancer అధికోష్ణస్థితి: కేన్సరు చికిత్సలో సహాయకారి. employed in arthritis కీళ్ళవాపు వ్యాధి చికిత్స.

**thiamine** or **thiamin** aneurine, vitamin $B_1$ విటమిన్ $B_1$: తవుడు, చిట్టులో పుష్కలంగా లభిస్తుంది/ఉన్నది. deficiency causes beriberi, neuritis దీనిలోపమువలన బెరిబెరి అను వ్యాధి, నరాలవాపు సంభవిస్తాయి.

**thigh** the region from the hip to knee తుంటి, తొడ, ఊరువు. **t. bone** femur, the bone inside the thigh లోపలి ఎముకపేరు ఊర్వస్థి, ఊర్వికి, తుంటిఎముక, తొడఎముక.

**thirst** craving for anything, principally for drinking water దాహము, దప్పిక, నీటికోసం ఉత్సుకత; దేనికైనను తృష్ణ, ముఖ్యముగా త్రాగేనీటి కొరకు. **t. for medical knowledge** వైద్యశాస్త్ర జ్ఞానాభివృద్ధి కొరకు నిరంతర తపన.

**thoracentesis** or **thoracocentesis** surgical puncture into the pleural cavity for aspiration/withdrawal of fluid ఫుపుసావరణ కుహరములోనికి సూది గుచ్చి ద్రవము తీయుట/కార్చుట.

**thoracic** pertaining to the thorax/chest వక్షము, రొమ్ము/ఛాతీకి సం. A. **t. aorta** వక్షీయ మహాధమని. **t. cavity** ఉరఃకుహరము. **t. duct** వక్షీయ వాహిని. **t. vertebra** వక్షీయకశేరుకము. B. **t. inlet tumour,** Pancoast tumour ఛాతీ ప్రవేశములో కంతి.

**thoracocentesis** *see/చూడండి* thoracentesis.

**thoracoplasty** an operation on the thorax in which some ribs are resected కొన్ని ఛాతీ ఎముకలు తీసివేసే శస్త్ర చికిత్స. This was once popular in the treatment of TB పూర్వం ఒకప్పుడు టి.బి.కి శస్త్రచికిత్స.

**thoracoscope** an endoscope to visualise the pleural cavity వక్షాంతర్దర్శిని: ఫుపుసావరణ కుహరము పరిశీలించటానికి గొట్టపు సాధనము.

**thoracotomy** cutting the chest wall, *viz.* incision వక్షచ్ఛేదన.

**thorax** 1. the chest ఉరము, ఉరఃకుహరము, రొమ్ము, వక్షము, వక్షస్సు. thoracic cage, rib cage ఉరఃపంజరము, వక్షపంజరము, పర్శుక పంజరము. containing vital organs, heart and lungs ప్రాణాధార అవయవములకు అనగా గుండె, ఊపిరితిత్తులకు నిలయము. 2. Thorax, a medical journal వైద్యశాస్త్ర వార్తాపత్రిక.

**threadworm** *Enterobius (Oxyuris) vermicularis, see/చూడండి* Enterobius. నులిపురుగు.

**threonine** an amino acid ఒక ఎమైనో అమ్లము.

**thrill** vibration of heart murmur that can be felt with the palm of the hand, *see/చూడండి* murmur. స్పర్శతరంగము, అరచేతితో స్పర్శించు గుండె మర్‌మర్ శబ్దము. **presystolic t.**, felt in mitral stenosis. **systolic t.**, felt in aortic stenosis.

**throat** కుత్తిక, కుత్తుక. pharynx సప్తపథ. *see/చూడండి* pharynx.

**thrombectomy** surgical removal of a thrombus (a clot) from inside a blood vessel థ్రాంబస్ (స్కందము) ను రక్తనాళములోనుండి తొలగించుట.

**thrombin** an enzyme which aids blood clotting రక్తస్కందమునకు/రక్తం గడ్డకట్టుటకు తోడ్పడు ఎన్‌జైమ్, జీవ ఉత్ప్రేరకము.

**thromboangiitis** inflammation of a blood vessel with thrombosis థ్రాంబోసిస్‌తో కూడిన రక్తనాళము యొక్క శోథము/'వేడి మంట వాపు'. **t. obliterans,** inflammation and thrombosis affecting both arteries and veins, most often in the lower limb with gangrene, affecting heavy smokers ధమనులు, సిరల 'వేడి మంట వాపు'తో కూడిన థ్రాంబోసిస్, ముఖ్యముగా అధోంగముయొక్క రక్తనాళములు చెడిపోయి, కణజాలముల కుళ్ళుకు దారితీస్తుంది – ఎక్కువగా పొగాకు పీల్చేవారిలో ఈ జబ్బు కానవస్తుంది/కనబడుతుంది.

**thromboangiitis obliterans** Buerger's disease. *see/చూడండి* Buerger's disease.

**thrombocytes** *micro.str.* సూక్ష్మ.చూ. blood platelets, granulated bodies 2$\mu$ to 4$\mu$ in diameter రక్తములో సూక్ష్మకణికలు. play a part in the clotting of blood రక్తస్కందమునకు తోడ్పడును.

**thrombocytopenia** decrease in the number of circulating platelets రక్తములో ప్రవహించు ప్లేట్‌లెట్‌లు తక్కువగుట. As a result, spontaneous bruising or prolonged bleeding after injury is noticed. ఈ స్థితిలో కమిలిన మచ్చలు లేదా ఎడతెగని రక్తస్రావం కలుగవచ్చు, *అలంకార.* రక్తసిక్తం.

**thrombolysis** dissolution/lysis of a thrombus థ్రాంబస్ విచ్ఛిన్నము.

**thrombophlebitis** inflammation of a vein accompanied by thrombus formation, *e.g.* **t. of calf veins** – The affected vein

feels like a cord. ఉదా. పిక్క సిరలయొక్క శోథము/'వేడి మంట వాపు'తోపాటు థ్రాంబస్; ఈ సిర తాడువలె తగులును.

**thrombosis** the development or presence of a thrombus (clot) inside blood vessels గడ్డకట్టుటము: రక్తనాళములలో థ్రాంబస్/రక్తస్కందము తయారగుట/తటస్థపడుట. **cerebral t.**, *see/చూడండి* stroke. **coronary t.**, *see/చూడండి* coronary thrombosis. may cause sudden death or myocardial infarction, *see/చూడండి* infarction. ఆకస్మిక మృతి లేదా గుండె ఇన్‌ఫార్క్‌ట్ (పేశీచచ్చు)ను కలుగజేయును.

**thrombus** blood clot థ్రాంబస్: రక్తస్కందము. వాడు.భా. రక్తం గడ్డకట్టుట. an aggregation of some blood factors, platelets and fibrin, commencing inside a vessel wall and growing, and gradually obstructing the lumen కొన్నిస్కందన ప్రక్రియ కారకములు, ప్లేట్‌లెట్‌లు మరియు ఫైబ్రిన్ యొక్క సంకలితము. ఇది రక్తనాళం లోపల అంకురించి పెరుగుతూ, ముద్దగా అయి క్రమేణ ఆ నాళంలో అడ్డుపడుతుంది.

**thrush** candidiasis, fungus infection of the mouth and throat, marked by curd-like plaques on the surface, which leave a raw blood-oozing area on attempts at removal నోరు, గొంతు ఫంగస్ వ్యాధి; పెరుగు తరకలవలె శ్లేష్మపొర తలముపై చేర్తాయి, వాటిని పీకితే రక్తం జీర అగపడుతుంది.

**thumb** the short stout first digit of the hand బొటనవ్రేలు, అంగుష్ఠము. *N.B.* left hand thumb impression, a well known mark of identification in the judiciary *గమనిక:* ఎడమ బొటనవేలు ముద్ర చట్టరీత్యా చలామణి అవుతుంది – ఇది లోకవిదితము.

**thymectomy** surgical excision of the thymus థైమస్‌ను శస్త్రచికిత్సద్వారా తొలగించుట.

**thymoma** tumour of the thymus థైమస్ కంతి.

**thymopathy** any disease of the thymus థైమస్‌యొక్క జాడ్యము.

**thymus** lymphoid organ in the chest producing T lymphocytes. It grows upto puberty, then begins to involute/regress. టి - లసికాకణాలను తయారుచేసే, వక్షాస్థి వెనుక, ఛాతీలోనున్న, లింఫా

యిడ్ అవయవము. ప్రౌఢదశవరకు పెరుగుతూ, (బాలగ్రంథి అని పేరు ఉన్నది) ఇక తర్వాత తరుగుతూ క్రమేణ అంతర్వలనము/అంతర్వలితము/ సంకుచితము చెందుతుంది. visible in the X-ray of a child as a sail-like shadow in the anterior superior mediastinum బాలల ఎక్స్‌రే ఫోటోలో ఛాతీలో ఓడచాప/తెరచాపవలె దాని నీడ అగపడుతుంది.

**thyroid** 1. resembling a shield డాలు ఆకారము; రక్షకఫలకమును పోలిన. 2. an endocrine gland situated in the front of the neck, secreting hormones (thyroxine and tri iodo thyronine) vital to life – hence shields against inactivity అవటుగ్రంథి, మెడ ఎదురుగా అనగా ముంగిట అమర్చబడిన డాలు; అంతస్స్రావి/వినాళికా గ్రంథి. ఇది ప్రాణాధారము; అలంకార. చురుకుదనముకొరకు చురక వేయు మావటివాని ముల్లు; మాంద్యమునకు శత్రువు. Iodine is required for the elaboration of the above hormones; hence the value of iodised salt, *see/చూడండి* salt. ఈ హార్మోన్ల తయారీకి అయోడిన్ కావాలి; కాబట్టి అయోడిన్ కలిపిన ఉప్పు ఉపయోగించడం ఒక ముందు జాగ్రత్త. Thyroid is our body's thermostat. Every cell in our body is a minipower plant, *see/చూడండి* theory. Thus thyroid regulates body metabolic rate. థైరాయిడ్ తనువుయొక్క తాపనియంత్రకము. శరీరంలోని ప్రతికణము సూక్ష్మవేడి/శక్తి కొలిమి. ఈ థైరాయిడ్ జీవ(న)క్రియను క్రమబద్ధం చేస్తుంది; వేడి తక్కువైతే పెంచుతుంది, ఎక్కువైతే తగ్గిస్తుంది. **hypothyroidism:** The thermostat is set too low, food is not metabolised fast enough, hence obesity occurs. He becomes sluggish and slow. థైరాయిడ్ మాంద్యములో మనిషి కొవ్వెక్కి, సోమరియై, శక్తిహీనుడు అవుతాడు. **hyperthyroidism:** The thermostat is set too high, food is metabolised too rapidly, hence wasting occurs. Nervousness, restlessness usher in. థైరాయిడ్ తేజము, థైరాయిడ్ గ్రంథి పెరుగుట: మనిషి క్షీణించి, నీరసించి, నరాల బలహీనత, అదుర్దాకు లోనవుతాడు. 3. **goiter,** swelling of thyroid gland, *see/చూడండి* goiter, goitre. 4. a pharmaceutical preparation of dried animal thyroid gland జంతువుల థైరాయిడ్ గ్రంథినుండి తయారుచేసిన ఔషధము.

**thyroidectomy** removal of the thyroid gland థైరాయిడ్ గ్రంథిని తీసివేయుట. **"chemical" t.** *jargon.* reduction in thyroid function achieved by anti-thyroid drugs, radioactive iodine రసాయనిక థైరాయిడ్ ఛేదన: జార్గన్. "రసాయనిక గాటు": థైరాయిడ్ ప్రతికూల ఔషధములు, రేడియోధార్మిక శక్తి గల అయొడిన్ యొక్క సాయంతో థైరాయిడ్ విధిని తగ్గించుట.

**thyroiditis** inflammation of the thyroid gland థైరాయిడ్ గ్రంథి వాపు/శోథము. **Hashimoto's t.** హాషిమాటో (జపాను శాస్త్రవేత్త) కనిపెట్టిన జబ్బు.

**thyrotoxicosis** overactivity of the thyroid gland థైరాయిడ్ తేజము; థైరాయిడ్ గ్రంథి అధిక చురుకుదనము. Graves' disease: goitre, exophthalmos, tacchycardia, emaciation, increased BMR థైరాయిడ్ వాపు, కండ్లు ఉబ్బుకొని వెలుపలికి రావడం, నాడిపరుగు, నీరసము, బక్కపల్చగా అయిపోవటం, అధిక జీవ(న)క్రియ ప్రమాణము.

**thyrotrophic** or **thyrotropic** a substance which stimulates the thyroid gland, *e.g.* **t. hormone** of the anterior pituitary gland థైరాయిడ్ గ్రంథిని ఉద్దీపన చేయు పదార్థము, ఉదా. పూర్వ పిట్యూటరీ గ్రంథియొక్క హార్మోన్.

**thyroxine** an iodine containing hormone secreted by the thyroid gland థైరాయిడ్ గ్రంథి స్రవించే అయోడిన్‌తో మిళితమైన హార్మోన్.

**TIA** *abbr.* transient ischemic attack, a signal heralding stroke, a harbinger, *see/చూడండి* stroke. కొంచెముసేపు ఉండెడు రక్తప్రసరణ దోషము, రాబోవు స్ట్రోక్‌యొక్క అగ్రదూత. symptoms: transient numbness/weakness in a limb, blurring of vision, *etc.* లక్షణములు: కాలు, చేయిలో స్వల్పకాలపు తిమ్మిరి/బలహీనత, దృష్టి చెదిరినట్లుండుట, మొ.

**tibia** shin bone అంతర్జంఘిక, అంతర్జంఘాస్థి. **sabre t.**, *see/చూడండి* shin. **t. valga,** inward bend of knee గాడిదకాలు, శరీరమధ్యరేఖవైపు అనగా లోపలికి వంగిన జానువు. **t. vara,** outward bend of knee; bow-leg, bandy leg వెలుపలికి విల్లువలె వంగిన జానువు, దొడ్డికాలు.

**tic** *syn.* habit spasm; sudden muscular twitch తటాలున చలించుట. sudden spasmodic jerk చివుక్కున ఈడ్పుతో కూడిన ఈడ్పు. pull, pluck, snatch with a sudden jerk గభాలున లాగు, పీకు, గుంజు. **facial t.**, twitches in facial muscles ముఖ కండరములలో ఈడ్పులు. **habit t.**, *see/చూడండి* spasm. **neck and shoulder t.** మెడ, బుజము ప్రాంతంలో కండరముల ఈడుపులు. In fact, any group of muscles may be affected, but the exposed ones are listed above. వాస్తవానికి, ఏ కండర సముదాయమైనా ఈడ్పుకు గురికావచ్చును, కాని మరుగు లేనివి మాత్రమే పైన పేర్కొనబడినవి.

**tic douloureux** trigeminal neuralgia త్రిధారానాడీ వేదన. pain in the distribution of trigeminal nerve, $5^{th}$ cranial nerve 5వ కపాలనాడియొక్క ప్రభావముగల భాగములో వేదన/నొప్పి.

**tick** a blood-sucking insect infesting cattle and dogs గోమారి, పిడుదు, కొణుజు, కొణుసు: పశువులను, కుక్కలను రక్తము గుంజి పీడించు కీటకము. Some ticks are vectors of disease, *e.g.* tick-borne relapsing fever, tick-borne typhus. కొన్ని వ్యాధి ఆరోహకాలు, ఉదా. కొణుజుద్వారా జ్వరము, గోమారిద్వారా టైఫస్.

**t.i.d.** or **T.I.D.** *abbr.* [Latin *ter in die*] three times a day *see/చూడండి* t.d.s. రోజుకు మూడుసార్లు.

**time** 1. a particular period నిర్ణీతకాలము. 2. a measure of time కాలప్రమాణము, అవధి. **bleeding t.**, 1 to 4 minutes (Duke method), **coagulation t., clotting t.,** (glass tubes) 9 to 15 minutes.

**tincture** an alcoholic solution మద్యసార ద్రావణము. **benzoin t. compound,** 1. seal on wounds (with cotton) గాయములమీద ఈ మందు దూదిలో ముంచి అంటించుట. 2. steam inhalations for coryza/cold after putting this medicine in boiling water ఈ మందు కాగే నీళ్ళలో వేసి ఆవిరి పడితే పడిశమునకు ఉపశాంతి, జలుబు నీరంతా కారిపోతుంది. **sweet orange peel t.,** a flavouring agent తీపి నారింజ తొక్క ద్రావణము, ఔషధములకు కమ్మదనము కలిగించేది.

**tinea** ringworm; fungal infections of the skin తామర: చర్మమునకు సంక్రమించు/సోకు ఫంగస్ జబ్బులు. **t. barbae,** affection of the

beard skin by *Trichophyton* ఈ పేరుగల ఫంగస్ గడ్డమును ఆవరించుట. **t. cruris,** of groin (dhobie itch) గజ్జ ప్రాంతములో, చాకలివాని తీట – తామర. **t. pedis,** ringworm of the foot పాదమునకు తామర. **t. sycosis,** deep type of t. barbae క్షురకర్మ చర్మతెగులు. **t. unguium,** of nails నఖముల తామర. **t. versicolor,** chromophytosis, multiple macular patches సోభి: శరీరంమీద రంగుమారిన పెక్కు పొడలు, మచ్చలు.

**tingling** a peculiar multiprick thrill జలదరించటం. caused by (i) cold శీతలం. (ii) emotional shock ఆవేశాఘాతం/ఉద్రేక ఘాతము. (iii) striking a nerve నాడి మీద కొట్టితే కలిగే జలదరింత. *experience:* striking the ulnar nerve at the back of the elbow (the "funny bone") *అనుభవం:* ముడుకువెనుక అరత్నినాడి మీద తట్టినప్పుడు చేతిలో జలదరింత ఒక వింత అనుభూతి. *N.B.* Tingling and numbness are co-discomforts. *గమనిక:* జలదరించడం, మొద్దుబారటం ద్వంద్వ అసౌఖ్యములు.

**tinnitus** noises in the ear, ringing, buzzing, *etc.* చెవులో గుయ్ మనడం, చెవులలో రింగుమను మ్రోత, బుజ్‌మని హోరు, ఇత్యాది చప్పుళ్ళు. This occurs in salicylism, *see/చూడండి* salicylism.

**tissue** the substance of an organ/organic body ధాతువు, కణజాలము, కణసముదాయము, కణసంహతి, కణసమితి, ఊతకము. an aggregation of cells to perform a set function నిర్ణీతవిధిని నిర్వర్తించు ఉమ్మడి/సమష్టి కణకూటమి. A. **t. culture** కణజాల సంవర్ధనము. B. **adipose t.,** fatty t. కొవ్వు. **bony t.,** bone ఎముక. **cancellous t.,** the spongy tissue of bone సుషిరధాతువు, సుషిర సంఘాతము. **cartilaginous t.** మృదులాస్థి. **cicatricial t.,** scar, cicatrix మచ్చ. **connective t.,** the nonparenchymatous ground substance సంయోజక కణజాలము, బంధన కణజాలము, సంధాయక కణజాలము. **elastic t.,** *e.g.* lung tissue స్థితిస్థాపక గుణముకల కణజాలము, ఉదా. ఊపిరితిత్తి. **epithelial t.** ఉపకళా కణజాలము. **erectile t.,** spongy tissue which becomes hard, when filled with blood, *e.g.* in the penis ఉదా. పురుషాంగములో స్పంజికవలెనున్న కణజాలము; రక్తముతో నిండగానే నిటారుగా అవుతుంది. **fatty t.,** fat, expensive in the

market, cheap in the body; harmful/unwanted in some persons కొవ్వు, అంగడిలో ఖరీదు, కొందరిలో అవాంఛనీయము. **fibrous t.** తంతుమయ కణజాలము *e.g.* healing with fibrosis in tuberculosis ఉదా. క్షయవ్యాధి నయముగుటకు ఇక ఇదియే దిక్కు/మార్గము. **glandular t.**, Gland is made up of cells. గ్రంథి కణముల యొక్క సముదాయము/నిర్మాణము. **granulation t.**, newly formed tissue to repair an injury/wound దెబ్బ/గాయమును నయము చేయుటకు పూనుకొన్న లేత కణజాలము. **lymphoid t.** లసికామయ కణజాలము. *e.g.* thymus ఉదా. థైమస్ గ్రంథి, బాలగ్రంథి. **muscle t.**, **muscular t.** కండరమయ/పేశీమయ కణజాలము. **myeloid t.**, red bone marrow అరుణ అస్థిమజ్జ. *figur. resemblance:* nutrition - giving pulp in the drumstick which is the vegetarian counterpart of the non-vegetarian bone – both are sucked with relish. అలంకార. *పోలిక:* శాకాహారులు మునగకాడలోని పోషకగుజ్జు, మాంసాహారులు ఎముక మూలుగ – ఈ రెండింటిని కూరిమితో చీకుతారు, ఆ రుచియొక్క అనుభూతి పొందుతారు. **nerve t., nervous t.** మజ్జామయ కణజాలము, నాడీకణజాలము. **osseous t.**, bone ఎముక. **parenchymatous t.**, the prestigious portion of the organ which is the productive one మృదు కణజాలము, మృదుసారము, మృదుకణసంహతి; ఫలహేతుకముగావున్న ప్రతిష్ఠాజనకమైన అవయవ కణరత్నజాలము. **reticular t.**, reticulated t. జాలక కణజాలము. **scar t.**, cicatricial t. తంతుకణమయ మచ్చ. **subcutaneous t.**, loose connective tissue underneath the skin చర్మము అనే కవచము క్రింద సడలుగానున్న బంధనకణజాలము.

**titubation** tremor of the head/trunk తల/మొండెముయొక్క వణకు.

**tobacco** a plant of the nightshade family పొగాకు, ధూమపాన పత్రము, ధూమ్రపత్రిక (ఆకు), తంబాకు. The dried leaves contain nicotine. Tobacco is consumed by human beings in different forms, *viz.*, smoking, (cigar, beedi, cigarette, hookah) chewing and inhaling (snuff). పొగాకులో నికోటిన్ ఉంటుంది. పొగాకు పొగ పీలుస్తారు (చుట్ట, బీడి, సిగరెట్టు, హుక్కా); జర్దా: తమలపాకు సున్నంతోపాటు నములుతారు; మరియు నశ్యం పీలుస్తారు. an

addiction 'to smoke off one's worries' మనోవ్యాకులతకు ఈ వ్యసనం ఒక చిట్కా వంటిది. Smoking is injurious to health; death in small doses. పొగాకుపొగ/పొగాకు ఆరోగ్యానికి అపాయకరము; చిన్న మోతాదులలో మృత్యువునకు చేరువ. మరణకారకము. 'పొగాకు పొగ మన పగ'గా భావించండి.

**toe** a digit of the foot పాదము వేలు/వ్రేలు, పాదాంగుళి. **great t.**, first stout toe మొదటి దొడ్డువేలు, పాదము బొటనవ్రేలు, వాడు. భా. కాలి బొటనవ్రేలు.

**toilet** 1. a place for discharging wastes from the body, *e.g.* urinal విసర్జన పదార్థములు విడుచు చోటు, ఉదా. మూత్రశాల, పరిశుభ్రతశాల. 2. *syn.* toilette. a place for grooming oneself ముస్తాబు చేసుకొనుగది. **wound t.**, cleansing and dressing of a wound గాయమునకు లాలనము; శుభ్రము చేసి మందువేసి కట్టుకట్టుట.

**tolerance** endurance సహించుట. **drug t.** ఔషధసహనము.

**tomography** *see/చూడండి* scan. **ultrasonic t.**, *see/చూడండి* ultrasonography.

**tone** 1. tonus, the normal healthy state of tension; the resistance of a muscle to stretch సహజ (ఆరోగ్య) బిగువు; కండరము చాచుటకు/సాగదీయుటకు ప్రతిరోధకము. When the resistance is high, it is called hypertonic (spastic), *see/చూడండి* rigidity. ఇది ఎక్కువగా ఉన్నట్లయితే బిగువు/బిరుగా ఉంటుంది. When the resistance is low, it is called hypotonic (flaccid), *see/చూడండి* flaccid. ఇది తక్కువగా ఉన్నట్లయితే మెత్తగా, పితపితలాడుతూ ఉంటుంది. 2. sound స్వరం.

**tongue** a powerful muscle in the body శరీరంలో బలిష్ఠమైన పేశీ; నాలుక, జిహ్వ, జిహ్వేంద్రియము, రసజ్ఞ. **coated t.**, పాచి(క) పేరుకొని ఉన్న నాలుక రూపము. seen in typhoid fever, indigestion, biliousness, *etc.* టైఫాయిడ్ జ్వరము, అజీర్తి, పైత్యము, మొ. వానిలో చూడనగును. Tongue is the mirror of the gastro-intestinal tract. జిహ్వ జీర్ణాశయాంత్ర పథమునకు అద్దములాంటిది; దీని రుగ్మత నాలుకమీద ప్రతిబింబించబడుతుంది. **geographic t.**, in glossitis, *resemblance:* map in altas నాలుక 'మంట ఎరుపు తీపు

వాపు', పోలిక: జాగ్రఫీ మ్యాప్. **scrotal t.**, fissured t., *resemblance:* fissured appearance (pineapple skin) of the scrotal skin in a cold night పోలిక: శీతల రాత్రి సమయంలో ముడుచుకున్న వృషణముల సంచియొక్క చర్మము అనాసపండు తోలువలె చీటికలు వాసి ఉండుట – ఈ నాలుక ఇట్లా ఉంటుందని తాత్పర్యము.

**tongue tie** abnormal shortness of the frenum of the tongue, thus anchoring it, *see/చూడండి* frenum. అడుగున అంటుకున్న నాలుక: క్రింద శ్లేష్మపొర మడత కురుచదనమువలన నాలుక లంగరువేయబడుట.

**tonic** 1. pertaining to tone, *see/చూడండి* tone. టోన్‌కు సం. 2. tonic spasm in epilepsy అపస్మారములో బిగువు ఈడ్పు. 3. a tonic for health which patients are fond of బలవర్ధకౌషధము, టానిక్ ఇవ్వమని/వ్రాయమని రోగుల అభ్యర్థన. 4. tense, characterised by tension అదుర్దా/అందోళనతో కూడుకొనియున్న.

**tonometer** a device to measure intraocular pressure or tension కన్నుగుడ్డు లోపలి ఒత్తిడిని కొలిచే సాధనం.

**tonometry** *e.g.* measurement of intraocular pressure కన్నుగుడ్డు లోని ఒత్తిడి నిర్ణయించుట.

**tonsil** 1. **lymphoid:** (a) masses of lymphoid tissue, used very often to refer as **palatine t.**, faucial t., also *see/చూడండి* adenoids. గళగుటిక: వాడు.భా. గొంతులో కొయ్యగండలు. బహుతరచుగా అంగిలిలోఉన్న లసికామయ కణజాలముయొక్క ముద్దలకు ఈ పదం వాడుతారు. (b) **lingual t.**, at the root of the tongue నాలుక మూలమున ఉన్న. (c) **pharyngeal t.**, at the posterior wall of the nasopharynx నాసికాగ్రసని వెనుకగోడ మీద ఉన్నవి. 2. **non-lymphoid: t. of cerebellum,** a portion of the cerebellum అనుమస్తిష్కములోని ఒక ప్రాంతము.

**tonsillectomy** surgical excision of a tonsil టాన్సిల్ ఛేదన: టాన్సిల్‌ను శస్త్రచికిత్సచేసి తొలగించుట.

**tonsillitis** inflammation of the tonsils టాన్సిల్స్ యొక్క శోథము/ 'నొప్పి వేడి మంట ఎరుపు తీపు వాపు'.

**tooth** [teeth *pl.*] పన్ను. **eye t.**, upper canine పై కోఱపన్ను. **Hutchinson's teeth,** notched, peg-shaped permanent incisors అంచున గంటుగల, గూటము రూపములోనున్న శాశ్వత కొఱుకుడు పళ్ళు/పండ్లు. **impacted t.** ఒకటిని ఇంకొకటి తాకుతూ మొలకెత్తనీయకుండా అడ్డుకొనియున్న పన్ను. **wisdom t.** జ్ఞానదంతము. A. **t. ache** పంటినొప్పి. **t. brush** పలుదోము కుంచె. **t. pick** పళ్ళసందున ఇరుక్కున్న పదార్థాన్ని తీసేపుల్ల. B. **artificial t.**, or set of teeth నకిలీ పన్నుగాని కృత్రిమ పండ్ల వరుసగాని. Nowadays non-removable permanent artificial teeth are being fixed in/on the bones with stainless steel bridges and screws. ఇటీవల శాశ్వతంగా కృత్రిమ పండ్లను ఎముకలమీద స్టీల్ పట్టీలు మరియు మరమేకులతో బిగిస్తున్నారు.

**tophus** [tophi *pl.*] (of gout) గౌట్ అనే వ్యాధిలో బుడిపెలు.

**topical** local స్థానిక. ointment for topical use, *i.e.* for local external use బయట రాసుకోటానికి/పూసుకోటానికి మలాం.

**topography** *anat.* the description of the regions of the body స్థలవర్ణనం: శరీరప్రాంతవర్ణనం.

**torticollis** wry neck/wryneck వంకరగా తిరిగిన మెడ. **spasmodic t.,** of neck మెడలో ఈడ్పులు, బిగువు.

**tourniquet** device to control bleeding in a limb అంగములో రుధిర/రక్తస్రావము అరికట్టే పరికరము.

**toxaemia** or **toxemia** 1. a state wherein the bacterial toxins circulate in the blood విషరక్తత/విషజన్యరక్తదోషము, రక్తంలో బాక్టీరియా విషపదార్థములు ప్రసరణ అగుట. 2. **t. of pregnancy,** a metabolic disturbance గర్భిణిస్త్రీలో జీవ(న)క్రియ గడబిడలు.

**toxic** 1. poisonous విషపూరితమైన. 2. pertaining to a toxin టాక్సిన్‌కు సం. 3. caused by a toxin టాక్సిన్ వలన కలిగిన.

**toxicity** quality of being poisonous విషత్వం. **drug t.,** ఔషధము యొక్క విషపరిణామము. **oxygen t.,** ఉదా. ఆక్సిజన్ యొక్క అవాంఛనీయ దుర్ఘటనము; అలంకార. సంజీవినిలాంటి ఆక్సిజన్‌కూడా మోతాదులో ఇవ్వాలి సుమా! కొన్ని జబ్బుల్లో ప్రాణవాయువే ప్రాణానికి ముప్పు తేవచ్చు.

**toxicology** the science about poisons విషవిజ్ఞానము, గరళ శాస్త్రము, విషతత్వ శాస్త్రము.

**toxin** 1. a poison విషపదార్థము, ఒక విషము, జీవాణు విషము, జీవజన్య విషము, జీవవిషము. usually protein in nature, elaborated by some higher plants, certain animals and especially by pathogenic bacteria కొన్ని వృక్షజాతులు, పశుజాతులు మరియు ముఖ్యముగా జబ్బులు కలిగించు బాక్టీరియా తయారుచేయు విషసంబంధపదార్థము – ఇది తరచుగా ప్రోటీన్. **botulinum t.,** *see/చూడండి* botulism. **diphtheria t.,** an exotoxin, *see/చూడండి* diphtheria. **tetanus t.,** an exotoxin, *see/చూడండి* tetanus. 2. snake venom విషసర్పగరళము.

**toxoid** a processed or inactivated exotoxin that is no longer toxic but retains the ability to combine with or stimulate the production of antitoxin గుణము మార్చబడిన లేదా నిరర్థకమైన సూక్ష్మజీవిజన్య విషము; దీనికి విషసంబంధ గుణము లేదుగాని, జీవ విషనివారకాల (antitoxins) తో మిళితమవుట లేదా వాటి ఉత్పన్నమును ఉద్దీపింపజేయుట అనే సామర్థ్యము గలదు. **diphtheria t., tetanus t.,** active immunizing agents, *viz.* those producing active acquired immunity after vaccination, *see/చూడండి* immunity. టీకాతర్వాత, స్వయముగా ఆర్జించిన వ్యాధి నెదుర్కొను శక్తి పెంపొందించు డిఫ్తీరియా, టెటానస్ టాక్సాయిడ్ లు.

**toxoplasmosis** protozoal infection by the mocroorganism *Toxoplasma gondii*, congenital, acquired ఈ ప్రొటోజోవా సూక్ష్మ జీవి సంపర్కమువలన సంభవించు వ్యాధి రెండురకములు: పుట్టుకతో వచ్చేది, తరువాత జీవితంలో సంక్రమించేది.

**trabeculae** [trabecula *sing.*] త్రాపకాలు. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **fleshy trabeculae of heart,** bands/strands of muscle projecting from the inner walls of the ventricles of the heart గుండె జఠరికలోని కుడ్యమునుండి ఉబికియుండు, తాడునుపోలిన, కండరపోగుల కట్టలు/త్రాపకాలు. *micro.str.* సూక్ష్మ.చూ. *anat.* supporting strand of connective tissue బంధన కణజాలముతో ఆధారభూతముగా ఉన్న తాడులలోని పోగులు. **trabeculae of bone,** framework/meshwork

of the bony cancellous tissue, the spaces filled with bone marrow వల ఆకారములో ఉండే అధారభూతమైన ఎముక జాలము - ఈ సందుల్లో ఎముక మజ్జ ఉంటుంది.

**tracer** a substance which can be traced in the body after introducing it ఒక పదార్థం శరీరంలో చేర్చిన తర్వాత దాని జాడ తెలిసికొనుట. **radioactive t.**, follow-up of a radioactive isotope introduced into the body రేడియో ధార్మికతగల ఐసోటోప్‌ను శరీరంలోకి ఎక్కించి, దాని జీవ(న)క్రియ, కణజాలములలోనికి అవరించుకొనిపోవుట మరియు విసర్జింపబడుట - ఈ అంశములన్నీ పరిశీలించుట.

**trachea** the windpipe వాయునాళము, ఊపిరిగాలిగొట్టము. divides in the chest into the right and left bronchus, *resemblance:* inverted Y ఛాతీలో కుడి, ఎడమ శ్వాసనాళములుగా విభజింపబడుతుంది, *పోలిక:* పంగలకఱ్ఱ.

**tracheitis** or **trachitis** inflammation of the trachea వాయునాళము యొక్క శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు వాపు'.

**tracheobronchitis** inflammation of the trachea and bronchi వాయునాళము, శ్వాసనాళికల యొక్క శోథము/'నొప్పి వేడి మంట ఎరుపు తీపు వాపు'.

**tracheostomy** stoma = opening. **emergency t.**, creating an opening into the trachea and placing a soft breathing tube వాయునాళ ఛిద్రము: అత్యవసర పరిస్థితులలో వాయునాళములో రంధ్రముచేసి ఒక మెత్తటి గొట్టమును అందులో అమర్చుట.

**tracheotomy** [Greek *tome*=incision]. an emergency procedure - making a vertical slit in the anterior wall or incision of trachea, *e.g.* in laryngeal diphtheria ప్రాణం కాపాడటానికి వాయునాళముమీద గంటుపెట్టుట, ఉదా. స్వరపేటిక డిఫ్తీరియాలో.

**trachoma** a contagious disease of the conjunctiva and cornea caused by *Chlamydia trachomatis,* marked by red follicles on the conjunctiva of the eyelids, seen on everting the eyelid దుర్మాంసములు: కంటిమీద పొరకు, శుక్లపటలమునకు స్పర్శమువలన సోకెడు అంటురోగము; రెప్ప వెనుకకు విరిచి చూస్తే ఎఱ్ఱ పుటికలు

అగపడును. If neglected, corneal scarring leads to blindness. అశ్రద్ధ చేస్తే శుక్లపటలము దెబ్బతిని, అంధత్వమునకు దారి తీస్తుంది.

**tract** 1. a region of tubed structures, extending over some length కొంత పొడవుగల నాళనిర్మాణ ప్రాంతము. **alimentary t., digestive t.,** alimentary canal ఆహార/జీర్ణమార్గము, ఆహార/జీర్ణనాళము. also called gastrointestinal tract జీర్ణాశయాంత్ర మార్గము. **intestinal t.,** the small and large intestines చిన్నపేగు, పెద్దపేగు. **respiratory t.** శ్వాస మార్గము. 2. bundle of nerve fibres నాడీతంతుల కట్టలు. **optic t.,** optic nerve at the back of the eyeball, and its continuation into the brain కన్నుగుడ్డు వెనుక దృక్‌నాడి/దృష్టినాడి, మరియు మెదడులోనికి దాని మార్గము. **pyramidal t.,** the great motor tract arising in the brain and running in the spinal cord సూచిస్తంభ మార్గము, మెదడులో బయలుదేరి వెన్నుపాము గుండా వెడలు చాలక మహామార్గము. 3. a group of related organs discharging a common function ఒకేవిధి నిర్వహిస్తూ, పరస్పర సంబంధముగల అవయవముల సముదాయము. **biliary t.,** comprises the liver, gall bladder, hepatic and bile ducts; effects delivery of bile into the duodenum పైత్యరసమార్గము: కాలేయము, పిత్తాశయము, కాలేయ, పైత్యరస నాళములు; పైత్యరసము అంత్రమూలములోనికి చేరేమార్గం. **urinary t.,** consisting of kidneys, ureters, urinary bladder and urethra మూత్రమునకు సంబంధించిన అవయవములు: మూత్రపిండములు, మూత్రనాళాలు, మూత్రాశయము మరియు మూత్రమార్గము.

**traction** the act of drawing or pulling ఈడ్చుట లేదా లాగుట. **skeletal t.,** *see/చూడండి* splint. **skin t.,** traction on a body part through plaster applied on skin చర్మముమీద అతికించు ప్లాస్టరు బాండేజ్ ద్వారా ఒక ప్రాంతమును లాగి ఉంచుట.

**tradition** 1. the handing down orally of an accepted custom from generation to generation, *e.g.* the science of medicine సంప్రదాయము: (అనుశ్రుత) వైద్యశాస్త్రము ఒక తరమువాళ్ళు మరియొక తరమునకు బోధించుట, శాస్త్రజ్ఞానము ఇతరులకు పంచుట. 2. an unwritten practice, *e.g.* shaving clean the beard, moustache and/or scalp but not shaving the eyebrow అనవాయితి: ఉదా.

గడ్డం, మీసం, శిరస్సు వెంట్రుకలు గొరుగుకుంటారుగాని కనుబొమలు ఎవరూ గొరుగుకొనరు.

**tragus** cartilaginous projection in front of the opening of the ear, *resemblance:* add beauty to the conch-shell shaped ear వెలుపలి చెవి రంధ్రము యొక్క ముంగిటనున్న మృదులాస్థి బొడిపె – పోలిక: శంఖాకృతిదాల్చిన శ్రోత్రమునకు అందము.

**training** practical education అభ్యాసము. **bladder t., bowel t.** శిక్షణ: మూత్రమల విసర్జనల తాలూకు భోగట్టా.

**trait** a genetically determined characteristic, *e.g.* sickle-cell trait: red blood corpuscles, assuming sickle shape లక్షణాంశము: జన్యువుకు సంబంధించిన ప్రత్యేకత, ఉదా. కొడవలి అకారములోనున్న ఎర్రరక్తకణములు.

**trance** sleep-like state పారవశ్యం, ఉపసమాధి. 1. **hysterical t.,** in the grip of emotion పారవశ్యము, హిస్టీరియా అను జబ్బులో ఆవేశము. 2. a state of religious or mystical ecstasy మత లేదా దైవ కైంకర్యములో పరవశత (rapture), మైమరపు, అనంద పారవశ్యం.

**tranquilizer** an agent with a calming, soothing action – a drug calming one's attitude ప్రశాంతకము: కలతలేకుండా, నెమ్మది పరచు వస్తువు/ఔషధము, ఉపశమనకారి, వ్యాకులత తగ్గించేమందు.

**transabdominal** across the abdominal wall or through the abdominal cavity ఉదరకుడ్యము ద్వారా. **t. route,** *e.g.* approach to the diaphragm through the abdominal (peritoneal) cavity ఉదా. విభాజకపటలము వద్దకు వెళ్లాలంటే ఉదర (అంత్రవేష్టన) కుహరముద్వారా ప్రవేశము.

**transdural** across the dura mater పరాశిక ద్వారా.

**transection** cutting transversely అడ్డముగా నరకుట.

**transformation** modification and change రూపాంతరణ. a change of one tissue into another, *e.g.* cartilage into bone ఒక కణజాలము మరియొక కణజాలముగా మారుట, ఉదా. మృదులాస్థి ఎముకగా మారుట.

**transfusion** introducing fluid into a tissue or blood vessel కణ జాలము లేదా రక్తనాళము లోనికి ద్రవము ఎక్కించుట. **blood t.,** introduction of donor blood into a patient/person రక్తప్రవేశనము: రోగికి/వ్యక్తికి దాత ఇచ్చిన కొత్తరక్తము ఎక్కించుట.

**transillumination** the transmission of light కాంతి యొక్క ప్రసరణ. **t. on a hydrocle,** pressing the scrotum on one side with a lit pen-torch and inspecting the beam of light transmitted through the hydrocele, on the other side పారప్రదీపనము: బుడ్డ/ఒఋబీజమును ఒకవైపున వెలుగుతున్న బాటరీలైట్‌తో నొక్కి, రెండవ వైపున ఆ లైటుదృశ్యమును పరిశీలించుట.

**translucent** 1. a stage in between transparent and opaque పారదర్శకమునకు మరియు అపారదర్శకమునకు మధ్యనున్న స్థితి. ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు కొంతమట్టుకు వెలుతురును పోనిచ్చెడు; 2. semitransparent, partially transparent పాక్షిక పారదర్శకమైన, మసకగా ఉన్న.

**transmission** 1. transfer of an infectious, contagious, communicable disease from one person to another ఒకరినుండి మరియొకరికి సంక్రమించు అంటు/సోకుడు, స్పర్శమువలన కలుగు, సోకదగిన/అంటెడు జాడ్యము. 2. transmission of an impulse ప్రేరేపణ పంపడం.

**transmural** 1. through or across the wall of an organ or cavity అవయవము లేదా కుహరము యొక్క కుడ్యముద్వారా. 2. through and through, *i.e.* involving the entire thickness, *e.g.* **t. thrombus** లోపలి అంచు నుండి వెలుపలి అంచువరకు, అనగా గోడ మొత్తము ఆవరించిన, ఉదా. థ్రాంబస్.

**transparent** 1. having the property of transmitting rays of light పారదర్శక, స్వచ్ఛమైన (clear). ఒకప్రక్క నుండి రెండవ ప్రక్కకు వెలుతురును పోనిచ్చెడి గుణము కల. 2. permeable to light ప్రకాశ భేద్యమైన (భేద్యత=చొరుచుకొని పోనిచ్చెడి గుణము, భేదించే గుణము) [*in contr.* opaque భిన్న. అపారదర్శక].

**transplantation** remove and plant in another place, *e.g.* **t. of tissue, organ,** *etc.* from the patient's own body or from another

person బదలీకరణము, ప్రతిరోపణము: ఒకచోటనుండి తీసి మరియొక చోట నాటుట, ఉదా. తన శరీరమునుండికాని లేదా మరియొకరినుండి కాని కణజాలమునుగాని, అవయవమునుగాని ఈవిధముగా ప్రతిరోపణము చేయుట.

**transport** carry from one place to another ఒకచోటనుండి మరియొక చోటకు తీసుకొనిపోవు. **oxygen t.**, transport between the lungs and the tissues రవాణా: ఉదా. ఊపిరితిత్తుల మరియు కణజాలముల మధ్య అక్సిజన్ కదలిక/రవాణా.

**transposition** displacement తారుమారు. **t. of viscera**, change in the position of a viscus to the opposite side, *e.g.* liver to the left, spleen to the right. It is a congenital condition. అవయవముల పక్షాంతరణము, ఉదా. లివర్ ఎడమవైపునకు, స్ప్లీన్ కుడివైపునకు మారుట – ఇది పుట్టుకతోనే ఉండే స్థితి.

**transudate** a fluid, *e.g.* pleural effusion with protein content less than 3 g/dl పారస్రావము, శోథరహితస్రావము: ఉదా. పుపుసావరణ కుహరములోని ద్రవము, ప్రోటీన్ శాతం తక్కువ [*in contr.* exudate, in which protein content is more than 3g/dl *భిన్న.* శోథస్రావము; శోథసహితస్రావం, ఎక్సుడేట్ – దీనిలో ప్రోటీన్ శాతం ఎక్కువ].

**transurethral** *see/చూడండి* resection, TURP. మూత్రమార్గంద్వారా.

**transverse** lying at right angles to the long axis అడ్డముగా నున్న. **t. colon**, horizontal part of the large intestine అడ్డముగానున్న పెద్దపేగు భాగము. **t. lie, t. presentation** of fetus in utero గర్భస్థశిశువు గర్భకోశములో అడ్డముగా తిరిగి ఉండుట. **t. process** కశేరుబాహువు.

**transvesical** through the urinary bladder మూత్రాశయము ద్వారా.

**transvestism** or **transvestitism** the practice of wearing dresses of the opposite sex, to derive sexual pleasure పరలింగ వేషధారణ: లైంగిక ఉల్లాసం కొరకు పరలింగ దుస్తులు ధరించుట. **in another context** *వేరు సందర్భములలో* (i) in cinema or drama, to show talent and skill సినిమాల్లోను, నాటకాల్లోను ప్రజ్ఞ, సామర్థ్యము, ప్రతిభ మరియు నేర్పరితనం, చాతుర్యం నిరూపించటానికి. (ii) fondling

children చిన్నారులను చూడముచ్చట గొలిపేలాగున అప్పుడప్పుడు తల్లులు పిల్లలకు ఈ రకంగా వేషధారణ చేస్తారు. (iii) in fancy dress competitions ఫాన్సీడ్రస్ పోటీలు: కల్పనాశక్తి క్రోడీకరించి వేషధారణ విన్యాస పోటీలలో. **male t.** eonism. adoption of feminine costumes and mannerisms by a male పురుషుడు దుస్తులలో మరియు కులుకులు, పలుకులు, ప్రవర్తనలో స్త్రీలను అభినయించుట.

**trapezium** one of the eight carpal bones మణిబంధ అష్టాస్థిలో ఒక ఎముక.

**trapezius** muscle in the chest wall ఛాతీకుడ్యములోని కండరము.

**trapezoid** one of the eight carpal bones మణిబంధ అష్టాస్థిలో ఒక ఎముక.

**trauma** physical wound/injury శారీరక దెబ్బ/గాయము. **psychic t., mental t.,** emotional shock మానసిక ఆందోళన/ఘాతము.

**traumatology** surgery in accidents, wounds, injuries ప్రమాదములు, గాయములు, దెబ్బలకు శస్త్రచికిత్స విభాగము.

**travel sickness** nausea and vomiting while travelling, *i.e.* while in motion, *e.g.* by car, bus, boat, *etc. figur.* to get carsick. ప్రయాణంలో కదలిక వలన కలుగు అస్వస్థత – వాంతి వచ్చినట్లుండుట, వాంతి చేసుకొనుట, ఉదా. కారు, బస్సు, నావ ప్రయాణంలో.

**treatment** 1. care of a patient, *N.B.* The cure lies in the care bestowed. చికిత్స, ఉపచారం. **conservative t.,** avoid surgery సంరక్షించెడు, సాంప్రదాయ చికిత్స, వీలైనంతవరకు శస్త్రము తప్పిస్తూ. **domiciliary t.** గృహచికిత్స. **empiric t.** శాస్త్రీయమైన రుజువు లేదా స్వానుభవముతో ఆచరించే చిటకాలు/చిట్కాలు. **medical t.** ఔషధ చికిత్స. **palliative t.,** to mitigate/lessen ఉపశమనము/ఉపశాంతి చేయు. **preventive t., prophylactic t.,** *e.g.* aspirin in heart disease, isoniazid in chemoprophylaxis of tuberculosis ముందు జాగ్రత: గుండెజబ్బు నివారణకు ఆస్పిరిన్, క్షయవ్యాధి నివారణకు ఐసోనియాజిడ్. **surgical t.** శస్త్రచికిత్స. **symptomatic t.** జబ్బులక్షణములు సవరించు చికిత్స. 2. **sewage t., sewerage t.** మురికినీరు కాలుష్యం నివారించు పద్ధతులు.

**tree** a grown-up plant వృక్షము. **tracheobronchial t., respiratory t.** శ్వాసకోశ వ్యవస్థ. *resemblance:* a tree. Trachea is the stem; branches are bronchial tubes; leaves are alveoli. *పోలిక:* వృక్షము. వాయునాళము చెట్టుమొదలు; శ్వాసనాళికలు కొమ్మలు; వాయుగోళములు ఆకులు.

**Trematoda** a class of Platyhelminthes, flukes, *see/చూడండి* flukes.

**tremor** involuntary trembling వణకు. quivering కంపము. **action t., intention t., volitional t.,** when the limb is put into action అంగమును ఆచరణలో పెట్టినప్పుడు వణకు. **Parkinsonian t.,** *see/చూడండి* parkinsonism. (a) **pill rolling t.,** in parkinsonism చేతుల చలనము, *పోలిక:* మాత్రలు చేస్తున్నట్లు. (b) beedi rolling t., in parkinsonism చేతుల చలనము, *పోలిక:* బీడీలు చుడుతున్నట్లు. **rest t., resting t.** కండరములు నిలకడగా ఉన్నప్పుడుకూడా కంపము. **senile t.,** in old age వృద్ధాప్యంలో వణకు.

**trephine** a cylindrical saw used by surgeon to drill a hole into i) skull ii) cornea. i) కపాలము ii) శుక్లపటలములోనికి తొలిచే గుండ్రని తిరుగుడు చుట్లుగల రంపము – శస్త్రవైద్యుని ఆయుధము/పరికరము.

**Treponema** *T. pallidum,* causes syphilis కొరుకు సవాయి రోగము కలుగజేసే సూక్ష్మజీవి. *T. pertenue* producing yaws యాస్ అను జబ్బుకు కారణము/కారకము.

**triad** trio త్రయము. The characteristic triad of diabetes mellitus is polyuria, polyphagia, polydipsia. మధుమేహం వ్యాధిలో అభిలక్షణిక లక్షణత్రయం: అతిమూత్రం, అధిక ఆకలి, అమిత దాహం.

**trial** a trying ప్రయత్నించుట. **clinical t.,** of drugs ఔషధముల శోధన/పరిశోధనము. **t. labour,** waiting for some hours, especially in a primi, for Nature to come into action, before contemplating further intervention to deliver the child వేరుపంథా/మార్గం నిర్ణయించేముందు ప్రకృతిసిద్ధంగా జరుగు కాన్పు కొరకు ఎదురుచూస్తూ, ముఖ్యముగా తొలుచూలు/తొలిచూలు ప్రసవంలో శరీరకణజాలములకు సరియైన వ్యవధి ఇవ్వడం.

**triangle** 1. ▽ shaped insignia for family planning త్రిభుజము, త్రికోణము, కుటుంబనియంత్రణ పథకములో చిహ్నము/గుర్తు. ▽ త్రిభుజపు త్రికోణాకారంలో ఈ బొమ్మ కనబడుతుంది. 2. A new dimension to the advertisement on family planning: Nowadays husband's face at one side of the base of the inverted triangle, wife's face at the other side, with a girl's face at the angle below, are being depicted. ఇటీవల కుటుంబ నియంత్రణ ప్రకటన దృశ్యానికి నూతన మలుపు దిద్దారు: త్రికోణములోని అడ్డగీత (base) కు ఒకవైపు పరిణేత (husband) ముఖము, రెండవవైపు పరిణీత (wife) ముఖము, క్రింది కోణము దగ్గర ఒక ఆడపిల్ల ముఖము చిత్రిస్తున్నారు.

**tribadism** lesbianism: homosexuality between women స్త్రీలలో స్వలింగ సంపర్కం.

**triceps** three headed muscle మూడు శిరలుగల పేశి. **t. muscle,** three headed muscle at the back of the arm దండవెనుక త్రిశిర కండరము. [*Cf.* biceps].

**trichiasis** an abnormal inversion of the eyelashes causing irritation of the eyeball, *e.g.* in entropion కనురెప్ప మీది రోమములు లోపలివైపుకు తిరిగి, కన్నుగుడ్డు మీద రాపిడి కలిగించుట.

**trichinosis** infection by a nematode, *Trichinella spiralis* due to eating undercooked/inadequately cooked pig meat (pork); diarrhoea, fever in the early stages and muscle tenderness later ఒక గుండ్రటి పరిధిగల పురుగు కారణము. పూర్తిగా పక్వముగాని పంది మాంసము భుజించినందువలన సంక్రమించు వ్యాధి; మొదట్లో అతిసారము, జ్వరము, తరువాత కండర సుకుమారత కలుగుతుంది.

**trichobezoar** a hair-ball found in the gastro-intestinal tract; may be an after-effect of pica, see/చూడండి pica. జీర్ణాశయాంత్ర మార్గములో వెంట్రుకల తుట్టె – ఇది ఒక విద్యూరము.

**trichology** study of hair వెంట్రుకల యొక్క శాస్త్రం.

**Trichomonas** a genus of flagellate protozoa కశాభము కలిగిన ప్రొటోజోవా ప్రజాతి. *T. hominis,* intestinal parasite of man మనిషి పేగులలో పరాన్నజీవి. *T. vaginalis,* found principally in the vaginal tract and also in the male genital tract, produces persistent refractory vaginitis. Trichomoniasis is a sexually transmitted disease (STD). ఈ సూక్ష్మజీవి ప్రథమంగా యోని మార్గములోను, మరియు పురుష జనన మార్గములోనూ ఉంటుంది. ఇది లైంగిక వ్యభిచారరోగము. యోని 'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు'తో కూడి, తెల్లబట్ట, పచ్చబట్ట అవుతూ మొండికేసే బండవ్యాధి.

**trichomoniasis** infection by *Trichomonas* పైన వివరించిన జబ్బు.

**trichopathy** disease of the hair వెంట్రుకల/రోమముల తెగులు.

**trichophytid** 1. associated with trichophytosis, a fungus affection ఒక ఫంగస్‌తో కూడుకొనిన. 2. this term is usually applied to allergy in ringworm, *see/చూడండి* ringworm. తామరలో ఎలర్జి.

**Trichophyton** a genus of fungi which infests skin, hair and nails చర్మము, రోమములు మరియు నఖములను పీడించు ఫంగస్ ప్రజాతి.

**trichophytosis** infestation with *Trichophyton* ఈ ఫంగస్ వలన పీడ(నము).

**trichuriasis** infection with the whip-worm *Trichuris trichiura* ఈ పేరుగల కొరడాపురుగు సంపర్కమువలన కలుగు వ్యాధి.

**Trichuris** genus of intestinal nematode parasite *T. trichiura* (whipworm) size 4 to 5 cms పేగులలో ఉండే గుండ్రటి పరిధిగల పురుగు, పరాన్నజీవి ప్రజాతి – కొరడాపురుగు.

**tricuspid** valve between the right atrium and right ventricle of the heart, with three cusps గుండెలోని కుడి ఏట్రియమ్‌కు కుడి జఠరికకు మధ్యగల త్రిపత్ర కవాటము; మూడు మొనలు కలిగి ఉంటుంది. **t. regurgitation,** back flow of blood from the right ventricle into the right atrium due to incompetent valve సామర్థ్యము కోల్పోయిన కవాటము వలన కుడి ఏట్రియమ్ లోనికి కుడిజఠరికనుండి రక్తం

వెనుకకు గుంజుకొనబడుట. **t. stenosis,** narrowing of the valve కవాటము పరిధి చిన్నదగుట.

**trigeminal** $5^{th}$ cranial nerve 5వ కపాలనాడి, త్రిధారానాడి. **t. neuralgia,** tic douloureux, *see/చూడండి* neuralgia. త్రిధారా నాడీ వేదన.

**trigger** 1. a sudden (often violent) reflex action/reaction, *e.g.* exercise in exercise-induced asthma ఉదా. వ్యాయామంతో మొదలిడు ఉబ్బసం వ్యాధి, పోలిక: మీటనొక్కితే యంత్రం నడచినట్లు. 2. **t. zone** మీట ఉన్న ప్రాంతము. *e.g.* nose is the trigger zone for sneeze reflex ఉదా. నాసిక ప్రాంతములో మీటనొక్కితే (అనగా ప్రేరేపణ కలుగుతే/కలుగజేస్తే) తుమ్ము వస్తుంది.

**trigone** a triangular area త్రికోణాకారమైన/త్రిభుజాకారమైన స్థలం. **vesical t.,** a triangular shaped mucosa at the base of the urinary bladder మూత్రాశయము మూలమున త్రికోణాకారమైన శ్లేష్మస్తరము.

**trigonitis** inflammation of the trigone ట్రైగోన్ యొక్క శోథము/ 'నొప్పి మంట ఎరుపు వాపు'.

**triiodothyronine** one of the thyroid hormones థైరాయిడ్ హార్మోన్‌లలో ఒకటి.

**trimester** a period of three months, *e.g.* first, second, third trimester of pregnancy త్రైమాసం: అలంకార. ముచ్చటగా మూడు నెలలకాలం, ఉదా. గర్భధారణ క్రమములో నవమాసములు మొదటి, రెండవ, మూడవ త్రైమాసభాగములుగా విభజింపబడినవి.

**triplet** 1. one of the three offspring delivered at one birth/time ముగ్గురు సహజన్ములలో నొకరు; ఒకే కాన్పులో పుట్టిన ముగ్గురు శిశువులలో ఒకరు. 2. set of three things ముగ్గురు, మూడు వస్తువులు.

**triplopia** a visual defect in which three images of the same object are seen త్రిచిత్రదర్శన దోషం/త్రిబింబదర్శన దోషం: ఒక వస్తువు మూడుగా కనబడే దృష్టిదోషం. [*Cf.* diplopia].

**trismus** lock-jaw, an early signal of tetanus, *see/చూడండి* tetanus. దవడ బందు, టెటనస్ వ్యాధి తొలిసూచన.

**trocar and canula** one set of the two instruments; the trocar fits into the canula snugly. It is used to pierce a body cavity for withdrawal of fluid. దబ్బనము మరియు దానిమీది తొడుగు; ఒకదానిలో ఒకటి సమముగా ఇముడుతుంది. ఈ దబ్బనము శరీరకుహరమునుండి ద్రవము తీయుటకు వాడ్తారు.

**trochanter** two projections of bone on the upper end of femur తొడ ఎముక ఉపరిభాగమున రెండు బొడిపెలు. **greater t.** పెద్ద బొడిపె. **lesser t.** చిన్నబొడిపె.

**trochlea** a pulley-shaped structure గిలకను పోలిన నిర్మాణము. *anat.* part, nerve, *etc.* which may traverse a pulley or resemble a pulley, *e.g.* trochlear nerve, $4^{th}$ cranial nerve గిలక ఆకృతిలోనున్న భాగము, నాడి, మొ. లేదా గిలకలాంటి గుండ్రం మీద తిరుగునది, ఉదా. నాల్గవ కపాలనాడి, డమరుకాకార నాడి.

**Trombicula** 1. a genus of mites తప్పటి పురుగుల ప్రజాతి. 2. The larvae (chiggers) of one species are vectors of *Rickettsia tsutsugamushi,* the cause of scrub typhus. ఒక జాతి డింభకములు రికెట్సియా యొక్క ఆరోహకాలు.

**-trophic** or **-tropic** 1. suffix. combining form relating to nutrition పోషణకు సం. 2. stimulating ఉద్దీపనం కలుగజేయు లేదా ఉద్దీపింపజేయు. *e.g.* adrenocorticotrophic hormone (ACTH) of the pituitary which stimulates the adrenal cortex; gonadotrophic hormone of the pituitary which stimulates the gonads; thyrotrophic hormone of the pituitary which stimulates the thyroid.

**trophic** [Greek *trophe*, nutrition]. 1. pertaining to nutrition పోషణకు సం. 2. resulting from interruption of nerve supply ఆ ప్రాంతానికి నాడీ ప్రభావం లేనందున.

**trophic ulcer** 1. due to impaired nutrition of the part, ischaemic hypoxia, prolonged pressure, *e.g.* decubitus ulcer (also called bed sore) శయన వ్రణం. 2. due to disease of nerve fibres, anaesthesia, trophic disturbances, *e.g.* leprosy కుష్ఠురోగంలో వ్రణం.

**trophoblast** precursor of the placenta and the membranes జరాయువు/మావి పొరల యొక్క అగ్రగామి.

**trophozoite** adult stage ప్రౌఢదశ. *e.g.* tissue-invading amoeba (20 to 30$\mu$ in diameter), the active, motile feeding stage with pseudopodia and ingested red blood corpuscles, a stage in the life cycle of *Entamoeba histolytica* ఉదా. చురుకుగా, చలనముతోకూడి, తిండి తిను దశ – మిథ్యాపాదాలుదాల్చి ఎర్రరక్తకణములను అరగించిన ఎంటమీబా యొక్క జీవిత చక్రములో ఒక దశ [*in contr.* amoebic cyst is the resting stage; this spreads infection, of course. భిన్న. అమీబా తిత్తిదశ, ఇది క్రిమిసంపర్కాన్ని వ్యాపింపజేస్తుంది సుమా!]

**tropical** characteristic of the tropics ఉష్ణమండలములకు సం. **t. climate,** *viz.* temperature, humidity, *etc.* ఉష్ణమండల శీతోష్ణాది స్థితి అనగా ఉష్ణోగ్రత, గాలిలో తేమ, మొ. **t. diseases** ఉష్ణమండల వ్యాధులు. **t. eosinophilia,** pulmonary eosinophilosis ఇస్నోఫిలియా జబ్బు. **t. medicine** ఉష్ణమండల వ్యాధుల శాస్త్రము. **t. ulcer,** Naga sore: gangrenous sloughing ulceration of skin and subcutaneous structures నాగా వ్రణం: చర్మం మరియు దానిక్రింద నిర్మాణములను పుండుచేసి కుళ్లగొట్టే వ్రణం.

**truncus** 1. the body (trunk or torso) without the head and extremities మొండెం. 2. a primary nerve or vessel before its division నాడి లేదా నాళం యొక్క మొదలు. **t. arteriosus communis,** common arterial trunk in the fetus, later divides into aorta and pulmonary artery భ్రూణములో ఒక మూలనాళముగా ఉద్భవించి, తరువాత మహాధమని మరియు పుపుస ధమనిగా విభజన చెందేది.

**trunk** 1. trunk of the body: to which are attached head and limbs, *resemblance:* trunk of a tree, the woody stem తల, అంగములు అమర్చబడిన మొండెము, మధ్యకాయము, పోలిక: శరీరానికి మూలము, దూలమువంటిది; వృక్షమూలము, చెట్టుబోదె. 2. nerve trunk: **sympathetic t.** *see/చూడండి* nervous system. సహానుభూత/స్వతంత్ర నాడీకాండము. 3. blood trunk: **celiac t.,** arterial trunk arising from the abdominal aorta బృహద్ధమనియొక్క

ఉదరభాగమునుండి శాఖగావచ్చు రక్తకాండము. 4. lymphatic trunk: thoracic duct శోషరసకాండము: వక్షీయవాహిని.

**truss** 1. a bandage/support over a hernial bulge హెర్నియా ఉబ్బు మీద ఒత్తిడి కలిగించు బాండేజ్/సాధనము/ఆధారము. 2. tight support over scrotum/hydrocele వృషణాలతిత్తిని/బుడ్డ (వరిబీజం, వాడు.భా. పురుషాలవాపు)ను బిగించి కట్టే లంగోటి/మొల బంధనము/కౌపీనము.

**trypanosomiasis** *syn.* sleeping sickness, caused by microorganism, *T. gambiense* or *T. rhodesiense,* transmitted by the bite of tse tse flies నిద్రనిషా: ఈ సూక్ష్మజీవివలన, ట్సేట్సే ఈగలు కుట్టినందువలన ఈ జబ్బు వ్యాపకమవుతుంది.

**trypsin** an enzyme. Its precursor is trypsinogen secreted by the pancreas. క్లోమము తయారుచేయు అగ్రగామి నుండి ఎన్‌జైమ్ (జీవ ఉత్ప్రేరకము).

**tryptophan** or **tryptophane** an essential amino acid found in proteins ప్రొటీన్లలో గల ముఖ్యమైన ఎమైనో అమ్లము.

**tube** 1. **t. structure,** oesophagus, trachea నాళనిర్మాణము: అన్నవాహిక, వాయునాళము. 2. **auditory t.,** Eustachian tube, from the nasopharynx to the middle ear నాసికాగ్రసని నుండి మధ్యచెవికి శ్రోతఃపథము, కంఠకర్ణనాళము లేదా కర్ణకంఠనాళము. **drainage t.,** for drainage of secretions స్రావములు బయటికి పోవు ఏర్పాటు. **endotracheal t.,** to keep airway patent వాయుపథమునకు ఆటంకము లేకుండా ట్యూబ్. **Fallopian t.,** uterine t., the path from the ovary to the uterus అండవాహిక: అండాశయము నుండి గర్భాశయమునకు దారి. **flatus t.** to expel gases in the stomach/intestines అన్నాశయము/పేగులలోని వాయువులను వెళ్ళగొట్టే నాళం. **Ryle's t.,** into the nose and stomach ముక్కుద్వారా అన్నాశయములోనికి నాళము. **test t.** టెస్టుట్యూబ్. **X-ray t.,** instrument for the production of X-rays ఎక్స్‌రే ఉత్పన్నము చేసే పరికరము.

**tubectomy** excision of a portion of the uterine tubes, a popular operation in family planning అండాశయమునుండి గర్భాశయమునకు పోవు నాళములను ఛేదించుట, వాడు.భా. చిన్న ఆపరేషన్: పిల్లలు పుట్టకుండా నివారణోపాయము. [*q.v.* vasectomy].

**tuber** swelling ఉబ్బు. protuberance ఉబుకు.

**tubercle** A. any small rounded mass గుళిక, యక్ష్మిక. 1. **in tuberculosis:** pre-eminently/typically relates to small rounded tissue masses produced by infection with *Mycobacterium tuberculosis* ప్రధానముగా క్షయబాసిల్లై సంపర్కముచే కలుగు చిన్న గుండ్రటి కణజాల ముద్దలు (-osis = morbid state, disease). Tuberculosis derives this name from the presence of tubercles. టి.బి. అనే వ్యాధికి ట్యూబర్‌కిల్‌యుతం లేదా యక్ష్మికయుతం అనడం సమంజసము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. a few millimetres in diameter కొద్ది మిల్లీమీటర్ల పరిమాణములో ఉండేవి: **t's. in fibrocaseous TB** క్షయకుళ్ళు తంతుమయ వ్యాధిలో యక్ష్మికలు. **t's. in miliary TB** 1 to 2 mm millet seed sized nodules disseminated all over the spleen, liver, lungs, bone-marrow, *etc.* 1–2 మిల్లీమీటర్ల సైజులో సజ్జలవలె ప్లీహము, కాలేయము, ఊపిరితిత్తులు, అస్థిమజ్జ, మొ. అవయవములలో విస్తరింపబడియుండే క్షయ యక్ష్మికలు. **t's. of the choroid** occur in tuberculous meningitis మెదడు మీది పొరకు సోకిన క్షయలో నేత్రరక్తపటలములో ఈ సజ్జలవలెనుండు యక్ష్మికలు. *micro.str.* సూక్ష్మ.చూ. In **tuberculosis** the characteristic tubercle consists of epithelioid cells, Langhan's giant cells, lymphocytes and a vascular granulation tissue surrounding an area of necrosis. ఊతక క్షయము/కణక్షయము అయిన కేంద్రము చుట్టూతా ఎపిథీలియాయిడ్ కణములు, లాంఘాన్స్ బృహత్కణములు, లసికాకణములు మరియు రక్తనాళికాయుత కణికామయ లేత (నూనూగు) కణజాలములు గల విశేషగుణ యక్ష్మిక. 2. *colloq.* tubercle (bacilli) for *Mycobacterium tuberculosis* వాడు.భా. మైకోబాక్టీరియమ్ ట్యూబర్క్యులోసిస్ అనే క్షయ బాసిల్లైకి గూడా ఈ పదం వాడ్తారు. 3. In **schistosomiasis** (bilharziasis) bilharzial tubercle, due to impaction of ova in pulmonary arterioles; the reaction consists of eosinophils, epithelioid cells, giant cells, lymphocytes. ఈ పురుగు గుడ్లు పుపుస ధమనికల్లో అడ్డు కొనిపోతాయి; ప్రతిక్రియగా ఇసనోఫిల్‌లు, ఎపిథీలియాయిడ్ కణములు, బృహత్కణములు, లసికాకణములు చేరిన గుళిక. 4. a nodule or a small eminence on a bone for the attachment of a tendon ఎముకమీద

స్నాయువు చేరుచోట కంతిలాంటి ఉన్నత ప్రదేశము. **mental t.**, on either side of the mental protuberance of the mandible హనువులోని ఉబుకు ప్రక్కన గుళిక. **pubic t. of pubic bone** జఘనాస్థి గుళిక. B. Tubercle, a medical journal వైద్యవార్తాపత్రిక.

**tuberculide** or **tuberculid** a small lump చిన్నగడ్డ/ముద్ద. **papulonecrotic t.**, successive crops of papules, hyperergic reaction to mycobacteria, self-healing రంగుమారిన మచ్చలు ఉండుండి అగపడటం. మైకోబాక్టీరియాకు ప్రతిఘాతము; వాటంతట అవే తగ్గిపోతాయి. [*q.v.* syphilide].

**tuberculin** sterile liquid extracted from the tubercle bacilli, *resemblance:* decoction of the bacilli క్షయక్రిముల సారము, *పోలిక:* బాసిల్లై కషాయము. purified protein derivative (PPD) used in tuberculin tests, *see/చూడండి* Mantoux test.

**tuberculoid** resembling tubercle గుళిక/యక్ష్మకను పోలిన. **t. leprosy**, *see/చూడండి* leprosy.

**tuberculoma** *-oma* = tumour or tumor; a tumour-like mass due to growth of a tuberculous lesion క్షయవ్యాధి క్షతము యొక్క ఎదుగుదలలో కంతివలెనుండు ముద్ద.

**tuberculosis** *abbr.* TB - *osis* = condition; 1. a disease due to infection with the species of Mycobacterium; pre-eminently and by tradition, refers to infection with *Mycobacterium tuberculosis* – the human type (*N.B.* similarly diabetes refers to diabetes mellitus, asthma refers to bronchial asthma) క్షయవ్యాధి, రాజయక్ష్మ: క్షయవ్యాధి ఈ జాతి మైకోబాక్టీరియా సంపర్కమువలన సంభవిస్తుంది. ప్రధానముగా, సంప్రదాయము/ఆనవాయితీ ననుసరించి మనుష్యమైకోబాక్టీరియమ్ సంపర్కమునకే క్షయవ్యాధి అని అంటుంటారు. Since lung is largely infected (air is common to all people)/involved/affected, *colloq.* tuberculosis refers to pulmonary tuberculosis. *వాడు.భా.* ఎక్కువమందిలో ఊపిరితిత్తి ఈ జబ్బుకు గురి అవుతుంది కాబట్టి క్షయ అంటే ఊపిరితిత్తి క్షయ. symptoms: cough (sometimes blood in the sputum), loss of appetite, loss of weight, fever, chest pain

లక్షణములు: దగ్గు (కఫములో రక్తము), ఆకలిలేమి, బరువు తగ్గడం, జ్వరము, ఛాతీనొప్పి. 2. pulmonary TB and diabetes mellitus – a notorious combination, *resemblance:* adding fuel/ghee to fire ఊపిరితిత్తుల క్షయ మరియు మధుమేహం – దుష్కీర్తి గడించిన వ్యాధిమేళనము, *పోలిక:* అగ్గిలో ఆజ్యం/నెయ్యి వేస్తే భగ్గుమన్నట్లు. 3. a dangerous liaison – coinfection TB and HIV, emerging nowadays as an additional health risk/hazard టి.బి.కి హెచ్.ఐ.వి.కి గండంతో కూడిన సంబంధము ప్రమాదస్థాయికి ఎదుగుతున్నది. ప్రజారోగ్యానికి ఈ రెండింటి పొత్తు మరింత ముప్పు. 4. TB can affect any part of the body. శరీరంలో ఏ భాగమైనా టి.బి.కి గురికావచ్చును.

**tuberculum** *anat.* small eminence on a bone ఎముకమీద కొంచెము ఎత్తైన స్థలము.

**tuberosity** protuberance బుడిపి, బొడిపె.

**tuboovarian** concerning the uterine tube and ovary ఫాలోపియన్ నాళము మరియు అండాశయమునకు సం. **t. abscess** అక్కడ చీముగడ్డ. **t. mass** అక్కడ ఒక జబ్బు ముద్ద.

**tubule** tube, microscopic in size సూక్ష్మకుల్యక. *micro.str.* సూక్ష్మ.చూ. **collecting t.,** terminal channels of the nephron నాళికలు, నెఫ్రాన్‌లో కుల్యకలు/అంతిమ కాలువలు. **dental t.,** minute canals in the dentin of the tooth, 3 to 4$\mu$ in diameter పన్నులోని డెన్‌టిన్‌లోని కుల్యకలు/సూక్ష్మకాలువలు. **Henle's t.,** *see/చూడండి* loop. **renal t.,** proximal convoluted t., distal convoluted t., in the structure of the nephron, *see/చూడండి* nephron. **seminiferous t's,** *see/చూడండి* seminiferous tubules.

**tularaemia** or **tularemia** caused by the bacillus *Pasteurella tularensis,* resembling plague ప్లేగును పోలిన వ్యాధి.

**tumefaction** tumescence, swelling ఉబ్బు.

**tumid** swollen ఉబ్బిన.

**tumoricidal** oncolytic, *e.g.* exposure to deep X-rays కంతి విచ్ఛిన్న విధానము, ఉదా. తీక్షణ ఎక్స్‌రేలకు గురిచేయు ప్రక్రియ. **t. dose,** amount required to kill tumour cells పై ప్రక్రియలో మోతాదు.

**tumour** or **tumor** 1. swelling, one of the cardinal signs of inflammation శోథము/'నొప్పి వేడి మంట వాపు'లో ముఖ్యమైన గుర్తు వాపు. 2. neoplasm కంతి. new growth in which cells multiply and the lesion grows ఈ క్షతములో కణములు సంఖ్యలో వృద్ధిచెంది తదుపరి కంతిగా రూపొందుట. **benign t.**, does not invade and metastasize into other tissues నిరపాయ కంతి; తతిమ్మా కణజాలములలోనికి దాడి సలుపదు, మొలకెత్తదు. **germ cell t.** బీజకణాలనుండి ఉత్పత్తియగు కంతి. **giant cell t.**, a bone tumour, benign or malignant బృహత్కణముల కంతి. ఎముకనుంచి కంతి, నిరపాయ లేదా అపాయకరమైన గుణముకలది. **glioma**, *see*/చూడండి glioma. **malignant t.**, invades and metastasizes into other tissues అపాయకరమైన మారణకంతి, తతిమ్మా కణజాలములలోనికి దాడి సలిపి, అక్కడ పిల్లకంతులను మొలకెత్తించును. **teratoid t.**, *see*/చూడండి teratoma. **Wilms' t.**, malignant mixed tumour of the kidney seen in children below fifth year అయిదేళ్లలోపు వయస్సు పిల్లలలో కిడ్నీలో దాపురించు అపాయకరమైన కంతి.

**tunica** a coat or tunic కంచుకము. in *anat.* general term for a covering/coat for a part ఒక భాగమునకు పొర. **t. adventitia, t. externa**, the outer coat of the wall of tubed structures బాహ్యకంచుకము, నాళిక/వాహికయొక్క కుడ్యములోని వెలుపలి పొర. **t. albuginea,** a covering of dense, white collagenous fibres surrounding a structure ఒక నిర్మాణమును ఆవరించియుండే దళసరి, తెల్లని తంతుయుత కంచుకము. **t. intima vasorum,** the innermost coat of the wall of blood vessels అంతరకంచుకము, రక్తనాళికలయొక్క కుడ్యములోని లోపలి పొర. **t. media vasorum,** the middle coat of the wall of blood vessels మధ్యకంచుకము, రక్తనాళికలయొక్క కుడ్యములోని మధ్యపొర.

**tunica vaginalis testis** the serous sheath of the testis and epididymis derived from the peritoneum. It consists of two layers, outer and inner. In hydrocele, fluid accumulates between these two layers. వృషణ తొడుగు కంచుకము: సీరస్ తొడుగు. అంత్రవేష్టనం యొక్క పొడిగింపు. ఇందులో రెండు పొరలుంటాయి,

వెలుపలిది, లోపలిది. వరి బీజంలో ఈ రెంటిమధ్య ద్రవంచేరుతుంది. [*distinguish* from vagina, female sex organ].

**tunnel** passage సొరంగము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **carpal t.,** passageway for the median nerve at the wrist underneath the flexor retinaculum, a fibrous band మణికట్టుదగ్గర తంతుయుత పట్టిక క్రింద మీడియన్ నాడి సొరంగము. **tarsal t.,** passage for vessels, nerves and tendons at the ankle under the flexor retinaculum, a fibrous band చీలమండ దగ్గర తంతుయుత పట్టిక క్రింద రక్తనాళములు, నాడులు మరియు స్నాయువులు పోయే సొరంగము. *micro.str.* సూక్ష్మ.చూ. **Corti's t.,** in the inner ear లోపలి చెవిలో సూక్ష్మభాగము.

**turbinate** shaped like a top బొంగరం ఆకారంగల. 1. turbinate bone. *resemblance:* a top ఈ ఎముక *పోలిక:* బొంగరం. three on either side forming the lateral (outer) nasal wall నాసిక వెలుపలివైపు గోడలో మూడు ఎముకలు. 2. concha nasalis శంఖాకారమైన నాసిక, శంఖాకృతిగల నాసిక.

**turbinectomy** surgical excision of a turbinate bone ఈ ఎముకను శస్త్ర చికిత్స ద్వారా తొలగించుట.

**turgescence** [turgid *adj.*] 1. said of a tissue, swollen, hard and distended due to accumulation of fluid కణజాలంలో ద్రవం కూడినందువలన/చేరినందువలన ఉబ్బి, గట్టిపడి పెద్దదిగా అగుట. 2. said of a plant cell: distended with fluid వృక్షకణము: ద్రవంతో ఉబ్బిన.

**turgid** congested and swollen రక్తము అధికముగా కూడి, ఉబ్బిన. *e.g.* **t. mucous membrane** in cold/coryza *ఉదా.* జలుబు/పడిశంలో ఇట్టి శ్లేష్మపొర.

**turmeric** *bot.* a rhizome అడ్డముగా పెరిగే వేరు, పసుపుకొమ్ము; పసుపు, హరిద్ర, హరిద్రాభము. It has healing properties. గాయములను నయము చేసేది, స్వస్థత చేకూర్చుగుణముగలది. It is a vermicide, vermifuge, anti-infective balm; disinfectant, antiseptic, anticarcinogenic agent. కీటకనాశని, కడుపులోని పురుగులు పోవుటకు మందు, సూక్ష్మజీవి సంపర్క_దోషనివారిణి; సంక్రమణహారి,

పూతిరోధి, కేన్సరు నివారణకారి. అలంకార. చిటికెడంత పసుపు చారు/కూరలకు రుచి (ఆరోగ్యకరము), పట్టెడంతపసుపు పేరంటానికి పంపిణి, పాదాలకు పదిలము/అందము (శుభప్రదము). *N.B.* A mixture of turmeric and lime is a double-edged disinfectant. *గమనిక:* పసుపు సున్నం కలిపిన పారాణి మరింత క్రిమిహారి, అంతేకాదు – పాదాలకు అందం. కనుకనే శుభసంజీవిని అందాము.

**tussive** pertaining to cough దగ్గుకు సం. **t. syncope,** brief spell of unconciousness after a bout of cough దగ్గుతెర తర్వాత ఒడలు/ఒళ్ళు తెలిపోయి, స్వల్పకాలం (కొద్ది క్షణములపాటు) స్పృహతప్పటు.

**twins** two offspring delivered during one pregnancy కవలలు. **conjoined t's,** two monozygotic twins joined together, *e.g.* Siamese t's రెండు శరీరములు అతికి ఉన్న జీవులు. **dizygotic t's,** fraternal t's, twins developed from two separate ova fertilized at the same time రెండు అండాలనుంచి విడివిడిగా ఒకే సమయములో ఫలదీకరణము చెందిన పిండములు. **monozygotic t's,** identical t's, similar t's, uniovular t's, twins developed from one fertilized ovum, *i.e.* of the same sex ఒకే అండమునుండి ఫలదీకరణము చెందిన పిండములు, అనగా ఒకే లింగము గల కవలలు, ఉదా. కుశలవ(లు).

**twitch** sudden contractile response in a skeletal muscle తటాలున లాగుట/కండరములో సంకోచ అదరు.

**tylosis** 1. the formation of a callosity (tyloma) ఆనె రూపొందుట. 2. keratosis చర్మము దళసరిగా యగుట.

**tympanectomy** excision of the tympanic membrane in the ear కర్ణభేరిని తొలగించుట.

**tympanic** *tympanon* = drum. 1. relating to the ear drum, tympanum. **t. membrane** చెవిగూబ, కర్ణభేరి, *అలంకార.* చెంప ఛెళ్ళు అంటే గూబ గుయ్యిమని ఒళ్ళు ఝుళ్ళుమంటుంది. 2. pertaining to the tympanic cavity, middle ear కర్ణభేరి కుహరమునకు సం. 3. tympanic, tympanitic or drum-like percussion note, *e.g.* over pneumothorax ఉదా. ఫుప్ఫుసావరణ కుహరములో గాలిచేరితే ఆ జబ్బు పరీక్షలో, ఛాతీమీద వేళ్ళు పెట్టి కొట్టినప్పుడు భేరీమ్రోత వినబడుతుంది/వేళ్ళకి స్పర్శ తగులుతుంది.

**tympanites** *tympanon* = drum. tympanism, abdominal distention due to gas or air in the intestine or peritoneal cavity పేగులలోగాని ఆంత్రవేష్టన కుహరములోగాని వాయువు/గాలి చేరి పొట్ట బిర్రుగా అగుట.

**tympanum** *tympanon* = drum. 1. (loosely) the tympanic membrane (పరాకుగా) శ్రుతిమీట, కర్ణభేరి. 2. middle ear (tympanic cavity) మధ్యచెవి (శ్రుతికుహరము).

**typhlitis** caecitis, inflammation of the caecum అంధనాళం యొక్క శోథం/'నొప్పి వేడి మంట ఎరుపు వాపు'.

**typhlon** caecum అంధనాళం.

**typhlosis** blindness అంధత్వం. నానుడి: సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్.

**typhoid fever** *see/చూడండి* enteric. సన్నిపాత జ్వరము.

**typhus** arthropod-borne rickettsial disease అర్థ్రోపాడ్ (పురుగుల/కీటకముల) ద్వారా సంభవించు వ్యాధి. **epidemic t.**, due to *Rickettsia prowazekii*. **scrub t.**, *Rickettsia tsutsugamushi* fever.

# U u

**ulcer** a sore discharging fluid/pus వ్రణము, పుండు, ద్రవము/చీము కార్చు కురుపు. **chronic u.** దీర్ఘకాలపు వ్రణము. **decubitus u.,** bed sore శయన వ్రణము: ఒత్తడి/ఒత్తిడి, ఒత్తుడు/రాపిడి వలన కలిగిన వ్రణము. **duodenal u.** అంత్రమూలములో వ్రణము. **gastric u.** అన్నాశయములో వ్రణము. **indolent u.** ఎన్నాళ్ళకూ నయముకాని మొండి పుండు. **malignant u.** అపాయకరమైన వ్రణము. **neurotrophic u.,** occurring in leprosy కుష్ఠరోగములో పాదాలలో/చేతులలో ఎక్కువగా సంభవించే వ్రణము. **peptic u.,** in the region of oesophagus, stomach or duodenum అన్నవాహిక, అన్నాశయము లేదా అంత్రమూలములో వ్రణము. **rodent u.,** ulcer eating away the skin, like the gnawing of a rodent చర్వకము కొఱికి తిన్నట్లు చర్మం మొరికె. **trophic u.,** *see/చూడండి* trophic. **varicose u.,** with tortuous, dilated veins, more on the legs, also in the oesophagus తరచుగా కాళ్ళమీద ఉబ్బి, వంకరలు తిరిగిన సిరలయొక్క వ్రణము; అన్నవాహికలోగూడ చూడనగును.

**ulceration** formation of an ulcer వ్రణము తేలుట, వ్రణోత్పత్తి.

**ulcerative colitis** chronic ulceration of colon, of unknown aetiology/cause కారణము తెలియని, దీర్ఘకాలపు, పెద్దపేగుయొక్క వ్రణములు.

**ulna** the inner bone of the forearm కూర్పరాస్థి, అరత్ని, అంతఃప్రకోష్ఠాస్థి, అంతఃప్రకోష్ఠిక, మోచేయి లోపలి ఎముక. *figur.* called the 'funny bone' – so-named because rolling pressure on the ulnar nerve tingles/thrills the inside of the forearm and inner fingers.

**ulnar** medial (inner) aspect of elbow and forearm మోచేయిలోపలి (అనగా బొడ్డువైపు) భాగము. **u. nerve,** felt as a cord under the medial condyle of the humerus (arm bone) అరత్నినాడి: భుజాస్థి అడుగున దాని లోపలికందము క్రింద తాడువలె తగులు నాడి.

**ultrasonography** ultrasound, the imaging of deep structures / organs in the body with the help of ultrasonic waves సున్నితమైన,

అతిధ్వని అలలు శరీరనిర్మాణములు/అవయవములను తాకి, వాటియొక్క ప్రతిధ్వని ఫోటోగ్రఫీ లేదా ఛాయాచిత్రముద్వారా నమోదుచేయుట.

**ultraviolet** అతి నీలలోహిత, అల్ట్రావయలెట్. **u. waves,** short wave electromagnetic waves/radiation అతినీలలోహిత కిరణములు. ఇవి అల్పతరంగ దైర్ఘ్యముగల విద్యుదయస్కాంత తరంగములు. సప్తవర్ణ కిరణ వెలుగు (vibgyor) లో ఊదారంగు (violet) కంటె తక్కువ తరంగదైర్ఘ్యముగల విద్యుత్ అయస్కాంత కిరణవిసర్జనము. u.A (UVA) causes photosensitivity reactions; used in the treatment of some skin disorders సూర్యరశ్మికి చర్మము కందిపోవుట; కొన్ని చర్మ వ్యాధులకు చికిత్స. u.B (UVB) causes sunburn; used in the treatment of some skin diseases సూర్యరశ్మి సోకిన ప్రాంతంలో కాలుపు, ఉదా. మోచేయి/చేయి, కాలు, కాలిపోవడం; కొన్ని చర్మరుగ్మతల్లో చికిత్స. u.C (UVC) germicidal/bactericidal, useful for ultraviolet air disinfection; recommended in rooms where TB patients are examined క్రిమినాశకము/బాక్టీరియా నాశకము, గాలిలో క్రిమి/బాసిల్లై కలుషితమును అరికట్టునది; క్షయరోగులను పరీక్షచేసే గదుల్లో వాడదగినది. [*q.v.* infrared].

**umbilical** pertaining to umbilicus నాభికి సం., బొడ్డు సం. **u. cord** (maternal bond మాతృబంధం) నాభినాళం, నాభి/బొడ్డుత్రాడు. **u. hernia** నాభివద్ద హెర్నియా.

**umbilication** a depression resembling the umbilicus, *e.g.* **u. in a vesicle** నాభీకరణము: నాభిని పోలిన లోతు, ఉదా. పొక్కుమీద ఈ పరిణామము.

**umbilicus** *syn.* navel. నాభి, బ్రహ్మనాడి/ముడి. 1. the site of attachment of the umbilical cord to the foetus, remembrance of the mother's blood relationship భ్రూణమునకు ఊత – బొడ్డుత్రాడు, తల్లి రక్తము పంచుకొన్న అనుభూతి. 2. In adults, an erotic symbol in women స్త్రీలలో శృంగార శోభ. *figur.* umbilicus exposed as a sex dot by the damsel *అలంకార.* బోటి కటిబొట్టు.

**uncinate process** an elephant-goad shaped process అంకుశ కీలితము. i) of a vertebra కశేరుకము/వెన్నుపూసయొక్క. ii) of

the lacrimal bone అశ్రుఅస్థియొక్క. iii) of the pancreas క్లోమము యొక్క.

**unconsciousness** lack of consciousness స్పృహలేని స్థితి.

**undulant fever** wave-like, prolonged fever, arthritis, splenomegaly, *see/చూడండి* brucellosis. తరంగముల/అలలవలె పట్టు విడుపుతో కూడిన, దీర్ఘకాలపు జ్వరము, కీళ్ళవాతం, ప్లీహము పెరుగుట.

**ungual** pertaining to the nails గోళ్ళ/నఖములకు సం.

**unguentum** ointment మలాము/ములాము.

**unguis** nail of finger or toe చేతివేలు లేదా పాదంవేలు (వాడు.భా. కాలివేలు) యొక్క గోరు/నఖము.

**ungula** an instrument for the extraction of dead fetus from the uterus మృత భ్రూణమును గర్భకోశంనుండి లాగుటకు పనిముట్టు.

**unicellular** single cell ఏకకణ. **u. organism,** comprises a single cell ఏకకణజీవి. 1. bacterium బాక్టీరియమ్. 2. protozoan, *e.g.* amoeba ప్రోటోజోవాన్, ఉదా. అమీబా.

**unilateral** affecting one side/half of the body ఏకపక్ష

**union** 1. joining of the two ends of fracture in a bone by growth of new bone (called callus formation) ఎముక విరిగినచోట కాలస్ అనగా ఎముక అతుకు తయారగుట. 2. healing by first intention, of the sides of a surgical incision, *figur.* The incision scar is the surgeon's signature. సర్జన్ కత్తిగాటు నాజూకుగా నయమగుట, అలంకార. అది వారి చేవ్రాలు.

**uniovular** formed from a single ovum ఏకాండ, ఒకే అండం నుండి తయారైనది [*in contr.* binovular].

**unipara** a woman who has borne one child only ఏకగర్భ: ఒకే శిశువును కన్న తల్లి.

**unit** 1. a standard quantity; SI units ప్రమాణము, మానము. **functional anatomy** 2. the nephron: each individual renal tubule and its glomerulus is a unit, *see/చూడండి* nephron. నెఫ్రాన్: వృక్కనాళిక మరియు దాని రక్తనాళికా గుచ్ఛము. 3. terminal respiratory unit: respiratory bronchiole, alveolar ducts and sacs,

and alveoli శ్వాసవృక్షము యొక్క అంతిమ ప్రమాణము: చిన్న శ్వాసనాళిక, వాయుకోశనాళికలు మరియు వాయుకోశగోణులు, మరియు వాయుకోశాలు. **hospital unit** 4. coronary care unit, for patients with severe heart disease ముమ్మరమైన గుండె జబ్బులకు ప్రత్యేకశ్రద్ధ. 5. intensive care unit (ICU) for seriously/dangerously ill patients అపాయముగానున్న రోగుల ప్రత్యేక పర్యవేక్షణము.

**universal blood donor** a person with O group, Rh negative blood. This blood may be used for transfusion to anyone. సర్వజనీన రక్తదాత: O గ్రూపు, Rh నెగెటివ్ రక్తం ఎవరికైనా ఎక్కించవచ్చు.

**universal blood recipient** a person with AB group. He can receive any group of blood by way of transfusion. సర్వజనీన రక్తగ్రహీత: AB గ్రూపు కలవారు ఏదైనా గ్రూపు రక్తమును స్వీకరించవచ్చును.

**urachus** the structure connecting the bladder with umbilicus in a fetus భ్రూణంలో మూత్రాశయమును నాభిని కలిపే నిర్మాణం.

**uraemia** or **uremia** *-emia* = present in blood. literally means retention of urine in the blood, *i.e.* due to failure of excretion of waste products of metabolism శబ్దార్థప్రకారము రక్తములో మూత్రము జమ అగుట, అనగా జీవ(న)క్రియ యొక్క వ్యర్థపదార్థములు విసర్జింప బడకపోవుట. 1. azotaemia, accumulation of nitrogenous end products of protein and amino acid metabolism in the blood రక్తగత మూత్రదోషము, ప్రోటీన్ మరియు ఎమైనో అమ్లముయొక్క జీవ(న)క్రియ అంతిమ ఉత్పన్న పదార్థములు రక్తములో కూడబెట్టబడుట. 2. in chronic renal failure దీర్ఘకాలముగా కిడ్నీ సోలిపోయి ఉండుట. 3. extrarenal uremia in haemorrhage, severe dehydration, shock రక్తస్రావము, తీవ్ర నిర్జలీకరణము, అఘాతము – వీటిలో యురీమియా.

**urate** any salt of uric acid యూరిక్ అమ్లలవణం. In gout, urates are deposited as sodium urate in joints గౌట్ అనే వ్యాధిలో ఇవి కీళ్ళలో పేరుకుంటాయి.

**uraturia** presence of excess of urates in the urine మూత్రంలో యూరేట్స్/ యూరేట్లు జాస్తిగా ఉండుట.

**urban clinic** నగరక్లినిక్ [*Cf.* rural తారత. గ్రామీణ].

**urea** 1. the end product of protein metabolism formed in the liver, found in urine and blood యూరియా: మూత్రిక, ప్రోటీన్ జీవ(వ)క్రియ యొక్క అంతిమ ఉత్పాదితము/పదార్థము; కాలేయములో తయారై, మూత్రము మరియు రక్తములో ఉంటుంది. 2. pharmaceutical product to reduce intracranial pressure కపాలములోని ఒత్తిడిని తగ్గించే ఔషధము. 3. popular fertilizer ప్రసిద్ధికెక్కిన/జనసమ్మతమైన రసాయనిక ఎరువు. **u. frost** on the face in uremia, *resemblance:* frost in the refrigerator *పోలిక:* ఫ్రిజ్‌లో పేరుకొన్న మంచువలె ముఖముమీద యూరియా తరకలు, యురీమియా అను వ్యాధిలో గమనిస్తాము/చూడనగును.

**uremia** *see/చూడండి* uraemia.

**uresis** urination మూత్రవిసర్జన, అలంకార. కాలుమడి, కాలుమడిచి కూర్చుని ఒంటేలు పోసుకుంటారు కాబట్టి – మునుపటి రోజుల్లో. ఇప్పుడు నిల్చునే ఉచ్చ పోస్తున్నారు.

**ureter** tube through which urine passes from the pelvis of the kidney to bladder మూత్రనాళము, మూత్రవాహిని: మూత్రము వృక్క ద్రోణినుండి ఈ నాళముగుండా మూత్రాశయములోనికి ప్రవహిస్తుంది.

**ureterectomy** exsection/excision of a segment or all of the ureter మూత్రనాళంలోని కొంతభాగంగాని లేదా అంతాగాని తీసివేయుట.

**ureteroplasty** plastic repair of the ureter మూత్రనాళమును రూపకల్పన చేయు యుక్తి/శస్త్రవిన్యాసము.

**urethra** 1. passage for the exit of urine from the urinary bladder మూత్రమార్గము: మూత్రాశయమునుండి మూత్రం విసర్జించడానికి త్రోవ. 2. ejaculation of semen through this ప్రసేకము: శుక్రస్ఖలనము దీనిద్వారా అవుతుంది. **rupture of u.**, *see/చూడండి* extravasation.

**urethritis** inflammation of the urethra మూత్రమార్గం యొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు'. **gonococcal u.**,

specific u. గనేరియారోగంలో పై శోథము. **nongonococcal u.,** nonspecific u. గనేరియాకాని వ్యాధి.

**urethrobulbar** relating to the urethra and the bulb of the penis మూత్రమార్గము మరియు మేహన లశునమునకు సం.

**urethrography** introducing a radioopaque dye into the urethra through a catheter and taking X-ray కిరణాభేద్యమైన రంజకమును రబ్బరుగొట్టముద్వారా మూత్రమార్గంలోనికి ప్రవేశపెట్టి ఎక్స్‌రే తీయుట.

**urethroperineoscrotal** concerning the urethra, perineum and scrotum మూత్రమార్గము, మూలాధారము మరియు వృషణముల సంచికి సం.

**urethrostenosis** stricture, constriction of the urethra అకుంచనము: మూత్రమార్గముయొక్క కుంచనము. a complication of gonorrhoea గనేరియాయొక్క పర్యవసానము.

**uric acid** end product of purine metabolism యూరిక్ అమ్లము: ప్యూరీన్ జీవ(న)క్రియ యొక్క అంతిమ ఉత్పాదితము/పదార్థము. gout, disease wherein this is deposited as sodium biurate crystals in the joints and kidneys, *see/చూడండి* gout. గౌట్ అను జబ్బులో కీళ్ళలోను కిడ్నీలలోను ఈ లవణము స్ఫటికములవలె ఘనీభవించును.

**uricacidaemia** or **uricacidemia** uricaemia, hyperuricaemia, increased level of uric acid in blood రక్తంలో యూరిక్ అమ్లము హెచ్చుగా ఉండుట.

**uricosuria** excretion of uric acid in the urine మూత్రంలో యూరిక్ అమ్లము విసర్జింపబడుట.

**uridrosis** excretion of urea or uric acid in the sweat స్వేదం/చెమటలో యూరియా లేదా యూరిక్ అమ్లం విసర్జింపబడుట.

**urinal** a place for discharging wastes (*e.g.* urine) from the body మూత్రశాల. **in conscious patients** (a) receptacle for collection of urine మూత్రపాత్ర. bottle shaped vessel with a wide mouth for men పురుషులకు వెడల్పాటి మూతి ఉండి, సీసా అకారములో ఉంటుంది. (b) bed pan for women స్త్రీలకు బెడ్‌పాన్. **in unconscious patients** (i) 'Nirodh' condom worn on the penis –

it is perforated at the tip and connected to a plastic bag hung by the side of the bed 'నిరోధ్' తొడుగు పురుషాంగము మీద తొడిగి, అంచున చిల్లిపొడిచి మంచానికి కట్టిన ప్లాస్టిక్ సంచిలోనికి మూత్రం కార్చుట. (ii) catheter into the bladder in women స్త్రీలలో మూత్రాశయములోనికి రబ్బరు గొట్టము వేయుట.

**urinalysis** urine analysis. analysis of urine మూత్ర విశ్లేషణము. examination of urine, *e.g.* albumin, sugar, *etc.* మూత్రపరీక్ష: అల్బుమిన్, చక్కెర, మొ.

**urinary calculi** stones in the urinary tract మూత్రపథంలో శిలలు/రాళ్ళు. Pain occurs while they are being passed. ఇవి విసర్జింప బడేటప్పుడు నొప్పిని మూత్రకృచ్ఛ్రరోగము అంటారు.

**urinate** to void urine మూత్రముపోయు, అల్పాచమానము, వాడు.భా. ఒంటేలు. 1. నెంబర్‌వన్ (భిన్న. నెంబర్ టు అనగా దొడ్డికి/విరేచనానికి). 2. 'పాస్'కు వెళ్ళిరావడం (చిటికిన వేలు చూపుతూ అంటారు). 3. కాలుమడి (కాలు ముడుచుకొని కూర్చొని మూత్ర విసర్జన చేస్తారు కాబట్టి).

**urination** micturition, passage of urine మూత్రవిసర్జనము.

**urine** end product of excretion; sterile fluid in health, excreted by the kidneys and discharged per urethra మూత్రము, ఉచ్చ, ఒంటేలు: విసర్జనక్రియలో అంతిమ ఉత్పాదితము/పదార్థము; మూత్రపిండాల్లో విసర్జన ప్రక్రియకు లోనయి, మూత్రమార్గముద్వారా బహిష్కరింపబడుతుంది. ఆరోగ్యములో సూక్ష్మజీవిరహిత ద్రవము. The essential constituents of urine are urea and uric acid, the nonprotein nitrogen (NPN) waste products of protein digestion. మూత్రములో యూరియా, యూరిక్ ఆమ్లము ముఖ్య విసర్జనములు – ఇవి ప్రోటీన్‌ల జీర్ణక్రియలో వ్యర్థపదార్థములు; పనికిరానివి కాబట్టి పారవేయాలి. *N.B.* Non-protein nitrogen (NPN) substances are wastes from the tissues whereas protein nitrogen substances are food for the tissues. *గమనిక:* వ్యర్థపదార్థములు వృథా అనగా కణజాలములు వాటిని త్యజించాలి, కాని ప్రోటీన్‌లు కణజాలములకు పోషకములు కావున శరీరానికి ఉపయోగకరము, శరీరంలో వాటిని ఉంచాలి.

**urinometer** a device for determining the specific gravity of urine మూత్ర విశిష్ట గురుత్వము/తారతమ్య గరిమ నమోదు చేయు పరికరము.

**urobilin** a brownish pigment in faeces విరేచనములోని నీరుకావి వర్ణముగల వర్ణకము. formed by oxidation of urobilinogen యూరోబైలినోజన్ ఆక్సీకరణము వలన తయారవుతుంది.

**urobilinogen** 1. precursor of urobilin యూరోబైలిన్ యొక్క అగ్రగామి. 2. formed by reduction of bilirubin బైలిరూబిన్ క్షయకరణము వలన సంభవించునది.

**urochrome** substance responsible for the light yellow colour of urine in health మూత్రరంజకము: ఆరోగ్యములో మూత్రములోని లేత పసుపుపచ్చరంగు దీనివలన కలుగును.

**urogenital system** pertaining to the urinary system and genitalia మూత్రజననేంద్రియ వ్యవస్థ: మూత్రవిసర్జన తాలూకు భోగట్టా మరియు జనన అవయవములకు సం.

**urography** X-ray photo of the urinary tract మూత్రమార్గమునకు ఎక్స్‌రే ఫొటో. **intravenous u.**, intravenous urogram (IVU): radiography of the urinary tract after intravenous injection of a radio opaque dye కిరణాభేద్యమైన వర్ణకము/రంజకమును సిరద్వారా ఎక్కించి మూత్రపథమునకు ఎక్స్‌రే ఫోటో తీయుట.

**urokinase** an enzyme, used as a thrombolytic (fibrinolytic) agent థ్రాంబస్‌ను విచ్ఛిన్నముచేయు ఎన్‌జైమ్.

**urolithiasis** formation of urinary calculi మూత్రశిలలు తయారగుట.

**urologist** specialist in urology మూత్రవ్యవస్థ వ్యాధులలో నిపుణుడు.

**urology** 1. **in males:** branch of medicine dealing with genitourinary (genital + urinary) system పురుషులలో జననేంద్రియ మూత్రవ్యవస్థ వైద్యవిభాగము. 2. **In females:** urinary system because there are two branches in the genital system, *viz.* Gynaecology and Obstetrics స్త్రీలలో మూత్రవ్యవస్థ వైద్యవిభాగము మాత్రమే ఉంటుంది; ఎందువలన అంటే – జననేంద్రియ విభాగములో రెండు శాఖలు గైనెకాలజీ, పురిటిశాస్త్రం రూపొందినవి కాబట్టి. 3. Urology, a medical journal వైద్యవార్తాపత్రిక.

**uropathy** any disease of the urinary tract మూత్రవ్యవస్థకు ఖాయిలా/సుస్తి.

**URTI** *abbr.* upper respiratory tract infection ఊర్ధ్వ శ్వాసమార్గ సంక్రమణం [*in contr.* LRTI].

**urticaria** hives; an allergic vascular/capillary reaction. raised rose-red or pale patches (weals/wheals) on the skin accompanied by burning and itching, triggered by food products, stings by insects, drugs, infections, *etc.* also called allergy or hypersensitivity, *see/చూడండి* allergy. చర్మములోని రక్తకేశనాళికల ప్రతిఘాతము; రోజారంగు లేదా పాలిపోయిన, ఉబ్బిన దద్దుర్లు, గోకుడు, మంట: గోకినకొద్దీ మరీ గోకాలని – అవి ఎర్రగామారి మరింత భీకరంగా అగపడుతాయి – వీటి ప్రేరేపణ వేటి/ఎందువలన కలుగుతుంది అంటే – అహారపదార్థములు, కందిరీగకాట్లు, మందులు, సూక్ష్మజీవి/క్రిమి సంపర్కము, మొ. **bullous u.**, lesions with superadded blisters దద్దుర్లమీద పొక్కులు. **giant u.**, giant hives, dilatation and increased permeability of capillaries, angioedema; glottic oedema, potentially lethal/fatal బృహద్దద్దుర్లు, రక్తకేశనాళికలు విస్తరించి, వాటి ప్రవేశ్యశీలత పెరిగి, తద్వారా సీరమ్ బయటకు వచ్చి దద్దుర్లు ఉబ్బుతాయి; కంఠబిలము యొక్క ఉబ్బు ప్రమాదకరము, మరణకారణమైనదిగూడాను.

**uterine** relating to the uterus గర్భాశయమునకు సం. **u. tubes**, Fallopian tubes అండవాహక నాళములు, గర్భకోశనాళములు.

**uterine tube** tuba uterina, oviduct, Fallopian tube, salpinx. one on either side of the uterus connecting it to the ovary అండవాహిక: గర్భాశయమునకు ఇరుప్రక్కలా అండాశయంతో కలిపే నాళం.

**uterogestation** uterine gestation, *i.e.* normal pregnancy గర్భ సంచిలో సహజగర్భధారణ.

**uterosalpingography** *see/చూడండి* hysterosalpingography.

**uterovesical** concerning the uterus and urinary bladder గర్భ సంచి మరియు మూత్రాశయమునకు సం.

**uterus** hollow muscular organ గర్భకోశము, గర్భాశయము. *colloq.* womb వాడు.భా. గర్భసంచి. responsible for: విధులు:

1. menstruation, *i.e.* menses every 28 days ముట్టులో ఇక్కడనుంచి ఋతుస్రావము 28 రోజులకొకసారి కలుగుతుంది. 2. pregnancy గర్భధారణ. **gravid u.**, one containing a growing fetus ఎదిగే భ్రూణముగల గర్భసంచి. **infantile u.**, underdeveloped womb కురుచ గర్భకోశము. **u. bicornis,** bicornuate uterus, having two cornua, *resemblance:* split stick రెండుకొమ్ములుగా విభజింపబడినది, పోలిక: పంగలకర్ర.

**utricle** 1. any small sac ఏదైనా చిన్న తిత్తి/గోణి/సంచి. 2. a structure in the internal ear లోపలి చెవిలో ఒక నిర్మాణము. 3. a small blind pouch in the prostate పౌరుష (అష్ఠీల) గ్రంథిలోని చిన్న అంధ జోలె/కోశము.

**utriculus** utricle పేటిక. **u. masculinus,** u. prostaticus, prostatic utricle పౌరుష గ్రంథి పేటిక.

**uvea** uveal tract. the iris, ciliary body and choroid considered together క్రిష్ణపటలము: కనుపాప, సిలియరి బాడీ మరియు రక్త పటలము కలసి ప్రస్తావన.

**uveitis** inflammation of uvea క్రిష్ణపటలముయొక్క శోథము: యూవియా యొక్క 'నొప్పి వేడి ఎరుపు మంట వాపు'.

**uvula** usually refers to the fleshy mass hanging from the soft palate, *resemblance:* pendant కొండనాలుక, చిరునాలుక, చిన్నాలుక: అంగిలినుండి వ్రేలాడు మాంసపు ముద్ద, పోలిక: స్త్రీలలో ముక్కు అలంకార ఆభరణము – పెద్దలలో బావిలీ, పిన్నలలో బులాకీ.

**uvulectomy** excision of the uvula కొండనాలుకను కత్తిరించడం.

**uvulitis** inflammation of the uvula కొండనాలుకయొక్క శోథము/'నొప్పి ఎరుపు మంట వాపు'.

**uvulotomy** operation involving cutting of uvula కొండనాలుకను కోసే శస్త్రచికిత్స.

**U wave** in ECG, a graph in the examination of heart ఇ.సి.జి., గుండె పరీక్ష గ్రాఫ్‌లో ఒక అంశము.

# V v

**vaccination** the injection of vaccine to produce immunity and protect against disease, *see/చూడండి* immunity, immunization. టీకాలు వేయుట: ప్రతిరక్షణ/వ్యాధినెదుర్కొను శక్తి పొందుటకు మరియు వ్యాధి నుండి కాపాడుటకు దిటవులేని (attenuated) క్రిములను లేదా క్రిమిజన్య పదార్థములను టీకాద్వారా శరీరంలోనికి చేర్చడం.

**vaccine** suspension of attenuated or killed microorganisms or of antigenic proteins contained in them, used for prevention or treatment of infectious diseases వాక్సీన్, టీకామందు: అంటుజాడ్యముల నివారణ లేదా చికిత్సకొరకు నిర్వీర్యము చేయబడిన/దిటవులేని క్రిముల లేదా మృతిచెందిన సూక్ష్మజీవుల లేదా వాటిలోని ప్రతిజనక (antigenic) ప్రోటీన్‌ల అవలంబకము. 1. **live, attenuated organisms** BCG, against tuberculosis and in cancer immunotherapy; MMR, against measles, mumps and rubella (German measles); OPV, oral polio vaccine (pulse polio is the catchword of the present day); oral typhoid vaccine బ్రతికి ఉన్న, నిర్వీర్యమైన, దిటవులేని సూక్ష్మక్రిములు: బి.సి.జి. టీకాలు, క్షయవ్యాధి నివారణ మరియు కాన్సరు నెదుర్కొను శక్తి కొరకు; ఎమ్.ఎమ్.ఆర్, తట్టు, గవదబిళ్ళలు మరియు రూబెల్లా (జర్మన్ తట్టు) వాక్సీన్; ఒ.పి.వి, ఆస్య పోలియో వాక్సీన్, ఓరల్ పోలియో వాక్సీన్ (పల్స్ పోలియో ప్రస్తుత పథకము); ఆస్య టైఫాయిడ్ వాక్సీన్. 2. **killed organisms** cholera v., influenza virus v., pertussis v., rabies virus v. మృతిచెందిన సూక్ష్మక్రిములు: కలరా, ఫ్లూ, కోరింత దగ్గుకు, పిచ్చికుక్క కాటు (rabies) వ్యాధికి టీకాలు. 3. **toxoids** diphtheria and tetanus (*Note:* DTP contains diphtheria and tetanus toxoids and pertussis vaccine) టాక్సాయిడ్‌లు: డిఫ్తీరియా, టెటనస్ (సూచన: డి.టి.పి.లో డిఫ్తీరియా, టెటనస్ టాక్సాయిడ్‌లు మరియు కోరింతదగ్గు వాక్సీన్ కలవు). 4. **antigens** hepatitis B v., hepatitis B surface antigen ప్రతిజనకాలు: ఈ కాలేయపు జబ్బుకు టీకాలు.

**vaccinia** 1. cowpox గోమశూచి. 2. in humans: a mild or localised reaction to inoculation against smallpox మశూచి టీకాకు ప్రతిచర్య.

**vacuolated** containing vacuoles రిక్తికలు గలది.

**vacuole** space/cavity in the protoplasm of a cell రిక్తిక: కణములోని జీవపదార్థములోని స్థలము/చోటు.

**vagal** concerning the vagus nerve, $10^{th}$ cranial nerve వేగస్, 10వ కపాలనాడికి సం. v. **inhibitory** వేగస్ నాడి విధిని అటంకపరచడం.

**vagina** 1. the canal in the female from the vulva to the cervix of the uterus, accommodating the penis during coitus మహిళయొక్క యోని, భగరంధ్రము: యోని రంధ్రమునుండి గర్భాశయగ్రీవము వరకూ వ్యాపించు యోని గుహ/కుల్య – సంభోగసమయంలో పురుషాంగమునకు అహ్వానము/అతిథ్యము. vaginal douche భగరంధ్ర పిచికారి. 2. any sheath - like structure, *e.g.* tunica vaginalis testes. ఏదైనా తొడుగులాంటి నిర్మాణం, ఉదా. వృషణకవచం.

**vaginalitis** inflammation of the tunica vaginalis testis, *see/* చూడండి tunica vaginalis testis. వృషణము మరియు ఎపిడిడైమిస్‌ను కప్పి ఉంచు పొర యొక్క శోథము/'నొప్పి వేడి మంట తీపు వాపు'.

**vaginismus** painful spasm of the vagina hindering coitus యోని కండరములో ఈడ్పు: సంభోగమును అటంకపరచు యోని ఈడ్పు; యోని ముడుచుకున్నందున రతిబాధ/రతిక్లేశము.

**vaginitis** inflammation of the vagina యోని యొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు మంట తీపు వాపు'. **atrophic v., senile v.,** occurring in postmenopausal women due to oestrogen (a hormone) deficiency ఈస్ట్రోజన్ అనే హార్మోన్ లోపమువలన ముట్లు ఎండిపోయిన స్త్రీలలో కణజాల క్షయము.

**vaginocele** prolapse of the vagina వాడు.భా. పేగు జారింది (బహుశా గుహ్యముగాబట్టి సిగ్గును అభినయిస్తూ లేదా నిజముగా తెలియక) అంటారు. వాస్తవానికి యోని జారుట.

**vaginopathy** any disease of the vagina యోని సుస్తి: యోనికి సంభవించు జబ్బు ఏదైనా.

**vaginoperineorrhaphy** repair of the vagina and perineum with sutures, especially tears after birth trauma యోని మరియు యోనిరంధ్రములో ప్రసవానంతర చిరుగులను కుట్టుట. *figur.* Mother is as tolerant as Mother Earth. అలంకార. మాతృమూర్తికి ధరిత్రికి ఉన్నంత సహనం ఉన్నది.

**vagotomy** division of the vagus nerve as a whole or in part (*i.e.* its branches) వేగసనాడీ ఛేదన: వేగస్ నాడిని మొత్తముగాగాని, లేదా శాఖలుగాగాని కత్తిరించుట. one modality of treatment for peptic ulcer పెప్టిక్ వ్రణమునకు ఒక చికిత్సోపాయము.

**vagotonia** hyperexcitability of the vagus nerve అధికప్రేరణశీలి అయిన వేగస్‌నాడి.

**vagus** vagus = wandering. so-called because of its wide distribution in the neck, thorax and abdomen. the vagus nerve, $10^{th}$ cranial nerve, *see/చూడండి* nervous system. వేగస్‌నాడి 10వ కపాలనాడి – సంచారక నాడి, ఎందుకనగా మెడకు, ఛాతీకి మరియు ఉదరమునకు ప్రాకుతుందిగాబట్టి.

**valgus** or **valga** or **valgum** If the part distal to the joint is away from (*i.e.* lateral to) the midline of the body, it is called valgus deformity. **hallux v.**, great-toe bent outwards కాలిబొటనవ్రేలు వెలుపలికి వంగియుండుట. **talipes v.**, ankle bent outwards చీలమండ వెలుపలికి వంగియుండుట [*opp.* varus].

**valine** an amino acid ఒక ఎమైనో ఆమ్లము.

**vallecula** a crevice on any surface ఉపరిభాగం మీద చీల లేదా చీలిక/చీలిక. **v. cerebelli,** vallis. a deep hollow on the inferior surface of the cerebellum, between the hemispheres where the medulla oblangata is situated రెండు అనుమస్తిష్క గోళార్ధముల నడుమ/మధ్యన, దిగువ/అడుగు తలమున లోతుచీలిక. ఇందులో మజ్జాముఖము అమర్చబడి యున్నది.

**vallis** [Latin valley]. *see/చూడండి* vallecula cerebelli.

**Valsalva manoeuvre** *see/చూడండి* manoeuvre.

**valve** a membranous fold in an opening or passage which allows one-way traffic కవాటము: రంధ్రములోగాని కాలువలోగాని ఒకవైపు

దారినిచ్చే పొరముడత. *N.B.* If it becomes incompetent, regurgitation, *i.e.* two-way traffic is inevitable. *గమనిక:* కవాటము అసమర్థత వలన రెండువైపులదారి అనివార్యము. **at the opening** రంధ్రంలో: aortic v. బృహద్ధమని మొదలున కవాటము. artificial cardiac v. గుండెలో కృత్రిమ కవాటము. mitral v. మైట్రల్ కవాటము. pulmonary v. పుప్పుస కవాటము. tricuspid v. ట్రైకస్పిడ్ కవాటము. **in the passage** మార్గంలో: ileocecal v., valve between the ileum and caecum శేషాంత్రికాంధనాళీయ కవాటము అనగా శేషాంత్రికము మరియు అంధనాళము మధ్యనున్న కవాటము.

**valvotomy** incision into a valve కవాటచ్ఛేదన: కవాటములోనికి కోత. **mitral v.** ఈ కవాటము కోత.

**valvula** or **valvule** a valve of small size పిల్లకవాటం. **v. lymphatica,** in lymphatic vessels లింఫ్ నాళికల్లో పిల్ల కవాటములు.

**valvulitis** inflammation of a valve, commonly heart valve కవాట శోథము: తరచుగా గుండెలోని కవాటముయొక్క 'ఎరుపు వాపు'.

**valvuloplasty** plastic repair of a valve కవాటమునకు మరమ్మతు. **balloon v.,** passing a balloon - tipped catheter intravenously and inflating the balloon at the site of the valve under fluoroscopic vision, thus widening the valve, *resemblance:* opening an umbrella at the site of the valve పూరించగల తిత్తి కొన గలిగిన గొట్టమును సిరద్వారా ఎక్కించి, స్క్రీనింగ్‌లో చూస్తూ, కవాట ప్రదేశము వద్ద ఆ తిత్తిని పూరించుట; అట్లు పూరింపబడిన తిత్తి కవాటమును విస్తరింపజేయును, పోలిక: కవాటప్రదేశమువద్ద ఛత్రి/గొడుగు తెరచినట్లు.

**van den Bergh's test** done in jaundice, to determine the level of serum bilirubin బిలిరూబిన్ సీరమ్‌లో ఎంత ఉన్నది తెలియపరుస్తూ, పచ్చకామెర్లు అనే జబ్బులో చేసే పరీక్ష

**variceal** pertaining to a varix వేరిక్స్‌కు సం.

**varicella** chickenpox, *see/చూడండి* chickenpox. ఆటలమ్మజాడ్యం.

**varicelliform** resembling varicella ఆటలమ్మజాడ్యమును పోలిన.

**varicocele** varicosity of the pampiniform plexus of the spermatic cord, *resemblance:* feeling of a bag of worms శుక్లరజ్జువు ప్లక్షము లోని వాచి త్రాడుబారిన సిరలు, పోలిక: పురుగులున్న సంచి పట్టుకుని నలుపుతున్నప్పుడు కలిగే అనుభూతి.

**varicocelectomy** operation done on varicocele, ligature and excision of the dilated veins వేరికోసీల్ మీద ఆపరేషన్; సిరలను బంధించి ఉబ్బిన సిరలను తొలగించుట.

**varicose** distorted with bends మెలికలు తిరిగిన. term applied to bluish swollen tortuous cord-like veins ఈ పదము నీలిరంగు కలిగి ఉబ్బి, మెలికలు తిరిగిన త్రాడువలె కనపడు సిరలకు వాడుతారు.

**varicose veins** swollen, tortuous and twisted veins ఉబ్బి, మెలికలు తిరిగిన సిరలు. also called varicosities.

**varicotomy** excision of a varicose vein or varix వెరికోస్ సిరను లేదా వేరిక్స్‌ను తొలగించుట.

**variola** 1. smallpox, eradicated all over the world మసూచి/మశూచి, స్ఫోటకము, వ్యా.డు.భా. పెద్దమ్మవారు, అమ్మవారు; ప్రపంచమంతటా నిర్మూలింపబడినది. 2. of historical interest చరిత్రకు సం. ఘట్టము, చారిత్రాత్మక విలువగలది. అలంకార. మరచిన మసూచి.

**varix** [varices *pl.*] a dilated tortuous vein, artery or lymphatic vessel విస్తరించి మెలికలు తిరిగి ఉబ్బిఉన్న సిర, ధమని లేదా శోషరసనాళము. 1. oesophageal varices – varicosities due to portal hypertension in cirrhosis of liver, an example of anastomosis between the systemic and portal veins కాలేయము గట్టిపడిన జబ్బులో నిర్వాహక ఒత్తిడి వలన దైహిక సిరలకు, నిర్వాహక సిరలకు అనుమేళకము/కలయిక. The result is bleeding per vomit. దీని వలన వాంతిలో రక్తము. 2. dilated tortuous temporal artery కణతభాగమందు ఉబ్బి మెలికలు తిరిగి ఉన్న ధమని. 3. dilated tortuous lymphatic vessels in lymphatic obstruction శోషరస పారుదలకు ఆటంకము కలిగినప్పుడు ఉబ్బి మెలికలు తిరిగిన శోషరసనాళములు.

**varus** or **vara** or **varum** If the part distal to the joint is nearer to the midline of the body, it is called varus deformity,

*e.g.* **hallux v.** big toe bent towards the other foot కాలిబొటనవేలు రెండవపాదం వైపునకు వంగియుండుట. [*opp.* valgus].

**vas** [vasa *pl.*] vessel నాళము. **v. deferens,** duct in testis శుక్రవాహిక. 1. vasa lymphatica, lymphatic vessels శోషరసనాళములు. 2. vasa vasorum, nutrient arteries and veins in the walls of the bigger blood vessels పెద్ద రక్తనాళముల గోడలలో వాటికి పోషణనిచ్చు ధమనులు మరియు సిరలు.

**vascular** 1. pertaining to vessels, especially blood vessels నాళములకు సం., ముఖ్యముగా రక్తనాళములకు సం. 2. rich blood supply, *colloq.* highly vascular. సమృద్ధమైన రక్తసరఫరా.

**vascularization** the growth of new blood vessels in tissues రక్తనాళవ్యాప్తి, కణజాలములలో కొత్త రక్తనాళములు పెరుగుట.

**vasculature** the vascular system రక్తనాళ వ్యవస్థ.

**vasculitis** angiitis, inflammation of a vessel నాళముయొక్క శోథము/ 'కందు వాపు'. **necrotising v.,** inflammation and necrosis of the walls of blood vessels రక్తనాళముల గోడలయొక్క కణక్షయముతో కూడిన 'కందు వాపు'.

**vas deferens** or **ductus deferens** or **sperm duct** or **deferent duct** [Latin *deferens* = carring away]. The continuation of the epididymis of the testis that ascends and joins the seminal vesicle శుక్రవాహిక: ఎపిడిడైమిస్ యొక్క పొడిగింపు – ఇది పైకిపోయి శుక్లం నిల్వచేయబడే తిత్తిలోకి కలుస్తుంది. Vasectomy severs the vas deferens at the level of the testis, thus making him sterile వాసక్టమి ఆపరేషన్ అనగా ఈ శుక్రవాహికను వృషణతలమందు ఛేదించుట, అప్పుడు అతడు వంధ్యుడు అవుతాడు.

**vasectomy** excision of vas deferens, a modality of family planning వేసెక్టమి: శుక్రవాహికను ఛేదించుట; పిల్లలు పుట్టకుండా పురుషులలో శస్త్రచికిత్స [*q.v.* tubectomy].

**vasoconstriction** constriction of blood vessel రక్తనాళ సంకోచం [*opp.* vasodilation వ్యతి. రక్తనాళ వ్యాకోచం].

**vasoconstrictor** an agent which decreases the diameter of blood vessels, thus increasing blood pressure రక్తనాళముల నడిమికొలత తగ్గించు వస్తువు; దీనివలన రక్తపోటు పెరుగుతుంది.

**vasodepressor** an agent which lowers the blood pressure through reduction in peripheral resistance బ్లడ్ ప్రెషర్‌ను తగ్గించు వస్తువు [*opp.* vasopressor వ్యతి. రక్తపోటు పెంచేది]. **v. syncope,** *see/చూడండి* vasovagal syncope.

**vasodilatation** vasodilation, a state of increased diameter of blood vessels రక్తనాళ వ్యాకోచం: రక్తనాళముల నడిమికొలత పెరిగిన స్థితి [*opp.* vasoconstriction వ్యతి. రక్తనాళ సంకోచం].

**vasodilator** an agent which increases the diameter of blood vessels, thus decreasing blood pressure రక్తనాళముల నడిమికొలత పెంచు వస్తువు; దీనివలన రక్తపోటు తగ్గుతుంది.

**vasomotor** producing dilatation or constriction of blood vessels రక్తనాళముల యొక్క విస్తారణముగాని కుంచనముగాని కలుగజేసే. 1. **v. nerves,** nerves which cause changes in the calibre of the blood vessels రక్తనాళముల పరిమాణములో మార్పులు తెచ్చే/కలిగించే నాడులు. 2. **v. disturbances** also known as anaphylactoid symptoms, simulate those of anaphylaxis, *see/చూడండి* anaphylaxis. The conjunctivae become suffused, the face becomes flushed, tongue and lips may swell; there may be respiratory distress. కన్నుపొర ఎర్రగాపొంగి, ముఖము దద్దరించి ఎర్రబారి, నాలుక మరియు పెదిమలు ఉబ్బి; శ్వాసక్లేశము కలుగవచ్చును. 3. **v. rhinitis,** sudden transient affection of nose, allergic or nonallergic ముక్కుక్షోభ; నాజూకు నాసిక తటాలున తుమ్ములకు గురియై తాత్కాలిక క్షోభను ఎదుర్కొనుట.

**vasopressin** ADH, antidiuretic hormone stored in the posterior pituitary పరాంత పిట్యూటరిలో నిల్వచేయబడియుండే హార్మోన్. It raises the blood pressure, concentrates the urine (diminishes diuresis), contracts the uterus. బ్లడ్ ప్రెషర్‌ను పెంచును, మూత్రమును సాంద్రీకృతమొనర్చును (అతిమూత్రమును అరికట్టును), గర్భాశయ సంకోచమునకు తోడ్పడును. It is used in the treatment of diabetes

insipidus, *see*/చూడండి diabetes insipidus. ఉదకమేహము అనే వ్యాధికి చికిత్స.

**vasopressor** a chemical agent that causes the smooth muscles of the arterioles to contract, thus narrowing their lumina and raising the blood pressure రక్తపోటు పెంచేది: ధమనికల కుడ్యములలో నునుపు కండరముల సంకోచము వలన వాటిలోపలి వైశాల్యము తగ్గించి, బ్లడ్ ప్రెషర్‌ను పెంచే రసాయనిక వస్తువు [*opp.* vasodepressor వ్యతి. రక్తపోటు తగ్గించేది].

**vasospasm** spasm of a blood vessel రక్తనాళముయొక్క ఈడ్పు.

**vasovagal** of vascular and vagus nerve రక్తనాళములకు మరియు వేగస్‌నాడికి సం. **v. attack, v. syncope**, vagal attack characterized by pallor, nausea, sweating, rapid fall in blood pressure, syncope ఈ ఘట్టములో పాలిపోవుట, వికారము (వాంతి వచ్చినట్లుండుట), చమటలు, బ్లడ్ ప్రెషర్ వేగంగా పడిపోవడం, సొమ్మసిల్లడం.

**vasovesiculectomy** excision of the vas deferens and seminal vesicles శుక్రవాహిక మరియు శుక్రము నిల్వచేయు తిత్తులను, శస్త్ర చికిత్స ద్వారా తొలగించుట.

**vasovesiculitis** inflammation of the seminal vesicles and a vas deferens శుక్రమును నిల్వచేయు తిత్తులు మరియు శుక్రవాహిక యొక్క ఇన్‌ఫ్లమేషన్.

**vector** usually an arthropod that transfers an infective agent from one host to another, *e.g.* louse-borne typhus, tick-borne relapsing fever ఆరోహకము, రోగవాహకము: ఒక అతిథేయినుండి మరియొకరికి అంటుక్రిములను సరఫరా చేయు మధ్యవర్తులు, ఉదా. పేనులద్వారా టైఫస్, కొఱుజులద్వారా జ్వరము.

**vegan** vegetarian, eating foods of plant origin శాకాహారులు: వృక్షజన్య పదార్థములు తినువారు [*in contr.* non-vegetarian who is a mixed eater, *i.e.* eating plant tissues and animal tissues భిన్న. మిశ్రమభోజి అనగా వృక్ష మరియు జంతు కణజాలములను తినువారు].

**vegetation** 1. a plantlike luxuriant growth of pathologic tissue, *e.g.* warty excrescences (vegetations) in the endocardium and over cardiac valves, especially in rheumatic process ఉద్భిజ్జము:

రుమాటిక్ జబ్బులో గుండె గోడలలోపల, కవాటములమీద పులిపిరికాయ కణితివలె విరివిగా (పుష్కలముగా) పెరిగెడు ఉద్భిజ్జములు. 2. plenty of plant growth వృక్షసంపద.

**vegetative** 1. concerning growth and nutrition పెరుగుదల మరియు పోషణమునకు సం. 2. resting stage, *i.e.* the one in which the cell is not replicating విశ్రామదశ, అనగా కణము ప్రతికృతి సలపకుండా ఉన్నప్పుడు. 3. characteristic of plants, but occurs in human beings, at times, *e.g.* **v. existence** in coma, *see/చూడండి* coma. వృక్షములకు ప్రత్యేకత కాని, మానవులకు కూడా సంభవిస్తుంది, ఉదా. స్పృహతప్పిన స్థితిలో మొద్దుమ్రానువలె పడియుండుట.

**vehicle** 1. excipient, an agent in/with which medicine is taken, *e.g.* mixing in syrup అనుపానము: ఔషధము సేవించుటకు ఉపాయము, ఉదా. మందును చేర్చి పుచ్చుకొనెడు తీపి ద్రవము. 2. carrier of infection/disease రోగవాహకం.

**vein** a vessel carrying blood to the heart సిర: గుండెకు రక్తము తీసుకొనిపోవు నాళము. **varicose v.**, *see/చూడండి* varicose. All veins except pulmonary veins carry impure (deoxygenated) blood. పుపుస సిరలలోతప్ప మిగతా అన్ని సిరలలో అపరిశుద్ధ (ఆక్సిజన్ రహిత) రక్తం ప్రవహిస్తుంది. *N.B.* Pulmonary veins carry pure (oxygenated) blood from the lungs to the heart. *గమనిక:* పుపుస సిరలు శుద్ధ (ఆక్సిజన్ సహిత) రక్తమును ఊపిరితిత్తులనుండి గుండెకు తీసుకపోతాయి.

**vena** vein సిర. **v. cava inferior,** drains blood from the lower limbs, pelvic and abdominal viscera into the right atrium of the heart అధోబృహత్సిర – ఇది అధోంగములనుండి, శ్రోణి ప్రాంతము నుండి మరియు ఉదర అవయవములనుండి రక్తమును సేకరించి, కుడి ఏట్రియమ్‌లోనికి చేర్చును. **v. cava superior,** drains blood from the head, neck, upper limbs and thorax into the right atrium of the heart ఊర్ధ్వబృహత్సిర – ఇది తలకాయ, మెడ, ఊర్ధ్వాంగములు మరియు ఛాతీనుండి రక్తమును సేకరించి, కుడిఏట్రియమ్‌లోనికి చేర్చును.

**venepuncture** or **venipuncture** insertion of a needle into a vein, especially for obtaining a blood sample ముఖ్యంగా రక్తపరీక్ష కొరకు సిరలోనికి సూదిగుచ్చుట.

**venereal** transmitted through sexual intercourse, *e.g.* syphilis సుఖవ్యాధి సం. – లైంగిక సంపర్కముద్వారా సంక్రమించు రోగము, ఉదా. కొఱుకు సవాయి రోగం.

**venereology** the study of venereal diseases సుఖవ్యాధుల/లైంగిక సంపర్కం ద్వారా సంభవించిన రోగముల శాస్త్రం.

**venesection** 1. cutting open a vein, especially for introducing a cannula, say for giving an intravenous drip of any fluid ఏ ద్రవమైనా శరీరంలోనికి ఎక్కించడానికి, చుక్కలుగా పడే పరికరం ద్వారా సిరలోనికి ప్రవేశిని లేదా సూదిని గుచ్చిఉంచుట. 2. phlebotomy రక్తం తీయుట. (a) in some diseases కొన్ని వ్యాధుల్లో (b) withdrawal of blood from a donor రక్తదాతనుండి రక్తం తీసుకొనటానికి.

**venoclysis** phleboclysis. introduction of nutrient or medicament into a vein by drip పోషక పదార్థంగాని ఔషధంగాని చుక్కలు చుక్కలుగా పడేటట్లు సిరలోనికి ఎక్కించుట.

**venogram** the radiograph of venous system after injection of a radioopaque dye/medium కిరణాభేద్యమైన, అపారదర్శకమైన అద్దకం/పదార్థం సిరలోనికి ఎక్కించి సిరలయొక్క వ్యవస్థను ఎక్స్‌రే ఫోటోద్వారా పరిశీలించుట.

**venom** poison from an animal గరళము: జంతువునుండి ఉద్భవించిన విషము, ముఖ్యముగా పామునుండి వచ్చిన స్రావమునకు గరళము అంటారు.

**venous** pertaining to the veins సిరలకు సం. *e.g.* **intra v. injection** సిరలోనికి సూది. **v. blood** సిర రుధిరము/రక్తము.

**ventral** *anat.* the front aspect of the body when the person is standing erect, *viz.* side of navel and nose ఉదర, బొడ్డు ముక్కువైపు. **v. view** అభిముఖ/ముందువైపు దృశ్యము. [*opp.* dorsal వ్యతి. పృష్ఠ, వీపువైపు].

**ventricle** a small chamber/cavity చిన్నఅర/కుహరము. **in the brain** కోష్ఠకము (మెదడులో): **fourth v.** of cerebrum, in the hind brain containing cerebrospinal fluid మస్తిష్కమేరు ద్రవముగల వెనుకమెదడులోనిది. **lateral v.** of cerebrum the cavity in each

cerebral hemisphere మస్తిష్క గోళార్థములోని కోష్ఠకము/కుహరము. **in the heart** జఠరిక (గుండెలో): **left v.** of heart, the lower left chamber of the heart గుండెలో ఎడమ క్రింది జఠరిక/కుహరము. **right v.** of heart, the lower right chamber of the heart గుండెలో కుడి క్రింది జఠరిక/కుహరము. **elsewhere** వేరుచోట: **v. of larynx,** the space between the true and false vocal cords శబ్దపేటికలోని రజ్జువులమధ్య చిన్నఅర.

**ventriculitis** inflammation of the ventricles of the brain మెదడులోని కోష్ఠకముల ఇన్‌ఫ్లమేషన్.

**venule** end of a vein, microscopic in size సూక్ష్మసిరిక. *micro.str.* సూక్ష్మ.చూ. smallest sized venous vessel, 20$\mu$ in diameter సిరిక: సూక్ష్మసైజు సిర.

**vermicide** an agent/drug that kills intestinal parasitic worms పేగుల్లో పరాన్నజీవి పురుగులను చంపే వస్తువు/ఔషధం.

**vermiform** wormlike క్రిమిరూపం; పురుగువలె. **v. appendix,** inflammation of which is known to many as appendicitis ఈ భాగమునకు 'కందు ఎరుపు వాపు' అపెండిసైటిస్ అని లోకవిదితము.

**vermifuge** [Latin *fugo*=to chase away]. an agent which expels intestinal worms, *see/చూడండి* anthelminthic. పురుగులు/పాములను పేగులనుండి మలము ద్వారా వెలుపలకు తోసే వస్తువు.

**vermis** 1. wormlike structure పురుగువలె నుండు నిర్మాణము. 2. **v. cerebelli,** median part of the cerebellum అనుమస్తిష్కములోని మధ్యభాగము.

**vernix** 1. varnish వార్నిషు. 2. **v. caseosa,** fatty covering over fetus which contains desquamated epithelial cells and sebaceous matter ఊడిపోయిన అధిచర్మ కణములు మరియు చర్మతైల పదార్థంతో కూడిన జున్నువంటి తొడుగు గర్భస్థశిశువును కప్పి ఉంటుంది.

**verruca** [verrucose, verrucous *adj.*] 1. a common wart caused by a virus వైరస్‌వలన కలుగు పులిపిరికాయ. 2. other cause **v. necrogenica,** tuberculosis verrucosa cutis, a tuberculous lesion of the skin చర్మమునకు సంక్రమించు క్షయవ్యాధి.

**version** especially applied in obstetrics, *e.g.* **internal podalic v.**, the manual turning of the fetus, with the doctor's hand inside, to bring the feet of the fetus at the birth canal భ్రూణవర్తనం: కాన్పుసమయంలో గర్భసంచిలోనికి డాక్టరు చేయిదూర్చి వేళ్ళతో శిశువు కాళ్ళు జననకుల్యవద్దకు జరుపుట.

**vertebrae** [vertebra *sing.*] కశేరుకాలు, వెన్నుపూసలు. 33 bones of the vertebral (spinal) column comprising 7 cervical, 12 thoracic/ dorsal, 5 lumbar, 5 sacral and 4 coccygeal vertebrae 33 వెన్ను పూసలు ఒకదానిక్రింద మరియొకటి దండవలె అమర్చబడియున్న సముదాయమును కశేరుదండము అంటారు. ఇందులో 7 గ్రీవా/గ్రైవేయ, 12 వక్షస్థల/పృష్ఠ 5 కటి/నడ్డి, 5 త్రిక మరియు 4 అనుత్రిక కశేరుకాలు కలవు.

**vertebrates** *zool.* animals with vertebral column including mammals, *see/చూడండి* mammal. సకశేరుకాలు. Man is a mammal. మానవుడు సకశేరుక, సస్తన (క్షీరద), రోమసహిత జీవుల సమూహంలోనివాడు.

**vertex** highest point on the head శిఖరము, శీర్షము, అగ్రము, తలమీది మాడు, నడినెత్తి.

**vertigo** whirling తల/ఒళ్ళు తిరుగుట. **labyrinthine v.**, in diseases of the labyrinth, the inner ear లోపలిచెవి (పద్మవ్యూహము) జబ్బులో. **objective v.**, neighbourhood rotating around self పరిసరము తన చుట్టూ తిరుగుతున్నట్లుండుట. **subjective v.**, rotation of self in the surroundings పరిసరములో తను గుండ్రంగా తిరుగుతున్నట్లుండుట. **vestibular v.**, in disorders of the vestibular system అళింద వ్యవస్థ యొక్క అపవ్యవస్థలలో/అస్వస్థతలో.

**vesical** related to urinary bladder మూత్రాశయమునకు సం. **v. calculus** మూత్రాశయంలో శిల.

**vesicant** agent causing blisters బొబ్బలు కలిగించేది.

**vesicle** 1. vesicula. a small blister due to accumulation of little fluid underneath the epidermis చిన్నపొక్కు, బొబ్బ: బాహ్యచర్మము క్రింద రవ్వంత ద్రవము చేరి చిన్నపొక్కు తేలుట. 2. *naked eye str.*

ప్రత్యక్ష.చూ. **olfactory v.,** in the embryo which later develops into the olfactory bulb and tract పిండములోని ఘ్రాణపొక్కు – దీనినుండి క్రమేణ ఘ్రాణ లశునము మరియు ఘ్రాణమార్గము జనించుతాయి/రూపొందుతాయి. **seminal v.,** reservoirs of semen, pouches attached to the posterior wall of the urinary bladder రెండు శుక్రాశయములు: మూత్రాశయము వెనుకగోడకు అంటిపెట్టుకుని ఉన్న తిత్తులు. *micro.str.* సూక్ష్మ.చూ. **germinal v.,** fluid filled nucleus of an oocyte స్త్రీబీజమాతృకణములోని ద్రవముతో నిండిన కేంద్రకము. **olfactory v.,** bulbous expansion at the distal end of an olfactory cell in the human being మనిషిలో ఘ్రాణకణముయొక్క అంచునందు లశునమువలె ఉన్న ఉబ్బు.

**vesicoureteral** relating to the urinary bladder and ureters మూత్రాశయము మరియు మూత్రనాళములకు సం.

**vesicourethral** relating to the urinary bladder and urethra మూత్రాశయము మరియు మూత్రమార్గమునకు సం.

**vesicouterine** relating to the urinary bladder and the uterus మూత్రాశయము మరియు గర్భాశయమునకు సం.

**vesicovaginal fistula** a communication between the urinary bladder and vagina మూత్రాశయమును యోనిని కలుపుతూ ఏర్పడిన మార్గము.

**vesicular** pertaining to small blisters చిన్నబొబ్బలకు సం. 1. **v. mole** or hydatidiform mole: translucent vesicles of the chorionic villi measuring about $\frac{1}{4}$ inch in diameter, *see/చూడండి* hydatidiform mole. పరాయువు అంకురికల పారప్రకాశకమైన/పాక్షిక పారదర్శకమైన పొక్కులు, షుమారు $\frac{1}{4}$ అంగుళము నడిమికొలతగలిగి ఉంటాయి. 2. pertaining to or made up of vesicles on the skin, *e.g.* vesicles in chickenpox చర్మముమీద పొక్కులకు సం., *ఉదా.* ఆటలమ్మజాడ్యంలో.

**vesiculopapular** containing vesicles and papules పొక్కులు/బొబ్బలు మరియు బుడిపెలు గల.

**vesiculoprostatitis** inflammation of the bladder and prostate మూత్రాశయం మరియు ప్రొస్టేట్ యొక్క శోథం/'నొప్పి వేడి మంట వాపు'.

**vesiculopustular** formation of vesicles and pustules బొబ్బలు మరియు చీము పొక్కులు కనబడుట.

**vessel** any channel carrying a body fluid, say blood, lymph నాళము: శరీరద్రవమును సరఫరా చేయు కాలువ. **blood vessels,** collateral v's, which establish collateral circulation లోపమున్న రక్త ప్రసరణను సరిదిద్దుటకు ప్రక్కవైపునుండి ఉత్పన్నమగు రక్తనాళములు. great v's, the large vessels arising from and entering the heart: aorta, pulmonary artery and venae cavae బృహన్నాళములు/మహా నాళములు: బృహద్ధమని, పుపుస ధమని మరియు బృహత్సిరలు. **lymph vessels,** lymphatic v's, *i.e.* the capillaries, collecting vessels and trunks that drain lymph from the tissues into the blood stream శోషరసనాళములు: శోషరస కేశనాళికలు, జమచేయు నాళములు మరియు లింఫ్‌ను రక్తములోనికి చేర్చే పెద్దనాళములు.

**vestibule** vestibulum. the first passage at the entrance to a canal, *resemblance:* the first passage, verandah at the entrance to a hall in a house అళిందము: నడవ, కుహరిక; కుల్యము/కాలువకు త్రోవ, *పోలిక:* ఇంట్లో హాలులోనికి వచ్చేముందు నడవ, వసారా. vestibular sense అళింద సంవేదన/జ్ఞానేంద్రియము. **v. of ear,** an oval space in the bony labyrinth లోపలి చెవి ఎముక పద్మవ్యూహములోని అళిందము/నడవ. **v. of pharynx,** corridor to oesophagus గొంతు, అన్నవాహికకు వసారా. **v. of vagina, v. of vulva,** space between the labia minora క్రింది చిన్న నిలువు పెదిమల మధ్యనున్న స్థలము.

**vestibulitis** inflammation of the vulvar vestibule leading to dyspareunia భగరంధ్రము చుట్టూరా శోథము/'నొప్పి కందు ఎరుపు తీపు వాపు మంట' సంభవించి రతిక్లేశమునకు లోనగుట, *అలంకార.* భగము భగభగమని మండుట.

**vestibulocochlear** relating to the vestibulum and cochlea of the ear అళిందము మరియు కర్ణావృత్తమునకు సం.

**vestige** vestigium అవశేషము. 1. a trace of something once present పూర్వము ఒకప్పుడున్నదాని జాడ/గుర్తు. 2. *biol.* an organ or part not so fully developed or functional in adult, as it once was in the embryo or species in the course of evolution, *e.g.* vermiform

appendix, coccyx పిండదశలోను, పరిణామము (evolution)లో పూర్వ జాతులలో పనికివచ్చినంత మేరకు ఈ ప్రౌఢదశలో అది పెరుగలేదు, ఉదా. ఎపెండిక్స్, అనుత్రికము.

**veterinarian** a person qualified to treat diseases of animals వెటరినరి వైద్యుడు.

**veterinary** concerned with diseases of animals and their treatment జంతువుల జబ్బులకు సం., పశువైద్య. **v. science** జంతు/పశువైద్య శాస్త్రం.

**viable** 1. able to live after birth పుట్టుక/పుట్టిన తర్వాత జీవించగల. 2. capable of individual existence స్వతః జీవించుశక్తిగల.

**vial** phial. *see/చూడండి* phial.

**Vibrio** a genus ఒక ప్రజాతి. **cholera v.,** కలరా కలిగించు సూక్ష్మజీవి.

**vicarious** experienced by one part (of the body) on behalf of others ఇతర భాగముల బదులు ఒక భాగము అనుభవించునట్టి. 1. **v. suffering,** property of one organ suffering (to protect the body), *e.g.* Liver has got this property. ప్రత్యామ్నాయముగాగ బాధపడుట, ఉదా. లివర్‌కు ఈ గుణమున్నది. 2. **v. menstruation,** bleeding from nose or other part of the body, say haemoptysis when menstruation is abnormally suppressed అసాధారణంగా ఋతువు అణచివేయబడినప్పుడు ముక్కులోనుంచిగాని దగ్గినకఫములోగాని రక్తం పడుట (రక్తస్రావం). *figur.* menstruating through the nose *అలంకార.* ముక్కునుండి ముట్టు/బహిష్టు.

**villi** [villus *sing.*] hair-like outgrowths (నూగువెంట్రుకలను పోలు) చూషకములు, రసాంకురికములు, అంకురాలు, అంకురికలు, శృంగకములు. A. *micro.str.* సూక్ష్మ.చూ. (i) **in small intestine:** thread-like processes 0.5 to 1.5mm. in length, 10 to 40 per sq.mm. on the inner surface of the small intestine (*N.B.* microvilli are 1 to 1.4$\mu$ in length and 80$m\mu$ in diameter) చిన్నపేగుల లోపలిభాగములో చూషకములు (*గమనిక: అతి సూక్ష్మచూషకముల సైజు పైన చూడండి*). (ii) **in chorion:** chorionic villi పరాయువులో అంకురికలు. (iii) **in synovium:** villi in the folds of synovial membrane in a joint కీలులోని సైనోవియల్ పొరలో అంకురికలు. B. arachnoid villi,

microscopic projections of the arachnoid into some of the venous sinuses, which enlarge in man with advancing age, to form Pacchionian bodies; arachnoid granulations visible by naked eye లౌతికళ శృంగకములు: లౌతికళయొక్క అంకురికలు సిరకోటరములలోనికి ఉబ్బుకొని ఉంటాయి. వయస్సు ముదిరినకొద్దీ/మీరినకొద్దీ పెద్దవయి, ప్రత్యక్షముగా కనబడుతాయి.

**violaceous** violet colour, a combination of red and blue in equal proportions ఊదారంగు: ఎరుపు నీలము సమపాళములలోగల రంగు.

**viraemia** or **viremia** presence of viruses in the blood రక్తంలో వైరస్‌లుండుట.

**viral** pertaining to or caused by virus వైరస్‌కు సం. లేదా వైరస్ సంపర్కమువలన కలిగిన. **v. fever** వైరస్ జ్వరము.

**Virchow's node** signal node, sentinel node, jugular gland/node. a firm or hard supraclavicular lymph node, especially on the left side, known to contain a metastasis (secondary deposit) from a malignant neoplasm of one of the viscera in the abdomen, particularly stomach కాపలా సంజ్ఞ నోడ్/గ్రంథి: ఎడమ జత్రుకపైన లింఫ్ గ్రంథి, పొట్టలోని ఏ అవయవములోనైనా కాన్సరు ప్రాకినందువలన పెరుగుతుంది, ప్రత్యేకంగా అన్నాశయం కాన్సరులో.

**virgin** 1. one whose hymen is intact కన్య, అక్షతయోని: అఛిద్రయోని గలది, *అలంకార.* హైమన్వతి. Barring the exception of a congenital defect, masturbation or the strain of sports, a torn hymen always indicates exposure to sexual intercourse. Hence virgin is a girl not exposed yet to coitus, *see/చూడండి* hymen. పుట్టుకతో ఉన్నలోపము, హస్తప్రయోగపర్యవసానం లేదా క్రీడలవలన కలిగే ప్రయాస ఫలితం మినహా, చిరిగిన హైమన్ (యోనిమీది ఉల్లిపొర) సంభోగమును సూచిస్తుంది. కాబట్టి కన్యాత్వమంటే రతికేళి సలపని కన్యబ్రతుకు. 2. **v. soil,** favourable tissue, say for bacterial growth బాక్టీరియా వృద్ధికి అనుకూలమైన కణజాలము.

**virginity** virginhood, maidenhood; state of being a virgin కన్యత్వం, కన్యాత్వము, అక్షతయోనిత్వం.

**virginity test** clinical examination of the external genitalia, especially for intact hymen of an unmarried woman; to be exact, a woman who has not undergone sexual intercourse, *see*/*చూడండి* hymen, virgin. అవివాహిత స్త్రీ, ఖచ్చితంగా చెప్పాలంటే రతికేళి జరపని స్త్రీ యొక్క బాహ్యాలైంగిక అవయవముల పరీక్ష, ముఖ్యంగా చెక్కుచెదరని కన్నెపొర ఉన్నదా అని. *snags:* (i) Intact hymen is not a proof of virginity. (ii) Torn hymen is not a proof of non-virginity. *అడ్డంకులు:* (i) చెక్కు చెదరని కన్నెపొర కన్యాత్వానికి ఋజువు గాదు. (ii) కన్యలో చిరిగిన కన్నెపొర ఉండవచ్చును. Hence the test is not infallible. కాబట్టి ఈ పరీక్ష పొరపాటురాహిత్యమైనది కాదు. [*q.v.* pregnancy test is a different one].

**virilism** the presence and development of male characteristics in the female, *e.g.* adrenogenital syndrome, hirsutism (*figur.* hair suit ism), moustache, beard, hair all over the body, clitoris becoming penis-like పురుషలక్షణాలుగల స్త్రీ; మగువకు పురుష చిహ్నములు పెరిగి, గడ్డాలు మీసాలువచ్చి, శరీరమంతా రోమమయమై (అలంకార. రోమవస్త్రము సూటుగా ధరించి), క్లైటోరిస్ పురుషాంగ మంత పరిమాణమవుట.

**virology** study of viruses and diseases caused by them వైరస్‌లు, వాటివలన కలుగు వ్యాధుల శాస్త్రము.

**virulence** the degree of pathogenicity of a microorganism తీవ్రత, సూక్ష్మజీవియొక్క వ్యాధిజనకశక్తి.

**virus** infinitesimal infectious microorganism much smaller than bacteria, requires electron microscope for identification వైరస్, అత్యంత అల్ప సూక్ష్మజీవి: ఎలక్ట్రాన్ మైక్రొస్కోప్‌లో పోల్చగలిగిన అతిసూక్ష్మజీవి. ఇవి బాక్టీరియాకన్నా బహుచిన్నవిగా ఉంటాయి, అంటు/సోకు వ్యాధులు కలుగజేస్తాయి. **common cold v.,** causes coryza జలుబు వైరస్. **dengue v.,** attended with severe body pains విపరీతమైన ఒళ్ళునొప్పులతో బాధపడే జబ్బు వైరస్. **encephalitis v.,** damaging the brain మెదడును చెరుపు వైరస్. **enteric v's,** enterovirus ఆంత్రము/పేగును ఆవరించు వైరస్‌లు. **filterable v.,**

**filtrable v.**, ultravirus సూక్ష్మాతిసూక్ష్మ వైరస్. **hepalitis B v.**, causing jaundice కామెర్లు కలుగజేసే వైరస్. **herpes v.**, lesions on skin, burning as if fire is kept on skin సర్పి, చర్మముమీద క్షతములు – అగ్గిపెట్టినట్లు కాల్చుడు మంట కలిగించు వైరస్. **HIV**, human immunodeficiency virus, the dread of the present day హెచ్.ఐ.వి. – ఈ కాలపు భీతి. **influenza v.** ఫ్లూ వైరస్. **measles v.**, usually affects children తడపర, పిల్లలలో పొంగు. **mumps v.**, involvement of salivary glands, especially parotid గవదబిళ్ళలు: లాలాజల గ్రంథులు, ముఖ్యముగా పరోటిడ్ గ్రంథి ఈ వైరస్‌కు ఆశ్రయము. **poliomyelitis v.** భయంకర పోలియో వ్యాధి వైరస్. **rabies v.** రేబీస్ వైరస్. **varicella v.**, chicken pox v. ఆటలమ్మ: ఆటలాడుకుంటూ తిరుగుతూ ఉన్న పిల్లలు గురి అవుతారు ఈ వైరస్‌కు. **variola v.**, smallpox v., the virtually extinct virus, a forgotten disease స్ఫోటకము: వాస్తవానికి నశించిన వైరస్, మరచిన మసూచి.

**viscera** plural of viscus. అంతరవయవములు/అంతర అవయవములు: లోని/లోపలి అవయవములు. organs in the three great body cavities, particularly those in the abdomen శరీరంలోని మూడు విస్తీర్ణ/పెద్ద కుహరములలోని అంతర అవయవ సముదాయము, ముఖ్యముగా ఉదరములోనివి.

**visceromegaly** organomegaly, splanchnomegaly especially those in the abdomen, *e.g.* liver and spleen అంతర అవయవ ప్రవర్ధనము: ముఖ్యముగా ఉదరకుహరములోనివి, ఉదా. లివర్, స్ప్లీన్. వాడు.భా. కడుపులో బల్లలు.

**visceroptosis** downward displacement of viscera అంతర్గతావయవములు క్రిందికి జారుట.

**viscid** viscous జిగటయైన. sticky బంకయైన. **v. secretion** జిగటస్రావము.

**viscosity** stickiness, glutinousness స్నిగ్ధత, జిగట, బంక, చిక్కదనము.

**viscous** viscid, thick, having high viscosity జిగట/బంకగానున్న, చిక్కని, అధిక స్నిగ్ధతగల.

**viscus** [viscera *pl.*] [Latin *meaning* soft part]. internal organ: an organ of the digestive, respiratory. urogenital, and endocrine systems, spleen, heart and great vessels; hollow organs studied in splanchnology. అంతర అవయవము: జీర్ణమార్గ వ్యవస్థ, శ్వాసావయవ వ్యవస్థ, మూత్ర జననేంద్రియ వ్యవస్థ, మరియు వినాళికా గ్రంథుల వ్యవస్థలోని అవయవములు, ప్లీహము, గుండె, బృహత్ నాళములు.

**vision** sensation of sight చూపు, దృష్టి. **central v.**, impressions produced by stimuli impinging on the macula retinae, *see/ చూడండి* macula. **color v.**, ability to appreciate all colours in 'vibgyor' వర్ణదృష్టి: ఇంద్రధనుస్సులోని రంగులు పరిశీలించి, ఇది ఫలానా రంగు అని తెలియజేయుట. **double v.**, diplopia వస్తువు రెండుగా కనబడుట. **night v.**, perception during darkness/night చీకటిదృష్టి (*note:* night blindness is a sign of vitamin A deficiency *సూచన:* విటమిన్ ఎ లోపముతో రేచీకటి). **tunnel v., tubular v.**, in which the visual fields are very much narrowed, say 10 degrees from the fixation point సొరంగము/గొట్టములోనికి చూస్తున్నట్లు అగపడుట.

**visual** pertaining to vision చక్షుస. **v. acuity** దృష్టితీక్షణత. **v. purple**, rhodopsin, purple pigment in the retina దృష్టి ధూమ్రము: రెటీనాలో ఊదారంగు వర్ణకము.

**vital** life-sustaining, vital for life ప్రాణావశ్యకమైన. **v. data, v. signs**, pulse, respiration, temperature, B.P. (blood pressure) ప్రాణాధార చిహ్నములు, నాడి, శ్వాస, ఉష్ణోగ్రత, బ్లడ్ ప్రెషర్. *గమనిక:* బొందిలోని ప్రాణానికి వెల కట్టలేం. **v. capacity**, of lungs పుపుసక్షమత: ఊపిరితిత్తుల శక్తి నమోదుచేయు ప్రమాణము.

**vitamin** organic substance present in foods; requirement in traces for normal metabolism విటమిన్: ఆహారపదార్థములలోనున్న జీవసంబంధ పదార్థాలు, శరీర జీవ(న)క్రియకు కొద్దిమోతాదులో చాలు/కావాలి. **water soluble:** జలములో కరగెడు: **vitamin B complex** విటమిన్ బి కాంప్లెక్స్. **vitamin C**, ascorbic acid, present in lemon నిమ్మకాయలో ఉంది. **fat soluble:** కొవ్వులో కరగెడు: **vitamin A**, particularly required in the functioning of retina, maintains integrity of epithelial structures; excess is toxic/forbidden

ప్రత్యేకంగా నేత్రపటలముయొక్క విధికి, ఉపకళ నిర్మాణాత్మకముల పటిష్టతకు తోడ్పడుతుంది; అధికము నిషిద్ధము. **vitamin D,** with antirachitic activity, contributed by sunshine సూర్యరశ్మి తాకిడివలన పుష్కలంగా ఏర్పడే విటమిన్ డి, రికెట్స్ నివారిణి; సూర్యరశ్మి సోకి తేచాలు, సరిపోతుంది. **vitamin E,** particularly alpha tocopherol, for normal reproduction సహజప్రత్యుత్పత్తికి సహాకారపడునది. **vitamin K,** promotes blood clotting రక్తస్కందనమునకు/రక్తం గడ్డకట్టడానికి కావలసినది.

**vitelline** relating to the yolk of the egg గుడ్డులోని పచ్చటి పదార్థమునకు సం. v. membrane, membrana vitellina.

**vitellus** [vitelline *adj.*] the yolk of an egg గ్రుడ్డులో పచ్చటి పదార్థము. *N.B.* Yellow contains fats and cholesterol, white contains protein; give yellow to the growing child and white to the elderly. *గమనిక:* పసుపుపచ్చ పదార్థములో కొవ్వు, కొలెస్టరాల్ ఉంటాయి. తెలుపుసొనలో ప్రోటీన్ ఉంటుంది. పచ్చటి పదార్థం పిల్లలకివ్వండి, తెల్లటిసొన (white of the egg) పెద్దలకివ్వండి.

**vitiligo** acquired leucoderma. depigmented (white) patches on skin, a scene which people abhor (*note:* There is a misconception prevailing among people that it is infectious. It is hideous, not infectious) బొల్లి, తెల్లబొల్లి మచ్చలు, హేయదృశ్యము (*గమనిక:* ఇది అంటుజాడ్యమని అపోహ ప్రజలలో ప్రబలి ఉన్నది. నిజానికి ఇది అంటువ్యాధికాదు, చూడడానికి వికారము).

**vitreous** 1. glass-like, hyaline కాచవత్, కాచాభ. **v. chamber,** chamber behind the lens in the eye కాచవత్కక్ష్య: కన్నులో కటకము వెనుక కక్ష్య. **v. humor,** humor in the vitreous chamber కాచవత్ తర్పకము, కాచవత్ శ్లేష్మం, నేత్ర గోళాంతర శ్లేష్మం. 2. corpus vitreum. vitreous or hyaloid body కాచవత్ భాగం.

**viviparous** zoogonous, giving birth to living young ones సజీవ సంతానోత్పత్తి ప్రకృతిగల [*in contr.* oviparous].

**vivisection** biotomy. cutting on a living being, especially experimentation on animals, (for enhancing knowledge) *e.g.*

dogs, rabbits, guinea pigs. జీవులను కోయుట, ముఖ్యంగా ప్రయోగ విలువల కొరకు (జ్ఞానాభివృద్ధి కొరకు), ఉదా. కుక్కలు, కుందేళ్ళు, సీమపందికొక్కులను కోయుట.

**vocal cords** folds of mucous membrane in the voice box స్వరతంత్రులు: శబ్దపేటికలోని శ్లేష్మపొర ముడతలు. Melody, play of these, is a God-given gift శ్రావ్యత, స్వరతంత్రులసాధన – దేవుడిచ్చిన వరము.

**voice** sound produced in the voice box, *figur.* music, sweet velvety voice స్వరము: స్వరపేటికలో ఉద్భవించిన కంఠస్వరము, *అలంకార.* శ్రావ్యధ్వని, మధురకంఠము, కంఠధ్వని, గానలహరి (*note:* distinguish from noise; it propagates noise pollution tinged with unpleasantness for hearing, *e.g.* braying of an ass, lorry horn *గమనిక:* శబ్దము వేరు; వినుటకు ఇంపుగాలేని శబ్దకాలుష్యమును వేరుగా భావించండి, ఉదా. గార్దభ శబ్దము/గాడిద అరుపు, లారీ హారన్) [*Cf.* noise].

**void** 1. empty శూన్యమైన. 2. especially to void urine మూత్రముపోయు.

**volar** palmar aspect అరచేయివైపు [*Cf.* plantar *తారత.* అరికాలువైపు].

**volition** the will to act సంకల్పము, *అలంకార.* సంకల్పం సగం జయం.

**volume** space occupied by any form of matter ఘనపరిమాణము. **blood v.** రక్త ఆయతనము. **stroke v.**, the volume of blood ejected from a ventricle of the heart into the aorta, pulmonary artery per one beat ఆయతనము, ఘనపరిమాణము: ఒక గుండె సంకోచములో మహాధమని, పుపుసధమనిలోనికి త్రోయబడు రక్తము. **tidal v.**, the volume of gas inspired or expired with each breath ఒక శ్వాసక్రియలో (ఉచ్ఛ్వాసములోగాని లేదా నిశ్వాసములోగాని) ఉన్న వాయువు.

**voluntary muscle** under control of the will, *see/చూడండి* muscle. ఐచ్ఛిక/నియంత్రిత కండరము [*opp.* involuntary *వ్యతి.* అనియంత్రిత].

**volunteer** one who offers to work without being paid జీతం ఆశించకుండా పనికి పూనుకునే వ్యక్తి. **v. community health worker** స్వచ్ఛంద సామాజిక ఆరోగ్య కార్యకర్త.

**volvulus** rotation/torsion of a loop of intestine, a surgical emergency పేగు శిక్యము (loop) మెలిక తిరిగిపోవుట; శస్త్రచికిత్సే దీనికి శరణ్యము.

**vomer** a flat bone at the posterior aspect of the nasal septum నాసికాంతర విభాజకం వెనుక పలచటి ఎముక.

**vomit** to eject stomach contents per mouth వాంతిచేయు, వమనము చేయు, కక్కు, డోకు: నోటిద్వారా అన్నాశయములోని పదార్థములు బయటికి వచ్చుట. **coffee ground v.,** altered blood clots due to action of gastric acid (*resemblance:* roasted coffee seeds) జఠరరసప్రభావమువలన నల్లగా మారిన రక్తపు గడ్డలు (*పోలిక:* వేయించిన కాఫీగింజలు).

**vomiting** eject forcibly stomach contents per mouth వమనము: ఆస్యముద్వారా డోకుట, కడుపులోనుంచి కక్కుట, వాంతి. **projectile v.,** jet of vomit like a fountain ఫౌంటెన్‌లాగా ధారలుగా వాంతియగుట. **v. of pregnancy,** morning sickness, especially first thing in the morning వేవిళ్ళు, లేవగానే డోకు. *గమనిక:* నెలతప్పింది అని సూచన.

**vomitus** vomited material వాంతి చేసుకున్న పదార్థము.

**voracious** *see/చూడండి* ravenous. **v. appetite** అశనాతురమైన ఆకలి. **v. reader,** very eager for knowledge, thirsty for knowledge. (వి)జ్ఞాన పిపాసి.

**voyeurism** deriving pleasure from the practice of secretly watching others in the act of undressing or sexual intercourse ఇతరులు నగ్నంగా ఉన్నప్పుడుగాని, రతికేళిలో ఉన్నప్పుడుగాని రహస్యంగా చూస్తూ తను ఆనందంపొందే మనోవికృతి.

**vulgaris** common సామాన్య. **acne v.** *colloq.* pimples, *see/చూడండి* acne. మొటిమలు. **lupus v.,** *see/చూడండి* lupus.

**vulva** the external genital organs of the female: mons pubis, labia majora and minora, clitoris and vestibule of the vagina భగము: యోనిప్రాంతము, గుహ్యప్రాంతము; జఘనాస్థి ఉబ్బు, క్రింది రెండు నిలువు పెదవులు, క్లైటోరిస్, యోనిరంధ్రము. అలంకార. వలువతో కప్పబడి ఉంటుంది కావున వల్వ.

**vulvectomy** excision of the vulva; female circumcision, *see*/చూడండి circumcision. ఆడుపడుచులలో సుంతి.

**vulvitis** inflammation of the vulva భగశోథము: భగము భగభగమనుట, యోనిప్రాంతములో 'నొప్పి వేడి కందు ఎరుపు తీపు వాపు'.

**vulvovaginitis** inflammation of the vulva and vagina భగము మరియు యోనియొక్క శోథము/'నొప్పి వేడి ఎరుపు కందు తీపు వాపు'.

**vulvovaginoplasty** plastic repair of the vulva and vagina ప్లాస్టిక్ శస్త్రచికిత్స చేసి భగ-యోని (పునః) రూపకల్పన.

# W w

**wafer** drug incorporated in a wafer-like structure వేఫర్ (తినే బిస్కెట్) లాంటి నిర్మాణంలో ఔషధమును అందించుట.

**waist** portion between the thorax and hip, *see/చూడండి* loin. నడుము, మధ్యము. అలంకార. ఛాతీకి తుంటికి మధ్యనున్న ప్రదేశముగాబట్టి మధ్యము, మొత్త. **w. line,** the circumference where a belt is worn కటి కైవారం, నడికట్టు: బెల్టు పెట్టుకునే పరిధి. *N.B.* Keep short your waistline to make long your lifeline. *గమనిక:* దీర్ఘాయువు కొరకు పొట్టమీద కొవ్వు పెంచకండి, మొత్త తగ్గించండి. అలంకార. కటి కైవారం గమనిస్తూ ఉండండి.

**wall** a structure bounding or limiting a space/cavity/vessel గోడ, స్థలము/కుహరము/నాళమునకు సరిహద్దు, ప్రహరి. *naked eye str.* ప్రత్యక్ష.చూ. **abdominal w.,** boundary of the abdomen ఉదరకుహర కుడ్యము. **chest w.,** rib cage ఛాతీగోడ, పర్శుక పంజరము, ఛాతీకి ప్రహరి/ప్రాకారము. **w. of blood vessel,** the coat of a blood vessel రక్తనాళముయొక్క గోడ, కంచుకము. *micro.str.* సూక్ష్మ.చూ. **cell w.,** boundary of a cell కణముయొక్క ప్రహరి.

**ward** in a hospital ఆసుపత్రిలో వార్డ్. **maternity w.** ప్రసూతి వార్డ్. **w. boy** వార్డ్‌బాయ్, పరిచారకుడు; రోగులకు పరిచర్య/సేవ చేయువాడు.

**wart** verruca, a hyperplastic epidermal lesion పులిపిరికాయ: పెరిగిన బాహ్యచర్మ క్షతము. causes కారణములు: A. **virus:** వైరస్‌వలన: human papilloma virus వైరస్‌వలన పులిపిరికాయ. **venereal w's,** condylomata acuminatum, caused by a virus and spread by sexual contact వైరస్‌వలన కలుగును, లైంగికస్పర్శ ద్వారా వ్యాపించును. B. **others:** తతిమ్మావి: **moist w's,** condylomata latum around anus or vulva seen in secondary syphilis కొఱుకు సవాయి వ్యాధి రెండవ దశలో ఆసనము, యోని ప్రాంతంలో చితచితలాడుతూ కనపడే దళసరి పులిపిరికాయల సముదాయము. **plantar w's,** verruca plantaris, warts in the sole of the foot అరికాలులో గరకు, మొద్దు బారిన పులిపిరికాయ పిలకలు. **tuberculous w's,** necrogenic w's,

tuberculosis verrucosa cutis ఒకరకమైన చర్మక్షయవ్యాధి. also called postmortem warts because infection may be implanted on the skin of the person doing postmortem on tuberculous tissues, as a result of accidental cut చనిపోయిన తర్వాత క్షయరోగి శరీరములోని క్షయకణజాలములను కోస్తున్నప్పుడు ఆ కోతకోయు వ్యక్తి చేతిమీద పొరపాటున కత్తిగాటు తగిలితే, ఈ క్షయక్రిమి సంపర్కముపలన ఆ ప్రాంతంలో చర్మక్షయ సంభవించవచ్చును.

**wash** lotion to cleanse any part ఏప్రాంతాన్నైనా శుభ్రపరచు/నిర్మలము చేయు లోషన్. **mouth w.** *see*/చూడండి lotio. నోరు శుభ్రపరచు ద్రవము. **stomach w.** జఠర ప్రక్షాళనము, జఠర ధావనము/శుద్ధి.

**Wassermann test** done in syphilis కొఱుకు సవాయి రోగము నిర్ధారణ కొరకు పరీక్ష

**water** the colourless transparent liquid నీరు, వివర్ణమైన, స్వచ్ఛమైన ద్రవము. Tissues are moist due to presence of water. జలము/ జలమే జీవాధారము. నీరే ప్రాణాధారం. *figur.* There is no life wihtout water. జలం జీవరక్ష, అలంకార. జలమూల మిదం జీవనమ్/ జగత్. for national health: fame with water, famine without water జలముంటే క్షేమం, లేకుంటే క్షామం. **distilled w.,** water purified by distillation స్వేదనజలము. **w. for injection,** sterile water for mixing in parenteral injections సూదిమందు తయారు చేసేటప్పుడు మందుపొడి ఉన్న బుడ్డిలో క్రిములులేని నీరు కలుపుతారు. water borne diseases: diarrhoea/dysentery, cholera, typhoid, jaundice (infective hepatitis), *etc.* జలము ద్వారా కలిగే జబ్బులు: విరేచనాలు, కలరా, టైఫాయిడ్, కామెర్లు, మొ.

**waters** *colloq.* amniotic fluid ఉమ్మనీరు. prologue at the beginning of the drama of delivery కాన్పుకు నాంది.

**wave** curve అల, తరంగము. **electromagnetic w's.** విద్యుదయస్కాంత తరంగములు. **w's in ECG** of heart గుండె పరీక్షలో పొడుగాటి గ్రాఫ్‌లో పరీక్షించు అలలు. **w's in EEG** of brain మెదడు పరీక్షలో పొడుగాటి గ్రాఫ్‌లో పరీక్షించు అలలు.

**wax in ear** cerumen చెవులో గులివి/జివిలి/గులిమి.

**WBC** *abbr.* 1. white blood cell తెల్లరక్తకణము. 2. white blood (cell) count తెల్లరక్తకణముల సంఖ్య.

**wean** disengage from a habit by enforced discontinuance కఠిన నియమంతో అలవాటును ఆపుట. 1. weaning from breast milk బిడ్డచేత స్తన్యపానము మాన్పించు, చనుపాలు మాన్పించు. 2. weaning a patient from respirator శ్వాసదోహద యంత్రమునుండి రోగిని తప్పించుట. 3. to see that (s)he is weaned (away) from drugs, drinking, *etc.*

**Weil's disease** infectious icterus, caused by the microorganism *Leptospira icterohaemorrhagiae*, spread by the urine of infected rats సంపర్కదోష పచ్చకామెర్లు: క్రిమి సంపర్కం పొందిన ఎలుకల మూత్రం ద్వారా సంక్రమించేది, సూక్ష్మజీవి పేరుపైన వ్రాసి ఉంది.

**wen** sebaceous cyst చర్మతైలగ్రంథి తాలూకు తిత్తి. **explosive w.,** cyst with a secondary (superimposed) infection సూక్ష్మజీవి సంపర్కం ఉపరి సంభవనీయ యాతన/ఘట్టముగా గల తిత్తి.

**Western blot test** blood test to detect the presence of antibodies to specific antigens, popular in the detection of HIV infection విశిష్ట ఏంటిజన్‌లను ఎదుర్కొనటానికి తయారైన ప్రతిరక్షకాలను కనిపెట్టే రక్తపరీక్ష – ఇది హెచ్.ఐ.వి. సంపర్కం కనుగొనడానికి ప్రసిద్ధ పరీక్ష.

**whartonitis** inflammation of the Wharton's duct ఈ వాహిక ఇన్‌ఫ్లమేషన్.

**Wharton's duct** duct of the submandibular salivary gland అధోహనువు లాలాజల గ్రంథియొక్క వాహిక.

**wheal** weal, red round elevated lesion on the skin accompanied by severe itching, *see/చూడండి* urticaria. దద్దురు, ఎర్రగా పొంగి బరకవలెనను యావ/వాంఛ కలిగి 'మంట మంట' అని వాపోవుట.

**wheeze** cat-mewing, cooing or whistling respiratory sound, *e.g.* in bronchial asthma, *see/చూడండి* asthma, rhonchus. పిల్లికూత, పావురము కూత లేదా ఈలధ్వని అనుకరించు శ్వాసశబ్దం; గుర్రుగుర్రుమని శ్వాసచప్పుడు.

**whipworm** *see/చూడండి* Trichuris కొరడాపురుగు.

**white** colour like milk పాలలాంటి తెలుపు, తెల్లనైన. 1. **w. discharge** in women స్త్రీలలో తెల్లబట్ట. 2. **'whites'** a popular term for leucorrhoea వాడు.భా. తెలుపు పోతోంది. 3. **w. matter,** myelinated (white) nerve fibres, *e.g.* nerve bundles in the spinal cord శ్వేతపదార్థము, తెల్లని మైలిన్ తొడుగుగల నాడీతంతువులు, ఉదా. వెన్నుపాములోని నాడీకట్టలు [*Cf.* grey matter in cerebral cortex *తారత.* మస్తిష్క వల్కలము మీద బూడిదరంగు పదార్థము].

**white leg** *see/చూడండి* phlegmasia.

**whitlow** felon గోరుచుట్టు. **herpetic w.,** primary herpes simplex infection of finger often with secondary infection గోరుకు సర్పి (వైరస్) సంపర్కమువలన కలుగు పరిణామము, తరచుగా చీము చేరుతుంది.

**WHO** *abbr.* World Health Organisation ప్రపంచ ఆరోగ్య సంస్థ.

**whoop** the sonorous jerky noisy inspiration in whooping cough, *see/చూడండి* pertussis. కక్కాయ దగ్గుకూత, కోరింతదగ్గులో శబ్దంచేస్తూ ఈడ్చుతూ తీసే ఉచ్ఛ్వాసము.

**whooping cough** *see/చూడండి* pertussis.

**Widal's reaction** an agglutination reaction; blood test done in the diagnosis of typhoid (enteric fever). సన్నిపాత జ్వర నిర్ధారణలో చేసే రక్తపరీక్ష.

**Wilms' tumour** *see/చూడండి* embryoma, tumour, nephroblastoma.

**wind** passing wind from both ends of the alimentary canal నోటినుండి త్రేపులు/త్రేణుపులు, పాయువునుండి అపానవాయువులు (పిత్తులు); కడుపు ఉబ్బరములో ఈ రెండూ అనుభవమే.

**windpipe** the trachea వాయునాళము. *figur.* the life-sustaining lumen or lumen of life *అలంకార.* ప్రాణాధార పట్టుగొమ్మ/ప్రాపు; ఆయువు పట్టు.

**wisdom teeth** *see/చూడండి* teeth.

**withdrawal symptom** suffering noticed after interruption/ stoppage of a drug of addiction మందు ఉపసంహరణ లక్ష

ణము, భేషజ ఉపసంహారక లక్షణము: వ్యసనమైన మందును మాన్పించినప్పుడు కలిగే క్షోభ.

**womb** the uterus గర్భాశయము, గర్భసంచి, గర్భకోశము. the abode of the fetus భ్రూణనిలయము. **surrogate w.** *see/చూడండి* surrogate.

**wood apple** *bot.* a fruit with hard woody pericarp and aromatic pulp inside వెలగపండు, కపిత్థము. useful in digestive disorders జీర్ణ అపవ్యవస్థల్లో ఉపయోగిస్తారు.

**worker** one who performs a duty ఒక విధిని నిర్వర్తించువాడు. **medico-social w.** సామాజిక-ఆరోగ్య కార్యకర్త.

**workshop** arranging a course to let know the doctors and public on a project, *eg.* AIDS workshop ఒక ప్రణాళికను గురించి డాక్టర్లకు, ప్రజలకు తెలియజేసే శిక్షణ, ఉదా. ఎయిడ్స్ వ్యాధి గురించి చర్చావేదిక.

**worm** any of the soft-bodied invertebrate creatures of the phyla Annelida, Nemathelminthes and Platyhelminthes క్రిమి, పురుగు, పాము. మెత్తటి శరీరంగల, అకశేరుక జీవి.

**worry** anxiety వ్యాకులత. *N.B.* worry, hurry, fury are the co-lifestyles in the present-day fast life, leading to neurotic temperament *గమనిక:* వ్యాకులత, తొందర, కోపావేశము ఈనాటి జీవనశైలిలో తోడు ఒడుదుడుకులు – ఈకాలపు పరుగు జీవనంలో అదుర్దా ఒక ముఖ్య అంశము.

**wound** disruption of tissue caused by injury గాయము: దెబ్బవలన కణజాల విచ్ఛేదము. **contused w.**, disruption of subcutaneous tissues చర్మముక్రింద కణజాలములు కందిపోవుట. **incised w.**, clean cut of the skin, *resemblance:* surgeon's incision on the skin కత్తితో వాడిగాటు, *పోలిక:* చర్మముమీద శస్త్రవైద్యుని ఆపరేషన్ గాటు. **lacerated w.**, tissues are torn/crushed విదారణక్షతము: కణజాలములు పచ్చడిగా అయిపోవుట. **penetrated w.**, puncture w., *e.g.* a lance penetrating into the tissues ఉదా. బల్లెపు పోటుతో తగిలిన దెబ్బ, కణజాలములలోనికి గుచ్చుకుపోవుట.

**wrist** 1. the region of the joint between the forearm and hand మణికట్టు, మణిబంధము: మోచేతికి చేతికి మధ్యనున్న కీలుప్రాంతము. 2. the carpus, the eight carpal bones అష్టమణిబంధాస్థులు. **w. drop,** radial nerve palsy పడిపోయిన చెయ్యి, రేడియల్ నాడి యొక్క పక్షవాతము.

**writer's cramp** *see/చూడండి* cramps.

**wry neck** torticollis, *see/చూడండి* torticollis. వంకరమెడ [వాడు.భా. మెడ బెణకు (తలబిరుసు కాదుసుమా!). *colloq.* confused with sprain].

**Wuchereria** a genus of filarial worms infesting humans. ఫైలేరియా వ్యాధి కలుగజేసే ప్రజాతి. **W. bancrofti** causes filariasis, *see/చూడండి* elephantiasis.

# X x

**xanthelasma x. palpebrarum,** yellow plaques affecting the eyelids, *see/చూడండి* xanthoma. కనురెప్పల వద్ద పసుపుపచ్చ తరకలు గట్టటం.

**xanthochromia** yellowish discolouration, especially of the spinal fluid ముఖ్యముగా మస్తిష్క-మేరుద్రవము యొక్క పసుపుపచ్చ రంగు.

**xanthoma** a growth with lipid-laden foam cells కొవ్వుతోకూడిన నురుగు/ఫేన కణముల కంతి. **diabetic x., x. diabeticorum,** yellowish or orange itchy papules/plaques in diabetes mellitus మధుమేహం వ్యాధిలో దురదపుట్టే, పసుపుపచ్చ లేదా నారింజ రంగు బొడిపెలు/తరకలు. **x. planum,** yellow streaks in the folds of the palms and soles అరచేయి మరియు అరికాలులో పచ్చటి చారలు. **x. tuberosum,** familial hypercholesteremic xanthomatosis wherein yellow nodules develop on the elbows, knees, buttocks కొలెస్టెరాల్ ఎక్కువైనప్పుడు మోచేతులు, మోకాళ్ళు, పిరుదులమీద పచ్చని కంతులు అగపడుట – ఈ జబ్బు వంశ పారంపర్యముగా రావచ్చును.

**xanthomatosis** a condition of xanthoma formation పైన వివరించిన పచ్చని కంతులు కట్టుట. **x. bulbi,** fatty degeneration of the cornea శుక్లపటలముయొక్క క్షయము.

**xanthopsia** yellow vision; objects seen as yellow వస్తువులు పచ్చగా అగపడుట (Distinguish it from jaundice wherein the sclera is coloured yellow. కామెర్లు వేరే జబ్బు – ఇందులో తెల్లగా ఉండే కన్నుగుడ్డు పచ్చబడుతుంది, వాడు.భా. కళ్ళుపచ్చబడ్డాయి).

**xanthosis** yellowish discolouration seen in degenerating tissues of malignant diseases అపాయకరమైన కేన్సరులాంటి జబ్బుల్లో క్షీణత చెందుతున్న కణజాలములు వివర్ణముచెంది, పసుపుపచ్చ రంగులోనికి మారుట.

**X-chromosome** carrier of genes జన్యువాహకము; females have XX chromosomes, males XY chromosomes స్త్రీలలో XX క్రోమోసోమ్‌లుంటాయి, పురుషులలో XY క్రోమోసోమ్ ఉంటాయి.

**xenograft** tissue from another species used as a temporary graft; though rejected, it tides over the crisis, *e.g.* in treating burns వేరేజాతి కణజాలం అంటు కట్టుట; శరీరం దాన్ని నిరాకరించినప్పటికి, గండం గడిచేదాకా పనికివస్తుంది, ఉదా. కాలిన గాయముల చికిత్సలో. *see/చూడండి* also heterograft in graft.

**xenology** [Greek *xenos* = stranger; *logos* = science]. the science dealing with host-parasite relationship 'అతిథేయి–పరాన్నజీవి' సంబంధానికి సం. శాస్త్రం.

**xenophobia** morbid fear of meeting strangers అన్యులను పలకరించాలంటే అమిత భయం. వాడు.భా. బిడియం, మొహమాటం.

**xeroderma** a mild type of ichthyosis, dry rough discoloured skin, *see/చూడండి* ichthyosis. **x. pigmentosum**, a *rare disease* where there is extreme cutaneous sensitivity to ultraviolet light అరుదైన వ్యాధి, అతినీలలోహిత కిరణములకు చర్మము తట్టుకొనలేక పోవుట. telangiectases, keratomas, papillomas; malignancies could occur on the skin చర్మముమీద రక్తకేశనాళికల ఉబ్బు, కంతులు; అపాయకరమైన క్షతములు కలుగవచ్చును.

**xerophthalmia** dryness of the conjunctiva and cornea due to vitamin A deficiency నేత్ర శుష్కత: విటమిన్ A లోపమువలన కంటిపొర మరియు శుక్లపటలము తగినంత తడిగా లేకుండుట, వాటి మృదుత్వము తగ్గుట.

**xerosis** dryness శుష్కత. **x. conjunctivae** కంటిపొర శుష్కత. **x. oris**, dryness of mouth అస్యశుష్కత, నోటి శుష్కత, నోరు ఎండుకపోవుట.

**xerostomia** dryness of the mouth due to deficient secretion of saliva by the salivary glands లాలాజల గ్రంథుల విధి లోపమువలన తగినంత లాలాజలము స్రవించక, నోరు ఎండుకపోవడం.

**xiphisternum** xiphoid process అగ్రకీలితము.

**xiphoid** sword-shaped, ensiform ఖడ్గమువంటి ఆకారముగల. **x. cartilage** అధోఉరోస్థియొక్క మృదులాస్థి. **x. process** అగ్రకీలితము.

**X-linked** 1. sex linked లైంగిక లంకె. 2. transmitted by genes on X chromosome ఎక్స్ క్రోమోసోమ్ మీది జన్యువుల ద్వారా వ్యాపింపబడినది.

**X-ray** *colloq.* X-ray photo: skiagram, radiograph వాడు.భా. ఎక్స్‌రే ఫోటో.

**X-rays** electromagnetic waves of short wavelength, *see/చూడండి* rays. అతి శక్తివంతమైన అల్పతరంగ దైర్ఘ్యముగల విద్యుదయస్కాంత కిరణములు. 1. They are able to penetrate organs to cause impression on a photographic plate and to ionise tissue. ఈ కిరణములు అవయవములను దూసుకొనిపోతాయి; కాబట్టి అవయవముల ముద్రలు ఫోటో తీస్తే, అవి వ్యాధి నిర్ధారణకు తోడ్పడుతాయి. అంతేగాక వీటికి అయనీకరణగుణము కలదు. 2. Deep X-rays are used in the treatment of some malignant tumours. వాడియైన ఎక్స్‌రే కిరణప్రసారమును కొన్ని అపాయకరమైన కంతుల చికిత్సకు వాడుతారు.

**XX** in genetics, normal human female సహజ, సాధారణ, సామాన్య స్త్రీ. contains 46 chromosomes 46 క్రొమొసోములుంటాయి.

**XXX** somatic cells of this female contain 47 chromosomes; trisomy X. also called triple X syndrome త్రి ఎక్స్ లక్షణ సంపుటి.

**XXY syndrome** Klinefelter's syndrome in males with 47 XXY karyotype, characterised by small testes, gynaecomastia, very low IQ, chronic pulmonary disease and varicose veins పురుషులలో లఘు/చిరు వృషణాలు, స్తన ఉబుకు, బుద్ధి/తెలివి మాంద్యం, దీర్ఘకాలపు ఊపిరితిత్తుల వ్యాధి, మరియు మెలికలు తిరిగి ఉబ్బిన సిరలు.

**XY** in genetics, normal human male సహజ, సాధారణ సామాన్య పురుషుడు. contains 46 chromosomes 46 క్రొమొసోము లుంటాయి.

**XYY syndrome** trisomy with 47 chromosomes in males with increase in height and poor mental development 47 క్రొమొసోములు గలది. పురుషుడు ఎత్తుగా ఎదిగి, అల్ప మానసికవృద్ధి కలిగియుంటాడు.

# Y y

**yaws** *syn.* Framboesia. tropical disease caused by spirochete bacterium, *Treponema pertenue* (clinical similarities: Bejel, pinta), *see/చూడండి* framboesia. ఈ పేరుగల బాక్టీరియావలన కలుగు ఉష్ణమండల వ్యాధి. It is non- venereal in origin; bacteria enter through abrasions on the skin. లైంగిక వ్యభిచారరోగము కాదు; క్రిములు చర్మముమీది గాయముద్వారా లోనికి ప్రవేశిస్తాయి.

**Y-chromosome** determines the male sex పురుష లింగసూచిక.

**yeast** fungi propagated by budding, *see/చూడండి* fungi. ఒకజాతి శిలీంధ్రాలు, కోరకముల/మొగ్గలద్వారా వృద్ధి పొందుతాయి. present in the froth on fermented liquor, *colloq.* left-over rice of the previous night పులిసిన సారాయి పొంగులోను, చద్ది బువ్వలోను పుష్కలంగా ఉంటుంది. rich source of vitamins of B complex group బి కాంప్లెక్స్ విటమిన్‌లకు మూలపదార్థము. **bakers' y.**, used in baking bread రొట్టెలు తయారుచేయుటలో వినియోగించెదరు. **brewers' y.**, used in brewing beer, processing alcoholic liquors కల్లు, సారాయి నురుగులో యీస్ట్ ఉంటుంది (*గమనిక:* కల్లు, సారాయి అతిగా సేవిస్తే హానికరము. అసలు అలవాటే మానేయాలి.)

**yellow fever** black vomit, an acute infectious virus disease transmitted to man by the bite of a mosquito, *Aedes aegypti,* marked by fever, vomiting, jaundice, tendency to haemorrhages (black vomit due to haemorrhage in stomach) పీతజ్వరము: దోమ కాటు వలన సంభవించు వైరస్ జ్వరము, వాంతులు, పచ్చకామెర్లు, రక్తస్రావము (జఠరములో రక్తస్రావమువలన వాంతి నల్లగా ఉంటుంది). The diameter of the virus is 17 to 28 nm, *i.e.* 17 to 28 millimicrons.

**Yersinia** a genus of bacteria ఒక బాక్టీరియమ్ ప్రజాతి. **Y. pestis,** *Pasteurella pestis* causes plague in human beings and rodents, *see/చూడండి* plague. ఈ సూక్ష్మజీవి మానవులలో మరియు ఎలుకల/చర్వకములలో ప్లేగువ్యాధిని కలిగించును.

**yolk** 1. yolk of an egg పచ్చసొన; పీతము. 2. a stored nourishment, the nutrient bank in the ovum అండములోని పోషకాశ్రయము, పోషణనిధి.

**yttrium** radioactive isotopes of this element used in cancer therapy కాన్సరువైద్యంలో వాడే రేడియోధార్మిక ఐసోటోపులు గల మూలపదార్థం.

# Z z

**zidovudine** azidothymidine or AZT, a drug used in the treatment of AIDS ఎయిడ్స్ వ్యాధికి ఔషధం.

**zinc** Zn – chemical symbol for zinc తుత్తునాగమునకు సంకేతము. Minimum daily requirement for a person is 8 to 10mg. Oral administration of zinc sulphate improves the sense of taste; hence, of late, this is being incorporated in tonics which tone up general health. *figur.* Zinc stimulates zing. రసనేంద్రియ చురుకదనమును పెంపొందించి, చవి/రుచి/కమ్మదనాన్ని ప్రసాదిస్తుంది. ఈ కారణంచేత ఇటీవల దీనికి ప్రాముఖ్యత పెరిగింది; ప్రజాదరణ పొందిన టానిక్కులలో తుత్తునాగం, తావుచేసుకుంది. అలంకార. ఎక్కడి తుత్తునాగం, ఎక్కడి తనువు దారుఢ్యం – సృష్టిలీల!

**zinc ointment** soothing antiseptic ointment, *e.g.* zinc oxide ఉపశమింపజేసే పూతినిరోధక మలాం, ఉదా. తుత్తునాగ ఆక్సైడ్.

**zingiber** dry ginger శొంఠి appetiser and stomachic ఆకలి పుట్టించు చిట్కా [*Cf.* wet ginger *తారత.* అల్లం].

**zizyphus** *bot.* edible fruit రేగి/రేగు పండు. 1. contains vitamin C ఇందులో C విటమిన్ ఉంది. 2. mouth-freshener నోరు, పళ్ళను శుభ్రపరచేది.

**zona** zone ప్రాంతము/మండలము. *naked eye str.* ప్రత్యక్ష.చూ. 1. **z. hemorrhoidalis,** the portion of anal canal containing the rectal venous plexus ఆసనములో మలాశయసిరల ప్లక్షముగల ప్రాంతము. 2. **z. ophthalmica,** herpes zoster, herpetic involvement of the cornea శుక్లపటలమునకు సర్పిసోకుట. *micro.str.* సూక్ష్మ.చూ. (i) in adrenal: **z. fasciculata,** thick middle layer of the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్‌లోని మధ్యస్తరము. **z. glomerulosa,** the thin outermost layer of the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్‌లోని బాహ్యస్తరము. **z. reticularis,** the innermost layer of the adrenal cortex ఎడ్రినల్ కార్టెక్స్‌లోని అంతరస్తరము. (ii) **z. pectinata,** outer part of the lamina basilaris of the cochlear duct in the inner ear లోపలిచెవిలోని కర్ణావర్తము వాహిక దగ్గర ప్రాంతము.

